త్నంబున మూలాధారాధిస్థితపవనసంఘుక్షణంబు నంజేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు—ఆ బ్రహ్మంబే నాభిపర్యంతం బా వాయువు చేత నభివ్యజ్యమానంబైన మనంబుతోడఁ గూడి సామాన్య స్పంద ప్రకాశ రూపిణియుఁ గార్యబిందు తత్త్వాత్మికయు నీశ్వరాధి దేవతయునై పశ్యంతీ వాక్కనంబడు—ఆ బ్రహ్మంబా వాయువు చేత హృదయ పర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మక బుద్ధి యుక్తంబై విశేష స్పందరూపయు నాదబిందు మయయుం హిరణ్య గర్భాధి దేవతయునై మధ్యమా వాక్కనంబడు— ఆ బ్రహ్మం బాస్యపర్యంతం బా వాయువుచేత కంఠాది స్థానంబుల యందభివ్యజ్యమానంబై "అ" కారాది "క్ష" కారాంత వర్ణమాలా రూపంబై నిశ్చయాత్మయై శ్రోత్రగ్రహణయోగ్యంబై వైఖరీ వాక్కనంబడు. —

అని చెప్పి,

యీ చతుర్విధ సూక్ష్మస్థూల
మాతృకా స్వరూప విట్టి
దేవికి నమస్కారంబు "

అని వాగ్దేవి నుపాసించుచున్నాఁడు.

లోక వ్యవహార యోగ్యమగు వైఖరీ వాక్కు భాష — మనలో దేవభాష — మానుషభాష — యను భాషా ద్వైవిధ్యము ప్రాచీన కాలము నుండియుఁ గలదు. దీక్షిత వ్రత విధియందు

"అథ పరిహ్వాలం వాచం వదతి
నమానుషీం ప్రసృతాం"

అని యామ్నాయము.

మంత్ర బ్రాహ్మణ సూత్రభాషలు మూఁడును సంస్కృతములే కాఁబట్టి సంస్కృత భాషా వ్యవహారము దేవ సంబంధమగు సంస్కార యోగము విశేషముగా వానియందుఁ గనబడుచుండుట వలన వాని భాష సంస్కృత మనిపించుకొనుచున్నది. మంత్ర బ్రాహ్మణ సూత్రములు మూఁడును యజ్ఞములలో మంత్ర, ప్రైష, పరికర్మ సమాదేశముల యం దుపయోగింపఁ బడును గావున వాని భాషలు దేవ భాష లనంబడును. అందుననే వానిలోని సమాస సంధి వికార నియమములను వైయాకరణులు సంస్కార శబ్దముచేత వ్యపదేశించిరి.

"స్వరసంస్కారయోశ్ఛందసి
నియమః"

అని ప్రాతిశాఖ్యమునందుఁ గాత్యాయన మహర్షి ప్రత్యేకించి స్వరనియమములను సంధి సమాస నియమములను మాత్రమే యుపదేశించెను. కాఁబట్టి మంత్ర బ్రాహ్మణ సూత్రభాషలు మూడింటికిని సంస్కృత భాషా నామము సామాన్యము. మఱియును మంత్రభాషకును బ్రాహ్మణభాషకును గల భేదము సూక్ష్మాతి సూక్ష్మముగాఁ గనఁబడును గాని సూత్ర భాషకును మంత్ర బ్రాహ్మణముల భాషలకును గల భేదము మాత్రము నామోపచార శబ్ద విభక్తి మాత్రోచ్చారణముల వలన స్పష్టముగాఁ గనఁబడును. ఉదాహరణ రూపమున నొక్కనామభేదమునుగూర్చి మాత్ర మించుక విశద పఱచెదను. పాణిని మహర్షి మంత్ర బ్రాహ్మణముల భాషను ఛందస్సనియు సూత్ర భాషను భాషయనియు వ్యపదేశించి యున్నాఁడు. నిరుక్తకారుడగు యాస్కాచార్యుఁడు మంత్ర బ్రాహ్మణముల భాష కధ్యాయమని నామ నిర్దేశము చేసి యున్నాఁడు. ఇట్లే యుపచారాది భేదములును గనంబడును.

దేవభాషయన స్వర్గము నందుండు దేవతలభాష యని యర్థము గాదు. భూలోకము నందుండు మనుష్య దేవతల భాష. మనుష్య దేవతలనుగా భూసుర శబ్ద వాచ్యులు. పూర్వకాలమున బ్రాహ్మణజాతి విద్యా కర్మ భేదముచేత విప్రులు, ఋషులు, దేవతలు, బ్రాహ్మణులునని నాలుగు తెగలుగా నుండెను. అందు దేవతలను తెగనుగూర్చి

"ద్వయావై దేవాః । దేవా అహైవదేవాః ।
అథయే బ్రాహ్మణాః శుశ్రువాంసో౽
నూచానా స్తే మనుష్య దేవాః ॥"

అని శ్రుతి చెప్పుచున్నది. అట్టి మనుష్యదేవతలు వ్యవహరించు భాష గావున దేవభాషయను నామము కలిగినది. ప్రథమమున ఋగ్యజుస్సామముల మంత్రభాషకు దేవభాషయనియు బ్రాహ్మణముల భాషకు మానుష భాషయనియు సంజ్ఞ లేర్పడినవి. చయన శ్రుతియందు

"వాచాహిం చీయతే ఋచా
యజుషా సామ్నేతి నదైవ్యా।
అథయన్మానుష్యా వాచాఽఽహ
ఇతీదం కురుతేదం కురుతేతి—త
దుహాతయా చీయతే ॥"

అని దేవమానుష భాషలు రెండింటితోను చయనము నిర్దేశించుట వలన మంత్రభాష దేవభాషయనియు ఋత్విక్కులు మున్నగువారిమాతృభాషయగు బ్రాహ్మణ భాష మానుషభాషయనియు స్పష్టపడుచున్నది. ప్రణయనము మొదలుకొని మానుషభాష నుపయోగింప రాదనియు హావిష్కరణ కాలమున "హావిష్కృదేహి" యని మానుషభాష నుపయోగించి పిమ్మట యథేచ్ఛముగా దానిని మాటలాడ నచ్చుననియు విధి గనఁబడుచున్నది. బ్రాహ్మణ భాషయందును "హవిష్కృదేహి" యనియే యందురు. ఎట్లనిన.

"తానివా ఏతాని చత్వారివాచః
ఏహీతి బ్రాహ్మణస్య ఆగహీ ఆద్రవేతి
వైశ్యస్యచ రాజన్య బంధోశ్చ। అథావే
తిశూద్రస్య సయదేవ బ్రాహ్మణస్య
తదాహ"॥

అనిచెప్పఁబడియున్నది. కాబట్టి బ్రాహ్మణ భాషకే మానుషభాషయను వ్యవహారమని విశదపడఁగలదు.

పిమ్మటఁ గాలక్రమమున మంత్రబ్రాహ్మణ భాషలకు దేశభాషయనియు సూత్రభాషకు మానుష భాషయనియు సంకేతము లేర్పడినవి.

లోకమునందేభాషగాని సుస్థిరముగా నుండనేరదు. సకలభాషలకును బ్రకృతి వికృతి భావములు ప్రవాహరూపమునఁ బ్రవర్తిల్లుట లోకమునఁగనఁబడుచున్నది. కాలక్రమమున నొకభాషనుండి యింకొక భాష యుద్భవింపఁబూర్వభాష యంతరించుటయును గలదు. ఇది నైసర్గికము. ఈపద్ధతిననుసరించి మంత్రభాష లోకవ్యవహారమునఁగొంతకాలముండి బ్రాహ్మణ భాషనుద్భవింపఁజేసి తానుశాస్త్రభాష యయిపోయినది. బ్రాహ్మణభాషయుఁ గొంతకాలము లోకవ్యవహారమునందుండి సూత్రభాష నుత్పాదించి తానును శాస్త్ర భాష యయిపోయినది. సూత్ర భాష లోకవ్యహారమునందుండు కాలమునందే దానిని భాషానామమున వ్యాకరణములలోఁ బాణిన్యాదులు విపక్షించిరి. వృత్తికార భాష్యకారులు శబ్దార్థసిద్ధి లోకమువలనఁ దెలియఁబడఁదగినదని చెప్పుటచేతదానిలోకప్రచారము విశదమగుచున్నది. మఱియును

"లింగమశిష్యం లోకాశ్రయత్వా
ల్లింగస్య"

అనిభాష్యకారులు లోకవ్యవహారమువలన శబ్దముల లింగస్థితి తెలియఁదగిన దనిరి.

సంస్కృతమగు సూత్రభాషయుఁ గాలక్రమమున వికృతిభావపరిణామముచేత ననేకభాషాంతరములను బొడమించినది. అవియే ప్రాకృతభాషలు. పిమ్మటఁగొంతకాలమునకు సంస్కృత ప్రాకృతముల నుండి వైకృత భాషలుద్భవించినవి. ఆవైకృతభాషలలోనిదేమనయాంధ్రభాష. ఇందుఁగల తత్సమ తద్భవ భాగములు పైతీరునఁగలిగినపరిణామములు. దేశ్యభాగమయినను కేవల స్వతంత్రభాషగాక కొంతస్వతంత్రభాషయుఁగొంతయితర వైకృతి భాషాజన్యమును నయియున్నది. ఇట్లేతక్కిన వైకృతభాషలు నని తలంపవలయును.

ఆంధ్రభాష ప్రశంస గావించుటకుముం దాంధ్ర దేశప్రశంస గావింపవలసియుండును గాబట్టియాంధ్ర దేశమన నేది? అంధ్రమనను బర్యాయ పదములై వాడుకలోనున్న తెలుగుదేశము త్రిలింగదేశమనునవి యేవి? వీనికీపేళ్ళెట్లు వచ్చినవి అను నీ మొదలగు విషయములను గొంతవరకుఁ జర్చించి చూచుకొందము.

## ఆంధ్ర దేశము.

వేదమునందాంధ్రదేశ ప్రశంస గానవచ్చుచున్నది. ఆదికావ్యమగు శ్రీ మద్రామాయణమునఁ గిష్కింధా కాండమునందు

> "తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ
> చోళాన్ పాండ్యాన్ సకేరళాన్"

అనికనంబడుచున్నది ప్రాచీనకాలమునుండియు నిటుల మనయాంధ్రదేశము సుప్రసిద్ధముగా నుండుట కాంధ్రుల ప్రాచీన నాగరికతయే హేతువు. ఆంధ్రులగానకళావిజ్ఞానమును మహోన్నత దశ యందుండెను. శాస్త్రకర్త లాంధ్రికళావిజ్ఞానమునకు శాస్త్రములయందు సముచిత స్థాన మొసంగుచుండిరి. దిఙ్మాత్ర మొకటిరెండు విషయములనిచ్చట నుదాహరించుచున్నాను. సంగీతశాస్త్రమునఁగొన్నికొన్ని దేశనామములతోఁగొన్నికొన్ని రాగములు పేర్కొనఁబడియిప్పటికిని వ్యాప్తిఁ జెందియున్నవి. సౌరాష్ట్ర, కాంభోజి, మాళవి- గౌళ- భూపాల- గాంధారి, కన్నడ, మొదలగునవియుదాహరణములు- ఆంధ్రిరాగమనునదియునట్లే పేర్కొనబఁడియున్నది.

> "ఆంధ్రీ - టక్క విభాషారాగ విశేషః
> తల్లక్షణంతు-మధ్యమాంశగ్రహా పం
> చమాంతాఽల్పర్షభా- తస్యాః ప్రహా
> ణేవినియోగః - ఉత్పత్తి రన్ధ్రదేశే"

అనిసైఘంటికులు వ్రాసియున్నారు. కావ్యశాస్త్రము నందంధ్రస్త్రీ సంకీర్ణజాతి విశేషమనియు సౌకుమార్యము గలిగియుండుననియు నీమొదలగువిశేషములు తెలుపఁబడి యున్నవి, శ్లోకాదులను గరఁగఁ బోయు మాటలలో నంధ్రమాష్కయమనొక విధముగ మాటపేర్కొనఁబడి యున్నది.

> "మధ్వేనిమగ్నా గోస్తనాకారా
> కించిచ్ఛన్నామాషా"

అని వివరింపఁబడియున్నది.

ఇట్టియాంధ్రదేశము ప్రాచీనకాలమునందెక్కడ నుండి యెక్కడిదాఁక వ్యాపించియుండెనో తెలిసికొనుటకుఁ బ్రబలాధారములంతగా లభింపక పోయినను కేవలమాధార శూన్యముగా నున్నాదని మాత్రము తలంపరాదు. శబ్దకల్పద్రుమమునం దుదాహరింపఁబడిన శక్తిసంగమతంత్రమునఁ గనంబడు దేశనామావళిలో

> "జగన్నాథాదూర్ధ్వభాగే మహాకల్పే
> శ్రీభ్రమరాంబికాంతః
> త్రానదంధ్రాభిధో దేశః"

అనియంధ్రదేశమును

> "శ్రీశైలంతు సమారభ్య చోళేశా
> న్మధ్యభాగతః।
> తైలంగదేశో దేవేశి ధ్యానాధ్య
> యనతత్పరః"

అని తైలంగదేశమును నిర్దేశింపఁ బడియున్నవి. వేదమునఁగాని రామాయణమునఁగాని శక్తిసంగమ తంత్రమునందుఁగాని త్రిలింగ దేశముదాహరింపఁ బడలేదు. తైలంగదేశమనునది శక్తిసంగమ తంత్రములోమాత్రమే చెప్పఁబడినది. విద్యానాథ మహోపాధ్యాయుఁడు రచించిన ప్రతాపరుద్ర కళ్యాణనాటకమునఁ బంచమాంకమునందు,

> "యైర్దేశస్త్రిభిరేష యాతిమహతీం
> ఖ్యాతిం త్రిలింగాఖ్యయా।
> యేషాం కాకతిరాజకీర్తివిభవైః
> కైలాసశైలాః కృతాః।

తే దేవాః ప్రసరత్ప్రసాదమధురా
శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం
త్వచ్ఛ్రేయసే జాగ్రతు "

అని చెప్పియున్నాఁడు. దీనికి శ్రీమహోపాధ్యాయమల్లినాథ సూరి తనూజుండగు కుమారస్వామి సోమయాజి,

"త్రయో లింగరూపాః శ్రీశైల
నాథాదయో దేవా యస్మిన్
దేశే స త్రిలింగోఽంధ్రదేశ ఇత్యర్థః॥"

అని వ్యాఖ్యానము చేసెను. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించిన యెడల నంధ్రదేశమునందీ మూఁడులింగములు వెలసి యుండుటవలనఁ ద్రిలింగ దేశమను సంకేతమేర్పడెను గాని యీత్రిలింగ క్షేత్రమధ్యస్థమయిన దేశము మాత్రమంధ్రదేశమని తలంప నవసరము గానరాదు. అప్పకవియును

"శ్రీక్షితిధర కాళేశ
ద్రాక్షారామంబు లనఁగఁ దనరారెడునీ
త్రిక్షేత్రంబుల లింగము
లీక్షితిని ద్రిలింగ'సంజ్ఞ నెన్నిక కెక్కెన్॥"

"తత్త్రిలింగ నివాసమై తనరు కతన
నాంధ్రదేశంబు దాఁద్రిలింగాఖ్య మయ్యె
తెలుఁగనుచుఁ దద్భవము దానివలనఁ గలిగె
వెనుక నొందఁ బుదాని నే తెలుఁగునంద్రు॥"

అని చెప్పెను. ఈతఁడును ద్రిలింగ సంజ్ఞావిషయమున విద్యానాథునే యనుసరించెను. కానియీయుభయులును ద్రాక్షారామమని వ్రాసిరి. దానిని ద్రాక్షారామమనిసవరింతుమన్న వారి శ్లోక మునకును నీతని పద్యమునకును ఛందోభంగము కలుగును. విద్యానాథుడు గతానుగతికముగా నున్న జనప్రవాదమును బట్టి ద్రాక్షారామమేయనుకొని ప్రయోగించెను. సత్యము తెలిఁగియున్న వ్యాఖ్యాతతూర్పుసముద్రతీరమున ద్రాక్షారామము లేనాఁడును లేవని తెలిఁగియుండియు

"ద్రాక్షారామేతి తత్రత్యానా మారామాణాం తద్భూయిష్ఠత్వాదితి ప్రౌఢోక్తిః—వస్తుతస్తు దక్షసంబంధిత్వాద్ద్రాక్షారామ ఇతి తన్నామ"

అని సరసముగా సమర్థించెను.

అప్పకవి చెప్పినట్లు "త్రిలింగ" శబ్దతద్భవము—"తెలుఁగు"—అని యంగీకరించుట కవకాశమేమియుఁ గానరాదు గాని "తెలుఁగు" శబ్దమునకు సంస్కృతీకృతి తద్ధితరూపముగా సంగమతంత్ర కారుఁడు "తైలంగ" శబ్దమును బ్రయోగించెనని యూహింపఁదగియున్నది.

ఆంధ్రదేశ విషయమునఁ జేయఁబడిన యీచర్చవలనఁ దేలిన పర్యవసానమేమనినఁ దాంత్రిక గ్రంథానుసారముగా నాంధ్రదేశమునది యించుమించుగాఁ గృష్ణామహానదీమధ్యప్రదేశమనియుఁ దైలంగదేశమనది కృష్ణాపినాకినీ మధ్యప్రదేశమనియును. ఈ రెండుదేశములకు నిట్లుత్తర దక్షిణదిక్కుల హద్దులేర్పడుచున్నవి. తూర్పున రెండింటికి సముద్రమే హద్దు. పడమటి హద్దు నేర్పఱచుటకు మాత్ర మాధారమంత గఁగనఁబడదు. కాని శక్తిసంగమ తంత్రమునఁ బ్రథమరాంబి కాక్షేత్రమగు శ్రీశైల ముదాహరింపఁ బడుటవలన నచ్చటనుండి మహానది దాఁక నొక సరళరేఖనుత్తరముగాఁ బెంచిసాగించియదియాంధ్రదేశమునకుఁ బడమటి హద్దనియూహించి సరిపెట్టుకొనఁ దగియుండును. మహానదివరకేలయన జగన్నాథమున కూర్ధ్వముగానని తంత్రగ్రంథము నందుండుటవలన. కాతీసునకే తైలంగ దేశమునకుఁ బడమటిహద్దు నూహించుకొనుట కాగ్రంథములోని శ్రీశైలము మొదలుకొని చోళదేశమధ్య ప్రదేశమువరకు ననుసూచన వలనఁ బినాకినీ నదీ ప్రాంతముదాఁక సరళరేఖను దీసికొనఁ దగియుండును. ఆంధ్ర తైలంగదేశము లొకప్పుడు వేర్వేర ప్రసిద్ధములై యుండినను రెండును నాంధ్రరాష్ట్రాంతర్భాగములై యుండెననుట కాతంకము లేదు. ఓఢ్రభాషమాట్లాడు నోఢ్రులు పూర్వము

నివసించు చుండిన గంజాము విశాఖపట్టణ మండలముల లోని కొన్ని భూభాగము లిప్పుడు తెలుగువారు నివసించు తెలుగు దేశభాగములైయున్నవి. ఇట్లే శ్రీజగన్నాథ ప్రాంత దేశ మనఁగా గంజాము మండలము లోనియుత్తర భాగము మొదలుకొని మహానదీ తీరము దాఁకఁ బూర్వమాంధ్ర దేశము గానుండిన భూభాగము లిప్పు డోఢ్రుల నివాసస్థానముగా మాఱినవి. కావున నిప్పుడవి యోఢ్రదేశ భాగము లనుపించుకొనుట కవకాశము లేకపోలేదు. పడమటి హద్దని మనమూహించి తీసిన సరళరేఖ నతిక్రమించి పశ్చిమదిక్కునకును నైఋతిదిక్కునకును గొంతదూరమాంధ్రదేశము వ్యాపించినదని తలంప వచ్చును.

రెండేండ్ల క్రిందట బ్ర॥ పురాణము సూరి శాస్త్రిగా రాంధ్ర పత్రికలోఁ బ్రకటించిన యాంధ్ర రాష్ట్ర పటమును బురస్కరించుకొని పైతీరునఁ బడమటి కాంధ్రరాష్ట్రమును బెంచి చూపుచు శక్తి సంగమ తంత్రానుసారముగా నాంధ్ర తైలంగ దేశములకు నేను వ్రాయించిన పటమును సభ్యులు పరిశీలింతురుగాక— ఆంధ్ర దేశప్రాచీన చరిత్రమును రచించు చరిత్రకారు లీవిషయమును బట్టుదలతో బరిశీలించి వివిధములగు నాధారములను సంగ్రహించి పరీక్షించి తమసిద్ధాంతము నాంధ్రలోకమునకుఁ బ్రసాదింతురుగాక—

మీఁదవిశద పఱచిన రీతిని త్రిలింగ తైలంగాంధ్ర దేశాంతర్భావులు గావున నగత్రయు నాం. దేశమే. తద్దేశభాషకు త్రిలింగ భాష— తెలుంగుభాష ఆంధ్రభాష యను వేరువేరు సంజ్ఞలున్నను నవిపర్యాయ పదములు.

ఆంధ్రభాష

యన్న నదియే చాలును, అప్పకవి

“తత్త్రిలింగ నివాసమైతనరు కతన
నాంధ్ర దేశంబు దాఁద్రిలింగాఖ్య
మయ్యె”

నని చెప్పి యంతటితోఁ జాలింపక

“తెలుఁగనుచుఁ దద్భవము దానివలనఁగలిగె
వెనుకఁ గొంద దానినేఱు తెనుఁగనం(డ్రు)॥”

అని సిద్ధాంతము చేసెను. “తెలుఁగు” “తెనుఁగు” నొక్కటే యనుట నిర్వివాదాంశము. “ములుఁగు” “మునుఁగు” మొదలగు ద్విరూప శబ్దములు భాషలోఁ గలవు. ఇఁకఁ “తెలుఁగు” శబ్దము “త్రిలింగ” శబ్దభవమా యనుదానిని విమర్శింతము. శక్తిసంగమతంత్రము రచింపఁబడిన కాలమునఁ “తైలంగ” శబ్ద వ్యవహారము సుప్రసిద్ధముగా నుండెను గాని “త్రిలింగ” శబ్ద వ్యవహారము సుప్రసిద్ధముగా నుండెననుకొనఁ జాలము. కాఁబట్టి “తెలంగ” శబ్దవ్యవహార ప్రాచీనమని తలంపవలసి యుండును. “త్రిలింగ” శబ్దము సమస్త పదము “తెలుఁగు” శబ్దము వ్యస్తపదము— “త్రి”—యను దానికి “తె” యనునది “లింగ” శబ్దమునకు “లుంగు” శబ్దమును దద్భవ రూపము లనుట సమంజసముగాఁ గనఁబడదు.— మఱియును “లింగ” శబ్దములోని సిద్ధ పూర్ణానుస్వారము అద్భుతముగ “లుంగు” శబ్దమున సంక్రమించి యర్ధానుస్వారముగా మాఱుటవలన “లుఁగు” శబ్దము సిద్ధించెననుట హాస్యాస్పదము. కావునఁ “త్రిలింగ” శబ్దభవము “తెలుఁగ”ని యంగీకరింప ననువుపడదు.

“తెలుఁగ”ను నది దేశ్య శబ్దము. స్వచ్ఛమయినదని యర్థము గలది.

తెల్ల=వెల్ల
తెలతెల=వెలవెల
తెలి=వెలి
తెలుఁగు=వెలుఁగు
తెల్గు=వెల్గు
తెలిఁగించు=వెలిఁగించు
తెల్గించు=వెల్గించు
తెలనాఁడు=వెలనాఁడు
(పలనాఁడు)
తెల్నాఁడు=వెల్నాఁడు
(పల్నాఁడు)

పళ్లెము=పల్లియము
పళ్యము
ఇట్లే
తెలఁగాణము=తెలఁగాణి
యము=తెలఁగాణ్యము
అనుశబ్దసిద్ధి.

ఇత్యాదులఁ బరిశీలించునది. (తెలిఁగించు శబ్దమును బ్రయోగించి నట్లే—అరవించు, మళయాళించు, మహారాష్ట్రించు, ఘూర్జించు, బంగాళించు, హిందీయించు, ఇగ్లీషించు, ననుశబ్దములను బ్రయోగింపఁదగు నన్నను నట్టిశబ్దములు చెవికింపుగా నుండవు. "కన్నడించు"— అని ప్రాచీన ప్రయోగముగలదు. ఇది విశేషము. ఈసందర్భమున నొక విషయము మనవి చేయుచున్నాను. తెలుఁగుఅనునది త్రిలింగ శబ్దభవము కానియట్లే కన్నడశబ్దము కర్నాట శబ్దభవముగా నేరదు. సంస్కృతీ కరణమునఁ గర్నాట మయినదని తోఁచుచున్నది. కన్నడయనునది దేశ్యపదము. అచ్ఛతమని యర్థముగలది. అద్దమువలె స్వచ్ఛమయినదను తాత్పర్యము స్ఫురించుచున్నది. కన్నడ పండితుల యభిప్రాయ మిందరయవలసియుండును.)

మఱియును తెలుఁగునఁ నలుఁగు—మెఱుఁగు—ముసుఁగు—వెఱఁగు—ప్రోఁగు పోఁగు,మడుఁగు,మున్నగు శబ్దములలోని తుదిబిందు పూర్వక గువర్ణకమువలన సిద్ధించిన విశేష్యరూపము వంటిదే తెలుఁగు శబ్దరూపమునని దోఁచుచున్నది. ఇట్లు దిఙ్మాత్రము సూచించితిని గావునఁ బండితులు తెలుఁగు శబ్దవ్యుత్పత్తిని విమర్శించి సిద్ధాంతీక రింతురుగాక.

లిపిమనోహరాకృతియని చిరకాలమునుండి మనవారను చున్నారు. గుండ్రనియాంధ్రాక్షరపంక్తులు ముత్యాలసరముల వలెఁ గనఁబడును. ఆంధ్రాక్షర స్వరూపమునధర్వణాచార్యుఁడును వన్నయభట్టును వివరించియున్నారు. మూలసూత్రములను దెలిగించిన యప్పకవి యక్షరముల రూపమును దనగ్రంథములోఁ దెలిపియున్నాఁడు. మనదేశమునఁ బ్రచలితములగు ముద్రితాప్పకవీయ గ్రంథములలో నక్షరముల రూపములు ముద్రింపఁబడినవి. వానినిచూచినవది యేభాషాలిపియో పోల్చఁదరముకాదు. ఆంధ్రాక్షరములు ప్రాచీనకాలము నందున్నట్లే యిప్పుడు నున్నవా లేక మార్పుఁజెందినవాయను విషయము విచారింపఁ దగినది. ఇప్పుడు లభించుచున్న తాళపత్ర గ్రంథములలోని తెనుఁగు లిపి యిన్నూరుసంవత్సరములకంటెఁ బ్రాచీనకాలమునాటిది కాదని తోఁచుచున్నది. అంతకన్నఁ బ్రాచీన లిఖిత గ్రంథములు లభించుట దుర్లభము. ఇప్పటికిలభించిన గ్రంథములలోనిలిపియిప్పటిలిపివలెనే కనఁబడును. ప్రాచీనతామ్రశాసనములను శిలాశాసనములను బరీక్షించిన యెడల నేడెనిమిది వందల యేండ్ల క్రిందట నుండియుఁ జెక్కఁబడుచుండిన యాంధ్రాక్షరములు గనఁబడును. కొన్నింటిలో నక్షరములు గుండ్రముగా నుండక కోలగానుండును. కొన్నింటిలో గుండ్రముగానుండును. మఱికొన్నింటిలో ద్రవిడభాషాక్షరములపోలిక నుండును. ఇంకఁగొన్నింటిలో నాగరాక్షరములవలెనుండును. ఈయాధారములనుబురస్కరించుకొని చూచినయెడల నాంధ్రలిపి యప్పటప్పుడు మార్పుచెందిచెంది యిప్పటిలిపి రూపమును దాల్చినదని బుద్ధిమంతు లూహించుచున్నారు. మఱియు నీరాజుకాలమున నీలిపియిట్టిమార్పును జెందినదని చెప్పుచున్నారు. ప్రతిలిపియుఁ గాలక్రమమున గొంతకొంత మారుచుండుట సైజమే. కానితామ్రశిలాశాసనముల యందలిలిపినాధారముగాఁగొనిచప్పున నేదోయొక సిద్ధాంతమును మాత్రము తొందరపడి చేయవలనుపడదని తోఁచుచున్నది. వ్రాఁతచదువులను జక్కఁగాతెలియఁగని స్వదేశీయశిల్పకారులును దెనుఁగు భాషయేయెఱుఁగని విదేశీయ శిల్పకారులును జెక్కఁ శాసనములలోని యక్షరాకృతులను మనముప్రమాణముగాఁదీసికొనరాదు. ఇప్పుడుకొన్నికొన్ని పోస్టాఫీసులలోఁగనఁబడు ఫలకముల మీఁదఁ దెలుఁగెఱుఁగని ద్రవిడదేశపు శిల్పులును చిత్రకారులును జెక్కినయక్షరముల రూపుదృష్టాంతముగాఁ గైకొనవచ్చును. "తపాలాఫీసు" "తపాలపెట్టె" యనువానిని జూడఁగా నేనవ్వు రాఁకపోదు. కొన్ని రెయిలుబండ్లలో "మనుష్యుఁడు" అనుమాటలోని "ష్యు" అను నక్షరము మఱింత వింతగాఁ గనఁబడును. మనము వ్రాయునట్టి "యి" (ఇత్వ సహితయకారము.) అను నక్షరమునకు మఱియొక కొమ్మిచ్చిమీఁదఁ గొంత యెడముగాఁ దలకట్టు వ్రాసి కుడిప్రక్కను కొంచెము దూరముగాయాముడి వ్రాసిన యొకానొక

విలక్షణ స్వరూపమును (య్యు) జూచి మనము దానిని "య్యు" అనుకొనవలసి యుండును. ఇట్టి యక్షరములు గల ఫలకములను మఱి సూరేంద్రనాడు చూడఁదటస్థపడు విమర్శకులు సూరేంద్ర క్రిందటి ప్రాఁత యీ తీరున నుండెనని సిద్ధాంతము చేసిన నెట్లుండునో యట్లే శాసనాదుల లిపినిబట్టి మనము చేయుచున్న సిద్ధాంతములును నని తలంపవలసి వచ్చును. కావున నత్యధిక పరిశీలనమునఁగాని సిద్ధాంతము చేయరాదు. ఆంధ్రలిపి నాగరలిపి నుండి యేర్పడినదని యూహించుటకవకాశమున్నది. "గ" "చ" "ఠ" "డ" "ద" "న" "భ" "వ" యను నక్షరములు నాగరాక్షరములనే మిక్కిలి పోలియుండును. లాముడీ మొదలగునవి కొన్ని నాగరాక్షరములే. నాగరలిపికిని తెలుఁగులిపికిని బ్రధానభేదములు రెండు గలవు. నాగరమున సంయుక్తాక్షరములకు స్వరసంయోగము తలుదగాఁ గ్రింది యక్షరమునకుండును. ప్రధానాక్షరమున నుండదు. తెలుఁగున నిది విపరీతము. నాగరమున బిందువు చుక్క. అది యక్షరమునకుఁ దలమీఁద నుండును. తెలుఁగున బిందువు వలయాకృతరేఖ అక్షరమునకుఁ బ్రక్క నుండును. తెలుఁగున బిందు వీ రూపమున నుండుటకు హేతువు గలదు. నాగరము నందును బోలెఁ జుక్కను బిందువుగా నంగీకరించిన యెడల నర్ధబిందువు వ్రాయ నవుపడదు. ప్రాఁత వ్రాఁత పుస్తకములలో ద్విత్వాక్షరమునకు డాఁపరి సున్నఁ గనఁబడును. అట్టిచోట్ల నది పూర్ణానుస్వారమనియుఁ దక్కినచోట్ల నున్న యర్ధానుస్వారమనియు గ్రహింపవలసి యుండును. ఇప్పటివలెఁ బూర్ణానుస్వార వామార్ధరూప మంతగా నానాఁడు వాడుకలో లేదని తోఁచుచున్నది.

ఆంధ్రాక్షరము లతి మనోహరము లయియున్నట్లే యాంధ్రభాషయు నతి మధురమని యెల్లవారు నంగీకరించుచున్నారు. ఇంత, సుప్రసిద్ధమగు నాంధ్రభాషయందుఁ బదపద్య గద్యాత్మకమగు కవన మెంత మృదు మధురముగా నుండునో చెప్పవలసిన దేమి.

## ఆంధ్ర కవిత్వము.

కర్ణ రసాయనమైనదో [illegible] కవితాశక్తి

"సాలెపురుగు కడుపులోని నూలు వలె" స్వభావ సిద్ధముగా నుండవలయునని తెలుఁగువారెఱుంగుదురు. కవి రచించిన పద్యము

"నాగి కమ్మచ్చు దీసిన తీగ వోలె"

నుండవలయునని తెలుఁగువారెఱుంగుదురు. కవికృతిమగు వాక్యము

"వలచి వలపించు చెలువ నెమ్మోము వోలె"

నుండవలయునని తెలుఁగువారెఱుంగుదురు.

చేతనాచేతన ప్రకృతి వైచిత్ర్యములు అన్నిటిని గాని కొన్నింటిని గాని విననింపయిన నియమయుక్తను పద్ధతిని ప్రయోగింపఁబడు శబ్దజాలముచే ననుకరించుట వలనఁగాని యాక్రోశించుట వలనఁగాని భావోద్రేకమును వ్యక్తీకరించుటయు విజృంభింపఁ జేయుటయుఁ గాలికకళ యగు కవితయనఁబడును. (Poetry is a time art of which the business is to express and arouse emotion by imitating or evoking all or any of the phenomena of life and the nature by means of words arranged with musical regularity) అని పశ్చిమ ఖండ పండితులు నిర్వచించుచున్నారు. వీరి మతములఁ బద్యరూపముగా నుండు నదియే కవిత గాని గద్యరూపముగా నుండునది కవిత గాదు. ఫ్రెంచి పండితులు గొందరు మాత్రము గద్యముగూడఁ గవిత్వమని యంగీకరింతురు. మనలో గద్యము, పద్యము, పదమును గూడ కవితయే.

కావ్య ప్రబంధ రూపమగు సారస్వతమునందు కవి తాను గొంత మాటాడి పాత్రవర్గముచే గొంత మాటాడించు నది యొకతెగ. పాత్ర వర్గమును నోరెత్తనీయక కవియే మాటాడునది యింకొకతెగ. కవి తాను తెరవెనుక దాఁగి పాత్రవర్గము చేతనే మాటాడించు నది మరియొక తెగ. దీనికి

రూపక మందురు. ఆంధ్రమున మొదటి రెండుతెగల కావ్యములే చిరకాలమునుండి లభించుచున్నవి. మూడవతెగ యిప్పు డిప్పుడుపొడసూపుచున్నది. భావిదశ యెట్లుండునో చెప్పఁజాలము. ఏమనినఁ బ్రకృతమునఁ బ్రచలితములగు నాంధ్ర నాటకాది రూపములను జూడఁగా నిరుత్సాహము గలుగుచున్నది. తెలిఁగింపఁబడిన సంస్కృత రూపకములనటుండనిచ్చి క్రొత్తగా రచింపఁ బడుచున్న తెలుఁగు రూపకములను బరిశీలించితిమేని వానిని రూపకములని పేర్కొనుటకే యనువు పడదు. గద్యపద్యాత్మకమగు కథోపకథన మాత్రమెల్ల రూపక మనవలసి వచ్చుచున్నది. వివక్షితార్థ ప్రతిపాదనముగాని యితివృత్తవిస్తరముగాని చమత్కారిత్వముగాని వానియందు స్ఫుటముగాఁ బొడకట్టదు. ఈరీతి దృశ్య ప్రబంధములవలన నాంధ్రరూపక సారస్వతము వన్నెకెక్కఁజాలదు.

ఆంధ్ర దేశోద్ధారకులగు కవితా సామ్రాజ్య పట్టాభిషిక్తులయిన యాంధ్ర మహాకవుల కీర్తిని దిగంత విశ్రాంత మొనర్చినదేది!

## ఆంధ్ర సారస్వతము.

సారస్వత మన్నను సాహిత్యమన్నను వాఙ్మయమన్నను నొక్కటే యను సంప్రదాయ మేర్పడినది. పరిభాషా విశేషవశమున సాహిత్య శబ్దమునకు వివిధార్థము లున్నను విద్యా విషయమున వాఙ్మయశబ్దము వలె సారస్వతార్థ బోధక మగుచున్నది. వాఙ్మయ శబ్దము నందలి మయట్ ప్రత్యయము ప్రాచుర్యార్థ బోధకమనుట కంటె వికారార్థ బోధక మనుటవలన సంగీత చిత్రలేఖనాది కళా విజ్ఞానము దానిలోఁ జేరగలదు. విజ్ఞాన సంపదవలె సారస్వత సంపదయు నఖండము ననంతమును గాఁబట్టి యింతటితోఁ జాలునని సంతుష్టి నొందక యాంధ్ర సారస్వతాభివృద్ధికి నిరంతరము ప్రయత్నించు చుండవలయును. ఇప్పటి కున్నది చాలదు. సంస్కృతాంగ్లేయాది భాషాంతర సారస్వతమును దెలుఁగుభాషలోనికిఁ బరివర్తనము మిక్కిలిగాఁ జేసికొన వలయును. ఉపయోగకరములగు క్రొత్త గ్రంథముల నధికముగా రచింపవలయును.

## సదసద్గ్రంథ విభాగము.

ఆంధ్రమున గ్రంథరచన యందభిలాష దినదిన ప్రవర్ధమాన మగుచుండుటవలన నానావిధ గ్రంథములు క్రొత్తక్రొత్తలు ప్రకటింపఁబడుచున్నవి. సారస్వత సభవారు దమలో గొందఱ నుపసంఘముగా నేర్పఱచి యిదివఱకుఁ బ్రకటితములైనవే కానిండు. మున్ముందు ప్రకటింపఁబడునవే కానిండు తెలుఁగున రచింపఁబడిన నానావిధ గ్రంథములలో నొక్కొక్కమాఱు కొన్నికొన్నింటి నుపసంఘ సభ్యులచే విమర్శ చేయించి సద్గ్రంథము లివియని నిర్ధారణ చేయించి యాతీరునఁబట్టికలను ముద్రింపించి ప్రకటించుచుండవలయును. పాఠశాలలలోను బరీక్షలలోను బఠనీయములుగా నిర్ణయింపఁబడు గ్రంథముల నెప్పటికప్పుడు తప్పక విమర్శించి సదసద్గ్రంథ విభాగమును జేయుచుండవలయును.

## వ్యాకరణము

గ్రాంథిక కాంధ్రమున కొకటియు వ్యావహారిక కాంధ్రమున కొకటియు నుండవలయునని కొందఱి మతము. భాష ప్రవాహరూపమగునది గనుక నప్పుడప్పుడు సంస్కారార్థము నియమ మేర్పడుచుండుట యవసరమేయగును. నియమమునకు లోఁబడు శబ్దమే సుశబ్దమనఁ బడును. నియమము నతిక్రమించిన శబ్దమపశబ్దమనఁ బడును. వ్యావహారిక కాంధ్రము నందునియమ బద్ధమగుభాగము గ్రాంథికమే కాగలదు. తక్కినది గ్రామ్యమనఁబడును. నియమమునకు లొంగకుండుటయె కాక నియమ మేర్పఱచుటకు వీలయినను జిక్కనీయని యదేచ్ఛాప్రయోగ బహుళమగు వ్యావహారిక కాంధ్రభాగమునకు వ్యాకరణము రచింపనెటుల సాధ్యమగునో స్ఫురింపదు.

## విమర్శనములు

గ్రంథముల గుణదోషములను వెల్లడిచేసి లోకోపకారకము లగును. కాబట్టి మిక్కిలి యావశ్యకములు. గీర్వాణ సారస్వతమున విమర్శనములుండి మహోపకారమొనరించుచున్నవి. అటులనే యాంధ్ర సారస్వతమునందును విమర్శనము లుండవలయును. విమర్శకులు మాత్రము నిష్పక్షపాతబుద్ధితో గుణదోష విమర్శనము గావింపవలయునే కాని పరస్పర ద్వేషభావమునువహించి యప్రస్తుత ప్రశంసలలోనికి నిందా వాక్యములలోనికి వ్యక్తిదూషణములలోనికి సాభిప్రాయములగు వేళాకోళపు వెక్కిరింతల లోనికిం గి యాత్మగౌరవమును గోల్పోయి వృధాశ్రమమును జెందరాదు. అట్టివిమర్శనములు విమర్శనములు గా నేరవు. సారస్వతమునం జేరంజాలవు.

## గ్రంథ భాండాగారములు

మన దేశమున నుద్భవింప సాగినవి. ఇది శుభసూచకము. ముద్రితాముద్రిత గ్రంథములను వీలు కొలందిసంపాదించి గ్రంథాలయములలో సంగ్రహించి యుంచుట వలనం దత్రత్యుల కెంతయు నుపయోగకరములుగా నుండును. "కోశవానాచార్యః" అను లోకోక్తి మనలోం గలదు. ఏ గ్రామము నందెట్టివారు గ్రంథ సంపాదనము చేసి గ్రంథాలయమునందు సంగ్రహించి యుంచినను వారు కీర్తి కాములయి లోకోపకార మొనరించిన వారగుదురు. ప్రాచీనకాలమునుండియు మనభరతఖండమున గ్రంథభాండాగారములు సుప్రసిద్ధములు. మహాకవుల గ్రంథభాండాగారములు మాత్రము సామాన్యభాండాగారముల వంటివి కావు. బిల్హణకవి

"సర్వస్వం గృహవర్తి కుంతలపతిర్గృహ్ణాతు తన్మేపునర్భాండాగార మఖండ మేవహృదయే జాగర్తి సారస్వతం" అనితన భాండాగార స్వరూపమును వివరించియున్నాఁడు. నిశ్చయముగా సారస్వత భాండాగారము లన్నవవియే. అట్టివి మన యాంధ్ర దేశమున నూటికొక్క నగరమున నూటికొక్కటియైన లభింపఁజాలును.

## జాతీయ విద్య

బాలికా బాలకులకు సులభసాధ్యముగా లభింపఁజేయ నెల్లవారును బూనుకొనవలసి యున్నది. మాతృభాషను సాధనముగా నైకొని దానివలన గ్రహింపఁగలిగినంతవరకు విద్యాజ్ఞానములను గ్రహించి సుఖముగా లోకయాత్ర సాగించుకొనఁ గల సామర్థ్యము నలవరించుకొనుట కనుకూలపడు విద్య జాతీయవిద్య యనవచ్చును. దేశకాలముల కనుగుణముగాఁ గృత్యను సారముగా బాలికాబాలకుల కెల్లరను జాతీయ విద్య నభ్యసింపఁ జేయనియెడల నాంధ్రదేశ పురోభివృద్ధి యింతట సమకూడదు. ఆంధ్రులలో నూటి కార్గురో యేడ్గురో వ్రాఁతచదువు లెఱిగినవారని వినుచున్నాము. ఇది సరియైనను గాకున్నను నిరక్షరకుక్షులత్యధిక సంఖ్యాకులని యంగీకరింపక తప్పదు. కాఁబట్టి జాతీయ విద్యావిధాన మూలమున నూటికి నూరుమంది నక్షరాస్యులఁ జేయునందాక నాంధ్రులు నిద్దుర వోరాదు.

ముప్పది సంవత్సరముల క్రిందటఁ బ్రతిగ్రామమునందును గొంచెమో గొప్పో జాతీయ విద్యావిధానము ననుసరించి బిడ్డలకుఁ దెలుఁగు చదువు నేర్పఁబడుచుండెను. ఇప్పుడాపద్ధతి సంపూర్ణముగా నంతరించి మనకు ముక్కు మొగమెఱుఁగని వింతవిద్యాభ్యాస పద్ధతి యేర్పడినది. ఇప్పటివిద్యార్థుల దశ మిక్కిలి శోచనీయముగా నున్నది. సుఖజీవనమున కుపయోగపడని దేశాంతర ఖండాంతర గోళాంతర వైచిత్ర్యములను వారనర్గళముగాఁ జదివి నేర్చుకొనుచున్నారు. దేశాంతర చరిత్రములను గ్రుక్క విడువక వల్లించుచున్నారు. తమదేశ స్థితిగతులు వారెఱుఁగరు. వారిదేశచరిత్రమేమో వారికిఁ దెలియదు. వేయేల వారివారి వర్గత్రయమైన వారి కెఱుక లేదు. పట్టుమని పదిమంది చుట్టాల వావివరుసలైన నెఱుఁగరు. సూర్యచంద్రులను బోల్చఁగలరు గాని గురుశుక్రులను బోల్పజాలరు. అశ్వినిభరణ్యాది నక్షత్రములమాట చెప్పనేలా! వారికెంత

బోధించినను వానియాకృతులు తెలియవు. ఇంటిలోని ముసలమ్మగాని తమమాన్యమును దున్ను పాలికాపుగాని పంచాంగమునుజూచి చెప్పుమని యేమడిగినను జెప్పఁజాలరు. పంచాంగమునుజదువుడెట్టులో వారు నేర్చుకొనలేదు. ఇంకేలా తుదిమాటఁ తెలుఁగున వ్రాయలేరు. తెలుగంకెలెఱుఁగరు. వ్రాఁతచదువు లెఱిగిన వారి లెక్కలోఁజేరిన వారి యవస్థయే యిట్లున్నదిగా బట్టి యాంధ్రులందఱుజదువువ్రాఁత లెఱుగనివారేయనుకొని నూటికి నూరుమందికి మాతృభాషమూలమున జాతీయవిద్య నేర్పవలసి యుండునని తోఁచుచున్నది. జాతీయ విద్యావిధానము ననుసరించి మాతృభాషయగు నాంధ్రభాషలోనే విద్య నేర్పినచోజనసామాన్యమునకు సుఖజీవము లభింపవచ్చును. విద్యాధికులై దేశకాలముల ననుసరించి యుత్కృష్టధనగౌరవాదులనుబొందఁగోరువారి విద్యావిధానమునఁ గొంత విశేషముండవలయును. జరుగుబడిగలవారుతమబిడ్డలధిక విద్యావంతులై కళావిజ్ఞానము నలవరించుకొని యుత్కృష్ట ధనగౌరవ ప్రతిష్ఠలను బడయుటకు సమంజసములగు వృత్తుల నవలంభింప జేయఁదలంతురు అట్టివారిబిడ్డలకుఁ బ్రారంభమునందు జనసామాన్యముతోడ్పాటున మాతృభాషమూలముననే విద్య నేర్పించి పన్నెండవయేడు మొదలుకొని మాతృభాషకు దోఁడు మరిరెండు భాషలు నేర్పింప వలసి యుండు. కొందఱొక్కటి చాలు నందురుగాని మనతెలుఁగువారికి రెండుండక తప్పదు. ఆంధ్రభాషకును సంస్కృత భాషకును గలసంబంధములనుఁ బట్టి సంస్కృత భాషాజ్ఞానమవసరము. దేశకాలాదులననుసరించివిశేష విద్యా విజ్ఞాన సంపాదనమున కింగ్లీషుభాషాజ్ఞానమవసరముకాబట్టియీమూఁడుభాషల మూలమునను జ్ఞానవిజ్ఞాన సంపద లభింప జేసి సఫల మనోరథులు గావచ్చును.

## సారస్వతమహాసభ

నేఁటేఁటనొక్కొకచోటసమావేశముగావించి కార్యక్రమము నొకటి రెండు దినములలోఁబూర్తి చేసి సభఁజాలించుచున్నంతమాత్రమునలాభమంత గానుండఁజాలదు. సభవారి తీర్మానము లాచరణములోనికి రాఁదగిన యేర్పాటులను గావించిగా యవిచ్ఛిన్నముఁ బనిసాగించుచుండ వలయును. ఆంధ్రదేశమునందొకచోట సభా ప్రధానస్థానమును నెలకొల్పి నిరంతరము సభోద్దేశములకు లోకప్రచారము గలిగించుచుండవలయును. ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమును మదరాసునుండి యాంధ్రదేశమునకు మార్పఁదలపెట్టుచున్నారు. ఆంధ్రదేశమున సారస్వత మహాసభా ప్రధానకార్యాలయమును సాహిత్య పరిషత్కార్యాలయమును నొక్కచోటనే నెలకొల్పననువగునేనిఁ జెప్పవలసినదేమి. పరస్పర సహాయ్యమున నెంతయైన బని నడువవచ్చును. శీఘ్రకాలములోనే యాంధ్రరాష్ట్రమేర్పడగలదు. గాన మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్న యాంధ్రగ్రంథసముదయమును నాంధ్రలిపితోనున్న సంస్కృత గ్రంథసముదయమును జిత్రవస్తు దర్శనాలయమునందలియాంధ్రదేశముతో సంబంధించియుండు తామ్రశిలాశాసనములు విగ్రహములు వివిధములగు నితరచిత్రవస్తువులు జరాయుజాండజ జోద్భిజ్జ కళేబరాదులును మనయాంధ్రదేశము నొండొక ప్రధానపట్టణమునకు దెప్పించుకొన బ్రయత్నింప వలయును. సాహిత్య పరిషత్పత్రికవలె సారస్వత మహాసభాపత్రికయొకటి ప్రకటింప వలయును. ఇంతటి గొప్పకార్యములను నెరవేర్పఁదగినంత ధనమునుసముపార్జింప వలసియుండును. దానికిఁ దగిన నెరవులాలోచింప వలయును.

## ఉపసంహృతి.

ప్రాజ్ఞుల సాన్నిధ్యమున లేశమాత్రము విద్యా గ్రంథమును లవమాత్రము జ్ఞానసామగ్రియు నలవరచుకొన్న నేనింకను విద్యార్థివర్గములోఁ జేరిన వాఁడనే కాని పండిత వర్గములోఁ జేరినవాడను గానని నే నెఱుగుదును. అట్టినన్ను మీరీ యాంధ్రసారస్వత మహాసభలో నధ్యక్షస్థానమునఁ గూరుచుండఁ బెట్టనిశ్చయించితిరి. కాని మీరు నిరుత్సాహులు కాకపోరని నానమ్మకము. అయినను మీయాజ్ఞనుల్లంఘింప స్వాతంత్రముగాదు గనుక నామమాత్రమున నే నధ్యక్షత వహింపమీరే సభా కార్యక్రమమంతయు సానుకూలముగా నేఁడును రేపును నడ

పించుకొనవలసిన భారమంతయు మీపయి నుండును. ఇచ్చటఁగూర్చుండి మాటసాయము మాత్రమునే చేయుచుందును. నే నేనాఁడు నెఱుఁగని సారస్వత మహాబాధ్యత్వతాగౌరవమును మీరు నాకనుగ్రహించితిరి. గాన త్రికరణశుద్ధిగా మీకుఁబదేపదే నమస్కరించుచు శిశా “ శౌరమృతార్పణ ”మ్మనునట్లు విబుధులగు మీకొఁక్క యుపనిషద్వాక్యమును వ్రాఁకూపమున సమర్పించి మీయనుమతిఁబడసి సుఖాసీనుఁడనయ్యెదను. అది యేదన

“ ఉత్తిష్ఠత-జాగ్రత-ప్రాప్యవరాన్ని
బోధత-క్షురస్య ధారానిశితాదురత్యయా
దుర్గంప థస్తత్కవయోవదన్తి”

అనునది. “లెండు మేల్కొనియుండుడు. ప్రాజ్ఞులను చేరి జ్ఞానమువలవరించుకొనుఁడు. కడు వాడిపదును గలకత్తి దారువలె దాటిచూడరాక యడుగుదీసి యడుగు వెట్టనవుపడని దాదారియని చెప్పుదురు పండితులు.” అని దీని తాత్పర్యము.

# చిత్రములు.



[ న. వేం. రత్నముగారు. ]



సుస్టిసూశావటె నాసిట్టిసీతి!
యెరుగుంటె సెప్పవే యెట్లుందొసీతి.
మెరుపెట్లు సీకట్లొ
మెరసిపోతున్నదో!
ఆసిత్రమేమిటో
అర్దమయ్యిందా? సుస్టి.
వానసినుకాసతో
వస్తావున్నాడె!
ఆసిత్రమేమిటో
అర్దమయ్యిందా? సుస్టి.
అంతా వకటయి పో
యినాదేసీతి !
ఆసిత్రమేమిటో
అర్థమయ్యిందా? సుస్టి.



# శ్రీముఖశాతవాహనుని దిగ్విజయయాత్ర



(చిల్లరిగె శ్రీనివాసరావుగారు.)

ఇప్పటికి సుమారు రెండువేల సంవత్సరములక్రిందట మన భారతదేశమునం దొకసారి వర్ణములు సాంకరమయ్యెను. కేవలము వంశపారంపర్యముచేత జ్ఞానపౌరుష భాగ్యసంపదలు ఒక్కశాఖవారి నాశ్రయించియుండవు గదా! అథవా ఆశ్రయించియున్నను వీర్యవంతములుగ నుండఁజాలవు. నూతన పరిస్థితులందు పైవాని యొక్కయార్జన నూతనమార్గములందు లభ్యమగుచుండును. పైవానియొక్క సంపాదనచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులన నెగడిన వర్ణములవారు వానిని వృద్ధి చేసుకొన లక్ష్యముంచుకొనక పూర్వపు వాసనచేతనే తమ సాంఘిక గౌరవమును నిలుపుకొనజూతురు. అట్టిగౌరవము తమకు అర్హతచేత కలుగునపుడు కృత్రిమసాధనాంతరములచేత దానిని నిలుపుకొనఁజూతురు. ఇదివరకు పూర్వకర్మచేత పైసాంఘిక గౌరవములేని నీచవర్ణములవారు పరిశ్రమచేత యుత్తమవర్ణముల కేగుటకు సత్కర్మను సంచితముసేయుదురు. పైమూడువర్ణములు అనగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యవర్ణములందుమనస్పర్థవలన క్రిందవర్ణములవారు పైవారి నాక్రమింపఁజూతురు. ఈసాంఘిక పోరాటమే దేశమునం దుండడో యాదేశము నిర్జీవంబగును. ఈ పోరాటము దేశారిష్టమని కొంద రందురు గాని యిదిలేనిదే సంఘము ప్రవాహములేని నదీజలమువలె దుర్గంధపూరితంబై దుష్టంబగును. ఇట్లు వర్ణసంకరమైనప్పుడు మన యాంధ్రనాయకుఁడగు శ్రీముఖశాతవాహనుడు వర్ణములకు పునర్జీవంబొసగ తన దిగ్విజయయాత్రను నడిపించెను.

రాజధానియగు ధాన్యకటకము ధనధాన్యములతో తులతూగుచుండెను. శ్రీముఖుడు భారతదేశమున ధర్మాభ్యుదయమును గావించుటకు జెండాను బయలుదేరదీసెను. వర్ణభేదమును అల్పబుద్ధితో జూడక విశాలబుద్ధితో నిర్వహించువా రిందుచేరవలెనని యాయన చాటింపు చేయించెను. దేశోద్ధారణకు సేవఁజేయగలవారు సేవఁజేయువలెను. ధనమివ్వఁగలవారు ధనమియ్యవలెను. ప్రాణమియ్యగలవారు ప్రాణమియ్యవలెను. జ్ఞానమియ్యగలవారు జ్ఞానమియ్యవలెను. అని యాయన వర్ణభేదమును పునః ప్రతిష్ఠచేయించెదనని ప్రకటించెను. దేశములో నీవరకు ఘనీభవించిన వర్ణభేదముతో సంతుష్టిచెందినవారెల్ల నీజెండాక్రింద జేరిరి. వీరలకు భోజన ప్రతిభోజనముల వివాదములులేవు. అంతర్వివాహములందు వధూవరుల

దిని వేడుకొనుచు నారు రాయ భారములు నడిపిరి.

శ్రీముఖ శాతవాహనుడు బాహ్య తేజస్సున చండకిరణుండుగాని హృదయమున నమృతమయుండు. అతని భయంకరమైన హాస్యరసంబుచూచి శత్రువులు వెరగందుదురు. అయన లీలా ...న సాయంకాలవేళలందు ఉరుములు మెరుపులతో వచ్చు కారుమబ్బువలె గాన్పించి తాంబూలరాగ–అస్తమయంబునకు పరిణమించు దివ్యసుందర విలాసంబు భాతి ప్రకాశించుచుండును. ఆయన క్రీడయందు దెవ్వరికిని హానిలేదు. ఆయన అవలంబించినది అహింసా వ్రతమేకాని యది యెవ్వరును తిన్నగా గుర్తింపజాలరు.

శ్రీముఖుడు తన శిబిరమునందు సోదర వీరులతో లోకవ్యవహారములను సరసంబుగ మాటలాడు చుండెను. అంతట నొక యువకుండు వచ్చి నమస్కారము చేసెను. శ్రీముఖుడు ప్రశ్నించెను.

శ్రీముఖ:— నీవెవరు?

ఆగంతు:— నాది పాటలీపుత్రము.

శ్రీముఖ:— నీ వేల వచ్చితివి?

ఆగంతు:— మీరుద్దేశించిన ధర్మోద్యమమున నాచేతనైన పాలుగొనుటకు.

శ్రీముఖ:— మాయాజ్ఞ లేనిది నీవే విశేష కార్యమును స్వతంత్రించి చేయఁగూడదు. ఎరుగుదువా?

ఆగంతు:— చిత్తము. కాని నాకొక్క కోరిక యున్నది. దానిని తాము నెరవేర్చ ప్రార్థించెదను.

శ్రీముఖ:— అదియేమి?

ఆగంతు:— నేనెప్పుడును తాము కార్యకలాపములు నిర్వహించునపుడు తమ యంతికమున సేవకుడుగా నుండనిచ్చుటకు ప్రార్థించుచున్నాను.

శ్రీముఖ:— (యువకుని తేరి పారఁజూచి చిరునవ్వుతో) అటులనె కానిమ్ము.

ఆగంతు:— తన ఖడ్గమును శ్రీముఖుని చేతికిచ్చి యాయన చేతనుండి ఆశీర్వాదముతో గ్రైకొనెను.

రాయబారములు జరిగెను. సుశర్మ చక్రవర్తి యొక్క పాదములకు శ్రీముఖుడు మ్రొక్కినట్లును, శ్రీముఖునకు సుశర్మ చక్రవర్తి రాజ్యమునంతను ధారవోసి తానడవులకు పోయి తపస్సు చేసుకొనునట్లును ఒక చిత్రమైన రాజీయేర్పాటు యయ్యెను. శుభలగ్నము నిర్ణయమయ్యెను. సభలో మహోన్నత సింహాసనమున సుశర్మ మహారాజు కూర్చుండెను. ఆయనచుట్టును ఆయనయుద్యోగస్థులు గంభీరముగ గూర్చుండి యుండిరి. రాజ్యము పోవుచున్నను గౌరవము నిలువబెట్టుకొన గల్గితిమని వారు సంతోసించుచుండిరి.

ఆసమయమున శ్రీముఖుడు తన వీరనికాయముతో సభలో ప్రవేశించెను. సుశర్మ మహారాజు నెదురు నాయనయొక్క యుద్ధత దంతావళము వలె నిలిచియుండెను. ఆయన కిరుప్రక్కలను బారుదీరి యోధులు ఖడ్గపాణులై విద్యుల్లతాలంకృతములైన నీలమేఘంబుల వలె నిలిచియుండిరి. శ్రీముఖుడు సుశర్మ చక్రవర్తి యొక్క పాదములకు నమస్కారము చేయుటకు మోకాళ్ళపై కొరగెను. అతడు తన చేతులతో సుశర్మ మహారాజు పాదములను బట్టుకొనెను. కాని తలవంచి మరియొక రాజునకు తాను నమస్కారము చేయుటకు తల వంచుకొన్నదిగాని పాదములనే తనతల యొద్దకు తీసుకొని పోవుదునని చెప్పుచు నట్లు

చేసి రెండుపాదములను పైకెత్తి యటుపిమ్మట మీరు దేవలోకమునుండి దిగిన ప్రభువులైన యెడల మీపాదములు అటువైపునకుండ వలసినదనియు మరల నాదిక్కునకు మీరు పోవుటకు మీపాదము లటు త్రిప్పుచున్నాననియు హాస్యము చేయుచున్నట్లుతలక్రిందులు చేసి విడిచిపెట్టెను. అతని యనుచరు లందరును ఈ చర్యనుజూచి ద్రోహముగాఁదలఁచి ఝడిసి పలాయనమైరి. శ్రీముఖుని సైన్యములు గొల్లుమని నవ్వనారంభించెను. సుశర్మ మేన ప్రాణములు మిణుకు మిణుకు మను చుండెను. అట్టి సమయమున నందఱును పరాకున నుండ నూతనముగ దండున చేరిన యువకుడు ముందుకువచ్చి తనకత్తితో సుశర్మవక్షమున బొడిచెను.

సభయంతయు రక్తము చిందెను. శ్రీముఖుడాశ్చర్య పోయెను. సభయంతయు నల్లకల్లోల మయ్యెను. భటుల యాయుధము లాయువకుని సమయింపనుద్యుక్తములయ్యెను. యువకుడు కేలుమోడ్చి నమస్కారము చేయు చుండెను. శ్రీముఖుడు తీక్షణముగఁ జూచుచు నిట్లుప్రశ్నించెను.

శ్రీముఖు:— ఏమీ దుండగము! నాయాజ్ఞ నీవర కెవ్వరును మీరలేదు. ఏమి నీ కింతసాహసము. నేనింత దవ్వుసంచారము చేసితిని. ఒక్క రక్తబిందువు నైనఁగార్చలేదు. నాపేరుమీద ఎవ్వరును ఇంతవఱకు ఒక్కరక్తపుబొట్టు పాపము కట్టుకొనలేదు. ఓడినవాని రక్తమోడ్చితివి. ఏమి పౌరుషమని తలంచితివి?

యువ:— మహావీరా, పౌరుషము నాకక్కర లేదు. నేను పురుషుడనుగాను. స్త్రీని. హత్యచేసినందుకు శిక్షచేసుకొనుడు. నేను సిద్ధముగా నున్నాను.

శ్రీముఖు:— ఏమిది! స్త్రీవా? నీకెందు కీయన మీదపగ?

స్త్రీ:— మహానుభావా! నేను వరించినపురుషునికీ డన్యాయముగ జంపించినాడు. నన్ను చెరబట్ట నుద్యోగించినాడు. నేను ప్రతిహింసగావించి నాపురుషుని సంతోషపెట్టితిని. ఇకనాకీలోకమున కావలసినది లేదు. నన్ను చంపి నాప్రియుని శీఘ్రముగ జేరునట్లు జేయుడు.

శ్రీముఖుడు :— మేము హత్యసేయువారము కాము. అందులో స్త్రీహత్య ననలే చేయము.

స్త్రీ:— దండార్హులగు నన్ను చంపిన మీకు హత్యాపాపములేదు. దండార్హులను జంపిన రాజులకు పుణ్యలోకంబు కలుగునని శాస్త్రంబులందు చెప్పియుండిరి.

శ్రీముఖుడు:— మాతో శాస్త్రవాదముచేయకుము. నీవు తక్షణమిచ్చటనుండి వెడలిపొమ్ము.

ఆమాటలు వినినంత నామానిని తన కంచుకమునుండి మఱియొక చురికను బయటకు తీసి బొడుచుకొనిచచ్చెను.

శ్రీముఖుడు :— ఆరాజ్యమునకు తన యనుచరులలో నొకనిపరిపాలింప నియమించి వర్ణాశ్రమంబులను సజీవంబుగ ప్రతిష్ఠాపింప నాజ్ఞయిచ్చి తన యుద్యమంబును భారతదేశమున తను ప్రచారము గావించి కొంతకాలమునకు రాజధానియగు ధరణికోటకు వచ్చెను.



# ప్రతిమా నాటకము.



( గో. రామదాసు గారు బి. ఎ. యం. ఆర్. ఏ. యస్. )



## ద్వితీయాంకము.

కంచుకి ప్రవేశించును.

కంచుకి:— ఓహో! ప్రతీహార వ్యాపృతులలారా! మీ మీ పనులయందే మరచి యుండకుడీ!

(ప్రవేశించి)

ప్రతీహారి:— అయ్యా! ఎందుచేత?

కంచుకి:— ఈ మహారాజుగారు, సత్యవాక్య రక్షణ యందు పట్టుదల గల రాముడిని అరణ్యావాసమునకు వెళ్ళకుండా ఆపలేక పుత్ర విరహ శోకాగ్నిచే దగ్ధహృదయుడై వెఱ్ఱివానివలె ప్రలపించుచూ సముద్రగృహమందు బడి యున్నారు.

యుగాంతమందు చలించు మేరువ వలెను అల్లకల్లోలమైన సముద్రము వలెను, బింబమాత్రమే గనబడుచూ పడిపోవుచున్న సూర్యునివలెను మహారాజుగారు శోకమువల్ల విశేషముగా శిథిలమైన దేహముబద్ధిగలవారై బడియున్నారు.

ప్రతీహారి:— మహారాజుగారు ఇటులైపోయినారా!

కంచుకి:— అవును. వెళ్లుము.

ప్రతీ:— చిత్తము! అయ్యా! (వెళ్లును)

కంచు:— (అంతటా చూచి) అయ్యో! రాముడు వెళ్ళిపోయినది మొదలు అయోధ్య నిర్జనమైనదాని వలె నిజముగా కనబడుచున్నది. ఏలనంటె? ఏనుగులు యవలు తినుటయందాసక్తి లేనివై కండ్లంట నీరు గార్చుచున్నవి. గుఱ్ఱములు సకలించలేదు. వృద్ధులు, స్త్రీలు, బాలురు అందరు పురజనులు ఆహార విహారములనువిడచి దీన ముఖములతో గట్టిగా రోదనము చేయుచు రాముడు సీతా లక్ష్మణులతో బోయిన దారినే జూచుచున్నారు. (అ) నేనుకూడా రాజు

గారి సన్నిధికి బోయెద. (కొంతదూరము వెళ్లి చూచి,) ఓహో! సహించుటకు శక్యము గాని పుత్రవియోగ దుఃఖము నణచుకుని తనను వోదార్చుచున్న తనపెద్దభార్యా సుమిత్రలతో గూడ మహారాజుగారున్నారు. ఇరుగోఇరుగో పడుతూ లేస్తూ, మాటిమాటికీ హా! హా! యని ఏడ్చుచూ రఘుకు లోద్ధారకుడు బోయిన దారి నేజూచుచూ (అ)

(ఉన్నారు) ఇరిగో మహారాజుగారు?

(నిష్క్రమించును)

(ఇది మిశ్రవిష్కంభకము)

(తరువాత పైన జెప్పినట్లుగా దేవీలతో గూడ రాజుగారు ప్రవేశించును.)

రాజు:— హావత్స! రామ! నయనముల కానందనిచ్చువాడా, హా నత్స, లక్ష్మణా, మంచి లక్షణములతో గూడియున్న శరీరము గలవాడా, హాసాధ్వీ, మైథిలీ, భర్తయందే నిలిచియున్న చిత్తవృత్తిగలదానా అయ్యో, అయ్యో, నా కడుపున బుట్టినవారు వనమునకు బోయిరి గదా, (ఇ)

ఏమి ఆశ్చర్యము, అన్నయందుండే ప్రేమచే తండ్రియందుం(బు)డే వాత్సల్యము పోయినది. అతనినే జూడగోరుచున్నాను. కోడలా వైదేహీ.!

లోకమందపకీర్తి వంతుడనని రామునిచేత విడువ బడితిని. లక్ష్మణునిచే నిరాకరించబడితి. నీవుకూడా నన్ను వదలివేసితివి.

పుత్రరామా! కుర్రా లక్ష్మణ! కోడలా వైదేహి పిల్లల్లారా, పలుకరేమర్రా, ఇచ్చటలేరా, నే పిలిచినప్పుడు మును చెప్పుడూ పలుకకుండా యుండేవారుకారే. ఎక్కడనున్నారోయి! కౌసల్యా తనయ!

సత్యసంధ! జితక్రోధ! విమత్సర! జగత్ప్రియ పెద్దల సేవ చేయువాడా! నాతో మాట్లాడవేమోయి!

సర్వజన హృదయ నయనాభి రాముడవైన రామా! యెచ్చట నున్నావోయి! నాయందున్న గౌరవ మేమైనదో! శోకార్తులైన వారియందు నీకుండే ప్రేమ యేమైనదో? పుత్రా! రామ స్పృహుడైన దండ్రిని నన్ను విడచి సంస్తుతమైన ఏధర్మమాచరించితివి! అయ్యో ఛీ! కష్టము!

సూర్యునివలె రాముడు వెడలెను. సూర్యుని తో వెలుతురు వెళ్ళినట్లు లక్ష్మణుడు వెంబడించెను. సూర్యుడు వెలుతురుతో ఛాయ బోయినట్లు సీత కనుపించలేదు! (ఈ)

(పైకిజూచి) యోకృతాంత హతకుడా!

మేము పిల్లలు లేనివారము. రాముడు మరియొక రాజు కొమారుడు. కైకేయి వనములోనుండు వ్యాఘ్రము. ఈమాటేని చేసితివి. నీ వింకేమి చేయనలెను!

కౌసల్య:— (ఏడ్చుచూ) చాలును. మహారాజా! విస్తార దుఃఖబడి తమగు ఓడలు మరుపకండి. ఆమెను ఇద్దగ పిల్లలనూ నిర్ణయ కాలాంతమందు తమరు జూతురు. (ఉ)

రాజు:— నీ వెవరో!

కౌసల్య:— ప్రేమలేని పుత్రుని గన్నదానను గదూ నేను!

రాజు:— ఏమి! ఏమి! సర్వజన హృదయనయనాభిరాముడైన రామునికి తల్లివే నీవు కౌసల్యా!

కౌసల్య:— ఆ మంద భాగ్యురాలనే నేను.

రాజు:— కౌసల్యా! నిజముగా అదృష్ట సంతురాలవైతివి. నీచే రాముడు గర్భమందు దాల్పబడెను!

నేనో అగ్నిజ్వాలవలె సహింప శక్యముగాని విస్తార దుఃఖమును భరించలేకున్నాను. అణచుకోలేకున్నాను. నా ఇంద్రియములు క్షీణించినవి. (బు)

(సుమిత్రను జూచి) ఈ రెండవ దెవరు.

కౌసల్య:— మహారాజా! వత్సలక్ష్మణ (అనిసఖము చెప్పి)

రాజు:— (వేగముగా లేచి) లక్ష్మణు డెక్కడ, కనుపించ డేమి. అయ్యో! దురవస్థ—
(ఇద్దరు దేవీలు చటుక్కున లేచి రాజుగారి వెంట వెళ్లుదురు)
కౌసల్య:— మహారాజా, పిల్లవాడైన లక్ష్మణుని తల్లియైన సుమిత్ర అని చెప్పుటకు ప్రారంభించితిని,
రాజు:— యోసీ! సుమిత్రా!
నీ కొడుకే సత్పుత్రుడు. రఘుకుల శ్రేష్ఠుడైన రాముని రాత్రిం బవళ్లు నీడవలె అనుసరించేయున్నాడు.
(ప్రవేశించి)
కంచుకి:— మహారాజుగారికి జయము! పూజ్యులైన సుమంత్రులవారు విచ్చేశినారు.
రాజు:— (చటుక్కున లేచి) రాముని దీసుకునేనా?
కంచు:— లేను రథముతో మాత్రమే?
రాజు:— ఎట్లు! ఎట్లు! ఒక్క రథముతో నేనా! (మూర్ఛబడును)
దేవీలు(ఇద్దరు);—మహారాజా యోర్చండి! యోర్చండి!
కంచు:— అయ్యో ఎంత కష్టము? ఇట్టి గొప్పవారు ఇటువంటి ఆపదను బొందుటను బట్టి విధి అనతిక్రమణీయముగదా! మహారాజా? యోర్చండి! యోర్చండి.
రాజు:— (కొంచె మోదారి) పిల్లకాయలలారా! సుమంత్రుడొక్కడే వచ్చెనా!
కంచు:— మహారాజా! చిత్తము!
రాజు:— ఎంతకష్టము!
రథము శూన్యముగావచ్చినందున నామనో రథము శిథిలమై పోయినది దశరథుని తీసుకుపోవుటకై యముని చేనంపబడినరథమే నిశ్చయముగానిది. (కి) వేగముగా అయనను తీసుకురండి!
కంచు;— మహారాజుగారి శలవుప్రకారమే (అని వెళ్ళిపోవును)
రాజు:— పద్మములతో నిండిన సరస్సులపై వీచుచు అరణ్యములో సంచరించు గాలులు ధన్యమైనవి. ఏమంటే అరణ్యములో వశించియున్న రాముని పైవీచి అతనకు సుఖమును గలుగ చేయును (ఎ)
(సుమంత్రుడు ప్రవేశించును)
సుమంత్రుడు:— (దుఃఖముతో నంతటనూ జూచి)
తమ తమ యుద్యోగములు విడనాడి రాముని యందుగల స్నేహముచే కళ్లనీళ్లు బెట్టుకుంటూ విచారముచే దీనముఖులై దుఃఖము చెక్కిళించిన దేహములు గలవారై రోదనము చేయుచున్న రాజుగారిని లక్ష్యము చేయకున్నారు (ఏ)
(సమీపించి)
మహారాజు గారికి జయమగును గాక!
రాజు:— అన్నా సుమంత్రి!
నా పెద్ద తనయుడైన రాముడెక్కడ?
కాదు! కాదు! నేను బాగా చెప్పలేదు.
ప్రియుడైన నాజ్యేష్ఠపుత్రుడేడి? విదేహరాజకుమార్తెయేది? ఆమెకు పెద్దలయందునూ భర్తయందును నిరుపమానమైన భక్తిగదా! పోనీ సుమిత్రాతనయుడైనయేడి? పితృగౌరమును పోగొట్టుకొని సకల జనులకు దుఃఖసముద్రమును గలుగచేసి చావసిద్ధమైయున్న నాకు ఏమైన చెప్పినారా?
సుమంత్రి:— మహారాజ! ఇట్టి యమంగళ వచనములను జెప్పకండి. కొద్దికాలములోనే వారిని మీరు జూడగలరు.
రాజు:— నిజము అయుక్త ప్రశంస! తపశ్శాలులకు యుక్తమైన ప్రశ్న గాదిది! ఇది జెప్పండి! తపశ్శాలులు తపస్సునందు వృద్ధియగుచున్నారా! అరణ్యములు స్వాధీనములైనవిగదా! అందుసంచరించుచున్న వైదేహి విసుగుకోలేదు గదా (వి)
సుమిత్ర:— సుమంత్రి అనేక నారబట్టలచే నలంకరించబడ్డ శరీరము గల్గి చిన్నదైననూ పెద్దల నడవడికగల్గి పెనిమిటితో గూడ ధర్మము నాచరించు సీత మాకున్ను మహారాజుగారికిన్ని యేమీ జెప్పలేదా?
సుమంత్రి:— అందరూకూడ మహారాజుగారి విషయమైయ్యే

రాజు:— వద్దు వద్దు. శ్రోత్రరసాయనములై హృదయ దుఃఖమునకు ఔషధములైన వారల నామధే యులనే వినుపించుమీ! (ఒ)

సుమంత్రి:— మహారాజుగారు శెలవిచ్చినట్లే. ఆయు ష్మంతుడైన రాముడు—

రాజు:— రాముడనియా? ఇదేరాముడు. అతనిపేరు విన్నంత మాత్రాననే అతనిని ముట్టుకున్నట్లు నాకైనది. తరువాత తరువాత?

సుమంత్రి:— చిరంజీవుడైన లక్ష్మణుడు —

రాజు:— ఇదే లక్ష్మణుడు. తరువాత తరువాత.

సుమంత్రి:— జనకరాజ కౌమార్తెయైన ఆయుష్మతీ సీత—

రాజు: ఇదే వైదేహి. రాముడు లక్ష్మణుడు. వైదేహి ఇదియా వరుస? బాగున్నదిగాదు.

సుమంత్రి:— అయితే మరేది ఉంచినవరుస?

రాజు:— రాముడు సీత లక్ష్మణుడు అని చెప్పవలెను. అచ్చటగూడ రామ లక్ష్మణులమధ్యనే యుం టుంది సీత. అనేక బాధలు గలది యరణ్యము గాన ఆమెకు యిరుప్రక్కలా రక్షణ యుండ వలెను.

సుమంత్రి:— మహారాజుగారు శెలవిచ్చినట్లే ఆయు ష్మంతుడైన రాముడు—

రాజు:— ఇదేరాముడు.

సుమంత్రి:—చిరంజీవి జనకరాజపుత్రి—

రాజు:— ఇదే వైదేహి—

సుమంత్రి:— ఆయుష్మంతుడైన లక్ష్మణుడు—

రాజు:— ఇదే లక్ష్మణుడు రాముడు! వైదేహి లక్ష్మ ణుడు! పిల్లలలారా! నన్ను కౌగలించుకోండి! ఇప్పుడే రాముడిని ముట్టుకుంటాను. ఇప్పుడే లక్ష్మణుని జూస్తాను. ప్రాణములు పోయినవాడు అమృతముచే బ్రతుకునట్లు ఈయాసచే నే బ్రతుకుదును (ఓ)

సుమంత్రి:— శృంగిబేర పురమందు రథమునుండి అయోధ్యాభిముఖులై నిలిచి అందరూ మహా రాజుగారికి శిరసా నమస్కరించి మనవి చేయుటకారంభించిరి.

దేనినోయొకదానిని చాలాసేపువరకూ యాలో చించి చెప్పనట్లు క్రింది పెదవులను గదల్చి కన్నీళ్లచే అరిగట్టబడ్డ కంఠములు గలవారై ఏమిచెప్పకుండానే అడవికి బోయిరి. (ఔ)

రాజు:— ఎందుచే ఏమిచెప్పకుండా అడవికిబోయిరి.

(అని రెండుచేతు గుండెను బాదుకొనును)

సుమంత్రి:— (తొందరతో) పిల్లకాయలలారా మం త్రులతో చెప్పండి — ప్రతీకారము జేయబడ లేనియవస్థయందు మహారాజుగారున్నారని—

కంచు:— చిత్తము (వెళ్లును)

దేవీలుఇద్దరు:— మహారాజా యోర్చండి యోర్చండి

రాజు:— (కొంచెము యోచారి)

కౌసల్యా నిన్ననే జూడలేకున్నాను. నన్ను ముట్టుకో రామునితో వెళ్ళిన బుద్ధి యింకనూ తిరిగి రాలేదు. (ఖ)

పుత్ర! రామ!

నిన్ను రాజ్యమందు అభిషేకించి మంచిరాజువల్ల గలిగెడు లాభములను బడయువారినిగా ప్రజలను జేసి, నీఅన్నదమ్ములను నీతో సరియైన విభవముగల వారినిగా జేయుమని చెప్పదమని నేనెల్లప్పుడూ అనుకునే వాడిని గాని నిన్ను అడవికి బంపివేయవలెనని జెప్పిన కైకేయిచే నిదియంతయూ ఒక్కక్షణములో మరియొకలాగు జరిగి పోయినదిగదా!

సుమంత్రుడా! కైకేయితో జెప్పు:—

రాముడడవికి పోయెను; నీవుసంతోషించుము; నేను గూడ ప్రాణములను విడిచివేస్తున్నాను. నీకొడుకును వేగముగా రావించుము. నీపాపము ఫలించినదిలే!

సుమంత్ర:— మహారాజుగారి శలవు!

రాజు:— ఓహో! (మీదికిజూచి) రామకథ వినుటచే దహించబడ్డహృదయముగలనన్ను ఓదార్చుటకు వచ్చి నారుగాబోలు నాపితృదేవతలు! ఎవ రచ్చట! (గ)

(ప్రవేశించి)

కంచుకి:— చిత్తము మహాప్రభూ!

రాజు:— నీళ్లుతీసుకురా!

కంచుకి:— మహారాజుగారి శలవు (వెళ్ళి తిరిగివచ్చి)
చిత్తము మహారాజా ఇవిగో నిన్ను.

రాజు:— (ఆచమనంచేసి జూచి)

ఈయన దేవతలకేనికి సఖుడైన దిలీపుడు, ఈయన రఘుమహారాజు; ఈపూజ్యులు మాతండ్రి అయిన అజ మహారాజు; మీరు విచ్చేయుటకు కారణమేమి? తమతో గూడ కలయుటకు నాకు కాలము వచ్చినదా? రామ! వైదేహీ! లక్ష్మణా! నేను ఈ పితృదేవతలతో గూడ వెళ్ళుచున్నాను! ఓ పితృదేవతలారా! ఇదిగో ఇదిగో! వచ్చుచున్నాను! (చచ్చిపడిపోవును)

(కంచుకి దుప్పటీ గప్పును)

అందరూ:— అయ్యో! అయ్యో! మహారాజా! అయ్యో! అయ్యో!

(అందరూ నిష్క్రమింతురు)

---

## విమర్శన.

ఈయంకమునందు గూడ కథ నాల్గు భాగములుగా జెప్పబడియె. మొదటి భాగము: రాముడడవికి వెళ్ళిన వెనుక పట్నపు స్థితి. కంచుకి వచ్చి జెప్పును. కంచుకి ద్వారా వెల్లడిజేయబడ్డ అంశమల్లా రామాయణము అయోధ్యాకాండ సర్గ 41 లో జెప్పబడ్డ అంశములే.

అ:— ఇందులో జెప్పినది రామాయణము, అయోధ్యాకాండ సర్గ 41 లో

శ్లో॥ 10 వ్యసృజన్ కబళాన్ నాగా గావో వత్సాన్న పాయయన్

15 అకస్మాన్నాగరస్సర్వో జనో దైన్యముపాగమత్
ఆహారే వా విహారే వా న కశ్చిదకరోన్మనః॥

16 శోకపర్యాయసంతప్తస్సతతం దీర్ఘముచ్ఛ్వసన్।
అయోధ్యాయాం జనస్సర్వశ్శుశోచ జగతీపతిమ్॥

17 బాష్పపర్యాకులముఖో రాజమార్గగతో జనః
న హృష్టో లక్ష్యతే కశ్చిత్ సర్వశ్శోకపరాయణః॥

18 అనర్థినస్సుతాస్త్రీణాం భర్తారో భ్రాతరస్తదా
సర్వే సర్వం పరిత్యజ్య రామమేవాన్వచింతయన్॥

ఆ నుశ్లోకాంశములతో సరిగానున్నది.

మిశ్రవిష్కంభకము చివరను కంచుకి జెప్పిన రాజుగారి యవస్థ అయోధ్యాకాండ సర్గ 42 లో జెప్పినట్లే యున్నది. చూడుడు.

శ్లో॥ 1 యావత్తు నిర్యతస్తస్య రజోరూపమదృశ్యత।
నైవేక్ష్వాకువరస్తావత్ సంజహారాత్మచక్షుషీ॥

3. న పశ్యతి రజోఽప్యస్య యదా రామస్య భూమిప
తదార్తశ్చ విషణ్ణశ్చ పపాత ధరణీతలే॥

ఈ శ్లోకాంశమునే దీసుకుని యెంత చక్కగా కవి జెప్పెనో జూడుడు।

శ్లో 6. నివృత్తైవ నివృత్తైవ సీదతో రథవర్త్మసు।
రాజ్ఞో నాతిబభౌ రూపం గ్రస్తస్యాంశుమతో యథా॥

శ్లో 7. విలలాప చ దుఃఖార్తః ప్రియం పుత్రమనుస్మరన్॥

అనుయీ శ్లోకములందు జెప్పినది (అ) లో ఎట్లు జెప్పెనో జూడుడు.

రెండవ భాగము: దశరథుని పుత్రవియోగ దుఃఖము భార్యలు, అందు ముఖ్యముగా రామునితల్లియైన కౌసల్య తనదుఃఖమును విడచి రాజు నోదార్చును. కష్టములలో బడి కొట్లాడు జనుడు సాధనాంతరము లేక భగవంతుని యందే దృష్టినిలిపి మొఱలిడునట్లు దశరథుని ఈకవి చేసెను. రామాయణము నందునూ దశరథుని దుఃఖము వర్ణించబడి యున్నది. ఆ యంశములనే ఈకవి యవలంబించి చదువరులకుగాని జూచువారికిగాని హృదయము కరుగునటుల సందర్భము చేసి వ్రాసెను. ఇందే కవి యొక్క ఘనత గనిపించుచున్నది.

(ఇ) ఈ శ్లోకమునకు సరియైనది. అయోధ్య సర్గ 64.

రాముడు సీత లక్ష్మణుడుయనియేల జెప్పవలెనో అందు కారణము గూడ దశరథునిచే జెప్పించెను. ఇందుల కవిచమత్కారము యెంతయూ బోధ్కాన వచ్చును. ఈసంభాషణను పెట్టుటలలో **మరియొక** యభిప్రాయ **ముగూడ**స్పష్టమగుచున్నది.

దుఃఖసముద్రములోనున్నవారు శ్రీరామస్మరణ చేతనేవారి దుఃఖోపశమనము జేసికొందురు. అటువలెనే దశరథుడుగూడ తనదుఃఖము తొలగించుటకై తనపిల్లలను ఏదోవిధముగా స్మరించుకొనేయుండెను. మొదటవారి నామములను జెప్పినా హృదయమునుసంతోషపెట్టుమని జెప్పె. వారినోర్లను చెప్పవలసిన విధముగా జెప్పిన పిమ్మట వారలతలంచుకొని పిల్లలారా నన్ను కౌగలించుకోండి, అనిఅనెను. కొనకు ఇప్పుడే రాముని జూతును అనేఆశచే నేనేను బ్రతికి యుంటిని (ఓ) అనేశ్లోకములో చెప్పె ఈశ్లోకాంశము అయోధ్య సర్గ

శ్లో 65 యదిమాంసంస్పృశేద్రామ స్సకృదద్యల భేతవా।
యమక్షయమనుప్రాప్తా ద్రక్ష్యంతి నహిమానవాః॥
చక్షుసా త్వాం నపశ్యామి స్మృతిర్మమ విలుప్యతే॥

(జా) రాముడు తనకేమైన పర్తమానమును బంపెనా యని దశరథుడు జేసిన ప్రశ్నకున్ను సీత తనతోనేమైన జెప్పమన్నదా యని గౌసల్య సుమిత్రిలు చేసిన ప్రశ్నకున్ను ఒకటే జబాబునిచ్చెను. రామాయణమందు రాముడు జెప్పమన్నట్లు లక్ష్మణుడు జెప్పమన్నట్లు సీతజెప్పమన్నట్లు కూడా సుమంత్రుడు జెప్పినట్లు యున్నదిగాని ఇచ్చట కవి తనసామర్థ్యమును చూపి ఏదోచెప్పబోయిరి కాని దుఃఖముచే చెప్పలేకపోయిరని వ్రాసెను. ఇందువలన రెండుయంశములు వ్యక్తబడుచున్నవి. రామాదులకు పెద్దలయందుగల గౌరవము వ్యక్తబడుచున్నది. పెద్దవారికిమనము ఏమిచెప్పదుము యని ఆలోచించి యేమీ చెప్పక యుందురు. రెండవది ఇట్లుయేమీ చెప్పక యూరకయే యరణ్యములో ప్రవేశించి నారలని జెప్పుటచే దశరథునికి శోకాధికమై అతని మరణావస్థను వర్ణించుటకు అవకాశముకలిగినది. సుమంత్రుడు జెప్పినతోడనే దశరథునికి దుఃఖము ద్విగుణితమైనది.

ఇచ్చటనుండి కథలో నాల్గవభాగమైన దశరథమరణము ప్రారంభమగుచున్నది, చావసిద్ధమైనవారికి మొదట నేత్రేంద్రిదృష్టిపోవునని పెద్దలు చెప్పుదురు. ఇదియే మొదట కవిచే జెప్పబడ్డది (కా)దీనినే అరణ్య 42

శ్లో 34 రామంమేనుగతా దృష్టి రద్యాపి ననివర్తతే।
నత్వాం పశ్యామి గౌసల్యే సాధుమాం పాణినా స్పృశ॥

ఈశ్లోకము నే కొంచెము మార్చికవి వ్రాసినాడు చూడుడు

అంగంమే స్పృశ గౌసల్యే నత్వాం పశ్యామి చక్షుసా।
రామంప్రగతితాబుద్ధి రద్యాపి ననివర్తతే॥

చచ్చిపోవుచున్నజనునికి యింద్రియనాశనమును అయోధ్య. సర్గ64 లో స్పష్టముగా జెప్పియున్నది,

శ్లో 73. కౌసల్యే చిత్తమోహేన హృదయం సీదతీనమే।
వేదయే నచసంయుక్తాన్ శబ్దస్పర్శరసానహమ్॥
74. చిత్తనాశాద్విపద్యంతే సర్వాణ్యే వేంద్రియాణిమే॥
క్షీణస్నేహస్య దీపస్య సంసక్తా రశ్మయోయథా॥

తరువాత ఈశ్లోకమునకల్ల కారణభూతురాలైన కైకను తలచి నిందించును. ఇచ్చట కైకతో చెప్పమని చెప్పినమాటలు ఎంతసొగసుగా కవిపెట్టెనో చూడుడు.

(గ.) చచ్చేవారు ప్రాణములు పోయేటప్పుడు యమదూతలను చూతురని పెద్దలు జెప్పుదురు, దశరథునికి యమదూతలు కనుపించినట్లు అయోధ్యసర్గ64.

శ్లో 66 దూతావైవస్వతస్యైతే కౌసల్యే త్వరయంతి మామ్॥

గానియీనాటకమందు పితృదేవతలు గనిపించినట్లు కవి వ్రాసెను.

పరబ్రహ్మ స్వరూపుడైన రాముని గన్నదశ రథుడు పాపాత్ములవలె యమకింకరలను జూడుననా పుణ్యాత్ముడు గొప్ప రథికుడు. ఇట్టి వానికి పుణ్య లోకమే గలుగవలెను. గావున యమ కింకరులు వచ్చినట్లు చెప్పక పితృదేవతల దర్శనము గలిగినట్లు వ్రాయుట కవి బాగా యాలోచించి నట్లు గనబడు చున్నది.

దశరథుడు తన ముత్తవతాత దిలీపుని తనతాత రఘు మహారాజును తనతండ్రి అజుని జూచినట్లే చెప్ప బడియె. ఈ వంశావళి బాలకాండలో జెప్పిన వంశా వళికి వ్యతిరిక్తముగా నున్నది. రామాయణము బాలకాండలో నిచ్చిన వంశావళిలో సర్గ 70. శ్లో 11,40,41,42,43,44,45,

రఘువున్కు అజునకిని ఎన్నియో పురుషాంత రములు జరిగినవి. ఇట్లుండగా భాసకవి అజుని రఘుమహారాజుయొక్క తనయునిగా జెప్పు టెట్లు గలిగె. రామాయణమును చెంతనుంచుకొని కథా సందర్భమునుశ్లోకశ్లోకములను గూడ పరిశీలించు మా నాటకము వ్రాసిన కవి ఇచ్చట రామాయణమునకు వ్యతిరిక్తముగా నెందుకు వ్రాసి యున్నాడో తెలిసి కోవలసిన యంశమే?

అయోధ్యా ఉరణ్యాకాండలలోని కథను ప్రతి మా నాటకముగాను, కిష్కింధ్యసుందర్యయుద్ధకాం డల కథను అభిషేక నాటకముగాను ఈకవివ్రాసెను. గాని బాలకాండ కథను నాటకముగా ఈ కవిచే రచియించబడిన గ్రంథము ఇప్పటికి దొరక లేదు. ముందు దొరుకు నేమో తెలియదు. స్వప్నవాసవదత్త యగు భాసుని నాటకము యొక్క ఉపోద్ఘాతమందు బాలచరిత్రయని ఒక నాటకము ఈకవిచే రచియించబ డినదానిగా మ. రా. రా. మహా మహోపాధ్యాయ. టి. గణపతి శాస్త్రిగారు యం. ఆర్. ఏ. యస్సు వ్రాసి యున్నారు. ఈ బాల చరిత్రము శ్రీమద్రామా యణకథ యుండదనొప్పు యని వారు వ్రాయుచున్నారు. ఈ బాల చరిత్రమును నే జూడలేదు గాని పది విషయమై విజయ నగర కాలేజి మేగజీనులో వ్రాయబడిన దాని [illegible] కృష్ణుని బాల క్రీడల కథగా గనుపించుచున్నది. [illegible] భాసు నిచే వ్రాయబడిన [illegible] నాటకము [illegible] [illegible] నాటకములు ఒక్కసారి [illegible] ఒక్క నాటకము [illegible] [illegible] [illegible] విషయమై [illegible] చెప్పలేము.

ప్రస్తుతము మనము చర్చించుచున్న యంశమందు నొక యాచారము గనుపించుచున్నది. పరిచారకు లనుబిలిచినప్పుడు సంబోధనము బాలకేఅనిచేయు. దశ రథునికి అత్యవసరమైనపనివచ్చినదని మంత్రులతో జెప్పుమని [illegible] సుమంత్రుడు 'బాలకే'. యని బిలువగానే కంచుకి వచ్చెను. దీనిని బట్టి భాసుని, కాలమందు రాజసమీపమునందుండెడి పరిచారకు లను ఇట్లు బిలుచుట యాచారమై యున్నట్లు గనబడు చున్నది. ఇప్పటికిగూడ కొన్ని జమీందారీ స్థాన ములలో జమీందారుగారి సన్నిధియుండే పరి చారకులను పిల్లకాయలు యని చెప్పుట వాడుకై యున్నది. ఈవాడుక భాసుని కాలమునుండి వచ్చినదే గాని నిన్నమొన్న వాడుకలోనికి వచ్చినదిగాదు. అందుచేతనే బాలకే యని వాడిన స్థలములయందు పిల్లకాయలులారా, యని తెనిగించితిమి.





నూతనయుగ ప్రవర్తకులును బ్రహ్మసమాజ మతస్థాపకులునగు
శ్రీ రాజా రామమోహన రాయలు.

# బాలుని ఆలోచనములు.

(నరహరిశెట్టి వెంకటరత్నంగారు.)



ఒకరోజున:—

ఈప్రపంచ మెందుకు పుట్టింది. ఈ గొడవంతా యేమిటి ఇవి లేకుండా వుంటే బాగుంటుందిగా. ఒకవేళ యెందుకో వున్న దనుకొందాం. ఉంటే అందరు సంతోషంగా వుండకూడదు. మళ్లా యీదుఃఖమెందుకు. సుబ్బరంగా లేకుండా వుంటే బాగుంటుంది. దేముడెందుకు పుట్టించాలి. పుట్టించకుండా వుంటే చాలబాగుంటుంది. అతడు మంచివా డంటారుగా. మంచివాడయితే యిట్లా యెందుకు పుట్టించాలి— అతడు లేడేమొ. దేముడు లేకపోతే ఏముంటుంది. ఏమీవుండదు. అప్పుడంతా గాలుంటుందేమొ. గాలిమాత్రం యెట్లావుంటుంది. ఏమివుండదు. ఏమీవుండక పోతే ఎట్లావుంటుందో? ఏమిటో యిదంతా గొడవగావుంది.

కొన్నిరోజులు గడచినతర్వాత:—

దేముడంతా వున్నాడంటారుగదా. అతనికి పాపమంట దంటారు. అతనికి పాపమంటకపోతే యీప్రపంచంలో పాపమెందుకుంటుంది. ఇక అంతా పుణ్యమనమాటే. మనముచేసేదంతా పుణ్యమన్నమాటే. ఇక పాపమేలేదు. ఇందేం తెలియకుండా పెద్దవాళ్ళు దేముడంతా వున్నాడంటారు. తప్పు చేస్తే పాపమంటారు. ఏమిటీ గొడవంతా. ఎవర్నడిగినా సరియైన సమాధానంచెప్పరు. నాకంతా తెలిసికోవాల నుంటుంది. ఎవరూ నచ్చేటట్టు చెప్పరు. వాళ్ళకేమీ తెలియదు. మేము పెద్దవాళ్ళమని ఏమిటో వాగుతారు. వాళ్ళంతా వట్టిపిచ్చివాళ్లు.

ఇంకొకరోజున:—

ఈవిచిత్రాలన్నీ మనసంతోషం కొరకు పుట్టించాడు దేము డంటారు మనసంతోషంకోసం పుట్టిస్తే మనకింకా దుఃఖమెందుకు. నిజంగా మనల్ని సంతోస పెట్టాలని దేముడుకుంటే అతని ప్రపంచంలో దుఃఖమనేమాటే వుండదు. వీళ్ళు వట్టివెర్రివాళ్ళుగాని, మనకు సంతోషం గలిగించాలని దేముడికుంటే నిమిషంలో అంతా సంతోషమే చేస్తాడు. అతడు తలుచుకుంటే యెంత ఇవన్నీ పుట్టించాలా యేమిటి? ఇట్లా చేయడానికి యేదో కారణం వుంటుంది అదేమిటో తెలిసికొందామంటే తెలియదు. ఎవరినైన పెద్దవాళ్ళనే వాళ్ళనడిగితే ఏమిటో పిచ్చిసమాధానాలు చెప్తారు. చెప్పేదివాళ్ళకీ తెలియదు. నాకూ తెలియదు. నాకేమీ తెలియడంలేదంటే పెద్దవాడనైన తర్వాత తెలుస్తుంది అంటారు. ఏమి తెలు

స్తుందో. ఏమియేమకుపో. ఇదంతా గోలగా వుంది. (కన్నీరు గార్చును.)

మఱొకరోజున:—

ఎవరూ పెళ్లిచేసుకోకుండావుంటే యేమవుతుందో. పక్షులు, మృగాలు, మనుష్యులు అందరూ మానివేయాలి. మానివేస్తే ప్రపంచంవృద్ధికాదు. అప్పుడు దేవుడ్కి బాగా శాస్తవుతుంది. లేకపోతే యెందుకు దేముడికీ గొడవంతా. ఒకళ్లి యేడిపిస్తాడు; ఒకళ్ని నవ్విస్తాడు. కొందర్ని చంపుతాడు; కొందర్ని పుట్టిస్తాడు. వాడికేమైనా పిచ్చిపట్టిందా యేమిటి. అప్పుడు ప్రపంచంమీద వున్నజీవులన్నీ నాశమవుతాయి. మళ్లా పుట్టిస్తాడేమొ గొడవ. మళ్ళాపుట్టిస్తే మళ్ళా వాళ్ళంతా అట్లాగే చేయాలి. ఎన్నిసార్లు పుట్టించినా అందరు అన్నిసార్లు అట్లాగే చెయ్యాలి అప్పుడు వాడికి బుద్ధొస్తుంది. విసుకెత్తి పుట్టించడం మానేస్తాడు. బలే పన్నాగంపన్నాను. (గంతులు వేయును)

మఱికొన్నిరోజులు గడచినపిమ్మట:—

ప్రహ్లాదుడు మంచివాడంటారు ఏం మంచోడు. వాడి ముకంమంచి. వాడుభక్తుడట. ఏంభక్తో. విష్ణుఅంతావున్నాడట. విష్ణుపేరనుకుంటే పుణ్యమొస్తుందట. శివుడుపేరు తండ్రనమంటే అనకూడదు. శివుడ్ని తలిస్తే పుణ్యంరాదు కాబోలు. వాడికా బేదం ఎందుకు. అంతటికి మూలం దేముడున్నాడుగా. వాడినే తలుచుకోకూడదు. విష్ణు ప్రహ్లాదుడు తండ్రిని చంపాడట. శివుడు ప్రహ్లాదుడ్ని చంపలేదుకాబోలు. విష్ణంతా వున్నాడట. శివుడు లేదుకాబోలు. విష్ణు నిజంగా దేముడయితే వాడితండ్రి మనస్సునిమషంలో మార్చి వేయవచ్చునుగా. మనస్సు మార్చలేకపోయాడు కాబోలు పాపము. లేకపోతే శోచలేదో. శివుడు దేముడయితే ప్రహ్లాదుమనస్సు మార్చొచ్చునుగా. ఆపిచ్చి దేముడికికూడా తెలియలేదు కాబోలు. అసల్దేము వున్నాడుగా. వాడొచ్చి వీళ్ళిద్దర్ని తనవైపు మార్చుకోరాడు. ఏమిటో ప్రపంచం అంతా పిచ్చిలోబడి కొట్టుకుంటుంది.

ఒకసారి:—

ఇదంతా యెందుకు పుట్టించాలి? వూరుకోక పుట్టించాడా యేమిటి? లీలకోసం పుట్టించాడట. లీలకోసం పుట్టిస్తే సంతోషం దుఃఖం యెవరికీలేకుండా పుట్టించకూడదు. రాళ్ళుమాదిరిగా ప్రాణంలేకుండా పుట్టించి వాటిచేత గంతులు వేయించి చూశి సంతోషించరాదు. సూర్యుడెప్పుడయితే వున్నాడో అప్పుడేకిరణాలున్నట్టు ఈదేము డెప్పుడయితే వున్నాడో యీజీవులూ అప్పుడే వున్నయ్యట. ఇదేదో కొంచం సమాధానంగా వున్నది. ఇక దేముడు పుట్టిస్తున్నాడంటూ రెందుకిపిచ్చి వాళ్ళు పుట్టిస్తున్నాడట. చంపుతున్నాడట. పాపంచేస్తే నరకంలోకితోసి యముడ్ని దండించమంటాడట. యముడు దండించకపోతే వీడు దండించకూడదు. ఇన్నిపనులు చేయగాలేంది దానికి కూలివాడు కావలసొచ్చాడు కాబోలు. పుణ్యంచేస్తే తనదగ్గిరికి తీసికెళ్తాడట. సూర్యుడ్కి కిరణాలుమాదిరిగా దేముడ్కి జీవులున్నయ్యంటారు. మళ్ళా పుట్టిస్తున్నాడంటారు కొంచంసేపు దేముడంతా వున్నాడంటారు. మళ్ళా యిట్లాఅంటారు. పానికొకమాట. యమలోకంలో దేము

దుండడు కాబోలు. అంతా వున్నాడంటారుగా మళ్ళా అక్కడ యముడు దండిస్తాడంటారు. ఏది నమ్మాలో. ఏది నమ్మకూడదో. నోటికి వచ్చినట్టెల్ల అంటూ వుంటారు.

ఒకరోజుదయమున :—

అబద్ధమాడితే పాపమంటారు. అబద్ధమాడేదెవరు. దేముడే కాదూ. దేముడంతా వున్నాడంటారుగా. అట్లయితే అబద్ధమాడేది దేముడన్నమాటే అప్పుడు పాపమెట్లా అంటుకుంటుంది.

మఱొకసారి:—

ఆ పెద్దవాళ్ళనే పిచ్చివాళ్ళు చెప్పే మాటలు వింటే పిచ్చెత్తుతుందని కూడాను. ఇక యీరోజునుంచి నేను వాళ్ళమాట లెక్క చేయను. సుబ్బరంగా భోంచేసి ఒక మురళి కొనుక్కొని ఎవర్లేని చోటికి పోయి అక్కడ వూదుకుంటా. అంతే, అదే సుఖం, వీళ్ళ మాట్లు వినకూడదు. ఈ పిచ్చిమనుష్యులున్న చోట వుండకూడదు. ఎప్పుడు మురళి వూదుకుంటూ, అడివి సుకెత్తితే గంతులు వేస్తూ, పాటలు పాడుకుంటూ, ఆకలివేస్తే భోంచేసి మళ్ళా అట్లాగే చేస్తా యికనుంచి.

* * * *

(ఆ బాలుడిట్లు నిశ్చయపరచుకొనెను. పాపము! తలిదండ్రు లట్లు చేయుట కొప్పుకొనరని యప్పటికతనికి తోచలేదు. ఆతని జీవితము భావికాలమున నెట్లుండునో!)

# భ్రమర గీతము

[ అనంతపంతుల రామలింగస్వామి గారు. ]

ఉ॥ మాయురె! భృంగమా! కుసుమమంజుల డోలికలూగుచుంట, శో-
భాయత పద్మరాగ కనకాంబరమున్ ధరియించుచుండుటన్ ।
తోయద దేహకాంతి సతతోజ్జ్వల రీతిని గల్గియుండుటన్ ।
చేయఁగ నేను గాదె నుతి శ్రీశునిఁగాఁ దలపోసి నిన్నిలన్ ॥

ఉ॥ మోవిని దేనె జిడ్డు మెరుపుల్దిలకింప, లతానికుంజబృం-
దావనకాన నస్థలులఁ దాండవమాడుచు, మోదమొందుచున్ ।
భావగభీరగా నరసవాహినిఁ దోగుచుఁ బూవుఁ గొమ్మలన్ ।
నీవిలఁ గూడుచుంటఁ గని నేను నెంచెద బాలకృష్ణుగాన్ ॥

ఉ॥ ఆమనిఁ గూర్చి పాడెదవొ? యౌవనమాధురిఁ గూర్చి యాడెదో ।
ప్రేమకథాంతరధ్వనులఁ బ్రీతిగ నందువొ పూవుఁ బోండ్లకున్ ।
గోముగ సృష్టి చిత్రముల గూర్చి గీతలఁ దెల్పుచుందువో?
నీ మహనీయ భాషణము నేరు పరాదొకో నాకు భృంగమా! ॥

గీ॥ కనఁగ, భవదీయ భావాత్మక పరిపూత
దివ్యగానము వర్ణనాతీత మహహా!
కీటకాశమమైన నీపాటవిన్నఁ
దొంటివాసన లన్నింటిఁ దొలఁచుఁగాదె! ॥

మ॥ లతికూనల్చెలువారఁ బుష్పవతులై, రంజిల్లెడుం బద్మినీ।
సతులుత్ఫుల్ల కళాలసన్ముఖవిలాస శ్రీఁ గవీంద్రాంతరం।
గతతుల్ భావతరంగ మాలికల యానంబూనునో భృంగమా!
క్షితిలోనన్ భవదీయగానకలితా శ్రీమంత్రమూలంబునన్ ॥

మ॥ తినచెంతన్ దినమెల్ల విన్బడు భవద్గానంబు నాలించిమో।
దనవాంభోనిధి నోలలాడి తనివిన్ దానొందగా సంజవే
ళను నిన్నుం దనలోన దాచికొని లీలాగానమందైక్యమై।
మనెడుం బద్మిని యీధరాస్థలిని బ్రేమైకాత్మ వీవేయనున్ ॥

ఉ॥ కల్ప లతాలతాంత గత కమ్రసుగంధన్ గోలు దేవగాయకా।
నల్ప మధువ్రతంబులుర యంబునఁ బాడఁగ సంతసించునా
వేల్పుల కేవిధంబున లభించు సుధన్ మరపించు మోదమున్।
గొల్పెడు నీ స్వభావరసకూజిత గానము నాలకించుటల్ ॥

గీ॥ తేఁగ బోఁడిని తిరిపెమర్థించి, యామె
పుష్పపాత్రను నకిచ్చు పూర్ణమధువు
నాని, పాటల సంతృప్తి నామె గొనఁగ
యలరు నిన్గాంచి నీస్వేచ్ఛనాసఁ జేతు ॥

గీ॥ చిఱుతపాయము నాడు నిన్జేరి పాడి
నిన్ను వెన్నాడి వన వీధి నెగడు చుంట
స్వప్న వార్తవిధంబున జ్ఞప్తిఁ దగును
భృంగమా! నాటియానంద భిక్షనిడుము ॥

మ॥ అకటా! యొక్కఁడియాస నాకిది — యనన్యాపేక్షమై, స్వచ్ఛమై,
సకలేశాంశ వికాసమై యలరు భాస్వద్బాల్య వృత్తిమయే
దికనాకియ్యెడ? భామ్యవాసనలచే నీర్ష్యాను సంధానమై
వికలంబై జడమై యొసంగునది - యో భృంగాన్వయోత్తంసమా।

మ॥ కవనంబా! భవదీయగాన రస పక్ష ద్వంద్వమందుంచినన్।
దవుదవ్వైన, పరిశస్త సమ్మద వసంత శ్రీలసద్బాల్యపు
ష్పవనంబున్వడిఁ జేర్పు నిన్గలసి యిచ్ఛాలీలనందాడెదన్
భవదీయాంఘ్రిలఁ జంపకోత్పలములన్ భక్తిన్ బ్రపూజించెదన్ ॥

---

# పరపతి సంఘములు.



## (i) వ్యాపారపు 'ముందడుగు, వత్తిడి'

(రంగనాయకులు. డి. ఇ. పి. (ఆక్స్ఫర్డ్) సి. యస్. డబ్ల్యుయుగారు.)



ప్రథమ వ్యాసమునందెట్లు, పరపతి సంఘములు, ఎటుల 'నప్పులనిచ్చి పుచ్చుకొనుచు' ఇతరులకు పరపతినిచ్చి, వ్యాపారమును త్వరపెట్టి, అన్నిపనుల నధికముగ సాగునట్లుచేసి, నిరుద్యోగమును రూపుమాపి వాణిజ్యాభివృద్ధి గల్గించుశక్తి కల్గియున్నవో చూచితిమి. తరువాత, పెట్టెలోనున్న ధనమున కారురెట్లు లేక నాల్గురెట్లుగా పరపతి నొసంగి, అందరికి, ఆదాయ మధికమైనట్లు, అన్ని వ్యాపారముల కధికధనమున్నట్లు, అన్ని కంపెనీలకు అధికలాభములువచ్చునట్లు, ప్రతి వ్యాపారము జయప్రదమగునట్లు, ప్రతిపని వాడు 'నిరుద్యోగమను మహామారి'నెదిరించి, 'ఉద్యోగము' బొంది, సర్వసుఖముల నందుటకైవచ్చుచున్న కూలినంతఖర్చిడునట్లుచేయగల శక్తియెట్టుల 'బ్యాంకు'లకు తమ 'పరపతి' ద్వారాగలదో చూచితిమి. (భారతిలోచూడుడు)

రెండవ వ్యాసమునందు, 'జాయంటు స్టాకుకంపెనీ షేరుల నమ్ముటకొను వ్యాపారమునకు, తగినంత ధన మప్పుగానిచ్చుచు నెటుల కంపెనీల సంఖ్యహెచ్చించి, క్రొత్త ఫ్యాక్టరీల సంఖ్య వృద్ధిచేసి, పాతఫ్యాక్టరీల పరిమాణము హెచ్చించి, క్రొత్తవ్యాపారముల సాగించి, వ్యాపారాభివృద్ధి కల్గించునో చూచితిమి. ఎటుల నెగుమతి దిగుమతి యగు వస్తువుల సంఖ్య హెచ్చింపజేసి, ఎగుమతి దిగుమతి వర్తకమును వృద్ధిచేసి, ఎగుమతి దిగుమతి వర్తకులకు ధైర్యముకలుగజేసి, త్వరితగతి వాణిజ్యము సాగునట్లుచేసి, దేశము ధనవంతముగ చేయగలశక్తి బ్యాంకుల 'పరపతి' పైలేడింగు బిల్లులు, మారకపు బిల్లులకు తగినంత ధనమిచ్చు శక్తిపై యాధారపడి యున్నదో చూచితిమి.

మూడవ వ్యాసమునందెట్లు, దేశాంతర్గత వ్యాపారమునందు 'హుండీ'లద్వారా నధికముగా వర్తకులకు 'పరపతి' నొసంగి, దేశమునందలి వివిధభాగములమధ్య పరస్పర వ్యాపారమును వృద్ధిచేసి, క్రమముగా దేశము యొక్క వ్యాపార నాగరికతను వృద్ధిబొందింపజేసి, హెచ్చుఫ్యాక్టరీలు, మిల్లులు ఏర్పడి, యేప్రదేశపు వస్తువుల నాప్రదేశమునందే మిల్లులద్వారా తయారుచేయించి వాని నితరరాజధానులకు బంపుచు, దేశపు టాంతర్గత దిగుమతి యెగుమతి వాణిజ్యాభివృద్ధి కలుగజేయు శక్తి బాంకులకు కలదో, ఎందులకు బ్యాంకును ఈయంతర్గతవాణిజ్యము

నందధిక శ్రద్ధ వహించి, హుండీల నుపయోగించి, ప్రజల సౌభాగ్యము నభివృద్ధి నందించుట తప్పనిసరియని చూచితిమి.

వ్యాపార వాణిజ్యములయొక్క జీవితయాత్రయందొక రహస్యముగలదు. సర్వసాధారణముగా వ్యాపారము చురుకుగా సాగునప్పుడే, వాణిజ్యము చురుకుగా సాగును. అంతర్గత వాణిజ్యము చురచుర సాగునప్పుడే, ఎగుమతి దిగుమతి వ్యాపారముకూడ త్వరపడుచుండును. వ్యాపార, వాణిజ్యములు, పరుగులెత్తునప్పుడే, క్రొత్తగా నేర్పరచు క్రొత్తకంపెనీలసంఖ్య, క్రొత్తగావచ్చు వ్యాపారములు, క్రొత్తగ హెచ్చు పరిమాణము బొందబోవు మిల్లుల సంఖ్య యపరిమితముగా హెచ్చును. అన్ని విధముల నన్ని వ్యాపారములందందరు వ్యాపారులకులాభముకల్గుచుండు సమయముననే అజాగ్రత్తగల్గి, అశక్తిముతులై, వ్యాపార లక్షణములేని, వాణిజ్యపు మొదటి సూత్రములఁదెలియని, ధనము నార్జించుటం దనుభవములేని, దరిద్రులనేకులు కంపెనీల, ఫ్యాక్టరీల, మిల్లుల, తదితర వ్యాపారముల స్థాపించి; కొద్దిగా లాభముబొందుచు, అధికముగ వస్తువుల ప్రతివ్యాపారము నందు చేయ ప్రయత్నింతురు. ఇట్టి వ్యాపారపు గొప్పయంశయందే, పనివారెల్లరు తమ కట్టి సౌభాగ్య వంతమగు దినములు, ఎల్లప్పుడుండునని తలంచి, తమ యాదాయమెల్లప్పుడట్లేయుండునని భ్రమజెంది, తమకు నిరుద్యోగ ప్రాప్తి కలుగదని ధైర్యమంది, వచ్చుచున్న ధనమునెల్ల హెచ్చువస్తువులగొనుటయం దుపయోగించుచు అన్నివ్యాపారములనుండి వచ్చుచున్న వస్తువులకు యధిక దుకాణముల అమ్మకవసతుల కల్గించుచు, వ్యాపార వాణిజ్యాభివృద్ధి మరింత కలుగఁజేయుచుందురు. అట్టిసమయమునందే ఈపనివారు ముందువచ్చు కష్టపుదినములకు చీమలవలె పుట్టలుపెట్టుకొనుటకుమారు, సీతాకోకచిలుకలవలె సుఖపడుచుఆదాయముంగొంతభాగము బ్యాంకులందు బెట్టక యేరోజునకారోజే స్వర్గసుఖములబొందుచుందురు. ఇట్టిసర్వప్రపంచ సౌభాగ్యపు దినములందె, బ్యాంకులపై పరపతి గొనువారధికమై, బ్యాంకులయొక్క 'పరపతి' గోరువారధికమై, బ్యాంకుల గనివృద్ధి చేసి, వాని లాభముల హెచ్చుచేసి, వానిపెట్టిలోని ధనమునకు, వానిపరపతి కిమధ్యగలభేదమును వృద్ధి చేయుచుండు పరిస్థితులుకల్గుచుండును. నమ్మకముగా పని చేయుచుండు వ్యాపారులు, 'పరపతి' గోర, ఇవ్వమని యేబ్యాంకరులు చెప్పజాలరు. ఇటుల ప్రతివ్యాపారిని 'పనులు' లాభకరముగనున్నట్లేకన్పడును ప్రతి, బ్యాంకరు తప్పకట్టి వ్యాపారులకు 'పరపతి' నివ్వతలంతురు. అన్ని బ్యాంకులు, తగినంతగా పరపతి నొసంగి, తగు లాభమును బొందవలయునని యు ఎటులైనను తక్కిన బ్యాంకులన్నిటికంటె కొంచె మెక్కువగా సంవత్సర మాఖరునప్పటికిసంపాదించి, తనబ్యాంకుసభ్యుల నానందింపఁజేయవలయుననియు తలపెట్టును. ఇటులబ్యాంకరు లందరపరిమితముగ వచ్చుచున్న వ్యాపారులకు 'పరపతి' నొసంగ మొదలిడుదురు. ఇటుల నెంతదూరము వ్యాపారము, వాణిజ్యము, అభివృద్ధి బొందుచు, ఎల్లకాలము పైకెగురుచు, ప్రబల సౌభాగ్య వంతులుగ చేయును? అందరిని 'పరపతి' యను బూటకముచే యీప్రపంచమున యధిక ధనవంతులమని నమ్మించి, తోలుబొమ్మలాట యెంతవరకు, మన బ్యాంకులు

తులమగుచున్నారను. కొనుచున్న వారందరు నిజముగా ధనవంతులగుచున్నారా? యను ప్రశ్నలు, మనకు తట్టును. కనుక, కొంచెము సేపిచ్చట నాగి, ఈరహస్యపు తత్త్వమును తెలుసుకొందము.

ప్రథమ వ్యాసమునందు మనము దృష్టాంత పూర్వకముగా తీసుకొన్న బస్తీయందెట్లు, అన్ని వ్యాపారములు యందముగ నుండి పనివారిమం దెక్కువ సంఖ్యాకులు నిరుద్యోగులైయుండి, ఉద్యోగమునందున్నవారు చాలతక్కువ కూలి బొంగు, వ్యాపారు లందరు పరపతి లేమిచే లాభకరమగు వ్యాపారముల చేయజాలక చేయుచున్న వ్యాపారములందు తగినంత ధనము లేమి తగినంత లాభములొంద జాలక ఎటులబస్తీప్రజలందరన్నివిధముల బీదవారై యుండిరో చూచితిమి. తరువాత బ్యాంకులనేర్పరచి పరపతి సమృద్ధిగా నొసంగుట ప్రారంభమైన పిమ్మట నెట్టియద్భుతపరిమార్పు కలుగ బ్రారంభించినది విచారించితి. ప్రజలందరు ఏ పని చేయుచు వ్యాపారములన్నియు లాభకరముగ నుండి వ్యాపారు లందరు ధనవంతులగుచుండుట బాంకులందు వడ్డీకై పెట్టెలోని ధనముగా ప్రజలుపెట్టు ధనపరిమితి యధికముగా హెచ్చుచుండుననియు అంతనాధనముపై మరింత పరపతి నొసంగి వ్యాపారముల మరింత త్వరితముగ సమృద్ధిగ నొనరించుట సాధ్యమగుననియు జూచితిమి, అచ్చటనొక్క విషయమును లెక్కలోనికి తీసుకొన్నను బయటికి తెచ్చి కన్పరచక యే విషయమును మరొకవిధముగకు మార్చితిమి. ఇచ్చట యదనువచ్చినది. అదియెద్దియో చూతము. అన్నివ్యాపారములు మందముగనున్నప్పుడు బ్యాంకులు పరపతి నొసంగుటచే జరిగిన గెల్ల ఇదివరకు నిరుద్యోగులై యున్న సర్వ ప్రజలు పని చేయునట్లు చేసి వారిచే యధిక ధనమును కలుగజేయుటయే అనగా ముందుతప్పక త్వరలో నధికముగానున్న సంపదను చూచి దానిపై నాధారపడియే యిప్పుడు కొంతపరపతి నొసంగుట జరుగుట సాధ్యము ('Giving credit in anticipation of additionl production in the near future;) అందువలన యిచ్చిన పరపతికి మించియే కొలదిమాసములలోనే అధిక ధనము సంపాదించబడినది. అనగా అధికముగా రూపాయలు ప్రతివారియింట్ల యందుండుననిగాదు; తలంపవలసినది. అందరు పనిచేయుటెల్ల హెచ్చురూపాయల జేబులో ఇనుపపెట్టెలో నధికసంఖ్యగా యుంచుటకై యగుచో అధికముగ పరపతిద్వారా ప్రథమమున గల్గించిన యధికపని వ్యాపారముయొక్క చురుకుదనము ప్రజలయభివృద్ధి త్వరలో నేయాగి ప్రజలసుఖము మటుమాయమై నిరుద్యోగముగల్గి ఎప్పటివ్యాపారపు మందముకల్గును. ఎందువలనన, అందరు రూపాయలు గోరునప్పటికి వస్తువులకోరువారు తగ్గుట ఆయావస్తువులు చేయువారు తక్కువవస్తువులే యమ్మబడుచుండుటచే వస్తువులచేయుట తగ్గించుట అంత యనేకమంది పనివారు నిరుద్యోగులగుట వీరు తిరిగి మరింత తక్కువగా వస్తువులుకొనుట అంతవ్యాపారము మరింతమందగించుటజరిగి వెనుకటి మందపునడక జరుగు పాదములు మనవ్యాపారమునకు త్వరలోనేవచ్చును. అటులగాక ప్రజలు వస్తువులనే కోరుచో వస్తువుల సృజించుట క్రొత్తపెరుల

పెంచి ధాన్యముదెచ్చి వానినుండి క్రొత్త వస్తువులచేయుట అన్నిపనులు దేశమునందు గల ప్రజలు వారుచేయగల్గుపని దినమునకు వారు పనిచేయుగంటలు వారమునకువారు పనిచేయు దినములపై నాధారపడియుండు నంతియేగాక ఆదేశమున యాకాలమున వ్యాపారముచేయ శక్తిగల్గి ధనమును ఖర్చిడుటందు సంపాదించుటందు ధైర్యముకల్గి పనివారిచే పనిచేయింపశక్తి కల్గిన ప్రజలసంఖ్యానిశ్చితముగా నుండును గనుక ఈవ్యాపారుల శక్తిని బట్టికూడ చేయగల్గుపనులు సృజించకల్గిన వస్తువులసంఖ్య యాధార పడియుండును. అట్టియెడ ప్రజలుచేయకల్గినవస్తువుల పరిమితి దెలియక వారు పదికోట్ల వస్తువులు చేయగల్గియుండ వందకోట్లవస్తువులైన చేయగలరనుపిచ్చి ధైర్యముతో వందకోట్ల వస్తువులు చేయుట కుపయోగించు ఫ్యాక్టరీల మిల్లులు పంటల వ్యవసాయము చేయింప బ్రారంభించినచో కష్టములు వాటిల్లునుగదా! ఎటుల యిట్టిపిచ్చి లెక్కలకు ప్రజలుపూనుకొందురనునది చాలాకాలమునుండి యార్థిక శాస్త్రజ్ఞులకు తమాషాకల్గించు విషయమైనను ప్రజలతత్వము మరచి పిచ్చివారుగ గొన్ని సమయములందగుదురని వారికి తెలియును. చూడుడు! ఏయజమానికా యజమానియే తనవ్యాపారమునందింక నెంత యెక్కువవ్యాపారము తానెక్కువగా చేసిన యెంతలాభ మారోజుల లెక్కల ప్రకారము వచ్చుననితలంచును. ఇతరవర్తకులతో వ్యాపారమునందున్న వారితోనైన ఆలోచించి తన వ్యాపారము స్థితిగతుల తెలిసికొనడు. అందువలన ప్రతివ్యాపారుడు తనవ్యాపారమునే పది యిరువదిరెట్లుగా వృద్ధిచేయకోరుచుండుటచే అందరు వ్యాపారులద్వారా పది కోట్లవస్తువుల వ్యాపారము వందకోట్లవ్యాపారముగా కన్పడుటయందాశ్చర్యమేమి? తరువాత ప్రతివ్యాపారుడు తనవ్యాపారమునందు ముఖ్యముగ తన ప్రత్యేకఫ్యాక్టరీయందు లేకమిల్లునందు లేక దుకాణము నందు యింక యిరువది నలువది సంవత్సరముల వరకిట్లే లాభములు కల్గుచుండు ననియు తనకిట్లేబ్యాంకులు సరిపడి నొసంగుననియు తలంచి వెర్రిగా లెక్కలువేసి యిరువది నలువదివత్సరముల వరకు సరిపోవు ఫ్యాక్టరీలు మిల్లులు దుకాణపు మిద్దెలు వగైరా పనుల నిప్పుడే ప్రారంభించి క్రమముగా నాసిపై తనకుబ్యాంకునుండి వచ్చుచున్న పరపతిని ఖర్చుచేయుచుండును. ఇటుల నందరువర్తకులు పనులప్రారంభించుటతోడనే దూరమునందున్న ప్రయాణీకునకుగాని ఆర్థికశాస్త్రజ్ఞునకుగాని కన్పడునదియేమి. ఆప్రత్యేకబస్తీ లేక దేశము నందలి ప్రజలు అందరొక్కవరి తమయొక్క యధికమగు పరపతిపై పూర్తి నమ్మకముంచి తమప్రజలయొక్క యధికమగుచున్న సుఖముల సంతృప్తి పరచుటకు వలయు యధిక సంఖ్యలగు వస్తువుల చేయ మొదలిడు చుండుటయేగాక యిరువది నలుబదివత్సరములవరకు వలయు మిల్లులు ఫ్యాక్టరీల దుకాణములు తదితరముల నన్ని బందోబస్తుల చేయపూని అందరు నడుములువంచి పనియను యాపెద్ద బరువునెత్తబూని యున్నారని కన్పడును. తరువాత నాయార్థికశాస్త్రవేత్త జూచునది యేమి! ఈప్రజలశాపసయను పెద్దబరువు యధికమై యున్నదనియు ఆబరువునెత్తుట వారికి సాధ్యముగాకపోగా కొందరి నడుము లప్పుడే పటపటమనుచు మరికొందరి నడుము

లోకటవికిగెనవియ్యుయిందువలన యెత్తువారు తగ్గుచుండుటయు మిగిలినవారిలో సదుములు విరిగి మూలబడువారి సంఖ్య క్రమముగా హెచ్చుచు తుదకందరు నిస్సారులై దరిద్రులైపోవనున్నారని యుకేన్పడు యీ దృష్టాంతరహస్యమును మన విషయముగూర్చి యుపయోగించుచో నెటుల పదికోట్లవస్తువుల జేయగలిన దేశీయులందరువందకోట్ల వస్తువుల జేయనెంచి మూలబడుదురో ద్వరలో తెలుసుకొననగును.

ప్రజలు మోయువస్తువు లందెల్లప్పుడు మూడు విధములగు వస్తువులు కలవు. అని రంగులు, బరువులు, లోహముల భేదములచే మూడువిధములుగ నేర్పడుట లేదు. ఆవస్తువుల నెప్పుడు ప్రజ లనుభవించకోరుచున్నారను కాలపరిమితి ననుసరించి మూడువిధములుగ వస్తువులన్నిటి విభజింప సాధ్యమగుచున్నది. ఒకటి, యొకటి రెండు, ఆరుమాసములలో ప్రజ లనుభవింపనెంచు వస్తువులు. యీవస్తువుల కాలపరిమితి ఒక సంవత్సరమువరకు నుండవచ్చును. వస్త్రములు భోజనపదార్థములు కుర్చీలు బల్లలువగైరాలు తదితర యన్ని యనుభవమునకుత్వర లోవచ్చు, అను దినము ప్రజలుయనుభవించు, వస్తువులీ తరగతి యందు జేరును.

నాలుగయిదు సంవత్సరములలోయనుభవమునకు వచ్చువస్తువుల జేయగల్గిన మెషినులు, ఫ్యాక్టరీలు, దుకాణములు రెండవ తరగతియందు వచ్చును. ఇదివరకున్న ఫ్యాక్టరీలు, మెషినులు, మిల్లుల పరిమాణము హెచ్చింప బ్రయత్నించుట, ఇదివరకున్న దుకాణములపై యధికయంతస్థుల క్రమముగా లేప బ్రయత్నించుట, ఇదివరకు జేయుచున్న వస్తువులకంటె హెచ్చువస్తువుల క్రమముగా జేసి, లాభము చేకూర్చగల యధిక పనులు ఈతరగతియందు జేర్చనగును. ఇట్టి పరిస్థితులందు, కోటిరూపాయల వ్యాపారము చేయుచున్నవాడు రెండు, మూడు లక్షలనో ప్రతివత్సరము తనవ్యాపారమునకు మూలాధారమగు నాలుగయిదు వత్సరములలో ప్రతిఫలమీయగల్గిన అధిక పనుల చేయింప మొదలిడిన, అట్టిపనిని యీరెండవ తరగతి యందుఁ జేర్చనగును.

తరువాత ఇరువది, ముప్పది వత్సరములలో గాని ప్రతిఫల మీయజాలని, అంత కాలములోగాని తయారుకాని సర్వపనులు, మూడవతరగతియందు జేర్చనగును. రైళ్లకు వలసిన వాగనులు, ఇంజనులు, పట్టాలు, ఇనుపరేకులు జేయు పెద్ద యింజనులు, ఇనుమును కరిగించు పెద్దఫర్నేసులు, మందుగుండు సామానులుచేయు మెషినులు, మెషినుతుపాకులచేయు, మెషినులచేయు పెద్దమెషినులు, ఓడలచేయు వ్యాపారము, పది, యిరువది వత్సరములందుగాని పూర్తిగా తయారై ప్రతిఫలమివ్వ ప్రారంభించు బంజరుభూముల వ్యవసాయము, ఆనకట్టలపని, కోనేరులపని, జలధారలద్వారా విద్యుశ్చక్తి తయారుచేయు పనులు, ఇట్టివెల్ల నీమూడవ తరగతియందుఁ జేర్చనగును. ఈతరగతుల నేర్పరచుటందాక ప్రత్యేక నియమమెద్దియు లేదనివెంటనే యొప్పుకొనవలయును. సాధారణముగా, దేశముల పరపతి విషయముల నాలోచించునప్పుడీ 'కాలపరిమితుల' పైతరగతులు నేర్పరచుట లాభకరము. కాలపరిమితు లటో నిటో నొకటి రెండు వత్సరములు నడపినను వచ్చుకష్టము లేదు. ఇప్పుడీకాల పరిమితుల ననుసరించి, 'పరపతి' ని దేశపుప్రజల పని చేయించినచో

ఎట్టి పరిస్థితులు కల్గునో విచారించిననేగాని. 'పరపతి' ద్వారా కల్గులాభనష్టములు సుబోధకము కాజాలవు.

మొదటి తరగతి వస్తువుల ప్రతి దేశము నందెల్లప్పుడు కొద్దిగనో గొప్పగనో చేయుచున్నారు. వ్యాపారము చురుకుగ సాగిన కొలది యావస్తువులను చేయు ఫ్యాక్టరీలు, మిల్లులు, అమితచురుకుగా, ఎడతెరపిలేకుండా నెల్లకాలము పనిచేయుచు, వస్తువుల తయారు చేయుచుండును. అంత నిదివరకే యీ ఫ్యాక్టరీల యందున్న పనివారు హెచ్చుగంటల కాలము ప్రతిదినము పనిచేయుచుండ, కొంత మంది క్రొత్తగా యధికపనివారు వచ్చి ఈ ఫ్యాక్టరీలయందు పనిచేయుచుండుట తటస్థించు నంత వచ్చు యార్డరులకు, తగినట్లు హెచ్చువస్తువుల చేయుచు, ఎల్లకాలము పోవుటకు సాధ్యముకాదు. వచ్చుయార్డరుల కన్నిటికి తగినన్ని వస్తువుల చేయించి, అమ్మవలయుననిన, ప్రతియజమాని, తన ఫ్యాక్టరీ యందు కొన్ని క్రొత్త మెషినుల పెట్టించియో ఫ్యాక్టరీప్రక్కన కొన్ని యితరచిన్న ఫ్యాక్టరీల త్వరలో కట్టించియో, త్వరగా వస్తువులచేయించుపద్ధతుల వెదకును. ఇటులమన 'పరపతి' యను మహాయంత్రముద్వారా, వ్యాపారమను పెద్ద ఇంజనును త్రిప్ప మొదలిడునప్పటికి, అధిక వస్తువులకు ఆర్డరులువచ్చుటయు, ఈవస్తువులు చేయువారు ఆదాయము అధికపని ద్వారా పొందుటయు, ఆయాదాయముద్వారా తదితరవస్తువుల కెన్నిటికో యధిక యార్డరులు కల్గుటయు, ఇటులగిరగిర 'ఆర్డరులపై యార్డరులు' మొదటియార్డరులద్వారా రెండవ యార్డరులు ఇటుల హెచ్చుచుండుటయు తటస్థించును. ఇందువలన, ప్రతివ్యాపారులకు నాలుగయిదు వత్సరములవరకు కొన్ని వస్తువులందు, అధికయార్డరులు వచ్చునని తోచుటకోడనే, అట్టివసతులు గల్గించుటకై పరపతి దెచ్చి, క్రొత్తఫ్యాక్టరీల, క్రొత్తమెషినులు నిర్మింప మొదలిడును. ఇట్టితరి, ప్రథమతరగతి వస్తువుల చేయుటకు, ప్రథమమున గల ఫ్యాక్టరీలు, మిల్లులు, దుకాణములు. త్వరితగతి ఎల్లకాలమును పనిచేయ ప్రారంభించుటయు, అంత నట్టివస్తువుల నింకను ఎక్కువగా నింకను హెచ్చుసంఖ్యలుగా చేయ ప్రయత్నించుటతో ప్రథమయంత్రము నడచును. రెండవ తరగతి వస్తువులనుగూర్చి యాలోచించుటకు ముందొక విషయము గమనింతము. ఇదివరకున్న ఫ్యాక్టరీలు వగైరాలు ఆర్డరులు హెచ్చినకొలది, తగినంత హెచ్చుసంఖ్యలుగా వస్తువులుచేసి యమ్మజాలవుగాన, ధరలు పెరుగుటయు, ధరలు హెచ్చినకొలది వర్తకులకు లాభము కన్పడుటయు, లాభముల నిచ్చి తగిలిన కొలది హెచ్చువ్యాపారము చేయు దాహము ప్రతివ్యాపారునకు బట్టి రెండవ తరగతి వస్తువులవంక వానిదృష్టి మరలుటయు సాధారణము.

రెండవతరగతి వస్తువులేవి? మొదటితరగతి వస్తువుల చేయుట కుపయోగించు వస్తువులు ఇప్పుడు పైనచెప్పిన దానినిబట్టి, మొదటితరగతి వస్తువులకు తగినంతగా యార్డరులు వచ్చునప్పటివరకు, మొదటితరగతి వస్తువుల జేయు ప్రస్తుతమున్న వస్తుసామాగ్రిద్వారా చేయగల్గిన వస్తువులకంటె హెచ్చుగా యార్డరులు వచ్చునరకే రెండవతరగతి వస్తువుల చేయ ప్రారంభించరని తలంచుటసాధ్యము. కాని తప్పు. ఏలననగా, మొదటిరకపు వస్తువు చేయు వస్తుసామాగ్రి క్రమముగా పనికాపిడి

కాలరాపిడివలన, చెడిపోవుటో, అరిగిపోవుటో క్రమముగా నుపయోగరహితమగుటో జరుగును. అందువలన కావలసిన సామాగ్రియందు కొరంత యెప్పుడు కల్గుచుండుగాన, ఆకొరంత దీర్చుటకుగాను రెండవతరగతి వస్తువులనెప్పుడు కొద్దిగనో గొప్పగనో చేయుచునే యుండవలయును. కాని, పైన తెల్పినటుల 'పరపతి'వలన క్రొత్తయార్డరులుకల్గి, ఈయార్డరులద్వారా మరిన్ని యార్డరులువచ్చి అప్పుడున్న వస్తుసామాగ్రి పైభాగమునందు చూచినటుల, కావలసినన్నివస్తువుల సప్లై చేయజాలనప్పుడీ రెండవరకపు వస్తువులకు వచ్చుయార్డరులు వచ్చుటయు, అంతయావస్తువులుచేయు వ్యాపారము చురుకుగసాగి ఇదివరకున్న వస్తుసామాగ్రిని పూర్తిగాపనిచేయించి, సాధ్యమగునంతవరకు ఆర్డరులను పూర్తిచేయబ్రయత్నము చేయబడును. క్రమముగా ఆర్డరులను పూర్తిచేయజాలని స్థితి వచ్చుటయు, అంత కొంతకాలమువరకు, అట్టి వత్తిడియుండునని, ఈరెండవరకపు వస్తువుల చేయువర్తకులు నమ్ముటయు, దానివలన తమ వస్తువులచేయు యితరవస్తువులు, లేక తమ మూలవస్తువుల నధికముగాచేయ బ్రారంభించుటయు కల్గును. వీరిమూలవస్తువులచేయు మెషీనులు, మిల్లులు, ఫ్యాక్టరీలే మూడవతరగతి వస్తువులు. ప్రథమతరగతి వస్తువులందు రెండవరకపు వస్తువులందొకే విధమగు ఆర్డరులు సప్లై'యను రెండు కత్తెరవత్తులు పనిచేయుచున్నవని తెల్పము.

ఇక మూడవరకపు వస్తువులకు రెండవరకపు వస్తువులచేయువారి ద్వారా యార్డరులెప్పుడు కొద్దిగనో గొప్పగనో వచ్చుచుండుగదా! రెండవరకపు వస్తువులచేయువారిపై వత్తిడి యధికముగ కల్గినకొలది, మూడవరకపు వస్తువులుచేయువారిపై యధికవత్తిడి కల్గుట సాధారణము. మూడవతరగతి వస్తువులుచేయుటకు సాధారణముగా పది, యిరువది, ముప్పది, నలుబది వత్సరములు పట్టుచుండును. గనుక యిచ్చట సాధారణముగా వచ్చుయధిక యార్డరులకు క్రొత్తమెషీనుల సాయమవసరములేకనే వస్తువులచేసి సప్లై చేయుటకు సాధ్యమగును. అత్యధికమగు వత్తిడి కల్గిననేగాని, యిచ్చటి వర్తకులకు కొంతవత్తిడి కలుగదు. చాలవత్తిడిని భరించగల్గిన శక్తి వీరికెప్పుడుండును? ఐనను, వీరును ఎప్పుడు 'పరపతి' ద్వారా ప్రతివత్సరము కొంతధనమును తెచ్చుచు; క్రొత్తమెషీనుల నేర్పరచుటందేకాక ఇనుము, బ్రాసు, రాళ్ళు దూలములు, యితరలోహ పదార్థములయందా ధనము ఖర్చిడుచుందురు. అందువలన జనరలుగా గల్గు ఆర్డరుల వత్తిడి, పనివత్తిడి, ద్వారా వీరుకూడ కొంతయాశలను బొంది, కొన్ని క్రొత్తమార్పులను, అధికపనులను తమ కార్యాలయములందు చేయబూని, ధనముఖర్చిడమొదలిడుట సర్వసాధారణము. ఇంక నితరవిషయములగూర్చి విచారింపక ముందే, మనతరగతులకుం జెందినవస్తువుల తిరిగిచూతము.

మొదటితరగతి వస్తువులు:—

రొట్టెలు, బిస్కతులు, గుడ్డలు, సింగరుమెషీనులు, ఐసు, ఫ్యాక్టరీ బియ్యము, నూనెలు, గోనెపట్టాలు, రాళ్లు, దరవాజా దూలాలాదిగాగల కొయ్యవస్తువులు, కాగితము, సిరా, కలము, పెన్సిళ్ళు, సూదులు, గుండుసూదులు, సున్నము, రంగులు, ధాన్యములు, వగైరా సర్వవస్తువులు, ప్రజలు వెంటనే తినుటకు, ఉపయోగించుటకు తీసుకొను సర్వవస్తువులు వీనిని చేయు వస్తువులు మొదటితరగతియందు వచ్చును.

రెండవతరగతి వస్తువులు:—

రొట్టెలు, బిస్కతులు చేయు మెషినులు సింగరు మెషీనుల చేయుమెషినలు గోనెపట్టాలు, నూనెలు కాగితమువగైరాయన్నివస్తువుల చేయుమెషినులు యిట్టియన్ని మెషినులచేయు పెద్దమెషినులన్నియు నీతరగతియందువచ్చును. చూడుడు. బియ్యపు ఫ్యాక్టరీలు స్పిన్నింగు వీవింగుఫ్యాక్టరీలయందు గల ఆ గిరగిర దిరుగు పెద్దచక్రములు యింజనులను చేయగల పెద్దయింజనులున్నవే అవియ రెండవరకపు వస్తువులు. దక్షిణవేల్సు దేశమునందు Iron and steel Industry ఈ రెండవ తరగతికి జెందియున్నది.

మూడవతరగతి వస్తువులు glascow లోనున్న ship Building works, south wales లోనున్న Iron and Steel Foundry works, Steel melting works, glascow లోనున్న బర్మింగుహాములోనున్న Engineering works యిట్టివన్నియు యీమూడవతరగతియందు జేరును.

యిక నిప్పుడువిచారింపుడు. మొదటి తరగతివస్తువుల జేయు మెషినుల కొన్నినెలలలో తయారుచేయనగు. రెండవ తరగతి వస్తువులజేయు మెషినుల కొన్నివత్సరములలో తయారుజేయనగు. మూడవతరగతి వస్తువులచేయు మెషీనుల కొన్ని పదివత్సరములలోకాని తయారుచేయుటకు వలనుపడదు. తరువాత యీతరగతులబట్టియే ఖర్చుపెట్టవలసినధనపరిమితిగూడ యధికమగుచుండును. ఇట్టి స్థితిగతులందు పరపతి హెచ్చుటచే వ్యాపారము చురుకుబొందుటచే వర్తకులకు లాభము లమితముగా కల్గుటచే పనివారందరుద్యోగులై ఐశ్వర్యవంతులగుచుండుటచే యీమూడువిధములగు వస్తుసామగ్రి నపరిమితముగ హద్దులేకుండ చేయగలమని తలంచుట వెర్రిగదా! యీపనులజేయుటకు యిదివరకు సంపాద్యమైన ధనము ప్రస్తుతము ప్రజలుచేయుచున్నపనివారు [illegible]చున్న ధనము యికముందు కొన్నివత్సరములలో వారుచేయుగలపనిపై యాధారపడియుండిన ధనమొత్తమెంతయోయుండునో యంతవరకే యీ మూడుతరగతులకుజెందిన వస్తువులయందు ధనము పెట్టతలపెట్టుట, తలపెట్టిన జయమందుచుట సాధ్యము, కానిచో తలంపులు విఫలమగును. విఫలమనుటయేకాక చక్రము ఎక్కు[illegible] చురుకుగ తిరుగుటకుమాని బొ[illegible]గా చ[illegible] బడిపోవును.

దీనికిగల కారణములుచాల గందరగోళముగ చిక్కిబిక్కిగా ఒకదానిపై మరొకటా ధారపడియుండును. కొన్నిముఖ్యకారణముల మాత్రముచూతము. యిప్పుడున్నధనము నాలుగైదు వత్సరములలో పూర్తిచేయుటకు లేకప్రజలునాలుగైదు వత్సరములలో సంపాదించగల ధనముకు సరిపోవునంత పరపతితో ఇప్పుడున్న ప్రజలు యీమూడుతరగతులగు వస్తువులపై ధనముబెట్టి పనిచేయ ప్రారంభింతురనుకొందము. ధనపిచ్చికల్గుటచే పరిమితులమించి ప్రజలు మొదటితరగతి వస్తువులందుకంటె రెండవతరగతివస్తువులందు రెండవతరగతివారు మూడవతరగతి వస్తువులందు హెచ్చుధనముపెట్టుటకు ప్రయత్నించుటయు పనివారు హెచ్చుమందిగా రెండు మూడుతరగతులగు వస్తువులకై పనిచేయుచు ప్రథమతరగతి వస్తువులయందు తక్కువమందిగా పనిచేయ ప్రారంభించుదురనుకొందము. చూడుడు.

| మొత్తము | ప్రారంభము | ఒకటి | రెండు | మూడు |
|---|---|---|---|---|
| 25 కోట్లు | 10 కోట్లు | 10 | 25 | 50 కోట్లు |
| 20,000000 ప్రజలు | 10,000,000 ప్రజలు | 5,000,000 | 3,000,000 | 2,000,000 |
| 110కోట్లు | 12 కోట్లు | 15 | 35 | 48 |
| 20,000,000 ప్రజలు | 10,000,000 | 4000,000 | 4000,000 | 2.000,000 |
| 24,000,000 | | 1,000,000 | 1,000,000 | 2,000,000 |

పైపట్టికప్రకారము మనదృష్టాంతము నందుగల దేశమునందు రెండుకోట్లప్రజలు మాత్రమున్నారు. వస్తువుల చేయుటఅమ్ముట యిత్యాదిచిల్లరకార్యములుచేయుటకు కోటి ప్రజలు మొదటిరకపు పనిముట్లచేయుటకు 50లక్షలుప్రజలు రెండవరకపువస్తువులు చేయుటకు30 లక్షలప్రజలు మూడవరకపువస్తువుల చేయుటకు 20లక్షలప్రజలుద్యోగస్థులైయుండ 95, 10, 10, 25, 50, కోట్లధనము వరుసగా ఆయావ్యాపారములకుపయోగించబడగా నిరుద్యోగములేకుండా తగినంతపని వత్తిడిసి మాత్రముకల్గి దేశము సౌభాగ్యవంతముగ నుండ వీలయ్యెడిది. కాని పనివత్తిడి జూచి భ్రమనొంది వర్తకులు మూడవతరగతి వస్తువులందు యిదివరకున్న 20 లక్షలుప్రజలకంటె మరొక యిరువదిలక్షల ప్రజలకు తగినంత పనిపెట్ట లెక్కలుచేసి పరపతిగోరుచో రెండవరకము వారు పదికోట్లహెచ్చుధనమును పదిలక్షల ప్రజల యుద్యోగము వెంటనే కోరుచుమరొక పదిలక్షుల ప్రజలకు హెచ్చుయుద్యోగము కల్గించు పద్ధతుల నేర్పరచి మొదటిరకపు వస్తువులందు 5 కోట్ల హెచ్చుధనమును యిదివరకుగల 50 లక్షుల ప్రజలకుద్యోగమిచ్చు పద్ధతుల నేర్పరచుటతోడనే జరిగిన పర్యవసానమేమి. దేశమున200లక్షలుప్రజలేయుండ 40 లక్షలుప్రజల కుద్యోగము కల్గు వసతుల కలుగజేయు నేర్పాటుల నాలోచించుటయు 95 కోట్లధనమును మాత్రము వ్యాపారము నందు పరపతి ద్వారాపెట్టిననే కలకాల ములో ఆధనమంత తిరిగివచ్చువసతులుండగా 110కోట్లకు పరపతినిచ్చుటయు అంతకాలదికా లములో నంతధనము ప్రజలు సంపాదించలే కుండుటచే తంటాలుకల్గుటయుసంభవించును. ఇట్టిపరిస్థితుల ద్వారాయేపర్యవసానము లెట్టి మార్గముల ద్వారాకల్గునని తెల్పుట దుర్ఘటము. కాని రెండవ మూడవరకపువస్తువుల జేయు వర్తకాగ్రేసరులకు తదితరులకంటె త్వరగా పరపతి బ్యాంకులందు దొరకున నియు అంత 'ప్రారంభము,ఒకటి' ఈరెండుతరగ తులకుచెందిన చిన్నవ్యాపారులకు తగినంత ధనము దొరకక పోవచ్చుననియు విదితమేక దా! తరువాత హెచ్చుమందిపనివారు చివర రెండు తరగతుల కుంచెందిన వ్యాపారము లందు తాత్కాలికముగ జేరుటయు అంత తక్కువ సంఖ్యాకులగు పనివారే ప్రథమ రెండుతరగతుల వ్యాపారములకు దొరకుచుం డుటయు అంత, అన్ని వ్యాపారములందు కూలివారికై పోటీలధికముగాజరిగి కూలిహె చ్చి వ్యాపారుల లాభముతగ్గుననియు తెల్లము. తరువాత మొదటి రెండుతరగతుల వారికి ధనమెప్పుడు దొరకక పనివారుదొరకకబాధ లుకల్గునో అప్పుడే చివర రెండవతరగతుల

వారిచే పనిచేయింపబడుచున్న పనివారినుండి అధిక వస్తువులకార్డర్లువచ్చుటయు అంతధనము హెచ్చగుటయుదుకాణాదారులు ప్రథమతరగతివస్తువులనుచేయించువారు బ్యాంకులకు అపరిమిత పరపతి నివ్వమని గోరుటయు తటస్థించును. ఈలోపల బ్యాంకులు తామిదివరకిచ్చిన పరపతియే యధికమైనదనియు యికముందు హెచ్చింపరాదని పైగావచ్చుచున్న ధనమును, తిరిగియివ్వకుండా బొక్కసమునేయుంచవలయుననియు తలంచి సంచులమూతలబిగగట్ట ప్రారంభించును. ఎప్పుడు వస్తువులకొను వారినుండి యధిక యార్డరులు వచ్చి ధరలధికముగ లేచి లాభమెక్కువగనున్నదని తోచునో ఎప్పుడు కూలి యధికముగ లేచియుండ యధికముగు పరపతియున్ననే గాని వ్యాపారము సాగదను యాతురత ప్రథమ రెండుతరగతుల వ్యాపారులకు పుట్టునో అట్టిసమయముననే బాంకులు హెచ్చుపరపతి నివ్వ నిరాకరించు. అంతటితో యకస్మాత్తుగా తటాలున వ్యాపారము చల్లబడును. యంత దుకాణవారులు ప్రథమతరగతి వ్యాపారుల వస్తువులనాకువద్దోయనిగోలపెట్టెదరు. పైగా బ్యాంకులుతమపరపతి తిరిగియివ్వమని వత్తిడిచేయుట మొదలిడును. గాన దుకాణాదారులు మొదటిరకపు వ్యాపారులు తమ తమ వస్తువుల నొక్కుమ్మడి భైరవులవలె భయము చేపీడితులై అమ్ముటకు ప్రారంభించుటయు, ధరలుతటాలున బోర్లగింత పెట్టి క్రిందకొచ్చుటయు, వెంటనే రెండుమూడు తరగతుల వర్తకుల వ్యాపారము లాగిపోవుటయుకల్గును. అంత ధరలుతగ్గిపోయినప్పుడే కొనువారుతగ్గుదురు. ఎందువలన యందురా, ధరలుతగ్గుటకు కారణము కొనువారు లేకుండుటవలన ప్రథమమున, తరువాత నష్టపడిన వర్తకులు పనివారి వదలివేయుటచే ధనవంతులము, అదృష్ట సంతులమని యుబ్బూరుటలాడుచున్న పనివారందరు నష్టదరిద్రులగుటయు యంతయేవస్తువుల కొనుశక్తి చాల కుంటుటయు యంతికొన బడువస్తువులుమరింతగా తగ్గుటయు తద్వారా మఱింత నిరుద్యోగముకల్గుటయు తటస్థించి ఎల్లయెడల వ్యాపారమాంద్యము యేర్పడి కొంతవరకు పూర్తిగనే నశించునని బొందిన రెండుమూడు రకముల వస్తువులకు వలయు మిల్లులు ఫ్యాక్టరీలు మూలబడి యధికనష్టము కల్గించుటయు కల్గును.

ఇప్పటికొక్క విషయము బోధపడియుండవచ్చు. ఏసమయమున యత్యధికలాభములు జీవితములు కూలిసాధ్యమని కన్పడునో ఆ సమయముననే వ్యాపారమందము భలా వ్యాపారులకు నష్టములు కూలీలకు నిరుద్యోగము తటస్థించు. దరిద్రము వెంటాడుచున్నదని తెల్లము. అనేకయార్థిక రాచకీయన్యాయముల నెంతియో జాగ్రత్తగయద్భుతముగ చెప్పిన సుమతీ శతకమునందు ధరతగ్గుట హెచ్చుకొరకే, పెరుగుటవిరుగుట కొరకే యని యెప్పుడో యీన్యాయమును, తెల్పెను. ఎందువలన యెట్లుయీదరిద్రము కల్గుచున్నది. ముఖ్యములగు మూడుసూత్రముల నిదివరకే యీదీర్ఘమగు దృష్టాంతముల ద్వారా తెల్పితి. ఇంగ్లీషున నైన చాలసులభముగ నీవిషయము తెలుప వీలయ్యెడిది. మన దేశమున పనివత్తిడి మందము జాతీయపరిణామముగ మారిన యంతదానివలన కల్గుకష్టములు మనవారికి తెలియవు. అనుభవము లోనికిప్పటివరకు వచ్చుచుండుటలేదు. గాన మనవారికి తెలియునట్లు వ్రాయుటలికపముగు

చున్నది. ఇంతవరకుమనము జూచిన దేమి! యొకటి, దేశపుధనము ప్రజలు వ్యాపారులు కొలదివత్సరములలో సంపాదించగల ధనము యీయాధారములపై యేర్పరచి నపరపతి కంటె హెచ్చు పరపతినిచ్చిన నష్టములువ్యాపారమందముకల్గును. రెండుయనవసరముగ నిచ్చియెత్తినటుల యొకరికొకరితో సంబంధము లేకుండా వ్యాపారులు పని యొత్తిడి కల్గిన దినములందు మొదటి రెండు తరగతులకు జెందిన పనుల నజాగ్రత్తగ జూచుచు హెచ్చుకాలములో నెప్పుడో ప్రతిఫలమిచ్చు పనులందధిక ధనము లెక్కలేకుండా ఖర్చిడిన వెంటనే లాభముకల్గించు వెంటనే ప్రజలధిక సంఖ్యలుగా కోరువస్తువులకు తగినంతమంది పనివారు, ధనము లేకపోవుటయు అంతవ్యాపారముగ భేలున తల్లకిందులుగా పడుటయు సంభవించు. మూడు బ్యాంకులప్పులిచ్చుటలో నెట్లు త్వరలో తిరిగివచ్చు బిల్లులందే యెక్కువధనమువడ్డీకిచ్చి కొద్ది ధనము మాత్రము చాలాకాలములో తిరిగి వచ్చు బిల్లులందు పెట్టి లాభముపొందుచున్నవో అటులనే దేశముయొక్క ధనమును, ప్రజలపనిని దేశమునకువలయుపనులందు బెట్టునప్పుడు హెచ్చుగా దేశముయొక్క యైశ్వర్యమును త్వరలో ఫలితములనొసంగుపనులందుఖర్చిడి, తరువాత, లాభకరముగా అవసరముగా నున్నంత ధనమును హెచ్చుకాలములో ఫలితములనొసంగు పనులందు ఖర్చిడుట లాభకరము లేనిచో యెప్పుడో ఫలితములనిచ్చు పనులందధికధనమును ఖర్చిడబూనుకొని ప్రస్తుతము ఆఫలితములువచ్చులోపల తినుటకు తిరుగుటకు అవసరమగు యైశ్వర్యము గల్గించు వసతుల బోగొట్టుకొని చతికిలబడుచో నష్టము కల్గుగదా! అసలు ప్రజలుసుఖముగనున్నగాని వారేపనియైన చేయజాలరు. పరపతి దృఢముగానున్న కానివ్యాపారము సాగదు. నాల్గు ఇదియతుది విషయము, కాని చాలముఖ్యమైనది. బ్యాంకులువిచారించకుండ పరపతి నిచ్చుట లాభకరము గదా! యనియు పరపతినిచ్చుట మంచిది గదాయనియు తలంచి గ్రుడ్డియెత్తుగా యెవరికి బట్టినవారికి పెద్దవర్తకాగ్రేసరులని కొందరికి పరపతి నధికముగానిచ్చి అవసరముగానుండు పరపతిని చిన్నవర్తకులకివ్వక జాతీయపరపతి నియమములమించి త్వరపడి పరపతి నొసంగుట చాల పెద్దతప్పు. తరువాత పరపతి యను ధనము కూలపడబోవుచున్నదను భయము కల్గినప్పుడు ఆలోచనారహితముగ పరపతి నివ్వక వడ్డీరేటులు హెచ్చించి పరపతి తిరిగి యివ్వమనికోరుట మరొకతప్పు. ఈరెండవ తప్పును తీర్చుటకు బ్యాంకులకు సాధ్యముగాదు. అయ్యది కేంద్రపరపతి సంఘమునకే సాధ్యమగుపని కనుక అంతవరకా విషయము నాపుదము. ఇచ్చట నెటుల పెద్దవర్తకులు తమకంపెనీలకు పరపతి ని బొందగలరను ప్రశ్నను మాత్రము విచారింతము.

జాయంటుస్టాకు కంపెనీల షేరుల నమ్ముటలో కొనుటలో నెట్లు బ్యాంకులు సహాయముచేయవలసినది రెండవవ్యాసము నందు జూచితిమి అచ్చట క్రిందచేవ్రాలు చేయువారు ప్రత్యేకముగనుందురని తెల్పితిమి. కాని మనదేశమున జర్మనీదేశమున వారు వేరుగనుండుటకు బదులు బ్యాంకులే యాపనుల నెరవేర్ప బ్రయత్నించుచున్నవి. క్రిందజేవ్రాలు చేయువారైనను బ్యాంకులైనను పెద్దవర్తకులు గొప్పకంపెనీల ప్రారం

# చెన్నపట్టణమునందలి కొన్ని ముఖ్యదృశ్యములు

( ఆర్. రంగనాథ శాస్త్రిగారు. )

(౧) కపాలేశ్వర దేవాలయము

ఈ దేవాలయము చెన్నపట్టణములోని తిరువళిక్కేణికి దక్షిణమున నొకమైలుదూరమున నున్నది. మైలాపురముయొక్క పరిసరము, పార్వత్యవతారమును గూర్చినయొక పురాణగాధకు సంబంధించినది. ఒకానొర్చిన చెక్కడములనేకములు గలవు. వైష్ణవుల యొక్కయు శైవుల యొక్కయు ప్రాతగ్రంథములలో నీదేవస్థానము 'తిరుమాయిలాయ్' (అరవములో తిరు=సుందరమైనదని యర్థము) యనివ్యవహరింపబడియున్నది.



కూమునది సముద్రమున సంగమించుచోటు.

కప్పుడు పార్వతిమయూరాకృతిని శివలింగము నిచ్చుట నర్చించెనని చెప్పుదురు. దేవళము యొక్క యుత్తరప్రాకారమున నీగాధనుగూర్చి స్థలగాధలనేకములు దేవాలయము లోపలి భాగమున శిల్పరూపముగ సజీవములై యున్నవి. శైవముని యగు



ప్రసిడెన్సీకాలేజి, చెన్నపట్టణము.

సంబంధానుని ప్రతిమ యొకటి యాలయ పశ్చిమాంగణమున గలదు. సంబంధానిగూర్చి యీ క్రిందికథ చెప్పబడుచున్నది.

ఈతడు పసివాడై యున్నప్పుడొకనాడితని తలిదండ్రులొక తటాకమున స్నానమొనర్చుచు నితనిని గట్టుపై కూర్చొనబెట్టిరి. అప్పు



సెంట్ థోము. క్రైస్తవ దేవాలయము, మైలాపురము, చెన్నపట్టణము.

డితడు పాలకొరకై యేడ్వగా తల్లివచ్చులోపల నొక దేవతవచ్చి యితనికి పాలిచ్చియంతర్హితయాయెను. అప్పటినుంచియు నితను దైవాశీర్వాదము గలవాడై వృద్ధిచెంది బాల్యముననే తీర్థములను సేవించుచు దైవమహి




కపాలేశ్వర దేవాలయము.

మను గీర్తించుచు పరిభ్రమణ మొనర్ప సాగెనట. తిరుక్కొలక్క యనుచోట నితడు దేవారాధన మొనర్చుచుండగా బంగరుతాళముల జతయొకటి మిన్నునుండి యితని చేతులలో పడెను. (ప్రతిమలో నీతాళముల బట్టికొనినట్లే చెక్కబడినది) ఇతడు భక్తిగీతములపాడి యసాధ్యములగు రోగముల బాపెను. ధనములేనివారిని భాగ్యవంతులుగ జేసెను. జైనమతములో కలిసిన పాండ్యరాజును తిరిగి హిందువులలో కలిపెను. ఎన్నడో చనిపోయినయొక 'చెట్టి' పిల్లయొక్క యస్థులనుగొని ప్రార్థన మొనర్చి మరల బాలికను జీవింపజేసెను"

ఇంకను 'కురాయి' (యనవకావ్యము) రచించిన తిరువళ్లువార్ యొక్కయు ఆవాయార్ యనునొక కవయిత్రి యొక్కయు, పండ్రెండుగురి యాళ్వారులలోని పెయాల్వారునియొక్కయు స్మారక చిహ్నము లిందుగలవు.

తిరువళిక్కేణి యందలి పార్థసారథి యాలయముపలెనే యిదియును విశేషప్రాముఖ్యమును గడించినది.

### (౨) సెంట్ థోమ్

దీనిని గూర్చిన యీక్రిందికథ నిప్పటికిని చెప్పుకొనుచుందురు. క్రీస్తుశక ప్రారంభమున నిచ్చట మహాదేవుడనురాజు రాజ్యపరిపాలనంబొనర్చుచుండెను. అప్పుడొక గొప్పమ్రానుకొట్టుకొనివచ్చి సముద్రపుటొడ్డుపట్టెను. రాజుదాని తన మందిరమునకు జేర్పించ వలయునని విశ్వప్రయత్నము లొనర్చెను. కాని సాధ్యపడలేదు. ఏనుగుల గట్టించి లాగించెను. కాని కదలలేదు. పురోహితులతోడ మంత్రతంత్రములు బెట్టించెను. లాభము గలుగలేదు. ఏమియు

దోచక యోచింపుచున్న రాజుకడకొక విదేశీయుడు వచ్చి యిట్లనియె. "అయ్యా! దీనిని మీగృహమున కవలీలగ జేర్పించెదను. అట్లొనర్చిన యెడల నీమారియును, సముద్రముకడ మందిరము గట్టుకొనుట కొకింత స్థలమును బహుమతిగ నీయవలయును." ఈ మాటలకు రాజుసంతసించి యాతని ప్రార్థన నంగీకరించెను.

అప్పుడా విదేశీయుడు ఆకొయ్య మొద్దును బాగుగ తాళ్ళతో బిగించి తాను కొంతమంద చేతికిచ్చి లాగుమనెను. సునాయాసముగ దానిని వారుగట్టునను చేర్పగలిగిరి. అప్పుడు రాజు మిక్కిలి యాశ్చర్యమొంది యా కొయ్యను సముద్రముకడ కొంత స్థలమును విదేశీయునకు బహుమతిగ నొసంగెను. ఆయన యాస్థలమందా ప్రమానుతోడ నొక చిన్న క్రైస్తవాలయమును గట్టుకొని కాలము గడుపుచుండెను, ఆతనిపేరు సెంటుథామస్. అప్పటి నుంటియు రాజునకును రాజపరివారమునకు నీయనయందు భక్తిశ్రద్ధలు మిక్కుటమైయాయన యనుజ్ఞగైకొనక యేకార్యమును చేయకుండిరి. అందువలన రాజపురోహితులు గురువులు, మొదలగువారు తమపలుకుబడి నశింపుచున్నదని విచారింప జొచ్చిరి. కొంత కాలమువరకు వేచియుండి చివరకు కుట్రపన్ని యాయనను చంపించిరి. ఆయన భక్తులాశవమును క్రైస్తవ మందిర సామీప్యమందే భూస్థాపితమొనర్చి దానిమీద నొకగోరీ కట్టిరి.

పదునారవ శతాబ్దమధ్య భాగమున పోర్చుగీసువారీ మందిరమును నభివృద్ధిచేసిరి.



చేపాకు నందలి ఝూక మందిరము. చెన్నపట్టణం

అనగా యిప్పుడు మనకగపడు ఆకారము పూర్తిగ వారివలనగట్టబడినదే.

ఇది చెన్నపురమందలి దర్శనీయస్థలములలో నొక్కటి యనుటకు సందియములేదు.

(౩) చేపాకు నందలి ఝూక మందిరము.

ఈ సుందర సౌధరాజమును కర్నాటక నవాబులలో ౮ వ వాడగు మహమ్మదాలియను నాయన నిర్మించెను. ఇది యింగ్లీషునందలి యల్ అక్షర సదృశమై



[ఎద్దులు లాగు మోటతోడ భావినుండి నీళ్ళు తోడు చున్నారు.]

యుండును. ఇందువలననిదియింగ్లీషు ఇంజనీయరుల సహాయమున నిర్మింపబడి నటుల దోచు చున్నది. పదమూడవ కర్నాటకనవాబగు గులాం మహామ్మద్ గౌస్ ఖాన్ యనునాయన సంతాన విహీనుడై మరణించెను. అందువలన దీనిని బ్రిటిష్ గవర్నమెంటువారువశపరచుకొనిరి. అప్పటినుండియు దీనియందు గవర్నమెంటు ఆఫీసులు బెట్టు చున్నారు.



ఉ॥ దీపిత పుష్పవృష్టిపికర దివ్యగణంబొకవంక సద్విప
ద్వ్యాపిన సత్వబృంద మొకవంక నిజాచిత శ్రీవితానముల్
గోపకు లొక్కవంకఁదగఁ గొల్వఁగనొప్పు సరస్వతీకళా
శ్రీపరతత్త్వమున్ గొలుతు కృష్ణహరీ! వసుదేవనందనా !

[ శతకకవులచరిత్ర. ]

# పరిచయము *

[ ఆదిపూఁడి ప్రభాకర కవిగారు. ]

చ॥. పలుకు పడంతికిన్ సరసభావములం బ్రకటించు మంజుభా
షలం దగనేర్పినట్టి సరసజ్ఞులు మీరు మహీంద్ర చంద్ర! యా
లలనకు మేల్ నడల్ గరపి లాలన సేసిన సుప్రసిద్ధలీ
యలఘులు, సార్వభౌమతిలకా! తిలకించితె! యీమహాత్ములా
కలికి కలంకిరియల్ సొగసుగా సడఁగూర్చిన ప్రౌఢధీసమ
గ్రులు, నృపవర్య! మీరు రసజ్ఞోత్తములా తిలపుష్ప నాసకున్
సులలితగానవిద్య కడు సొంపుగ శిక్షయొనర్చినట్టి ప్రా
జ్ఞులు మహిపాల! యాభ్రమరకుంతల కెంతయు నర్తనంబు మం
జులతర వైఖరిన్ సలుపు శుద్ధిని దిద్దిన శుభ్రకీర్తివం
తులయిన వారు వీరు పరితోషిత సత్కవిజాల! యిట్టిమా
న్యులకు దక్షిణార్హమై యలరుచున్నది యీసభ నేడు కృష్ణరా
యల సభ నుగ్గడించుచు, నయారె! యొయారి మిటారి యొప్పనా
చిలుకలకొల్కి నేఁడిచట జిందులు ద్రొక్కునొ పాటపాడునో
పలుకులిగుర్ప గారసిక భావములం గరగించి మోహకం
దళముల మోసులెత్తఁ బ్రియదంబుగ వీణియమీఁది పాండితిన్
దెలుపునొ? తేటతేనియల తెట్టెగ దట్టెడు ముద్దుముద్దుమా
టల తెగ దొప్పులేని కెరటంబుల నావలరాచవానియా
గ్గలనుగువృత్తమెల్ల యతికౌతుక మొప్పతిలం బ్రసంగమున్
సల్పునో? కావ్యరూపములు నాయకభేదములున్ రసంబులున్
బలుకులయందు నర్థములయందును నొప్పు నలంకృతుల్ సము
జ్జ్వలతరవృత్తులుం ధ్వనులు భావములందగు నట్టిరీతులుం,
బొలుపగు శయ్యలుం, బుధసమూహము, బాపురె, మేలటంచు నా
దలలటులూప నిప్పుడిట తామరసోద్భవురాణి, వాణి, యం
పొలయ నుపన్యసించునొ? నృపోత్తమ! యీకలకంఠి వచ్చు జా
డలు కనుపట్టినా తెలుపు డాలదె, యామృగనేత్రి మేని కాం
తులు విరిజాజి ముత్తముల దోరణిగట్టెడ, నాణిముత్తియం
బుల వెదజల్లెడున్, మరియు బున్నమవెన్నెల కాసెడున్, విని
ర్మల సురవాహినీ ఝరిపరంపర గొల్పెడుఁ గ్రొత్త క్రొత్తను
ర్వ్యాలపన మీఁజు పాల్కడలి పొంకము మించెడు? బచ్చికప్రపుం
బలుకుల పోహణంబు చెలువంబుగ నించెడుఁ, బారిజాతపుం

---

* గద్వాలసభకు కొప్పరపు సోదరులు వచ్చినప్పుడు చెప్పినది.

బిలకలతోఁట వాటముగఁ బొంచెదు, నత్తగలాక్షి కాళ్ళయం
దెల గొమరారుగజ్జలు ఘణిల్లని మ్రోఁగ, మనోహరధ్వనుల్
వెలయఁగఁ జొచ్చెవింతె యరవిందము భీకరకంకణక్వణం
బులుశ్రుతి వేయమై హృదయముం గరగించెదు హాయి, హాయి! కో
యిలలును శారికల్ శుకములిచ్చమె యుంజెలరేఁగినట్లుగాఁ
గలకల కాకలీకలితక్రమబుతుల్ వినుపించుచున్నవా
చెలువకడాణివీణె శ్రుతిచేసిన చంద మమందగోస్తనీ
ఫలరసమాధురీలహరిపర్వఁగఁ శార్వణచంద్రబింబవ
ద్తుల కమనీయవక్త్ర యదె ప్రౌఢతనంబున నాలపించె ని
స్తులగతి రాగమంజరి, విశుద్ధ సురద్రుఫలాసవాతిపే
శలపదగుంఫ గుంఫితలసత్తరగాన రసాయనంబుగ్రు
క్కులుగొను నిచ్చవచ్చిరదె కంజభవుండు గిరీశుఁడింద్రిము
ఖ్యులు సురలద్దిరా "సరసి జోద్భవుఁ జూడుము తెల్లతేజిపై
నలరుచునున్న వాఁడదె శశాంకవిభూషణుఁ డేనుగెక్కెవ
ర్త్తెదు సురేంద్రుడల్లదె యతిప్రముదంబున గిత్తనెక్కి భా
సిలెడుఁ గుబేరుడంచవయిఁ జేరినవాఁడు సుధాప్రమత్తచి
త్తులయిరిపోలు వీరు, మధుతుందిలగాన రసంపుఁ గ్రొత్తపు
ఝ్జలకెగ్రబాకెనో" టని పొగింబొరి దేవసమూహ మధ్భుతా
కలనపరీత దృక్కులనెగాదిగఁ జూడఁగ నప్సరస్సరో
జలలితవీక్షణాతతిదిసంతులుకొట్టుచు దావకీన కీ
ర్తుల మహిమంబులన్ వివిధరూపములంగొని యాడి గానముల్
సలుపుచునున్న వారదె! రసావరశేఖర పాకనాటిరా
ట్కుల జలరాశిచంద్ర, శతకోటి ధరప్రతిమానవైభవా
కలిత విభుత్వ భాసుర! యఖండరమాపరిపూర్ణ! ముష్టిప
ల్యలఘుకుల ప్రదీపక! దయారసపోషక! రామభూపపు
త్ర! లలిత సత్కవీంద్ర జనతాస్తుతి పాత్ర ! మహాధిరాజ దో
ర్బల దళితారిమండల ప్రభాకరభాను సహస్ర కర్ణ కుం
డలగుణరత్నదామ! రిపునామ వినామ! మిముంభజించుకో
ర్కులు దళుకొత్త నేడిటకుఁ గొప్పరపుంగవిరాజులీసభా
స్థలి కరుదెంచినారు ప్రభుసత్తమ! యాదరమొప్ప వీరికిన్
గలుగు శతావధాన ముఖకార్యములందలి కౌశలంబుపు
ష్కలముగఁ బేరుఁగాంచినది, కానబహూకరణ ప్రసిద్ధదృ
ష్టులఁ దిలకించి యీసభకు సొంపు ఘటింపుము భూవరాగ్రణీ !



# విచిత్రప్రణయము

(పి. నరసింహా రావుగారు.)

అది వసంతకాలమా? కాదు. తరులతాగుల్మములు కుసుమ శోభాసమన్వితములు కావు. కలకలనినాదమున సెలయేళ్లుకాలమహిమనుజాటుచు జలజల ప్రవహించుచున్నవా? లేదు. ఇకరసాలశాఖపై కూర్చుని కోయిల యెట్లువసంత గీతముల పాడుననుకొందురు? అరవిందనీలోత్పలాదులు పూజ్యములు. భ్రమర గీతములకుమాత్రము తావెచ్చట? శుకపికగీతములకు సంబంధమేమి?

అదివెన్నెలరాత్రికాదు. ఆకాశము ధూళియుతము. ఇక పండువెన్నెల లెచ్చట? నక్షత్రముల ప్రకాశమా? ఆ. బాగున్నది. మిణుగురు పురుగులైనను మనోముగ్ధకరము లగు కాంతిని విరజిమ్ముచుండెనా? ఆ-అంతమాత్రముకూడనా?

ఇక వైశాఖవేళల శరీరములట్లు చెమటబట్టినప్పుడు చల్లని మందమారుతమా?- ఇక- మలయమారుతమా?- ఆ- పూజ్యము.

మానాయికా నాయకులు నూతనులు. నవనూతనులు - నిత్యనవీననూతనులు.

జంకుగొంకు-మంచిచెడ్డ-నియమనిష్ట-మొదలగునవి యెట్టివో వారెరుగరు. ఎరుగుటకుప్రయత్నింపరు. అదివారికవసరములేదు. తెలియుట యావసరమను జ్ఞానమే లేదు.

వసంతకాలమైనను- గ్రీష్మవేళలైనను, చిగురాకు జొంపములైనను- ఎండుటాకుల ప్రోవులైనను, కోయిలకూతలైనను- గుడ్లగూబల రొదలైనను, నవనీలోత్పలములైనను, ఉమ్మెత్తపూవులైనను- పండువెన్నెలయైనను మిట్టమధ్యాహ్నమైనను- ప్రశాంతమైనను, గోలాహలమైనను, సర్వమును సమానమె- సమానాదరణీయములే. అన్నిటికి నతీతులు మానాయికానాయకులు.

రహస్యములేదు. ఒకరుచూతురను విచారమేలేనప్పుడు రహస్యప్రదేశముకోటి ప్రశంస యెందుకు?- ఒకరి సహ్యతతోగాని, యసహ్యతతోగాని, వారికి పని లేదు. ఒకరు వెక్కిరింతురని — కంటకించుకొందురను మాటయే లేనివారు మానాయికానాయకులు.

అది మండువేసంగి. తీవ్రముగ గ్రీష్మవాయువులు వీచుచుండెను. మిట్టమధ్యాహ్నము. ఆగృహమందలి వారెల్లరు భుజించి యానాటివరకు తాళజాలకతలుపులు కిటికిటిల బిగించుకొని మండువాచుట్టును చాపలపై చేరికొనియు మంచములపై వాల్చుకొనియు కూర్చుని తాంబూలచర్వణమొనర్చుచు ఆపసోపాలు పడుచు విసురుకొనుచు లోకాభిరామాయణము చెప్పికొనుచుండిరి.

మా నాయకుడు డాబామీదనుండి మండువాగుండ క్రిందకు దుమికి 'మ్యావ్' మనెను. వెంటనే నాయిక 'మ్యావ్' మనెను.

# నిపాననాదేవి స్వప్నము

కౌశాంబిదేశపు రాజ కొమరుని పేరు అభిజిత్కుమారుడు. అతనిని నిపాననాదేవి వరించెను.

ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందలి రణదుందుభి త్రిలోకముల నల్లకల్లోల మొనర్చెను. వెంటనే నిపాననాదేవి స్వహస్తమున అభిజిత్కుమారుని వీరవేషమున నలంకరించెను. ఆమె రాచకన్నియ గదా? అందువలన వీరుడే యామె కారాధ్యుడు.

అభిజిత్కుమారుడు గుర్రము నెక్కి దానిపై నుండి వంగి నిపాననాదేవి మస్తకమును స్పర్శించి వాయువేగ మనోవేగముల ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమునకు నిర్గమించెను. నిపాననాకుమారి స్వగర్వమున పైమరచినది. ఏలయన, ఆమె మహా వీరవనిత. అతడో— మహావీరుడు.

ఆమె గృహమునకు తిరిగి వచ్చి సఖుల జూచి "నా భర్త మహావీరుడు—వీరోత్తముడు. ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందు జరుగు మహా సంగ్రామమున పాల్గొనుటకు నిర్గమించెను." అనినుడువుచు నానందింపుచు తల ముడిచికొనెను. పట్టు పీతాంబరమును ధరించెను. కానియామె సంతసమునకు మేర యెక్కడ? వీర రమణికి ప్రాణనాథుడు ధర్మయుద్ధమున కేగుట కంటెను పొందదగిన యానంద మేమున్నదీ?

ఆమె మస్తకమున పుష్పమకుటమును దాల్చెను. జడయందు పూలు దురుముకొనెను. పూలహారములు వక్షస్థలమున తాండవంబాడుచుండెను. సువర్ణపాత్రయందు జపాకుసుమ పుష్పముల నుంచుకొని దేవళమునకేగి భగవానుని యారాధించివచ్చెను.

మరుసటిదిన ముషఃకాలముననే లేచి సఖులతో గూడి పుష్కరిణియందు జలకేళి యొనర్చి తల్లితోడ పరమానందమున పరమాన్నమును భుజించెను. సాయంతనమైనంతనే పుష్పభూషణముల ధరించి యర్ఘ్యమును కరకమలముల యందిడుకొని భగవానుని దేవాలయమున కేగెను.

కాని మూడవ దినమున నా రాజకుమారి మనమెటులో యుండెను. ఆనందము స్తంభింపజొచ్చెను. అయినను భగవానుని పూజించుటకు దేవళమునకేగెను. నాలుగవ దినము వచ్చెను. భర్తృవిహీన జీవితమునందానందము వ్యర్థమను విషయమును గ్రహించెను. అయినను నానిరానందముతోడనే దేవళమున కేగి భగవానుని యర్చించెను.

అయిదవ దినమున పతి విరహమునకు తాళజాలకుండెను. హృదయము తల్లడిల్లజొచ్చెను. ప్రాణగతి మందగించెను. కార్యము లెల్ల కట్టుబడెను. కన్నీరు కారజొచ్చెను. కాని చేయునది యేమి?

ఆరవ దినమున "భర్తతోడ నెట్లు గలియుదును? ఈ విరహమున కంతమెచ్చట" అని చింతింప సాగెను. ఆరాత్రి మూడవజామున నిపాననాకుమారి శయనమందిర ద్వారముల బంధించుకొని వీరవేషమును దాల్చెను. అగదియందలి యస్త్రశస్త్రములు దీపపు వెలుగున తళతళ మెరయ మణిమాణిక్యములు అనంత కాంతుల నీనుచుండెను. దృఢ ప్రతిజ్ఞతో గూడిన యామె ముఖమండలము సుసుందరమై యలరారుచుండ నామె శిరస్త్రాణమును ధరించెను. చేత ఖడ్గమును దాల్చెను. బర్చి మొదలగు ఆయుధముల గైకొనెను. ధనువును స్కంధకు దగిలించుకొని యశ్వశాలకు జనెను.

అందొక నల్లని గుర్రము పైకి చూచుచు దర్పభరమున కాలిగిట్టలతోడ భూమిని కంపింపజేయుచుం

డెను. ఇట్టిదేకదా, వీరవనితలకుపయుక్తమగు వాహనము. రాకుమారి దానినిబట్టి కళ్ళెము జీను మొదలగు వానితోడ నలంకరించెను.

నిపానసాకుమారి సుసజ్జితమగు నాగుఱ్ఱము నెక్కి దానిని యింద్రప్రస్థమునకేసి పరుగెత్తించెను. ఇట్లామె యేగుటకు కారణమేమి? పెత్తిమాస్వసునిధర్మ యుద్ధము నుండి మరలించుటకా? కాదు. అతనికి దోడ్పడుటకు; ధర్మయుద్ధ మొనర్చుటకు. ఆమెరాచకన్నిక. రాకొమరుని బ్రేమించినది. అందువలన భర్తతోడ నిడయై ధర్మయుద్ధమును సాగించుట కేగుచున్నది.

అప్పుడామెకు తలిదండ్రులవిషయము తంపునకురాలేదు. బాల్యక్రీడల కాలవాలమగు జన్మభూమి యొక్క యాలింగనము లంత లాయమునుగల్పింపలేదు. సఖీబృందముయొక్క ప్రేమ విలాసములడ్డగింపలేదు. ఏలయన, ఆమె వీర నారీమణి. వీరవనితను నడ్డగింప గలిగినది భూమండలమున నందుగలదా! వీరనారీమణి యెప్పుడైనను మార్గము దప్పియుండెనా? వెనుకడుగిడి యుండెనా?

ఆ యశ్వము వాయువేగమున పరువిడుచుండెను. ఆ మెరమనము విద్యుద్గతిని మించి నిర్గమింప జొచ్చెను. కాని యావేగమునకు తగినగతి యశ్వమున కెట్లుండును? కొరడాదెబ్బల వలన దాని శరీరము నుండి రక్తము ప్రవింపు చుండెను. నోట నురుగులు గ్రక్కసాగెను. అయిననుదానికి విరామములేదు. విశ్రాంతి శూన్యము; భూమిని కంపింప జేయుచు నుగ్రము పరువిడుచునే యుండెను.

సూర్యోదయ మగుచుండెను. మహా తేజస్వినియగు నాయశ్వము భూతలమున బడిపోయెను. ఒక్కమారు సలిదిక్కుల జామ్ములతోడ దానిజీవితము ముగిసెను.

నిపానసా కుమారి యశ్వకంఠమును కౌగలించుకొని యొక్క కన్నీటి బిందువును రాల్చి వానితలమీద చేయు వైచి నిమెరెను. దీనస్వరమున వాయురాజమా, యని సంబోధించి దీర్ఘనిశ్వాసమును వీడి వెనుకాడక పరుగిడ జొచ్చెను.

ఆమెకాహారములేదు—నిద్రశూన్యము—విశ్రాంతి పూజ్యము— నడచు చుండెను; పరువిడు చుండెను. ఎంతనడచినను, పరువిడినను తోవ్రవతరుగ కుండెను. ఇట్లు పండ్రెండు రాత్రులు పండ్రెండు పగళ్లు గడచెను.

పదమూడవ నాటి యుషఃకాలమున నిపానసాదేవి కురుక్షేత్రమును బ్రవేశించెను. కాని యప్పటికి ధర్మయుద్ధము ముగిసెను. అందువలన కురుక్షేత్రము జనశూన్యమై, మహా స్మశానమై శవములతోడ నిండి భీభత్సమై భయంకరముగ నుండెను. ఆ మహాయుద్ధము పదునెనిమిది దినములు జరిగెను. పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము నశించెను. ఆ క్షేత్రమును చూచినంతనే సగర్వమున నా వీరవనిత శరీరము గగుర్పొడిచెను. ఆశవములయందు—అమృతశరీర రాసులయందు నిపానసాకుమారి భర్తశరీరమును వెదుకజొచ్చెను. కొంత ప్రొద్దెక్కినప్పటికి కురుక్షేత్రమగు ధర్మక్షేత్ర మంతయు శోకాకులురగు వితంతువులతోడ నిండిపోయెను. వారెల్లరును తమ మృతభర్తల శరీరముల వెదకుచుండిరి.

రెండవజామ మతిక్రమించెను. నిపానసాకుమారికి బడలికలేదు. ఆకలిదప్పులు వ్యాగ్యము. శ్రమయననేమో యెరుంగక శవముల బరిశీలింపు చుండెను. కొంతమంది స్త్రీలు తమతమ భర్తలశరీరములపైబడి యేడ్చు చుండిరి. మరి కొందరు సహమరణమునకు సంకల్పింపు చుండిరి. మరికొందరు మృతభర్తల శరీరముల గాంచజాలక విలపించుచు గృహోన్ముఖులగు చుండిరి. కాని నిపాన నాదేవి ప్రయత్నము మాత్రము పూర్తికాలేదు.

సూర్యభగవాను డస్తాద్రిశిఖరో హింపుచుండ నా క్షేత్ర మంతయు రక్తవర్ణ రంజితము కాజొచ్చెను. అప్పుడా రక్తవర్ణరంజిత మగు శవరాసుల గాంచిన వారిహృదయములు బ్రద్దలగునట యుండాశ్చర్య మేమున్నది?

వీరాగ్రగణ్యుడగు అర్జును డొకదిక్కుననుండి వీరశూన్యమగు కురుక్షేత్రమును గాంచుచుండ యాయన మన ముస్సురనుచుండెను. ఒకటి రెండు యశ్రుబిందువులు రాలెను. అప్పుడీ క్రిందివిషయము మనమునకుదట్టెను.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ
నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం।
త్యక్త్వోత్తిష్ఠపరన్తప

తా॥ అర్జునా, భయమును జెందకుము. ఇదినీకు యుక్తముకాదు. పరంతపా, తుచ్ఛమైన యీయ ధైర్యమునువీడి యుద్ధముచేయుటకులెమ్ము.

అప్పుడర్జునుడు సమరక్షేత్రమును బరికించిచూడ యందొక యోధుడుగన్పడెను. ఆశ్చర్య మొందెను. క్షత్రియకుల మెల్ల నాశనమొందియుండ నీత డెవ్వడని దలంపుచు నావీరవరుని సమీపించి నీవెవరు అని ప్రశ్నించెను.

వీర వేషముననున్న నాత డిట్లనియె. నాపేరు నిపాననాకుమారి. అభిజిత్కుమారునకు నేనువాగ్దత్తను.

ఆమాట వినినంతనే యభిజిత్కుమారుని శౌర్యసాహసములాయన మనమునకు దట్టెను. అభిజిత్కుమారుడు తనపార్శ్వమందుండి యనన్యసామాన్యమగు వీరత్వమున యుద్ధమొనర్చుటయు, కర్ణుని సునిశితబాణ పరంపరల నాతని యెడమ చేయి తెగిపోవుటయు, అప్పుడుగూడ నాతని ముఖమండలము సుమధుర మందహాసమున మండితమగుచుండుటయు, ధనువును కాలితో దొక్కిపట్టి నాతడు బాణపరంపరల శత్రుసైన్యముల నురుమాడుటయు, కర్ణుని శరాఘాతమువలన నాబాలుని విల్లువిరుగుటయు, వెంటనే యభిజిత్కుమారుడు నొంటిచేతనే కరవాలమును ధరించి ప్రళయకాలరుద్రునిబోలి శత్రుసైన్యముల చించి చెండాడుచుండ సైన్యనివహముల యాక్రందన ధ్వనుల విని కర్ణుడు సునిశితసాయకమున నభిజిత్కుమారుని తలనరక మొండెమొకచోటను తలయొక చోటను బడుటయు, యోధులు గండము దప్పినదని హుంకారములుచేయుచు నాతనిశరీరముమీదనుండి నడచుట మొదలగువిషయములు కన్నులకు బొడగట్టినటులయ్యెను. అంగువలన నర్జునుడు నిమేషకాలము నిర్విణ్ణుడై యుండి నిపాననాదేవిని చూచియిట్లనియె. "కుమారీ పద నీభర్తదేహ మెచటనున్నదో చూతము"

ఇరువురును వరానముగ యుద్ధక్షేత్రమందు నైరుతిదిక్కున నడచుచుండిరి.

మార్గమధ్యమున శ్రీకృష్ణు డెదురై నిపాననాకుమారినిచూచి యర్జునునితో డనిట్లనియె. ఈతరుణీమణి యెవ్వతె. ఏవీరుని గృహమందు బుట్టినది. ఈమెను చేబట్టిన వీరోత్తముండెవ్వడు.

అర్జునుడు:— కృష్ణా? ఈమె వీరశ్రేష్ఠుడగు అభిజిత్కుమారుని వాగ్దత్త. పేరు నిపాననాదేవి. అభిజిత్కుమారుని గాంచ నిటకువచ్చినది.

శ్రీకృ:— అభిజిత్కుమారు డిహలోకమునువీడి పరలోకమందున్నాడను విషయము తెలియదా!

అ:— తెలియును. ఆతని పవిత్రశరీరమును చూడగోరుచున్నది.

శ్రీ:— (పకపకనవ్వుచు) కుమారీ? అభిజిత్కుమారుని దేహమునుగైకొని యేమిచేయుదువు? ఆదేహమునకు మస్తకములేదు. హస్తములు దెగిపోయినవి. వికృతమై కుళ్లుచున్నది.

నిపాననాదేవి:— (శ్రీకృష్ణుని ముఖకమలమును నిరీక్షించుచు నిమేషకాలము నిర్విణ్ణయైయుండి) తామెవ్వరు?

అర్జునుడు:— కుమారీ! ఈతడు యదుకులపతి యగు శ్రీకృష్ణుడు.

ఆమాటవినినంతనే యామె శ్రీకృష్ణునకు సాష్టాంగ దండప్రణామం బాచరించి లేచి నిలచి నెమ్మదిగ నిట్లనియె. "యాదవకులపతీ? నేనావీరవరుని శరీరమును గాంచి ధన్యనగుటకు నిటకు వచ్చితిని. అంగహాని గలిగినంత మాత్రమున వీరుని మహత్త్వ భంగము వాటిల్లునా?

కృ:— (నవ్వుచు) కుమారీ? నీవు చెప్పినది యదార్థము.
కాని యీజ్ఞానము నీ కెచ్చటలభించినది?

నిషా:—(సగర్వముగ) క్షత్రియపుత్రికకు—సుక్షత్రియుని ప్రేమించిన వనితకిది స్వత సిద్ధము. అస్తిమజ్జాగతము. కృష్ణార్జును లిర్వురీ జ్ఞానమున కానందించిరి. పిమ్మట నాముగ్గురును అభిజిత్కుమారుని సమీపించిరి. అప్పు డర్జును డిట్లనియె "కుమారీ! అదిగో? వీరాగ్రగణ్యు డగు అభిజిత్కుమారుని మృతదేహము. అట్టిమహావీరుని యంకమున ధరించుటవలన నేటికిగదా! పృథ్వి పవిత్రమైనది? నీవు మహాధన్యురాలవు. ఆమహావీరుని వరించుటవలన.

నిషాననాకుమారి ప్రత్యుత్తరమీయలేదు. ఆమె యందలి సుకుమార కోమలమగు నారీత్వము మేల్కొనెను. వెంటనేయామె యాశరీరమును కౌగలించుకొని కన్నీరు విడువజొచ్చెను.

శ్రీకృష్ణుడు మౌనముగ నాదృశ్యమును జూచుచుండెను.

అర్జునుడు:— (నేత్రముల నీరుగ్రమ్ముచుండ) సఖా? నిషాననాకుమారికి శాంతినొసంగుము. ఆమెను భర్తకడ కనుపుము.

శ్రీకృ:— (అర్జునుని వెన్నుజరచి) వీలులేదు.
అనయర్జునుడు చిన్నబుచ్చుకొనెను.

కొంతవడికి నిషాననాదేవి శోకవేగ మెుకింత తరిగెను. కటిప్రదేశమందున్న మణియుతమండితమగు ఖడ్గమును లాగి వక్షస్థలమునబొడుచు కొన యత్నించెను. వెంటనే చతురశిఖామణియగు శ్రీకృష్ణుడు ఆమె చేయిబట్టుకొని యిట్లనియె. కుమారీ ఏమిచేయుచున్నావు.

ఆమె యీయాటంకమువలన శోకదగ్ధ్వాగ్ని శిఖవలె మండిపడుచునిట్లనియె. కృష్ణా? సతీధర్మమును నడ్డగింపకుము. చేయివిడువుము. నేను మహావీరుని యనుగమించెదను.

శ్రీకృ:— ఎందుకు?

నిషాననా:— (కోపమున) నీకు తెలియదా! శ్రీకృష్ణా! యదుపతీ? పతిలేని నారీజీవితము వృథ. క్షత్రియకుమారి మరణించుటకు జంకునా! ప్రియుని కొరకు నవ్వుమునవ్వుచు అగ్నిహోత్రమున దుముకుటకెప్పుడు సంసిద్ధమై యుండును.
ఈ మాటల కర్జునుడు సంతుష్టచిత్తుడాయెను.

శ్రీకృ:— కుమారీ! నీమీద నాకు మిక్కిలి ప్రీతిగలిగినది. కాని యీజ్ఞానమును నీ వెచ్చట పొందితివి?

నిషాననా:— (నిరసనగ) ఈజ్ఞానము నభ్యసింపవలయునా? క్షత్రియకుమారికి? నేను వీరుని పుత్రికను. వీరశ్రేష్ఠుని పత్నిని—

శ్రీకృ:— కుమారీ? నీవు వీరశ్రేష్ఠుని పుత్రికవు. మహావీరుని భార్యవు. కాని వీరోచితము కాని యీ కార్యము చేయుటకు కారణ మేమి? ఆత్మహత్య వీరధర్మమా?

ఈమాటలు వినినంతనే నిషాననాదేవి నిర్విణ్ణయయ్యెను. ఆమె నోటనుండిమాట వెడలకుండెను. నూతనవిషయ మామెకు గోచరించెను.

శ్రీకృ:— అభిజిత్కుమారుడు వీరశ్రేష్ఠుడు. పరోపకారముకొరకు, ధర్మరక్షణనిమిత్తము ధర్మక్షేత్రయుద్ధమున ప్రాణములర్పించి యక్షయ స్వర్గమును బొందినాడు. కుమారీ? అట్టి మహావీరుని ప్రేమించిన నీవు భర్తను కలుసుకొనవలయునను స్వార్థపరత్వమునకు లోబడి యాత్మహత్యయను అధర్మమునకు పాల్పడెదవా? ఇందువలన స్వర్గము లభించునా? ఆత్మహత్యవీరధర్మమా?

నిషాననాదేవి శ్రీకృష్ణుని విలోకింపుచు మౌనముగనుండెను. శ్రీకృష్ణుడు నిమేషకాలము మౌనముగనుండిస్నేహపూరితస్వరమున నిట్లనియె.నిషాననా? రా? అభిజిత్కుమారుని తోడగలయుటకు మార్గమును జూపుదును. అతనికి సహధర్మిణివిగ విలసిల్లెదవు.

నిషాననాదేవి కృష్ణార్జునులతోడ పాండవ శిబిరమును బ్రవేశించెను. అప్పుడు ద్రౌపదీదేవిని బిలచి శ్రీకృష్ణుడిట్లనియె. ఈమె నిషాననాకుమారి. అభిజిత్కుమారుని వాగ్దత్త. ఈమెను నీకడనుంచుకొనుము.

ప్రేమతోడ ద్రౌపదీదేవి నిపానవాదేవి హస్తమును బట్టుకుని తన మందిరమును బ్రవేసించెను. అప్పుడు ద్రౌపదీదేవి యామె వీరవేషమును దీసివైచి స్త్రీ వేషమున నలంకరించెను. కాని నిపానవాదేవి మృతునిబోలి యేవిధమగు ఆసక్తినిగాని అనాసక్తినిగాని దెలుపక మౌనముగనుండెను.

మరు దినమున శ్రీకృష్ణునిచూచి ద్రౌపతీదేవి యిట్లనియె. ప్రభో? కుమారి మిక్కుటమగు మనోవ్యథ నొందుచున్నది. ఆమెకానందమునుగలిగించుము. లేని యెడల నామె మరణించుట నిక్కువము.

కృష్ణుడీ విషయమును చిరునగవు తోడవినుచుండెను.

ద్రౌపదీదేవి యొకింతవడి మౌనముగ నుండి యిట్లనియె" ప్రభో? నాదొక్కమనవి. మీరు నిపానవాదేవిని గ్రహింపుడు. మీరు వివాహమాడిన యెడల నామె ధన్యురాలగును.

శ్రీకృ:— నిపానవా కుమారి నన్ను బ్రేమింప జాలదు.

అను మాటలు విని ద్రౌపదీదేవి చిన్నబుచ్చుకొనెను. అంత శ్రీకృష్ణుడు నిపానవాదేవి యున్న మందిరమును బ్రవేశింప నామె యుదాసీన భావమున గూర్చుండి యుండెను. ఆమె కనురెప్పలు వాలయుండెను. చేతులుకాళ్ళు అధీనముదప్పిపోయెను. శరీరమున ప్రాణశక్తి సంచారమునణగినట్లుండెను. అప్పుడు శ్రీకృష్ణుడిట్లనియె. నిపానవా?

ఈపిలుపునకు నిపానవాదేవి మరి యొకజగత్తునుండి క్షీణస్వరమున నిట్లనియె. ఎవరు?

శ్రీకృ:— (సస్నేహమున) ఏమిచేయుచున్నావు?

నిపానవా:— కూర్చున్నాను.

శ్రీకృ:— నిపానవా? అభిజిత్కుమారుని సందర్శించెదవా? ఆ తడెట్లుండునో గాంచెదవా?

ఆమాట వినినంతనే నిపానవాదేవి శరీరమందంతటను ప్రాణశక్తి బ్రవహింపజొచ్చెను. నేత్రములు విప్పారెను. అప్పుడామె యాతురతతోడ «ఉపరతకరించు నాకేమి కావలయును? ప్రభో? శ్రీకృష్ణా?

శ్రీకృ:— (ముసిముసి నగవులతోడ) నీవు చూడదలచినది జీవితుడగు అభిజిత్కుమారునేనా, లేక అభిజిత్కుమారునిమృతశరీరమునా?

నిపానవా:— (సర్దుకునికూర్చుండి యాతురతతోడ) మృతుని దేహమునుగాంచితిని. సజీవి యగు రాకుమరుని చూడవలయుననియున్నది.

శ్రీ:— ఆతని కిప్పుడు దేహము లేదు. జీవితచ్ఛాయ మాత్రము గనపడును. దానితోడ సంతుష్టి నొందుదువా?

నిపానవా:— (సగర్వమున) ప్రభో? క్షత్రియ స్త్రీ దేహమును బూజించునా? ప్రాణశక్తిని బూజించును.

శ్రీకృ:— నీ ప్రత్యుత్తరమున కానందము గలుగుచున్నది. ఈ రాత్రి నీకభిజిత్కుమారుని దర్శనము లభించును. (అనినిర్గమించెను)

నిపానవాదేవి యచ్చటనే యుండెను. ప్రొద్దు గ్రుంకెను. అంధకారము గ్రమ్మెను. ఆ యంధకారమందే యామె మౌనముగ గూర్చుండి అభిజిత్కుమారుని సందర్శనముకొరకెదురు చూచుచుండ నామెయంగ ప్రత్యంగము లణుమాత్రమైనను కదలకుండెను. మనోప్రాణములు చంచల రహితములాయెను. అప్పుడామె స్థిరదృష్టి తోడ నాయంధకారమును గాంచుచుండెను.

ఆ నిబిడాంధకారము క్రమక్రమముగ తరుగజొచ్చెను. కొంతవడికి మేఘముల వలననడ్డగింపబడిన చంద్రాలోకమునుబోలి వెలుతురాగదియందంతటను గ్రమ్ముకొనెను. నీలమేఘ చ్ఛాయను మించు నా కాంతి స్పర్శ మృదు మధురమై యుండెను. కాని యావెలుతురు నందుదేనిని బాగుగ చూచుటకు వీలులేకుండెను.

క్రమముగ నావెల్తురుజ్వలమై ప్రకాశింపజొచ్చెను. అప్పుడందలి నీలమేఘచ్ఛాయ క్రమక్రమముగ పలుచన యగుటవలన శుభ్రకాంతులు పరిస్ఫుటమాయెను. ఆ దివ్యకాంతుల వలన నామందిరము స్వచ్ఛము—స్వచ్ఛతరమై— స్వచ్ఛతమమగుస్ఫటిక

రూపమును దాల్చెను. దానియందు నదీనదములు— పర్వతారణ్యములు— వికసింపజొచ్చెను. ఆదృశ్యమంతయుదూరము— అనంత దూరమువరకు క్రమముగ వ్యాపించి జగత్తంతయు నయన గోచర మాయెను. ఆస్వేతకాంతులు స్వచ్ఛతమములై యనంతము నందు సంగమింపుచుండెను. ఆ దివ్యాలోకమునందు జగత్తంతయు సుందరమై—సుందరతరమై—సుందరతమమై యలరారజొచ్చెను. ఆ సౌందర్యమును గాంచుచు, అందలి మాధుర్యమును గ్రోలుచు నిపానవాదేవి పరవశ యగుచుండెను.

అప్పుడు "నిపానవా! నన్ను చూడుము." అనుమాట వినబడెను. వెంటనే నిపానవా దేవి నేత్ర విస్ఫారిత మొనర్చిదిలకింప, ఆయనంత కోటి బ్రహ్మాండముల యందంతటను నిండియుండు సౌందర్యమును కేంద్రీభూత మొనర్చుకొని లావణ్యయుతుడై ప్రకాశించు అభిజత్కుమారుడు సమ్ముఖమందలరారజొచ్చెను. కోటిసూర్య ప్రభల ధిక్కరించు నా దివ్య తేజోమయమూర్తిని సందర్శింపుచు నిపానవా దేవి మైమరచి యుండెను.

"నిపానవా! నేను. నీకొరకు వచ్చినాను." అనినుడువుచు అభిజత్కుమారుడు ఆమెమస్తకమును స్పర్శించెను. ఆస్పర్శవలన నిపానవాదేవి శరీరమందలి ప్రతియొక్క యణువు నుండియు విద్యుచ్ఛక్తి పొంగిపొరల సాగెను. నిపానవాదేవి విహ్వలచిత్తమున నాతని సందర్శింపు చుండ అభిజిత్కుమారుడామెవామ పార్శ్వమందు గూర్చుండెను.

అభి:—నిపానవా? నీకొరకు వచ్చితిని. చెప్పదలచిన దానిని చెప్పుము.

కాని నిపానవా దేవి చెప్పున దేమి? చెప్పదలచినదేమి? అయినను మిక్కిలి కష్టముమీద అక్షరముల లెక్కింపుచు ఇట్లనియె. ఆ — వీ — ర — శ్రే — ష్ఠా? దర్శ— న— మొసం— గితివా?

నిశ్చేష్టితుడైయున్నయభిజత్కుమారుని పార్శ్వమందు వీరకుమారి నిస్తబ్ధయైయుండెను. జగత్తంతయు స్తబ్ధమై యామహాదృశ్యమును దిలకింప సాగెను.

అభిజిత్కుమారుడు నిపానవాదేవిమస్తకమును నిమురుచుండ నిపానవాదేవి శరీరమందలి ప్రతియణువు నుండియు ఆనంద ధారలు బుట్టి పొంగి పొరల జొచ్చెను. జగత్తంతయు నాయానందల హరి యందు మునిగి తేల సాగెను.

ఆయానందసాగరమున నిపానవాదేవి విలీనమైనకొలదిని యామె చైతన్యము లోపింపు చుండెను. అభిజత్కుమారుని యంకమున బడిపోయెను. అప్పుడభిజత్కుమారుడు జాగ్రత్తగ నామెమస్తకమును తన బుజముమీద నానించు కొనెను.

ఒకటిరెండు నిముసములు గడచిన పిమ్మట అభిజిత్కుమారు డిట్లనియె. "నిపానవా? నేనేగుచున్నాను"

నిపానవా:— (కన్నులు దెరచి చూచి) వీరాగ్రణీ? ఏట కేగెదవు?—

అభి:— నాస్థానమునకు నేనెగుదును.

నిపానవాదేవి వెంటనే యభిజిత్కుమారుని హస్తమునుగట్టిగ పట్టుకొన యత్నించి పట్టుకొనజాలక తనచేతిని తానుగట్టిగపట్టుకొనెను.

అభి:—నిపానవా? నన్ను నీవు బట్టుకొన జాలవు. నే నశరీరిని.

ఆమాటవిని నిపానవాదేవి తనప్రయత్నమును మానెను.

అప్పుడు అభిజిత్కుమారుడు నిపానవాదేవి మోమునుతన వైపునకు ద్రిప్పుకొని ప్రేమపూరిత చుంబనముల నిట్లనియె. "నేనెగుచున్నాను. నిపానవా?"

ఆ చుంబనమువలన నిపానవాదేవి మైమరచెను. ఆమెచక్షు— కర్ణపదాదులుమృతునిబోలి క్రియాశూన్యతనుగాంచెను. ఆమెమాటలాడ జాలకుండెను. అభిజిత్కుమారుడటనుండి మెల్లగ నిష్క్రమించెను. జగత్తంతయు ఘోరతరాంధకారమున మునింగెను. అనేకదినములు గడచినపిమ్మట నిపానవాదేవి మితిలేని బడలికతోడ నిద్దుర బోయెను.

సూర్యోదయ మాయెను. జగత్తునావరించిన యంధకారము దొలంగెను. అప్పుడు శ్రీకృష్ణుడు

నిపాననాదేవి మందిరము ప్రవేశింప ఆమె లేచి నిలచి సాష్టాంగ దండప్రణామంబాచరింప శ్రీకృష్ణుఁ డుచిరునగవున నటనుండి మరలెను. కాని యాదిన మంతయు నిపాననాదేవి హృదయమందా నగవు ప్రతిబింబితమై యలరారజొచ్చెను.

నిపాననాదేవి మరుసటిదిన ముదయమున పుష్పచయన మొనర్చి శ్రీకృష్ణుని మందిరము ప్రవేశించెను.

అచ్చట నవరత్నమండితమగు సింహాసనము మీద శ్రీకృష్ణుఁడు విరాజిల్లుచుండెను. సఖులాతని చుట్టుచేరి పుష్పమాలల నలంకరించు చుండిరి. నిపాననాదేవి శ్రీకృష్ణుని పదములపై పుష్పము లర్పించి నమస్కరించెను. శ్రీకృష్ణుఁడు ముసిముసినగవున దక్షిణహస్తముతోడ నిపాననాదేవిమస్తకమును స్పర్శించెను. ఆమెశరీరము గగుర్పొడిచెను.

అప్పటి నుండియామె ప్రతిదినమును పుష్పచయన మొనర్చి వానిని శ్రీకృష్ణుని పదముల యందర్పించి నమస్కరింపు చుండెను. ఆమెకిప్పుడుదుఃఖములేదు— శోకమునెరుంగదు. ఆమె సంతసమున—నిరంతర సంతసమున— నానందమయియై యలరార జొచ్చెను. సఖీగణము నవజలధర కాంతియుత పుష్పముల నేరితెచ్చి మాలలుగ గ్రుచ్చివానిని శ్రీకృష్ణుని మెడయందు వేయుచుండిరి. చేతులకు గట్టుచుండిరి. శిగకు తురుముచుండిరి. ఆపుష్పములతోడ కిరీటమునుజేసి దానిమధ్య నెమలియీకల బెట్టిదానినితలకుబెట్టుచుండిరి. వైడూర్యమణులతో నలరారుకుండలములను చెవులతగిలింపుచుండిరి. కానిదానిమీద నన్యపుష్ప గుచ్ఛములను గ్రుచ్చుచుండిరి. ఒక్కొక సఖి యొక్కొక పుష్పమాలను గుచ్చియాయన మెడయందు వైచు చుండెను. ఒక్కొక సఖివేయు పుష్పహారమొక్కొక విధముగ నుండెను. కాని నిపాననాదేవి మాత్రము పదపద్మముల పుష్పములతోడ నలంకరించి నమస్కరించి వచ్చు చుండెను.

ఒకదినమున నిపాననాదేవి యరవిచ్చిన మల్లెమొగ్గల హారమును సంసిద్ధమొనర్చి యొవరులేని సమయమున శ్రీకృష్ణుని మెడయందు వేయవలయుననిదలచెను. నిపాననాదేవి నేడెవ్వరినో ప్రేమించెను. కానియాత డెవ్వడో?

నిపాననాదేవి శ్రీకృష్ణుని సమీపించి పుష్పహారమునుచే ధరించి గూర్చుండెను. శ్రీకృష్ణుఁడు మందహాసమున నామెనుజూచుచు నిట్లనియె. నిపాననా? పూలహారమును నొసంగ వేమి?

నిపాననాదేవి ప్రత్యుత్తర మీయలేదు. ఇచ్చుటకు ప్రయత్నింపలేదు. లజ్జవలన నామె ముఖమండలమురక్తరాగరంజితమాయెను. ఆమె యొకింతవడివఱకు మూగ నుండి యిటునటుచూచి శ్రీకృష్ణునకు నమస్కరించి పలాయన మాయెను.

అప్పటినుండియు నామె మనమేటులనో యుండెను. కారణము మాత్రము తెలియదు. ఆ యానందము— ఆ మధుర భావము— ఆ తన్మయత్వము మొదలగునవి దొలంగెను. కేవలమతృప్తి— చిరాకు— మొదలగువాని తోడ కొన్ని దినములు గడచెను.

ఒకదినమున పుష్కరిణియందు స్నానమొనర్చుటకేగి వికసించిన కహ్లారముల గాంచి సంతసమున నీలమేఘశ్యాముని శరీరముమీద నీ పుష్పము లుండిన యెడల నెంతయు మనోహరముగ నుండునని దలచెను. వెంటనే యాపద్మముల గొన్నిటి సంగ్రహించుకొని గృహమును జేరెను.

ఆ వికసించిన పద్మములతోడ మాలను రచించు నప్పుడు అభిజత్కుమారుని సుందర వదనారవిందము గోచరించెను. ఆ మాల నాతని కంఠసీమ నలంకరింపవలయునని దలంచెను. కాని యభీష్టదేవునికై సంసిద్ధమొనర్చిన మాలను ముందుగా తానుధరింపవలయునని యనుకొనెను.

ఇట్లుభావింపుచు నిపాననాదేవి శ్రీకృష్ణునికొరకుద్దేశింపబడిన పూలహారమును అజ్ఞాతముగ తానలంకరించుకొనెను. కాని యొక్క ముహూర్తకాలములో తెలివిదెచ్చుకునిలజ్జించెను. అనుతప్త హృదయయాయెను. ఉచ్ఛిష్ట మాల్యమును భగవానున కర్పించుట

పాడిగాదనుకొనెను. కానికాలము గడచెను. కృష్ణుని పూజించుటకు మాలయేదీ?

శ్రీకృష్ణుని విషయము స్ఫురించినంతనే యామె మనమందలి తర్కవితర్కము లంతరించెను. వెంటనే హారమును గైకొని మందిరమున కేగెను.

ఆ దినమున శ్రీకృష్ణు డొంటరిగ మణిమయసింహాసనముమీద నాసీనుడై యుండెను. నిషానసాదేవిని చూచినంతనె చిరునగవున నిట్లనియె.

“నిషానసా? ఇంతయాలస్యమేల?

నిషాన:— (తలవంచి) ప్రభో? నేనుమహా పాపమొనర్చితిని.

శ్రీకృష్ణుడు (విస్మితుడై) మహా పాపమా! ఏమిచేసితివి.

నిషా:— ( చేతియందలి పుష్పహారమును జూపుచు ) దీనిని నేను ధరించినాను. అందువలన తమను పూజించుటకు నాకడ నేమియు లేదు.

ఆమాటలకు శ్రీకృష్ణుడు సింహాసనమును వీడి క్రిందకువచ్చి నిషానసాదేవి హస్తమును ధరించి యిట్లనియె. “ఇంతవరకును నీవొసంగిన పుణ్యమాలలను గ్రహించిన నేను, పాపపుమాలనుగూడ గ్రహింపవలదా? దానిని నాకిమ్ము. ధరించెదను.

నిషానసా దేవి కృతజ్ఞతా సూచకముగ మాలను శ్రీకృష్ణుని కంఠసీమ నలంకరించెను. వంగి మాలను దాల్చు శ్రీకృష్ణుని మస్తకము నిషానసాదేవి మస్తకమునకు తగిలెను.

ఆస్పర్శవలన నిషానసాదేవి సర్వాంగములు స్వాధీనము దప్పెను. హస్త పదాదులు ప్రాణ విహీనము లాయెను. రక్తము నందలి వేడిమి తరిగెను. అందువలన నామె క్రిందబడి పోయెను. ఆ దృశ్యమునుజూచి శ్రీకృష్ణుడు నవ్వెను. పడిపోయిన నిషానసాదేవిని లేవదీసి కౌగలించుకొనెను.

అందువలన నామె శరీరమందు రక్తము ప్రవింప జొచ్చెను.

ఆయాలింగనము వలన—ఆచుంబనము వలన—నామెకు తిరిగి ప్రాణము వచ్చెను. తీవ్ర జ్యోతి వలన నిషానసా దేవికి స్వప్నభంగమాయెను.

ఆమె లేచి కూర్చుండెను. ఆమె కుమారి గాదు, వాగ్దత్తయు గాదు. అభిజిత్కుమారుని భార్య. నేను కౌశాంబి యువరాజు అభిజిత్కుమారుడు గాదు. త్రిలోకాధిపతియగు శ్రీకృష్ణుడు. ఆ శ్రీకృష్ణునినుండి నిమేష కాలమున లక్షలు, కోట్లు, అక్షౌహిణీల అభిజిత్కుమారులును, లక్షలకొలది నిషానసాదేవులును బుట్టుచున్నారు. ఆ కుమారి కుమారులు గలయుచుందురు. తిరిగి శ్రీయంగమున సంగమింపుచుందురు.

శ్రీకృష్ణుడే యభిజిత్కుమారుడు. అతడే నిషానసా కుమారి సఖుడు. పతి. ఈ జగత్తునకు పతి శ్రీకృష్ణుడు.

( అనువాదము. )



# సర్వమధురకృతి ప్రశంస

(చింతలపాటి వెంకట శ్రీరాములు గారు. బి. యే., యల్. టి.)



సర్వమధురమను నది అచ్చ తెనుఁగు కావ్యము. ఇది మహాకవి మలుగు పాపయారాధ్యులచే రచింపఁబడినది. ఈయనకే సంగమేశ్వర శాస్త్రి యని నామాంతరము కలదు. ఇక్కవి తల్లజుం డమరావతీ పురాధీశ్వరుం డగు శ్రీవాశిరెడ్డి వేంకటాద్రినాయని యాస్థానమున నుండి, సంస్కృతాంధ్ర భాషలయందు దనకుగల యనన్యసాధారణ పాండితీ గరిమ లోకుల కెరుకపడ, గీర్వాణభాషాప్రబంధములను, మిశ్రకావ్యములను, అచ్చ తెనుంగు పొత్తములను శతాధిక సంఖ్యముగ రచించి ప్రస్తుతికెక్కెను. యీకవివరేణ్యుఁడు తాను రచించిన గ్రంథములఁ గొన్నింటి గురించి తన వేమనారాధ్య చరిత్రంబులో నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

సీ॥ పదపదార్థ నిబంధ బంధురంబుగ ధరా
తలమెల్ల నెఱుఁగ శంతను చరిత్ర
సరస శృంగారాను షంగముల్ రవణిజా
పఁగ నహల్యా వధూ పరిణయంబు
ధీమజ్జనస్తవ్య ధీమజ్జనోన్మేష
కరముగా నలరు ఘూర్జర చరిత్ర
లస దలంకార లాలసవిశంకటముగాఁ
బరగు నిరింద్రాత్మజా పరిణయంబు
గీ॥ శతక పూజాస్తవంబులే సంఖ్య, సంఖ్య
మీఱ శివప్రసంగించు మేలికావ్య
రచనమాకెల్ల సమ్మదార్థిత బొనర్చె
సరస రుచిసాంద్ర! సంగమేశ్వర కవీంద్ర!

ఇయ్యనఘుండు శివపూజా ధురంధరుఁడనియు, పరదేవతోపాసకుండనియు, బ్రహ్మవిద్యాపారంగతుఁడనియుఁ దెల్పుగాథ లనేకములు గలవు. ధారాశుద్ధిగలిగి, మృగు మధుర ఫణితినెసంగి, రసోచితములగు కల్పనలతో నొప్పారు నిమ్మహాకవి గ్రంథముల వెలువరించుచున్నందులకుఁ బ్రకాశకులగు ములుగు వీరభద్రశాస్త్రిగారికి నాంధ్రలోకమంతయుఁ గృతజ్ఞులు.

వరంగల్లులోని శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి, పాఠలోకమునకందఁజేయఁబడిన, సర్వమధురకృతి ప్రశంసయే ప్రస్తుత వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. గ్రంథనామమునుబట్టి యందలి కథ నూహింపవలనుగామి, తత్కథను సంగ్రహముగ దెల్పి, కవితాధోరణిని బరిశీలించి, యే తత్ప్రణేత తన కృతికి సర్వమధురమను నామమిడుట యెట్లు సమంజసమని తలంచెనో తెలిసికొనఁ బ్రయత్నము సల్పబడును.

కథాసంగ్రహము:—ఒకతరిఁ బదరికావనంబునకు విచ్చేసిన మునిశ్రేష్ఠులందరు, తమ డెందంబులు గోవిందునందు బొందుపడ

పుండరీకాక్షుని పుణ్యచరిత్రంబులు విన గుతూహలులై, 'నిఖిలపురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండగు' సూతుం జూచి,

క॥ శ్రీమతియను రాచూలిం
దామరవిరిగంటి కేలుతమ్మిం గొనెనం
చేమో వింటిమి తెల్పుమి
యా మెతగద డెందములకు నామెతలంపుల్॥

అనుటయు "నాల్గవకోలంపు గతలవి న్నాణో" యిట్లని చెప్పందొడంగె.

సరయూనదీతీరంబునందు సకలసంపదల కాటపట్టయి, పరయోధుల కసాధ్యయగు నయోధ్యయను పురవరంబొండు గలదు. ఆనగరీ లాలమ తనకు రాజధానిగా నంబరీషుండను రాజోత్తముండు నిజకీర్తిచంద్రికలు దెసలవెలుంగఁ బ్రజలధర్మమార్గంబునఁ బరిపాలించుచుండె. ఒక్కనాడా నృపమౌళి నిండు పేరోలగంబున నున్నయెడ వాసవాలుం దొరల్, తటకాపాటున వచ్చి రచ్చటికి నెల్లారుం దమ్ముం జూడఁగన్॥ అంత నారాజచంద్రుండు, భక్తితో వారికెదురేగి, యర్ఘ్యవిధులఁ బూజించి, తోడితెచ్చి, యుచితాసనములనుంచి, కుశలసంప్రశ్నంబు గావించె. పరితుష్టస్వాంతులై

చ॥ తపసులు పల్కి రప్పుడమి దాలుపుతో నొడయఁడ
నీవురా। నెపమగు తమ్మికంటివి, యనింబగరంబని
దీప్పటించితెకా। కిపుడర లేకలోఁ బగఱనెల్లఁగలం
చితి పబ్బురంబుచా। గపుసిరులన్ యసంబెనసి
కాంచితి తొల్లిఁటిరాలతో నెవన్॥. కాని

గీ॥ పాలమున్నీటి యల్లునిఁ బట్టఁబట్టి।
కేలనొక విరియ వ్రేల్పు కాలిమీఁద।
నిడ్డవానికి వేలుపు గిడ్డి దొడ్డి।
గిడ్డియగు, చావుపుట్టుల జిడ్డుదలఁగు॥

మఱియు

ఉ॥ ఒండొకజోలిమాలి, మదినొయ్యనఁదాలిమి సంత
రించి, పూ। చెండులఁబోలు నెన్నడులచే, సిరి
పెన్మిటి నాడిపాడి పె। న్గొండలవంటి బన్నములు
గొట్టి, తుదం, జెడనుండు నింటిలో। బండుటఁ
జెందుకల్మిసని పండుట యెంతవచ్చు నేరికిన్॥

అని యానతిచ్చి యా జడదారులు జనుటయు, వారి వచనంబులు మనంబున నిడికొని, శిథిలంబులగు దేవళంబులఁ జక్కజేసి, యూరూరఁ గ్రొత్త కోవెలలఁ గట్టించి, విప్రులఁదనుపుచు, నేకాదశీవ్రతంబు మిగుల నియమంబుతో జరుపుచు,

కం॥ ఎన్నియొ యెన్నని నేమము
లన్నియుఁ గడముఁబడనీక, యరసియరసి తాఁ
నన్నియొనర్చెను, నెల్లా
రెన్నఁగ, నయ్యెడయఁడొచ్చె మెరుగ నిబత్తిన్

అంత విష్ణుమూర్తి ప్రసన్నుండై సాక్షాత్కరించి.

శా॥ చుట్టుంగైదువు నీకుఁ దోడగుచు నిల్చున్
వాసవాల్గుంపుచే
దిట్టుల్ సేరగనీక, నెప్పగరగ త్తిన్ సోకనీకల్లడన్
మట్టుల్ మీరగ రానిరుల్ గురియుచున్
మంచుంబలెన్ బన్నముల్
బోక్టేడుల్లఁగఁ జేయుచున్ బవలురే
ల్పాల్పొందు నాయానచే

అని అంతర్ధానంబు నొందెను.

యిట్లు చక్రసహాయంబున నఖండమహీచక్రంబు ధర్మమార్గంబునఁ బరిపాలించుచున్న యా పుడమిరేనికి శ్రీమతియను పుత్రిక జన్మించెను. ఆబాలిక జనకునింట నెల్లారు ముద్దునాఁ బెరుగుచు, తనతోడి వయస్యలగూడి యాడుచు, యౌవనప్రాదుర్భావమగుదు, విరాగుల విరాళిం గొలుపఁజాలియుం

డెను. కాని యంబరీషుంజూచు నెపంబున, తన సౌందర్యమూర్తి నవలోకింపఁ జనుదెంచు రాచకుమారుల నేరింగోరక.

మ॥ తలిదండ్రుల్ గడుదాల్మి నిచ్చలును డెందంబుల్ మరుల్గొల్పవ
ప్పలుగుంతత్తడికొని బత్తిమెయి గొల్వ్వల్ సేయ దానుఁ నీరిఁ
వలపుల్ గొల్పెడి సామి సేతలఁతల్ వక్కాణముం జేయఁగాఁ
జెలి వేవీనులనించి నించితమి బెంచెన్ వెన్నునిం జేరఁగన్

క॥ తొల్లిటి నోమెట్టిదయో
యుల్లం బత్తమ్మికంటి యొద్దనేచిక్కన్
మల్లడి గొనినిచ్చలు, నెల
చెల్లెలికిన్ సవతిదనముఁజెందుదుననుచున్

యిట్లా నృపతిపుత్రి యింతింతనరాని తమకంబున, తాలిమిదూలి, జాలింబడి, విరాళిగొని దినంబులు వేగించుచున్నంత, సంప్రాప్తయౌవనయగు కూతునకుఁ దగిన వరుండెవ్వడోయని, నానాదేశ రాజస్యకుమారుల నన్వేషించుచు, నంబరీషుండు స్వయంవరంబు చాటబంచెను.

అంత.

గీ॥ గదలివచ్చిరి పుడమినల్గడల నెల్ల
యొడలఁగాపున్న రాకూనలడల జేయు
వెడవిలుతు దెబ్బపోటుల బడలలేక
గొమ్మ గొనపండ్లుగోరిన గుజ్జులట్లు॥

రాజును, బట్టణంబు నలంకరించి, స్వయం వరాగత నానాదేశ రాజకుమారుల కుచితరీతి మర్యాదలగావించి, విడిదులఁజూపెను.

అత్తఱి భూలోకమునందలి వింతలు జూచు వేడ్కనచ్చటచ్చట జరించుచు, నారదపర్వతు లంబరీషునియొద్ద కేతెంచి, యాపుడమి యొడయండొనంగు సపర్యల బరితోషితులై సుఖాసీనులరైయుండి, వాని పెంపును ప్రాభవంబును నుతించి, భక్తిం బ్రశంసించుచున్నంత, నచటికి రతి సుందరియగు శ్రీమతి జనుదెంచుడు.

క॥ పుట్టినది మొదలు వలపుల
పుట్టెరుగని బడుగు జడలపుట్టల నయహో
కట్టడిమరు డేచుటచే
నిట్టూర్పుల కాకనింగి నేలయునుడికెన్॥

అంత విజ్ఞానమంతయు వీటిబోవ వీరిద్దరు, నానవిడి యారాజచంద్రుని తనగాదిలిపట్టినిచ్చి వివాహము జేయుమని యొకరిగాన కుండ నొకరు గోరుటయు నంబరీషుండు స్వకుమారీ స్వయంవృతుడగువానికే దన కూతు నిచ్చెదనని చెప్పి యాజడదారుల నెటులనో యొడంబరచెను. మనంబున ఘనంబగు సంతాపంబుగదుర నా తపసి దోయి యితరేతరాసూయా పరులయ్యు స్నేహంబునటించుచు నెల్లియువచ్చువారమని యారాజునకు దెల్పి కార్యసిద్ధితెర వూహించుచు నంబరయానంబునముకుందుని చెంతకేగి బైసిమాలియాదేవ దేవుని సహాయము నపేక్షించిరి. సకలదర్శిష్టుడగు నా సామియేమియు నెఱుంగనివానివాలె

మ॥ కలవేయబ్రములిట్టి వెందు నగరేకచ్చుల్ బిగంగట్టియా
కలముల్ మెక్కుచు నిచ్చ డెందములు జిక్కం బట్టిలోగాంచు న
య్యలకిట్లాట కలుంగునే? పడతి యొయ్యారంబు మెచ్చయ్యెడిన్
వలవంతల్ సరియాడుటోడువగ కా? హారెందు నిట్లాడురే॥

అని వారిచే సర్వంబును జెప్పించి స్వయంవరావసరంబున నారాచపట్టికి బర్వతుండు క్రోతిగా నగుపడునటుల నారదున కును నారదుండు కొండముచ్చువలె గాన్పించునటుల బర్వతునకును రహస్యముగ నభయంబొసంగి వారిని బుడమికి వీడుకొల్పెను.

అంతమరునాడు స్వయంవర ముహూర్తంబు సమీపించుటయు శ్రీమతి తండ్రి చేసిన బాసందలంచి కరివేల్పుకట్టడితనంబుగాదని యదృష్టమును నిందించుచు నంతిపురంబువీడి యంతికోద్యానమును జేరి, తన్నుగానక నెమకుచువచ్చిన నెచ్చెలుల గుజగుజల జెవుల జొన్పక విష్ణుమూర్తి సాన్నిధ్యమును గల్పించుకొని న్యాయనిష్ఠురంబులాడి చిత్తజుని కన్న తండ్రి చిత్తరువు బూజసేసి ‘వేవేల పుట్టువులొందినయైన జుట్టువాలు దాలుపున కిల్లాలనై చిగురులంబోలు నాసామి యంజలకడ నిలుతుగాక’ యను నంతలోన,

చ॥ చెలి యోహాయిటు మేలు వాడనయి వచ్చె
తున్ని సుంగోరి నా
తలపిట్లంట యెరుంగవే, కడిదివింతంజూపన్
నేబన్నితిన్
దలిదంద్రుల్ గరపించు సేతివలవర్గంబుగా
బోదద,
వ్వలనే గల్గ గొరంతలే లనుచున్నార్యల్ప్నింగి
మోయించినన్

ఆవాక్యంబు లాలించి హృదయంబు పదిలపరచుకొని యక్కన్నియ యుండె. మాయలమారి గట్టుదారిమాటలు నిక్కువంబులని నమ్మి నారదపర్వతులు తమ కోర్కులు కొనలుసాగునను తమకంబున నయోధ్యాపురంబు జొచ్చుటయు నంబరీషుడు వారి సవినయంబుగ నంతిపురంబునకు దోడ్కొనిచని మంగళస్నానంబు లొనరించిన వెనుక పెండ్లికుమారులకు మేలివలువలు గట్టనిచ్చి సుముహూర్తంబున కెదురు చూచుచుండెను. అప్పుడెల్లరు

సీ॥ ఎటులదాపురమయ్యె నింతికీకాపురం
బెట్టినోములనోచితే పడంతి
బడుగులెచ్చుటనుండి పట్టుకవచ్చిరో
యింతకట్టడిరేని నెరుగ నెంచట
యీతల్లి తానోర్చుటెట్లొకో కన్నులు
తెరువని కూనకీ తెర్లువాడమే
యడవిగాసిన వెన్నెలయ్యెనీవె యొయార
మయ్యయో నలువ వ్రాయునిది గలదె?
గీ॥ యనుచు నంతిపురంబు వారందరదల
నను కొనినవారు వేరు లేరైరి యపుడు
పంటనవలాము గండులో గంటగించు
ననుచు బయలు పడంగ నిర్వైరిగాని,

అంత నంతఃపుర కాంతలు శ్రీమతిని పెండ్లికూతుంగావించి చెలువమర సింగారించి యిలవేల్పులకు మ్రొక్కించి తండ్రియొద్దకు దీసికొనిరా నంబరీషుండు వచ్చిన కూతుంగని

గీ॥ సిదుచే విరిదండ యీసిగు మెచ్చు
తపసి మెడనిల్పి మ్రొక్కుమాతలీయనిన
కమనీయపుష్ప దామాభి శోభితహస్తయు
కటకకంకణములు ఘల్లురన గద్దియడిగ్గివచ్చు
కన్నియంగాంచి కారడవుల కాయకసరుల మెసవి కాలముగడుపు కటికతపసులగుంజెలు జల్లుమనెను. తత్తగొండ దొల్పు తనపాలగల డను దిండిచేయూత కొనగ నానవమోహనాంగి బంధురమందగమనంబుతో నాయారరంబుగా నాతపసదోయి యున్నయెడకుం బోయి వారిరువురి పొరపొచ్చెసరికి, చెన్నని

విన్నాణంబుచే నొకరు కోఁతిగను వేఱొకరు కొండముచ్చుగను దోఁచుడు, నాబాల భయపడి కెవ్వున కేక వేసి పరువిడి భవనంబుజొచ్చి, కవాటంబు బంధించెను. అట్టియద్భుతచర్య కెల్లరు నాశ్చర్యపడి గుజగుజలు వోవుచుండిరి. తపసులకినుకకు వెఱచి యంబరీషుండు కూతుం బుజ్జగించి తలుపుఁదీయించి భయకారణం బడుగుటయు

క॥ అయ్యా జడలయ్యల నొక
యయ్యను విరిదండవేయుమంటివి యదిసి
గ్గయ్యెడు నేలానొకరె
ముయ్యాఁగఁబలె క్రోఁతి కొండముచ్చులసుమ్మా॥

అన వెఱపుడిపి మరలఁ దిగున "నేలినవాఁడు కట్టిచెలి యేటికి యీవెఱయంచు" నాబాలలే నడుమల్లలనాడ స్వయంవరమందిరంబుజొచ్చి యాక్రోఁతి కొండముచ్చులు మధ్యఁదనయేలికసామి యగు నల్లనయ్యంగాంచి ముప్పిరిగొనుముదంబున ముందానకునడచి వనటంగుందు నిజజనకుంజూచి యయ్యా యాయడవి దిరుగుడుల నడుమ పొడకట్టు కడలి యల్లుని కంఠము కమనీయ పుష్పదామమునఁ గైసేతునని కలికి పల్కు బల్కుటయు నద్దెస సేరింగానక, కూతు వెఱ్ఱిగా దలంచి నేడు వెడమాటయకా ననుమతించెను. అంత నగ్గలంబగు వలపుతో జడదారుల చెక్కటికేఁజని

మ॥ నాయొడనుండు దరఁడయని
నారదుడాసఁగొసంగనంతలో
నాయొడనంచు బర్వతుడు
నర్మవిలిగిరుపంగ మించు మిం
చోయన చైట గుబ్బగవ
కూరనితి స్నదలంచపిరడురా
శోయక నోటి కెల్పులాను హరో
[illegible] దండచేసె

"అప్పుడు తెరగంటి ప్రమాణకొమ్మల విరిసోనలు గురిసెను." తపసులు చీకాకుపడి యాయలరుదండంగొనిన వానిగుఱుతు లెఱిగింపుమని శ్రీమతిని గద్దించి, యెల్లరాక్షసమాయగా దలంచి యంతకు గారణభూతుడగు తేసయోఱుక నశించునటుల శపించి యచ్చోటు వెడలిపోయిరి. ఆధూర్తమును లిడి చనిన శాపంబు పుడమి తేనింబొడువ తద్విమోచనమునకై యార్తత్రాణ పరాయణుండగు నారాయణుండు రక్షితామర చక్రంబగు చక్రంబు నంబ్రయోగించెను. ఆచక్రానలజ్వాలలకు వెఱచి శాపంబాబాపలఁ జేరంజనుటయు సుదర్శనంబు వారింవెంటనంటి వారెచ్చోటికేగిన నచ్చటికి జనుచు నాతేని గడప ద్రొక్కమనియు బెండ్లిమాట దలంపమనియు నొట్టుపెట్టుకొనినం విడువక వెన్నాడుచు సిలుగులఁ బెట్టుచుండెను.

అంత నచ్చట నంబరీషుండు తెప్పరిలి కన్నులు విప్పునరికి శంఖచక్ర గదాఖడ్గహస్తుండగు చతుర్భుజుండు సాక్షాత్కరించ నారాజోత్తముండు ప్రస్తుతించి తనకూఁతు నప్పనము చేసెను. అంత నాదేవుండు బ్రసన్నుడై :—

మ॥ అల్లుడనైతి సందియము
నందబనేమిక నీవు నేతనా
యుల్లముజల్లనయ్యె జెలి
యొప్పులు మెప్పొనరుంజెనంటులై
చొల్లరినోట వేల్పు దప
స్వులెడిరింతియకానినీవుమే,
లెల్లెడఁగొల్లగొంటివిక
యొద్దిఁ దలంపవఁగూర్తుబల్కుమీ॥

అని యంబరీషునితో సరసనల్లాపంబు లాడుచుండెను. మఱునాడు పాణిగ్రహణ మహోత్సవంబు జరుపుటకు నిశ్చయింపబడెను. సుముహూర్తంబున శ్రీమతి శ్రీమహావిష్ణువుల వివాహము సకలవైభవములతో జరిగిన వెనుక నంబరీషుండు కూఁతు నత్తవారియింటికిఁ బంపెను. నూతనవధూ కేళిలాలసుఁడై సర్వము మఱచియున్న నయ్యాదిదేవుకడకు నంగలార్చుచు నారదపర్వతులు జేరి.

సీ॥ మాయన్న మాతండ్రి మాయయ్య మాయప్ప
యడుగుదమ్ములదోయి విడువమయ్య
*     *     *

గీ॥ కావుమన వీడు వాఁడవుగావె నీవు
మోసపోతిమి యొక వెడయాస దవిలి
వెఱపుఁ దీరిచి డెందమీ వేపసింఁడి
తెగటు దప్పటివలె వాటుదాల్పు వేల్ప

అనుటయు వారికుయ్యాలించి చక్రంబు నుపసంహరించి మునీంద్రులకు నెఱుకగరపి వీడుకొలిపి శ్రీభూ శ్రీమతులతో సుఖంబుండె.

ఇట్టికథ నిజముగ మధురముగనున్నదని యె చెప్పవచ్చును. అంబరీషుని భక్తివిశేషము శ్రీమతి గాఢానురాగము జన్నిగట్టులతరితీ వ్రతము వెన్నుని విన్నాణము స్వయంవరవైచిత్ర్యము ఆలరిగ తపసులభంగపాటు శ్రీమతివివాహము లోనగు కథాంశములు మధురఫణితిని వర్ణింపబడినవి. కానికవి శ్రీమతివిష్ణుల వివాహఘట్టమున తంతును క్రమముగావర్ణించుచువచ్చి

“మ॥ తలఁబ్రాలోయ్యెను వెన్ను డప్పుడతికై
దార్మారుగా”

అని తెల్పి తుట్టతుదకు

సీ॥ ... ... రాపట్టిమెడను
మట్టుమీరిన తమకొల్ల బెట్టు సిరుల
నట్టునకు మేలిమగరాలచుట్టుఁగీలఁ
దట్టమగు కెంపురాగట్టు తాళిబొట్టు

ను గట్టించినారు. తలబ్రాలు వోసిన తరువాత తాళిబొట్టు గట్టుటలో దార్మారున్నదేమో?

ఇది శృంగారరస ప్రధానమగు ప్రబంధము. పూర్వలాక్షణికులు చేర్కొనిన ప్రబంధలక్షణములన్నింటిని నిరూపించుచు గలిగియున్నదనియే చెప్పవచ్చును. శృంగారము ప్రధానరసమైనను భక్తిభయానక భీభత్స హాస్య కరుణారసంబులా యాసందర్భంబుల మనోహరముగ వర్ణింపబడినవి. అచ్చతెనుగు కావ్యమైనను వికృతిరూపంబులు మూరుమూలపదంబులుఁ గలిగి విసుగు పుట్టింపక చనువుకొలది కొంజవ్రలూరుచు భాషాజిజ్ఞాసువులకే గాక యెల్లరకు నానందమునొడఁ గూర్పఁజాలియున్నది. అట్లనుటచే రసపుష్టికి దోడ్పడక పాఠకుల విముఖులఁజేయు పదజాలంబీ గ్రంథమున లేదని కాదు. చూడుడు.

ఆ॥ పులుగుకత్తలాని పాంబుట్టువలదోయి
సెజ్జసాలయు వాని పజ్జనొంది
సవతుసంతుబును ప్రకసనతిలచ్చింటిలో
నత్తుకొన్నడోకొ—యని తలంచు

ఇట్టివి కడుంగడు తక్కువయని మాయభిప్రాయము. మనోహరమగుకథ, మధురమగుఫణితి, చక్కని శైలి, సరసములగు వర్ణనలు-యిట్టి ప్రబంధరాజమునకు సర్వమధురమను నామంబిడిన మహాకవిములుగు పావయారాధ్యులు మిగుల బ్రశంసనీయులు.

వీని నుడి పంచదారపోడి' 'వీని పలుకుంజవి వెన్నకన్నమిన్న'. కవియే తనగ్రంథముం గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాడు.

"చ॥ ఇదియపరంజిసొమ్మపయి నిరుపుగ గెంపులు చెక్కినట్టులో
ప్పిదముగ మింటి తెర్వరులపెద్దల నిద్దరజెప్ప కబ్బమై
మెదవుల పాలతిమ్మనల ముచ్చటలంగల ముల్గుపాపయా
రనులాదరించు సర్వ మధురంబు..."

కానియిట్టి యుద్గ్రంథముదోషభూయిష్ఠముగ ముద్రింపఁబడుట యెంతయు శోచనీయము.

ఇమ్మహాకవి యితర రచనల బరిశీలించి నను దాను సరస హృదయాను రంజనమున వ్రాసికొనినటుల "విద్వజ్జన జాలలాలితవచో నైపుణ్యనష్టంభగుంభన ధారాళకవిత్వ తత్వ కలనా పారంపరీ పారగుం"డని తోపకపోదు.

కవి జీవితగ్రంథకర్తలగు శ్రీవీరేశలింగం పంతులు గారు ఇక్కవి కవితలో వ్యాకరణదోషములు గలవని వ్రాసిరి. సర్వమధుర పీఠికకారులీ కవి కవితనిర్దుష్టమని వాకొనిరిగాని యందందు వ్యాకరణదోషములు లేకపోలేదు. ఇంతమాత్రమున కవిప్రశస్తి కెట్టిలోపంబురు రాబోదని మనవిజేయు చున్నాను.

# మ హా త్ము డు

[ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు. ]

కం. జనుపాంథులకుంగన్నులు
వనస్పతి వితతికిఁ బుష్పభాగ్యమ్మనుమో
ఘనిధింద్రవ్యఁ గసిద్ధాం
జనముందయచేసినావు చాలు మహాత్మా?

సీ. ప్రాక్పశ్చిమాశలైవర్తిల్లు హిందూమహమ్మదీయులకు నైక్యంబుగూర్చి
చిరకాల గత మహాస్పృశ్య తావృతుంబుఁ గూఁగటి వ్రేళ్ళతోఁ గుళ్ళగించి
పట్టిపల్లార్చుచున్నట్టి మద్య పిశాచమునకు నుచ్చాటనంబును వచించి
శల్యాశల్యమునాటి శక్తి కుల్చినదాస్య దూరోగమునకు మందును రచించి
గీ. మతగురువా! లేక జెట్టిరా! మంత్రిగాడా! వైద్యుడో! యనసంశయపడచినావు
ఉద్ధరించితి మమ్ము మహాహోద్యమమునఁదండ్రి ! దండంబు మోహనదానగాంధి
గీ. ప్రబల దేశదారిద్ర్య జ్వరంబుఁ బాఁప వచ్చిమందిచ్చినావు దన్వంతరిగతి
కానిపథ్యంబు నడపని కారణమున సరిగఁ గనుపట్టకుండె నౌషధగుణంబుఁ
గీ. తావకముఖంబునుండి తద్దయును వెడలుచున్న యొక్కొక్కమాటయొక్కొక్క యుపని
షత్తుగాఁదోఁచియుల మోతుసౌధమెక్క నైన సోపానమయ్యె మహాత్మ గాంధి

# ఇది దురాకాంక్షయేనా?

[ న. నరసింహారావుగారు. ]

## య

ఆ శిల్పి యొక చిన్న కుటీరమందు శయనించుచుండెను. కాని యాతడు నిద్దర లేచునప్పటికి సూర్యోదయమై యా కుటీరమరుణ సూర్యప్రభలతోడ నిండునప్పుడాతడున్నతమగు కోరికతోడను - నూతనోద్యమముతోడను, వెలుపలకువచ్చి సమీపమందలి పొదరింట బ్రవేశించి యచ్చట చిత్తరువుల చిత్రించుచుండెను. ఈ ప్రయత్నమందాతడాకలి దప్పుల నెరుంగకుండెను. తదేకదీక్షతోడ తలవంచుకొని చిత్రముల రచించుచుండును. కాని యాతడు తలయెత్తి చూచునప్పటికి నలుదిశల నంధకారము గ్రమ్ముచుండెను. అప్పటి కాతడు చిత్రించు చిత్తరువు గూడ పూర్తి యయ్యెడిది. అప్పుడాతడు దానిని చేధరించి కడుడస్సిన దేహముతోడ కుటీరమును బ్రవేశించుచుండెను. కొంచెకొంచెముగా నాతని కైశోరవయస్సీవిధముగనే గడచెననుట యతిశయోక్తి కాదు.

## ర

అలక్షితముగను, ఆకస్మికముగను, ఆతడు యవ్వన సీమయందు బ్రవేశించెను. ఆతని మనమెచ్చటనో యుండెడిది. అందువలన చిత్ర రచన యందాతనికి రుచి తరుగ జొచ్చెను. విరహమువలననో లేక మరేయే విషయమువలననో నాతడు మనోవ్యథ నొందుచు అప్పుడప్పుడు దుఃఖించుచుండెడివాడు.

ఒకనాడత డేలనో-సరిగ జెప్పవలెనన్న పడదుగాని, ఆచిత్రకారుడా వెన్నెల రాత్రి- ఆ వసంతవాయు కల్లోలమున తన శాంతి కుటీరమును వీడి వెలుపలకు వచ్చెను. విశ్వమాధురిమమును చిత్రింపవలయునను దలంపై యుండనోపు. లేకున్న నట్లు తిరుగుటకు కారణమేమి? కొంతవడి నటునిటు తిరిగి కుటీరమును బ్రవేశించెను. కాని యాతడార్జించినదేమి? హృదయమున దాల్చినదేమి? వేదన- దుర్భరమగు వేదన. దానివలననాతని హృదయ కలతచెంది శరీరము పులకితము కాజొచ్చెను? ఆసుఖకల్పన యాతనికేల గలుగవలయును? దీనికి ప్రత్యుత్తర మిచ్చుటెట్లు? కాని మరునిముసముననే యాతనికి రాకుమారిమీద ననురాగము గలిగెను. రాకుమారి యాతనికి గనుపడెను. అప్పటినుండియు నాతడు మోహాబ్ధియందు మునింగెను.

కాని యిదెట్టి న్యాయము? ఆ రాకుమారి, చిత్రకారుని కనుచూపుల బంధించి, ఆతని

సౌఖ్యము మొదలగు వానినన్నిటిని హరించి దుర్భరజీవితమున కాలము గడుపుమని చెప్పకయే చెప్పి తనదారిని తానేల బోవలయును. ముగ్ధయగుటవలనా? తన మనోభావముల నడంచుకొని యేగినది?

౮

నాకు చిత్తరువుల వ్రాయుటను నేర్పెదవా?'' అని రాకుమారి వచ్చి శిల్పిని బ్రశ్నించెను.

కాని యా చిత్రకారుడు తదేకనిష్ఠతోడ తన్మయుడై రాకొమరిని ధ్యానింపుచుండెను. వీనులకు విందుగొల్పు నాయపూర్వ స్వరము వలన చిత్రకారుడులికిపడి ఏమిది? ఈ కంఠస్వర మెవ్వరిది? అని యనుకొనుచు విస్మితుడాయెను. ఆతని హృదయ తంతువుల మీద నా స్వరము మేళవింప బ్రయత్నించెను.

"నాకు చిత్తరువుల వ్రాయుటను నేర్పెదవా?" అని రాకుమారి మరలబల్కెను.

అప్పు డాతడు ప్రక్కకు దిరిగిచూడ రాకుమారి నిలుచుండెను. ఆమె దృష్టి చిత్రకారుని బాధించి వైచెను. ఆమె ముఖమండలము సింధురరాగ రంజితమై యలరారజొచ్చెను. ఏదియో యొక యపూర్వభావ మామె హృదయమున బ్రవేశించి పొంగి పొరలుచుండ "చెప్పుము. ఎప్పటినుండి నేర్పెదవు." అని మరల బ్రశ్నించెను. అప్పుడు శిల్పి యత్యంత కష్టముమీద లజ్జనడంచుకొని యిట్లనియె. "చిత్తరువులు చిత్రించుట నాకు దెలియునా? అయినను నీతండ్రికీ విషయము సరిపడదుగదా?"

రాకు:- ఆమాటలెందుకు—నీకేమి వచ్చునో దానినే నాకు నేర్పుము. అభ్యసించెదను. నష్టమేమున్నదీ? నాతండ్రి యభిప్రాయమును గనుగొనియే నేనిటకు వచ్చితిని.

శిల్పి:- సూర్యచంద్రాదులు తాండవంబాడు నీ గుడిశయందు— రాజకుమారి గూర్చుండునా?

రాకు:- ఆ—కూర్చుండును. నీవిచ్చటగూర్చుండి చిత్తరువులు వ్రాయుచుండ నేనుమాత్రము గూర్చుండి చిత్తరువుల వ్రాయుట నభ్యసింపజాలనా? మాటలతోడ బ్రయోజనం బేమి! ఎప్పటినుండి నేర్పెదవు? చెప్పు.

శిల్పి:- నీయిష్టము వచ్చినప్పటినుండి.

రాకు:- రేపటినుండియు నేర్పుము. నేర్చుకొందును.

శిల్పి:- మంచిది, అటులనే. (అని రాకుమారి మోమును దిలకించెను.)

రాకు:- రేపువచ్చెదను. (అనినుడివి యట నుండి మందగమనమున నిర్గమించెను.

మరునటి దిన ముదయము నుండియు చిత్రకారుడు రాకుమారికి చిత్తరువుల వ్రాయుటను నేర్పజొచ్చెను. కొన్ని దినములు గడచెను.

౯

ఒకదినమున చిత్రకారుడును, రాకుమారియు చిత్తరువుల చిత్రింపుచు గూర్చుండిరి. అప్పుడు రాకుమారి నవ్వుచు శిల్పిని చూచి యిట్లనియె. "ఇదేమి? నామోము కేసియే కాగ్రచిత్తమున చూచుచుండుటకు కారణమేమి? చిత్తరు వెటులబూర్తియగును, కుంచెనడచు టెట్లు!'' అనియన చిత్రకారుడు చిర్నవ్వున మోమువంచి పటమునకు రంగు వేయుటకు గడంగెను.

రాకు:- అదేమి. ఎఱ్ఱరంగు వేయవలసిన చోట పచ్చరంగును వేయుచున్నావేల?

ఆ. పూర్తియైనట్లే-ఇక నీచేతనగునట్లు లేదు.

శిల్పి యీమాటల కులికిపడి యొక్క నిట్టూర్పు విడచి యిట్లనియె. "రాకుమారీ, నిజము. నాచేత నీచిత్తరువు పూర్తియగునట్లు లేదు."

రాకుమారి చేతియందలి కుంచె చేతియందే యుంచుకొని చిత్రకారుని చూచుచు యిట్లనియె. "నీవిట్లగుటకు కారణమేమి? నిజము చెప్పుము? నీమనము చిత్రరచనయందు నిలుచుట లేదా?"

శిల్పి:- (విహ్వలుడై) ఏమో, నాకు తెలియదు. మిక్కుటమగు మనోవేదనకు లోనగుచున్నాను. కారణము మాత్రము తెలియదు. వ్యక్తపరుప జాలను.

రాకు:- ఇదివరకు నీవుమంచిమంచి బొమ్మల రచింపుచుంటివి. కాని నీవిప్పుడట్టి చిత్తరువుల చిత్రించుటకు బ్రయత్నింప కుండుటకు కారణమేమి?

శిల్పి:- ఆవిషయము నీకెట్లు దెలియును?

రాకు:- నీవు పొదరింట గూర్చుండి యాకలి దప్పుల నెరుంగక చిత్తరువుల జిత్రించు నప్పుడు నేనుచూచితిని. అవియెంతయు మనోహరమ్ములై యుండెను. కానియిప్పుడట్టివానిని వ్రాయజాలకున్నావు. ఎందువలననో తెలియదు. అట్టి పటముల జిత్రించిన నీకీర్తి సుస్థిరమై యుండును గదా?

శిల్పి:-అవును. నిజమే. కాని తగినయాదర్శమేదీ? చిరకాలమునుండి విషాదరూపమును సృష్టింపవలయునని నాయాకాంక్ష. కాని ఇంతవరకు నాసంకల్పము నెరవేరలేదు. తగిన యాదర్శము లభింపలేదు.

రాకు:- నీకు గావలసిన యాదర్శ రూపము యొక్క వివర మొకింత జెప్పెదవా?

శిల్పి:- ఆ. చెప్పెదను. యౌవనమందున్న దంపతులు- సుఖముగ కాలము గడుపుచుందురు. ఒకనూతన జీవివచ్చి వారి సుఖమును స్వర్గసుఖముగ మార్చును. భగవదనుగ్రహమువలన వారట్లు కొంత కాలము గడపుదురు. పిమ్మట పురుషుడు విధి విధానమునకు లోనగును. తల్లిపిల్ల వానిని వీడుట కంగీకరింపదు."

అనినుడువుచుండ రాకుమారివ్యాకుల హృదయమున వాని మాటల కడ్డువచ్చి యిట్లనియె. "వలదు. వలదు. అట్టి యాదర్శము వలదు. ఆచిత్తరువు బాగుండదు. మనఃక్లేశ కారియగును. మరియొక యాదర్శమును చెప్పుము. అది మనోముగ్ధకరముగ నుండ వలయును సుమా?"

శిల్పి:- "ఒకపండు వెన్నెలరాత్రి నావంటి చిత్రకారుడు- దరిద్రుడు, నీవంటి యొక లావణ్యవతిని- రాకుమారిని చూచుట- ఆరూప యౌవనశ్రీకి ముగ్ధుడగుట-"

రాకుమారి మోహమొంది బడెను. తరువాత చెప్పుమని నుడివెను.

శిల్పి:- తరువాతనా; చెప్పవలయునా; . అని నెమ్మదిగ చిత్రకారుడు తనమనో కాంతను రాకుమారి కెరిగించి యామె చేతులు బట్టుకుని యిట్లనియె. ఇప్పటికయినను నామనోగతాభిప్రాయమును నీవుగ్రహింప లేదా? రాకుమారి యొనరు చిత్రకారు డెవ్వడు?

అనుచుండ రాకుమారి లజ్జచే తలవంచుకొనెను. ఆమెశరీరమొకింత వణకజొచ్చెను. అప్పుడాతురతతోడ చిత్రకారుడిట్లనియె. రాకుమారీ చెప్పుము. ఇది దురాకాంక్షయేనా. అనియనుచుండ రాకుమారి చేతులు విడిపించుకొని యటనుండి నిర్గమించెను. మెరుపుతీగనుబోలి నిర్గమించు యామె కడనుండి పిల్లవాయువులు దెచ్చిన సందేశమేమయియుండు? ఒకటిరెండు కఠినోక్తులు కావచ్చును.

శిల్పి మౌనముగ గూర్చుండియుండెను. కానియాతని మనోభావమును వెలిబుచ్చుటెట్లు? ఆతడు బహిర్జగత్తును మరచెనని మాత్రముచెప్పవచ్చును. కాని యంతలోనొక దాసి పిలుపువలన నాతనికి మౌనభంగమాయెను. ఆమెయొక యుత్తరమును చిత్రకారుని చేతికిచ్చెను. అదిరాకుమారి వ్రాసినది. దాని యందిట్లున్నది. "రేపటినుండియు నేనురాను." అనువిషయమును చదువుకొనినంతనే చిత్రకారునిమోము వాడిపోయెను. చతికిలబడెను.

౪

అయిదారు వత్సరములు గడచెను. అతని మనోసాగరము సంక్షోభితమగుచుండెను. కాని చిత్రకారుడు మనోవేదనకు వశుడుగాక సుస్థిరుడై యుండెను. రాజకుమారి యందలి ప్రేమగూడ నాతనిని విచలితునిగ నొనర్ప దాయెను.

కానియొక యవ్యక్తమగు నాహ్వానమునకు వశుడుగాక తప్పకుండెను. ఆతడనేక దినములుగ చిత్రించుచున్న రాకుమారి చిత్తరువును చిత్రించి దివ్యతేజోమయవిలసితములగు నేత్రములఁ జిత్రించుటతోడ నాతడతీంద్రియలోకమున విలీనమాయెను.

ఆరాత్రి అంధకార బంధురమగు నానిశియందు రాకుమారి యొకస్వప్నమును గాంచి భీతయై లేచి గూర్చుండెను. చిత్రకారుని విషయము మనమునకువచ్చెను. "ఇది దురాకాంక్షయేనా" అను దీనవాణి యామెకు వినబడుచుండెను. ఆమెకునిద్దుర బట్టలేదు. హృదయవేదనతోడ తెల్లవారెను.

ఇంకను సూర్యుడస్తాద్రి నధిరోహింపలేదు. సంధ్యాదేవి సునీల చేలాంచలముతోడ బ్రహ్మాండమునుగప్పుచుండెను. సూర్యభగవానుడు సమస్తచరాచరజంతుజాలము కడశెలవుగైకొని యాకాశమును రక్తరాగమున ముంచి యస్తాద్రి నెక్కుచుండెను.

చిత్రకారుని జూచుటకై రాకుమారి బయలుదేరి కుటీరముకడకేగెను. ద్వారము తెరచియుండెను. కానిరాకుమారి యాశ్చర్యమును బొందుచు 'ఏడీ చిత్రకారుడు? ఎచ్చటనున్నాడు!, అనియనుకొనుచు నటునిటు చూచెను. శరీరము కంపింపజొచ్చెను. నలువైపుల చూచెను. ఒక్కపటమును గాంచి "ఇదియే నాయాతడిన్ని దినములుగ చిత్రించిన చిత్తరువు" ఆ-అతనిదే-అని దానిని చూచుచుండెను.

రాకుమారి చిత్తరువు ప్రక్కనే చిత్రకారుని చిత్తరువుగూడ చిత్రింపబడి రాకుమారి చేతులు చిత్రకారుడు బట్టుకుని "ఇది దురాకాంక్షయేనా" అని యడుగుచున్నటులుండెను.

ఆ పటముక్రింద రాకుమారిని సంబోధించియున్న చీటి కనుబడెను. దానియందలి విషయమిది' రాకుమారీ! నీవెప్పుడో యొకప్పుడీ కుటీరమునకు వచ్చెదవను సంపూర్ణ విశ్వాసమున నాకుటీరద్వారము తెరచి

యుంచితిని. నాయాదర్శమును నీకొరక ప్పుడు దెల్పియుంటిని. దానికనుగుణ్య ముగచిత్రించిన యీచిత్తరువు బాగున్నదా? నాపైనీకణుమాత్రమైనను కరుణయున్నచో నొకక్షణకాలమైనను నీవునన్ను ప్రేమించి యుండిన యెడల, నీచిత్రపటమును జాగ్రత్తగ కాపాడుము. నాకు సంతృప్తికలుగును.

నాహృదయ కుటీరద్వారమెప్పుడును నీకొరకై దెరచియుంచెదను. ఆద్వారమెన్నటికిని బంధింపబడదు. పరలోకమందుకూడ నీకొరకు వేచియుండును

హతభాగ్యుడు
శిల్పి."

ఆయుత్తరము చదువుకొని రాకుమార్తె స్థంభితయాయెను. నేత్రముల నుండియశ్రుబిందువులు రాలజొచ్చెను. అప్పుడామె యాచిత్తరువును వక్షస్థలమున నదుముకొని హృదయమును దానియందు ప్రవహింపచేసెను.

ఆచిత్రపటమును వక్షస్థలమున బెట్టుకుని రాకుమారి నిద్రాదేవికి వశమాయెను. స్వప్నమందు చిత్రకారుని యాహ్వానమును వినుచు" వచ్చుచున్నాను? ప్రభో? వచ్చుచున్నా" ననియనుచు చిత్రకారుని సమీపించెను. రాకుమారియెచ్చట?



# ఏమున్నదే

[ భమిడిపాటి రామ సోమయాజులుగారు. ]



ఒకసారి నినుజూచి – ఉప్పొంగి పోయేను
ఒకసారినినుతిట్టి – ఉసురోసు కున్నాను;
మాటాడవని యెంతో–మరగిపోతున్నాను
చెపితివా హాయిగా – చెవులారవింటాను
మబ్బులో నేమున్నదే – ఓచినుక
మబ్బులో నేమున్నదే?

గాలిలో తేలేవు – గగనాన నిలచేవు
వురుములో నురికేవు – మెరవులో మెరసేవు
వురుములో నేమున్నదే – ఓచినుక
మెరవులో నేమున్నదే

తలవంచువరిచేను – తలలపైనాడేవు
శిలలపై బరుగెత్తు – సెలయేట పాడేవు
నిలువెల్ల పులకలై – కలిగిపోయేటట్టు,
నిలుచున్న ననుజూచి – వలచి పైబడ్డావు;
నాలోన నేమున్నదే – ఓచినుక
నాలోన నేమున్నదే?
నీతోడ నేగూడ – నీలమేఘాలెక్కి,
నీతోడ నేగూడ – నేలపై దిగజారి,
పూలలో చేలలో – వనములో వనధిలో
పాటపాడగ నీలు – పడదటే చెప్పవే,
ఆటంక మేమున్నదే – ఓచినుక
అందు తప్పేమున్నదే!



# భగవద్గీతావళి



[ శ్రీరాజామంత్రి ప్రెగడ భుజంగరాయకవికృతము. ]



వ. అంత శ్రీకృష్ణుండిట్లనియె.

అర్జునా! మద్గతాత్ముండ వగుచు నన్నె
యాశ్రయించుచుఁ జిత్తసమాధిఁ బూని
సకల పూర్ణుండ నన్ను నిస్సంశయముగ
నెట్లెఱుంగుదువో యది యింక వినుము.
జ్ఞానవిజ్ఞానముల నశేషముగ నీకుఁ
దెలియఁ బలికెద వానినిఁ దెలిసితేని
యుండ దెఱుఁగంగఁ దగినదింకొకటి ధరణి
వేనవేల్మంది మనుజులలో నొకండు
తివిరి యత్నించు నాత్మసిద్ధిని గ్రహించి
యత్నమొనరించు సిద్ధులందైన నాదు
నిక్కమెఱుఁగును వారిలో నొక్కరుండు.
ఉర్వి సలిలంబు నగ్ని వాయువు నభంబు
మనసు బుద్ధి యహంకార మనఁగ నాదు
ప్రకృతి యష్టవిధంబులఁ బరగుచుండు
నిదియపర, దీనికన్న వేఱింక నొకటి
సరియనఁగఁ జెల్లునదియు విశ్వమునకెల్లఁ
బ్రాణరూపిణియగుచు సర్వముఁ జరించు
నఖిల భూతంబులకు నీపరాపరప్ర
కృతియుగమె కారణంబుగా నెఱుఁగు మయ్య
తద్విధంబునఁ గాదె యేతత్సమస్త
జగమునకు నేను సృష్టినాశము లొనర్చు
కర్తనై యుంటిఁ బార్థ! నాకన్న నితర
మైన యుత్తమహేతు వింకైన లేదు
సూత్రమున రత్ననికరంబు చొప్పుదోఁపఁ
జేర్చి విశ్వంబు నాయందు గూర్పఁబడియె
సకలములయందుఁ బార్థ! రసంబు నేను
చంద్రసూర్యుల యెడఁ బ్రకాశంబు నేను
నిగమముల యందుఁ బ్రణవంబు నేను చుమ్ము
అంబరంబున యందు శబ్దంబ నేను
సకలమనుజుల యెడఁ బౌరుషంబు నేను
ధరణితలమునఁ బుణ్యగంధంబు నేను
జాతవేదుని యందుఁ దేజంబు నేను
బహుళభూతములందు జీవనము నేను
తాపసులయందుఁ బావనతపము నేను
సకల భూతంబులకును బీజంబు నేను
బుద్ధిమంతుల యందలి బుద్ధి నేను
సకల తేజస్వులందుఁ దేజంబు నేను
బలనిధుల కామరాగ వివర్జితమగు
పావన బలంబు నే నెల్ల ప్రాణులందుఁ
గలిగి ధర్మంబు దప్పని కామమేను
ధరణి సాత్త్విక రాజస తామసాఖ్య
భావములు జూడ నన్ను నావలనఁ గలిగె
ననియెఱుంగుము నే వానియందు నేను
గలుగుచున్నవి నాయందుఁ గానఁ ద్రిగుణ
ములఁ జనించిన యీభావముల సమస్త
జగము మోహితమై భావసమితికన్నఁ
బరుఁడ నవ్యయుఁడ నగు నన్నెఱుఁగ దెపుడుఁ
ద్రిగుణరూపిణి నిర్గమింపఁగ నశక్య
సుమ్ము నా దైవమాయ; నన్నిమ్ము మీఱుఁ

గొలుచువారలె పరియింపఁ గలరు దీని
నజ్ఞులును పాతకులునగు నధమజనులు
మాయచే నష్టవిజ్ఞానులైయనార
తంబునాసురమైన భావంబు నొంది
నన్నెఱుంగరు ఫల్గునా! నాల్గువిధము
లైనధార్మికజనులు నన్నాశ్రయింతు
రార్తురర్థార్థి జ్ఞానిజ్ఞానాభిలాషి
వారిలో నిత్యముక్తుండును, పరమభక్తుఁ
డైనజ్ఞాని మహాత్ము డాజ్ఞానికేను
ప్రియుఁడనెంతయు, నాకును బ్రియుఁ డతండు
వీరలందఱుదారులు వీరిలోన
జ్ఞాని నేనే యటంచు నాసమ్మతంబు;
అతఁడు నియతమనస్కుఁడై యన్వహంబు
నుత్తమగతి గనను జేరియుండెఁ గాదె?
యెవఁడనంత జన్మంబులనెత్తి పిదప
జ్ఞానముగడించి మించి యీసకల జగము
వాసుదేవుడటంచుఁ దత్త్వము నెఱుంగు
దుర్లభుండగు ధరమహాత్ముండతండు
స్వస్వభావనిబద్ధులై సకలజనులు
నెడఁద నాయాయి కోరికల్ దడుకుపఱవఁ
దెల్విగోల్పోయి యాయాయి దేవతలను
నెమ్మి సేవింతురా యాయినియమములను;
ఇష్టుఁడై యెవ్వఁ డెవ్వఁ డేయే తనువును
శ్రద్ధనర్ధియునాయా యిజనునకట్టి
శ్రద్ధఘటియించుచుండు నిశ్చయముగాఁగ
నాతఁడా శ్రద్ధతో దాని నర్ధిఁగొల్చి
యేనెయొసగిన యట్టి యభీప్సితముల
దానివలనగడించి సంతసముఁ జెందు
నల్పమతులైన వారల కాఫలంబు
భంగురంబగు; నన్యదేవతల గొల్చు
వారలాదేవ సన్నిధిఁ బడయఁ గలరు;
నానుభక్తులు నన్నె జెందఁగఁ గలరు;
పరమమును నుత్తమంబు నవ్యయమునైన
మత్స్వరూపం బెఱుంగని మతివిహీను
లాదినవ్యక్తునిగ నిప్డు వ్యక్తునిగను
ననుదలంతురు సర్వమానవులకేను
అనగతుఁడఁగాను యోగమాయాసమావృ
తంబగుట మూర్ఖమైన లోకంబు నజుఁడ
నవ్యయుఁడనైన నను దెలియంగ లేదు;
నేనెఱుంగుదుఁగద! వర్తమానభావి
భూతకాల స్థితంబులౌ భూతములను
ఒక్కఁడును నన్ను దెలియంగ నోపఁడుగద!
అర్జునా! సృష్టికాలంబు నందు సర్వ
భూతములు కామరోష సంభూతమైన
ద్వంద్వమోహంబు వలన నంతంబులేని
యురుతరాజ్ఞానమును బొందుచుండునయ్య!
యెవరి దురితంబు మొదలంట నింకఁబోవు
నట్టిదృఢనియములగు పుణ్యాత్ములెల్ల
ద్వంద్వమోహంబుఁ బాసి నాపజ్జఁ జేరి
నన్ను సేవించుచుందు రనారతంబు;
ఎవ్వఁడు జరామరణ మోక్షమిచ్ఛగోరి
యత్నమొనరించుచుండు నన్నాశ్రయించి
యాతఁడా బ్రహ్మమునుదదధ్యాత్మభావ
మిమ్ములనుదాని సర్వకృత్యంబుఁ దెలియు
సాక్షిభూతాధి దైవాధి యజ్ఞుఁడనగు
నన్నెఱింగిన వారలంతంబు నందుఁ
గూడయుక్తచిత్తులై యెఱుంగుదురు నన్ను.

# చిత్రాంగదాపరిణయము *

( కె. రాఘవాచార్యులు గారు. యం. ఏ. బి. యల్. )

## 1

నేను మణిపురరాజ కొమరితను. నాపేరు చిత్రాంగద. భక్తపరతంత్రుడగు శివుడు మావంశమునందు దప్పక పురుష సంతానముకలుగునని వరమిచ్చెనుకాని యీదివ్యవాక్కు సహితము నాస్వభావము మార్పజాలక పోయెను. అందుచే నాజనకుడు నన్ను గుమారునివలె జూచుకొనుచు నాకు బాణవిద్యయు రాజనీతియు నేర్పించెను. పురుషుల దుస్తులనే ధరించుచు నంతఃపుర నివాసమును మానివేసితిని.

ఒకనాడ వినోదార్ధము పూర్ణానదీతీర సమీపారణ్యముల దిరుగుచుంటిని. అశ్వము నొకవృక్షమునకు గట్టివైచి లేడియడుగుల జాడవెంబడి దట్టమైన పొదరింట బ్రవేశించితిని. వృక్షశాఖలల్లిబిల్లిగ నల్లుకొన గీచురాయిలరొదచే బ్రతిధ్వనులీనుచు నంధకారమయమై సన్ననై వంకరటింకరగానున్న దారిని బోవుచు నాకస్మికముగ జీర్ణపర్ణములపై బరుండినిద్రితుడగు మనుజుని గంటిని. గర్వముతో నాతని దొలగుమన గొంచెమైనను గదలడయ్యె. తిరస్కారముతో నాధనువుం గైకొని యాతనిం బొడిచితిని. బూడిదలోనుండి జ్వలించు నగ్నిశిఖవలె నాతడులేచి నాముఖమునందలరారెడు బాల్యలక్షణముల గనుంగొని యొక్కచిరునవ్వునవ్వెను. నేనొకస్త్రీ ననియు నొకపురుషుని సమక్షమున నుంటిననియు నామనస్సున దట్టుట కదియే ప్రథమసమయము.

భయసంభ్రమములతో మీరెవరని యాతనినడిగితిని. కురువంశసంభవుడ నర్జునుడ ననియాతడు ప్రత్యుత్తరమొసంగెను. ప్రతిమవలె జేష్టలుడిగి వందనమొనర్పనయితిని. స్వప్నములందు సయితము నాచేనర్చింపబడు అర్జునుడాయీతడు. పండ్రెండుసంవత్సరముల బ్రహ్మచర్యవ్రతదీక్ష నంగీకరించినవాడని వింటిని. ఎన్నిదినములనుండియో యాతనికి నా బాణ విద్యాకౌశలమును జూపి మెప్పువడయ మనసువ్విళులూరుచుండెడిది. ఇటుల దీర్ఘాలోచన జేయుచు నెట్టకేలకు గనుల దెరువ నాతడు వృక్షములచాటున నదృశ్యుడగుట గంటిని.

## 2

మరునాటి యుదయమున నాపురుష దుస్తులను త్యజించి మురుగులను కడియములను యెఱ్ఱపట్టు అంగరఖానుధరించి యాతని వెదకుచు బయలుదేరి యరణ్యమునందొక శివాలయముచెంత గనుగొంటిని. పిడుగువలె సిగ్గుసన్నావహించుకొనియెను. "బ్రహ్మచర్య వ్రతదీక్ష నంగీకరించితిని. నేను నీపతినగుట కర్హుడనుగా"నను యాతనికడపారివాక్యములు ములుకులై హృదయఖేదన మొనర్చినవి. ఆహా! పురుషుల వ్రతదీక్షలట! ఇనుపకచ్చడాల్గట్టిన మునిప్రవరులు గూడ దమ జీవిత తపఃపుణ్యముల ధారవోసి భామాకర కంకణక్వాణనంబుల విగతధైర్యులగుచుండ వీరవారసేన్న నేల నని తలంపుచు నింటికి జని ధనువును విఱచియమ్ములనగ్నిలోవైచితి. అల్లెత్రాటిచే

* రవీంద్రుని ‘చిత్ర’ యను నాటకము నుండి సంగ్రహింప బడినది.

నెఱవాఱిన నాదృఢబాహువుల గనిన విషా
దము జనించెను. ముల్లోకముల జయించు
నర్జును బాదాక్రాంతునిగ నొనర్చు సౌంద
ర్యవైభవము బడయమదనవసంతుల బ్రార్థిం
చితిని. వారట్టిసౌందర్యము నొసగుచు నొక్క
వత్సరము గడువొసంగిరి.

**3**

ఒకసాయంకాలమున వసంత కుసుమ
శోభితమగు శయ్యాతలమున మదీయసౌం
దర్యవర్ణనాత్మకములగు నర్జును నర్మోక్తుల
దలచుచుంటిని. వనమందలి తుమ్మెదలరొదను
వినుచు ముహూర్తకాలము సౌఖ్యమనుభ
వించి నశించు పుష్పమువలె నానందవార్ధి
నోలలాడుచు మలయమారుతము మెల్లగ
వీవ నిద్రజెందితిని. పుష్పసమన్వితమగుమా
లతీనికుంజమునుండి పూవులు జలజలరాల
దొడగెను. ఆకస్మికముగ నిదుర మేల్కాంచి
యెదుట నాకృతిమతియైదండిని గంటిని.
శీతకిరణుడు పశ్చిమాద్రిపైనుండి చెట్లమా
టున నాశరీరలావణ్యమును బొంచికనుగొను
చట్లు దోచెను. మారుతము సౌరభముల వీచు
చుండెను. కీచుతాయిల రొదతక్క యరణ్యము
నిశ్శబ్దముగనుండెను. చేతదిద్దండము దుంబూని
నిలువబడినతపసినిజూడ జూడ గలలో గాంచిన
వస్తువును మఱలగన్గొనిన విధంబుదోచెను.
ఇంతలోప్రియసఖా! యని యాతని మధుర
రవము విన వచ్చెను. స్వప్నమైకొనుమని నుడు
వుచు గరములనాపై యాతని గౌగిలించితిని.
చంద్రుడు చెట్లమాటున దాగుకొన్నట్లోదసీ
కుహర మంతయు ధ్వనిపూరితమాయెను.

**4**

ప్రాతఃకాలమున బత్తులకల్లలమును
ఖని లేచి యెడమచేతిని బ్రాపుగ జేసుకొని
కూర్చుంటిని. పెదవుల చిన్న నవ్వునటింప
బాల భాస్కరుని వలె శోభితుడై యాతడు
నిద్రజెందియుండెను. మనోజ్ఞమగు నాతని
ఫాలముపై నుదయారుణిమ మెంతయు రక్తి
గాంచెను. పిట్టలార్పువిడచుచు నిలువబడి
సూర్యకిరణముల నాతని ముఖముపై బడకుండ
బత్రముల మాటుగ జేసితిని. నలుదిక్కుల
గలయజూచి నాపూర్వపుస్థితి జ్ఞప్తికి రా దన
ప్రతిబింబమును గని భ్రాంతి గొన్న లేడి వలె
బరువెత్తితిని. వనకుసుమములచే నలరారు
బాటను బోయిపోయి యెట్టకేలకొక నదీత
టమును జేరి విచారించితిని. కాని కనుల
బాష్పములే కఱవయ్యెను.

మదనవసంతులయనుగ్రహముచే వడ
సిన శరీరలావణ్యము వత్సరముముగియనశించు
నని తలచినకొలది గుండెలు జల్లుమనసాగెను.
నాభర్తకు నాయందుగల యనురాగస్థిర
మగు ప్రేమబంధమున గట్టువడగ మదీయ
సౌందర్య సంజనితమేయగు నెడనాభావిస్థితి
యెట్లుండునో తలపోయ శరీరము కంపమొం
దెను. సాగరమధ్యమున నీచికల నల్లలనాడు
నావవలె దత్తరపడుచు కాలముగడుపుచుంటిని.

**5**

మదన వసంతులు గడువొసంగినకాలము
సమాప్తమగు చున్నది. నాశరీర సౌష్ఠవ
లావణ్యముల యందర్జునునకు బ్రేమ నానాటి
కిని తగ్గెను. అస్థిరమై, క్రమక్రమముగ క్షీణించి
నశించు లావణ్యమాతనికి దామరాకునందలి
జలకణంబువోలె. బుద్బుదప్రాయమై కనుప
ట్టెను. సంవత్సరము గ్రాసిన్నయగునప్పటికి నాశ్వ
రము ప్రకృతిమానమును జెందెను. నాతనీ
నాజన్మమునమాత్రము సార్థకమగునటుల
నాటియర్జును నర్మోక్తులెన్నడును మఱపు
రావు. నాజన్మమునకు కీర్తిచేకూరి సంపూర్ణమయినది

# శ్రీకృష్ణదేవమహారాయలు



( శిరుగూరి హనుమంతరావుగారు, ఎం. ఏ. )



ఏమహారాజు పండితులను కవుల నాదరించి తెలుంగు బాసకు నిగ్గుబోసెనో, ఏమహాధీయుని బుద్ధినీతి శాస్త్ర పాండిత్యమునందు వాచస్పతిని శేముషిని ధిక్కరించెనో, మహాశూరుఁడు నిజానర్గళదోః ప్రతాపానల జ్వాలల జతుస్సముద్ర ముద్రిత సర్వంసహాచక్రమును వెలిగించెనో, ఏవీరాగ్రేసరుఁడు ఘోరారి మద గజ కుంభ విదారణా సమాన కేసరమయి రాజిల్లెనో; ఏసార్వభౌమతిలకు డఖిల సామంత నరపతి మకుట రత్నప్రభా నీరాజిత పదపంకజుఁడై భాసిల్లెనో; ఏమహాదాత యథార్హంబు సత్పాత్రమెఱింగి నానాదేశ సమాగతార్థి జననికరంబుల నగ్రహార సువర్ణాది భూరిదానంబుల సంతృప్తుల గావించి యనిమిషధేను భూరుహంబుల యాచకబృందములు మరచునటు లొనరించెనో; ఏభక్తాగ్రగణ్యుఁ డనన్యసామాన్య రాజ్యకార్య నిర్వహణ ధురంధరుఁ డయ్యు పుంఖానుపుంఖ విషయేక్షణ తత్పరుఁడయ్యు యోగిబ్రహ్మవిలోక ధిషణమును త్యజింపనిభంగి రాత్రిందివములు భక్తత్రాణపరాయణుఁడు నవాఙ్మానసగోచరుఁడు నగుభగవంతుని దివ్యచరణకమలయుగమం దపారమగుభక్తితో దనమనంబు నిల్పెనో; ఏసంస్తవనీయ చరిత్రుఁడు శరదిందు కుందఘనసారనీహార మృణాళ సదృశంబగు తనకీర్తిని సమస్త దిగంతరాళంబుల నాచంద్రార్కముగ నాటి తుట్టతుద కశేషజనంబుల నపార ఘోరదుఃఖ సముద్రమున ముంచి యైహిక సౌఖ్యంబులు నశ్యములనియు, 'జాతస్య మరణం ధ్రువ'మనియుఁ బ్రపంచమున కెఱిగించెనో యనునటుల రాజ్య భోగముల విడనాడి స్వర మలంకరించెనో; అట్టిమహారాజు అట్టి నీతికోవిదు డట్టిమహాశూరుఁడట్టి వీరాగ్రేసరుఁ డట్టి సార్వభౌమ తిలకు డట్టి భక్తాగ్రగణ్యుఁ డట్టి యమలయశస్కుఁడు శ్రీకృష్ణదేవ మహారాయలు.

ప్రతిదేశమందొకానొక సమయమందా దేశచరిత్రను మార్పుచేయు సామర్థ్యముకల మహాపురుషు లవతరించుచుందురు. ప్రతిదేశములో నొకానొకసమయమందు శక్తియు తేజస్సు, బలము, జ్ఞానము, నశించి జను లంధకార బంధురంబగు మార్గమున నేగుచుండ, వారికి సరియగు త్రోవఁజూపి రక్షింప నవతారపురుషు లుదయించుచుందురు. దైవభక్తి తగ్గి దురాచారములు మెండయినపుడీ దురాచారముల రూపుమాపి మానవహృదయ క్షేత్రముల భక్తిబీజంబుల నాటువారు మతోద్ధారకులు. సంఘమందైకమత్యము సన్నగిలి విపరీతములగు భేదంబుల ప్రభావమున దేశమునకు మిగులఁ గీడువాటిల్ల, సంఘ సంస్కరణలు సల్పి దేశసేవచేయువారే సంఘసంస్కర్తలు. దేశము పరుల హస్తగతమయి రాజ్యబలము తగ్గినపుడు స్వాభీష్టంబుల బరిత్యజించి వీరావేశపూరితులై ఘోరశత్రుని కరంబులమద మడంచి దేశమును వశపఱచుకొని దేశము నుద్ధరించిన రాజులే రాజులు. ఇటువంటి రాజపుంగవుల పుణ్యచరిత్రలు కడుస్తోత్ర పాత్రములు. శ్రీకృష్ణదేవరాయ లట్టి మహాపవిత్ర చరితులలో నగ్రగణ్యుడనుట నిర్వివాదాంశము. నాలుగు వందల వర్షములు గతించినను ఆంధ్రుల మగు మనమందఱ మిప్పటికి ఎఱుక

శ్రీకృష్ణదేవరాయల ప్రాచీనౌన్నత్యము స్మరించుకొనుటయే ఆతని యనన్య సాధారణమగు కీర్తికి నిదర్శనము.

ఈ విజయనగర సామ్రాజ్యము చరిత్రాంశములలో నెట్టి ప్రాముఖ్యత గలదో తెలిసికొనుటకుఁ బూర్వపు చరిత్ర కొంచెము విచారించుట సమంజసముగ నుండును. క్రీస్తుశకము 3 వ శతాబ్దము వరకాంధ్రరాజులు కృష్ణా గోదావరుల మధ్యదేశమును బాలించుచుండిరి. 6 వ శతాబ్దము మొదలుకొని చాళుక్యులీరాజ్యమును పరిపాలింపఁదొడగిరి. తొమ్మిదవ శతాబ్దమందు రాష్ట్రకూటులు వీరి నోడించి రాజ్యము నాక్రమించినను పదియవ శతాబ్దమందున చాళుక్యులు తమరాజ్యమును మరల వశము చేసికొనిరి. పండ్రెండవ శతాబ్దమున చాళుక్యులు క్షీణదశ నొందిరి. వారి రాజ్యములో గొంతభాగము హొయసల రాజులక్రింద, కొంత యాదవులక్రిందను శేషించినది కాకతీయుల వశమున నుండెను. పదునాలుగవ శతాబ్దమందు మహమ్మదీయ దండయాత్ర లారంభించెను. ఈమూడు రాజ్యములు వారిచే గెల్చుకొనఁబడెను. అటుతరువాత నీదేశమంతయు బాహామని రాజ్యా లేలిరి. ఈవిధంబున మహమ్మదీయ దండయాత్రలచే నీదేశము ముట్టడింపఁబడిన నపుడు హైందవ రాజ్యమును నిలువఁబెట్టుటకయి 1336 వ సంవత్సరమం దానగొండి కోట బలపరుపఁబడి విజయనగర రాజ్యము స్థాపింపఁబడెను. 1336, 1565 వ రకించుమించు 230 సంవత్సరములు దక్షిణదేశ మితరులకు స్వాధీనము కాకుండుటవలన విజయ నగరరాజ్యము కడు వన్నెకెక్కెను. ఈసార్వభౌముల శాసనములు వందలకొలది గన్పట్టుచున్నవి. పశ్చిమ దేశములనుండి యిచ్చటికే తెంచినబాటసారులు, మహమ్మదీయులీ రాజ్యమును, జూచి విచిత్రమైన విషయముల దెలియజేసి యున్నారు. ఈరాజ్యమందనేకులు విద్యాభూషణులుండిరి. వారి యుద్గ్రంథములు సయితము చరిత్రాంశముల విశదీకరించుచున్నవి. వారి నాణెములు, వారిచే నిర్మింపబడిన దేవాలయములు నాకాలపు నాగరికతను వేనోళ్లఁజాటుచున్నవి. 1336 1448 వరకు భామినిరాజులతో కయ్యమే ముఖ్యాంశము. 1448–1509 వరకు రాజులకు కడు దౌర్బల్యమాపాదించి యుండెను. 1509 వ సంవత్సరమందు శ్రీకృష్ణ దేవరాయలు పట్టాభిషిక్తుఁడయ్యెను.

ప్రస్తుతమందు మదరాసు రాజధానియందలి జిల్లాలయందంతటను బహిర్గతమయిన కృష్ణదేవరాయల శాసనములవలనాతని రాజ్యవిస్తీర్ణమునకు నిదర్శనములు. ఆతని రాజ్యము తూర్పున సింహాచలము వరకు విస్తరించెను. ఓఢ్రదేశాధీశుఁడగు ప్రతాపరుద్రుని కృష్ణదేవరాయ లోడించినట్లు సింహాచలమందుగల యొక శాసనమువలన విశదపడుచున్నది. విజయనగరమున కనతి దూరమున నున్న పోట్నూరు గ్రామమున నొక రాతిబండపై జయస్తంభముగ నిల్పినట్లు స్పష్టపడుచున్నది. సింహాచలములోని మరికొన్ని శాసనముల వలన కృష్ణదేవరాయల రాణులగు చిన్నదేవమ్మయు తిరుమలదేవమ్మయు సింహాచల స్వామికి కొన్ని గ్రామముల నర్పించి నటుల తెలియుచున్నది.

నెల్లూరు జిల్లాలోని కొండవీడును, ఉదయగిరి దుర్గమును ఓఢ్రాధీశుని వశమున నుండెను. 1513, 14, 15, సం॥లలో నీరెండు దుర్గములను కృష్ణదేవరాయలు ముట్టడించినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఉదయగిరి దుర్గమును స్వాధీనము జేసికొని యచటికి కతిపయ దూరముననున్న కొండపల్లి, బెల్లముకొండ, వినుకొండ, నాగార్జుని కొండలఁ బట్టుకొని యా సామంతపతులయిన కొండయ్యను కొండవీడులోను, బాస్కరయ్యను వినుకొండలోను, వీరభద్రుని బెల్లముకొండలోను, అయ్యలయ్యను నాగార్జున కొండలో సర్దారులుగ నుంచెను. ఈయుదయగిరి దుర్గమును ముట్టడించినప్పుడే శ్రీకృష్ణుని సుందర విగ్రహమును విజయనగరమునకుఁ దెప్పించి గొప్పదేవాలయము కట్టించినటుల తెలియుచున్నది.

నెల్లూరి శాసనమువలన నీయుదయగిరి నొక తాలూకా చేసి యొక తాలూకాదారుని కార్యకర్తగ నేర్పాటుజేసినట్లు బోధపడుచున్నది. 1516 వ సంవత్సరములో కొండవీడు స్వాధీనము జేసికొనెను. ఈ కొండవీడు ముట్టడించు సందర్భమునఁ గృష్ణరాయలు

వీరభద్రరాయుని, నరహరిపాత్రుని, మల్లుభానుని, ఉద్దండభానుని, నాఖిరాజును, శ్రీనాథరాజును, మఱి కొందఱను లోఁబరచుకొనెను. కొండవీటిని తాలూకా జేసి నాదెండ్లగోప మంత్రిని కార్య నిర్వాహకునిగ నేర్పాటుఁ చేసెను ఈగోపనమంత్రియే ప్రబోధ చంద్రోదయమునకుఁ జంద్రిక వ్రాసిన అప్పయ్యసోదరుఁడు. ఈనెల్లూరి శాసన మాకాలపు పన్నుల విషయమునుఁ గొంతఁ దెలియజేయుచున్నది.

ఎండ్లబండెకు కోకలబస్తాల కొక చవేల; ఇంక ననేక పదార్థములకు ½ పదికము, 2, 3, 4½ పదికములును; లవణశాలలు, పానీయశాలలు, వీధులు. వసంత గరువలు, దేవాలయములకుఁ బోవు మార్గములు— వీటికొక దమ్మ్మ;—ఈవిధంబుగ బన్నులు వేయబడినవి. ఈపన్నుల నన్నింటిని కొండవీటి రాములవారి దేవాలయమున కర్పింపఁబడినటుల కొండవీటి శాసనమువలన బయల్పడుచున్నది. ఇవ్విధంబున నెల్లూరు కృష్ణామండలములలోనున్న యనంతగిరి, ఉంద్రకొండ, ఉరాలకొండ, అరుణపల్లి, జల్లెపల్లి కండికొండ, కప్పలవాయి, నల్లగొండ, కంబముమెట్టు కనకగిరి, శంకరగిరి, మొదలగు దుర్గముల జయించెను. 1515 వ వత్సరమందు కృష్ణరాయలు తిరుమలదేవిని, చిన్నదేవిని వెంటబెట్టుకొని ధరణికోట యందున్న అమరేశ్వరాలయమును దర్శించి, తులాపురుష, రత్నధేను, సప్తసాగరములను, మరియు గొన్నింటి గ్రామములను దానముజేసినటులఁ దెలియుచున్నది. వుదయగిరిని జయించినపిదప తిరుపతియాత్ర సల్పి, 30,000 వరహాలతో వేంకటేశ్వరునకుఁ గనకాభిషేక మొనర్చి, 8 వరుసలుకల స్వర్ణహారమును మాణిక్యఖచితమగు కంకణద్వయమును భగవంతున కర్పించినట్లే శాసనము వలన వ్యక్తమగుచున్నది.

1516—1520 వరకు యుద్ధములు లేకఁ దూర్పున శ్రీకూర్మము మొదలు దక్షణమున మధురదనుక ననేకబిరుదముల ధరించి నిష్కంటకముగ శ్రీకృష్ణరాయ లేకచ్ఛత్రాధిపతిగనుండెను. గుంటూరుశాసనమందు శ్రీమాన్మహామండలేశ్వర రాజాధిరాజ రాజపరమేశ్వర తేజోనిధియగు శ్రీకృష్ణ దేవమహారాయులని వ్రాయబడుట దీనికి దార్ఖాణము. రాయలవారి సేనాధిపతులలో నొకఁడగు రాయసము కొండ మారయ్యయను నాతఁడు విజయనగర ధ్వజమును సింహాద్రియందును, శ్రీకూర్మమందును నిల్పినటుల విశదమగుచున్నది.

దక్షణదేశమందనేక దేవాలయములు కట్టించి పెట్టుటయు, అనేకములగు శిథిలమైన దేవాలయములను బాగు చేయించుటయు, బ్రాహ్మణులకొరకును వేలకొలది రూకల వ్రయపరచెననియుఁ దెలియుచున్నది. మధుర, రామనాథ్, దక్షిణకన్నడ జిల్లాలలో నతని శాసనములగుపడుటచే నతనిరాజ్యమంతవరకు విస్తరించెననియు దెలిసికొనదగియున్నది రామనాథు జిల్లాలో వెలసిన శాసనములనుబట్టి చూడ నితఁని ఈళము మొదలగునన్ని దేశములను జయించినటుల స్పష్టపడక మానదు. కీర్తిశేషులగు వేంకయ్యగారిశాసనము మిగుల యపూర్వమైనదనియు ద్రవిడశాసనములలో కృష్ణరాయలు ఈళము జయించెనని చెప్పుట ముఖ్యాంశమనియు నుడివిరి.

కృష్ణదేవరాయలు వైష్ణవమతాభిమాని యయ్యు శైవాలయముల రెండింటిని బాగుచేయించి దానము లొసంగెను. వారికులదేవత తిరుమల వెంకటాచలపతి. మనకందరికీ దేశమందున్న పుణ్యస్థలములలో నెల్లగొప్పది తిరుపతి. ఎంత పర్యంతము కులదేవతలయందు మన కాదరభావముండునో, యెంతకాలము మనపూర్వులగు ఋషీశ్వరులు సామాన్యజనులకగోచరులై నివసించినయేకాంతస్థలములగు కొండలు, అరణ్యములు మనకు యాత్రాప్రదేశములుగ నుండునో, అంతకాలము శ్రీకృష్ణదేవ మహారాయల కీర్తి నాశమొందకుండ వారి రాగివిగ్రహము నచ్చటకట్టించిరి. ఒకచోట నొకయంగవస్త్రమును ధరించి, మరియొక వస్త్రముచే నడుముబిగించికొని రెండుచేతుల జోడించి యిరువురిభార్యలతో భక్తివినయ వినమ్రుఁడై నమస్కరించు కృష్ణదేవరాయల విగ్రహము జూచువారలకొకరిక రమునుదిశాన్య సీతాపహారణుఁడయ్యు శ్రీకృష్ణ

దేవరాయలకు భగవంతుని యందుగల భక్తిశ్రద్ధలు వర్ణనాతీతములని తత్క్షణమున సుస్పష్టము కాగలదు. ఇతడు ఆర్కాటుజిల్లాయందలి తిరువణ్ణామలైకి దేవాలయమందు వేయిస్తంభముల మంటపమునొకటిని సరోవరమునొకదానిని మిగుల యెత్తయిన గోపురమునొకదానిని చిదంబరములోనొక జయస్తంభమునుకట్టించుటయేగాక తంజావూరు, తిరుచునాపల్లి, సేలము, పుదుక్కోట, మధుర, కడప, బళ్ళారి, అనంతపురం జిల్లాలలో దేవాలయముల కొరకిచ్చినదాన శాసనములు వేనోళ్ళ నితని యపారమగు దైవభక్తిని సూచింపక మానవు. ఈదేశములనుండి రాయలవారికిఁ బంపవలసిన పన్నులు దేవాలయముల నిమిత్తము వ్యయము చేయుట కీశాసనము లధికారము నిచ్చుచున్నవి. మరియు నీశాసనముల వలన ద్రవిడదేశమునందు వాడుకలో నున్న పన్నుల వివరము వ్యక్తమగుచున్నది. సాలెవాడొక మగ్గమునకు 3 పణములును, వ్యవసాయదారొక నాగలికి 3 పణములు, యేకచోరు, వరిచోరు, అలమంగీ, గోది, అరుసుపేరు చెల్లించుట వాడుకకలదు. ఈ విధముగ 1౧, 12 వ శతాబ్దములందు పశ్చిమదేశములో సామంతరాజు లనేకు లనేకవిధములగు పన్నుల వసూలు చేసినట్లు, వీరుకూడా వాటాలు చేయుచుండిరి. తుంగభద్రా నదియందు దాదాపు పడవలు సయితము పన్నుచెల్లించునట్లీ శాసనమువలనను, వివాహసమయమందును పన్ను చెల్లించవలసి యున్నట్లు కడకీ శాసనమువలనను స్ఫుటమగుచున్నది.

ఈపన్నులనియమమును జదువునపుడు మనదేశీయ రాజులు ప్రజల ధనమును పన్నుల నిమిత్తమయి యెక్కువగ గ్రహించుచుండిరని తెలియును. కాని యీ ధనమును మరల జనులకిచ్చివేయుటగాని, కొన్నికొన్ని క్షామము మొదలగునవికలవిపరీతకాలముల యందు వసూలు చేయకుండుటగాని ఆచారముగ నుండునని శాసనములవలన దెలియుచున్నది. తంజావూరులో వసూలయిన 10000 వరహాలను, ఆర్కాటులో పోగయిన 10000 వరహాలను, సేలములోను కొండవీటిలోను కడపలోను వసూలయిన పన్నులమొత్తము నాయా ప్రాంతములలోని దేవాలయములకిచ్చినటుల దెలుచున్నది. ఈకాలములో విద్యాశాఖయు, పరిశోధన శాఖయు కట్టడముల శాఖయు—ఏయేకార్యములు చేయుచున్నవో ఆకాలమందా యాపనులను దేవాలయములు చేయుచుండెను.

ఈ ప్రకారముగ రాజ్యమంతటను ధర్మములజేసి కట్టడములఁ గట్టించి హైందవ సామ్రాజ్యమును వృద్ధి చేయుటయేగాక తన ప్రధాన పట్టణమగు విజయనగరమును మహేంద్రుని పట్టణమునకు సాటి వచ్చునటులఁ జేసెను. కోటలో నంజీర రామస్వామి దేవాలయము కట్టించెను. దేవాలయ ప్రాకారముల యందంతటను రామాయణ కథలఁ జెక్కించెను. విఠలస్వామి యాలయమును బ్రారంభించి యొక గోపురమును బూర్తిజేసెను. ఈ విఠల మూర్తికి 991 బంగారు మొహరులను 200 ఆవులను 25 రజిత దీపస్తంభములను 4 గ్రామముల నిచ్చినటుల శాసనముల వలనఁ దెలియుచున్నది. కొంతకాలము మదరాసు దొరతనమువారి పరిశోధక శాఖాధిపతియగు రేదొరగారిపోర్టులో యీ సుందరమగు చిత్రములతో నిండియుండెనని వ్రాసియున్నారు. శ్రీకృష్ణదేవరాయల యపారవిష్ణుభక్తికి నీ దేవాలయములే నిదర్శనములు. కృష్ణస్వామి యాలయమునకు సమీపమున చెక్కబడియున్న యుగ్ర నృసింహమూర్తి విగ్రహమును జూచి పాశ్చాత్యులు కొందరు మిగుల వికారముగ నున్నదని యభిప్రాయపడి యుండిరి. నృసింహమూర్తి చరిత్రయు హైందవ మతమందు నారసింహునికి గల ప్రాముఖ్యతయు నాతని సంబంధమగు పురాణములన్నియుఁ బాశ్చాత్యులు తెలిసికొనిన గాని వారికీ శిల్పకారుల యుద్దేశములు బోధపడ నేరవు. ఇంతవుముందు పాశ్చాత్య శిల్పశాస్త్రమే సర్వోత్తమ మనియు భారతీయ శిల్పశాస్త్రము పురుషుల లక్షణముల సమాజముగ చిత్రింపక దృష్టికి గోచరంబగు పదార్థములనుగాని, దేవతలనుగాని, రాక్షసులనుగాని సృష్టించుచుండుటవలన నది యంతశ్రేష్ఠమైనది కాదనియు నభిప్రాయపడిన పాశ్చాత్య పండితులును ప్రకృతము

వారి యాశయముల మార్చుకొనుచున్నారు. దోషబద్ధుడయిన మానవుని యంగముల జిత్రించుటకన్న దోషరహితుడై పరిపూర్ణుడగు పరమాత్మ వివిధరూపములు వర్ణించుటయందును భగవంతుని విగ్రహరూపమున నిర్మించుటయందును విశేషము కలదని భారతీయ చిత్రకారుల యాశయము. సకల జననీ నయనానందసంజనకమగు ముద్దుకృష్ణుని ప్రతిమయందు ఉత్తమ గుణంబులు స్ఫురించునటులను, ఉగ్రనారసింహుని విగ్రహమును భీకరాకృతిగలదానిగను వారు యథాశాస్త్రముగ సిద్ధము చేసియుండిరి. కృష్ణరాయని కాలమున నీ శిల్పశాస్త్రము కడు వన్నెకెక్కినదని చెప్పుట యతిశయోక్తి కానేరదు.


శ్రీకృష్ణ దేవరాయలు.

1520 సం॥ రమున రాయచూరుయుద్ధము జరిగెను. రాయచూరు, బీజపూరు నవాబుల స్వాధీనమందుండెను. దీనిని ముట్టడించి కృష్ణరాయలు తన వశము చేసికొనెను. గుల్బర్గ తరువాత వశపడెను. 703,000 కాల్బలము, 32, 600 అశ్వపుదళము, 551 ఏనుంగులు యుద్ధము చేసెనని తన చరిత్రయందు వ్రాసియున్నాఁడు. ఇది యతిశయోక్తియని కొందరి యభిప్రాయము. కాని చంద్రగుప్తమౌర్యునికి 609,000 కాల్బలము, 80,000 గుర్రములు 9000 ఏన్గులుండుట, ఆకాలమున సామంతరాజులకు గప్పము చెల్లించుటయేగాక యుద్ధసమయమున తమ సేనలతో తోడ్పడుటయు విధియైనటుల గన్పట్టుచున్నది. ఇప్పటికిని హైదరాబాదులో ప్రముఖులగు నవాబులు, జాగీర్దారులను వారివారి సిబ్బందుల నుంచుకొనవచ్చును.

పూర్వము ఱంగరు, వుత్సవము సందర్భమునవెలుపడు సేనం జూచినవారు కృష్ణరాయల సేన విషయమై సందియ పడరు. తంజావూరు నందు బయల్పడిన నొకశాసనము వలనరాయచూరు యుద్ధమందు ఱఅపత్సహాయుఁడను బ్రాహ్మణ ఐర్య డొకడుయుద్ధము చేసెనని విశదమగుచున్నది. దీనిబట్టిచూడ బ్రాహ్మణులా కాలమందుమంత్రులు మొదలగువారుగ నుండుటయేకాక సమయానుకూలముగ వాహినులయందును జేయూతి యొసగుచుండిరని స్పష్టమగుచున్నది.

కృష్ణరాయలు 1520–29 వరకు రాజ్యమును నిరంకుశముగ బరిపాలించి స్వర్గ మలంకరించెను.

“హిందూ దేశమున రాజుల నేకులు అసమాన భూరితేజోగరిష్ఠులయి శూరాగ్రేసరులై రాజ్యము చేసినను వారు జనసమ్మతముగు పరిపాలన చేయలేదు. జనులు వారి యాజ్ఞాబద్ధులై పన్నులు చెల్లించుచుండిరని” రాజ్యతంత్రముల వ్రాసిన మెయిన్ గ్రీసు మొదలగు వారి

యభిప్రాయము. దీనియర్థ మొకించుక వివరింప దగియున్నది. ప్రధానపట్టణమునుండి రాజ్యమంతయు స్వయముగ పాలించుట యసంభవమగుటం జేసియు మధ్యభాగములందును, యత్యంత మగు ఏర్పాటు లొనరించుట కధికారులు నియమింపబడుచుండిరి. ద్రవిడదేశములో నాడు, కోట్టము, మండలమనియు, నాంధ్రదేశమందు సీమ, స్థలము రాజ్యమనియు, భాగములకు పేళ్లిడబడెను. ఆంధ్రదేశముల



1. చిన్నాదేవి 2. కృష్ణరాయ మహారాయలు. 3. తిరుమలదేవి.

అంత్యభాగములయందును వసించు జనుల కష్టసుఖములనరయుట ప్రధాన పట్టణమందుండు వారలకు దుర్లభమగుటవలనను, రాజ్యమంతయు చిన్నచిన్న భాగములుగ విభజింపబడి ఆయా భాగముల కవసరయగు ప్రత్యేకముగ నధికారు లేర్పడిరి. అప్పటికిని ప్రధానపట్టణమునుండి న్యాయాన్యాయ విచక్షణదక్షులగు గౌరవ నియోగాద్యోగుల నియమించి సదా జాగరూకతతో రాజ్య కార్యములు నెరవేర్పబడుచుం

జెను. సేలముజిల్లాలో వెలువడిన యొకశాసనములో నీక్రింది విధముగ లిఖింపబడియున్నది. పెరుమాన్ కణియవారియాలయములో ముగ్గురు స్థానికులకా



వెంకట పతిరాయలు.

గ్రామాధికారు లన్యాయము చేసినందున వారుముప్వురు విజయనగరమునకేగి రాజుగారిని దర్శింప నెంచగ బ్రిధానమంత్రియగు తిమ్మరుసు వారికి బ్రభుదర్శనమిప్పించెననియు, రాయులు వారి యభీష్టములదీర్చి వారిం బుష్పమాలాలంకృతులం జేసి బహుమతి యొసంగి గౌరవించెనని యీశాసనమువలన మనకు తెలియవచ్చుచున్నది. దీనివలన పూర్వులు మహారాజులయ్యు సామాన్యజనులకుగూడదర్శనమిచ్చుచుండిరనియు, సామంతరాజులుగాని, శేషించిన యధికారులుగాని వారికిచ్చవచ్చినటుల చేయుట కవకాశము లేకుండెననియు దేలుచున్నది. ఈవిషయమునే అనంతపురము జిల్లాలోని సమమస్త భువనాశ్రయ, అను బిరుదము



తిరుమల రాయలు.

ధృవము చేయుచున్నది. ఈకాలమున రాజులు తమ నిరంకుశ పరిపాలన సాగించుకొనుట కవకాశములే కుండ, జేయుటకై జనసభలు, ఎన్నికలు మొదలగు



వెంగళాంబ.

ఏర్పాటుల నేకములు చేయబడు చున్నవి. ఆకాలములో సభ లుండెనుగాని, సభలకు స్వతంత్రము లేదాయెను, అయినను రాజులు తమ యిచ్ఛానుసారముగ బరిపాలన చేయగూడదనియు, కొన్ని కట్టుబాట్లకు లోబడి యుండవలయుననియు, పూర్వకాలమునం దేర్పాటులుండెను. గ్రీకుదేశమందలి తత్వబోధకాగ్రేసరుడగు ప్లేటో అను నాతడు రాజపరిపాలనము సామాన్య జన పాలనము— ఈ విధములగు పరిపాలనములను, వాటివలన జనులకు కలుగు లాభనష్టములను జర్చించు సందర్భమున యోగ్యుడగు రాజు లభ్యమయ్యేనేని రాజపరిపాలనమే శ్రేష్ఠమని నుడివియుండెను. రెండు వేల వత్సరముల తరువాత జర్మనీదేశమందు బయలు వెడలిన ట్రీట్ష్కీ నీట్సె మొదలగు తత్వబోధకులును రాజపరిపాలనమే శ్రేష్ఠమనిరి. అయితే రాజున కవసరమగు గుణసంపత్తి విషయమైయైనమాత్రము ట్రీట్ష్కీ అను అతనిని ప్లేటో అనువానికిని భిన్న భిన్నమైన యభిప్రాయములు కలవు. ఏరాజు తన పరిపాలనయందు ధర్మము నవలంబించుచు భూమియం దవతరించిన దేవునివలె ప్రవర్తించునో ఆరాజు సంబంధమగు పాలన మంచిదని ప్లేటో, అనువాని యాశయము ఏరాజు తన సామర్థ్యమును ప్రకటించి ప్రపంచము నంతయు తన యిష్టానుసారముగ నడుచునటుల చేయునో అట్టి రాజు పరిపాలన మంచిదని ట్రీట్ష్కీ యభిప్రాయము. ప్లేటో వ్రాసిన గుణములు కలరాజు సంభవించుట దుర్లభము. కౌటిల్యుని అర్థశాస్త్రములో

“విద్యావినీతో రాజాహి ప్రజానాం వినయేరతః
అనన్యాం పృథివీంభుఙ్క్తే సర్వభూతహితేరతః॥
ప్రజాసుఖ హితం రాజ్ఞః ప్రజానాంచ ప్రియంహితం
నాత్మప్రియాహితం రాజ్ఞః ప్రజానాంతు ప్రియంహితం”

అనియు, మహాభారతములో.

పూర్వాహ్ణేచాచరేద్ధర్మంమధ్యాహ్నేర్థముపార్జయేత్
సాయాహ్నే ఆచరేత్కామమిత్యేషా వైదికశ్రుతాం॥

అనియు జెప్పబడియున్నది.

ప్లేటో తత్వవేత్తృత్వము రాజలక్షణమని యభిప్రాయ పడుచున్నాడు. మహాభారతము ధర్మార్థకామార్జనయె రాజలక్షణమని వక్కాణించుచున్నది. కౌటిల్యుడు సర్వభూతహితరతి రాజచిహ్నమని నుడువుచున్నాడు. ఏతాదృశ సర్వసుగుణగణమండితుడు కృష్ణదేవమహారాయలని నొక్కి వక్కాణించుట సర్వజన సమ్మతమగుచున్నది. ఇట్టి మహనీయుని ఇట్టి యాదర్శక మహాక్షత్రియుని గనిన మన భరతమాతకు మనమెంతయో కృతజ్ఞులమయి యామహాశయుని జీవితమునుండి వినయముల గ్రహించి మన యంతరాత్మలను పరిశుద్ధముగ జేసికొనిన కృతకృత్యులము కాగలము. ఈ మహామహుని చరిత్ర సర్వజనుల కుపయుక్తమగుచున్నది. మహీపతులు నీతిని గ్రహింపవచ్చును. దాతలు దాతృత్వమందును భక్తులు భక్తియందును విరాగులు వైరాగ్యమందును కీర్తికాములు కీర్తియందును సత్యగుణాభిలాషులు సత్యగుణాదులయందును నీతని యాదర్శప్రాయునిగ గ్రహింపవచ్చునను టనిర్వివాదాంశము.

# అనర్థక వాఙ్మయము - యెంకి పాటలు

[ పొన్నలూరి లక్ష్మీనారాయణగారు ]



"యెంకిపాటల, యందుగల గుణదోషంబులను నాశక్తి ననుసరించి సంపూర్ణముగ విమర్శించి అట్టిపాట లెట్టుల వాఙ్మయమున కనర్థకములో సహేతుకముగ ధృవపరచుచున్నాను. నేను విమర్శించు పంక్తుల నిట నిచ్చుచున్నాను.

"యెనకజల్మములోన యెవరమో- నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలకనాయెంకి ॥
"ముందుమనకేజన్మ ముందోలె" యంటి।
తెల్ల తెలబోయింది పిల్లనాయెంకి॥
"యిన్నాళ్ళునాకోలె ఈసుకము" లంటి
కంటనీరెట్టింది జంటనాయెంకి ॥

ఆంధ్రభాష ముఖ్యముగా మూడుతెఱంగులఁ గాన్పించుచున్నది. అందు,

(1) సాంప్రదాయ సిద్ధమగు లక్షణభాష. (2) వ్యావహారిక భాష. (3) నింద్య గ్రామ్య భూయిష్ఠమగు నధమజాతి యాంధ్రము.

ఇందు మొదటిది విద్యాధికులకు విశేషపరిచయముఁ గలదియు, అది నుండియు గ్రంథములనలంకరించినదియునైయున్నది. రెండవతరగతి భాష సామాన్యముగా నుత్తమ జాతులనిపించు కొనెడి వారెల్లరు ననుదినముగ వ్యవహారమునందు వాడునదియు పాత్రోచిత్యముగ నాటకములు ప్రహసనములు పాటలు మున్నగు వానియందు ప్రయోగింప బడు నదియునై యున్నది. ఇక మూడవది యధమజాతులనుదినము ను వాడు నట్టిది. పైవిభజనకు భిన్నముగ మనకు దొరకు నుదాహరణముల సంఖ్య యత్యల్పము. అరుదు —

— ఈ పాటలలోని పదములను మూఁడు శీర్షికల క్రింద చూపెదను.

| 1 మొదటి తరగతి. | 2 మధ్యతరగతి. | 3 అధమతరగతి. | |
|---|---|---|---|
| అంటి | లోన | యెట్టినాయెంకి | సిలక నాయెంకి |
| ముందు | ఎవరము | యెనక | జల్మముందోలె |
| మనకే | నవ్వింది | జల్మము | తెల్లతెల |
| మనకు | ముందు | యెవరమోని | పిల్ల నాయెంకి |
| సుకము | మనకే | సిగ్గొచ్చి | ఓది |
| కంటికి | పోయింది | నవ్వింది(నయ్యింది) | సీరెట్టింది |
| జన్మము | మనకు | | జంట నాయెంకి |

* 'భారతి, వైశాఖ సంచికయందు, నండూరి సుబ్బారావు బి. ఎ. గారి "యెట్టినా యెంకి" అను పాటలమీద గావింపబడిన విమర్శకు, జ్యోతి, 16-5-1924, సాహితి రుధిరోద్గారి మాఘ పాల్గుణములు, భారతి రుధిరోద్గారి జ్యేష్ఠసంచిక, శారద జూలై 1924 సంచికలయందు ప్రతివిమర్శలు బయలు వెడలెను. ఈవ్యాసము వానికి ప్రత్యుత్తరము.

ఈ పాటయందలి భావముల నిందలి మాటలలోనే సాధ్యమగు నంతవరకు నీమూడు శీర్షికల కనువగు నట్లు వ్రాసి చూపెదను.

వెఱ్ఱినావెంకి.

**మొదటి తరగతి.**

(1) వెనుకజన్మములోన । నెవరమో యంటి
సిగ్గుపడినవ్వేను । చిలుకనావెంకి॥
(2) ముందుమనకేజన్మ । ముందునో యంటి!
తెలతెలబోయెను । పిల్లనావెంకి॥
(3) ఎన్నాళ్లుమనకోసి । యీసుకము లంటి।
కంటనీర్వెట్టింది । జంటనావెంకి॥

రెండవతరగతి — వెఱ్ఱినాయెంకి.

(1) వెనకజన్మములోన । యెవరమోనంటి।
సిగ్గొచ్చినవ్వింది । చిలకనావెంకి॥
(2) ముందుమనకేజన్మ ముందోసేయంటి।
తెలతెలబోయింది । పిల్లనావెంకి॥
(3) ఎన్నాళ్ళుమనకోసే । యీసుఖములంటి।
కంటనీర్వెట్టింది । జంట నావెంకి॥

మూడవ తరగతి — యెఱ్ఱినాయెంకి.

1) యెనక జల్మములోను - యెవరిమోలంటే
సిగ్గొచ్చినయ్యింది - సిలకనాయెంకి।
(2) ముందుమనకేజల్మ - ముందో లే యంటే
తెల్లతెలబోనాది - పిల్లనాయెంకి।
(3) యెన్నాళ్లమన కోలే - యీసుకాలంటె
కళ్లనీళ్ళెట్టింది - జంటనాయెంకి॥

ఈ పాటయందలి పదములిం చుమించు అన్నియు మూడవతరగతిలోని పదములని చెప్పవచ్చును. దీనివలన యెంకి మూడవతరగతి భాష మాటలాడు నాయికయని స్పష్టము. అట్టియెడ నాయకుడును మూడవతరగతి బాష మాట్లాడువాడై యుండుటయే సహజము. కాని వెఱ్ఱికిబదులుగ యెఱ్ఱియు, వెనుకకు బదులు యెనకయు జన్మమునకు బదులు జల్మమును, చిలుకకు బదులు సిలకయు పట్టుగనుచ్చరించిన నాయకుడు చట్టున నోరుజారి అంటి యను శాస్త్రీయమగు భూతార్థక క్రియ నుచ్చరించెను. కంటన్ మొదలగు మఱికొన్ని కూడగలవు. ఇదికొంత సంశయమును గలుగజేయుచున్నది. నాయకుడు క్రియలను చక్కగ ప్రయోగింప సమర్థుడగు మొదటిజాతి భాషనెఱిగిన పండితుడో కవియోయని సందియము తోపక పోదు. నాయకుడును మూడవతరగతిలో భాషమాటలాడు వాడైయుండిన నీక్రియను ప్రయోగించుట అసంభవము. దీనింబట్టి నాయకుడు మొదటితరగతి శ్రోత్రియభాష మాట్లాడు నుత్తమకులజుడై యుండవలెను. అట్లుకాదేని యీకవనంబున కరీతియు (రసములకుచితము కాని పదవిన్యాసము) విరసమును సిద్ధించును. నాయకుడుత్తమ తరగతిలోని వాడైనచో అధమజాతి యెంకితో మూడుజన్మములకుగల కష్టసుఖముల జెప్పుకొని సరససల్లాపములాడి మేను మేనతో చేర్చుటవలన నీకావ్యనాయిక యనౌచిత్య గానోపునవియు దోచెడిని. ఒండొరుల భుజములను దగ్గరజేర్చి పెట్టప్రక్క నిలువంబెట్టి చిత్తరువును జూపెట్టి వరసము విప్రలంభశృంగార రసముగాక ప్రేమకొలకు పేరిమయగు ప్రణయరసము కానేరదు. కొందరు విమర్శకులట్లుగాక దీనియందు గొప్పభావము గలదనియు ప్రణయరసముప్పతిల్లిపోవుచున్నదనియు మల్లోకములు ముట్టించుచున్నదనియు జెప్పుచున్నారు. భావమేమియు లేదని నేనును నిరాకరింపను. భావమెట్లున్నను నీపాటయందలి భాషహేయమై నింద్యగ్రామ్యభూయిష్టమై అత్యరాస్యులగు నాంధ్రులకు రుచింపనిదై గ్రంథస్థమగుటకు ననర్హమై యున్నది. పాటలకు ఛందస్సు అక్కఱలేదు గావున నేనంత పట్టుబట్టను. పాటలయందు గ్రామ్యపదప్రయోగముకూడ కలదందురేని ఇంతహీనమైన గ్రామ్యమును పట్టుబట్టి సారస్వతమున జొప్పించుటవలన వాఙ్మయమునకు ననర్థకము. ఇట్టి భావమున్నన్నదియు గ్రంథస్థము కాలేదు. పామరులకోట నెపాటనాటవాడబడుచుండెడిదిగాని యెన్నడును గౌరవింపబడలేదు. బొబ్బిలిపాట కామమ్మకథ మున్న

పాటలయందిట్టి జాతులకు చేరువచుట్టమగు హీనభాష వాడబడియుండలేదు. ప్రస్తుతకాలమున స్వేచ్ఛావ్యాపారులగు వారు కొందరిప్పుడిప్పటి వానిని గ్రంథస్థములుగ జేయుచుండిరి. అట్టివి పెద్దలు కొందరంగీకరించు చుండిరి.

"యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతేలోకస్తదనువర్తతే॥"

యనుగీతావాక్యము వీరెఱుంగనిది కాదు. ఇట్టి భాషను నెంత యుత్కృష్ట భావములతో సమ్మిళితము చేసినను గ్రంథస్థము గావించుటవలన ఆంధ్రవాఙ్మయమున కనర్థకము గావించినవారమె యగుదుము. ముందువారు తమపూర్వులయొక్క భాషయిట్టి మహోన్నత్య స్థితియందున్నట్లు నిస్సంశయముగ దలంతురు. క్రమక్రమముగ గ్రంథములన్నియు బూతులు బుంగలు గావచ్చును.

ఇక్కాలంబున పలువురు భావగీతముల పేర రచించు కవిత హృదయాహ్లాదకరమగు మృదుమధుర శైలిని పాటలుగను గీతములుగను చక్కని భావములతో పెంపొందుచున్నది. అట్టివి యాంధ్రసారస్వతమున కాపేక్షకములే కాని భావము పేరుచెప్పి చెప్పరాని భాషను భాషాధికులు గ్రంథస్థముగ జేయుట కడుంగడు శోచనీయము. పండితులాపాదించుచుండునాంధ్రవాఙ్మయమునకు గొడ్డలిపెట్టు పదములు సౌష్ఠవమును బొందినమాత్రమున నశించిపోవుచుండి భావ మెరిక్కాలము నిలువగలదా

"కం. తనువగు శబ్దార్థంబులు
ధ్వనిజీవము లంక్రియావిధానము సొమ్ముల్
తనరుగుణంబులుగుణములు
ఘనవృత్తులువృత్తులు కారకావ్యేందిరకున్"

అనునాలంకారివాక్యమువలనయీశబ్దార్థసౌష్ఠవములేని కవిత్వము తనుహీనమని (కవిత్వముగాదని) ఘోషించుచున్నది. తనువుండినగదా భావము. తనువులేనిది భావమెట్లు భాషనుధ్వంసముజేసి యెంతెంత భావములందిమిడ్చినను నదిబుద్బుద కవిత్వమే యగును పైపెచ్చు వాఙ్మయమున కనర్థకమగును.

శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులవారి సంశయములు తన్నివారణ.

(1) లోకము స్వాతంత్ర్య వాయుపూరితమగుట చాలతప్పని వీరూహించుచున్నారా?

(1) ముందు వెనుకలరయని సక్రమ పరిణామ విరుద్ధమగు నవీన స్త్రీయ స్వాతంత్ర్యమునకు విరుద్ధాభిప్రాయుడనే. ప్రపంచపరిణామమును తదంతఃపాతియగుఆంధ్రకవిత్వాది పరిణామమును కూడతిరోహితముగాన వుడంగీకరించెదనుఏపలుకు పలికినను భాషాభివృద్ధియే కానేరదు.

(2) ఛందస్సున్నయా పూర్ణమా?

(2) సున్నయసత్యమనిరి. వీరిపూర్ణమును అసత్యమే. వీరుసుబ్బారావుగారి పాటలు లక్షణయుక్తములనియు ద్విపదలనియుశ్లాఘించియుండిరి. మొదటి రెండుచరణములును ప్రాసలేని ద్విపద పాదములు రెండవ రెండుచరణములలోను యగణములమీద లఘువులున్నవి. అందుకడపటి చరణమందు యతిశూన్యము మూడవ రెండుచరణములలోను మొదటిదానియందు భగణముపైలఘువు గలదు. కడపటిపాదమందు యతిసున్న. ఇట్టియాకార లక్షణయుతమగు పాటను శాస్త్రీయమని శాస్త్రులవారనుట కడుహాస్యాస్పదంబు. వీరుశాస్త్రీయమనిరి గాని శ్రీసుబ్బారావుగారట్లనరనిదలచెద.

(3) యెట్టిజాయెంకి యందలి భావము నెవ్వరికినివివరింపఁబనిలేదట. ఎందువలన?

కష్టతరమగు పదములీ పాటయందు లేమింజేసియు నిఘంటువు లిప్పట్లు నిరర్థకములగుటచేతను, ఆట్టి భాషాపరిచయము కలవారికెల్లరకును భావమువ్యక్తమగుటను వ్యాఖ్యాన మనవసరము. సలక్షణభాషయేమో వ్యాకరణాదులు జూడవలెనన్నట్టియగత్యము గగనకుసుమము. ఈయెడ వేరవివరింపఁబనియేలను?

(4) వెంకిపాటలో భావములేదా? ఉన్నను అదికవనముగాదా?

(4) అసలు భావములేకపోలేదు. లేదని నేను నిరాకరించియుండలేదు. సుష్టుగుపదములులేనిపట్ల కవనమునకు తను వేలేదని నే నింతకుముందే మనవిచేసి కొనియుంటిని.

(5) ఇట్టికవనంబులు భాషాయోషామణి కలంకారములుకావా?

(5) నింద్యగ్రామ్య భూయిష్ఠ మగుటంజేసి, భాషాయోషామణి కలంకారము కానేరదు.

ఈ సందర్భమున శ్రీ ఆదినారాయణశాస్త్రిగారే తాము ఆంధ్రశబ్ద చింతామణికి బ్రహ్మశ్రీ పారనంది రామశాస్త్రిగారు వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథమునకు పీఠికవ్రాయుచు తొలుదొల్త నుదాహరించినశ్లోకమునుజూడుడు.

శ్లో॥ అధికంయదినాధీషే తథాపిపఠపుత్రవ్యాకరణం।
సకలశ్శకలోమా భూత్సలిలంశలిలం సకృత్ శకృత్॥

వ్యాకరణము నెఱుంగనికతన సంభవించెడి అపశబ్దోచ్చారణమును తజ్జనితమగు నపహాస్యమును నీకు రాకుండుగాక! సకలము శకలముగాను, సలిలము శలిలముగాను సకృత్తు శకృత్తుగాను, కాకుండునుగాక! యని యీ సుభాషితమునకు తాత్పర్యము.

ఇందుకు సంబంధించి సూత్రాదికము.

“అని యమాద్గ్రామ్యం హియత్వపభ్రంశః”

శాస్త్రనియమములేని పద మపభ్రంశ గ్రామ్యమగును. అపభ్రంశమనగా గ్రామీణజన ముఖోచ్చారణములో భ్రంశమునొందినది. నూసె, నేసె, ఇత్యాదికము.

శ్రీశాస్త్రిగారి వ్యాఖ్యాన నిరంకుశత్వము:—

“ముందుమునకేజన్మ” యనుటకు బదులు ‘ముం“దుమునకేజన్మ”యనివ్రాసితదనుగుణ్యముగ మిథ్యావ్యాఖ్యానమునుజేసిరి. వీరుకవిహృదయమునుగుర్తింపజాలక పోయిరి. యెంకిపాటలలోని యసభ్యములు, నశ్లీలములు, నపభ్రంశములను మచ్చునకుఁ గొన్నిటింజూపి ముగించెద.

| | |
|---|---|
| పిల్లపోరుగూరెల్లి<br>మల్లీరాతేదాని<br>వొల్లంత వుడికెత్తి<br>వొక్కణ్ణిపొడుకుంటె | నాయకుఁ డొంటిగ పరుండి యనుభవించు విరహవేదనా వర్ణన కాబోలు? ఏమి చక్కని ధ్వని? |

... ... ... ...

| | |
|---|---|
| తళుకుమని యెంకి నాదరికిరావాలి<br>నిదరరాబోసంట నిందలాడాలి<br>పడుకుంటే నా కేటో బ్రమపుట్టినాది<br>కడుపులో సెయ్యేసి కలిపేసినాది.<br>* * * | చక్కని గూఢతకి ది నిదర్శనము. ఆహా? ఏమి విప్రలంభము. |

‘సీటిగాలికి యెంకిపై ఒగురుతాదంట.’

ఇవన్నియును సభ్యములట. ఇందలి పదములకంటె నపభ్రంశములు నశ్లీలములు నెటదొరకును? పెద్దలదృష్టిలో నీకవితయుచ్చస్థానము నాక్రమించినది.

ఇట్టిపాటలు వాఙ్మయమున కనర్థకములని యిది వరకే వ్రాసియుంటిని. కొందరంగీకరింపనచ్చును. కొందరు ప్రతిఘటింపవచ్చును. కాని వ్రాసిన వ్రాతయెల్ల వాఙ్మయాభివృద్ధియే కాఁజాలదు.

ఇక్కాలంబున ఆకుమడిలోని కలుపువలె అనర్థక వాఙ్మయముపెరిగి పోవుచున్నది. క్రమముగ విద్వాంసులును విమర్శకులును పూనుకొని అట్టివితగు రీతిని గ్రంథస్థములుగాకుండజూచిననేగాని క్రమశః గ్రంథములు బూతులబుంగలు కాఁగలవు.





సీతంశెట్టి శ్రీరామదాసుగారు కట్టించిన శ్రీ భద్రాద్రి సీతారాములవారి దేవాలయము. (బందరు) 1913 సం॥ డిశంబరు నెలలో ప్రతిష్ఠింపబడినది. దాదాపుగ ముప్పదివేలు రూప్యములు దీనికిక్రింద వినియోగింపబడినవి. అనగా శ్రీ శ్రీరామదాసుగారు తమకున్న స్థితివంతను ఈ మహత్కార్యమునకు సమర్పించిరని తెలుపుట కానందము గలుగుచున్నది.

శారద

# నా మైసూరు ప్రయాణము.

[పాలపర్తి రామమూర్తిగారు.]

నాకు జిన్నతనమునుండి దేశదేశముల కేగి యచ్చటచ్చటగల వింతల నెల్లగను గొన వలెనన్న యభిలాష కలదు. మైసూరులో కొన్ని సంవత్సరములుండి విద్య నభ్యసించినట్టియు, బంధుమిత్రులను గలిగినట్టియు ప్రస్తుతము గుంటూరులో హైకోర్టు వకీలుగానుండిన దేశరాజు హనుమంతరావు పంతులుగారు నాకు చిరపరిచితు లగుటచే వారు అప్పుడప్పుడు మైసూరు రాజ్యవైభవములను గూర్చియు, అచ్చటి రమణీయములైన ప్రదేశములను గూర్చియు ముచ్చటించుచు వచ్చిరి. అప్పటి నుండియు నాకు మైసూరు రాజ్యవైభవములను జూచి యానందింప వలెనను కుతూహలము జనించెను. ఒకనాటి వేసవికాల దినమున నామిత్రునితో కలిసి బెంగుళూరునకు బయున మైతిని. వేసవికాల మగుటచే మేముగూడూరు చేరుసరికి దీవ్రమైన సూర్య తాపమువలన మామేనులు చెమ్మటలు గ్రమ్మనారంభించెను. ధూమశకటముయొక్క వేగమునకు దోడు గ్రీష్మవాయువుయొక్క తాడనమువలన మేను పడిన బాధ యాపరాత్పరునికే యెరుక. ఏదోవిధముగ చెన్నపురి చేరితిమి. వేడి గాడ్పులవలన కృశించిన మాదేహములను కొంత ఆహారమువేసి బలపఱుప నెంచి యొక భోజనశాలకు వెళ్ళితిమి. పప్పు, పచ్చళ్ళు, కూరలు, నెయ్యికి అలవాటుపడిన ఆంధ్రుల మగుటచే దాక్షిణాత్యుల కొళంబు, రసం, తైరుపచ్చడి, మూరు (నీళ్ళమజ్జిగ) మాకంతగా రుచించినవికావు.

భోజనానంతరము బెంగుళూరుకు బోవు రైలుబండి నెక్కితిమి. రైలుమారిన వెంటనే అందలి ప్రయాణీకులలోను మార్పు కనబడుచుండెను.

అలవాటు లేమిచే బండ్లలోని అరవల గోడవ మాకర్ణ పుటంబులకు వింతగొల్పు చుండెను. ధూమశకటము కొంత దవ్వరుగు

నప్పటికి నెద్దియోయొకటి వాయు వేగమున మాప్రక్కనే పఱుగిడుటచే నాకాశ్చర్యము తోచి అదియేమియని నామిత్రుని నడిగితిని. "చెన్నపురినుండి ఆర్కోణమునకు రెండు రైలుమార్గము లున్నవనియు బండియొక దానికొకటి వేచియుండక వెంటనే జనుట కొరకిట్టి యేర్పాటుచేయబడె" నని నామిత్రు నివల్ల దెలిసికొంటిని. కొంత కాలమునకు బొంబాయికిని గూడూరుకును జను పొగబండ్ల కూడలియగు ఆర్కోణం జంక్షను చేరితిమి. వేసవికాలపు వేడిమికి దోడు యెడతెగని ప్రయాణమగుటచే మాశరీరములు నీరసించి కడుదుర్బలములై యుండెను. ధూమశకట మాహారముగొని తిరిగి ప్రయాణమునకు సిద్ధమగునప్పటికి నీరసించిన మా శరీరముల గూడ గొంతయల్పాహారములచే బలపఱచి మేముసు సిద్ధముగ నుంటిమి.

అంత గొంతదూరము అరుగునప్పటికి తంజావూరుకు బోవు దక్షిణ యిండియా యినుపదారికూడలియగు కాట్పాడిజంక్షను జేరితిమి. అప్పటికినుమారు సాయంకాలము నాలుగుగంటలాయెను. సూర్యునకు మేఘము లడ్డుపడుట జేతనో లేక అచ్చటి స్వభావసిద్ధమగు శీతోష్ణస్థితి జేతనోగాని కొంచెము చల్లబడి సన్నని వర్షతుంపురలు మామేనులపై బడుటచే మాకమిత సంతోషముగా నుండెను. వాయువేగమున పొగబండి జనుటచే వర్షబిందువులమీది చల్లనిగాలి మా మేనులను స్పృశించుటచేత మామోములు వికసించి మార్గాయాసమును మఱుపుజెందు చుంటిమి. పోనుపోను వర్షబిందువులు వర్షధారలుగా మారిపోయెను.

ఈమార్గమున రైలు కిరుప్రక్కల మేము గాంచిన సృష్టివైచిత్ర్యములనుమీకు తెలుపక విడుచుట ధర్మముగాదు. మార్గమున కిరుప్రక్కల నారికేళ వనములతోను మయిలుపోకునని గాబోలు భూమికి గొన్ని యంగుళములెత్తుగానున్న చిత్రవర్ణములుగల ఫలములతో నలరారు రసాలవృక్షములతోను మరికొన్ని తావుల రమణీయమైన ఛాయ గలిగి తమమేనినున్న ధూళి వర్షధారలచే శుభ్రపరుపబడి స్వచ్ఛమైన కాంతిని వెద జల్లుచు పాలవల్లికి వ్రేలాడగట్టిన వివిధరంగుల రసబుడ్లవలె ప్రకాశించు ఫలములు నేత్రములకు విందుగొలుపుచుండెను. మారి కొంతదవ్వున నిగనిగలాడు పర్వత శిఖరములతోను గిరిగిరులమధ్యనుండు విశాలమైన లోయలతోను స్వర్గమునకు బ్రవేశ ద్వారమో యన్నట్లుల నామార్గమొప్పియుండెను. భూదేవి కలాకాంతములగు నీవిచిత్రసృష్టిని సాకల్యముగ వీక్షించ నభిలాష గలదు. కాని ధూమశకటముయొక్క వేగమున కన్నుల గరవుదీర జూచుభాగ్యమబ్బదయ్యె. నేత్రోత్సవముచేయు నీవిచిత్రసృష్టిని వీక్షించిన నాస్తికునకైనను భగవంతుడున్నాడన్న నమ్మకము బుట్టక మానదు. తనను దెలిసికొనమని చిత్రవిచిత్రముగ దన మహిమలను అక్కడక్కడ వెదజల్లి దాగియున్న ఆసర్వేశ్వరుని గొనియాడ నెవరి తరము!

అంత గొంతదూరము జనినపిదప శీతలదేశ నివాసులకు వేసవికాలమున శరణ్యమగు నీలగిరి కొండలకు బోవు యినుపదారి కలియుచోటగు జోలారుపేట జంక్షను జేరితిమి. అప్పటికి యినుడు తనప్రాంతముల

దినపనిని ముగించి యస్తాద్రిని గ్రుంకుతరుణ మాయెను. చలిగాలి తీవ్రముగ వీవనారంభించెను. వేసవివస్తువులను విసర్జించి చలికాలపువస్తువులను ధరించవలసి వచ్చెను. కను చీకటికి దోడు కారడవులతో నిండియున్న గిరులమధ్యగాపోవుబండిప్రయాణముచేయుట జూడ నాశ్చర్యమును భీతియు జనించుచుండెను. ఇట్లు కొంతదూర మరిగినపిదప బంగారపు గనులకు బోవుయినుపదారి కూడలి యగు బౌరింగుపేట జంక్షను జేరితిమి. అచ్చటనుండి పయనమై రాత్రి పదిన్నర గంటలకు మైసూరు రాజ్యమునకు ప్రధాన నగరమగు బెంగుళూరు పట్టణమునకు జేరితిమి. ఇదియె మాముఖ్య గమ్యస్థానమగుటచేనచ్చట దిగి మాగ్రామ నివాసులును చాలకాలము నుండి యీరాజ్యమునందే ఉన్నతోద్యోగమును బడసినవారును నావెంట నంటిన మిత్రుని పినతండ్రియునగు దేశరాజు శీతారామరావు పంతులుగారి భవనమునకు బోతిమి.

—: బెంగుళూరు పట్టణము: —

మఱునాడు బెంగుళూరు నగర వైభవములను జూడనెంచితిమి. బెంగుళూరు చెన్నపురికి 219 మైళ్ళదూరమున నున్నది. సముద్రపట్టణమునకు 3,113 అడుగులయెత్తు గల్గిన పీట భూమిమీద నీపట్టణము నిర్మింపబడి యున్నది. ఇంతయెత్తున నుండుటచేతనే యిక్కడి శీతోష్ణస్థితి చాలచల్లగా నుండును. బెంగుళూరులో కొంతభాగము కంటోనుమెంటు అనిపేరు. ఈభాగము బ్రిటీషు ప్రభుత్వమువారికి చెందియున్నది. ఇదియొక బ్రిటీషు రెసిడెంటు పరిపాలన క్రింద నుండును. ఈపట్టణమున చూడదగిన వానిలో కోట, రెసిడెన్సి భాగము, లాల్ బాగ్ అను పేరుగల ఉద్యానవనము, కుబ్బన్ పార్కు లేక పీపుల్సు పార్కు ముఖ్యములు. ఇక్కడి కోట 1537 సంవత్సరములో కెంపె గౌడయనుహిందూ రాజుచే మట్టితో నిర్మింపబడినది. హైదరాలీ కాలములో 1761వ, సం॥ మున నీకోట తిరిగి రాతితో కట్టబడినది. ఈకోటకు రెండు ముఖద్వారములు గలవు. ఉత్తర ద్వారమునకు డిల్లీద్వారమనియు, దక్షిణద్వారమునకు మైసూరు ద్వారమనియు పేర్లు. డిల్లీముఖద్వారము మహమ్మదీయ శిల్పకళానైపుణ్యమును చాటుచుండును. ఈకోటకొక మైలు దూరమున నైఋతీ మూలగా కెంపెగౌడయి రాజుచే నిర్మింపబడిన గాలి గంగాధరేశ్వరుని దేవాలయము కొండగుహలో నున్నది. ఇచ్చట శివుని చిహ్నములగు త్రిశూలము, ఛత్రము, ద్వారభేరి విడివిడిగా 15 అడుగుల యెత్తుగల ఒకేరాతితో అందముగా చిత్రింపబడి యున్నవి.

1638 వ, సంవత్సరమున బెంగుళూరు బీజపూర్ సేనాధిపతిచే వశపర్చుకొనబడెను. 1791 వ, సం॥ మున బ్రిటీషువారికిని టిప్పూ సుల్తానుకును జరిగిన మూడవమైసూరు యుద్ధమున లార్డుకారన్ వాలీసు గారిచే పట్టుకొనబడెను. టిప్పుసుల్తాను మరణించి శ్రీరంగపట్టణము బ్రిటీషువారి వశమైనపిదప 1799 వ సం॥ మున మైసూరు తిరిగి పూర్వపు హిందూ రాజుల సంతతి వారగు ఉడయర్లకు నిచ్చి వేయబడెను. ఆఉడయర్ వంశము వారే యిప్పుడు రాజ్య మేలుచున్నారు. ఇప్పటి మైసూరు మహారాజు.........'దివాను' అను

హాదాగల మంత్రుల సహాయమున మైసూరు సంస్థానము పరిపాలింప బడుచున్నది. సమర్థులగు దివానులలో నొకరని పేరుగాంచిన సర్. యం. విశ్వేశ్వరయ్యగారు మన ఆంధ్రులగుటచే మనమెల్లరము సంతోషింప దగియున్నది.

ఇచ్చట చూడదగిన వానిలో లాల్ బాగ్ అను ఉద్యానవన మొకటి. విశ్రాంతికి పురజనులు తండోపతండములుగా వచ్చి నీ యుద్యానమందలి తరులచ్ఛాయల, లతాగృహములందును, విశ్రమించి అందలి వివిధవృక్ష సంతానమును, సుగంధపుష్పగుచ్ఛములమీది కమ్మతావుల నాఘ్రాణించి యానందించి వెళ్లుచుందురు. వనమధ్యమున ఉన్నతమైన తురగము నెక్కినట్లు నిర్మింపబడిన చామరాజేంద్ర మహారాజుయొక్క గొప్ప ప్రతిమ గలదు. పీపిల్సు పార్కు అనుపేరున నొక ఉద్యానవనము గలదు. సాయంకాలమున విహారార్థము పలువురిక్కడికి వచ్చి విశ్రాంతితీసుకొనుచుందురు. ఇచ్చట తరుచు మిలిటరీ బ్యాండు వాయిద్యములు ప్రమోగుచుండును.

చూడదగిన భవనములలో గవర్నమెంటుహౌసు, రెశిడెంటుగారి నివాసస్థలము మైసూరు ప్రభుత్వమువారి పబ్లిక్కు ఆఫీసు భవనములు, సెంట్రలు జేయిలు, గవర్నమెంటు కాలేజి, కోటలోని మహారాజావారి క్రొత్త రాజనగరము, పురాతన రాజనగరము, విక్టోరియా ఆసుపత్రి, మ్యూజియం, క్రైస్తవ దేవాలయములు, విద్యుచ్ఛక్తి యంత్రాలయము ముఖ్యములై యున్నవి.

—: పట్టణ స్థితి :—

ఒకనాటి యుదయమున మేమీవైభవములను దిలకింప నుద్దేశించి ద్విచక్రశకటముల (బైసికిల్) నెక్కి పయనమైతిమి. ఈనగరము పర్వతాగ్రములపై నిర్మింపబడినందున నిమ్నోన్నతములైన రాచబాటలు గలిగియున్నది. ఒకవీధిలో నిలబడి ముందుజూచిన కొంతయెత్తున భవనములు వీధులు వీధుల వెంబడి జనుచుండు గుఱ్ఱపుబండ్లు మనకన్నులకు గోచరమగుచుండును. మనమా ఉన్నత ప్రదేశమునకు బోయి నలుదెసల పరికించిన అధోముఖముగ నొకపట్టణమువలె కొన్ని గృహములు వీధులు గనంబడును. ఈవిచిత్ర గోచరమునకు కారణము ఆపట్టణముయొక్క మిట్టపల్లములేయని గ్రహించితిమి. వీధులు నిమ్నోన్నతములుగా నున్నందున బైసికిళ్ళమీద నెక్కి అన్నివీధులను దిరుగుట మిక్కిలి కష్టతరముగా నుండును. ఎత్తునుండి క్రిందికి బోవు రోడ్లపై మా బైసికిళ్ళను ప్రయాస లేకయే పోవుచుంటిమిగాని తిరిగి క్రిందనుండి ఎత్తుకుబోవు రోడ్లమీద బైసికిళ్ళను త్రొక్కుట చాలదుస్తరముగా నుండెను. అట్టి సమయములో మేమొక్కొక్కప్పుడు సైకిలు దిగి పోవలసివచ్చెను. మొత్తముమీద మా బైసికిళ్ళషికారు మిక్కిలి సంతోషకరముగా నుండెను. మధ్యాహ్నమగుసరికి మేమందఱము గృహప్రవేశమై భోజనమునకు జనితిమి. మాగృహయజమాని ఆంధ్రులైనను చిరకాలమునుండి కన్నడ రాష్ట్రమున నివసించుటచేత అక్కడి భోజనముగూడ వారికి అలవాటుపడియుండెను. అరవలకున్నట్లు మనకును మైసూరు రాష్ట్రమువారికిని భోజనములో విశేష వ్యత్యాసములేదుగాని వంగీభాత్ కేసరిభాత్ కోసుంబరి, మైసూరురసం, కూటు మున్నగు యేవియో కొన్ని మాత్రం క్రొత్తగానుండినవి.

(సశేషము.)

# కవిత్వము.

[ దర్భా యజ్ఞేశ్వర సోమయాజులు గారు. బి. ఏ. ఎల్. టి. ]



తే॥ విబుధలోకంబు "కవితైవ విద్య" యనుచుఁ
జదువు వచనార్థమున సంశయము గలదె!
విద్యలకు నెల్ల నుత్తమ విద్య కవిత
దానిఁ దెలియుట విశ్వమంతయును గనుట॥
(అప్పకవి.)

1. "కు=వర్ణించు" అను ప్రకృతినుండి "కవయతీతి కవిః" యనియు, "కబృ=వర్ణే" "వ,బ, యోర భేదః," "కవృ" అను ప్రకృతినుండి "చాతుర్యేణ వర్ణయతీతి కవిః" యనియు శబ్ద సిద్ధి యేర్పడినది. దీనినిఁబట్టిచూడ "చాతుర్యముగా విషయ వర్ణనలను జేయువాఁడే కవియనియు, వాతఁడు రచియించు నది యెల్ల కవిత్వమనియు" తెలుకపడు చున్నది. విజ్ఞాన కళలలో ప్రత్యేక కళగ నెన్నఁబడుచు, మనోభావ కల్పనలదగు (కళా నిబంధన బంధురమేని లేక వ్యత్యస్తమేనియగు) ప్రకటన సౌకుమార్యము కవిత్వ మనఁబరగు చున్నది. మనోభావ కల్పనల ప్రకటన సౌకుమార్యము వలనను తన శక్తి ప్రభావము వలనను జాతి విజృంభణ ప్రేరణములలో ప్రధాన ప్రేరణమై వెలయుట వలనను కవిత్వము శాస్త్రములతోఁ దులఁదూగు ప్రతిభ గల దానివలె పొడగట్టు చున్నది. కొన్ని సారస్వతములందు కవిత్వ శక్తికిని, మఱి కొన్నిట కవిత్వకళకును, ప్రాముఖ్యము పొసఁగి నట్లగపడు చున్నది. ఆయా కవీశ్వరులందుఁ గూడ నీ నిర్ధారణమే వర్తించు చున్నట్లగపడు చున్నది. ఆంధ్ర కవులలో నన్నయభట్టును కవిత్వశక్తి గలవానినిగను తిక్కన సోమయాజిని కవిత్వ కళా నైపుణ్యము గల వానినిగను భావింపవచ్చును. నన్నయభట్టు తనకగు కవిత్వ కుశలత్వమంత యెక్కువగా గల వాఁడైనను తన సహజ గుణములగు "నను శాసన" "విన్యాసన" విధులకే యెక్కువ వశపడియున్నాఁడు. ధారాళమైన ధార శుద్ధిగల తిక్కన కవనమునందు కళా నైపుణ్యములు పెక్కులు గలవు. తిక్కన శ్రీనాథుఁడు సూరన మున్నగు కవి గ్రామణులు కవిత్వ కళను బోషించి పెంచిరి. నన్నయ రామరాజ భూషణుఁడు రామకృష్ణుఁడు వీరు కవిత్వ శక్తిని ప్రోదిచేసిరి. కళా నైపుణ్యములను కవిత్వ పటుత్వమును సంధించి మిన్నలై నెగడినది యెఱ్ఱాప్రెగ్గడ, నాచన సోముఁడు, పోతన, కంకటి పాపరాజు, పెద్దన మున్నగు ప్రబంధ కవులు.

2. ఈ వ్యాసమున కవిత్వము యొక్క కళా నైసర్గికమునుఁగూర్చి ప్రధానముగ ప్రశంసించెదను. కవిత్వమునకు బాహుళ్యమగు వ్యాప్తి గలదనియు, మానవ జీవిత ప్రేరకములగు నితర ధీవినిర్మిత విషయ జాలముతోడి సంబంధము వలన కవిత్వమునకు సునిశ్చితమైన సామర్థ్యము గలుగు చున్నదనియు చెప్పి కవిత్వము యొక్క శక్తినిగూర్చి ప్రకటింప విరమించెదను. అగ్ని యొక్క యుపయోగములను నిర్ణయించుట విద్యుచ్ఛక్తి మున్నగు ప్రయోజనకర విషయముల గనుగొనుట యన్నవి మానవకోటి యభివృద్ధి కెంత తోడ్పడి నట్లు ప్రకటించు చుందురో యంతకంటె నెక్కువగ నాయా మానవ జాతుల సారస్వతము లంపలి

కవిత్వముకూడ వారివారి నాగరికత నభివృద్ధి చేయుటకు తోడ్పడుచున్నదని వేరె చెప్ప నవసరములేదు. వేయేల కవిత్వముయొక్క యీ ప్రాశస్త్యమును గూర్చి యుగ్గడింపని చారిత్రక తత్త్వ విచారములు వ్యర్థములే

3. ప్రస్తుతము కవిత్వకళకు సంబంధించిన యీ దిగువ విషయముల నరయుదము. “(1) కవిత్వమన నేమి? (2) ఇతర కళలంగూడి యిది యెట్టిస్థానమును పొందుచున్నది. (3) విషయ ప్రకటనమునం దితర కళలందుకంటె దీనికి గల ప్రాశస్త్య సౌకుమార్యములను? (4) నాటకభావన, యాత్మభావన యనెడి కవిత్వము యొక్క ప్రధానోద్బోధన ప్రేరణ జనకములగు నెట్టి వివిధ కవిత్వ కళాభాగములేర్పడుచున్నవో!” యను నీ విషయముల గూర్చి చర్చింతము.

4. కవిత్వమన నేమి? భౌతిక శాస్త్రాది శాస్త్రము లందువలె కవిత్వమును దానియొక్క నిర్వచనమును ప్రకటించుట యసాధ్యము. శాస్త్రములం దేదేని యొక పదముయొక్క నిర్వచనమును ప్రకటించినచో నాశాస్త్రము నందా పదము నెచ్చట వాడినను నదియా నిరుక్తార్థమునే ప్రబోధించుచుండును. ఇంతియకాక నిర్వచనమునం జేర్కొనిన గుణముల నాశ్రయించి కొని మఱికొన్ని గుణములుండుట శాస్త్రములందు చూచుచున్నాము. దీనంజేసి నిర్వచనము చాల సంక్షిప్తమైన స్థితిని ప్రకటింప సాధ్యమగా నట్లొనర్చుచున్నది.

కవిత్వమునకు నిర్వచనము నొసగనుంకించినచో దానియందు కవిత్వపు ప్రధానగుణములనుం జేర్కొనవలెను. ఈ ప్రధాన గుణముల నాశ్రయించికొని యొక కొన్ని సాధారణ గుణములు ప్రస్ఫుటముగ వ్యక్తమగుట యన్నది కవిత్వము పట్లనసాధ్యము. ఇది యిట్లుండ కవిత్వముయొక్క ప్రధాన గుణజాల మిద్దియని యెవ్వరు చెప్పంగలరు. కవిత్వ తత్త్వమును గూర్చి యేవియో యొక కొన్ని భావములందరి మనంబులందును తిరుగాడుచుండును. కాని వానైనను వానిని ప్రకటించెదమని లేఖినిని చేతంబూని వ్రాయ నుంకించు తరి నవి యన్నియుకూడ నెట్టివాని మనోవీథినుండి మాయమగుచుండును. వీనిని బట్టి చూడ కవిత్వము యొక్క నిర్వచనమును ప్రతిపాదించుటంత సులభము కాదని తేటపడుచున్నది.

ఆంగ్ల సారస్వతమునను, నాంధ్ర సారస్వతమునను కూడ నొక కొందరు మహానుభావులు కవిత్వము యొక్క నిర్వచనముల నొక కొన్నిటి నొక్కొక రీతిగా నొసంగి యుండిరి. వానినెల్ల నాకు తెలిసినంతవఱ కిచ్చో ప్రకటించెదను. కవిత్వమునుగూర్చి మనకుం గల యాయా భావనలు వీనిలో నొక కొన్నిటి యోగమున నేర్పడినవేని కావచ్చును! లేదా వీని యన్నిటి కూటభావమేని కావచ్చును. లేదా వీనిని మించిన మఱికొన్ని క్రొత్త తత్త్వముల మొత్తమేని కావచ్చును. 1. ఛందోబద్ధమైన రచనమే కవిత్వమని యొకరును, 2 భావనాశక్తిని జేదోడుగ జేసికొని వాస్తవమును సంతోష దాయకముగ నుండునట్లు ప్రకటించు కళానైపుణ్యము కవిత్వమని యొకరును. 3 విషయములం గల్పించుటే కవిత్వ సారాంశమని యొకరును 4 ఆవేశోద్రేక గర్భితములైన భావములయు, పదములయు సంఘటనమే కవిత్వమని యొకరును 5 చిత్రకారుడు రంగుల మూలమున నెట్టి కార్యములను సాధించుచున్నాడో దానినే పదముల సహాయమున నిర్వహించుచు మానవుల భావములందొక విధమైన భ్రాంతిని కల్పించునట్లు పదములను కళానైపుణ్యముతో నల్లుటే కవిత్వమని యొకరును 6 వినసొంపైనభావమే కవిత్వమని యొకరును 7 భావనాశక్తియొక్క ప్రకటనమే, కవిత్వమని యొకరును; 8 భావనశక్తియొక్కయు, రాగములయొక్కయు భాషయే కవిత్వమనియొకరును; 9 “యథార్థత, రమణీయత, సమర్థతలయందు గల యనురాగమును దానిభావములను, కల్పననిష్ఠతోను భావననిష్ఠతోను పురస్కరించుకొని బహువిధములుగ నగపడుచు నేకత్వముగల భాషయందు వీనిని ప్రకటించిన ప్రకటనమే, కవిత్వమని యొకరును; 10 “యథార్థమును ప్రకటించుటే

ప్రతిభానోద్యమముగాఁగల శాస్త్ర జ్ఞానమునకు ప్రతిపక్షతవహించి హృదయరంజన మొనర్చుట నేముఖ్యాశయముగాఁ గొన్న విజ్ఞాన సారస్వతమే" కవిత్వమని యొకరును; 11. "మూర్తీభవించిన యపారజ్ఞాన లక్ష్మియొక్క యాత్మానుభవములును, సకలశాస్త్రముఖస్థంబైన సరసమగు వికాసము నున్నవే, కవిత్వమని యొకరును; 12. "యదార్థమును వక్కాణించుటకు సామర్థ్యము నొసఁగు సంపూర్ణమైన మానవభాషయు; నాహ్లాదమును కల్పించు సంపూర్ణత నొందిన మానవభాషణోక్తియు; కవనచాతుర్యము కవనవాస్తవత యను వాని సిద్ధాంతములచే నిబద్ధమైన స్థితుల ననుసరించి చేసిన జీవిత విమర్శనమును" కవిత్వమని యొకరును; 13. "లయతాళానుబద్ధమైన సౌందర్యము యొక్క కల్పనమే, కవిత్వమని యొకరును; 14. పట్టశక్యముకాని భావములయొక్కయో, లేక వెల్లివిరియుచున్న కల్పనములయొక్కయో, ప్రకటనమే కవిత్వమని యొకరును; 15 "మనకగపడుచు మన కందుబాటుగనున్న వానియందు మనకుఁగల యనిష్టముయొక్క ప్రకటనమే కవిత్వమని యొకరును; 16. ప్రకృష్టములైన యావేశములకు సర్వోత్కృష్టములైన యాశయముల భావనలపూర్వకముగ నారోపించి ప్రకటించుటే, కవిత్వమని యొకరును; 17. "భావనలందుఁగల్గు భావములను, రాగములను, నుచితరీతిని ఛందోబద్ధమైన భాషయందు ప్రకటించి మనస్సునురంజింపఁ జేయుట యను కళాకుశలత్వమే, కవిత్వమని యొకరును; 18. కళామయములై వస్తునిష్ఠగల మానవుల మనోవికారముల నావేశపూరితమై లయతాళబద్ధమైన భాషయందొనర్చిన ప్రకటనమే, కవిత్వమని యొకరును ప్రకటించియున్నారు.

ఇవి యిట్లుండ,

చ॥ "కవిత యనంగఁ బద్యములు
గద్యములున్ రచియించుటొనె భా
వవిలసనంబు, లోకహిత
వర్తనముం బచరింపఁ జేసిఁక
న్గవకను నద్దమెట్లటుల
గ్రంథచమత్కృతి నేర్పు పెంపునన్
బ్రవిమల వస్తుతత్త్వమును
భాసిల జేయుట గాకయారయన్ ॥

(చాటుధార)

సీ॥ శబ్ద సంస్కార మెం • చ్చటను జారగనీక
పదమైత్రి యర్థసం • పదల బొదలఁ
దలఁపెల్ల నక్లిష్ట • తను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు • పొంతఁబోక
యాకాంక్షిత స్ఫూర్తి • యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ • గడవఁజనక
ప్రకృతార్థ భావంబు • పాఁ మకోనదుకుచు
నుపపత్తి యొందు • నత్యూర్జితముగ
తే॥ నొకటఁబూర్వోత్తర విరోధ • మొందకుండఁ
దత్తదవయవ వాక్య తా • త్పర్యభేద
ములు మహాకావ్య తాత్పర్య • మునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపః ఫలముగాదె ॥

(పింగళిసూరన)

క॥ ఛందో లంకారాదుల
యందలి పాటెల్లఁదుదిని • వ్యర్థముకాదే
సుందరమగు వాక్యంబుల
పొందెఱిఁగి రచించు బుద్ధి • పుట్టకయున్నన్ ॥

( అప్పకవి )

కవిత్వమునుగూర్చి మనవారీ రీతిగ వాక్రుచ్చియున్నారు.

6. ప్రకటిత విషయ మెట్టిదైనను, ప్రకటనవిధి యెంత వస్తునిష్ఠ గలదైనను, పదముల పొందిక యెంత లయానుసారియై తాళగతుల గొలుపునట్టిదైనను, కళానైసర్గిక గుణకలితమైన దైనను, నావేశజనకముకాని వ్రాఁత కవిత్వమనిపించికొనదు. అపహారముల (abstractions) గ్రహించి, వానికి వస్తునిష్ఠ కల్పించి ప్రకటించుట దక్క! వీనితో కవికి వేఱెట్టిసంబంధమును గాని యున్నట్లగపడదు. ప్రకృతియందును మానవులందును ముఖ్యముగా నగపడు స్వభావబీజ

ముగు "సర్వాత్మిక భావమును వస్తునిష్ఠగల రూపమున ప్రకటించుటే కళానైపుణ్య మనఁబరగుచున్నది. ఇట్టి వస్తునిష్ఠగల రూపముల కుచితమగు ఛందోబద్ధమైన భాషన ప్రయత్నపూర్వకముగా నెన్నుకొని యాయా విషయములను ప్రకటించుటే కవిత్వకళానైసర్గిక మనబరగుచున్నది. ఎట్టికళా కల్పనము నేనిఁ జూచి పరిశోధించుతఱి: "దీనియందలి విషయములు నిజముగా సత్యములా కావా? అవి సర్వత్రానువర్తితములా కావా? ఇవి మానవత్వ మూలాధారములగు బీజాంకురములా కావా? వీనిని ప్రకటించు వస్తునిష్ఠగల ప్రకటన విధుల రూపమావేశపూరితములైన మానవహృదయములచే నిజముగా రమ్యముగా నున్నట్లంగీకరింపఁ బడుచున్నవా లేదా? యను ప్రశ్నముల పురస్కరించికొని తద్విమర్శన నిరీక్షణములకుఁ గడంగవలెను. తదితరములగు ప్రశ్నము లన్నియుఁగూడ నసంగతములే యగును. వస్తునిష్ఠ పద్యముయొక్క స్వరూపమును గ్రహించుటకై యీ దిగువ పద్యమును గ్రహింపుడు.

ఉ॥ నిండుమనంబు నవ్యనవ
నీతసమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జ
గన్నుతవిప్రుల యందునిక్కమీ
రెండును రాజులందు విప
రీతము గావున విప్రుడోపు నో
పండతిశాంతుడయ్యు నర
పాలుఁడు శాపము గ్రమ్మరింపఁగన్॥
భార ఆ. 1. 100.

మ॥ హరినామస్తుతి సేయు కావ్యము సువ
ర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానసరస
స్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేని కావ్యమువిచి
త్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమైయుండదయోగ్యదుర్మలి నట
త్కాకోల గర్తాకృతిన్॥ భాగ.

లక్షణమునకు సంబంధించిన ప్రశ్నములను విడిచి వీనిని పరీక్షించినచో నివి వస్తునిష్ఠగల ప్రకటన విధిని పురస్కరించుకొని భావముల నుచితగాంభీర్యములో ప్రకటించుచున్నట్లు గ్రహించుచున్నాము. ఇందు వస్తునిష్ఠాత్మక విధి నవలంబించియే నన్నయ భట్టారకుడును పోతనార్యుడును విషయప్రకటనముల నొనరించియున్నారు. ఇందు విప్రులయు, నరపాలురయు, సాధారణ ధర్మము నూహించి ప్రకటించిరే కాని యిది యీప్రత్యేక భూసురుని నైజము—నది యీ ప్రత్యేకభూభర్త లక్షణమనని చెప్పలేదు.

"నవ్యనవనీతము, దారుణాఖండల శస్త్రము" మున్నగు కవిచాతుర్య పదజాలాదులు బోధించు భావములు భావనశక్తి పూర్వకముగ గ్రహింపదగినవే యైనను "నవనీతము, శస్త్రి" యనువస్తునామములతో గూడి యుండుటచే వీనికివస్తునిష్ఠయేర్పడుచున్నది. ఇట్లే రెండవ పద్యమునందు కూడ "మానస సరస్సు, గర్తము, హంసలు, కాకోలములు" ననుపదములచే వస్తునిష్ఠ కల్గుచున్నది.

కవిత్వము ఛందోబద్ధమై తాళగతులు గొలుపు సామర్థ్యము కలదిగా నుండవలెనా యక్కరలేదా? యనువిషయమునుఁ గూర్చి భిన్నాభిప్రాయములను కొందఱు కొందఱు ప్రకటించి యున్నారు. సారస్వతము లన్నిటి యందును గద్యపద్య విభజనమును చూచుచున్నాము. ధీమాత్స్మృత యావేశమువను రెండు బీజములు గద్యములందు కాన్పించుచున్నవి. ధీమాత్స్మృత, యావేశము కావ్యము, యనుమూడు బీజములతో పద్యములొప్పుచున్నవి. కావ్యతయే కవిత్వముయొక్క యగ్రగణ్యమగుగుణమని యొకకొందఱు విమర్శకోత్తముల యాశయము.

కొన్నిసమయములందు కవిత్వము నందలి భావప్రాశస్త్యము వానిని ప్రకటించు భాష నైసర్గికగుణములమీదను, తదితరములగు పెక్కుగు పూతల మీదను నాధారపడి యుంటను చూచుచున్నాము; కాని యియ్యది యన్నిటఁ; మాత్రము కాన్పించుటలేదు. పద

ముల భావములను వాని నైసర్గిక గుణములను; గద్యములందలి విషయములను విమర్శించు విధులకంటె నుత్కృష్టములైన విధులచేతనే యరసి విమర్శింపవలెను. భావౌచిత్యమువలన నావేశమును పుట్టించి మనంబుల రంజింప జేయు తిక్కన, పోతనాదుల కవనములను; ఉచ్చారణ మాత్రముననే రచనభాగము లందు గర్భభూతములైన విషయముల యొక్క గూఢభావాదులను తోపింపజేయు పెద్దన సూరనాదుల కవనములను; భావగర్భితములై, రసభూయిష్ఠములైన శ్లిష్టములైన ద్వ్యర్థి రచనములను నొకరీతి దృష్టితో పరిశోధింపరాదు. ఇంతియకాక కొందఱి కవిత్వమునకు నడకలయొప్పిదమును కొందఱి కవనమున పదలాలిత్యమును, మఱికొందఱి కవితల యందలంకార సౌరభమును, యొప్పమీరియుండి చదువరుల నానందింపఁజేయుచుండును. వరూధిని ప్రవరాఖ్యుల సమావేశమునకును, శకుంతల దుష్యంతుల సమావేశమునకును, సుబోధకములుగా వర్తించిన చిత్తనైసర్గికములం దొకకొంత విభేదమును చూచుచున్నాముగదా? ఇందు మొదటిదానియందు రెండు విరోధ కాంక్షల సమసనము, రెండవదాని యందు రెండనుకూల మానవాకాంక్షల సంఘటనమును ప్రకటింపవలసి యుండెను. ఇందు మొదటి విషయమును వర్ణించు పద్యములందొక విధమైన విషాదరస సాంతర్వాహిని జ్యోతితమగుచునే యుండును. పద్యములందుకూడ నొక విధమైన పెళుసుదనము కాన్పించు స్థిరత్వమును ప్రకటించు కొంత దృఢభావము వ్యక్తమగుచుండును. కాని రెండవదానియందనుకూల భావము లొకదానితో నొకటిలీనభావమునొందుచు నొకదానికొకటి పోషకముగా వర్తించుచు, చంచల స్వభావముకల్గి దృఢత్వ స్థైర్యములు లేక చదువరులను తమతమ యాందోళన చాంచల్యంబులచేతనే రంజింపఁజేయుచుండును. విషయప్రకటనమున కనుకూలములైన నాయాజాతి పద్యములందే యాయా విషయములను ప్రకటించుటుచితము.

కవిత్వము కూడనొక జీవముగల నైసర్గిక కళయే యగుటచే దానియందు కవియొక్క కళాకుశలత్వము వ్యక్తమగుచుండును. కళలకు నైసర్గిక గుణమగు "యెన్నుగడ" కవిత్వమునకు కూడ నావశ్యకము. విషయము నెన్నుకొనుట, దానిని సాభిప్రాయ విశేషణములతో సమగ్రముగ ప్రకటించు భాష నెన్నుకొనుట, వీనిని రెండింటిని నెన్నిక కెక్కువ నైపుణ్యమైన విధిని సంధించుట యను నీబాధ్యతలన్నియు కవివై యున్నవి. ఇవియిట్లుండ తానా యావిషయముల హృద్యముగానుండునట్లే యే సారస్వతరీతిని ప్రకటింపగలడో దానిని కూడ యెన్నుకొనవలెను. కొందఱకు ప్రబంధరీతి ప్రకటనలును కొందఱకు పురాణపక్కి ప్రకటనలును మఱికొందఱకు నాటకరీతి ప్రకటనలును, ఇంకమఱికొందఱకు వీరగీతముల రీతి ప్రకటనలును, తక్కిన కొందఱకు హరికథల విధానమును కరతలామలకములుగా నుండును. ఏయితివృత్తమునకే జాతి ప్రకటనము చేత తన ప్రకటనము చేత తనచతుర రచన విలాసగతి ప్రభావితభావలాలసముగ జేయుచుండునో దానినే యెన్నుకొని, దానియందే విషయప్రకటన మొనరింపవలెను; అనగా కవిత్వమును కళానిబద్ధముగజేసి, జీవమును పోసి, రసవంతముగ జేయవలెను. దీనికి తార్కాణముగ నీదిగువ పద్యమును చూడుడు.

శా॥ పుణ్యం బేదిన నేదనీ, జనులు గుం
పుల్ గూడి కాదంచు కా!
ర్పణ్య ప్రక్రియ బల్కినన్ బలుకనీ,
రాజుల్మహాదుర్గుణా!
గణ్యంబొండంచును దెల్పినన్ దెలుపనీ;
కౌతూహలం బొప్పనీ!
పణ్యస్త్రీమధురాధరసుధా
పానంబు గావించెదన్॥

[ జగ్గకవి. ]

ఈపద్యము నందలి విషయము పణ్యస్త్రీమధురాధర పానము చేయుటయందలి నిశ్చయము. దీనిని కవితన కల్పపౌఢి మెఱయునట్లు, హాస్యరసము చిప్పిలుచుండురీతిని, సొగసైన వాగమృతధారతో, చదువరుల రంజింపఁజేసియున్నాఁడు. కవియొక్క కళావైచిత్ర్యముకూడ యిందు ప్రకటమగుచునే యున్నది.

ఏహృద్యభాజనమైగర్హితమగు నీవిషయము నంగహాస్య రసమునఁ బ్రవేశ పెట్టుటచే దాని సహజా సహ్యము రూపడినది.

వీనిని బట్టికవికి కల్పనాశక్తియు, కళాకౌశల్యమును, మాత్రమున్న చాలదనియు; నీరెండుభావన గుణములకును శరీరమునందగు వాగ్వితాన వైఖరియొక్క సౌకర్య విన్యాసముల గ్రహణశక్తియు కూడనావశ్యకమనియు తెలుకపడుచున్నది. వీనిని గుర్తించి, వీనినిపాటించుచు రచించినప్పుడే యీజ్ఞానముయొక్క యుపయోగము గణ్యతకెక్కును. కానియిట్లు రచించు బుద్ధిపుట్టనిచో, నీజ్ఞానము నిరర్థకమై, వానినిదోషాకరునిగాఁ జేయును. ప్రకటనవిషయ మెట్టిదైనను సరే యావేశమును కల్పించుటయన్నదే కవిత్వము యొక్క ముఖ్య గుణము. భావములను కవిత్వములోనికి గొని ఐచ్చుతచేని వానినావేశమును పుట్టించు విధులలో భావింపవలసి యుండును. ఈగూవేశ జనకవిధి రచన శైలి చమత్కారములను, రూపరామణీయమును కూడ కాంక్షించుచుండును.

ఛందోబద్ధమై ముద్దు పలుకుల మూటయై, యొప్పురచనము కవిత్వమని చాలమంది యెప్పుకొనుచున్నారు. ఇదియిట్లుండ, తానేదేని వ్రాయబూనినప్పుడు కవితానొకవిధమైన వింతపంచ భూతాత్మక ప్రపంచముచెచుట్టబడియున్నట్లు భావించుచుండును. కవితావర్ణించు విషయము నీవింత ప్రపంచము ద్వారమునఁజూచిదాని యందువింత వికారములను, క్రొత్త మెఱుంగులనుఁ జూచి తదనుకూలమగు భాషలో దానిని ప్రకటించుచుండును. కవిమిథ్య విషయముల కేనియొక విధమైన సుందరాకృతిని ప్రసాదించిదానిని విచిత్రవిధుల వర్ణించియు దానిని హృదయరంజకముగ జేయును. మేఘములు సూర్యునావహించి సూర్యరశ్మిని సప్తవర్ణాత్మకమగు నింద్రధనస్సుగా మార్చి ప్రపంచకము నందలి జీవరాసుల నానందాంబుధి నోలలాడించు నట్లుకవి తన్నావరించి యున్నయీ కవితా ప్రపంచము ద్వారమున వివిధ విషయములను జూచివానికి వింతమెఱుంగులిడి ప్రకటించుచుండును. ఇట్టివాక్కులనే కవిత్వమను పేరునకుఁదగియుండును. ఈవింత ప్రపంచకమే భావనా ప్రపంచకము; దీని ద్వారమున విషయములఁ జూడగల్గుటే భావనాశక్తి యనంబడును. ఇట్టిశక్తి ప్రకృతి జన్యమైనదే గాని సాధనమువలన బోధవలనను మాత్రమలవడునది కాదు.

కవిత్వమునకు దాని ప్రేష్యభావమును బట్టియే ప్రాశస్త్యము కలుగుచున్నది. ఈప్రేష్యభావము (Message) ధ్వనిగర్భితమై, విశాలార్థబోధకమై యుండవలెను. ప్రేష్యభావపూరితమైన కవిత్వము దోషభూయిష్ఠమైన నైననువినాశము నందదు. భాగవతమువంటి యాంధ్రగ్రంథము లన్నిటిలో నీప్రేష్యభావమునుకలిమినిమిన్న. ఇత్యాదిసలక్షణగ్రంథము గానన్నబడక పోవుచువచ్చినను, దీనికున్న హృద్యమ్మాద యాకర్షణశక్తి, చిత్తశాంతి గల్పించు ప్రాశస్త్యము, చదువరుల భక్తిగ్రేసరులుగఁ జేయఁగల ప్రభూతి మఱియే గ్రంథమునకుఁ గలవు? బమ్మెర పోతరాజు మనస్సా యేయేవిషయములను యథార్థములని తలపోసి సునిశ్చితముగ నమ్మియున్నాఁడో వానినే ప్రకటించియున్నాడు. హృదయజనిత విషయములకే హృదయాకర్షణశక్తి యుండునన్న సంగతికీమన యాంధ్ర భాగవతమే నిదర్శనము. ఈమూల తత్త్వము నాధారముగా జేసికొనియే యాధునికులలో కొందఱు గీతమాలికలను వ్రాయుచున్నారు; ఛందోవిరుద్ధములైన యొకకొన్ని వ్రాతలను కూడమనము పత్రికలందు చూచుచున్నాము. వీనిని విమర్శించు తఱిని వీని యందెట్టి యుత్కృష్ట ప్రేష్యభావము లున్నవను దృష్టితోఁ జూడవలెను.

కవితానెంత కవిత్వకళాకౌశలము గలవాఁడైనను తావ్రాయబూని నప్పుడెల్లనాతడు తానెన్నుకొన్న విషయములతో తాదాత్మ్యము నందుచుండవలెను. కవిత్వకళను గూర్చిమన మెంతెంత చర్చలుచేసినను కవిత్వమన్నది కేవలమావేశ భూయిష్ఠమైనదే యనిమాత్ర మొప్పుకొనక తీరదు. సర్వోత్కృష్టమైన కవనము చెప్పుటకు కవియొక విధమైన పునర్జన్మ నెత్తుచుండవలెను. ఆవేశాత్మకమైన యీనూత్నజన్మము నందే

యాతడు సాధారణులకుఁ గోచరింపని వింతప్రకటన విధులనుఁ జూడగల్గును. ఒరులు కోరినపుడెల్ల కవిత్వము చెప్పుట యసాధ్యమని నుడివిన పెద్దవార్యని వాక్యమున కర్థమిదియే యైయుండ నోపునని నేనూహించు చున్నాను.

కవి తానే వృత్తిచేయు వాడైననుసరే, కవనము చెప్పుతరిని యాతని మనస్సును చాలకాలము నుండి యాశ్రయించుకొనిన ప్రాపంచక తాపత్రయముల నన్నిటిని మఱచిపోయి కవిత్వావేశ పూరిత మనస్కుఁడై పలుకుచెలువవినుచు సూక్తులను వినివానిని పచరించు చుండును. చిత్తశాంతియు, నిర్మలాంతఃకరణమును నున్నపుడే కవికి కవిత్వావేశము పుట్టును. ఈయావేశము పుట్టి వింత విశేషములఁ దోపింపజేయుచు సంపూర్ణమై స్వచ్ఛందమైనరీతిని విషయ ప్రకటన మొనరింప నుత్సహించు చుండును. ఈరెండింటి సహాయమున నాతడు యనంతంబగు హృద్విలాసాదుల సంపూర్ణదృష్టితోఁ జూడగల్గు చున్నాడు. ఇట్టి సామర్థ్యము కవికుండుట చేతనే యాతని గ్రంథములఁ జదువువారి మనంబుల నుండు జిజ్ఞాసాదులను దవ్వులకు దోలఁగల్గు ప్రభావము గల విషయముల జూచివాని నుచితవిధిని ప్రకటింపఁ గల్గుచున్నాఁడు. ఇట్టియమూల్య మణులకునికిపట్టయిన కవిత్వమే రసవంతమైనదై పొగడ్తకెక్కు చుండును. సుందరమగు వస్తువే సతతానందదాయిని యగుడు కవిత్వము రసపుష్టిగలదైనపుడే సాంపుదీరి పొగడ్తకెక్కును.

# ఆట

( పెమ్మరాజు లక్ష్మీపతిగారు. )

ఉ॥ గోళములిట్లుపై కెగురఁ గొట్టుచుఁ గ్రమ్మరఁ జేత బట్టుచీ
లీలను బాల! బాల్యగుణలీలలఁ దేలెదు; పో, త్వదీయ దృ
గ్జాఃవితాన లక్ష్యయుత చాలనలీల యొకింత తప్పినన్
గోళములెల్ల నొక్కపడి కూలునొ? శుద్ధతమోహతంబులై.

ఉ॥ భాసురత్వత్కరద్యుతి విభాసిత గోళవితాన కాంతి ను
ద్భాసితమైనయా యరుణ భావముగొన నెఱుంగ నయ్యెడున్
భాసురభాస్కరాదికనవగ్రహయుక్తఖగోళసీమసం
ధ్యాసమయంబులన్ గొడము నాయరుణప్రభ కేదిహేతువో!

చ॥ కరకమనీయ కంకణవికస్వరరావము లొప్పఁగందుకో
త్కర రయజాత గీతముల తావకసద్గణనాంకరాగముల్
తిరముగ తాళరాగలయలీలలఁజూప నెఱింగితిన్ నభో
ంతరమున నేటి శ్రావణవనాదముజస్రము మ్రోగుచున్నదో!

ఉ॥ ఆడుము బాల! గోళముల నట్టిటుగొట్టుచుఁ గేళిగీతముల్
పాడుము మేల! నీసొబగు పాటలయూటల దేలిపోయి ని
న్నూడిచరించు చున్నటులె గోచరమయ్యెడి నాకు, బాల! యీ
క్రీడయె నిన్ను నన్నును సరించెడుగాక యుగాంతకేళికిన్.॥

# కబీరుని గీతములు

[ పరిపెల్లి విశ్వనాథశాస్త్రి గారు. ]



సేవకా! నాకై యెందు వెదకెదురా?

అరరె! సేవకా! నాకొఱ — కిటు వెదకెదు
మసలుచుండ నీయొద్ద నే — మఱక నెపుడు;
గుడుల మసీదులందు నే — గుదిరి యుండ;
సురకైలాస శిఖరవా — సుండనుగాను;
పరగు నాచార విధులందు — పరలు యోగ
ములను విజ్ఞాన వైరాగ్య — ములను లేను;
అమలసద్భక్తి నలయింప — నలరువాఁడ;
ప్రాణపద పవనాధార — ప్రాణమేను;
కనుమ సద్భక్తి శీఘ్రాన — గలసికొనెదు.

జోగికి మతమేదరా మూర్ఖా!

యోగివర్యుని మతమ్ముకై — యోచనేల?
జోగి, వీరుఁడు వణిజుఁడు — జూడజాతు
లన్నియును గూడనాథునే — యునవాతము
గోరుచుంటచేత తెలియ — గోరు యోగి
మతము మౌర్ఖ్యంబుగాదె యే — మానవునకు.
కర్మకారాది యా యంత్య — కర్మదనుక
రాయఁడు సుంకుశ్వపచుఁడా — రాజయోగి
మౌస్లిములు హిందుజనులా య — మానుష ప్ర
భావుగనరె లేదా భేద — భావమచట.

వద్దురా పరుగిడ వద్దురా —
పూలతోటకు "వద్దురా"

పుష్పవనములఁ గుమ్మరఁ — జోనవలదు
ప్రియుసేవలను వలదటకుఁ — బ్రీతివినుము;
తనువునందున పుష్పితో — ద్యానలక్ష్మి
చెలగుచున్నది; ప్రియమార — వెలయునచట
కాంతులీనుచును సహస్ర — కమలమొందు
అందువసియించి తనివోవు — నంతవఱకు
వివిధవర్ణాల కాంతితో — వెలయుచున్న
కనులకింపగు మోహాన — కాంతిగనుము!

ముల బంధించుటకు వెనుదీయ కుండిరి. కేవలము స్పార్టా యందలి స్వజాతి లేక స్వనగర వాసులను మాత్రము దాసులుగ నొనర్పగూడదను నియమము మాత్రి ముండెను. కాని యితర పట్టణములు లేక మరి యొక సమాజమునకు చెందిన గ్రీకులను దాసులను చేయగూడ దను నియమము లేకుండెను.

విజిత శత్రువులయెడల రోమను లింతకంటెను కఠినముగ వ్యవహరింపు చుండిరి. స్పార్టినులు ఆఫ్రికనలు స్పెయినులు, ట్యూటన్ డేనీ మొదలగు శత్రువులను వారు సాధారణముగ వధింపు చుండిరి లేక యనుగ్రహము గలిగినచో వారిని పశు తుల్యముగ భావించి సంఘమందలి యత్యంత శ్రమ సాధ్యమగు నీచకార్యములను చేయించు చుండిరి. రోమునకు గ్రీసుకు యుద్ధము జరిగి నప్పుడు రోమకులు సుసభ్యులగు గ్రీసులనుగూడ దాసులుగ నొనర్చిరి. ఈదాసులగు గ్రీకులు రోమక సంఘమునజేరి ప్రజలకు విద్యనేర్పుచు కృషి మొదలగు కార్యముల యందాధిపత్యమును వహించి రోమనులకు మిక్కుటమగు సహాయమొనర్చి యుండిరి. ఇట్టి సుశిక్షిత గ్రీకు దాసులయందు పేర్కొన దగిన వారిలో ప్రసిద్ధి కెక్కిన యైతిహాసికుడగు పలీవియాన్ అను నాతడును రోమక నాట్యసాహిత్యమునకు మూల పురుషుడగు హెరోనియాన్ అనునాతడును ముఖ్యులు.

దాసులవలన పాశ్చాత్య సంఘముల యందు మిక్కుటమగు మార్పుగలిగెను. దాసుల పరిశ్రమ మీదనే నా సంఘము లాధారపడ వలసి వచ్చెను. పరిశ్రమతో గూడినసమస్తకార్యములను దాస దాసీలు చేయుచుండిరి. కృషి వాణిజ్యములు, గనులు, నౌకలు, వంట, గృహ పరిశ్రమలు, పిల్లలకు చదువు చెప్పుట మొదలగు నవన్నియు దాస దాసీజనులచేతి యందుండెను. ఇంతయేల ప్రాచీన సాంఘిక జీవిత మంతయు దాసులచేతి నుండె ననుట యతి శయోక్తి గాదు. ఇందువలన దాసులు సంఘమందు ముఖ్యులైరి. ఈశ్వరు డొనర్చిన వ్యవస్థయే దాస్య పద్ధతియని రోము గ్రీకునందలిపండితులు దాస్యపద్ధతిని సమర్థింపజొచ్చిరి. అరిస్టాటల్ యను పండితుడుగూడ దాస్య పద్ధతి మానవకరుణకు సూచకమనియు సంఘమున కావశ్యక మనియు నుడివియుండెను. మరియు దాసుని దాస్యము స్వభావ సిద్ధమగు నైతికావనతియే కాని సాంఘికావనతి సూచకము గాదని దలంప జొచ్చిరి. ఇట్టి చింతనమువలన మానవుల దాసులుగ జేయుపద్ధతి దోషముగ పరిగణింప బడ కుండెను. చరిత్రనుబట్టి చూచిన యెడల నాకాలమందొక పట్టణ మందలి మూడు లక్షల జనులలో మూడవవంతు జనులు దాసులైయుండిరని తెలియుచున్నది.

దాసులవలన ప్రయోజనము మిక్కుటమైనకొలదిని దాస వ్యాపారము మిక్కుటమాయెను. ప్రాచీన యుగమున కార్థేజి, ఏథెన్సు, రోము, మొదలగు ప్రధాన పట్టణములయందు దాసుల వ్యాపారము మిక్కుటముగ జరుగు చుండెను. దాసుని గుణము—బలము ననుసరించియు, దాసీల సౌందర్యమునుబట్టియు ధర నిర్ణయ మయ్యెడిది. కార్థేజ గవర్నమెంటు వారు పలు దేశములకు సైన్యములబంపి యచ్చటి జనుల బట్టితెచ్చి వారిని దాసులుగ జేయుచుండిరి. రోము సామ్రాజ్యము నుండి సభ్యా సభ్య జాతులకు జెందిన వివిధ రకములవారు దాసులుగ రోము పట్టణమునకు వచ్చుచుండిరి. ఒక్కొక దాసుని వెల రొక్కప్పుడు రు. 2—0—0 మొదలు 5—0—0 వరకుండెనని చెప్పు యున్నారు.

దాసులవలన సంఘమున కెక్కుడు ప్రయోజన ముండినను వారిని పలువిధముల హింసించి హేయముగ చూచుట కణుమాత్రమైనను జాలి నొందకుండిరి. గ్రీసునందు కొన్నిచోట్లను అందు ముఖ్యముగ ఏథెన్సునందు మాత్రము దాసులయందొకింత కరుణ గలిగి యుండిరి. ప్రభుత్వ చట్టము ననుసరించి దాసుడొక పణ్య ద్రవ్యముగ బరిగణింప బడుచుండెను. అందు దాసునికి ప్రభువైనవాడు తన యిష్టము వచ్చి నటుల బరివర్తించుటకే విధమగు ఆటంకమును లేకుండెను. ప్రభుత్వ శాసనము దాసుని చంపినను హత్యగ పరిగణింప కుండెను. రోము నందలి రాజ నీతిజ్ఞులు

"దాస్యపద్ధతి వ్యవహారిక చట్టములవలన నిషిద్ధముగాదు. నీతి నిరుద్ధముకాదు." అని వ్రాసియున్నారు.

ఇట్టి సంకుచితమగు చింతనమువలన రోమజాతి యత్యంత హీనస్థితికివచ్చెను. ప్రజలు శ్రమవిముఖులై సమస్తకార్యములను దాసులచేత జేయించుకొనుచు ఆమోద ప్రమోదములతోడ కాలము గడుపజొచ్చిరి. క్రీడలయందుగూడ దాసులను నియోగింపుచుండిరి. అందువలన నత్యంతఘోరమగు క్రీడలు బయల్వెడలెను, దాసులను పెద్దపులులు సింహములు మొదలగువాని తోడ పోట్లాడింపుచుండిరి. లేకయిర్వుర దాసులచేతికి కత్తులనిచ్చి పోట్లాడింపుచుండిరి అప్పుడు కత్తిగట్టిన కోళ్ళవలె వారు పొడుచుకొని మరణించుటను చూచి దర్శకు లానందమును బొందుచుండిరి. నీఘోర క్రీడను యువక యువతులు, వృద్ధులు, బాల బాలికలుగూడ, గాంచి సంతసింపుచుండిరి. ప్రజాసాధారణమువలన మెప్పువడయుట కిట్టి భీభత్స క్రీడల నేర్పాటు చేయజొచ్చిరి. జూలియసీజరు దాదాపుగ అరువందల మంది దాసులను పరస్పరము హత్యయొనర్చు క్రీడ యందర్పించియుండెను. టాయిటాస్ చక్రవర్తికాలమున ఇట్టి పైశాచిక యుత్సవమొకటి నూరుదినములు జరిగెను. రోము ప్రజల యానందముకొరకు అంతెంత మంది దాసులో ప్రాణముల విసర్జించిరి. ట్రాజాన్ చక్రవర్తివిజయోత్సవ సందర్భమున 123 దినము లిట్టి రాక్షసక్రీడ జరిగెను. అందు 10 వేలమంది దాసులు పరస్పరము బాకులతోడ బొడుచుకొని చచ్చిరి.

అప్పుడే క్రైస్తవ మతప్రచారము రోమనుల యందు వ్యాపింప జొచ్చెను. అందు వలన ననేకు లీ పైశాచిక క్రీడ యందు విముఖులుగాజొచ్చిరి. కాని యంతమాత్రముననే యిది యంతరించలేదు. చిట్టచివర కొక క్రైస్తవ మిషనరీ పరస్పరము బొడుచుకొన నుద్యుక్తులైయున్న దాసులను యుద్ధమునుండి మరలించుటకు రంగస్థలమున దుమికెను. కాని యాతనిని దర్శక బృందము కర్రలతోడ బాదుటవలన నాతడు వెంటనే మరణించెను. అంతటితోడ నా పైశాచిక క్రీడ యస్తమించెను. ఇట్టి బర్బరోచితమగు క్రీడ జరుగ గూడదని రోము చక్రవర్తి శాసించెను.

పిమ్మట కొంతమంది సహృదయుల వలనను చక్రవర్తి కరుణ వలనను దాసుల యవస్థ కొంతవరకు మారెను. కాని యిందువలన దాస్య పద్ధతి యూరపునుండి సంపూర్ణముగ దొలగ లేదు. మధ్య యుగమందు గూడ దాస్య పద్ధతి యుండెను. మహమ్మదీయులందు నీఘోరాచారము మిక్కుటము. మధ్య యుగమందేగాక నేటికిని మహమ్మదీయ రాజ్యములయందీ పద్ధతి నడచుచునే యున్నది. దాస వ్యవసాయమే వృత్తిగాగల యరబ్బు దేశీయులలో కొంతమంది యుత్పాతమువలన దక్షిణాఫ్రికాయందలి నీగ్రోజనపదము లెన్నియో పేరు మాసిపోయినవి. నేటికిని యూరపియనులలో కొందరు బానిసవ్యాపార మొనర్చుటకు జంకకున్నారు. ఇందువలన ఆఫ్రికా మొదలగు దేశములయందు జరుగు దురంతరములు చరిత్రపాఠకులకు దెలియనివి కావు. అమెరికాయందు బానిస జాతియంతయు స్వతంత్రమును బొందినది. కాని యానల్లవారిప్పటికిని తెల్లవారివలన బడుబాధలు మొదలగునవి సర్వజన విదితమేగదా?

ప్రశంగ వశమున ప్రపంచమందలి పలుదేశములలో జరుగు బానిసవ్యాపారమును గూర్చి యొకటి రెండుమాటలు చెప్పితిని. మన భారతవర్షమందుగూడ దాస్యపద్ధతియుండెను. కాని యిది పాశ్చాత్యఖండముల బోలి మిక్కుటముగ వ్యాపించలేదు. భారతీయ సంఘమునకు బునాదియై యుండలేదు.

భారతవర్షమందుగూడ దాసులు అస్వతంత్రులేను. దాసులను మరియొకరికి దానమిచ్చుచుండిరి, క్రయ విక్రయము లొనర్చుచుండిరి. అయినను నిది యెప్పుడును మనదేశమందు మిక్కుటముగ వ్యాపింప లేదు. సంఘముగూడ దానికి తగిన యవకాశమును గలిగించలేదు.

వైదికయుగమందు దాసుల పేర్లుగానవచ్చును. ఋగ్వేదమందొకచోట దాన మొసంగు వస్తువులపట్టిక

యందు దాసదాసీలపేర్లు చేర్కొనబడినవి. ఈదాస దాసీజనులీ సవారువిజితులగు అనార్యసంతానమని పలువురు పండితు లభిప్రాయపడుచున్నారు. యుద్ధములయందు బంధింపబడినవారు దాసులుగ చూడ బడుచుండిరి. ఇంతకంటెను వారినిగూర్చి దెలిసికొనుట కవకాశములులేవు. గృహకార్యముల యందు దాస దాసీజనులను నియోగింపుచుండిరను విషయము గోచరించును.

బౌద్ధయుగమందలి దాసులనుగూర్చిన విషయముల మనము గ్రహించగలము—బౌద్ధుల పురాణ గ్రంథములయందును ఇటీవలిదగు జాతక గ్రంథమునందును చెప్పబడిన ప్రకారము దాసులు నాలుగైదు శ్రేణులుగ విభజింపబడియున్నారు. వీరి యుత్పత్తికి ననేక కారణములు గల్పడుచున్నవి.

ప్రథమ శ్రేణిదాసులు=వీరు యుద్ధమందు బంధింపబడిన వారు. వారి సంతానము.

ద్వితీయశ్రేణి= విశేషముగు దోషకార్యములొనర్చినవారు. అట్టివారిని దండించుటకు మారుగ వారి స్వాధీనతను హరించి నీచకార్యములయందు నియమించుచుండిరి.

తృతీయశ్రేణి= దుర్భిక్షసమయముల పొట్టకూటికి ధనికులు మొదలగువారికి తమ్ము దాముచ విక్రయించుకొనుచుండిరి. సంతానమును నమ్ముచుండిరి. ఋణమును దీర్చుకొనజాలనప్పుడుగూడ ధనికులకు దాసు లగుచుండిరి. లేక భార్యాపుత్రులనుగూడ విక్రయించి ఋణమును దీర్చుకొనుచుండిరి.

మనదేశమందు బౌద్ధధర్మ ముత్పత్తియగునప్పటికి దాసులసంఖ్య మిక్కుటముగనుండెను. దాసులెప్పుడును ప్రభువునకులోబడి నడచుచుండిరి. దాసుని దండించుటకు సర్వాధికారమును గలిగి యుండిరి. కాని ప్రాణ దండన నంబొనర్చుట కధికారము గలదో లేదో సరిగ జెప్పజాలము. బౌద్ధసాహిత్యమునం దెచ్చటను నావిషయమునుగూర్చి కానరాదు. దాసీగర్భమందు ప్రభువువలన సంతానము కలిగినయెడల నాసంతానముగూడ దాసుడే యగుచుండెను. దాసులసంపద యంతయు ప్రభువుల సంపదయే. వారు మానవులుగ చూడబడక పణ్యద్రవ్యములుగ దలంపబడు చుండిరి. బౌద్ధజైనసంఘములందు ప్రవేశించుటకు వారి కధికారములేకుండెను. అప్పు డప్పుడు గొంతమంది దయాళులగు ప్రభువులు దాసులకు స్వాతంత్ర్య మొసగుచుండిరి. స్వాధీన మొసగుట యొసగ కుండుట వారి యిష్టముమీద నాధారపడు చుండెను. దాసుల స్వాధీనులుగ జేయు విషయమున బుద్ధ భగవానుడు మొదలగు దయామయులు చేసిన ప్రయత్నములు గానరావు.

బౌద్ధ ధర్మ మేర్పడిన రెండువందల సంవత్సరముల తర్వాత మౌర్య సామ్రాజ్యము స్థాపింప బడినది. మహా పురుషుడగు కౌటిల్యుడు దాసు లున్నతికి వచ్చుటకును, ముందెవ్వరిని దాసులుగ చేయ కుండుటకును మిక్కుటముగ ప్రయత్నించెను. కౌటిల్యుడు వ్రాసిన యర్థశాస్త్రమందు దాసకల్పమను అధ్యాయమును బరికించిన యెడల అందాతని యుదారనీతి మనకు గోచరించును. ఇంతియేకాక యప్పటి పాశ్చాత్య యాదర్శములతోడ కౌటిల్యుని యర్థశాస్త్రమును బోల్చిచూచిన యెడల తత్కాలమందలి భారతీయుల యుదారమగు సాంఘిక నీతి మనకు హృదయంగమమగును. కౌటిల్యుని యర్థశాస్త్రి మందిట్లున్నది. "నత్వేవార్యస్య దాసభావః—మ్లేచ్ఛానా మేవణ దోషః ప్రజాం విక్రేతుమ్ అధాతుమ్వా" ఇట్టి మహత్తరము నుదారభరితమగు నీతి ప్రచురింపబడిన కాలమందు గ్రీసుదేశ దార్శికుడగు (Aristotle) అను నాయన దాస్య పద్ధతిని మానవుని యుదారతను తెల్పుననియు ప్రకృతి నియమమనియు సాంఘిక విషయమున కల్యాణ కరమనియు నుడివి యున్నాడు.

"For that some should rule and others be ruled is a thing not only reasonable, but expedient. From the hour of their birth some are marked out for subjugation, others for rule,"

దాస్య పద్ధతిని సమర్థించుచు మరియొక స్థలమున నిట్లు జెప్పియున్నాడు.

"And whereas there are many kinds both of subjects and rulers that rule is the better which is exercied over better subjects for example to rule over men is better than to rule over wild beasts"

"Nature would like to distinguish between the bodies of freemen and slaves making the one strong for servile labour the other up right and although useless for such services useful for political life in the arts of war and peace."

ఇందు వలన తత్త్వజ్ఞులయందలి ప్రాచ్య ప్రతీచ్యుల చింతనము— ఆదర్శములయందలి ప్రభేదము మనకు గోచరింపుచున్నదిగదా?

అర్థశాస్త్రము నందలి విధులను బట్టి చూచిన యెడల దాస వ్యవసాయమును దాస్యపద్ధతిని మిక్కుటముగ నిర్మూలించుటకు ప్రయత్నించినట్లుల దోచుచున్నది. సుసభ్యులమనుకొను యూరపు జాతులలో కొన్ని వత్సరముల క్రిందటనే యనేకమంది మహాపురుషులు జీవితము లర్పించి పని చేయుటవలన నీ రాక్షస కృత్య మడుగంటినది. ఇప్పటికిని మహమ్మదీయ ప్రపంచమునందిది మిక్కుటముగనే యున్నది. కాని భారతవర్షమునందు రెండువేల వత్సరములకు పూర్వమే దీనిని నిర్మూలించు వ్యవస్థ కల్పింప బడెను.

దాస్య పద్ధతిని నిర్మూలించుటకు చెప్పబడిన యర్థశాస్త్రమందలి కొన్ని విషయముల నిక్రింద నుదాహరింపుచున్నాను.

(౧) ఏజాతి వానినైనను, ఎట్టి కారణముల చేతనయినను దాసునిగ విక్రయింపరాదు. స్వజనులనుగాని, సంతానమునుగాని, విక్రయించువారు దండనార్హులు. విక్రయించువాడు విక్రియ మొనర్చువాడు చూచుచు నూరకున్నవాడు మొదలగు వారెల్లరు దోషులేను. ఈ కార్యములకు మరణ దండనను కూడ విధింపవచ్చును.

(౨) స్వేచ్ఛగా తనను తాను విక్రయించుకొనువాడే దాసుడగుచున్నాడు. కాని యాతని భార్యాపుత్రులు మొదలగువారు స్వతంత్రులేను. ఈ ద్వివిధ విధుల వలన నూతన దాసులను సంగ్రహించుటకు వారి సంఖ్యను వృద్ధి చేయుటకుగాని వీలు గలుగదు.

మరికొన్ని నియమముల వలన నప్పటి దాసులకు స్వాధీనత గలుగుటకు మార్గములు సూచింప బడినవి.

(౧) దాసుడు ప్రభుకార్యము లొనర్చిన పిమ్మట మిగిలిన కాలమందు పరిశ్రమ యొనర్చి ధనమును సంపాదించుకొనిన ధనము దాసునిదే కాని ప్రభువునకు చెందదు. ఉత్తరాధికారి సూత్రమువలనగూడ దాసునకు ధనము లభింపవచ్చును. కావున దాసుడు తన ధనమును ప్రభువునకిచ్చి స్వాధీనుడు గావచ్చును. దాసుడిచ్చు ధనమును గైకొని ప్రభువు వానికి దాస్యమునుండి విడుచుట విధి. అట్లు చేయనియెడల దండనార్హుడు.

(౨) విశేషముగ నత్యాచారము జరుగుచోట్ల యున్నత వర్ణములకు చెందిన దాసుని కార్యములయందు నియుక్త మొనర్చిన యెడల అనగా శవముల మోయుట మలమూత్రముల తీసి వైచుట మొదలగునవి ప్రభుత్వశాసన సహాయమున దాస్యమునుండి దప్పించుకొన వచ్చును. దాసీలకు ధర్మనష్టము గలిగినప్పుడు బలాత్కరింప బడినప్పుడు వారు స్వాధీనతను గాంచవచ్చును. వారి గర్భమందుబుట్టిన సంతానము దాసులుగాక స్వాధీను లయ్యెదరు.

స్వాధీనతను బొందజాలని దాసుల కొరకు కొన్ని నియమము లేర్పడి యున్నవి. అవి యెవ్వియనిన;—

(౧) ప్రభువు దాసుని మిక్కుటముగ దండించినను లేక యత్యాచార మొనర్చినను దండితుడగును.

(౨) దాసుని సంపదను వాని వారసులు బొందుదురు. కాని వారసులు లేనప్పుడు మాత్రమే యది ప్రభువునకు సంక్రమించును.

(౩) దాసుడు పనిలేని సమయమున సంపాదించుకొనిన ధనమును ప్రభువునకిచ్చి ముక్తుడు గావచ్చును.

(౪) వారసత్వము వలన ధనము; స్వంతముగ నార్జించుకొనిన ధనమును దాసుడు యథేచ్ఛగ ననుభవింప వచ్చును.

ఈవ్యవస్థవలన మౌర్యయుగమందు దాస్యపద్ధతి నశించెనని చెప్పవచ్చును. ఏకొందరో దాసులుగ నున్నను వారుగూడ నున్నతిని బొందిరి. అనగా వారిని పాశ్చాత్యదేశముల యందలి దాసులతోడ

పోల్చిచూచిన యెడల దాసులని నుడువుటకే వీలు లేదు. మౌర్యయుగమందు భారతవర్షమునకు వచ్చిన గ్రీకుదూతలు, పర్యాటకులు మొదలగువారు భారతీయులయందు దాస్యపద్ధతి లేదని వ్రాసియున్నారు.

కాని దాస్య వ్యవహారము భారతవర్షమందు సంపూర్ణముగ లోపించినదని మాత్రము చెప్పజాలము. మౌర్యయుగానంతరము వ్రాయబడిన నాటకములు స్మృతులు మొదలగు వానియందు దాసదాసీజనుల గూర్చిన విషయముల నేకము గానవచ్చుచున్నవి. మనుసంహిత యందేడు విధములగు దాసులపేర్లు దహరింపబడినవి. అందు యుద్ధమందు పట్టుబడి లేక లొంగిపోయి దాసత్వమున కొడబడిన వారిని "ధ్వజాహృతులు" అనియు, పొట్టకూటికి తిరులకు దాస్యము చేయుట కంగీకరించిన వారిని భుక్తదాసులనియు, దుష్కర్మకు దండనరూపముననగాని, అప్పుదీర్చుకొనుటకుగాని దాసులయిన వారిని దండదాసులనియును, పిలచుచుండిరి. మిగిలినవారు దాసుల సంతానము లేక విక్రయింపబడినవారలు.

మనుసంహిత యందు దాస్యపద్ధతిని నిర్మూలించుటకు ప్రయత్నించునట్లు లగానరాదు. కాని బ్రాహ్మణుని బలవంతముగ దాసునిగ నొనర్చినను, వానిచేత నీచకార్యములు చేయించినను, దండనము మాత్రము విధించి యున్నది. శూద్రుని బలవంతముగ గూడ దాసునిగ చేయవచ్చునను నృశంస విషయ మిందు గలదు. అందువలన మనుసంహితాకారుని శూద్రవిద్వేషము, దాస్యపద్ధతి సమర్థనము చాలవరకు అరిస్టాటల్ మతము ననుసరించి యుండును. కాని గ్రీకుల దాస్యపద్ధతి ప్రభావము కొంతవరకు భారతవర్షమందు గూడ జొచ్చియుండ వచ్చును. బౌద్ధధర్మ ప్రచారమువలన శూద్రులకు వైదికధర్మముమీద విద్వేషము గలిగి యుండును. అందువలన పరివ్రాజకుల మీద యాక్రోశమున మనువిట్లు వ్రాసి యుండవచ్చును. మనువు తర్వాత రచింపబడిన స్మృతుల యందు దాసులు—దాస్యపద్ధతిని గూర్చిన విషయము లున్నవి. నారదస్మృతియందు దాసులను పదునేను తరగతులుగ విభజించి యున్నాడు. కొంతమంది స్మృతికారులు గూడ ఈవిభాగమునే యంగీకరించిరి.

కాత్యాయనుడు బ్రాహ్మణ దాస్యమునకు విరోధి. మిగిలిన వర్ణముల వారినిగూడ బలవంతముగ దాసులుగ నొనర్చుట కాతడంగీకరింపలేదు. స్వబుద్ధి వలన మిగిలిన మూడు వర్ణముల వారును దాసులయిన కావచ్చును. అనులోమ క్రమమున క్షత్రియ—వైశ్య—శూద్ర వర్ణముల వారు తమ వర్ణములవారు లేక యంతకంటె యున్నత వర్ణములవారికడ దాస్యము చేయవచ్చును. తమకంటె తక్కువ వర్ణములవారికడ దాస్యము చేయరాదు.

స్మృతికారుల యభిప్రాయాను సారము దాసులకు ధనమునువదిలేదు. అతని ధనముమీద నాతని ప్రభువునకే యధికారము గలదు. అయినను దాసుని కష్టబెట్టినను, బాధించినను ప్రభువుదండనార్హుడగుచున్నాడు.

"బలవంతముగ దాసుడుగ చేయబడినవ్యక్తి రాజునాదేశమున విముక్తుడు గావచ్చును. ప్రభుప్రాణమును రక్షించినవాడు, డబ్బు గలవాడు, ప్రభువుదయ సంపాదించుకొనిన వాడు స్వాధీనుడు గావచ్చును" అనియాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు.

ఈయన దాస్యమును నిషేధింపలేదు. కాని తీరుబడి గలిగినప్పుడు సంపాదించుకొనిన ధనముతోగాని మరియితర మార్గముల వలనగాని దాసుడు స్వాధీనత గాంచవచ్చునని చెప్పెను.

వీనివలన భారతీయు లెప్పుడును దాస్యపద్ధతిని యుత్కృష్టముగ భావించియుండలేదు. పలుకారణముల వలననిది సంపూర్ణముగ లోపింపలేదు. విదేశీయులు మనదేశమందు రాజ్యమును స్థాపించి యుండిరి. వారిలో గ్రీకులు—పారసీలు—శకులు, హూణులు మొదలగు వారందరు దాస్యపద్ధతిమీద విశేషానురాగము గలిగియుండిరి. వారి యాదర్శమువలన మనకు నైతికావనతి గలిగినది. దాస్యపద్ధతి యుబ్బినది.

హిందువులు స్వాధీనతను గోల్పోయిన పిమ్మట మధ్యయుగమందు మనదేశమందు దాస్యపద్ధతి ప్రబలముగనుండెను. మహమ్మదీయ యుగమందుగూడ దాస్యపద్ధతి మిక్కుట మాయెను. ఇప్పటికిని మనదేశమందనేక పేర్లనున్న దాస్యపద్ధతి తొలంగిననే గాని భారతవర్షమునకు స్వతంత్రము లభింపదు.

# వర్షఋతువు

## II

[నాళము కృష్ణారావుగారు.]

౧

అల త్రివిక్రమగతి దివి నాక్రమించి
శంకరుని బోలె జలధివిషంబు గ్రోలి
విధియొ యన నాదసృష్టి గావించి మించె
ముగురుమూర్తులదలపించి మొయిలుఱేఁడు.

౨

సితబలాకదంతంబులఁ జెన్నుమీరి
ప్రబల వర్షాంబుదానధారలఁ జెలంగి
భూరివిద్యుల్లతాంకుశములకు లేఁగి
గగనవీథిని గర్జించె ఘనగజంబు.

౩

జలదమను పేరి రాహువు చలము మెరసి
చంద్రసూర్యులఁ గబళింప జడల కెగయ
వార లొనరించు రోదనధ్వని యనంగ
దిక్కులను గర్జనంబులు పిక్కటిల్లె.

౪

ఘన నృపాలుడు పాలించు గగనపురిని
నింద్రచాపంపు గోపుర మెత్తు వేళ
విరసవాక్కుల వర్ణించు భేకనామ
కాకవులకుఁ బంకాభిషేకము లభించె.

౫

ముదుకలగు నీరుతాల్పులు పూసియున్న
యూఁతకోలల మొత్తంబులో యనంగ
వసుధ నలరారె నలుగడ వానకాళ్లు
బెదరి రాయంచకదుపులు చెదరిపార

౬

క్రమ్ముకొనియున్న కాఱుమేఘములచేత
కాల మెల్లను నొకతీరె కానఁబడఁగ
విమలజలజాత మాలతీ వికసనములు
జనుల కిది పగలిది రేయియనుచు జాటె

౭

దారుణం బగు వర్షాంబుధారచేత
సారహీనము లైన యబ్జముల వీడి
తుమ్మెదలు వ్రాలె గంధబంధుము లైన
వికసితకదంబపుష్ప గుచ్ఛకము మీఁద.

౮

మమ్మరపువానఁ దనపువ్వుటమ్ము లెల్ల
నమ్ము లైచన విరహికంఠమ్ముఁ గోయ
మరుఁడు గైకొన్నపైడితంపమ్మొ యనఁగ
పొలుపు మీఱెను గేదంగి పువ్వు రేకు.

౯

తరణి గ్రోలిన జల మెల్లఁ గురిసె నేని
పుడమి కతివృష్టిదోషంబు పొడమ నంచు
కమలజుఁడు చుట్టుఁ గట్టను గట్టెననఁగ
నినుఁడు పరివేషగతుఁడయియింపుమీఱె

౧౦

తలలఁ బ్రతిబింబభాను రత్నములఁ దాల్చి
వక్రగతులను జెరలాడు పాము లనఁగ
కొండబిలముల వెలువడి క్రొత్త యేళ్ళు
బిరబిరను జాఱె జక్కవల్ బెదరిపోవ.

౧౧

పెక్కువన్నెల తంతులఁ బేర్చికూర్చి
లీల నల్లిన మరునియుయ్యాల యనఁగ
సాంద్రకాంతులఁ జూపట్టె నింద్రధనువు
కనులపండువు సేయుచు గగనవీధి.

౧౨

ఘనుఁడు రామనృపాలుండు కౌతుకమున
మెఱుఁగుపూఁబోఁడి జానకిఁ బెండ్లియాడ
నెక్కువెట్టిన చాపంబు ముక్కలగుచు
చదలఁబడి యెకోయనఁ గోఁచెశక్రధనువు.

౧౩

అంబరంబను రంగస్థలంబునందు
నిలిచి కాళిక ప్రౌఢిమై నృత్యమాడ
కనులరాలిన విస్ఫులింగంబు లనఁగ
నింద్రగోపము లొప్పారె నెల్లయెడల

౧౪

సతత వర్షాంబు ధారాభిహతులచేత
కలఁగి తారలు నింగిని నిలువలేక
కుప్పతిప్పలుగా నేలఁ గూలెననఁగ
గుప్పుగుప్పున వడగండ్లు గుమ్మరిల్లె

౧౫

చండమారుత కంఠీరవుండు చెలఁగి
మత్తజీమూత కుంభికుంభములఁ జీల్ప
నేలరాలిన మౌక్తిక జాలమనఁగ
గుప్పుగుప్పున వడగండ్లు గుంప్లరాలె

౧౬

ఘనుఁడు మెఱుఁగుపూఁబోఁడితోనఁగిపెనగ
కంఠహారము సడలి నల్గడల రాలు
విమలమౌక్తిక పద్మరాగము లనంగ
పడిమెవడగండ్లు నింద్రగోపములుపుడమి.

౧౭

ధారలనియెడు త్రాళ్ళచేతను బిగించి
అంబరంబను పెనుగుడారంబు నిలిపి
వింతవన్నెల కాంతుల వెలయుచున్న
ఇంద్రధను వను ద్వారంబు నేర్పరించి
నీలిమబ్బుల తెర లందు వ్రేలఁగట్టి
[illegible]కాలంబు పేరిటి గార[illegible]డు
నెమలి పింఛంబు కుంచియ నెమ్మివిచి
కటికిచీఁకటి కనుకట్టు గలయఁబఱపి
వివిధ గర్జామహావాద్యరవము సెలఁగ
[illegible]వృద్ధిగల పేరి [illegible]గులచేత
హాటముగ నాలు మొగ్గల[illegible]చేసి
నగములకు నింపుసొంపును స[illegible]ంచి
యాటలాడంగ నక్షత్ర[illegible]లు
తోఁచనీకగ [illegible]
గుప్పుగుప్పున [illegible] గురియుచుండె

౧౮

అంబుదభ [illegible] శాక్రసింహ
[illegible] తిమిర తేజంబులు [illegible]
మొగులు [illegible] దళములు [illegible]
సమర సన్నాహ [illegible] సంభ్రమమున
దాకి యొండొంటితో నవి [illegible]
వాహనములఁ [illegible]
వెడలి [illegible] చెమ్మట [illegible]
చింది [illegible]
తునిగిరాలిన యెముకల [illegible]
ప్రబలతర వర్షధారా [illegible]
శక్రగోప [illegible] సమూహ[illegible]ను
గూడిచూడ్కికి వేడ్కలు గొలుపుచుండె.

౧౯

సలిలజీమూత పటలంబు నింగినుండి
యింద్రచాపంబుతోఁ గూడి నేలకుదిగ్గి
స్వేచ్ఛమీఱ విహారంబు చేసెననఁగ
నెమలి పురివిచ్చి నృత్యంబు నెరపుచుండె

౨౦

భేకజాలంబు గుమిగూడి బెకబెకంచు
వేదపాఠంబు నదివెడి ద్విజులు వోలె
రహి నుదాత్తాను దాత్త స్వరంబు లొప్ప
వరుసతప్పక యింపుగా బలుకుచుండె



# సామాన్య నేత్ర వ్యాధులు.

[వేమూరి దుర్గానాగేశ్వరరావు పంతులు గారు, బి. ఏ. యల్. యం. & యస్.]

కళ్ళకలక:— (కూనలు)

నేత్రగోళము కప్పుపొర (conjunctiva) యొక్క వాపును కళ్లకలకయందురు.

లక్షణములు; కనురెప్పలలోపల వైపు యెఱ్ఱగా నుండి వాచును. నల్లగుడ్డుచుట్టు గొంతయెఱ్ఱగానుండును. యీవ్యాధి తీవ్రముగానున్న నల్లగుడ్డుచుట్టు గూడ బాగుగ యెఱ్ఱగ నుండును. ఈపొరక్రింద నక్కడక్కడ నెత్తురుగూడును. రెప్పలు మిక్కిలి వాచును. వ్యాధియెక్కువ తక్కువనుబట్టి కంటిస్రావము మారును. స్రావమెక్కువగానుండకుండిన మడ్డిగానుండును. మరీయెక్కుడైన చీముగామారును. తీవ్రమైన యెడల చీము విశేషముగా నుండును. రాత్రిళ్ళు యీచీము రెప్పల చివరభాగమున యెండి కళ్ళంటుకొనునటుల జేయును.

రెప్పలు వేడిగను బరువుగను నుండును. కంట్లో యిసుక పడినట్లుండును. స్రావ మెక్కువగా నున్న చూపుగూడ మందముగా నుండును. ఈ లక్షణము లన్నియు సాయంకాల మగునప్పటికి యెక్కువయగును. వాపునుబట్టి గుణాధికములుండును.

నడక;— వైద్యము లేనప్పటికిని రెండుమూడు వారములలో నెమ్మదింపవచ్చును. ఒకప్పుడు పైయుద్రేకము మాత్రము తగ్గిలోనికలక కొలదిగా నిలువబడవచ్చును.

వ్యాధితీవ్రముగనున్న యెడల శుక్లమండలము (cornea) చివరభాగమున, నల్లగుడ్డుచివరభాగమున తెల్లని చుక్కలు పడవచ్చును.

ఇటులకొన్ని చిన్న చుక్కలు కలసిన శుక్లమండలము మీదపుండగును. యీ పుండుసాధారణముగా పైపైననే యుండును. గాన తేలికగనే మానును. ఎక్కడనోయీ పుండు చాల బాధకు కారణమగును.

ఏవయసులోనైనను యీకళ్లకలక రావచ్చును. అన్నిఋతువులలోవచ్చునుగాని వసంత శరదృతువులలో చాల విస్తారముగ నుండును.

కారణములు:—

1 బయటనుండి కంటిలోపడు నలకలు, గాలి, దుమారము, పొగ, మొదలగునవి.

2 ఇది సర్వత్ర వ్యాపించు యంటురోగము గుట వలన వసంత శరదృతువుల యందలిగాలి మార్పులవలన యీవ్యాధి బీజములు వ్యాధిని కలిగించు చున్నవి.

3 అంటువ్యాధి: వ్యాధితులుపయోగించిన చేతిరుమాళ్లవలనను,తువాలులవలనను, వారివేళ్లవలననిది ప్రాకును.మనలో యీవ్యాధి ఆడవారిలో యెక్కువ. చిన్నపిల్లలలోగూడ

మిక్కుటము. ఒకే కాటుక కాయనుండి యింటి యాడువారును పిల్లలును కళ్ళకు కాటుకను పెట్టుకొను యలవాటు గలదు. ఇందులో నొకరికీ వ్యాధియున్న యింటివారం దరి కీవ్యాధి చాల తేలికగా ప్రాకును. ఈ కంటినుండి వచ్చు స్రావమే యిటుల వ్యాధిని ప్రాకించునది.

4 ఇతర తీవ్రమైన వ్యాధులలో గూడ కలకవచ్చును. (పొంగు-మహామారి)

5 శిరోభారము, ఉబ్బసము, యిన్‌ఫ్లూయంజా జ్వరములతో గూడ నిది రావచ్చును.

దెబ్బతగులుటవలనను కంటిలో యేదియైన పడుటవలనను కలకవచ్చును. ఎక్కువ ప్రకాశమానమైన విద్యుచ్ఛక్తి దీపములవలన హిమమునుండివచ్చు ప్రతిబింబము వలన గూడవచ్చును.

వీనిలో కలక కున్న లక్షణములే కాక వెలుతురును జూడలేకపోవుట, కన్ను నీరుగారుట, విపరీతపుపోటు, పాపచిన్నదగుట, రెప్పలవాపు, శుక్లమండలముమీద పుళ్ళు గూడనుండును.

కంటిలోనుండి కన్నీరు ముక్కులోనికి వచ్చుటకు యొక స్రోతయున్నది. ఈ స్రోతవాచినగూడ కలకవచ్చును. ఇటుల కలిగిన ముక్కువైపు నల్లగుడ్డు చుట్టును మాత్రమే యెర్రగానుండును.

చికిత్స:-- వైద్యము లేనప్పటికి దినిమ్మళించును. కాని త్వరలో పోవుటకును పూర్తిగనయముగాక పాతబడి దీర్ఘవ్యాధిగా మారకుండ నుండుటకును వైద్య మవసరము.

దినమునకు పెక్కుమారులు కంటిని ఉప్పు (మెగ్నగంధకితము) నీటితో కడుగవలెను. పావుశేరుమంచినీటిలో ఒకచిన్న చెమిచా కొలగల మంచిపుప్పును వేసియానీటితో కడుగవలెను. రాత్రిపుడు కన్నంటుకొనకుండ రెప్పలమధ్యను రెప్పల వెంట్రుకలకును వేసలైన్‌గాని మరియితర మృదువైన తైలమును (ఆముదముగాని) గాని వ్రాయవలెను.

వెండిసంబంధమగు అరఖులను Argyrol కంటిలో దినమునకు రెండు మూడు మారులు వేయవలెను. కంటినుండి బయలు వెడలు పుసులంటిన వారికిది వచ్చును. గాన జాగ్రత్తగానుండవలెను.

పటికను పొంగించి కళ్ళలో వేయుట మంచిదికాదు. ఈ పటిక నీటివలన శుక్లమండలముమీద తెల్లని చుక్కలుపడి దృష్టికి చెరుపువచ్చును. కంట్లో చనుబాలుపిండుటవలన యిటువంటిహానియేమియులేదు. ఫలమును లేదు. కళ్ళకలకయున్న వారి కాటుకకాయను నితరు లెవ్వరు నుపయోగింపరాదు.

శీఘ్రముగా కుదరకపోయిన వైద్యుల సలహా యవసరము.

## దీర్ఘవ్యాధియైన కలక:—

తీవ్రవ్యాధిగపరిణమించి సరియైన వైద్యములేనందున నిది దీర్ఘవ్యాధిక్రిందమారవచ్చును. తీవ్రవ్యాధికిని దీనికిని భేదము కన్నునుండి వచ్చు స్రావములోనున్నది. కంటినుండి వచ్చు స్రావము యొక్క మొత్తములోను దానిగుణములోను భేదమున్నది.

లక్షణములు:- రెప్పలలోపలిభాగము నునుపుగను ఎర్రగను నుండును. స్రావము కొద్దిగనుం

డును. రాత్రిళ్ళు కళ్ళంటుకొనును. లేక కొలుకులలో మాత్రమే పుసి కట్ట వచ్చును.

దురదలు- మంటలు- కన్ను పొడి యారి నట్లుండుట- కంట్లో నలకలున్నట్లుండుట- రెప్పలుబలువు- వెలుతురును జూడ లేకపోవుట- కళ్ళుసుఖముగా నలసిపోవుట మొదలగు గుణములు తీవ్ర వ్యాధిలోవలెనే యుండును. ఈగుణములన్నియు రాత్రి వ్హెక్కువయగును.

నడక:- కంటివ్యాధు లన్నిటిలో ఈవ్యాధి చాలతరుచుగ జూడనగును. సాధారణముగ బాల్యావస్థదాటి వయసు వచ్చినవారిలోనే నిది గాననగును. ముసలివారిలో గూడ తరుచు చాలకాలమువరకు నడచును.

దానివలన వచ్చుచిక్కులేవన-రెప్పల మందము- అడుగు రెప్ప బయటకు తిరుగుట- శుక్లమండలముమీాద పుళ్ళుపడుట- మొదలగునవి.

కారణములు:-

తీవ్రవ్యాధినుండి యిటుల మారవచ్చును. అనారోగ్యకరమగునిండ్లలోనుండుటవలనను, ఒకయింటిలోనే పెక్కుమంది వసించుట వలనను మంచిగాలిలేనందునను, పొగ, దుమారమువలనను, సరియైన నిద్రలేనందునను, రాత్రిళ్ళు చాలవరకు మేలుకొనుటవలనను, అతిత్రాగుడువలనను, రెప్పలు బయటకు తిరిగియున్నను; కంటికి మితిమీారినశ్రమవలనను, ఎక్కువ వాడుకవలనను, కనురెప్పల వెంట్రుకలు లోపల గుడ్డునకు గ్రుచ్చుకొనుచున్నను, కంటిలోనుండి ముక్కులోనికిపోవు త్రోవ వాచియున్నను, నీవ్యాధిరావచ్చును. సాధారణముగా యిది రెండు కళ్ళకు వచ్చును.

చికిత్స. కారణమును కనుగొని దానినిపోగొట్టవలయును. కళ్లంటుకొనకుండ మృదువైన తైలములను రెప్పలకు వ్రాయవలెను. దీర్ఘమైన వ్యాధిగాన మందులను తరుచు మార్చుచు చాలకాలము వైద్యము చేయించుకొనవలెను.

## రోగవలన కలక.

తలి తండ్రుల పాపములు చిన్నిపాపల కళ్లకుకూడ సంభవించుట తరుచుచూచుచుందుము. శిశువు జన్మించు త్రోవలోనే యీా రోగకారకములగు క్రిములు శిశువుల కళ్ళలో ప్రవేశించి యీావ్యాధిని గలుగజేయును.

ఈవ్యాధి చిహ్నములు శిశువు జన్మించిన రెండు మూడు దినములలోనే కనబడును!

కళ్ళు బాగావాచును మిక్కిలియెఱ్ఱగానుండును. కళ్ళు తెరచుట చాలాకష్టము. మొదట కంటి స్రావము నీరుగాను, నెత్తురుతో కలసినట్లుండును. మఱియు కన్ను చాలనొప్పిగ నుండును. కన్ను వేడిగను, చురుకుమనుపోటుగానుండును. నొసటలోను కణతలలోను తీవ్రుగానుండును. కొద్దిగా జ్వరమువచ్చును. ఈగుణములు రెండుదినములున్న తరువాత కళ్ళవాపు కొంత తగ్గును. నొప్పికూడ కొంతతగ్గును. చాలయెక్కువగ స్రావము వచ్చును. ఇటుల రెండుమూడు వారములుండును. సరియైన వైద్యము లేని యెడలశుక్లమండలముమీాదపుళ్లుపడికన్నులు పోవచ్చును.

కారణములు:-

శిశువు జన్మించునపుడు తల్లికి సెగ రోగమున్న యావ్యాధియొక్క క్రిములు శిశువు నేత్రములో ప్రవేశించి యిటుల చిక్కు గలిగించును. శిశువు పుట్టక పూర్వము యిటుల వ్యాధివచ్చుట మిక్కిలి యరుదు. జన్మించిన తరువాత తల్లివ్రేళ్ళవలనను, ఈక్రిములంటిన బట్టలవలనను, ఈవ్యాధి రావచ్చును.

చికిత్స:-

కంటిని చాలతరుచుగా కడుగుచుండవలెను. దినములో 10 మారులైనను కడుగవలెను. శుక్లమండలము చెడకుండా మృదువైన తైలమును కళ్ళకువ్రాయవలెను. వాపు-మెరుపు కొంచెము తగ్గగానే కంట్లోమందులను చాలమారులు వేయవలెను. వాపు యెక్కువగానున్న చల్లటి నీళ్ళలో తడిపిన దూదిని కంటిమీద వేయవలెను. వాపు కొంచెము తగ్గగానే మానవలెను. శుక్లమండలము చెడకుండా తరుచుగా పరీక్షించుచుండవలెను. చెడిన తగిన చికిత్సను నవలంబింపవలెను. శిశువుయొక్క ఆరోగ్యమును క్రమముగా గాపాడవలెను.

ఆపుదల:- ఈవ్యాధి రాకుండ జేయవచ్చును. శిశువు జన్మించగనే కళ్ళను శుభ్రముగా గడిగి కంట్లో వెండి అరఖుల బొట్లను వేయవలెను; తల్లికి యీసెగవ్యాధి యున్నదా లేదాయను ప్రశ్నలేకనే యిటులజేయుచున్నచో చాల యపాయములు తప్పును. ఈవ్యాధియున్నట్లు స్పష్టముగా తెలిసిన శిశువు జన్మింపబోవునపుడు మాతృ మర్మస్థానములన్నిటిని శుభ్రముగా నరఖులతో కడుగవలెను.

శిశువు జన్మించిన కొలదిదినములలోనే కళ్ళకలక రావచ్చును. ఏదియైనను యీజాతిదే యని శ్రద్ధగా చికిత్స చేయవలెను.

యవ్వనులలో సెగవలన కలక.

వీరికి తమవ్రేళ్ళవలన లేక, ఇతరుల వ్రేళ్ళవలనగాని, బట్టలవలనగాని రావచ్చును. ఆవ్రేళ్ళకుగాని, బట్టలకుగాని యీసెగ వ్యాధిని కలుగజేయు క్రిములున్న స్రావమంటిన యీస్రావము కళ్ళకంటిన నావ్యాధియే వచ్చును. గుణములన్నియు చిన్నపాపలలో నుండునటులనే యుండును.

సాధారణముగా పెద్దలలో మొదట ఒక కంటికి వచ్చును. వీరిలో ముఖ్యమైన చిక్కేమనిన శుక్లమండలముమీద చాలత్వరగా పుండ్లు పడును. ఇవి పైపైననేగాక లోతుగాపడును. ఇట్లుబడిన యీపుళ్ళలోనుండి కంటిలోనికి బెజ్జము పడవచ్చును. ఇట్లైన కన్నుపోవు నటులయే.

నడక:- పెద్దలయందు శిశువులలోవలె తేలికగా నడువదు. అతి తీవ్రముగా నడుచును.

చికిత్స:- కంటినుండి వచ్చు స్రావము యితరుల కళ్ళకు తగిలిన యీవ్యాధి యెక్కువగ వచ్చును. కాన జాగ్రత్తగ నుండవలెను. ఈవ్యాధితగలిన రెండవ కంటికి యంటకుండ జేయవలెను.

రాత్రింబగళ్లు చెడిన కంటిమీద చల్లటి దూదిని వేయవలెను. ఎంత త్వరలో పుసి కట్టిన యంతత్వరగా కడిగి వేయవలెను. వాపు మెరుపు కొంతతగ్గగానే యీచల్లటిదూదిని యప్పుడప్పుడు వేయుచుండవలెను. శుక్లమండలముకూడ చెడిన చల్లని దూదిని యెక్కువగా వాడరాదు.

బాగుగ వాపు తగ్గగనే, శుక్లమండలము మీద పుళ్ళున్న వేడికాపులను కాయవలెను. మూడుగంటల కొకసారి కంట్లో "ప్రోటార్గాల్ ఆర్గయిరాల్" బొట్లను వేయవలెను. ఈపుండ్లకు సరియైన చికిత్సను చేయవలెను.

## దుర్మాంసములు.

ఇది యొక దీర్ఘ వ్యాధి. రెప్పలు లావగుట, లోనివైపున సన్నని పొక్కులు గాన్పించుట, ఇవన్నియు కలసిపోయి మచ్చలుగా మారుట మొదలైన మార్పులను దుర్మాంసము లందురు. ఈ వ్యాధి మన దేశములో చాల తరుచుగ గానవచ్చును. నేత్రాలయములకు వచ్చురోగులలో సగముమంది వీరలేను. ఇది మగవారిలో కన్న ఆడువారిలో నెక్కుడుగ గన్పించుచున్నది. ఆడ పిల్లలలోకూడ మిక్కుటము. ఒక్కొక వంశములోనందరికి కానవచ్చెడిని. దానినిబట్టి యిది యంటుడువ్యాధి యని తెలిసికొనవచ్చును. వంశములో నాడు వారిలో యెల్లరకు నుదుటను బట్టిజూడ నేదో యొక కారణ ముండవలయును. ఇందులో పిల్లలందరిని యొక మంచముమీద పరుండ బెట్టుట యొక కారణము గా వచ్చును. దానికంటెయొకే కాటుక కాయనుండి యందరును వేలుబెట్టి కంట్లో కాటుక బెట్టుకొనుట ముఖ్య కారణముగ గానుపించుచున్నది. గోషాపద్ధతులుగూడ కొంతవరకు సహాయపడుచున్నవి అనారోగ్యపు టిళ్లు మనుజులు మురికిగా నుండుట సహాయకారులగుచున్నవి. మహమ్మదీయులలో ముఖ్యముగ స్త్రీల యం దీవ్యాధి యెక్కువ. వారి గోషా పద్ధతులు కొంతవరకు యీ వ్యాధి యభి వృద్ధికి కారణము లగుచున్నవి.

లక్షణములు:-

వెలుతురును జూడలేకపోవుట కళ్ళు నీరుకారుట-నొరదలు-మంటలు-కళ్లలో నలకలుపడినట్లుండుట-నొప్పి- దృష్టిలోపము.

రెప్పలవాపు, చీకిరికళ్లు- (పైరెప్ప బరువువలన వాలినట్లుండుట) కొలదిగనో గొప్పగనో పుసులుకట్టుట, రెప్పల లోపలివైపు యెఱుపు నునుపుగానుండక చిన్నయణువులు గానుండుట (granules) తెల్లగుడ్డు కొంచెము మెరగ్రానుండుట మొదలగునవి.

నడక:--

ఈవ్యాధి కొంతదూరము నడిచిన తరువాత రెప్పలలో మచ్చలుపడును. అప్పుడా వ్యాధి అంతరించిన దనవచ్చును. ఎత్తుపల్లములు పొక్కులుమాదిరిగ పోవును. కాని నేత్రగోళముపైపొర పూర్వపు ఆరోగ్యస్థితికి రాదు. తెల్లనిచారలు, మచ్చలుపడును. మరల నునుపుగా నగును. రెప్పలు చిన్నవగును.

ఈ వ్యాధి గుణములు పైకగుపడకుండ చాలదినములుండును. ఇదిచాల దీర్ఘ వ్యాధి. నెలలు సంవత్సరములు పట్టును.

~~ఈ వ్యాధి సరిగనమనగ~~ మధ్యమధ్య నాస్మికముగ నెక్కువగును. వ్యాధికుదిరి మరల వచ్చుటయు కలదు.

చికిత్సను పూర్తిగ నయమగువరకు మానకున్న యిటుల తిరుగబెట్టుట యుండదు.

చిక్కులు:-

శుక్లమండలముమీద పుళ్ళు. నల్లగుడ్డుపైపొర.

గుడ్డుపైపొర:-

ఇది నెత్తురుగొట్టములకు సంబంధించినది. నల్లగుడ్డుమీద మబ్బుమాదిరిగ తెలుపు

పొర యేర్పడును. నల్లగుడ్డు పైభాగము మీద మొదట మొదలిడును. యిది ప్రాకి గుడ్డంతయు పొర వేయవచ్చును. ఇటుల జరిగినచో చూపు యేమియు యుండదు. ఈపొర వైద్యమువలన కరిగిమారల శుభ్రముగా నుండవచ్చును. ఒకప్పుడయాటులనే యుండవచ్చును; లేదా యీపొరలో పుళ్ళుపడి వెలుతురు జొచ్చుటకు వీలులేని మచ్చలు పడును. ఇటులపడిన తరువాత పొర కరిగి పోయినను నీ మచ్చలు చూపునకు అడ్డమువచ్చును.

అంత్యము:-

బహు తేలికగా యీవ్యాధి వచ్చును గాని పూర్తిగ నయము కానేరదు. తీవ్రముగా ప్రవేశించిన కళ్ళలో చాల మార్పులు యేర్పడును.

1 రెప్పల లోపలి వైపున మచ్చలుపడుట వలన రెప్పలు లాగుకొని పోవును. రెప్పలు లోనివైపునకు తిరుగును. కాన కంటిరెప్పల వెంట్రుకలు గుడ్డునకు గుచ్చుకొనును. యీగుచ్చుకొనుట వలన శుక్లమండలముమీద పుళ్లుపడును. ఎక్కువగుటవలన రెప్పలలోనికండలులాగుకొనును. అందువలన రెప్పలు బయటకు తిరుగవచ్చును.

2 రెప్పల వాపు వలన తెల్లగుడ్డు రెప్పలును అంటుకొని పోవచ్చును.

3. గుడ్డుపైకి వచ్చు పొర కొన్నాళ్ళుండిన శాశ్వతమగును. శుక్లమండలముమీద మచ్చలవలన చూపునకు నష్టము గలిగి శుక్లమండలము పొడుచుకొని రావచ్చును.

చికిత్స:--

వాపును, కంటినుండివచ్చు స్రావమును తగ్గించుటకు ప్రయత్నముచేయవలెను. దానికి కొన్నిమందులు, శస్త్రచికిత్స యవసరము. మందులలో ముఖ్యమైనవి మైలతుత్తపుకణికలు, పటికకణిక, వెండిసంబంధమగు అంఖులు, శస్త్రిచికిత్స, మొదలగునవి.

పూర్తిగ వ్యాధిరహితమగువరకు వైద్యముచేయకున్న వ్యాధితిరిగిప్రారంభించును. యీవ్యాధి వచ్చినతరువాత కుదుర్చుకొనుటకన్న రాకుండ జేసికొనుట మిక్కిలి మంచిదని తెలియుచున్నది.





# హిమబిందు.



(అడవి బాపిరాజు గారు.)

ఇరువదియవ ప్రకరణము.

## నాట్యము.

“ప్రహార కుమారుని నేను ప్రేమించి నాను. ఆతనితోడిదే నా లోకము, నా జీవితము.” ఏమి ఆతడంత అందముగానున్నాడు. ఆతని చూపులో కాంతి సూర్య కిరణముల రీతి తనకు మిరుమిట్లు గొలిపినవి. ఎంత వత్రువలు ఆతని పెదవులు? ఏమి సుందరాకారుడు!

హిమబిందు కాదినములలో ప్రహార కుమారుని రూపమే కాన్పించినది. ఆతని మాటలే వినిపించినవి. ఆతని చూపులే వెలుగులైనవి. సుధా ప్రవాహము వెన్నెలయైనది. వెన్నెల ఆనందము, ఆనందము ప్రహార కుమారుడైనది. ప్రహార కుమారుడే తనకు నీడ యైనాడు. ఆమెకా రోజులలో సతతము లీలా మాధుర్య సంగీత స్వనములు వినిపించినవి. ఆమె నిముషమునకొక్క చీరకట్టినది. సిద్ధముగా తేట తెల్లముగా చెక్కిన రజత ఫలక ముకురములలో చంద్రకాంత శిలాతల దర్పణములలో తన్ను చూచుకొన్నది. లక్షల కొలది సువర్ణ పణములు విలువజేయు నగలనేకములు ముహూర్తమునకొక్కరీతి, ఒక్కమాదిరి మార్చినది. సన్నని పంచమ స్వనమున చిన్ననాటిపాటల పాడినది. బుద్ధుని జాతక కథా శ్లోకముల గాన మొనరించినది. ఆమెకు ప్రణయ ప్రత్యక్ష మగుటచే సర్వము ఆనందమే. పరిచారికలకు బహుమతు లిచ్చినది. వారిని ప్రియవాక్యముల పల్కరించినది. ఆమె కొక్కటే ధైర్యము. తాను ప్రపంచమున నున్న బాలలలోకెల్ల సుందరాంగి. అట్టి దానిని ప్రహార కుమారుడు ప్రేమించక,

ఏపాలు మెసవురు? మోహించినాడుకాదా! స్తూపముకడ ఆతనిమాటలే ఆతని రీతియే వ్యక్తపరచినవి. ఇంక తార్కాణ మేమి కావలయును?

తానెంతో అందమైనది. అయ్యది నిజమేకాదా! ప్రహార కుమారుడు తనకు సరిపోయిన అందకాడేనా? అది తాను తెలిసికొనవలయును. బాలనాగి చెప్పినది. తన హృదయమున కాతడు సతతము గోచరించుచున్నప్పు డందకాడు కాకుండుట ఎట్లు?

హిమబిందు కుమారిక కింకను తాను ప్రహార కుమారుని ప్రేమించుచున్నట్లు వ్యక్తము కాలేదు. మనో భూములనిగూఢ ప్రదేశముల ఆవిషయ మించుక స్ఫురించినది. వెన్నెల వలుకు వెలుగులు వియత్పథమున విదజల్లుటకు రేరాజు కెంత యవకాశము కావలయును? మలయ పవనాంకురములు మొలకలెత్తుటకు వసంత సాయం సమయములనేపాటి ఎదురు చూపుండవలయును. ఆమె కాతని మరల నొక్కసారి చూచిన చాలునని కోర్కె కలిగినది. తన తల్లికి చెలిమి క్షత్రియయగు శక్తిమతీదేవిని వారింటికి బోయి ఏల చూడకూడదు. అది హిమబిందు గౌరవమునకు లోటా! లేదు కాని ఇదివర కెన్నడునుబోనిది తానెట్లు ఇప్పుడు వెళ్ళగలదు. మరల నాతడు స్తూపము కడకు వచ్చునేమో. కాని తానచ్చటకు వెళ్ళినచో ఆత డేమనుకొనును? సిగ్గు. తానాతని వలచెనని అనుకొనడా? నిజముగా ఆతడన్న తనకున్నకోర్కె ఏమి? శకట పరీక్షలో నెగ్గినట్టి వాడు భరత వర్షమునకు కీర్తి తెచ్చినవాడు బాలకుడు అట్టివానిని ఎవరైనను చూడ నిచ్చగింతురు. ఆలాగున తనకును బుద్ధిపుట్టినది.

చారుగుప్తు డింటలేడు. ఆమె చిన ముత్తవ ముక్తావళీదేవి మాత్రమింటనున్నది. ముక్తావళీదేవి హిమబిందు తల్లియగు ప్రజాపతి మిత్రకు పినతల్లి. ఆమె కెవరును పిల్లలు లేరు. అక్కగారు చిన్నతనముననే ప్రజాపతి మిత్రను కని నిర్వాణపథ సంశ్లేషయగుటఆ బాలను పెంచి కన్న కుమారిత కన్న నెక్కుడు లాలించి పెద్దదానిని చేసినది. కుబేరుడగు ప్రజాపతి మిత్రతండ్రి లక్ష్మీ స్వరూపుడగు చారు గుప్తునకు తన కుమార్తెనిచ్చి వివాహము చేసిన నాటినుండి ముక్తావళీదేవి ఆమె యింటనే యున్నది. చిన్నతనముననే తల్లివలెనే ప్రజాపతి మిత్రి హిమబిందునకన్న మూడు సంవత్సరములకు కీర్తిశేషు రాలయినది. అప్పటినుండి ఆవృద్ధాంగన తన ప్రాణము లరచేతిలో నుంచుకొని అమిత ప్రేమతో పెంచినది.

బౌద్ధమతమన్న ఆమె కేమియు నమ్మకములేదు. సేవకుడగు నొక నాగుని అడవులలో వాసము చేయు మాతంగుల కడకు పంపి వారి దేవతలకు బలు లిప్పించి అచ్చట హిమబిందునుగూర్చి ఆమె తల్లిపోయిన రెండు సంవత్సరములకు సోదె యడిగించెను నారా బాలవర్తకుని వివాహ మాడ కూడదనియు అట్లయినచో జీవితమునకు ముప్పునువచ్చుననియు ఆమెకు ఇరువదవ యేడుకు ముందు వివాహము కాకూడ దనియు ఆమె వివాహమునకు పూర్వము సంవత్సరము లోపల నొకసారి ప్రాణాపాయము వచ్చునంత యగు ననియుఅప్పు డామెను యెవరు రక్షించెదరో నాతడే భర్త యగునని యుసోదె చెప్పిరి.

ఈ రోజున హిమబిందు ముక్తావళీదేవి కడకుబోయి "అమ్మమామ్మా, సమరకుమారుల

వారిభార్యను శక్తిమతీదేవిని నీవెరుగుదువా యని ప్రశ్నించెను.

“శక్తిమతినే ఎరుగనా! అమ్మతో అడుకొనేదమ్మా! అమ్మకు శక్తిఅన్న ప్రాణము. ఇరువురు నొకకంచములో అన్నము తినువారు నొకచోట పండుకొనువారు. ఇద్దరు సువ్వాలాటలాడుకొనుచు బొమ్మలపెట్టి పెండ్లిండ్లు చేసికొనువారు. వియ్యపురాలమని వేళాకోళ మూడుకొనువారు.”

హిమబిందున కేలనో గుండెలుకొట్టినవి. తల్లి బ్రతికి యున్ననేది యెట్లయి యుండునో.

“అమ్మమ్మా! శక్తిమతీదేవి పెద్దమ్మాయియు నేనును నొకగురువు నొద్దనే చదువుకొన్నాము సుమా. ఈరోజున వారింటికి వెళ్లవలెనని యున్నదే”

“నాఅభ్యంతరము లేదు. శక్తిమతిని చూడవలెనని నాకెన్ని యేండ్ల నుండియో కోర్కె. ఆమెకు పిల్లలట. ఆమెను చూచిన (కండ్లనీరు గ్రుక్కుకొనుచు) అమ్మజ్ఞాపకము వచ్చును. అట్టితల్లినాకుదక్కునా! పాపపు దైవము బ్రతుకు బద్దలుచేసినాడుకదా!”

“మధ్యాహ్నముబయలుదేరి వెళ్లెదము. స్యందనములు సిద్ధముగానుండును” అనిహిమబిందు వెడలిపోయెను.

ఆమె కేలనో భయము వేసినది. ఏమియుతోచదు. అలంకారకురాలగు కౌరాదత్తను బిలువనంపి తనకున్న మంచివస్తువుల, బట్టల, తీయమన్నది. పాముకుబుసముల జోలు సన్నని దుకూలములు చిత్రచిత్రవర్ణములు జెలువొందినవి యామెదూరముగా దోచినది. వలిపెములు సముద్ర వీచికాఫేన సదృశములై జిలుగుల తళుకుమను నవి నచ్చలేదన్నది. మిలమిలంపు మడతల కులుకులీను అంబరములు గని పెదవివిరిచినది. ఎట్టకేలకామె వివిధవర్ణ సురేంద్ర చాపసౌందర్యముగ చీర కటిభాగ మలంకరించినది. రత్నతారకలు పొలుపారు సువర్ణ మేఖల నొయారంబు పొంగునూటయూనెన్నడము క్రిందనూలుగా, వక్షోపరిసానువుల మేఘమూక్రమించు ఆచ్ఛాదనోత్తరీయము నీలరుచుల వెలుగుగా తుల్యరహిత హారపంక్తులు ఎత్తుపల్లముల ప్రవాహములుగా సొబగులమేటియై ముకురముకడ మూర్తిముడిచినది.

హిమబిందు గర్వభూయిష్టయైనను, తీవిలో నొరులకడ గంభీరతవహించి సంచరించిననుయిష్టమువచ్చిన వారినడకలోనడంగియున్న బాలికాచాపల్యము మరుగుపరచలేదు. చంటిపిల్లదానివలె గంతులు వేయును, కలకలనవ్వును, ఆటలాడును, చిరుగాలులవలె సంతోషమునై సంచరించును. కూర్మివారి హాస్యమాడును. ఆమెకుసిగ్గులేదు. చిన్నతనము నుండియు పిల్లలులేని చారుగుప్తుని కుమారిత బాలునివలె నెదిగినది. బాలురవిద్యలు నేర్చినది. నాల్గు నత్తమాశ్వములు పూన్చిన రథము తెల్లకంబళి ఛత్రముగా గప్పినది, చిత్రశిల్పకౌశల్యము కలిగిమెలగులారునది, ధాన్యకటకమున కృష్ణానది యొడ్డునయున్న చారుగుప్తుని మహాభవనముకడ ఆసాయంత్రము పదుమూడవ ముహూర్తనాదము పట్టణము లోననేకప్రదేశముల ప్రతిధ్వనించుచున్నప్పటికి వచ్చియాగెను. అందుస్త్రీజనముండిరని తెలియుట తోడనే లోనుంచి పరిచారికలు వచ్చి వారి నెదుర్కొనిరి. గుమ్మముకడ నాగబంధునికయు

శక్తిమతియు మహాలియు నిలిచి యుండిరి. వారర్పించిన రజత పాత్రంబుల సుగంధ జలంబుల కాలగడిగికొని లోనికిపోయిరి. కస్తూరిచే సమ్మిళితమగు కుంకుమ బొట్టుశక్తిమతీదేవి హిమబిందు మోమున నుంచెను. నాగబంధునిక యాబాలపాదములకు లత్తుక లిఖించెను. పద్మరాగమున నెఱవారితామర మొగ్గల రీతిచిరుతలై సౌహార్ద్రములై నవ కంబులీను వేళ్ళుకలిగిన యాయమపాదములు తనచేతి కాంతులతో తియ్యమందు నప్పుడు చూచి నాగబంధునిక వానియందమునకు నాశ్చర్య పడియెను.

అభ్యంతర మందిరములకు పోయిరి. అచ్చట సుఖాసీనులై వివిధవార్తల ముచ్చటించుకొనిరి. కుమార్తెనుతలంచుకొనిముక్తావళీ దేవి వాపోయెను. అందరును కండ్లనీరు పెట్టుకొనిరి. ముక్తావళీదేవి, శక్తిమతిని పిల్లలెంతమందియని యడిగెను, ఏమిచేయుచున్నారని యడిగెను. వారిరువురు యెరిగియున్న కాంతల గూర్చి మాట్లాడిరి. ఈ లోన హిమబిందును నాగబంధునికయు నెయ్యము తో సంగతులేమియో ముచ్చటించుకొనిరి. నవ్వుకొనిరి. నాగబంధునికకు ముభావముగా తనతో నిదివరకు మాట్లాడు చుండిన యాహిమబిందు నేడేల యింతవిచిత్రముగా తనయింత సౌహార్ద్రముగా తమయింటికివచ్చి తనతో మాట్లాడుచున్నదో అర్థము కాలేదు.

అందరును యిల్లుచూచుటకు బయలు వెడలిరి. వైభవముతోడను, వైశాల్యమునకు ఔన్నత్యమునకు, చారుగుప్తుని మహాభవనముతో సమరకుమారుని సౌధము సరిపోక పోయినను, సౌందర్యమునకు దానితో నేమాత్రముతీసిపోకయుంచియుండెను. నాలుగు అంతస్తుల మేడ చారు గుప్తునిది. సమరకుమారునిది రెండేఅంతస్తులు. హిమబిందుకళానిధియగుట, యామందిరములు చూచి ఆనందించెను. ముసలిముక్తావళీదేవి వెనుకబడుటచే నాగబంధునికయు, హిమబిందును ముందుబోయిరి. హాస్యములాడుచు కెవ్వున నవ్వుకొనిరి. చప్పట్లు కొట్టికొనిరి. అట్లామదిరము లన్నియు తిరిగి బాలికలు సిద్ధార్థనికతో కూడి తోటలోనున్న క్రీడామందిరమునకు జనిరి.

ఆ క్రీడా మందిరము నొక ముగ్గుల మూట. సాగర వీచికా సౌందర్యపూరితము మహావనగర్భితానందమయము.

"మనమిక్కడ నాట్యమాడదమా నాగబంధునికా ?"

"ఉపకరణములు"

"మన గజ్జియలే"

"సిద్ధార్థనిక శ్రుతియు, తాళమును వేయునులే"

వారు నాట్యమాడసాగిరి. ఆషాఢమేఘాల మెరుపుల్లా, ఆమబ్బు లోయలలో మిరుమిట్లుగొల్పినవి. ఒక్కసాయంకాలము వింధ్య పర్వతసానువుల, నొకశైవాలినీకన్యలిరువురు ఆటలాడుచు సంగీతస్వనముగ నొండొకచో పతి సౌందర్య క్రీడాభిరక్తుడై యున్నప్పుడు వారి సొబగుల మేఘచాయ నర్తించు ఇంద్రధనస్సులవలె ఆబాలికలిరువురునృత్యము మొదలిడిరి. శ్రుతి వేయుచు సిద్ధార్థనిక చిరునవ్వునవ్వినది. సిద్ధార్థయశోధరా ంవదర్శనము వారభినయించిఅవ్యక్త మధురస్వనముల పాటపాడిరి.

హిమబిందు:—

సిద్ధార్థుఁడు *

"మేఘాంచలములందు మినుకాడునీల
వర్ణంబునన్ జేరుపద్మ రాగంబు
బర్హిగళమరకతము పాముతలకెంపు
కమల విమలానంద కరికుంభముత్య
సిక్థాంత కాంతులన్ జెలువారు మెలుకు
హృదయంబు చెయివెట్టికుదురుమా పెడిని

నాగబంధునిక:—

చెలికాడు

హిమవన్నగాంచల ద్రుమపత్రనిధులతో
మేళవించెను నీలమేఘుజాలంబు

సిద్ధార్థినిక తాళము వేయుట మాని కుమ్మముకడ నిలచియున్న సహోదర సుంద రమూర్తి సందర్శనము దర హాసముతో గమనించెను. వీణానాదమును మనోహర సంగీతమున తేలియాడి వచ్చు పాటవాగును ఆయుద్యానవనము నొంటిమై సంచరించు ప్రహరకుమారుని చకితుని చేసినవి.

'ఏమే బాలనాగి దారియామునవే'

అను కఠిన వాక్యాంతర్గర్భిత మాధు ర్యము నేడాతనికి పులకితమైన ప్రహరా అల్లిబిల్లిగ నల్లికొన పచ్చని పొదలలోనిగుడి పోయిన సకల గుణ చాంపేయ సౌరభము దిలకించెదవుగాక. కమలాసౌశీల్యము మల్లికా శిశుత్వము మాధవీలతా మాధుర్యము దమన మరవక ఓషధీ సౌభాగ్యము దండ కూర్చెదవుగాని రమ్మని' వీణావాణులాతని చెవికడ రహస్యములు తెలిపినవి.

హిమబిందు అట్లనే నిలిచిపోయినది. ఏసందర్శనమునకై నాడంతయు తపంబొన రించుచున్నదో, ప్రయత్నము సలిపినదో, యుపాయమాచరించినదో ఆదివ్యగోచరము రూపొందినతోడనే ఆమెకు చెప్పగా రాని వివశత్వము కలిగినది. మలయపవనాంకుర ములు తీవ్రమై శరీరము నలుము కొనినవి. సుగంధవీచికలామెపై విరిగి పోయినవి.

నాగబంధునిక గనుసుదనమున రహ స్యము గ్రహించివేసినది. "అన్నయ్యా ఈఅమ్మాయిని ఎరుగుదువుగా? చారుగుప్త దేవునికుమార్తెమాకున్నే హితురాలుఅమ్మా హిమబిందు తల్లియును చిన్నతనములోపాణి స్నేహితురాండ్రట హిమబిందు ముత్తవతల్లె అమ్మనుఎరుగునట. అందుకని చూచుటకు వచ్చినారు. మేము నీబొమ్మలు చూడవచ్చు నా? మాకు చూపించవు?"

ప్రహరుడు నవ్వుచు " సిద్ధార్థినికా ! వీణబాగానే వాయించినావే! రండి. వెళ్లి చూచెద"మని యాతడు ముందడుగు వైచెను.

* ఈపాట పూర్ణముగా ముందు వర్ణింపఁబడును.



# వనసౌఖ్యము

[ నరహరిశెట్టి వేంకటరత్నముగారు. ]

ఈవిపినముఁ గనుఁగొన నాకెంతయు నానందమయ్యె !
ఓవనజాస్య ! పురములనుండ నేమిసౌఖ్యంబిఁక !
పిల్లగాడ్పులెంతయు నాయుల్లమపహరించె నహా !
మొల్లలుజాజులు సుగంధమును విరజిమ్మెడినిఁగనుము.

లేజివురులతోఁ గ్రాలెడి భూజములను గనుఁగొనఁగా
లేజవరాండ్రఁ బోలి బలే ! కన్నుల పండువయ్యె!
కోకిలంబు పాటపాడి కూర్చెడి సంతసము మదికి
నాకా బలపాటలేల నారీమణి సుదినంబిది.

హాయిఁగా విపంచిబూని యాడుచు బాడుచు గడపెడి
కేయిసుమ్ము కేయియనఁగ తోయజాక్షి యీతోఁటఁ
పూలపాన్పు, మంచిగాలి, పూఁబోఁడియు నిర్జనస్థ
లాయంబుగలిగిన నేలా స్వర్లోకసుఖమ్ములు?

వనజాప్తుండవరగిరికి జనియెఁ వనసౌఖ్యంబులు
వనరుహవైరికి దెల్పఁగ వారిజాత చారునేత్ర !
కనుమా! వటభూరుహమును కనుమా సురసాలంబును
కనుమా! బూబొదరిండ్లను కనుమా వెన్నెలరేయిని

లలితంబగు నిట్టిస్థలంబులు విధాతృనిర్మితమును,
పురము మానవుని నిర్మితముఁగ కవిగీతమువినవే
పూదావియు, చల్లగాలిపోలిక నీ నా మనములు
మోదమ్మున నేకమయినముక్తి బ్రహ్మంబదియే !



# ప్రపంచపర్యటకులు.



క్యాప్టెన్ వాండర్ వెల్ యను నాతడును, నాతని సోదరియు మోటారు బండిమీద ప్రపంచమంతయు చుట్టి రావలయునని బయలుదేరినారు. వీరి తండ్రి గొప్ప ధనికుడు. వాండర్ వెల్ యను నాయన అమెరికా దేశపు ప్రెసిడెంటగు జి. హార్డింజి మొదలగు ధనికులకు తన మనోగతాభిప్రాయమును విన్నవించుకొనెను. వారీ ప్రయత్నమునకు సంతసించి కావలసిన ధనము మొదలగు వాని నొసంగుట కంగీకరించిరి.

భూప్రదక్షిణ మొనర్చుచున్న కెప్టెన్ వాండర్ వెల్ సోదరి.

యిదివరకు సైన్యాధ్యక్షుడై యుండెను. ఈతడిదివరకొక మారు అమెరికా దేశమంతయు నాల్గు సత్సరములలో చుట్టివచ్చెను. పిమ్మట నీతనికి ప్రపంచమంతయు తిరిగి రావలయునను సంకల్పము గలిగి కాని వారిద్దరు పర్యటనమునకు కావలసిన ధనమును వారతే సంపాదించు కొనుటకు ప్రతిజ్ఞబూనిరి. అందువలన బయలుదేరినది మొదలు వారికి కావలసిన ధనమును వారలే సంపాదించుకొను చున్నారు. గృహ

మును వీడు నప్పుడు వారికడ నొక చిల్లిగవ్వ యైనను లేదనుట యతిశయోక్తి గాదు.

1919 సం॥ 22 శెప్టెంబరున వీరిర్వురు అమెరికా యందలి అట్లాంటాయ్ స్టేటునుండి ప్రపంచ పర్యటనమునకు బయలుదేరిరి. వీరివెంట ఫోర్డు మోటారు బండి యొకటి యున్నది. దాని ఫోరు సిలెండరులు గలవు. 65 గుర్రముల పవరుగల యింజను గలదు. తుపాకులు, నూనె మొదలగు పనిముట్లుగూడ యందు గలవు. బండికి యమెరికావారి స్వాతంత్ర్యపతాకము కట్టబడినది

యుటకు కెప్టెన్ వాండర్‌వెల్ గూడ "డెట్రాయిట్" నుండి 1921 సం॥ 21 నవంబరున బయలుదేరెను. వీరు మిషిగాన్ నుండి బయలుదేరి పలుదేశములుతిరిగి కెనడా యందు బ్రవేశించిరి. వారికడ ఫోటుగ్రాఫులు దీయు నొక క్యామరా యుండెను. మార్గమందలి సుందర దృశ్యములకు ఫొటగ్రాఫులను దీసిరి. కెనడానుండి మెక్సికోకు వెళ్లిరి. అచ్చటనుండి కాలిఫోర్నియా యందలి శాన్ ఫ్రాన్సిస్కోను చేరిరి. అచ్చట జగద్విఖ్యాతమగు కిగ్స్నాయుల గనులను జూచిరి. అచ్చట నుండి సెంట్రలు అమెరికాకేగి యచ్చట ఫ్యాక్టరీలు




భూప్రదక్షిణ మొనర్చుచున్న కెప్టెన్ వాండర్ వెల్, అతని సోదరి.

అట్లాంటాయ్ స్టేటునుండబయలుదేరిపర్వతములు నదీ నదములు, మొదలగువాని నతిక్రమించి మిషిగాన్ నందలి "డెట్రాయిట్" అను పట్టణమును చేరిరి. అచ్చట నొక సెనో మెటగ్రఫీవారు భూప్రదక్షిణ మొనర్చి యందరికంటెను ముందు స్వస్థలమును జేరు వారికి పదిలక్షలడాలరులు బహుమతిగ నొసంగెదమని ప్రచురించిరి. ఈ బహుమతిని బడయుటకై మిచిగా నుండి యారుగురు బయలుదేరిరి. ఆ బహుమతిని బడ

మొదలగు వానిని చూచి 1922 సం॥ 5 వ జూలైతో యుత్తర యమెరికా దేశ పర్యటనను ముగించుకొని యట్లాంటిక్ మహా సముద్రము నొక స్టీమరు మీద ప్రయాణ మొనర్చి దాటిరి. ఆగష్టు నందు లండనుకు వచ్చిరి. ఇచ్చట పెద్ద మనుష్యులు వీరిని మిక్కిలిగ గౌరవించిరి. అచ్చటనుండి స్కాట్లాండు మీదుగా ఫ్రాన్సునకేగిరి. ఇచ్చటనున్న పృథ్వియందలి గొప్ప దగుటవరును గాంచి మిక్కిలి సంతసించిరి.

ఫ్రాన్సు నుండి కాన్ మెరినో మధ్యనుండి ఇటలీ రాజధానియగు రోము నగరమును జేరిరి. రోము నుండి స్పెయినుమధ్యనుండి పోర్చుగలునకేగిరి అచ్చట యొకటిరెండుదినములుండికొలదిగ ధనమును సంపాదించుకొని ఆఫ్రికాదేశమునకేగిరి. అచ్చటయుష్ట్రదకపుటూటలను గాంచిరి. అచ్చటభూప్రదక్షిణ మొనర్చుచున్నమరియొకయమెరికాదేశీయుడు గన్పడెను. అతడు మోటారు సైకిలుమీద తిరుగుచుండెను. వారచ్చటనుండి జర్మని దేశమున కేగిరి. అచ్చట నొక యువకుడు వీరి యమెరికా దేశపు జెండాను చించివేసి జర్మనిదేశపు జెండాను మోటారునకుగట్టెను జర్మనీనుండిరష్యాకేగుటకు రష్యా వారి యుత్తరువుకొరకు వ్రాసికొనిరి.

జర్మనీనుండి బయలుదేరి శీతకాలమున పోలెండును జేరిరి. అచ్చటనుండి రుమేనియాను చేరి యచ్చట పెద్దలను దర్శించి గ్రీసునకు వచ్చిరి. అచ్చటనుండి పాలెస్టయిన్ నుండి మిశరునకేగి మెసపటోమియా నుండి స్మర్నాకు బయలు దేరిరి. ఎడారిని దాటి పట్టణమును చేరిరి. అచ్చటనుండి సోమాలిల్యాండునకు వచ్చిరి అచ్చట ముఖ్యప్రదేశములగాంచి మహమ్మదీయులకు ముఖ్య తీర్థస్థానమగు మక్కాకేగిరి. అచ్చటి భయంకర గ్రీష్మమునకు తల్లడిల్లిరి అరబ్బు నుండి కరాచీ రేవున దిగిరి. అచ్చటనుండి బొంబాయి కేగి యటనుండి యాగ్రాకువచ్చి విశ్వ విఖ్యాతమగు తాజ్ మహాలును దర్శించిరి. 17 జూన్ అలహాబాదునుండి కాశికి వచ్చిరి. 22 జూన్ కు కలకత్తాకు వచ్చిరి. కలకత్తానుండి చీనా దేశమున కేగ బ్రయత్నించిరి వీరు ప్రపంచమునందచ్చటచ్చట దీసిన ఫొటగ్రాపులను విక్రయించి మిక్కిలి ధనమార్జించిరి. 9 జులై రంగూనుకు బోయిరి.

## నా చరిత్ర.

నాకొక పుత్రుడు- పుత్రిక. పుత్రుని పేరు సుఖము. పుత్రిక పేరు శాంతి. పుత్రుడు పెద్దవాడు. వయసుకూడ మిక్కుటము. అందువలననాతడు తీవ్రస్వభావి. శాంతిచిన్నది. వయసునకూడ చిన్నది. కోమలశరీరమున నలరారు నామె ప్రకృతిసుకోమలము; సువినయము. సుఖమున కనేకమంది స్నేహితులున్నారు. అందువలన నాతడెప్పుడును యాటపాటల కాలము గడుపుచుండును. శాంతికి సహవాసకత్తెలులేరు. అందువలన నామెయెవ్వరితోను కలియక నెమ్మదిగ తన కార్యములు దానొనర్చుచుండును. భిన్నప్రకృతుల నలరారుచున్నను అన్నచెల్లెలన్యోన్యప్రేమతోడ మెలంగుచుండిరి. మా సుఖమత్యంత బలిష్ఠుడు. ఏనుగుదంతమును పెరుకుకొని వచ్చుటకు గూడ నణుమాత్రమైనను వెనుదీయడు. ఇకస్వభావమా!దూర్వాసుడే. కాని సోదరికడ నెప్పుడును తలయొగ్గి దుర్బలుడైయుండును. ఆతనితీవ్రస్వభావమామెను చూచినంతనే చల్లపడును. సాధారణముగ నందరివలెనే నేనుగూడ చిన్నపిల్లయగు శాంతినే మిక్కుటముగ బ్రేమింతును. దాని గుణములవలన గూడ నాప్రేమ వెల్లివిరియుచుండును.

నేను సంపన్నుడనుగాను. నిర్ధనుడను. అందువలన శాంతి దరిద్రుని పుత్రిక. కాని యామెకు వయసురాలేదు. దరిద్రుని పుత్రికకు సువర్ణభూషణములుండవు నాకునగలులేవను చింతయామెకులేదు. నిరంతరమానందమును చిరునగవుల నేత్రపద్మముల వెళ్ళగ్రక్కుచుండును. నేను శాంతిమీద నాధారపడియే జీవింపుచుంటిని. "శాంతికి వయసువచ్చిన పరులయింటికేగును. దానిని వదలినేనెట్లు జీవింతు" నని పరిపరి విధముల తలపోయు

చుంటిని. అట్టియోచన నామనమునకు వచ్చినంతనే కన్నీరుకారుచుండెను. కాని యెవరిచేతనయిన బెట్టక తప్పదుకదా! వివాహము చేయనియెడల చుట్టపక్కాలేమందురు! ఈదరిద్రునిపిల్లను- ఒక్కబంగారుపూసయైన నొంటలేని యీపిల్లను- చేబట్టువారెవ్వరు? విద్యాధికులై ధనమార్జించు యువలకు దరిద్రునిపుత్రిక గుణగణముల మీద దృష్టి నిల్చునా?

క్రమముగా శాంతికి వయసువచ్చుచుండెను. దానితోడ గుణగణములు రూపలావణ్యములు వికసింపజొచ్చెను. కాని చేయునదియేమి? విషమ సంకటమున దగుల్కొంటిని. శాంతిని మరియొకని యింటికి బంపుట కయిష్టము. దానినెప్పుడు నాకడనే యుంచుకొనవలయునను కోరిక మొదలగునవి యొకదిక్కున నన్ను మిక్కుటముగ తొందరింపుచుండెను. రెండవదిక్కునుండి చూచినయెడల లోకులేమందురో యను సంశయమటులుండ స్త్రీత్వము. మాతృత్వమునుండి యామెను వంచించుటెట్లు?

కాని యీచింతనమున నేను కృశింపజొచ్చితిని. శాంతిమనోభావమును గనుగొనవలయునను దలంపున వివాహవిషయమును వెల్లడించితిని. దానితోడ నాహృదయ వేదన గూడవెల్లడియాయెను. నన్నుచూచి శాంతి యిట్లనియె "నాయనా నాకొఱకు నీవింతగా యోచింపవలసిన పనిలేదు. భగవానుని మీద నిర్భరపడుము. ఆతడెట్లొనర్చినను సంతసమేగదా?"

ఆమాటలు నామనమునకు తృప్తి గలిగించెను. అప్పటినుండియు నాయోచన చాలవరకు కట్టుబడెను. ఉద్యోగ మొకింతతరిగెను. ఆసాహసముతోడ శరీరమున కొకింత బలమువచ్చెను. ఇట్లు మూడునవత్సరములు గడచెను. చిట్టచివరకొక విద్యాధికుడగు యువకుడు శాంతిపాణిగ్రహణమునకొప్పుకొనెను. ఆతడు సుందరుడు, విద్యాధికుడు-ఉపార్జనాశీలుడు. కరుణామయుడగు జగదీశ్వరుడే యీసంబంధమును గుదిర్చెననినంతసించితిని. భగవానునకనేక వందనము లర్పించితిని. కాని యల్లుని కూడ యింటనే యుంచుకొనిన యెడలనామనోవాంఛితమీడేరునను కొంటిని. బావమరది తోడ కలసిమెలసితిరుగుటవలన సుఖముకూడమంచివాడగునను కొంటిని. కాని యల్లుడు మాసుఖముకంటె మూడునాలుగేండ్లు మాత్రము పెద్దవాడు. పేరు ప్రజ్ఞానము. నేనీ వివాహముకొరకు సర్వ సన్నాహములొనర్చితిని.

వివాహమైనది. నేనునిశ్చింతగనుంటిని. ప్రజ్ఞానముయొక్క సంసర్గమువలన సుఖముయొక్కమతిగతులుపరివర్తితమాయెను. క్రమముగవాడు మంచివాడాయెను. సూపగుణములవలనశాంతిభర్తయాదరణకుగురియాయెను. యీగృహమందుశాంతిపొంగిపొరలజొచ్చెను. కొన్నివత్సరములుగడచినపిమ్మట శాంతికొక ఆడశిశువుగలిగెను. ఆశిశువుపేరు ముక్తి. ముక్తి తల్లియంకమున క్రమాభివృద్ధిని గాంచుచు సమస్తమైన వారికానందమును గలిగింపుచుండెను. సంసారము స్వర్గధామముగ పరిణమించెను. సుఖము శాంతి ప్రజ్ఞానము ముక్తుల కలయికవలన సంసారమును భూమి నందనోద్యానముగ బరిణమించెను. ఈనందనోద్యానమునకు మూలతరువగు ప్రణయమహిమ అపారముగదా! అయితే యింతకు నాపేరేమి?- "ప్రణయము-"

# విజ్ఞానవిషయములు

[ ఆర్. రంగనాథ శాస్త్రి గారు ]

(౧) మానవులకు వచ్చు వ్యాధులనంతములు. అందు కొన్ని వ్యాధులకు పశువుల రక్తమునుదీసి శరీరమున కెక్కించిన నయమగును. అమెరికా యందొక చికిత్సాలయమున రెండు గుఱ్ఱములుగలవు. ఇందొక



చార్లి — జిమ్. అను గుఱ్ఱములు.

దానిపేరు 'చార్లి'. రెండవ దానిపేరు 'జిమ్'. వీని రక్తమును మానవులకు వచ్చు వ్యాధులలో కొన్నిటి కుపయోగ పరచుచున్నారు. ఈ రెండు గుఱ్ఱములు బలమైనవి. ఆరోగ్యముగను లావుగను నుండును. 6 వత్సరములనుండి వీని రక్తము రోగులకొరకు దీయబడుచున్నను, వీని యారోగ్యమున కణుమాత్రమైనను భంగము వాటిల్ల లేదు.

(౨) ఒంటిముల్లు గడియారము.

సాధారణముగ మన గడియారముల యందు రెండు ముండ్లుండును. ఒకటి గంటలను దెలుపును, మరియొకటి నిముసముల దెలుపును. కొన్ని గడియారములయందు సెకండులను దెలుపు ముల్లు గూడ నుండును.



ఒంటిముల్లు గడియారము.

ఇప్పుడొంటి ముల్లు గడియారమును చేసినారు. దానికి కీయిచ్చిన రెండల 40 గంటల వరకును నడుచును. ఘంటల యంకెలకు పైనుండు గుర్తులను బట్టి ఘడియారమును చూడగనే నిముసములగూడ గమనింపవచ్చును.

(౩) చెవిటివారితో మాట్లాడుట కెంతే కష్టపడుదుమో వారును మన మాటల వినుట కంతె కష్టబడుదురు. ఈ కష్ట నివారణ కొరకు ఒకవిధ మగు నూతన యంత్రము నిర్మింపబడినది. ఈయంత్రము స్వల్పధ్వనిని మిక్కిలి గొప్ప ధ్వనిగ జేయును. అందు వలన మన మాటలీ యంత్ర సహాయమున సులభముగ గోచరించును. ఈయంత్రము పరిమాణమందు చాల చిన్నది. దీనిని చేతి కఱ్ఱకు పిడిగా యుంచుకొన వచ్చును. అందు వలన నవసరమువచ్చి నప్పుడా చేతి కఱ్ఱ పిడిని చెవిదగ్గర నుంచుకొని మాట్లాడ వచ్చును.





చెవిటివాని చేతికఱ్ఱ –

(౪) టెలిగ్రాఫోను

టెలిఫోనునందు మాట్లాడవలయుననిన అవతల గూడ వినువారుండవలయును. కొలదిదినముల క్రింద టెలిగ్రాఫోను నొకయంత్రము నూతనముగ గనిపెట్టబడినది. దీనితో మాట్లాడుటకు రెండవదిక్కున మనుష్యియుండవలసిన పని లేదు. మనముమాట్లాడిన మాటలు రెండవవైపున లిపిబద్ధమైయుండును. అవసరము వచ్చినప్పుడు రెండవవైపుననుండు దానిని చెవి యందుంచుకొనిన యెడల నామాటలన్నియు వినబడును.



టెలిగ్రాఫోను.

(౫) క్షయరోగము.

క్షయసంబంధమగు విషము ప్రతిమానవుని యందున నున్నదని డాక్టరు ఫర్నుంటు అనునాయన సిద్ధాంతీకరించి యున్నాడు. దీని బీజాణువులు శరీరమందు రహస్యముగ దాగి యుండును. ఫర్నుంటు ఈ థర్ భాష్పముల ద్వారమున శరీరమందు గుప్తమున నుండు వీనినిగాంచి నాడు.

(౬) క్షౌరమున కుపయోగించు అద్దము.

ఈ యద్దమునకు విద్యుద్దీపముండును. దీనిసహాయమున సులభముగ ప్రతివాడును క్షౌరము జేసికొనవచ్చును.



క్షయరోగ జీవాణువుల పరీక్ష.

(౩) కార్నెజి విద్యాలయమందొక వైజ్ఞానికుడొక యంత్రసహాయమున మన శరీరము ప్రతిముహూర్తము క్షయమగుటను చూపించినాడు. మనిషినితూచిన నయిదు నిముసములకు తిరిగిచూచినయెడల బరువునందు



విద్యుచ్ఛక్తి యుక్తమగు అద్దము.

చాల తరుగునవుచున్నాడు. ఏలయన శరీరమురసాయనిక వస్తువులకూడిక యనియు అందువలన ప్రతిముహూర్తము తరుగుచుండునని యాయనయభిప్రాయము.



శరీరము క్షయమొందుట.

(౮) అమెరికాయందొకడు మోటారు సైకిలు మీద సామానులు దెచ్చి బజారునం దమ్ముచున్నాడు.

(౯) నేడుగడియారముల వ్యవహరించని విద్యాధికుడు ధనికుడు లేనే లేడన వచ్చును. కాలమును సరిగ చూపనియెడల గడియారము చెడినదనియు దానికి మాను వేయవలయునని యనుకొందురు. ఎందువలన ఘడియారము చెడ్డదను విషయమును బాగుగ గమనించరు. ఈ క్రిందినియమముల పాటించిన గడియారము సరిగపని చేయుచుండును.



నూతన దర్పణము.

ఇందు మూడద్దములు గలవు. దీనిసహాయమున తలముడిగూడ యెట్లున్నది తెలియును. అందువలన సౌందర్యము నపేక్షించు స్త్రీలుదీనిని మిక్కుటముగ నుపయోగింపు చున్నారు.



మోటారుసైకిలు మీద వస్తువులబజారు నందమ్ముట.

(క) కొనునప్పుడు బాగుగ చూచికొనవలెను.

(ఖ) కీనెమ్మదిగ నీయవలయును.

(గ) సంవత్సరమున కొకమారు మాను చేయవలయును.

(ఘ) పనిచేయునప్పుడు ఘడియారమును చేతి నుండి దీసి క్రింద బెట్టవలయును.

(ఙ) శీతగాలి నీటియావిరి మొదలగువానిని గడియారమునకు తగుల నీయరాదు. అట్లు తగిలిన తుప్పు పట్టును.

ఈ మొదలగు నియమములు పాటించవలయును.



పయిపు కొట్టునప్పుడు చేతిగడియారముండవలసినపద్ధతి.

# సుందరశివరావు.

( ఆరిద్ర శేషగిరిరావుగారు. )

౧

పెనుగొండ గోదావరి కాలువయొద్దనున్నది. అక్కడి భూములు సస్యవంతములైన సుక్షేత్రములు. ఎకరము చచ్చుసంట రెండుపుట్లు. ఆగ్రామములో నూరెకరము లున్నవానిని పిల్లజమీందారనవచ్చును. సుందరశివరావు తండ్రిగంగాధరశాస్త్రి యట్టి పిల్లజమీందారులలో నొకరు. విశేషించి విద్యావంతులు, పెనుగొండకుఁ గరణము కూడ. అందుచే వారికి నాయూరిలో మాట చెల్లుబడి విశేషము.

సుందరశివరావు విద్యాపూర్తియైన పిమ్మట సేవకావృత్తిచేగాక స్వతంత్రముగా జీవనము చేయనెంచెను. అప్పటికిఁ బెనుకొండలో బియ్యపుమర యొక్కటియు లేకుండుటచే నట్టిదొకటి పెట్టిన బాగుండు ననియు లాభకారిగానుండునని అతఁడాలోచించెను. చివరకదియే నిశ్చయించెను. తండ్రి ధనమీయుట కియ్యకొనలేదు. అంతతోఁ దనయత్నము శివరావు మానునా? మానడని శివరావు నెఱిగినవారెల్ల రనుకొనిరి.

తనవంతుఆస్తిపంచియిచ్చివేయుమని తండ్రిని నిక్కచ్చిచేసెను. సుందరశివరావు. గంగాధరశాస్త్రి వలదని నివారించిన వచనములు పెడచెవినిఁ బెట్టెను. తల్లి కామేశ్వరిమ్మ రోదన మరణ్యరోదనమాయెను. మామ మృత్యుంజయరావు సుబోధన లడవిఁగాంచిన వెన్నెలయయ్యెను. అత్తసుబ్బలక్ష్మిదీనాలాపములాతని చెవులచెంతకుఁ జేరలేదు. బావ సుబ్బారావు నీతి వచనములు బూడిద బోసిన పన్నీరయ్యెను. శివరావున కీషయమై యెవరేమి చెప్పినను బధిరశంఖారావమే కాని లాభము లేదు. నిమ్నమున దొడిగిలు నీరు నిలుపఁ గలవారెవరు? ఈప్సితార్థంబు నకు జాఱుహృదయరుచి నరికట్టఁ గలవారెవరు?

సుందరశివరావు వంతు ముప్పది యెకరములభూమియుగంగాధరశాస్త్రియిచ్చివేసెను. భూమి తన స్వాధీనమైన మాసములో ముప్పది అయిదువేల ఐదువందలకు విక్రయించెను. రాజమహేంద్రవరములో నొక దివాలా షావుకారమ్మివేయుచుండిన పాతబియ్యపుమర నొక దానిని పాతికవేలకుఁ గొనెను. పదివేలుపెట్టి పెనుగొండలో బ్రహ్మాండమైన కట్టడము నిర్మించెను. అందు బియ్యపుమర పెట్టి ఆడ మొదలుపెట్టిరి. సుందర శివరావు గారి మర ఆచుట్టుపట్ల గ్రామములలోఁ బేరు మ్రోఁగిపోయెను. పెద్దపెద్ద రయితుల కందఱి కాతనితోఁ బనిగల్గుచు వచ్చెను.

రెండునెలలలో రెండువేల రూపాయిలు లాభము. ఓ! ఇంకనేమున్నది. మూడుపూవ్వు లారుకాయలు. సుందరశివరావు మునుపటి సుందర శివరావు కానేకాడు. వ్యాపారము బహుళమైనది. లాభము విశేషమైనది. శివరావు పట్టినదెల్ల బంగారమగుచుండెను. వరిపంటయే కాని మెట్టపంటలుపండని గ్రామముల నడుమపెట్టిన బియ్యపుమర లాభకారి కాకపోవుట యెట్లు?

౨

మనవారిలో నొక దుర్గుణమున్నది. ఒకడొక వ్యాపారములో బాగుపడుచుండిన నందఱు కూడ నాపనినేచేసి, తమకును దమకంటె ముందా వ్యాపారము చేయుచున్నవారికి నష్టము కల్గింతురు. రామిరెడ్డి వద్ద బియ్యమాడుట కొంచ మాలస్యమైనమాట నిజము. తనవిరోధి సుబ్బిరెడ్డి వద్ద ముందుమరలో బోయుటేమి? తనవి తరువాత ఆడుటయేమి?' అని రామిరెడ్డి శివరావుపై గారాలు మిరియాలు నూర మొదలిడెను. తలగిల్లి మొలవేయజూచెను. సుందరశివరావుని 'వీడి మరయెంత, వీడెంత' అని తానొక మరపెట్టించెను. రెండుమరలకు బోటీ సంభవించెను. ఒక మరకంటె వేఱొకటి తక్కువధర కాడ మొదలుపెట్టెను.

ధరలు తగ్గుటచే సుందరశివరావుకు దగిన వచ్చుబడి లేదు. పైగా మరమ్మతులకు వేఱుసొమ్ము కర్చుపెట్టవలసి వచ్చెను. రామిరెడ్డి మిల్లు శివరావున కెదురొమ్ము కుంపటివలె నుండెను. గిట్టుబాటు లేదని మర విక్రయించునా? అంత పరువుతక్కువపని కాతడొడికట్టడు. విద్యావిహీనుడైన రామిరెడ్డి ధాటికి నోర్వలేక పోటీకి నిల్వనేరక విద్యావంతుడైన తాను మిల్లు విక్రయించిన దన్నెరిగిన వారిలో దలంపుకాదా? బంధువులలో బ్రబలావమానము సిద్ధింపదా? కావున అతడు మిల్లు విక్రయింపక విశేషముగా నప్పుచేసి పైకి గుట్టుగా మేడి పండువలె నడిపివేయుచుండెను.

సొమ్మంతయు సముద్రములోం బడిపోవుచున్నట్లు ఎక్కడపడిపోవుచున్నదో, ఏపనికై వినియోగింప బడుచున్నదో, కాని చేసినపని కనుపించదు. చేతిలో పైసాలేదు. దుంపలు దంపలు చేసినను దుడ్డు కొంచమైనను హస్తమునకుం జేరుటలేదు. రెండున్నర సంవత్సరములలో నిరువదివేల రూపాయిల అప్పు. మరపెట్టిన దినములందు రెండు నెలలలో రెండువేల రూపాయిల లాభము పొందినసుందర శివరావేనా యితడు? కాదు కాదు, అతడన్నిటికిని గాండు— అట్లని అతని విచారవదనమే చెప్పక చెప్పుచున్నది. పెద్దలమాట విననందులకుం జెడిపోవుచుంటినని శివరావు గ్రహించెను. కాని కాలాతీతమైనది. కాలు జారినది. తలమునిగినది. అతడప్పుడెంత చింతించినను గతజలసేతు బంధనమే. శివరావుకుత్తుకకు గండకత్తెరపొసగినట్లైనది. శివరావునకు ఆతనిసంతోషస్రవంతి యెండిపోయినది. ఉత్సాహదీపిక కొండయెక్కినది. అప్పు తీర్చుటకు మరవిక్రయింపక తప్పదు. ఎంతలో నెంతమార్పు!

౩

సంగీతమునకున్నంతయాకర్షణశక్తి లోకమున మఱియే వస్తువునకును లేదు. అయస్కాంతము లోహమును మాత్రమే యాక

ర్షించును. సుందరుల సుందరవదనారవిందములు కామాతురుల హృదయములను మాత్రమే యాకర్షించును. కాని సంగీతము సర్వవశ్యకరమైనది. అదియాకర్షింపనివస్తువే లేదు. మణిణించుచున్న పాదపములు సయితము సంగీతము విని చిగుర్చుననుట స్వభావోక్తికి ఎంత మాత్రము దూరముకాదు. పూర్వము బంగారమువంటికోమటి సంగీతమువలన భేరసారము లుడిగెనని ముసలమ్మలు చెప్పగా విని యున్నాము.

గంగాధర శాస్త్రి యింటిలోఁ బదునారేండ్ల బాలిక తులసికోటసమీపమున తుంగచాపమీద కూర్చుండి హార్మోనియము సాహాయమున సంగీతము పాడుచుండెను. ఆ మృదుమధుర గానామృతము గడుపాఱగ్రోలి ఆసుందరి సంగీతవిద్యయందెఁ అందెవేసిన చేయి, యనిచుట్టుచేరిన సుందరులు హెచ్చుగా మెచ్చుకొనిరి. ఆమె కంఠస్వరము కంచుగీసినట్లుండెను. మనోజ్ఞ చూతపల్లవ ఫలములేతక్కు మాఱుపదార్థములు ముట్టని వసంత కోకిల కుహూరావమును సాగదీసి చెంపపై గొట్టినట్లుండెను. కిన్నర అన్నవ మిన్నల కంఠస్వరముల దోసిరాజను నట్లుండెను.

పాడునామె సుందరి. స్వరము మనోహరమైనది. సహజసుస్వర మాధుర్యములకు హార్మోనియము వన్నె పెట్టుచున్నది. ఇట్లుండ చుట్టుచేరిన పల్లెటూరి పడుచులు పెదవిమెదపక, రెప్పవాల్చక స్తంభీభూతులై గానము వినుచుండిరి. ఆమె కొంతసేపు అధ్యాత్మరామాయణ కీర్తనలుపాడెను. కొంతసేపు రాధాకృష్ణుల మోహన గీతములు పాడెను. అట్లామె రెండు గంటలు గానము చేసెను. చేరినవారెల్లఆహా! అనిమెచ్చుకొనిరి. "కామేశ్వరమ్మగారదృష్టవంతురాలమ్మా, చక్కనికోడలులభించినది." అనికొందరనిరి. సుందరశివరావుగారికి మాణిక్యమువంటి భార్యలభించినదమ్మా అనిమఱికొందఱు వచించిరి. సంగీతము పాడినసుందరిని వినుతించుచు నెవరియిండ్లకు వారుపోయిరి.

కానిపాతిక యేండ్ల పడుచు కామేశ్వరమ్మదగ్గరకు జేరి— అమ్మామీకోడలినెప్పుడుతీసికొని వచ్చినారండి యనెను.

కా:— సూరమ్మా! వారమురోజులలో మా చిన్నఅబ్బాయి ఉపనయనము కదా. కావున నేటియుదయమున నే నరసాపురమునుండి తీసికొనివచ్చినాము.

సూ:— అమ్మా! మీకోడలిగారినిమాయింటికి నొక్కసారి పంపుదురా మా యిల్లుచూచి వచ్చెదరు.

కా:— ఓఁ (కోడలితో) అమ్మాయిసత్యవతి. వెళ్ళివారిల్లుచూచిరామ్మా!

సూరమ్మసత్యవతివెళ్ళిరి. రెండవవీధిలో వారిల్లు శివరావునకు బోటిగా బియ్యపు మర స్థాపించిన రామిరెడ్డిభార్య ఈసూరమ్మ ఆమె సత్యవతినితన ఇంటికిదీసికొని పోయిఎంతయో గౌరవించెను. గౌరవించి యిల్లంతయు జూపెను; బంగినపల్లి మామిడిపళ్ళు కొన్నియిచ్చి సత్యవతి తినుదాక బలవంతపెట్టెను. నాటి యుదయమున నే వారియింటగేదె యీనుటచేబరె జున్ను కూడ బెట్టెను. జున్నంటే సత్యవతి చెవిగోసికొనును. ప్రేమతో బెట్టిన జున్నామె సంతుష్టిగా భుజించెను. వారికి నొకగంట

వరకు నేమో సంభాషణజరిగెను. సూరమ్మ సంగీతము నేర్పెదనని మన సత్యవతి యన్న మాట స్పష్టముగా మాకు వినిపించెను. ఆపైమాటలు తిన్నగా వినబడినవికావు. బియ్యపుమరయని పోటేయని నష్టముని లాభమని, మీవారితో జెప్పుమని మావారితో జెప్పెదనని పోరు నష్టము పొందులాభమని సర్తకసరళియని ఐకమత్యమని యేమేమో కొన్నిమాట లస్పష్టముగా మాచెవులలో జొరబడినవి. వారు సంభాషించిన విషయ మేదో మేము చెప్పజాలము. పిమ్మట సూరమ్మ సత్యవతిని దీసికొనివచ్చి యత్తింట నొప్పగించి వెళ్ళిపోయెను.

౮

వింతలో వింత మఱునాడుదయమున సుందరశివరావు రామిరెడ్డి ఇరువురు కాలువ యొడ్డున కూర్చుండి దంతధావనము చేయుచు సంభాషించుకొనుచుండిరి. జనులు వీరిని వింతగా జూచుచుండిరి. వీరిసంభాషణ వింతగావినుచుండిరి. ఇట్టివింతకు కారణ మేమి వింతకాదామఱి —— మాటపట్టింపులచే బోటీగామరస్థాపించిన రామిరెడ్డి శివరావుతో నెమ్మదిగా సంభాషించుచుండుటా? విరోధులే! ఒకరి పొడపొందు ఒకరికి గిట్టనివారే! ఈసరళ సంభాషణయేమి ——" ముమ్మాటికి నిశ్చయము" ——అని వారిద్దరనుకొనిరి. దంతధావన మొనర్చుకొని సమీపముననున్న ఎవరి మరలలోనికి వారు పోయిరి. ఇదిచూచి జనులబ్బురపడసాగిరి.

౯

సుందర శివరావు మిల్లుసాపిడిలో కూర్చుండి జమాఖర్చులు చూచుకొనుచుండెను. అప్పుడు నాగులుగాడక్కడకు వచ్చి అయ్యా! "పతంపూడి వెంకటసుబ్బయ్యగారుగారివి ఆరువందల ధాన్యపు బస్తాలు వచ్చుచున్నవి. నాలుగుదినములలో జరూరుగా గానలెనన్నారు. దస్తు "పంపుతామనినారు" అని చెప్పెను.

సుం:— వెంకటసుబ్బయ్య వచ్చుటలేదా?

నా:—— పనిఉండి ఇంటియొద్దనే యున్నారు. బస్తాకుపావలా చొప్పున ఎంతఅయితే అంతాయిత్తామన్నారు.

సు :—— మునుపటి ధర లేదు. బస్తాకు రు1 8 0 యిచ్చినకాని వీలులేదు.

నా:—— అబ్బో! అట్లయితే అక్కరలేదు. వీరాదియొక్కటే మిల్లను కొన్నారా ఏమి! రామిరెడ్డిగారి మరకేపోస్తాము.

ఆమాటకు సుందరశివరావు మందహాసముచేసెను. దానియర్థముమాకు విదితము కాలేదు. రామిరెడ్డిగారి మరసమీపముననే యున్నది. రామిరెడ్డిగారూ బస్తాకు రేటెంతో యని నాగులుగాడడిగినాడు.

రా:—— రు 1-8-0

నా:—— పావలా ధరలు పోయినవి కాబోలు! సరే! ఎన్నాళ్ళలో నిచ్చెదరు?

రా:— నాలుగురోజులలో

నా:- అయితే బస్తాలుతోలించుకు వచ్చెదను.

రా:— శివరావుగారి మిల్లులోనికి వెళ్ళియే యిటకు వచ్చినావా?

నా:— ఆ ( ( (

రా:-- వారేమన్నారు?

నా- మీరనినట్లే.

రా:- సరే. మొదటవారిదగ్గరకు వెళ్ళినావు కాన మీాబస్త్రాలామరకే పోయును. వారిమీాదపోటీగా మేము వ్యాపారము చేయము.

*  *  *  *

సుందర శివరావునకు యిరువదివేల అప్పునాలుగు వేలలోనికి దిగినది.

ఆహా! సంగీతమహిమ! నడుమ పూరివేసిన భగ్గున ప్రజ్వరిల్లు ప్రబల శత్రువు లగు సుందరశివరావు రామిరెడ్లను స్నేహితులుగా నొనర్చుటకు ముఖ్యకారణమైనది!

*  *  *  *

సత్యవతిరానిచో నీపాటికి సుందరశివరావు ని యేమైయుండునో?

# జానకీపతీ.



ఉ.॥ నమ్మిన నిన్నె నమ్మవలె నానది యట్లవినోధితమ్మునిన్
నమ్మినరాజుఁ జేసితి వనాథులపాలిటి దైవరాయనే
నమ్మమతెన్వరిన్ మిగుల నమ్మితి నిర్మల కర్మ చిత్త వా
క్యమ్ములనిన్ను నమ్మితినఖండ కృపానిధి జానకీపతీ.

చ.॥ అతులజగత్పతి ప్రియుది తామరదివ్య సుగంధధీరతీ
సతతగుణోన్నతీ విమలచారుమతీ దినరాజసంతతీ
కుతుకమనోధృతీ యమితకుంభిపతీ చిరభాగ్యపద్ధతీ
చతురచనస్థితీ సతతసద్గతి మద్గతి జానకీపతీ

ఉ.॥ నవ్వులుగుల్కు నెమ్మొగము నల్లనిమేనుపసిండి వల్లెయున్
నివ్వటిలంగ నాయెదుట నిల్చి దయారస మొప్పఁబిల్చినా
నెవ్వగవాయ తారకవినిర్మలమంత్రి ముపన్యసింప వే
దవ్వలనుండ నేలఁ దగదాస్యముఁ జేసెద జానకీపతీ!

[ శతకకవుల చరిత్ర. ]






కొన్నిరోజుల క్రిందట ఐరోపా దేశము నందు సుప్రసిద్ధుడైన డాక్టర్ జె. యస్. డరస్‌గారు "ప్రాక్టికల్ మెడిసిన్" అనునొక ఆంగ్లసమాచారపత్రమునందు ఒక ఆంగ్ల స్త్రీకి (24 సంవత్సరముల వయస్సునుంచి) 8 వత్సరములలో 18 రు సంతానము పుట్టినట్లు తెలిపి, దాని వివరమును ఇట్లు చెప్పుచున్నాడు.

ప్రథమ సం॥న ౧యు రెండవసం॥న ౨రును, మూడవ సం॥న ౩రును, నాల్గవసం॥న ౨రును, అయిదవ సం॥న ౩రును, ఆరవసం॥న ౨రును, ఏడవసం॥న ౩రును, ఎనిమిదవ సం॥న ౨రును సంతానము కల్గిరి.

ఒక స్త్రీ ఒకే సమయము నందు ఎంత మంది సంతానము నుత్పత్తి చేయ గలదను విషయము నందు విద్వాంసులకు మత భేదము గలదు. అయినను 6 గురు కన్న యెక్కువ సంతానము ఒకేపర్యాయము పుట్టుట యెప్పుడును వినియుండలేదు. డాక్టర్ చర్చిల్‌గారు పుట్టవచ్చునని చెప్పుచున్నారు.

డాక్టర్ క్లార్కుగారు, ఒకపర్యాయము, ప్రసవించిన 10807 స్త్రీలయొక్క సంతాన వివరమును ప్రకటించిరి. అందులో 18[illegible] స్త్రీలకు యమజ (ఒకే పర్యాయము ఇద్దరు పుట్టుట) సంతానము గలిగిరి. మిగిలినవారిలో ముగ్గురికి ముగ్గురుముగ్గురు పిల్లలును, ఒక స్త్రీకి ఒకేపర్యాయము 4 గురును గలిగిరి.

డబ్లిన్ ఆసుపత్రి యొక్క రిపోర్టును చూచిన క్రిందటివత్సరము ప్రసవించిన 1,29,172 స్త్రీలలోను 2062 కు కవలపిల్లలును, 29కు నొకేపర్యాయము ముగ్గురేసిపిల్లలును, నొక స్త్రీకి మాత్రము 4 ను జన్మించిరని విశదపడు చున్నది.

ఈవిషయమై బ్రిటన్, జర్మని, ఫ్రాన్సు దేశముల యొక్క ఒక రిపోర్టు యిట్లున్నది.

| బ్రిటీషు దేశమందు ప్రసవించిన | జర్మనీ యందు | ఫ్రాన్సు నందు |
|---|---|---|
| స్త్రీల సంఖ్య 2, 85, 219 | 4, 14, 292 | 89, 409 |
| కవలపిల్లలు 3718 | 5085 | 886 |
| ఒకేపర్యాయము ముగ్గురుపిల్లలు 43 | 49 | 6 |

పైరిపోర్టును చూచిన బ్రిటను నందు 77, జర్మనీలో 82, ఫ్రాన్సులో 108 స్త్రీలలోను కేవలము ఒకే స్త్రీ కవల పిల్లలను గనినదని విశదపడు చున్నది.

కవలపిల్లలు మామూలు పిల్లలకంటె చిన్న శరీరము గలవారు. వారతల్లియొక్క పొట్టయందు వేరువేరుగ చెట్టుయొక్క చిగురువలె నుందురు. ఒకొక్కచోట కవల పిల్లలలో ఇద్దరును పురుషులును, మరికొన్నిచోట్ల యొక స్త్రీ, యొక పురుషుడును; మరికొన్ని చోట్ల

ఇద్దరు స్త్రీలును గలిగిరి. కాని సామాన్యముగ ఆడ పిల్లలకంటె పురుషులే యెక్కువ యుత్పత్తి యగుచున్నారు.

ఈవిషయమై ముగ్గురు యూరపియన్ డాక్టర్ల యొక్క రిపోర్టులు యిట్లున్నవి.

| కవలపిల్లలు | ఇద్దరుపురుషులు | ఇద్దరుస్త్రీలు | ఒక పురుషుడు నొక స్త్రీ |
|---|---|---|---|
| 536 | 183 | 171 | 182 |
| 95 | 38 | 21 | 35 |
| 233 | 76 | 58 | 99 |

కవలపిల్లలలో మొదటిసంతానము పుట్టిన 5నిమిషములనుంచి 30 నిమిషములలో రెండవ సంతానముత్పత్తియగుచున్నది. కొంతమంది స్త్రీలకు రెండవసంతానము కొన్నిరోజుల వ్యవధిలో కలుగుచున్నది. మరికొందరకు కొన్నివారముల వ్యవధిలో ద్వితీయ సంతానముత్పత్తి యగుచున్నది. డాక్టర్ కోలిన్సు గారు యిట్లు చెప్పుచున్నారు. ఒకపర్యాయము, ప్రసవమైన 272 స్త్రీలలో, 38 గలిగిన కవల పిల్లలలో రెండవ సంతానము 5 నిమిషముల తరువాత, 29 కి 10 నిమిషములు తరువాత, 45 కి 15 ని॥, 30 కి 30 ని॥, 5 కి 45 ని॥, 16 కి యొక ఘంట తరువాత 8 కి 2 ఘంటలు, 3 కి 3 ఘంటలు, 5 కి 4 ఘంటలు, 3 కి 5 ఘం॥, 2 కి 6ఘం॥ 1 కి 7 ఘం॥, 1 కి 8 ఘం॥, 1 కి 10 ఘం॥, 1 స్త్రీకి 20 ఘంటలు తరువాతను ద్వితీయ సంతాన ముత్పత్తి యయినది.

డాక్టర్ మేరిమేన్ గారు ముగ్గురుస్త్రీల విషయములో ఆశ్చర్య కథను చెప్పుచున్నారు. ముగ్గురికిని కవలలు గలిగిరి. మొదటి స్త్రీకి 14 రోజులు, రెండవ స్త్రీకి 15 రోజుల తరువాతను రెండవపిల్ల గలిగినది. మూడవస్త్రీకి మొదటిరోజున ఇద్దరుపిల్లలును, రెండవరోజున మరియిద్దరు పిల్లలును గలిగిరి.

ఒక్కొక్క సమయము నందు అన్యోన్యము కలుసుకొనిన పిల్లలుపుట్టు చున్నారు. ఐర్లెండులో "రాయల్ కాలేజి ఆఫ్ సర్జన్సు" విద్యాలయము నందుయిట్లు పరస్పరము కలుసుకొనిన బాలకులయొక్క అస్థిపంజర మున్నది.

ఒక్కొక్క స్త్రీకి రాక్షసాకృతి గలిగి చూచుటకు మిక్కిలిభయమును గల్గించుపిల్లలు పుట్టుచున్నారు. మరికొందరకు రెండుతలలును, నాలుగు బాహువులును గలపిల్లలు పుట్టుచున్నారు. ఇంకను నానాప్రకారములైన ప్రసవ విచిత్రములను చూచుచున్నారము.

( అయ్యగారిజోగి సోమయాజిశాస్త్రి )

## స్త్రీలు— సంతాన వృద్ధి.

పీటర్సు బర్గునందలి మిసెస్ రాలిన్‌సన్, అనునామె నాలు వర్షములలో నార్గురు పుత్రులను గనెను. కానిఇదియంత గొప్పసంగతికాదు. మిసెస్ అర్మ్సవీ, అను స్త్రీ ఆరుసంవత్సరములలో 14 గురు పిల్లలను గనెను. మేడం ఫెర్నెన్ అను బెల్జియం దేశపు స్త్రీ 20 మాసములలో నార్గురు పుత్రులను గనినది. అంతకు పూర్వమే యామెకు పదిపంనెండుగురు పిల్లలుకూడ కలరు. కాని ప్యారిసు (ఫ్రాంసుదేశము ముఖ్యపట్టణము) నందలి యొక స్త్రీ యామెనుగూడ తలదన్నినది. ఈమె ఏడువత్సరములలో నిరువదియొక్క సంతానమును గనెను. ప్రతి ఒకవత్సరము ముగ్గురుబిడ్డలను గనినది. అందఱు మగబిడ్డలే. వీరెల్లరకు వివాహములైనపుడు వీరి స్త్రీలును ఒకేపర్యాయము ముగ్గురుముగ్గురు బిడ్డలను గనిరి. కంబర్ లైండునందు నొకదంపతులుగలరు. వారికి 31 సంతానము. క్లర్కన్‌వేల్ నందలి యొక సోలిసిటర్ వకు 32 రు బిడ్డలు. ఐరోపాఖండ దేశములలోకెల్ల అమెరికాయందు పెద్ద పెద్ద కుటుంబములు అధికముగా నున్నవి. కనడాపురమందలి యొక దంపతులకు 39 గురు సంతానము. జేక్సు కాకింగ్‌స్టన్ నకు ముగ్గురు చెల్లెండ్రుగలరు. వారికూతుండ్ర సంఖ్య యిప్పటికి 64.

అన్నిటికన్న నత్యద్భుతమగువిషయము, “ఇర్వుర సోదరులు వారియొక్క సోదరి” వీరిని గూర్చినది. వీరుమువ్వురు, నేటికి సజీవులై యున్నారు. పెద్దన్నగారికి 444 గురు చిన్న అన్న గారికి 402 ద్దరు, సోదరికి 130 గురు స్త్రీపురుష సంతానము గలదు.

ఇది విచారింపగా మహాభారత కాలమున నొకతల్లికి నూర్గురు పుత్రులుండిరన నతిశయోక్తియే మాత్రము కాదని తోచుచున్నది. కలియుగములో పృథ్వీభార మతిశయించునని పురాణములలో జెప్పబడియున్నది. దీనినిబట్టిచూడ, పశ్చిమఖండములయందలి స్త్రీలు, భూభార భంజనుడగు భగవంతుని శీఘ్రముగ నవతరింపజేయు బాధ్యతను వహించినట్లు తోచుచున్నది.

## బహుసంతాన నిషేధసంస్థ.

లండన్ నగరమున మేరీస్టోపన అను నామెయు నామెపతియు నత్యధిక సంతానోత్పత్తి నివారించుటకుగాను కన్స్ట్రక్టివ్ బర్త్ కంట్రోల్, (Constructive Birth Control) అను నొకసంఘమును స్థాపించిరి. ఈసంఘము సత్సంతానవృద్ధికిని, బలహీనము రోగభూయిష్టము నగు సంతాన నివారణమునకు నుపాయముల నాలోచించుచున్నది. ఈసంఘముయొక్క అధి సంచాలికయగు మేరీస్టోప్సు విజ్ఞానవతియు స్త్రీ శరీర రచనాసంబంధమగు విశేష పరిజ్ఞాన సముపార్జన మొనర్చినదియునైయున్నది. “దాంపత్యప్రేమ” మొదలగు ననేక ఉత్తమ గ్రంథములను రచించినది.

## బ్రహ్మచారి సంఘములు.

ఇప్పటికి షుమారు రెండువత్సరములనుండియు నింగ్లాండునందలి యువకులలో నొక తీవ్రమగు సంచలనము బయలుదేరినది. జనసమ్మర్ద మెక్కుడగుటచే జీవన సంరంభము తీవ్రగతిని దాల్చినది. జీవనముయొక్క మూల్యము శతగుణముగ నతిశయించినది. సామాన్యకుటుంబముల నడుపుటకును వలయు ద్రవ్య సామాగ్రి యెంతశ్రమపడినను లభించుటలేదు. శ్రమపడువారికితగినంత పనిలేదు. అందుచే కుటుంబ భారమునకు యువకులు జంకుచున్నారు. వివాహము చేసికొనినచో నొకయిల్లు అద్దెకు తీసికొనవలెను. భార్య పనిచేయగూడదు. ఒంటరిగ నున్ననే చిన్నగదియో స్వల్ప మూల్యమునకు అద్దెకు తీసికొన వచ్చును. తాను సంపాదించుకొన్నది తన పొట్టకు సరిపోవును. వివాహముకాని స్త్రీలు కంపెనీల యందును, ఫరమ్సునందును, రైల్వే టెలిగ్రాఫు ఆఫీసు లందును పనిచేయుచుందురు. వివాహితలైనచో స్త్రీలు పని మానెదరు. బ్రహ్మచారులుగ నున్న యువకులు కొందరు ఒక కొట్టయినను అద్దెకు తీసికొనరు. పది పండ్రెండుగురు కలిసి ఒక కొట్టు స్వల్ప మూల్యమునకు దీసికొని బట్టలుపెట్టెలు వగైరాలు మాత్ర మందు పెట్టుకుందురు. హోటలులో భోజనము; రీడింగ్‌రూమ్సులో (పఠనాలయములు) రాత్రి ప్రొద్దుపోవునరకు చదువుకొనుట; అచ్చట బండ్రోతులకీనాము నిచ్చుపద్ధతిమీద ఆరాత్రి యంతయు నచటే పడుకొనుట; ఇట్లు వారు జీవనము గడుపుచున్నారు. వీరిలో విద్యాధికులును ఆధ్యాత్మిక దృష్టిగలవారును, సంఘములుగగూడి యువకులను వివాహము చేసికొన వలదని ప్రబోధించుచుండిరి. బ్రహ్మచారి సంఘములను స్థాపించిరి. “ది గ్రేట్-అన్-మ్యారీడ్-” (The Great un-married) అను నొక విపుల గ్రంథమును సకల సమస్యల పరిష్కరించుచు బ్రకటించిరి. దీని పరిణామము మునుముందెట్లు గానున్నదో !

## అరబ్బుదేశము — గోవధ నిషేధము.

భారత దేశమునగోవధ కారణముననే హిందూ మహమ్మదీయ మైత్రి కుదుర కున్నది. కొందరు మహమ్మదీయులు గోవధ తమ మతధర్మమునకు నొక అంగముగా చెప్పెదరు. కాని అది సరికాదు. దీని సత్యమువారి మత గురువులకు దెలియును. మూల కారణము, హూణులుగాని, మహమ్మదీయులు గాని గో మాంసమును ఖాద్యముగనుపయోగింతురు. అమీరు (కాబూల్) గారు భారత వర్షమునకు వచ్చినపుడు

ఇచ్చటి మహమ్మదీయులను గోవధ చేయవలదని బ్రతిమాలి యుండిరి. దేవీదత్తద్వివేదిగారు మొన్న మొన్ననే ఆర్యావర్తమున నొక ప్రకటనము జేసి యుండిరి. యావత్తు అరబ్బు దేశమునను గోవధ ఏమాత్రము జరుగుటలేదని యాప్రకటన యందున్నది. అరబ్బునుండి యొక మహమ్మదీయ డాక్టరు ప్రయాగకు వచ్చియున్నాడు. అతడిట్లు చెప్పుచున్నాడు. "అచ్చట (అరబ్బులో) పూర్వమువలెకాదు. గోవధ పూర్తిగనిషేధింపబడినది. ప్రజలు గోవధ నొనర్చుటమాని వేసిరి. అచట కేవలము "బద్దూ అను నొక" జాతిమాత్రము ఘోర కృత్యములు చేయుచున్నది. కాని అది హిందూ జాతియుగాదు; ముసల్మాన్ జాతియు గాదు. వాండ్రు కులీనులగు మామహమ్మదీయులను గూడ బాధించుచుందురు. వారు గోవులనేకాదు, ఒంటెలను, గొఱ్ఱెలను, మేకలనుగూడ వధించి పచ్చి మాంసమునే తిందురు. మేము వారిని బందిపోటు గాండ్రు, లూటీదార్లు, అని వ్యవహరించుచుందుము. ఏమి? హిందూదేశమునందలి ముసల్మానులును కఠినాత్ములై గోవధ చేయుచుండిరా? మహమ్మదీయ మత గురువులు నయమున బోధించి దీనిని నివారింపవలెను. క్రౌర్యమును జూపు జాతి ఎప్పటికిని మనజాలదు. ఇందుచేతనే తురుష్కస్థానము ఖిలాఫత్తును గోల్పోయినది. క్రౌర్యమును పరిత్యజించితిరా (ముసల్మాన్;) మీదేశము నుద్ధరింప బడును." ఈ వాక్యములు ధర్మభీరువగు నొక సత్య ముసల్మానునివి. మహమ్మదీయులు సాధువృత్తి నవలంబించుటకును హిందువులు మహమ్మదీయులను మన్నించుటకును ఇర్వురును, పైయంశమును గమనింప వలసియున్నది.

* * * *

## కొన్ని గమనింప వలసిన విషయములు.

### ౧ భారత దేశమునందు:—

గోరక్షకుల సంఖ్య.

| | | |
|---|---|---|
| హిందువులు. | ... | 21, 57, 34, 586 |
| జైనులు. | ... | 1, 15, 71, 238 |
| సిక్కులు. | ... | 11, 70, 596 |
| పారసీకులు. | ... | 1, 01, 778 |

గోభక్షకుల సంఖ్య.

| | | |
|---|---|---|
| ముసల్మానులు. | ... | 6, 67, 25, 830 |
| ఈసాయీలు. | ... | 4, 75, 405 |
| యహూదీలు. | ... | 21, 77, 8 |

౨ ప్రపంచము మొత్తముమీద నివసించుచున్న జనుల సంఖ్య ౧౭౪, ౫౫, ౦౦, ౦౦౦.

3 భారత దేశమునందు భిన్న భిన్న జాతులు వ్రాయను చదువను నేర్చినవారు ఈవిధముగ నుండిరని ప్రభుత్వ నివేదికవలన దెలియుచున్నది.

సంయుక్త రాష్ట్రములలో.

| జాతి. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|
| కాయస్థులు | 523 | 90 |
| అగ్రవాలులు(వణిజులు) | 398 | 49 |
| సైయదలు | 210 | 38 |
| బ్రాహ్మణులు | 191 | 13 |
| రాజపుత్రులు | 114 | 12 |
| జాటులు | 51 | 2 |
| జులాహాలు | 30 | 3 |
| బఢయీలు | 27 | 2 |
| కుర్మిలు | 30 | 1 |
| తెలుకులవారు | 22 | 0 |
| కమ్మరులు | 20 | 1 |
| గూజరులు | 19 | 1 |
| నాయిలు | 17 | 2 |
| లోధులు | 13 | 1 |

| జాతి. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|
| ఆహారులు | 12 | 0 |
| డోములు | 12 | 0 |
| కహార్ | 17 | 1 |
| మల్లాహులు | 10 | 0 |
| గడరియాలు | 6 | 0 |
| కుంహారులు | 6 | 0 |
| భంగీలు | 5 | 0 |
| భిడ్ | 4 | 0 |
| చాకలి | 3 | 0 |
| పాసీ | 3 | 0 |
| చమార్ (పాపచ్చుల) | 2 | 0 |
| **బీహార్-ఒరిస్సా** | | |
| కాయస్థులు | 591 | 84 |
| బ్రాహ్మణులు | 303 | 19 |
| బాంభన్ (భూమిహారములు) | 222 | 20 |
| రాజపూత్ | 208 | 9 |
| ఖండైత్ | 160 | 7 |
| తెలుకుల | 93 | 2 |
| కుర్మి | 76 | 2 |
| చాసా | 75 | 2 |
| కాందూ | 55 | 1 |
| జులాహా | 50 | 7 |
| కోహరి | 50 | 1 |
| కహార్ | 43 | 0 |
| తాంతీ | 39 | 1 |
| కేవట్ | 37 | 1 |
| గౌరా | 35 | 1 |
| హజ్జామ (మంగలి) | 32 | 1 |
| కుంహార్ | 32 | 1 |
| గ్వాలా (అహార్) | 26 | 1 |
| ధానుక్ | 25 | 1 |
| సోనియా | 21 | 1 |
| చాకలి (హిందూ) | 20 | 1 |
| సంథాల్ (హిందూ) | 18 | 0 |
| దుసాథ్ | 8 | 1 |

| జాతి. | పురుషులు | స్త్రీలు. |
|---|---|---|
| చమార్ (పాపచ్చుల) | 3 | 0 |
| ముసహర్ | 3 | 0 |
| **బెంగాలు.** | | |
| వైద్య | 714 | 431 |
| బ్రాహ్మణ | 654 | 169 |
| కాయస్థ | 559 | 154 |
| స్వర్ణవణిక్ | 552 | 112 |
| తెలుకుల (తేలీ) | 352 | 29 |
| సద్గోప్ | 328 | 28 |
| జోగి | 290 | 14 |
| నాపిత్ | 245 | 16 |
| పోద్ | 232 | 7 |
| సూత్రధార్ | 195 | 12 |
| గ్వాలా (గొల్ల) | 181 | 12 |
| చాకలి (ధోబీ) | 142 | 8 |
| నమః శూద్ర | 110 | 6 |
| జులాహా | 81 | 4 |
| బాగది | 40 | 2 |
| హాడీ | 36 | 2 |
| **బొంబాయి** | | |
| బ్రాహ్మణ | 652 | 144 |
| లోహాణా | 343 | 281 |
| లింగాయత్ | 281 | 15 |
| మరటా | 58 | 8 |
| అగరీ | 41 | 3 |
| మహార్ | 28 | 1 |
| కునబీ (రైతు) | 11 | 1 |
| భిల్లు | | 0 |
| **పంజాబు** | | |
| బనియా (అగ్రవాల్) | 386 | 20 |
| ఖత్రీ | 387 | 61 |

| జాతి. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|
| ఆరోడా 3 | 294 | |
| బ్రాహ్మణ | 214 | 19 |
| సైయద్ | 172 | 16 |
| శేక్ | 141 | 24 |
| పఠాన్ | 100 | 16 |
| కశ్మీరీ | 64 | 11 |
| రాజపూత్ | 58 | 6 |
| తర్ ఖాన్ | 38 | 5 |
| కనేజ్ | 36 | 1 |
| ఆవా | 36 | 1 |
| జాట్ | 32 | 2 |
| ఆడైన్ | 28 | |
| నాయీ | 28 | 2 |
| మీరాసీ | 28 | 1 |
| లుహార్ (కమ్మరి) | 0 | 2 |
| ఝఖర్ | 22 | 8 |
| జులాహా | 22 | 1 |
| బిలోచ్ | 16 | 1 |
| తేలీ | 13 | 1 |
| మోచీ | 10 | 1 |
| కుంహార్ | 9 | 1 |
| చమార్ | 9 | 0 |
| మాఛీ | 7 | 1 |
| మూహత్ | 4 | 0 |

### మధ్య పరగణాలు.

| | | |
|---|---|---|
| వైశ్య | 480 | |
| బ్రాహ్మణ | 386 | 63 |
| రాజపూత్ | 137 | 11 |
| జలార్ | 137 | 6 |
| కుర్మి | 82 | 8 |
| కునబీ | 78 | 2 |
| మాలీ | 66 | 8 |
| లోథీ | 61 | 3 |
| తేలీ | 59 | 4 |

| జాతి. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|
| లోహార్ | 55 | 9 |
| చాకలి | 39 | 4 |
| అహిర్ | 31 | 4 |
| మహార్ | 27 | 1 |
| ఢీమర్ | 23 | 3 |
| గోండ్ | 10 | 3 |
| చమార్ | 8 | 1 |

### మద్రాసు రాజధాని.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణ | 608 | 1 |
| నాయర్ | 491 | 15 |
| కోమటి | 387 | 25 |
| బనియాలు (వర్తకులు) | 298 | 21 |
| క్షత్రియులు | 244 | 38 |
| తియాలు | 210 | 40 |
| సైయద్‌లు | 201 | 34 |
| చెట్టియారులు | 181 | 19 |

### బరోడా.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణ | 600 | 158 |
| కునబీ | 267 | 38 |
| కోలీ | 59 | 6 |

### నిజాం రాజ్యము.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణు | 437 | 68 |
| కోమటి | 270 | 10 |
| లింగాయతులు | 76 | 3 |
| శెట్టి యారులు | 70 | 13 |
| సైయద్ | 55 | 46 |
| కాయా | 47 | 2 |

### మైసూరు.

| | | |
|---|---|---|
| బ్రాహ్మణులు | 707 | 303 |

| జాతి. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|
| శెట్టి | 206 | 50 |
| లింగాయత్‌లు | 203 | 11 |

రాజపుత్ర స్థానము.

| | | |
|---|---|---|
| వైశ్య | 442 | 17 |
| బ్రాహ్మణ | 169 | 10 |
| రాజపూత్ | 52 | 9 |
| నియా | 17 | 1 |
| మాలీ | 11 | 1 |
| జాట్ | 10 | 0 |
| గూజ | 7 | 0 |
| మీనా | 6 | 0 |
| కుంహార్ | 5 | 1 |
| మేవ్ | 5 | 0 |

మధ్య భారతము.

| | | |
|---|---|---|
| వైశ్య | 333 | 19 |
| బ్రాహ్మణ | 140 | 11 |
| రాజపూత్ | 76 | 14 |
| గూజర్ | 25 | 2 |
| భీల్ (హిందూ) | 7 | 0 |
| గోండ్ | 6 | 0 |

౪ రంగూను — స్త్రీపురుష సంఖ్య.

1921 వ సంవత్సరము జనాభా లెక్కల ప్రకారము రంగూనుపట్టణపు జనసంఖ్య 341962. వీరిలో పురుషులసంఖ్య 236689; స్త్రీలసంఖ్య 105273. ఇర్వురు పురుషులకొక స్త్రీచొప్పున నుండినటుల తెలుచున్నది.

... ... ...

వలసబోయిన హిందువులయొక్కయు మహమ్మదీయులయొక్కయు స్త్రీపురుషుల సంఖ్య యీవిధముగనున్నది.

| | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| బంగాళీలు | 4304 | 1086 |
| చిటగోనియులు | 405 | 4 |
| హిందూస్థానివారు | 15795 | 1740 |
| సిఖ్కులు | 1435 | 396 |
| తమ్మిళులు | 15743 | 9175 |
| తెలుగువారు | 55704 | 8776 |
| ఇతరులు | 4788 | 1452 |

... ... ...

మహమ్మదీయులు 41132 రు పురుషులును 4275 రు స్త్రీలును గలరు.

పైవివరమును బట్టిచూడ మహమ్మదీయులలో 10 మంది పురుషులకొక స్త్రీ చొప్పునను హిందువులలో 6 గురి కొక స్త్రీ చొప్పునను, అందును ప్రత్యేకముగ జూచిన తెలుగువారిలో అర్గురకొక స్త్రీ చొప్పునను ఉండినటుల దేలుచున్నది.

... ... ...

తమ్మిళులు కుటుంబములతో వచ్చుచుండుట చేత ఇంతఅన్యాయముగ లేదనియు, ఆంధ్రు లట్లుగాక 15 లేక 20 గురు నివసించు గదులలోనే తమ యుంపుడు కత్తెలను గూడనుంచుకొను చుండుట చేత అనేకదుర్భ్యములకు చోటిచ్చు చున్నదనియు, తెలుగువారి దశశోచనీయముగ నున్నదనియు దీనికి ప్రతిక్రియ ము అవసరమనియు రంగూను నందలి తెలుగు పత్రిక వ్రాయుచున్నది.






రాజకీయరంగమునందు మార్పు లాకస్మికముగ గలుగుచుండును. ఇండియా గవర్నమెంటును నల్లకల్లోలమొనర్చిన దేశీయ మహాజనసభనిన్నటివరకుబలహీనమై పలుకుబడి_యైక్యత__వశీకరణ- జనాదరణను గోల్పోయి యుండెను. కాని నేడో యైక్యత తోడను, సర్వజనాంగీకృతమగు కార్యక్రిమమునను గూడుకొని బలయుతమై ప్రపంచమునంతను నాకర్షింప గలుగుచున్నది. కారణమేమి ? దేశీయమహాసభ యందిట్టి యపూర్వ శక్తినిబ్రసరింపజేసిన మహాపురుషుడెవ్వడు? అను విషయములు విచారణీయములు. నిర్బంధకాలము తగ్గింపబడక మహాత్ముడు కారాగృహమందే నివసింపుచుండినచో యిట్టి మహత్తర శక్తి గోచరించెడిది కాదు. మహాత్ముడు కారాగారమునుండి వెలుపలకు వచ్చి యొకింత యారోగ్యమును బడసి భారతీయులను తన కార్యక్రమముచే నాకర్షింప వలయునని దలచి దేశీయమహాజనసభను వశపరచుకొన ప్రయత్నించెను. కాని యాంగ్లవిద్యా ధురీణులగు దేశీయ నాయకులు-- ప్రముఖులు మొదలగువారి యభిప్రాయములను బాగుగ గమనించెను. వీరివలన దేశమున కెన్నటికి ముక్తికలుగదని నిశ్చయించుకొనెను. దేశీయమహాజనసభనునిజమగుదేశీయమహాజనసభగ జేయుటెట్లని యోచించెను.

అందువలననే కాంగ్రెసు ప్రముఖులెల్లరు నెలకు రెండువేల గజముల నూలువడకి పంపించవలయునని శాసించెను. దేశీయులెల్లరినొక్క విశ్వాసమున, నొక్కయడుగున, నొక్క యాదర్శమునకేసి నడిపింపగలిగిన సూత్రము ఖద్దరునందు మాత్రమేగలదని యాయన విశ్వాసము.

ఇంతలో యాంగ్లదేశమునకు బోయిన రాయబారులు తిరిగి మన దేశమునకు వచ్చిరి. వారు మన దేశమునందు వివిధకక్షలుండుట వలన నేకార్యము కొనసాగుటకు వీలులేదని చెప్పిన మీదట మహాత్మునకు సర్వజనాంగీకృతమగు నొక ప్రణాళికను ప్రచురించెను. అందుహిందూమహమ్మదీయ మైత్రియు అస్పృశ్యతా నివారణయు ఖద్దరుత్పత్తియును నవి ముఖ్యముగ జేర్కొనబడినవి. ఈ మూడింటిని గూర్చి యొకింత విచారించుట యావశ్యకము.

ఖద్దరునందున్న కొంత్త విషయమేమని స్థూలదృష్టులు శంకింప వచ్చును. ఆవిధముగ దాంగే యూమూడింటిని తృణీకరించిన వారు గూడగలరు.

మహాత్ముడు జాతీయనిర్మాణ పద్ధతుల నెరుంగని పిచ్చివాడు కాడు. మొట్ట మొదట కలకత్తా యందు దేశీయులెల్లరు వర్కు నూలుబట్టలు ధరింపవలయునని శాసించి స్వదేశీయన నాలుగుతరగతుల వస్త్రములుగ వర్గీకరించి యుండెను. పిమ్మట వాలంటీర్లందరు తప్పక ఖద్దరునే ధరింపవలయునను నియమమ్మును అహమదాబాదు వాలంటీర్ల శపథమునందు జేర్చెను. కాంగ్రెసునందు చేరిన సభ్యులెల్లరు ఖద్దరును ధరింపవలయునను నియామక మెచ్చటను కానరాదు. ఇప్పటికిని మల్లుబట్టల ధరించు మహాత్ములెందరో కాంగ్రెసు సభ్యులుగనున్నారు. సం॥కు 0—4—0 మాత్రమిచ్చి కాంగ్రెసు నిబంధనలలో మొదటిదానిని యంగీకరించినట్లు సంతకము చేయుటయే యిప్పటున్న నియమము. కాని గడచిన జూన్ మాసమునందు అహమ్మదాబాదునందు జరిగిన సభలో ఎన్నుకొన బడిన కాంగ్రెసు మెంబర్లయందొక్కొక్కడు స్వయముగ చేరాటముల మీద వడికిన నూలును ప్రతినెల రెండు వేల గజములను పంపించ వలయునని నిర్ణయించి యున్నారు.

ఇదియనేకులకు వెర్రిగ గనుపించెను. 1924 వత్సరము కాంగ్రెసు వరకును బహిష్కారములను తాత్కాలికముగ వదులుకొని కాంగ్రెస్సువారి మెడచుట్టు ఖద్దరుప్చెలను తగిలించి వానిని గట్టిగబిగించెను. ఈ సారి కమిటీలకెన్నుకొనబడిన వారు మాత్రమే కాక కాంగ్రెసుసభ్యులలో ప్రతివారును నూలువడికితీరవలయును. ఇదివరకు సంవత్సరమున కీయవలసిన 0-4-0 చందాకు బదులు 24000 గజములనూలును స్వయముగ వడికి యీయవలయును. ఇందు వలనకాంగ్రెసు కార్యక్రమము ముందుకు బోవుచున్న దందుమా? లేక వెనకకు పోవుచున్నదందుమా? ముందుకునడచుచున్నదని యొప్పు కొనక తప్పదు

పండితుని పామరుని- ధనికుని నిర్ధనుని- కూలివానిని యస్పృశ్యుని- యొక్కయాదర్శమున-నొక్క పాశమున-నీనియామము బంధించుటలేదా?

ఐక్యతకు హిందూ మహమ్మదీయ మైత్రియే ముఖ్యప్రమాణమని మహాత్ముని నమ్మకము. అది నమ్మకమేగాదు. అమోఘమైన విశ్వాసము —ధర్మసూత్రము. వివిధమతస్థుల యంతరైక్యతను స్థాపించుటయును మహత్తర ధర్మరక్షణమునకాయన అత్యంత తినవ్రతమును బూనినాడు. 18 వ శెప్టెంబరు నుండి యిరువదియొక్క దినము కేవలము వారి భక్షణతోడనే కాలము గడిపెదనను దీక్షకు గడంగినప్పుడీ క్రిందివిధముగ భారతీయులను దెలిపియుండెను. "మన దేశము నందిటీవల జరిగిన కొన్ని సంఘటనలు నాకుదుర్భరమగు మహోవేదనను గలిగించినవి. నాకుగలిగిన నిరాశయంతకంటెను దుర్భరతమమైనది. మనము నివారింపజాలని యిట్టి ఘోరకృత్యములు జరిగినపుడు ఉపవసించి పరమేశ్వరుని గూర్చి ప్రార్థింపవలయునని నాధర్మము నాకుబోధింపుచున్నది. నాకత్యంతప్రియమైన వారివిషయములో గూడ నేనిట్లు చరించియుంటిని.

నాయుపదేశములు వ్రాతలుహిందూమహమ్మదీయ సంఘముల యందైకమత్యమును గలిగింప జాలకున్నవి. కావున నేనీదినము మొదలిరువదియొక్క దినములు నిరశనవ్రతమును బూనుచున్నాను. ఈ వ్రతము 8 అక్టోబరుతోడ బూర్తియగును. లవణముతోనైనను లేకనైనను యించుక జలమును స్వీకరించుటకు స్వాతంత్ర్యమును మాత్రముగలిగియున్నాను. ఈ వ్రతము నాకొక పక్షమున తపస్సు. మరియొకపక్షమున బ్రార్థన యైయున్నది. తపస్సే యయినచో దానిని నేనులోకులకు దెలుపవలసిన యావశ్యకతయే లేదు. కాని యీవిషయమును బ్రచురించుటకు కారణమేమన యింతవరకు కలసిమెలసి పనిచేసిన హిందూమహమ్మదీయు లొండొరుల యాత్మహత్యగావించుకొన రాదని ప్రార్థింపగలనని నాయాశయము. ఈపోరాటము మతమునకు మానుషత్వమునకును అవమాన కరముగనున్నది. ఇట్టిపోరాటమును తుదముట్టింపవలయునని యాంగ్ల సంఘముతోగూడ హిందూదేశ మందలి యున్ని సంఘముల నాయకులను సమావేశము గావలయునని సాదరముగ నాహ్వానింపుచున్నాను. సింహాసనము నుండి భగవంతుడే నేడు పదచ్యుతుడాయనా యని తోచుచున్నది. మనహృదయసింహాసనమునందాయనను తిరిగి ప్రతిష్ఠించు కొందుముగాత.''

''ఇట్టి ఘోరదీక్ష కీయనయేల గడంగవలయును? నాయకులతో సంప్రదించకనే నిరశనవ్రతమునకేల యుపక్రమింపవలయును? వెంటనే పరిత్యజింపవలయును. ఇట్టి వ్రతముల వలన కార్యసాఫల్యమగునా?" అని పలువురుపలు విధములుగ నుడువసాగిరి. విమర్శింప దొడగిరి. ఇది యన్యుల సంప్రదింపు మీద నిర్వర్తింప దగిన కార్యము గాదు. ఆయన యాత్మబలము- చిత్తశుద్ధి- మనోనిశ్చయముల మీద నీవ్రత మాధారపడియున్నది. అందువలన నాయన యాధ్యాత్మిక శక్తి సామాన్యులకు గోచరమగునది కాదు. కావుననే చాలమంది యవ్యక్త ప్రసంగముల గావించుచున్నారు. సత్యాగ్రహ మననేమియో మన మెరుంగని దినములున్నవి. అసహాయోద్యమమనుపేరు నే యెరుంగని కాలము కలదు. అటులనే నిరశనవ్రతమననేమియో యెరుంగని సమయమిది. కొలది కాలములోనే సత్యాగ్రహామె నిరశనవ్రతమనిమనము గ్రహింప గలము. బుద్ధభగవానుడు, ఏసుక్రీస్తు మొదలగు మహాపురుషులు సర్వసౌఖ్యముల వదలి భార్యాపుత్రుల విడనాడి యరణ్యములకేగి ఘోరతప మాచరించి తత్త్వోపలబ్ధినిబొంది ధర్మమును బ్రవర్తిల్లజేసిన విషయములు సర్వజన విదితములేగదా?

మహాత్ముడు ఈ యుగసంధియం దవతరించి భారతవర్షమందలి సమస్త వైషమ్యములు, అసూయలు మొదలగు వానిని నిర్మూలించి సమస్తమానవుల నైక్యతాపాశమున బంధించి వైచుచున్నాడు.

మహాత్ముడు దేశీయమహాజన సభకధ్యక్షుడుగనెన్నుకొనబడెను. అందులకుమహాత్ముడంగీకరించెను. కానియిది మహాత్ముడు దేశమునకు చేసినదానికి పారితోషకమా? లేకయింకను చేయనున్న సేవ కవకాశమా? అను విషయమును గూర్చి యోచింప

వలయును. కాలాతీతమగుట వలననిదివరకు చేసినసేవకు ప్రతిఫల మనుటకు వీలులేదు. ముందు చేయబోవు సేవకే గౌరవము గలిగించుట యాచారముకాదు. ఇట్టి విచారణ మహాత్ముని సంబంధమున యోచించుటకు వలనుపడదు. భవిష్యద్భారత వర్షమునకు బునాదుల వేయుచున్న నూతన యుగప్రవర్తకుడు మహాత్ముడు. ఏనిముసమున కానిముసము భారతీయుల దృక్పథమును స్ఫుటము- స్ఫుటతరముగ నొనర్చు చున్నాడు. త్యాగము నకువశముగాని దేదియు లేదనియాయనవిశ్వాసము. బాధల ననుభవించుట వలన నే నితరులకు సన్మార్గ చింతను గలిగించి గమ్యస్థానమునకు జేర్పించ గలనని యాయన నమ్మకము. అందువలన మహాత్ముడు తాను దేశీయ మహాజనసభ కధ్యక్షుడనని దెలిపిన వెంటనే దేశీయ జయమునకు మూలాధారమగు సూత్రములను సూచింప బూనినాడు. హిందూ మహమ్మదీయుల కైకమత్యము గుదిరిన యెడల స్వరాజ్యము నార్జించుకొనుట కెట్టి యాటంకము లుండవు. కాని హిందూమహమ్మదీయ సమ్మేళనమను నది కేవలము తర్కవితర్కముల వలనసిద్ధింప జాలదని మహాత్ముడు గ్రహించెను. ఆమైక్యమత్యసిద్ధికే నిరశనవ్రతమును బూనినాడు. ఇపుడు ఢిల్లీయందు సమావేశమైన సభ వాగాడంబరముల కాలము గడుపుటకు వీలు లేదు. అనావశ్యకమగు ప్రతిమాటయు మహాత్ముని ప్రాణమునుదీయు నొకబాణముగ నెంచతగి యున్నది. ఒకప్రక్కను మహాత్ముడు మృత్యుగహ్వరమున బడనుండ, రెండవవైపున ఢిల్లీపురమున సమావేశమైన మహానీయులు పరిశుద్ధ హృదయముల న్యాయబుద్ధిని మెలంగక తప్పదు. ఇందు వలనమహాత్ముని సంకల్పమీడేరుననుట నిక్కువము!



# తప్పక చదివి.చూడుడు!! చాలముఖ్యము !! జరూరు!!


















భారతదేశమందు ప్రసిద్ధిగాంచి తెలిసినదే చెప్పనక్కరలేదు. దూర దేశము లందున్న వారికి యిది మిక్కిలి ఉపయోగము. వారు వేళ్ళ, కుతకు, నగ నెంబరులను తెలిపిన కావలసినవారికి సక్రాం

ముగ వారుండుచోటికిచేరును క్యాటలాగు పట్టుబడి ధర 1-6-0 లయినను 1-0-0 యికే ఇవ్వబడును. కావలసిన వారు ఈవిలాసమునకు వ్రాయ వలెను.

ఊమ్మిడి రామయ్యసెట్టి, గురుస్వామిసెట్టి, నగలవర్తకులు; 25 చైనాబజారుగోడౌను, మదారాసు.

వైద్యరత్న
పండిత డి. గోపాలచార్లుగారు

# ఆయుర్వేదాశ్రమము

4-, ఆచారప్పన్‌వీధి, జార్జిటవున్, మదరాసు.
సకలవిధరోగములకు సుప్రసిద్ధములగు
శాస్త్రీయాయుర్వేదౌషధములకు ఖని

## జీవామృతము

అన్నివిధములగు బలహీనములను పోగొట్టును. వ్యాధులను రాకుండ జేయును. రక్తవృద్ధిజేసి, బలమునిచ్చి, నిస్త్రాణ పోగొట్టి శరీరమును గాపాడును. సీసా రు. 6—4—0

## అమృతామలకతైలము

విద్యార్థులకును, యోచనాపరులకును చాల యుపయోగకారి, శిరో రోగములను, కండ్ల వ్యాధులను పోగొట్టి, కండ్లకు చలువనిచ్చి, మెదడును, వెండ్రుకలను, మొత్తముమీద శరీరమును గాపాడును. 6 అవున్సు సీసా రు. 1-0-0

## ప్లేగు మందులు

లోకప్రసిద్ధములైనవి. దేశ దేశములందును విరివిగ ఉపయోగింపబడుచు శ్లాఘింపబడుచున్నవి.

జ్వరమునకు పానకముగడ్డలకు ఘృతము (కలసిన) పెద్దసెట్టు రు. 2-2-0 చిన్నసెట్టు రు. 1-6-0

## కలరామందులు

వాంతిభేది వ్యాధికి విక్రయింపబడు మందులలో కెల్ల శ్రేష్ఠమైనదని ఖ్యాతి గాంచినది.

6 అవున్సుల ద్రావకము, 12 మాత్రలును గలసిన ఒకసెట్టు రు. 1—2—0.

అన్నిటికి ప్యాకింగు పోస్టేజి ఖర్చులు ప్రత్యేకము.

ఇంకను అనేక దివ్యౌషధములు మాయొద్ద సిద్ధముగ గలవు. వ్యాధి వివరములు వ్రాయుడు, మా క్యాటలాగునకు వ్రాయుడు.

# కుసుమరోగనివారణి

ఈఅవుషధము కుసుమరోగంబులుగల స్త్రీలు 15 దినంబులు సేవించిన స్త్రీలు ఋతుకాలమునకు బహిష్టుకాకుండుట, తరుచు బహిష్టగుట ఋతుకాలమందేగాక తరుచు తెలుపు, యెరుపు పసుపు రంగుగా బట్టలగుచుండుట, కాళ్లు, చేతులు, నడుము లాగుచుండుట, నిస్సత్తువ, శరీరము శుష్కించుట, ఆకలి మందగించుట, అధికనిద్ర సంతానహీనత మొదలగు కుసుమరోగ దుర్గుణములన్నియు నివారణయి సంతానవతులయ్యెదరు. అవుషధముగ సేవించినమూడు ప్రూటలలో గుణము తెలియగలదు, అవుషధము యొక్క ఘనతకుమెచ్చి కొందరు యోగ్యతా పత్రములనుగూడ యిచ్చియున్నారు.. కఠినపథ్యమేమియులేదు. వి. పి. ఖర్చులు వేరు.

15 దినములకు సరిపడుమందు.

వెల డబ్బా 1కి రు. 5—0—0.

## ఋతుశూలసంహారిణి

ఈ మందు బహిష్టయినప్పుడు వచ్చే కడుపునొప్పి వ్యాధిగల స్త్రీలు వారం దినములు సేవించిన అమోఘముగా పనిచేయును. అవుషధము సేవించిన 24 గంటలలో గుణము తెలియగలదు. ఇదివరకు అనేక డబ్బాలు ఖర్చుఅయినవి. ఖర్చు అగుచున్నవి. పెక్కుమాటలేల? ఒక డబ్బా తెప్పించి వాడి చూడుడు. వి. పి. ఖర్చులువేరు. వారం దినములకు సరిపడుమందు వెల. డబ్బా 1 కి రు. 2—8—0

షరా:— అవుషధములు కావలసినవారు రోగ వివరము వయస్సు, వ్యాధి ఎంతకాలమునుండి వున్నది. వివరముగా తెలుపుడు.

ప్రొప్రయిటర్సు, పి. యస్. రెడ్డి అండుకో.
శ్రీరామ విలాస ఫార్మసీ, రావులపాడు.
కొత్తపేట పోస్టు, గోదావరి జిల్లా.


లోధ
స్త్రీలకు కొంగు
బంగారువంటిది.
గర్భాశయరోగ నివారిణి.
12 ఔ రు 3-0-0 లు 6 ఔ 1-10-0 లు
కేసరికుటీరం, ఆయుర్వేదౌషధశాల
ఎగ్మూరు, మద్రాసు





# సచిత్ర మాసపత్రిక.

సం|| చం 6-0-0 . వి పి. ఖర్చులు వేరు. అ|| సం|| సం|| 3-4

ప్రతి ఆంగ్లమాసము చివర వారము ప్రకటింపబడును.


## —సూచనలు.—

ఇందలి విలేఖకుల యభిప్రాయములకు సంపాదకుఁడు ఉత్తరవాదికాఁడు.

కథల లోని పాత్రములు కల్పితములు. ఎవరినుద్దేశించి వ్రాయఁబడినవి కావు.

వ్యాసములు, కథలు, పద్యములు, పటములు మొదలగునవి సంపాదకుని పేర పంపవలెను. ప్రకటింపబడని వ్యాసములు అణాచీటి పంపిన పంపబడును.

విలేఖకులు కాగితమున కొకప్రక్కనే స్ఫుటాక్షరముల వ్యాసములు వ్రాయ ప్రార్థితులు. ఏ మాసములో పడవలసిన వ్యాసములా మాసము 1, 2 తారీఖుల లోపల మాకు చేరవలెను.

## —చందాదారులకు—

తమ చిరునామా మారినపుడు చందాదారులు తప్పక మాకు తెలుపవలెను. ఈ విషయమున నశ్రద్ధ చేసిన సంచికలు తిరిగి పంపబడవు.

నియమితకాలమునకు తరువాత 15 రోజులలో పత్రిక చేరనియెడల చందాదారులు మాకు రిపోర్టు చేయవలయును. ఆలస్యముగ రిపోర్టు చేసినయెడల చేరని సంచికలు పంపవు. చందాదారులు మాకు వ్రాయునపుడు తమ చందాదారునెంబరు వ్రాయుచుండవలెను.

## —కావలెను.—

(1) భంగిమముల చిత్రములు (poses) ఆంధ్ర నటకుల అభినయ కళాకౌశలమును తెలుపు చిత్రపటములు మా పత్రికలో ప్రకటించుటకు కావలెను. ఛాయాపటములు పంపువారు విశేషాంశములను వ్రాయవలెను.

(2) ప్రాచ్య చిత్రకళకు సంబంధించి ప్రాచీనులచే లిఖింపబడిన చిత్రములు, నవి పంపవీలు లేనిచో వాని ఛాయా పటములుగాని విశేషాంశములతో పాటు కావలెను.

(3) కావ్యజగత్తునందలి ప్రాక్తన భారత సభ్యతను సమాలోచించు విమర్శనా వ్యాసములు కావలయును.

(4) ప్రహసనములు, ఏకాంక నాటకములు చిన్ని చిన్ని కథలు, కావలయును.

(5) ఆంధ్రదేశమునందలి రమ్యదృశ్యములు వాని అభివర్ణనములు కావలెను.

కృతజ్ఞతతో స్వీకరించి ప్రకటించెదము. ఏ కారణముచేగాని ప్రకటింపబడకున్న నవి తిరిగి పంపివేయబడును.

మానేజరు "శారద"

వైద్యరత్న
పండిత డి. గోపాలచార్లుగారి

## ఆయుర్వేదాశ్రమము

4-, ఆచారప్పన్‌వీధి, జార్జిటౌన్, మదరాసు.
సకలవిధరోగములకును సుప్రసిద్ధములగు
శాస్త్రీయాయుర్వేదౌషధములకు ఖని

## జీవామృతము

అన్నివిధములగు బలహీనతలను పోగొట్టును వ్యాధులను రాకుండజేయును. రక్తవృద్ధిజేసి బలమునిచ్చి, నిస్త్రాణను పోగొట్టి, శరీరమును గాపాడును. సీసా రు. 6—4—0

## అమృతామలకతైలము

విద్యార్థులకును, యోచనాపరులకును చాల యుపయోగకారి, శిరో రోగములను, కండ్ల వ్యాధులను పోగొట్టి, కండ్లకు వలువనిచ్చి, మెదడును, వెంట్రుకలను, మొత్తముమీద శరీరమును గాపాడును. 6 ఔన్సు సీసా రు. 1-0-0

## వేగుమందులు

లోకప్రసిద్ధములైనవి. దేశదేశములందును విరివిగ ఉపయోగింపబడుచు శ్లాఘింపబడుచున్నవి.

జ్వరమునకు పాచకముగడ్డలకు ఘృతము (కలసిన) పెద్దసెట్టు రు. 2-2-0 చిన్నసెట్టు రు. 1-6-0

## కలరామందులు

వాంతిభేద వ్యాధికి ప్రకటింపబడు మందులలో కెల్ల శ్రేష్ఠమైనవని ఖ్యాతి గాంచినది.

6 ఔన్సుల ద్రావకము, 12 మాత్రలును గలసిన ఒకసెట్టు రు. 1—2—0.

అన్నిటికి ప్యాకింగు పోస్టేజి ఖర్చులు ప్రత్యేకము.

ఇంకను అనేక దివ్యౌషధములు మాయొద్ద సిద్ధముగ గలవు. వ్యాధి వివరములు వ్రాయుడు,

## కుసుమరోగనివారణి

ఈఔషధము కుసుమరోగంబులుగల స్త్రీలు 15 దినంబులు సేవించిన స్త్రీలు ఋతుకాలము నకు బహిష్టుకాకుండుట, తరుచు బహిష్టగుట ఋతుకాలముందేగాక తరుచు తెలుపు, ఎరుపు పసుపు రంగుగా బట్టలగుచుండుట, కాళ్లు, చేతులు, నడుము లాగుచుండుట, నిస్సత్తువ, శరీరము శుష్కించుట, ఆకలి మందగించుట, అధికనిద్ర సంతానహీనత మొదలగు కుసుమ రోగ దుర్గుణములన్నియు నివారణయి సంతానవతులయ్యెదరు. ఔషధము సేవించినమూడు పూటలలో గుణము తెలియగలదు, ఔషధము యొక్క ఘనతకుమెచ్చి కొందరు యోగ్యతా పత్రములనుగూడ యిచ్చియున్నారు.. కఠినపథ్యమేమియులేదు. వి. పి. ఖర్చులు వేరు.

15 దినములకు సరిపడుమందు.

వెల డబ్బా 1కి రు. 5—0—0.

## ఋతుశూలసంహారిణి

ఈ మందు బహిష్టయినప్పుడు వచ్చే కడుపు నొప్పి వ్యాధిగల స్త్రీలు వారం దినములు సేవించిన అమోఘముగా పనిచేయును. ఔషధము సేవించిన 24 గంటలలో గుణము తెలియగలదు. ఇదివరకు అనేక డబ్బాలు ఖర్చులైనవి. ఖర్చు అగుచున్నవి. పెక్కుమాటలేల? ఒక డబ్బా తెప్పించి నాడి చూడుడు. వి. పి. ఖర్చులువేరు. వారం దినములకు సరిపడుమందు వెల. డబ్బా 1కి రు. 2—8—0

మ. రా:— ఔషధములు కావలసినవారు రోగ వివరము వయస్సు, వ్యాధి ఎంతకాలమునుండి వున్నది. వివరముగా తెలుపుడు.

ప్రొప్రయిటర్సు, పి. యస్. రెడ్డి అండుకో.
శ్రీరామ విలాస ఫార్మసీ, రాపులపాడు.

బంగారు వెండినగలు, పాత్రలను కోరువారు.

# తప్పక చదివి చూడుడు!! చాలముఖ్యము!! జరూరు!!

నెం (8)







మా స్నే
హితులు, మాతో
లావాదేవి 10 సంవత్సర
ములనుండి చేయుచున్నవారికి
అతిదూర ప్రదేశములందున్న వా
రికి బంగారు, వెండినగలు, ఇతరసా
మానులు, రాళ్ళనగలు, బహుమ
తులు పతకములు వివిధగిన్నెలు ఇనామ
కప్పులు మొదలగువానిని ఎన్నిమో
స్తరు లున్నవో అన్నిటిని పూర్తిగ
92 పటములతో 172 పుటలు
కలిగినక్యాటలాగు వారికోరిక మే
రకు 1/8 డబిల్ క్రౌను సైజులో
ముద్రింపబడినది. ఇట్టిది త్రిభా
షలలో ఆంధ్ర, ద్రవిడ, ఆం
గ్లభాషలలో ఇన్నిపట
ములను చేర్చి









భారతదేశమునందు ముద్రింపబడ
లేదనియే చెప్పవచ్చును. దూర
దేశము లందున్న వారికి ఇది
మిక్కిలి ఉపయోగము. వారు
పుటం, పటము, నగ నెంబరును
తెలిపిన కావలసిన వారికి సకాల

మున వారుండుచోటికిచేర్చును.
క్యాటలాగు కట్టబడి ధర
1-6-0 లయినను 1-0-0
యిక్కే ఇవ్వబడును. కావలసిన
వారు ఈవిలాసమునకు వ్రాయ
వలెను.

# విషయసూచిక



## త్రివర్ణచిత్రపటములు



1. జీవనభారము.
2. బుద్ధుడు—జర.



జ్యేష్ఠము, ౧ క్రాంతి.

౨ వ,వత్సరము } మచిలీపట్టణము, జూన్, ౧౯౨౪. { సంపుటము ౧ సంఖ్య ౪

# ప్రత్తి-వర్తకము

ప్రపంచము నందంతటను మొత్తము మీద నైరోపా మహా యుద్ధమునకుఁ బూర్వము 95, 500, 000 బేళ్ల ప్రత్తియుత్పత్తి యయినటుల నంచనా వేయఁబడినది. అందు 3/5 వ వంతు, అనగా 150, 000, 00 బేళ్ల ప్రత్తి నొక్క యమెరికా సంయుక్త రాష్ట్రములే తయారుచేయుచున్నవి. ప్రపంచము మొత్తముమీద ప్రత్తి యుత్పత్తిలో 3/5 వ వంతు నమెరికా దేశము యొక్క దియే యగుట నాదేశము ప్రపంచమునందలి సకలవర్తక స్థానముల యందును ప్రత్తియొక్క మూల్యమును నిర్ణయించుట యందు నధికార గౌరవమును వహించి యున్నది. మహా సంగ్రామ మారంభమైన పిమ్మట మూడు వత్సరములలో, ననగా సం॥ 1917 లో 13½ మిలియనుల బేళ్లును, సం॥ 1918 లో 125, 00, 000 బేళ్లును, సం॥ 1919 లో 11½ మిలియనుల బేళ్లును సం॥ 1921 లో 80, 00, 000 బేళ్లును మాత్రమే ప్రత్తి నమెరికాదేశము పండించినది. పైవివరణను బట్టి క్రమముగా నమెరికా యందు ప్రత్తిపంట క్షీణించు చున్నదని తెలియు చున్నది. కాని 1922 వ సంవత్సర

మున ప్రత్తియొక్క యుత్పత్తి యీదేశమందు 12 మిలియనుల బేళ్లవఱకు హెచ్చెను. పై తగ్గుదలకు గారణము లేకపోలేదు. ఈ ప్రత్తిపంటను ప్రదేశముల యందొక విధమగు పురుగు ప్రవేశించి పంటను పాడుచేసినది. రసాయన శాస్త్రపరిజ్ఞాతలెందరో యీయరిష్టమును నివారింప ననేక ప్రయత్నము లొనర్చియుఁ గృతకృత్యులు గాజాలకుండిరి. ఆకీటకమును నిర్మూలించుట నసాధ్య మయ్యెరి.

ఉపర్యుక్త కారణముల వలన గడచిన యయిదు వత్సరములలోను నమెరికా దేశమునకు 500 000 000 పౌనుల యపారద్రవ్య నష్టము కలిగెను. యూరపుదేశమున కెగుమతి చేయుటకు ప్రత్తి యుత్పత్తికై ప్రత్యేకింపబడిన విస్తార భూభాగము నాశనమైనది. ఇంగ్లాండులో నున్న 580, 00, 000 కదుళ్లలోను 420, 000, 00 కదుళ్లు ప్రత్తికొఱకై యొక యమెరికాదేశము మీాదనే యాధారపడియున్నవి. కాని యమెరికాలో, నుత్పత్తి క్షీణించుటవలన ప్రత్తియొక్క ధర 150 రెట్లు పెరిగిపోయినది. 'పెరూ' 'బ్రెజలు' లయందు ప్రత్తిపండునుగాని యది యతిస్వల్పము. ఈజిప్టునందు కూడ పంట తగ్గిపోయినది. దానికితోడు జాతీయత యీదేశమందు విశేషవ్యాపకమును జెందుటయు లాంకషైరు నకు ప్రత్తినంపుట యీజిప్టు మానుకొనెను. ఈ కారణములచే బ్రిటిషు సామ్రాజ్యమునకు స్వయముగ ప్రత్తి పండించుకొనుట ముఖ్యావసరమయ్యెను.

ప్రత్తి బ్రిటనులో కేవల పరిశ్రమాలయములందును, శ్రమజీవి సంఘముల యందును మాత్రమేగాక ప్రభుత్వకోశ పరిస్థత్యాలోచనయందును ప్రాముఖ్యత వహించిన దయ్యెను. లాంకషయిరులో తయారు కాబడు నూలుగాని దూదిగాని విశేషభాగ మితర దేశములకే యెగుమతి యగుచున్నది. ప్రపంచములోని 2/3 వ వంతు దూదిని యింగ్లాండు తనయొక్క పరిశ్రమలకొఱకే వినియోగ మొనర్చుకొను చుండెడిది. "యీ సర్వప్రపంచమును వస్త్రములచే మేము కప్పి వైచెద" మని గతశతాబ్ద మధ్యమువఱకును లాంకషయిరు జనులు గర్వోక్తుల నాడెడివారు. అప్పుడు మార్కెట్టులో, ప్రత్తియొక యధికార స్థానమును వహించియుండెను.

అమెరికాదేశము దూదిని తయారొనర్చుటయు నింగ్లాండు దాని గొనసరకుల సమకూర్చుటయు జరుగుచుండెడివి. కాని కొంతకాలము నుండియు నింగ్లాండు కొన్ని కష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. యూరపునందును నమెరికా దేశమునందును ప్రత్తి పరిశ్రమ వలనను నమితలాభము గలుగునని గ్రహించి యా యాదేశముల యందు ప్రభుత్వమువారు మిల్లులను స్థాపించి విస్తారముగా దూదిని, దూది సరకులను తయారుజేయ మొదలిడిరి. ఇట్టి పరిస్థితులలో నమెరికా మీాదనే ప్రత్తికొఱకాధారపడి యుండుట లాంకషయిరునకు నష్టదాయకము. పైలయన నమెరికాయందు రానురాను ప్రత్తిపంట క్షీణించినదని యీావరలో నివేదించి యుంటిమి గదా! అందున నిప్పుడమెరికా స్వయముగ ప్రత్తి-పరిశ్రమల నభివృద్ధిపరచుకొను చున్నది; అచ్చటిపంట యచ్చటకే సరిపోవని స్థితియు వచ్చుచున్నది. పంట తక్కువగుటచే దూదిధర మఱింత హెచ్చిపోయెను.

లాంకషయరు ఘోర సమస్యల నెదుర్కొనవలసి వచ్చినది. కూలివాండ్రకు పని లేదు. పనిలేకపోవుటచేత తిండికి నలయు ధనలబ్ధియైన లేక మలమల మాడజొచ్చిరి. యుద్ధమునకు వెనుకటి పరిస్థితులే యిప్పుడున్న యెడల దూదిధర యింతింత పెరిగిపోయెడిదే. కాని ముఖ్యపారిశ్రామిక దేశములయందలి యార్థిక స్థితులు తారుమారగుటచేతసరకులు సేయుటకు జాలినంత దూదియే లభింప కుండెను.

1922 వ సంవత్సరమునందు జర్మనీ 1300000 బేళ్ళ దూదిని, జపాను 7,50000 బేళ్ళ దూదిని కొనెను. కాని 1923 వ సంవత్సరమునందు జర్మనీ 800000 బేళ్లను, జపాను 550000 బేళ్లను మాత్రమేకొనెను. 1922 వ సంవత్సరము అగష్టు నెల మొదలుకొని 1923 సంవత్సరము మేనెలాఖరు వరకు గడచిన పదిమాసములలో అమెరికాలో పండిన 5,660.969 బేళ్ల దూదియే కాక, యీజిప్టునుండి ఆ దేశములోనికి దిగుమతి చేయబడిన 449.070 బేళ్లదూదికూడ అమెరికా పరిశ్రమలయందుపయోగింపబడెను. ఇంతియేగాక అమెరికానుండి యూరపున కెగుమతియగు దూదిలో ఒకమిలియను బేళ్లుతగ్గి యితర దేశములనుండి దిగుమతియగు బేళ్లలో నొకమిలియను బేళ్లవరకు హెచ్చెను. అమెరికా "న్యూఇంగ్లాండు" నందు చాల పెద్దవి యగు దూదిమిల్లులను స్థాపించెను. దూది యచ్చటిదేయగుట సరుకులు తయారగుటలో వారికి విశేషవ్యయము కాదు.

జపానుదేశమున ముప్పదియేండ్ల వ్యవధిలో దూది దిగుమతులు నూరురెట్లకన్న నధికముగ హెచ్చిపోయెను. 1891 వ సంవత్సరమున జపానులో దిగుమతికాబడిన దూది ధర 6,998,534 యెన్నులు * 1920 లో నది 741, 800, 623 యెన్నులవరకు హెచ్చిపోయినది. అమెరికానుండి వచ్చుదూది శ్రేష్ఠమయినది. పేలికలు పొడవుగ నుండును. ఇదిగాక పేలికలు తునుకలు తునుకలుగను పొట్టివిగ నున్నను కూడ చైనా హిందూదేశముల నుండె దూదిని జపాను దిగుమతి జేసికొనినది.

1913 వ సంవత్సరమున ననగా యుద్ధమునకు పూర్వము జపానునందు 24, 14, 000 ల కదుళ్లును, చైనాలో 1480,000 కదుళ్లును పనిచేయుచుండెడివి. 1922 వ సం॥ నందు జపానులో 4,267,000 కదుళ్లును, చైనాలో 2,344,000 కదుళ్లును పనిచేసెను. అమెరికా, యిండియా, చైనా, జపానుదేశములలో పరిశ్రమలు వృద్ధియగుటవలన లాంకషైరున కపారనష్టము వాటిల్లెనని వేరుగ జెప్పనక్కరలేదు.

బ్రిటీషువారి సాంవత్సరిక నివేదికను బట్టి 1921 సం॥ రమున దూది యీక్రింది విధమున పండినట్లు తెలియుచున్నది.

| హిందూదేశము. | | | బేళ్లు (400పౌనులుబేలుకి) |
|---|---|---|---|
| బొంబాయి | ... | ... | 969,000 |
| పంజాబు | ... | ... | 588,000 |
| మధ్య పరగణాలు, బీరారు | | ... | 514,000 |
| మద్రాసు | ... | ... | 358,000 |
| సంయుక్త రాష్ట్రములు | | ... | 337,000 |
| బర్మా | ... | ... | 42,000 |
| బెంగాలు | ... | ... | 21,000 |

* యెన్ను (yen) ఇదిజపాను నందు చలామణిలో నున్నయొక నాణ్య విశేషము. ఒకయెన్ను రూపాయి పదియణాలగును.

| | | | |
|---|---|---|---|
| బీహారు, ఒరిస్సా | ... | ... | 15,000 |
| అస్సాము | ... | ... | 15,000 |
| సంస్థానములు, ఇతర రాజధానులు | | | 742,000 |
| | | | 3,601,000 |

ఇతర దేశములు.

| | | | |
|---|---|---|---|
| ఉగెండా | ... | ... | 31,300 |
| సుడాన్ | ... | ... | 27,700 |
| దక్షిణ నైగేరియా | ... | .. | 19,500 |
| ఉత్తర నైగేరియా | ... | ... | 12,000 |
| మెంగిన్యారా సరిహద్దులు | | ... | 7,500 |
| వెస్టిండీసు | ... | ... | 4,500 |
| న్యాసిల్యాండ్, రొడీషియా | | ... | 4,600 |
| దక్షిణాఫ్రికా | ... | ... | 2,500 |
| కెన్యా | ... | ... | 500 |
| ఇతరభాగములు | ... | ... | 500 |
| | | | 165,100 |

బ్రిటీషు సామ్రాజ్యము నందు ప్రత్తి విస్తారముగా పండు దేశము హిందూ దేశము. ఇది ప్రపంచములో ద్వితీయ స్థానమును సామ్రాజ్యములో ప్రథమ స్థానమును నాక్రమించుచున్నది. ప్రత్తి నింకను విస్తారముగా పండించుటకు పెక్కు సౌకర్యములు గలవు. వ్యవసాయాభివృద్ధిజేసి పలురకముల ప్రత్తి గింజలను నాటి నీటి వసతి గలుగజేసిన యెడల ఇండియాలో ప్రత్తి యెక్కువగ పండుట కవకాశము గలదు. నేటి లెక్కలనుబట్టి ఇండియాలో యెకరమునకు 85 పౌనులును అమెరికా యందు 200 పౌనులును ఈజిప్టునందు 400 పౌనులును ప్రత్తి పండుచున్నదని తెలుచున్నది. మరియు హిందూ దేశము నందలి ప్రత్తి దూదిగా వచ్చునప్పటికే 10 పౌనుల వరకు తరుగుదల కాన్పించును. అనగ యెకరమునకు 76 పౌనులు మాత్రమే నికరముగా నిల్చును. ఇంత తక్కువ పంటకు కారణమేమి? భూమి ఫలవంత మైనది కాకపోవుట చేతనా? కాదు. కృషి పురాతన పద్ధతుల మీద సాగివలయును.

హిందూ దేశమునందు సం॥ కు 5000000 బేళ్లదూది యుత్పన్నమగును. ఇందులో బ్రిటను దేశము 2,15,000 బేళ్లదూదిని కొని యందు తిరిగి కొంత యమ్మివేయును. లాంకషైరు మిల్లులకు పొడుగుపోగు పేలికలుగల దూది యవసరము కావున పట్టివిత్తులను నాటి వృద్ధి పరచుటకు 1788 సం॥ నుండియు ప్రయత్నములోనర్చబడి కొంతవరకు సఫలతనొందినవి. హిందూ దేశమునందలి మిల్లులకు గూడనిట్టి దూదియే యవసరము. కావున ననేక స్థలములలో పట్టి విత్తులను నాటుచున్నారు. కాని యింక పదేండ్ల వరకు తగినంత దూదిని హిందూ దేశము తయారుసేయ జాలదు. ప్రస్తుతము హిందూ దేశము నందలి దూది యూరపునకును జపానునకు నెగుమతి చేయబడుచున్నది. బొంబాయి మార్కెట్టులో పేలిక 3/4 అంగుళము పొడవున్న యెడల నా దూది యమూల్యముగనే గణింపబడుచున్నది.

1922-23 సం॥ లో ప్రపంచము నందలి ప్రత్తి పండు ముఖ్య ప్రదేశములలో పంట యీ క్రింది విధమున నున్నది

| ప్రదేశము | | | పంట. |
|---|---|---|---|
| ఇండియా | ... | ... | 4,799,000 |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | | ... | 12,455000 |
| ఈజిప్టు | ... | ... | 991,000 |
| చైనా | ... | ... | 1,800,000 |
| రష్యా | ... | ... | 800,000 |

సింధు పాంచాలముల యందు ప్రత్తి వ్యవసాయము నీటిసప్లై వలన జరుగుచుండును. ఇతర ప్రదేశముల యందీ పంట వర్షముల మీద నాధారపడియున్నది. మొత్తము మీద ప్రతివత్సరము నీదేశములో 80 మిలియనులు విలువగల ప్రత్తి పండుచున్నది. ఇందులో మన పరిశ్రమలకు గాను 7,50000 * బేళ్ళు ప్రత్తియుపయోగింప బడుచున్నది. రాటనుమీద తయారగుచున్న నూలెంతయుండునో సరిగా యింకను తెలియుదు. ఖద్దరుయొక్క వ్యాప్తి యతితీవ్రముగానున్న యీరోజులలో నయ్యది కనీసము 100,000 బేళ్ళయిన నుండగలదు. ఇక మిగిలిన 40,00000 బేళ్ళదూదియు నితర దేశముల కెగుమతి యగుచున్నది.

ప్రత్తి గింజలు తీయుట బేళ్లుచేయుట మొదలగు పనులు యంత్ర సహాయమున చేయబడు చుండును. హిందూదేశ వర్తకులకును యూరపు దేశ వర్తకులకును స్వంత యంత్ర సామగ్రికలదు. యంత్రములు లేనిచోట్ల కమిషను మీద గింజలను దీయించి బేళ్లను చేయుచుందురు.

హిందూదేశము నందుత్పత్తి యగు దూది యంతయు బొంబాయి మార్కెట్టునకు బోవును. ఈ దూదియంతయు "కొలాబాగ్రీను" అనుచోట కొట్లలో నుంచబడు చుండెడిది. కాని యచ్చట తగినంత స్థలము లేక దూది బేళ్లనారుబైట బడవేయు చుండెడివారు. అందువలన సాధారణముగా నగ్నిప్రమాదముల వలన కొన్నివేల బేళ్లు తగులబడి యపారనష్టము కలుగజొచ్చెను. ఇప్పుడు బొంబాయి గవర్నమెంటువారు బొంబాయికి నాలుగు మైళ్లదూరమున నున్న "సివ్రె" వద్ద పెద్దపెద్ద కొట్లను కట్టించిరి. ఆకొట్లు ఎన్నిలక్షల బేళ్లనయినాభరింపగలవి. ఆకొట్లవద్దకు ప్రత్యేకముగ వర్తకుల కొఱకై రైళ్లు ట్రాములు మొదలగు యానసౌకర్యములును చేయబడినవి.

ఇచ్చటనే దూది సంబంధమగు సకల వ్యవహారములను నడపుట కేర్పడిన ఒక అధికార సభయొక్క కార్యాలయమును గలదు. ఈసభకనుమతి లేకపోయిన యెవరును ఇష్టమువచ్చినట్లు జరుపుటకిప్పుడు వీలులేదు. ఈ వర్తకములో బొంబాయి అహమదాబాదులకు తీవ్రములగు పోటీలు జరుగుచుండెను. బొంబాయి యొక్క ప్రాధాన్యమును తొలిగింప నెన్నియో ప్రయత్నములు చేయబడినవి. కాని లాభము లేకపోయినది. బొంబాయియే యిప్పటికిని మార్కెట్టున మూల్యనిర్ణయాధికారమును వహించియున్నది.

ఇంక బెంగాలులో చిట్టగాంగు, బంకూర మిడ్నపూరు ప్రాంతముల యందును అస్సాములో గారొ, లూషై ప్రాంతముల యందును ప్రత్తిపండు చున్నది. ఇచ్చట తయారగు దూదిని కామిల్లా దూది యందురు.

గుజరాత్, మధ్యరాష్ట్రములు, బీరారు, చెన్నరాజధాని, యీ భాగముల యందు ప్రత్తికృషి జాగరూకతతో నూతన పద్ధతుల మీద విశేషముగా పండింప బడుచున్నది.

అమెరికా, క్వీన్సులెండు, ఆస్ట్రేలియా మొదలగు దేశములు ముఖ్యముగా నీవ్యవ

* బేలు 1కి 19400 పౌనుల తూకము.

సాయమును వృద్ధిజేసికొను చున్నవి. విశేష ధనమును వ్యవసాయమునకుగాను వెచ్చింపు చున్నవి. హిందూదేశమున నట్లుకాదు. ఈపరిశ్రమ కొరకతిస్వల్పముగ ధనము వినియోగింప పడుచున్నది.

హిందు దేశమున నింకను కలకత్తా, ఇంటోరు, అమరావతి, బికనీరు, పదేశము లలో దూదిమార్కెట్టులు గొప్పవియే కలవు.

ఇండియా గవర్నమెంటు వారిప్పు డిప్పుడు మనదేశములో ప్రత్తిపండించు విష యమున శ్రద్ధదీసికొనుచున్నారు. "సుకూరు బరేజి ప్రాజెక్టు (Sukkur Barrage Project) గవర్నమెంటువారి అంగీకారమును బడసినది. పని ప్రారంభింప బడినది. పూర్తియగు నప్పటికి 12 పండ్లుపట్టును. 12 కోట్ల రూపాయలు వ్యయమగును. 80 లక్షలయెకరముల భూమిని ఈప్రాజెక్టుసాగు చేయగల్గును. బ్రిటీషువర్తకులు, మంత్రులు, మిల్లులయజమానులు నెల్లరు మేలిరకపుదూది కొఱకమెరికామీాద నాధారపడియుండ నవసరములేకుండ నట్టిదూదినే ఇండియాలో తయారొనర్ప యత్నించినేటికి ఈప్రాజెక్టు మూలమున కృతకృత్యులైరనియే భావింపవచ్చును. నేటిదూది ధరలుకూడ యీవ్యవసాయాభివృద్ధికి కారణ మనుకొన వచ్చును. ప్రభుత్వమువారి యీశ్రద్ధయంతయు లాంకషైరు వర్తకుల నిమిత్తమేమో ననియు నూహింపవచ్చును.

---

# ప్రకృతి

(పెనుమర్తి వేంకటరత్నము గారు)

అరుణరాగము నొరసి కొనుచును
సరసి జాప్తుం డుదయశైలాం
తరమునం దెసకమ్ము నెసెఁగఁగ
నరుగఁ బిలిచెదవు!

పూవుఁ దీవలతావి పొలయఁగ
మావిగున్నల మవ్వములయఁగ
శ్రీవసంతోదయపు భాగ్యముఁ
జేరఁ బాడెదవు!

చిఱుతరంగల నొరసి కొనుసురు
చిరతటాక తటంబులందున
మురుపుఁ గొలిపే పిల్లగాడ్పులఁ
బరుగులాడెదవు!

లేఁతవెన్నెలఁ బూఁతఁ బూసుక
వాతవిస్పృతి సౌరభంబుల
శ్రీతలిర్పనిశాలతాంగికి
గీతిఁ బాడెదవు?

కవి కుమారులు భావగీతా
రవళిలోమగ్నమ్ము నందుచు
భువిమరచి తన్మయతఁ జెందఁగ
బొంగిపోయెదవు!

జనులు నిద్రాసక్తులగుచును
దనులమఱచి సుషుప్తిఁ జెందఁగ
లాలితములగు వేణురవముల
జోలఁ బాడెదవు!

సముద్రగుప్తు డాంధ్ర దేశముపై దండయాత్ర సలిపి యుండెనా ?

# ఆంధ్ర దేశమును జయించి యుండెనా?

[ నడింపల్లి జగన్నాథరావు పంతులుగారు.]



పల్లవరాజు లీ యాంధ్రదేశమును పరిపాలన సల్పు కాలమున అనఁగా క్రీస్తుశకము నాలవ శతాబ్ద మధ్యమున పాటలీ పుత్రమును పరిపాలన చేయు చుండిన గుప్త వంశీకుఁడు సముద్ర గుప్తు డీ యాంధ్రదేశముపై దండు వెడలి జయించి నటుల విన్సెంటు స్మిత్తు, డాక్టరు ప్లీటు మొదలగు చరిత్రకారులభిప్రాయముల వెలిబుచ్చియుండిరి. సముద్రగుప్తుని దండయాత్రా విధానమును అలహాబాదు కోటలో నొక స్తంభముమీద నున్న శాసనము దెలుపు చున్నది. * సముద్రగుప్తు డీయాంధ్రదేశమును గూడ జయించి నటుల పూర్వచరిత్రకారులు కొందరు చెప్పియుండుటచే నాతని దండయాత్రా విధానమును గూర్చి విశదముగ తెలిసికొనుట ప్రతి యాంధ్రుని కావశ్యకమని తలంచెద.

సముద్ర గుప్తుఁడు ప్రథమమున దక్షిణకోసలముపై దండెత్తి యాదేశమును బరిపాలించెడి మహేంద్రుని జయించి ప్రస్తుతపు ఒరిస్సా (Orissa) మధ్య రాష్ట్రముల (Central Provinces) భాగములు జేరియున్న మహాకాంతార రాజులను జయించెననియు అందుముఖ్యుఁడు వ్యాఘ్రరాజనియును, అటనుండి దక్షిణముగ తూర్పు సముద్రతీరమున కళింగరాష్ట్రపు పూర్వపు రాజధాని నగరమగు పిష్టపురమును పాలించెడి రాజును, గంజాము మండలములోని మహేంద్రగిరి కోటను కొత్తూరు కోటలను బరిపాలించెడి రాజులను, కొల్లేరు సరస్సు తీరముననున్న మంతరాజును, దాని నానుకొని కృష్ణా గోదావరుల మధ్య నున్న వేంగిని పరిపాలించెడు రాజును, మద్రాసునకు నైఋతిమూలనున్న కాంచీపురమును పరిపాలించుచుండెడు "విష్ణుగోపుని" జయించి అటనుండి వెడలి పశ్చిమముగా "పాలక్కను" పాలించు ఉగ్రసేనుని జయించి యటనుండి వెడలి దక్షిణాపథను పశ్చిమ భాగముగా మార్గ మధ్యమున దేవరాష్ట్రమును ఈ రండపల్లెను జయించి తన రాజధానీ నగరమునకు చేరియుండి నటుల విన్సెంటు స్మిత్తుగారు హిందూ దేశ పూర్వ చరిత్ర యందు చెప్పి యున్నారు.‡ అందు వేంగిని పరిపాలించు రాజు పల్లవ వంశీకుఁడుగ నూహించుచుండినటులను, కాంచీపురిని పరిపాలించుచున్న విష్ణుగోపుఁడు పల్ల

‡ see Early History of India by mr V. A. Smith Pages 283 — 284

ప్రడయినటులను చెప్పియున్నారు. దేవరాష్ట్రమన ప్రస్తుతపు మహారాష్ట్ర దేశమయినటులను యెరండపల్లి ఖాండేష్ అయినటులను పాలక్కడను నెల్లూరు జిల్లాలో నుండినటులను కూడ చెప్పియున్నారు.

ఈ సముద్ర గుప్తుని అలహాబాదు శాసనమున చెప్పబడిన కౌరాల శబ్దము కైరళ శబ్దమునకు మారు పొరపాటున వ్రాయబడియుండుననియు కైరళమే కేరళ దేశమునకు పేరై యుండుననియు దీనిని బట్టి సముద్రగుప్తుడు దక్షిణమున కైరళదేశము పర్యంతము దండ యాత్ర సలిపి కేరళమును కూడ జయించి యుండు ననియు ఫ్లీటు దొరగారభిప్రాయ పడి యుండిరి.* కేరళమనునది చేరరాజ్యమునకు పేరు. ఆ శాసనమున చెప్పబడిన కొత్తూరమనునది కోయంబత్తూరు మండలములోని పొల్లాచికిని పాలక్కడయనునది పాలఘాటునకును ముడిపెట్టి పైయభిప్రాయమును బలపరచి యుండి నటుల గాన్పించు చున్నది.†

పాలక్కడ యనునది నెల్లూరుమండలములో నున్నటుల స్మిత్తుగారు చెప్పియున్నారు. మఱియు పల్లవుల శాసనములందయ్యది కృష్ణానదికి దక్షిణమున నున్నటుల జెప్పబడియున్నది. పల్లవరాజ కుటుంబములలో నొకశాఖవారు పాలక్కడ యందు పరిపాలన సలుపు చుండినటుల వారిశాసనములే తెలుపు చున్నవి. ఆశాసనములలో నుదహరింపబడిన గ్రామములనుబట్టి యయ్యది ప్రస్తుతపు నెల్లూరు మండలములో వాయవ్య భాగమున నుండినటుల యూహింప దగియున్నది గాని పాలఘాట్టు అని చెప్పుట కెంత మాత్రము వలనుపడదు. ప్రస్తుతపు గంజాము మండలములో కొత్తూరుగలదు. ఆశాసనమున చెప్పబడిన కొత్తూరనునది ప్రస్తుతపు గంజాము మండలములోని కొత్తూరేగాని కోయంబత్తూరు జిల్లాలోని పొల్లాచియును కాదు.

అయిహొలి శాసనమున‡ చెప్పబడిన కూనాల తీర్థము, అలహాబాదు శాసనమున చెప్పబడిన కౌరాలమేనని కీల్హారన్ గారు నుడివియుండిరి. బహుశః దీని నంగీకరించియే కాబోలును చరిత్ర కారులందరును సముద్ర గుప్తుడు కొల్లేరు సరస్సు ప్రాంతమున బరిపాలించెడు రాజును జయించినటుల జెప్పి యుండురని తోచుచున్నది. కౌరాలమును కూనాల తీర్థమును ఒక్కటియే నని చెప్పుటకు కారణము లెవ్వియో కీల్హారనుగారు తెలియజేసిన వారు కారు. కౌరాలమును, కూనాలతీర్థమును ఒక్కటియే యయ్యుండునని సమర్థింప చెద మనినను కారణము లేమియు గాన్పించవు. కౌరాలమే కూనాల తీర్థమని యొప్పుకొనినను కూనాల తీర్థమునకును కొల్లేరు సరస్సునకును సామ్యమేమి? అయ్యదియే కొల్లేరు సరస్సుఅని చెప్పుటకును కారణములు గాన్పించవు. ఈ శాసనమున చెప్పబడిన కౌరాలమును గోరాలముగ జదువ వలయుననియు అయ్యది కోరాళ రాష్ట్రముగ జెప్ప వలయునేగాని కొల్లేరు సరస్సును గూర్చి సముద్ర గుప్తుని అలహాబాదు శాసన

*See Gupta's Inscriptions by Dr. Fleet page 7. Foot note 1.
† See I. R. A. S. 1897 page 29.
‡ E. p. Ind Vol. VI. No. 1 Page 3

మున చెప్పఁబడి యుండలేదనియును స్వామినాథ దీక్షితుల వారు చెప్పి యున్నారు.* ప్రస్తుతపు బొంబాయి రాజధానిలోని ఖాండేష్ జిల్లాలోనున్న యీ రండోలను నదియే సముద్రగుప్తుని శాసనమున నుదాహరింపఁ బడిన యీ రండపల్లియని ఫ్లీటు దొర వారు చెప్పి యున్నారు.† రెంటి నామము లొక్కటిగ గాన్పించుటచే ఖాండేశులోని యీ రండోలని చెప్పుటకు కారణములను చెప్పియుండిరి. దీని నంగీకరించియే కాబోలును తక్కిన చరిత్ర కారులును సముద్ర గుప్తుడు కాంచీ పురమునకు వెళ్ళి అటనుండి తన రాజధానికి తిరిగి బొంబాయి ప్రాంత మార్గమున వెళ్ళియుండెనటుల జెప్పుచు అలహాబాదు శాసనమున చెప్పఁ బడిన దేవరాష్ట్ర మనునది మహారాష్ట్ర దేశమని చెప్పియుండె నటుల గన్పించుచున్నది.

అలహాబాదు శాసనమున చెప్పబడిన దేవరాష్ట్రము మహారాష్ట్ర దేశమని చెప్పుట రంతమాత్రమును వలను పడదు. అటుల చెప్పుటకు నాధారములును గాన్పించవు. దేవరాష్ట్ర మనునదియే మహారాష్ట్ర దేశమని చెప్పు వారందులకు కారణముల జెప్పిన వారుకారు. అలహాబాదు శాసనమున చెప్ప బడిన దేవరాష్ట్రమును ప్రస్తుతపు విశాఖ పట్టణము మండలములోని భాగ మయ్యుండెను. గాని మహారాష్ట్ర దేశముకాదు. ఫ్లీటు స్మిత్తు దొరగార్లు చెప్పినటుల యీరండపల్లి ఖాండేషులోని యీ రండోలనునది కాదు. దేవరాష్ట్రము, మహారాష్ట్ర దేశముకాదు. వారి యభిప్రాయము సరికాదని స్పష్టముగ జెప్పవలసి వచ్చుచున్నది.

అలహాబాదుశాసనములో చెప్పబడిన 'పిష్ఠపురక మహేంద్రగిరి కౌత్తూరక స్వామిదత్త'' యను వాక్యమును బట్టిచూచిన "పిష్ఠపురి మహేంద్రుడును, గిరికౌత్తూరక స్వామి దత్తుడును" అనియే జెప్ప నొప్పుచున్నది. గానివేరు విధముగ జెప్పవీలు లేదు. అనగాపిష్ఠపురము నందలి మహేంద్రుఁడనియు, గిరికొత్తూరు నందలిస్వామిదత్తుడనియు జెప్పదగియున్నది. గిరికౌత్తూరన కొండకొత్తూరు అనగా కొత్తూరు కొండపైని కోటయని స్ఫురించు చున్నది. అయ్యది ప్రస్తుతపు గంజాముమండలములోని కొత్తూరను నదియెగాని మఱియొకటికాదు. ఈకొత్తూరునకొండపైన కోట యున్నది. ఈశాసనమున ఈరండపల్లె యనునది కొత్తూరుగిరి కొత్తూరునుచెప్పిన వెంటనేచెప్పబడియున్నది. ఆవరుసను బట్టిచూచిన యీరండపల్లియు దానికి దాపుననే తూర్పుసముద్ర తీరమున నున్నదనియె స్ఫురించును. మఱియు దేవేంద్ర వర్మచే బ్రకటింప బడిన సిద్ధాంతముశాసనమునుబట్టి గంజాము జిల్లాలోనొక యీరండపల్లి యుండినటుల స్పష్టముగ గాన్పించుచున్నది. సిద్ధాంతము శాసనమున యీరండపల్లి వాస్తవ్యునికి దానముచేయఁ బడినటుల జెప్పఁ బడి యున్నది. ఈయీరండపల్లి గంజాము మండలములోని శ్రీకాకుళము ప్రాంతమున నుండినటుల గాన్పించుచున్నది. కాన సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున

* See Ancient History of Deccan by Swaminatha Dikshitiar page 59.

† See J. R. A. S. 1898 Page. 369.

‡ See Ep ind Vol Xi Page 112

జెప్పబడిన యీారండపల్లియును, దేవేంద్రవర్మ సిద్ధాంతము శాసనమున చెప్పబడిన యీారండ పల్లియునొక్కటియేయని చెప్పనొప్పుచున్నది.

దేవరాష్ట్రమనునది విశాఖ పట్టణము మండలములోని దైనటుల విశాఖపట్టణము మండలములోని కసింకోట యందు గాన్పించిన శాసనమును బట్టి తెలియ చున్నది.‡ ఇయ్యది పూర్వచాళుక్య భీమవిష్ణువర్ధనునిచే బ్రకటింపబడినదై యున్నది. అందు దేవరాష్ట్రములోని భాగమగు యలమంచికళింగ దేశములోని గ్రామమునొకదానిని దానము చేసినటుల జెప్పబడియున్నది. యలమంచి కళింగ దేశమనగా యలమంచి రాజధానిగ గలకళింగ దేశభాగమని జెప్పనొప్పును. ఈ యలమంచియనునది ప్రస్తుతపు విశాఖ పట్టణము మండలములోని సర్వసిద్ధితాలూకాలోని యలమంచిలి యనుపట్టణముయ్యున్నది. వీనినిబట్టిచూడ సముద్రగుప్తుని అలహాబాదు శాసనములోను దహరించ బడిన యీారండ పల్లి గంజాము మండలము నందలి యీారండ పల్లియనియు, దేవరాష్ట్రము విశాఖపట్టణము మండలములోని దేవరాష్ట్రమనియు తేలుచున్నది. అయ్యవిబొంబాయి రాష్ట్రములో జేరినఖాందేషు జిల్లాలోని యీారండోలును, మహారాష్ట్ర దేశమును కావనియును, సముద్రగుప్తుడు దక్షిణాపథము నందలి పశ్చిమ భాగమున నగా బొంబాయిప్రాంత మార్గమున తిరిగి రాజ ధానికి వెళ్లి యుండ లేదనియు జెప్పుటకేమియు సందేహము గాన్పించదు. ప్లీటు దొరవారు చెప్పినటుల కేరళము పాలాచి, పాలఘాట్టు,మహేంద్రగిరి, కొల్లేరు సరస్సు, ఖాండేషులోని యీారండోలు, మహారాష్ట్రదేశములను గూర్చిఅలహాబాదు శాసనములో బ్రశంసచేయబడియుండ లేదనియును, ఆశాసనమున చెప్పబడిన ప్రదేశములన్నియు దక్షిణా పథములోని తూర్పు సముద్రతీర ప్రాంతప్రదేశము లేననియును నిస్సంశయముగ జెప్పనొప్పుచున్నది.

ఇక సముద్రగుప్తుడెంతవఱకు దండయాత్ర సలిపి యుండెనో యీా విషయమును దెలిసికొనుట యావశ్యకము గాకపోదు. సముద్రగుప్తుడు దండ యాత్ర సల్పిన కాలమున యీాదేశమును కాంచీపురమును రాజధానిగ జేసుకొని విష్ణుగోపుడు పరిపాలించు చుండెను. ఆతని సామ్రాజ్యమున కళింగ దేశ భాగము జేరియుండెను. సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండు వెడలి దక్షిణకోసలము మహా కాంతారముల మీాదుగ విష్ణుగోపుని సామ్రాజ్యము లోని కొత్తూరు పిష్టపురము వఱకు వచ్చుసరికి చక్రవర్తియగు విష్ణుగోపునకు తెలిసి తన సామంతరాజులను దక్షిణా పథమునందలి యితర రాజులను గూర్చుకొని యుద్ధసన్నద్ధుడై సముద్రగుప్తుని దార్కొని ఆతని నోడించి వెనుకకు దరిమివేయ తిరిగిపారిపోవు పట్ల దేవరాష్ట్రము యీారండ పల్లెమీాదుగా తన రాజధానికి చేరినటుల గనుబడుచున్నది. దేవరాష్ట్రమును యీారండ పల్లియును తూర్పుసముద్ర తీరమున విశాఖ పట్టణము గంజాము జిల్లాలలో నుండుటచేతను తిరిగి రాజధానికి పోవుపట్ల ప్రథమమున దేవరాష్ట్రమును (విశాఖపట్టణము జిల్లాలోనున్నది.)

‡ See Report on Epigraply Go. No. 538, public 28, July 1909, part II para 59, page 102; Inscripition No14.

పిమ్మట యీరండపల్లి (గంజాము జిల్లాలో నున్నది.) యును జెప్పబడి యుండుటచేతను గోదావరి జిల్లాలో నున్న పిష్ఠపురమునుండి వెనుకకు తిరిగి పోవు నెడల ప్రథమమున విశాఖ పట్టణము మండలమును పిమ్మట గంజాము మండలమును దాటిపోవలసి యుండుట చేతను సముద్రగుప్తుడు పిష్ఠపురమును దాటి యీవలకు వచ్చినటుల గాన్పించదు. సముద్రగుప్తుని శాసనమున అవముక్తాధిపుడైన నీలరాజును వేంగిరాజగు హస్తివర్మయును పాలక్కరాజగు నుగ్రసేనుడును దేవరాష్ట్ర ప్రభువగు కుబేరుడును కోసలపురాధిపతి యగు ధనంజయుడును బేర్కొనబడి యున్నారు. ఈశాసనమున దక్షిణాపథమున నున్న రాజులందరిని బేర్కొనుచు వారల నందరిని సముద్రగుప్తుడు చెరగొని తిరిగి విడచి పెట్టినటుల జెప్పబడి యున్నది. ఉత్తరహిందూస్థానమున బెక్కు విజయముల గాంచి ప్రఖ్యాతి వడసిన సముద్రగుప్తుడు దక్షిణాపథముపై దండువెడలి దక్షిణాపథమున నోటువడియెననిన యపఖ్యాతిగ నుండు ననియెంచి దక్షిణాపథమున గూడ జయము గాంచినటుల డంబములు గొట్టుకొనుచు వ్రాయించుకొనిన వ్రాత లయ్యుండునే కాని వేరు కాదు. తాను చెప్పుకొను నటుల విజయమునే గాంచియుండిన నీదక్షిణాపథమునం దెచ్చటనైనను విజయ చిహ్నములు గాన్పించు లాగున నట్టి శాసన స్తంభముల నాటించక యుండునా? అట్టి దృష్టాంతరము లెచ్చటను గాన్పింపవు. ఇయ్యదియు సముద్రగుప్తు డీదేశమునకు వచ్చియుండలేదనియు నీదేశమును జయించి యుండలేదనియు జెప్పుటను బలపరచుచున్నది. ఒకవేళ ప్రప్రథమమున తానుగాంచిన స్వల్ప విజయములలో నొకరిద్దరిని చెరగొని యుండినను విష్ణుగోపునితో బోరి యపజయమొంది తానదివరలో జయించిన దేశమును సయితము వదలితిరిగి చూడకుండగ తనరాజధానికి పారిపోవుటలో వారిని విడచి వెళ్ళియుండియు దానినే గోరంతలు కొండంతలుగ జేసి అతిశయోక్తిగ శాసనమున బ్రచురించి యుండిన బ్రచురించి యుండవచ్చుననియు తోచుచున్నది. కావున సముద్రగుప్తు డీయాంధ్రదేశమునకు వచ్చియుండలేదనియు ఆంధ్రదేశమును జయించి యుండలేదనియు స్పష్టముగ జెప్పనొప్పుచున్నది.



# ఎఱుకలవారు.

(తిమ్మరాజు లక్ష్మీనారాయణగారు.)



వీరొకవిధమైన కొండ జాతివారు. అనాగరికులు. అనుదినము 'సోదమ్మసోదో' యని యఱచుచు వీధులవెంట తిరుగువారును ప్రతిదినము 'పచ్చపొడిపించుకోరమ్మ పచ్చో', యని కేకలిడుచు గ్రామగ్రామము పల్లెపల్లె దిరుగువారును అనేకవిధ సర్పముల బుట్టలలో నుంచుకొని నెత్తినిడికొని యిల్లిల్లు తిరిగి నాగస్వరము పాడుచు తిరిపెమెత్తెడు భిక్షాటకులును, యీచెఱువు ప్రాంతముల ఆచెఱువుప్రాంతముల గుడిసెలవేసికొని 'కుంచెలగట్టు' వారమని చెప్పుకొనుచు కుంచెలగట్టి జీవనము చేయువారును యెఱుకలవాండ్రే. ఇక్కాలమందు వీరలలో వృత్తిభేదములంబట్టి యనేక తెగలు కాన్పించుచున్నను వీరినామముంబట్టి చూడ ఈజాతియంతయు నొకానొకప్పుడు వారు వీరిని వివక్షత లేక సోదిచెప్పుటయే పరమావధిగా నున్నవారని స్పష్టపడుచున్నది. వీరలలో యీ వృత్తి యిపుడు చాలభాగము నశించినది. సరియైన సోది చెప్పువారే కనబడరు. వీరుసత్యమున కరణ్యవాస్తవ్యులే యైయున్నను నేడెల్లెడల గాన్పించుచున్నారు. దేశభాషంబట్టి వీరికి కొన్ని తావులందు కొరిచలనియు, కొన్ని ప్రదేశములయందు కొరవలనియు కొన్ని తావులందు కైకేతీలనియు కొన్ని ప్రదేశములందుమృకండులనియు, పర్యాయనామంబులు కలవు. అనాదియందు యుద్ధాదులందు గూఢ చారులుగనుండి ప్రజలకెంతయో నుపకారులుగనుండిన వీరలు, దేశదేశము, పట్నపట్నము, పల్లెపల్లెదిరిగి ఉప్పు, కరివేపాకు లోను గాగల ముఖ్య తినుబండముల బ్రజలకు సరపరాజేసి యెన్నికగాంచిన వీరలు, నేడధోగతి పాలయి తినుటకు తిండిలేక కట్టుటకు గుడ్డలేక మలమలమాడుచు దిగంబరులై చోరవృత్తి భిక్షాటనవృత్తి నవలంబించుచు యెందుకు కొఱగానివారలయి ప్రజలకు భీకరాకారులై సంచరించుచున్నారు. మనుస్మృతి యెఱుకల నొకబాహ్యజాతిగా పరిగణించుచున్నది.

వీరలలో యీక్రింది తెగలు కలవు.

1. కావడి లేక ఉప్పుయెఱుకలు
2. పరికి యెఱుకలు
3. తట యెఱుకలు
4. సానె యెఱుకలు
5. వడ్డెఱుకలు
6. కుంచెఱుకలు
7. కరివేపాకెఱుకలు
8. కావలెఱుకలు
9. పాములవాండ్రు
10. భజంత్రీ యెఱుకలు
11. అడవి యెఱుకలు

12. జాతిపల్లె యెఱుకలు.

13. పూనాయకుట్టి యెఱుకలు.

11, 12, జాతులు రిటైర్డు పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు గారగు శ్రీమాదిరెడ్డి పాపారావునాయుడుగారి గ్రంథములయందును, 13 వ జాతి శ్రీములాలి ధోరవారి గ్రంథముల యందును మాత్రమే కన బడుచున్నవి. కాని యీజాతు లనవసరము లని నాయభిప్రాయము. ఎఱుకల వారందఱు వనవాసులేకాన ప్రత్యేకపు అడవియెఱుకలని నొకతెగ చూపుట యనవసరము. జాతిపల్లె యెఱుకలన్నను పరికెయెఱుకలన్నను నొక్కటియే. పూనాయకుట్టి యెఱుకలన పిల్లుల జంపువారు. ఈ ఘాతుకకృత్యము సాధారణముగా కుంచెఱుకలు చేయుదురు. కాన వీఱినొక తెగగా చూపుట యనవసరము. ఇక యొక్కొక్క తెగను గుఱించి సావధానముగ ప్రత్యేకంబుగ విచారింతము.

కావడి లేక ఉప్పుయెఱుకలు.

ఇనుపదారులు వృద్ధిలోకి రాకమున్ను వీరు ప్రజల కెంతయో నుపకారులుగా నుండెడివారు. హైదరాలీ టిప్పు సుల్తానుల కాలములయందు రణరంగమందు వీరు గూఢచారులుగను యుద్ధసామగ్రిల మోయుట యందును దేశముల గొల్లకొట్టుట యందును నెంతయో నుపయోగపడు చుండెడివారు. ఎడ్లను గాడిదలను పెంచి వాని సహాయ్యమున యుప్పు లోనుగా గల యపరద్రవ్యముల సముద్ర ప్రాంతములనుండి కొనివచ్చి ప్రజలకు విక్రయించి క్షామబాధానివారణ మొనర్చెడివారు. ఇనుపదారులు వచ్చినపిమ్మట వారి వృత్తులకు తావులేకపోయెను. వాని విడనాడి అన్నముకు నీరముకు కఱువు వాచి భార్యాబిడ్డలతోను బంధువర్గముతోను దేశాటనము చేయుచు కుక్షింభరింపు కొనుటకు చ్యార్యాద్యనేక దుర్వృత్తుల నవలంబింప వలసి వచ్చెను.

పరికె యెఱుకలు

వీరలనే మనము పరికె ముగ్గులవారనియు, సోదెచెప్పు వారనియు దబ్బె యెఱుకలనియు పచ్చకుట్టు యెఱుకలనియు బిలుచుచుందుము— వీండ్ల జన్మస్థానము తిరుచినాపల్లి జిల్లాలో కులూతలై తాలూకా తోగమలైవద్ద నున్న యూదియపట్టిగ్రామమనియు యనంతరమచటనుండి బయలుదేరి పాల్ఘాటు తాలూకా యందును పునుచ్చేరీ గ్రామమందును వాసమేర్పఱుచుకుని గుంపులుగుంపులుగా వసియించుచున్నారని ములాలీ ధోరవారు వ్రాయుచున్నారు.

తట్టయెఱుకలు

వీరలను అనుదినము మనము చూచుచునేయున్నాము— ప్రతి గ్రామమందును గ్రామబాహ్యమందు వసించుచు యీతచువ్వలవగయిగాలతో తట్టలు బుట్టలులోనుగా గలవి యల్లిగ్రామగ్రామముదిరిగి పైకమునకో బియ్యమునకో వడ్లకో పిడికెటి యన్నముకో యమ్మి జీవనము చేయుచుందురు.

సాని యెఱుకలు

మాదిగలు మాలలు తురకలు చెంచులు యానాదులలోవలె వీరలలో కూడ భోగమువాండ్రు కలరు. అందునిమిత్తమై

పిల్లలుగూడ విక్రయింతురు. వీండ్లనే మాదిరెడ్డి పాపారావునాయుడుగారు వారి గ్రంథమందు కోతి మెుకలని పేర్కొని యున్నారు. ఈ నామము వీరు భిక్షాటనము చేయుచు కోతినొకదాని వెంటనిడికొని బిచ్చమెత్తుచుండుట కాన కలిగెను.

వడ్డెమెుకలు

వీండ్లు రస్తాలుబాగుచేయుటయందును రాండ్లు మోయుట యందును రాండ్లు చెక్కి శుభ్రముచేయుట యందును నిపుణులు. ఈజాతి యీప్రాంతములలో కానవచ్చుట లేదు.

కుంచెమెుకలు

వీండ్ల నెఱుంగనివారు లేరు. గ్రామ గ్రామముతిరిగి గ్రామబాహ్యమందు గుడిసెలు వేసికొని ప్రజలకు కుంచలుగట్టి యిచ్చియు బట్టలనేతగాండ్రకు నేతబిళ్ళల తయారుచేసి యిచ్చియు చేపలపట్టు వాండ్లకు వలల నల్లి యిచ్చియు జీవనము చేయు చుందురు.

కరివేపాకుమెుకలు

వీరికిని కావడి లేక ఉప్పు యెఱుకల కును భేదములేదు. కాని వీరి వృత్తికరివే పాకు విక్రయము.

కావలియెఱుకలు

ఈ జాతి గ్రామ కావలి కాయును. ఈయాచారము యుత్తరహిందూస్థానమందు విశేషముగా ప్రబలియున్నది. నేటికీ యా చారము మన వరకు కూడవ్యాపించియున్నది. ఉత్తర సర్కారుల యందును తదితరస్థల ములందును వీండ్లను గ్రామకావలివాండ్లనుగా నే డేర్పఱుచుచున్నారు. కాని వీరి కావలి యంత విశ్వసనీయము కాదు. యీనాది కావలి గుఱించి వ్రాసినయంశములే వీరికిని చెల్లును.

పాములవాండ్రు.

పాములను బుట్టలలో పెట్టుకునివచ్చి నాగస్వరము పాడి వానియాడించి యిల్లిల్లు తిరిగి తిరిపమెత్తుచుందురు.

భజంత్రీయెఱుకలు.

వీండ్లు వాద్యగాండ్రు. వివాహాది శుభకార్యములయందు వాద్యముల ప్రయోగించి ధనార్జన కావింతురు. ఇటీవల మంగల వాండ్రు బయలుదేరుటచే వీరివృత్తి నశించి నది. వారు వీరిని తరిమివేయుచున్నారు. నేడీతెగ యెందును కాన్పింపదు.

మనుస్మృతి.

ములాలీ ధొరవారు యెఱుకలవారు వైశ్యునకు బ్రాహ్మణస్త్రీయందు కాని క్షత్రియస్త్రీయందుకాని జన్మించిన వారలని మనుస్మృతి వాక్రుచ్చుచున్నటుల వ్రాయు చున్నారు. కాని యిది సత్యముకాదు. మనువు వైశ్యునకు బ్రాహ్మణ స్త్రీయందు కాని క్షత్రియా స్త్రీయందుకాని జన్మించిన వారలు మాగధులు వైదేహులు అని వచించుచు (10 వ అధ్యాయము 17 వ శ్లోకము) వారి వృత్తులు గట్టునందును సముద్రమందును వర్తకము చేయుటయని వ్రాసినాడు (10 వ అధ్యాయము 47 వ శ్లోకము) దీనిని బట్టియే ములాలీ ధొరవారు పొరబడియుందురు. మనుస్మృతి ప్రకార మీవృత్తి నవలంబించు వారింకను పెక్కురు కలరు. అందువలన యీవృత్తి కల వారు యెఱుకలవారే యని నిర్ధారణచేయుట చాల పొరపాటు.

### గోత్రములు.

వీరిలో కావాటి (దైవమునకు బూజా ద్రవ్యములు కావడులలో మోయువారు) యనియు; వుయ్యాల (దైవమును వుయ్యాల తొట్టిలో బెట్టి యూపువారు) అనియు, బండి (రథ్యాదుల లాగువారు) యనియు, మాను పాటి (దైవసంకీర్తనలు చేయువారలు) అనియు మేంద్రగుత్తి (దైవమునకు పాదరక్షలు సరఫరా చేయువారు) యనియు, సాదుపాటి (భగవద్యలంకార ప్రీతులు) యనియు, ఆరు గోత్రములు కలవు. ఈగోత్రనామములంబట్టి చూడవీరొకానొకప్పుడు కేవలము దైవా రాధనయందు నిమగ్నులై యున్న పవిత్ర జాతివలె గాన్పించు చున్నది. కాని అయ్యది దక్షిణదేశమందు మాత్రమే. అందువలననే వీరికి దక్షిణదేశ సంబంధనామములు కలిగి నవి. వీరిభాషకూడ అరవము, తెలుగు, కన్న డము మిశ్రమమైయుండు. పైయారుగోత్రము లలో కావాటు సాదుపాటి ముఖ్యములు. కొంతకాలము దనుక కావాటి పిల్లవానికి సాదుపాటి పిల్లనిచ్చుటదక్క సాదుపాటి పిల్లవానికి కావాటిపిల్లనిచ్చు యాచారము లేదు. ఈనిర్బంధము నేడు నశించినది.

### గృహనామములు.

వీండ్లకు సాధారణముగా కావాటి, సాదు పాటి, మేంద్రగుత్తి, వుయ్యాల, బండి, మాను పాటి, ఆవుల, బొమ్మ, పొన్నర్సు, పేట్ల, చల్లా, దేసిర, దేవరకొండ, గరికె, కంపా, కట్టా, వగైరాగృహ నామములు కలవు.

### దుస్తులు - ఆభరణములు.

పురుషులు ఒక గోచీయు, నూలు మొలత్రాడు, దానికి వ్రేలాడు సంచియు, ఒకపెద్ద యండపాకారపు తలగుడ్డయు ధరి యింతురు. చేత నెల్లకాలము లాదొకపొడుగు పాటి కఱ్ఱకూడ నుంచుకొందురు. వీరు ధరి యించు గుడ్డలన్నియు నొకవిధమగు రంగు గుడ్డలు. ఆమొలకు వ్రేలాడు సంచిలో పైక మోలేక నములుటకు పొగాకో యుండును. చేతులకు వుండిన సన్నని రాగి మురుగు లో వెండిమురుగులో యుండును. లేకున్న లేదు. స్త్రీలు ముతకవస్త్రముల ధరియించి చేతివ్రేళ్లకు లోహపువుంగరములు ధరియించి దాదాపు మోచేయివఱకు గాజుల దొడిగించు కుని మెడనిండ ననేక విధములైన రంగుల పూసల దండలు అలంకరించుకుని శోభిల్లు దురు. కొందరు రెవికల తొడిగి కొందురు. కొందరు తొడుగు కొనరు. వీరియాస్తి వరా హములు. ఎవనికి యెక్కువ పందులున్న వాడు గొప్పయాస్తిపరుడు. వీరియాచార ములు వ్యవహారములుకూడ నశించి మార్పు చెందుచున్నవి. నేడు చూడగానే యెవనిని యెఱుకలవాడని చెప్పలేము. వారిలో నేడు కొంతమందికీవిమనయు ననేకుమసరహితుల కన్న మించినది.

### కులము - దైవములు.

వీరు వైష్ణవ సాంప్రదాయకులు. పెరు మాళ్లు, భవానమ్మ, దుర్గాంబ, మహాల క్ష్మమ్మ, కొల్లాపురెమ్మ వగయిరా దేవతల నారాధింతురు. కొల్లాపురెమ్మ సాధారణ ముగా గద్దెయెఱుకలచే నారాధింపబడును.

### వివాహములు

అతిచిత్రము; అతిస్వల్పము. ఏకులము వారైనను వీరిలో కలయవచ్చు. వీరి వివాహ మాడవచ్చు. అడ్డులేదు. పునర్వివాహము

కలదు. ఒక్కదినకార్యము. ఒకటి-రెండు-మూడుదినములానందము. సంబంధము తలిదండ్రులచేతనే పరిష్కరింపబడును. వివాహామునకు కావలసిన సామగ్రి రెండుకుండలు బియ్యము ఒకపంచపాత్ర కొబ్బరికాయమాత్రమే. పళ్ళెరమునిండ బియ్యముపోసి రెండుకుండలు అక్కడయుంచుదురు. ఆబియ్యపు పళ్ళెరములో యీగ్లాసు కొబ్బరి కాయ కలిశము గానుంతురు. అంత వధువు తండ్రి వధూవరులకు నూతన వస్త్రము లొసంగును. అవి వారు ధరియింతురు. కలశము వద్దకు వత్తురు. సాంబ్రాణి అగరు ధూపముల ననుభవింతురు. అంతవరుడు వధువుమెడలో నల్ల పూసలు గట్టును. మంగళసూత్రము గట్టును- అనంతర మా వివాహమున కరుదెంచిన బంధుమిత్రాదులు భోజనసురాపానములతో యానందింతురు, వీరిలో కట్నము కలదు. పెండ్లి కుమార్తె తండ్రికి పెండ్లి కుమారుడి తండ్రి 20 వరహాల నీయవలయును. అదియే ద్వితీయ వివాహమైన రెండువరహాల నీయవలయును. అది ద్రవ్యరూపకముగా నుండవచ్చు. లేదా వస్తువురూపకముగా నుండవచ్చును. వివాహకాలమందైనను నీయవచ్చు. లేదా యింకొకకాల మందైనను నీయవచ్చును. లేదా యితరవివాహములలో దీర్చుకొనవచ్చు. మేనత్తకూతుల పెండ్లియాడుటముఖ్యముఅటులపెండ్లియాడక పోయిన తప్పుగనెంచి యపరాధము విధింపబడును. అటుల పెండ్లియాడిన పెండ్లికట్నముకూడ తగ్గింపబడును. మేనమామకు కుమారుడేలేనియెడల మేనత్తకూతుల వివాహకాలమందు మేనమామకు కొంత యపరాధమీయవలసి యుండును. వివాహమెట్టులైనను వీరికది నిర్బంధములో చేరదు. భర్త చనిపోయినపుడు కాని జైలుకు పోయినప్పుడుకాని అనురాగహీనుడైనపుడు కాని స్త్రీ మరల వివాహమాడవచ్చు నయస్సు తోపనిలేదు ఏడువివాహములాడిన స్త్రీయా కులములో పరమపతివ్రతకు వేళన క స్త్రీ భర్తనువిడనాడి పునర్వివాహము జేసుకొన్న ననుకొనుడు. ఆమె భర్త మరల ఆపెను కావలయునన్న యథేచ్ఛగా సకుటుంబముతో స్వీకరింపవచ్చును. అభ్యంతర మేమియు లేదు.

కులతగాయిదాలు

ఇవి పంచాయితీల సహాయ్యమున తీర్చుకుందురు. ఆకాలమునకు చుట్టుప్రక్క గ్రామాదులవాండ్లందఱికి వర్తమానమంపుదురు. అందరు నియమితదినమున నియమితతావున చేరి తగవు దీర్చి తప్పుచేసినవానికి పన్ను విధింతురు. ఆపన్నుపెట్టి అందఱును త్రాగి యానందింతురు. ఈ యానందముతో తగవు సమాప్తియగును. ఇంకొకచిత్రము. ఎక్కడనైనను నేరముజరిగినదనుకొనుడు- అది తేలలేదు. ఎవరిమీదనో యనుమానము. వానికి బాధయెక్కువైనది. అప్పుడు వారందరు చుట్టుప్రక్కల అనుమానపు యెరుకలవాండ్లను పిలుతురు. ప్రథమమున నెవరినైతే అనుమానించినారో వానిచేత నూనెను తెప్పింతురు. దాని సల సల మంచి మంటను కాతురు. ఆకాగుచున్న కాలమందు అనుమానింపబడిన వారు మిగత వారు అందులో చేయిముంచవలయు. నేరము చేయనివాడిచేయి కాలదనియు ఇతరులు చేతులు కాలుననియు వారి మూఢ విశ్వాసము. ఇంతేకాక నిజనేరస్థుడందులో చేయి

ముంచుటకే జంకుననియు కూడ వారికినమ్మకము కలదు. ఈవిధముగ నేరమును వెలిపుచ్చ చూతురు. కాని అదియు దుస్తరమే. నమ్ముటకు వీలులేదు- వారి విశ్వాసమేమియో చెప్పలేము కాని వేడి చమురులో ముంచినచేయి కాలకుండునా? ఎవరిదైనను కాలును. అందుచే నిజమారయుట దుర్లభము. ఇది కుదురకున్న యింకొక విధమాలోచింతురు. వాండ్లలో కాళ్లు కట్టుకొనుట యను యాచారము కలదు. దీనికైనను పైచెప్పిన రీతినే అందరిని పిలిచి యొకరికాలుకును మఱొకరికాలుకు త్రాడుతోనో గుడ్డపీలికతోనో కట్టుకుని తగవులాడుచు అన్నాహారములు లేక నీరైనను త్రావకయుందురు.

## నేరములు

ఇదియే ముఖ్యాంశము. వీరలలో వారనక వీరనక ఆ తెగవారనక యీ తెగవారనక అన్ని తెగలవారు స్త్రీలు పురుషులు బిడ్డలు కూడ నేరములు చేయుచురన్న నతిశయోక్తి కాదు. వీరు చేయు నేరములు వర్ణనాతీతములు. అవియివియనక అన్ని నేరములు చేతురు. సామాన్యదొంగతనములు- కన్నపుదొంగతనములు— దోపిడులు- బందిపోట్లు చేయుదురు. పచ్చకుట్టు యెరుకల ఆడవాండ్లు పచ్చపొడిచెదమని చేతి యిండ్లుసొచ్చి పచ్చపొడిచి ఆభారపడుచుండ చేతికందిన దాని దొంగిలింతురు. యిల్లంతయు బాగుగ పరిశీలించి మొగలవారి యాహుతి కర్పణ కావలయునో యాలోచించుకుని వెడలిపోయి మగవారి కాగుట్టునిచ్చి దొంగతనముచేయింతురు తట్టయెఱుకలు వాండ్లు తట్టలమ్ముకొనబోవునపుడు పైవిధమున సంచరింతురు కరివేపాకు యెరుకలు యుప్పు యెరుకలు పాండ్లపని మీదవాండ్లు బయలు దేరునపుడు వారిగాడిదలను పశువులను యధేచ్ఛగా గ్రామముల మీదను చేలమీదను వదలుదురు. వారిక్రౌర్యమునకు కేవలమైన లోబైనవారి నానాహింసలుపెట్టి యాస్తి కొల్లగొందురు కావలియెరుకలు వారి మామూలు వారికి సరిగనీయక పోయినను వారికి ముట్టవలసినది ముట్టకున్నను గృహముల కొల్లగొందురు. మిగత జాతుల వాండ్రు నా వారిస్త్రీలద్వారా వర్తమానము మానిసి గృహసేవకు నాయ్యమున నతదితరుల సాహాయ్యమునను నేరములుచేయుదురు. వారిపిల్లలనువారు యుగ్గుపాలతో సహా 'నేనెరుగను నేనెరుగను' అనెడి పదము నేర్పుదురు. వారినెంత హింసించినను ఆపదము తప్ప వేరుచెప్పకూడదు. అటులనే మఱక చెప్పినవాడే వారిలో గట్టివాడు. ఈపిల్లల పెద్దవారితో వెంటనిడుకొని సంతల వగయిరాలకు తీసుకుని అచట ప్రజలు దుకాణదార్లు యేమఱి యుండునపుడు ప్రజల జేబులలోని పైకము తీయుటయు దుకాణదార్ల దుకాణములనుండి వస్తువుల నపహరించుటయు నేర్పుచుందురు. ఇక్కడనుండి పెద్దదొంగతనముల నేర్చుకొందురు. ఈయెరుకల వారి సామ్రాజ్యము నకు మేర లేదు. మనము సాధారణముగా బ్రిటీషు రాజధానిపట్ల నుపయోగించు సూర్యుడస్తమింపని సామ్రాజ్యమని వీరి సామ్రాజ్యమునకు నిరాటంకముగా నుపయోగింపవచ్చును వీ రాసేతు హిమాచల పర్యంతము వ్యాపించియుండి వారిమాటల యధేచ్ఛగ సాగించుచున్నది. వీరలను రెండు ముఖ్య జాతులుగా విభజింపవచ్చు. అవిస్థిరనివాసులు అస్థిర

గుంపులు అని. స్థిరగుంపులన గ్రామముల యందే వాసమేర్పరచుకుని యాయాగ్రామస్థులమని చెప్పుకొనెడివారు. అస్థిరగుంపులనగా స్థిరనివాసము లేక దేశసంచారము చేయువారు. మనకార్యమున కెవ్వరైనను యొక్కటియే. అస్థిర గుంపులకన్న స్థిర గుంపులకే యనుమానము లేకుండ నేరముల జేయుట కెక్కువ సావకాశముకలదు. వీరికి గ్రామాధారను సాహాయ్యము అపరిమితము గానుండును. నేరములలో ననుమానింప బడినప్పుడు గ్రామస్థులుత్తరసాక్ష్యముగావచ్చి వారినెప్పుడు కాచి యున్నవారి వలెనే 'అయ్యా వీరుమా గ్రామములో నున్ని దినముల నుండి యున్నారు. ఏనేరమునను యనుమానింప బడలేదు. వీండ్లనడతమంచిదిఅందురు. ఈమాట సాహాయ్యము అస్థిర గుంపులకులేదు. వారినెప్పుడును అనుమానించుచునే యుందురు. ఈఅస్థిరగుంపులకు స్థిరగుంపులు గ్రామసమాచారమొసంగి తోడుపడుదురు. గ్రామములో స్థిరగుంపు గాంచినను అస్థిరగుంపు గాంచినను యెల్లప్పుడును పరులెవరో కానవచ్చుచునే యుందురు. వారితరులెవరు కాకవారి కులమువారే. పురుషులకన్న స్త్రీలధికముగా కాన్పింతురు. వారిండ్లకరుదెంచిన పరులు నేర సమాచారమునకు వచ్చిన వారలో నేర సమాచారము తెచ్చినవారలో లేక నేరములుచేయుటకు వచ్చినవారలో అయి యుందురనుట నిస్సంశయము పురుషులకన్న స్త్రీలధికముగ నుండుటకు గతంబేమి? ఇదియు ఆయాస్త్రీలకు జెందియున్న పురుషులుచేరువ నెచటనో మరుగు ప్రదేశముల బొంచి యున్నారనియు స్త్రీలనేసమాచారము కొరకో బంపియున్నారనియు వారను

కాలమును బట్టి గుంపులు గలియు ననియు మనమూహింప వలసియున్నది. అంతేకాని వారు చెప్పుకొను నటుల బంధువులు కా[illegible] కాదు. ఈ సదుపాయముల నిమిత్తమే స్థిర గుంపులుకాని యస్థిర గుంపులుకాని గ్రామ మధ్యములందు కాక గ్రామ బాహ్యమందు గుడిసెల వేసికొందురు. వీరుదిగియుండు తావులనెల్ల గొప్పనేరములు మొదలు స్వల్పనేరముల వరకుజరుగుచునే యుండును. వీరలు అనుమానము కలుగకుండ చేయుటకు నేరము జరిగిన కొన్నిదినముల వరకు ఆ ముకామును వదలరు. వీరి ముకాము వద్దకేదైన కోడిపెట్ట వచ్చిన యెడల దాని మెడనులిమి చంపి తిందురు. ఆచుట్టుపక్కల నేదైనా గొఱ్ఱెలమందకాని మేకలమందకాని మేయుచున్న యేపుల్ల చితుకు నేరుకునే నెపమునో యక్కడకేగి ఆ కాపరి చూడకుండ నొకదాని దారితప్పించి యావల గొంపోయి యరవకుండ నోటిలో నేదియో గ్రుక్కి యే చెట్టు చాటుననో, పొద మఱుగుననో దాచి యుంచి యేమియు నెఱుంగని నాగ నాచివలెయుండి ఆకాపరి యామంద నింటికితోలుకు వెళ్లుటతోడనే తానుదానిసంగ్రహించి యింటికితెచ్చి చంపితినును. బళ్లారి జిల్లా రుద్రపాకం, మీనాపూరు, గాదికనూరు మొదలగు గ్రామాదులలో స్థిరగుంపులకును ఆజిల్లా కొల్లగ్రితాలూకా పంగిడిగూటి యెరుకలకును, ధార్వారుతాలూకా సింగనహళ్లీయెరుకలకును, సింగలబాద, కలగబాద యెరుకలకును బీజపూరు, బెల్గాం, షోలాపూరు గుంపులకును బాంధవ్యము కలదని

యు, వీరులింగధారుల వేషములతో ప్రయాణములు చేయుచు బళ్లారి, కడప, ధార్వారు, బీజపూరు జిల్లాలలో తఱుచు తిరుగు చుందురనియు, కడపజిల్లా కదిరికొండలలోనున్న, నిజాము రాష్ట్రపు వరంగల్లుజిల్లాలోను యున్న గుంపులు నియమిత కాలమున నుత్తరార్కాడు నెల్లూరు, అనంతపురం, కర్నూలు, బళ్ళారి, మైసూరు రాజధాని, కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలలోను ప్రతివత్సరము కాలము మార్చి తిరుగు చుందురు— "1900-1901 సంవత్సరములో కదిరిగుంపులు మైసూరు రాజ్యమంతయు గొల్లకొనినవి. అదే కాలమున హైదరాబాదు గుంపులు గుంటూరు, గోదావరి, కృష్ణాజిల్లాలు కొల్లగొనినవి. బెల్గాం, షోలాపూరు, బీరారు, అహమ్మదునగర, మహారాష్ట్రదేశపు గుంపులు బొంబాయిరాజ్యమున కుత్తరమున వారిప్రతాపము వెల్లడి చేయుచున్నారు. వర్షకాలముల యందు బొంబాయి రాజధాని యెఱుకల వాండ్రు నయిజాం సరిహద్దులకు కాని చిన్న స్వతంత్ర రాజ్యములకు కాని చేరుదురు. మద్రాసు రాజధాని యెఱుకల వాండ్లు కొండలకును, కొండల చెంతనుండు గ్రామాదులకును విశ్రాంతి నిమిత్తము పోవుదురు" అనెడి ఆమాది రెడ్డి పాపారావు నాయుడుగారి వాక్యములే వీరి విజృంభణను చాటుచున్నవి. వీరికనుకూలముకాని తావులేదు. వీరుకొన్ని గుంపులుగా జేరి దేశమంతయు విభజించుకొందురు. గుంపునకొక నాయకుడుండును. ఆనాయకుడు సామాన్యుడు కాడు. ఇదివఱకెన్నియో నేరములు చేసి, కారాగృహవాసమనుభవించి పేరెన్నికగన్న మహాశుద్ధుడు.

అతడు చెప్పిన మాట గుంపులో నెవరును జవదాటకూడదు. అతనియాజ్ఞ శిరసావహింపవలయును. అతడు నేరమునకు వచ్చినను రాకపోయినను చోరీ యాస్తిలో యుక్తవిభాగమతని కీయవలయును. అతనియందలి గౌరవము చేతనో కానొక కష్టం డతనికి జబ్బు చేసిన కొంత కాలము నఱకు నేరముల నాపుదురు. వీరువర్షకాలములయందు తప్పమిగత కాలములయందు నేరములు చేయుదురు. వర్షకాలమందే నియమిత స్థలమునకేగి మిగత కాలముల యందు దేశముల గొల్లగొని యార్జించిన విత్తమును ఖర్చుచేసి కొరుచు తినుచుందురు. కొన్ని తావులకు నియమిత కాలమునకు గాని వెళ్లరు. ప్రతివత్సరమున ఒకే కాలమున వెళ్లుదురు. నేరము చేయుటకు వెళ్లునపుడును నేరమునుండి వచ్చినపుడును వీరు వారిష్ట దైవము పెరుమాళ్లనారాధింతురు. ఏనిమ్మచెట్టు క్రిందనో, యే వేపచెట్టు క్రిందనో యొకరాయినునిచి దానికి కుంకుమాదులలంకరించి యదియే యొక దేవతగా నారాధింతురు. వీరుశకునముల బహు పట్టుదలతో చూతురు. అశుభ శకునమైన నేరమునకు వెళ్ళుటమానుదురు. వీరిన్ని నేరములు చేయుచున్నారు కదా? ఆస్తి యేమగుచున్నది? లోకానుభవము కలవారికి ప్రత్యుత్తరమెదుట నే యున్నది. ఆస్తికొనిన వారుయుండిన యెడల నేరములే జరుగవు. ఈఆస్తి ప్రజలలోనే హరించును. ఎక్కువ కాపు కమ్మలలో హరించును. గ్రామాధికారులు కూడ కొంతమంది వారిలో నేకీభవింతురు. ఈ కాపుకమ్మల స్త్రీలకు నేరస్థులకు చాల పరిచయముండును.

రహస్య బాంధవ్యము కూడ కలదన్న దోషములేదు. ఇక వీరు నేరములకే యేయాయుధముల గొంపోవుదురో విచారింతము. కర్రలు కొడవళ్ళు, కత్తులు, ఒడిశేలాది యాయుధములు కన్నపు కత్తులు కొనిపోవుదురు. వీరుపయోగించెడి కన్నపు కత్తి షుమారు అడుగు మొదలు రెండడుగుల పొడవుండును. రెండుకొనలయందు వాడియుండి ఒక కొనయందు పిడియుండును. మూడు, నాలుగు, లేక యధికమగు పలకల గలిగి యుండును. బహువాడిగానుండును. వీరు సాధారణముగా గోడలకు కిటికీల క్రిందను గడియల వద్దనుగుమ్మముల క్రిందను కన్నములు వేతురు. లోపల ప్రవేశించువాడు లోపల ప్రవేశించి తనకార్యము మీద తానుండగా మిగత వారు బయటనుండి యెవరా ప్రాంతములకు రాకుండ పైజెప్పిన యాయుధ ప్రాణులై యుండి కాపాడుచుందురు. లోనవాడు లోన ప్రవేశించి ఇంటి తలుపు లన్నియు నొక్కుమ్మడి తెరచును. లోపలి పెట్టెలన్నియు బయిటివారికందిచ్చును. వెంటనే నాలుగైదు మైళ్ళు చనును. అంతవరకుదిరిగి చూడరు. అక్కడ తెచ్చిన యాయాస్తి వారిలో నాయకున కొసంగుదురు. నియమిత స్థలమునకు గొంపోవుదురు. అక్కడ గాడిదెలు వగయిరాలు కట్టివేయబడు కట్టుకొయ్యల మొదటి యందును ఆ చేరువను గోతుల దీసి గోతులలోను, పేడకుప్పలలోను పాతి పెట్టుదురు. ఎఱుకల వాండ్లు నేరమొనర్చుటకు యిల్లు సొచ్చుట తోడనే గృహస్థులు మేలుకున్నారో లేదో గుర్తెఱుంగుటకు యిసుక రాళ్లు నిదురపోవువారిపై జల్లిపరీక్షింతురు. గ్రామస్థుల బారినుండి తప్పించుకొనుటకు ఆ నేరము చేయుతావునందిన్ని గులక రాళ్లపేర్చి యుంచుకొందురు. పచ్చబొట్టు యెఱుకలు తప్పమిగత యెఱుకల వాండ్రు నిదుర పోవుచున్న వారి యొడలిపై యాస్తి నంటరు. పచ్చబొట్టు యెఱుకలుగుమ్మము క్రిందను, కావలి యెఱుకలు గోడకును మిగత వాండ్రుగడియలవద్దను కన్నములు వేతురు. కన్నములన్నియు సూత్రవాసన వేయును. నేరము జరిగినతావులందు వెలిగించి పారవైచిన యగ్గిపుల్లలుండును? దొంగిలినయాస్తిలో నాయకునకు 2 భాగములు. నేరముచేసుకవచ్చిన ప్రతివానికి 1 భాగము. గుడిసెలవద్ద కావలియున్నవానికి 1/4 భాగము. జెయిలుకు వెళ్లినవారి భార్యలకు 1/2 భాగము. మిగతచిల్లరఖర్చుకు 1/8 భాగము జెయిలుకు వెళ్లినవారిన వారికుటుంబములను బోషించు బాధ్యతమిగత వారియందు కలదు, వీరుసాధారణముగా నేరస్థుని బయటపెట్టరు. అటుల నెవడైన ప్రమాదవశమున గావించి యెవరినైన జైలుకుబంపిన అటుల వెల్లడించినవారు గాని అతనివారసులుగాని అటుల జైలుకు వెళ్లివచ్చినవానికి వాని సర్వస్వమును భాగపోయవలసి యుండును. ఇక బందిపోట్లు దోపుడులగుఱించివిచారింతము వీరు సాధారణముగా సంతలుజరుగు గ్రామముల మార్గములందును, రహదారులకు సామీప్యముననూ మరుగు తావులందు క్యాంపు చేయుదురు. వచ్చేబోయే బండ్లను బాటసారులను కొల్లగొట్టి వారి కున్నదంతయు దీసికొందురు. ఇందులకీ క్రిందిపద్ధతి నవలంబింతురు. బండికాని బాటసారికాని వాని

వద్ద యేమైన యాయుధము లున్నవో లేవో కనుంగొనుటకు బండి మీద కాని బాట సారి మీద కాని దూరము నుండి రాళ్లు రువ్వెదరు. వెంటనే నలు గుర్రైదుగురు బండిని కాని బాటసారిని కాని సమీపించి గాబరా చేయుటకు వారి వద్దనున్న యాయుధములతో గబ గబ నొకరినో యిదరినో చావమోదుదురు. అందరిని క్రిందికి దింపి మసిపికొకరు కాపలాయుండి యాయుధ పాణులై సర్వమును దోచుకొందురు. వారివద్ద పెట్టెలేమైన యున్న వాని తాళంచెవులిచ్చువఱకు స్వంతదారుల కెంతటి బాధయైన గలుగజేయక మానరు. ఇందులకు శ్రీమాదిరెడ్డి పాపారావునాయుడు గారొక సులభమార్గమును బోధింపుచున్నారు. బండ్లమీద రాళ్లు పడగానే సాధ్యమైనంత వరకు మెడలోని హారములు నగయిరాలు త్రెంచి బండిచెంత నెక్కడనో కొలది దూరమునగుర్తుపట్టగలతావునందువిరజిమ్ముటయు, కొంత బండి గడ్డిలో గప్పి పుచ్చుటయు, కొంత బండిచాపలలో దూర్చుటయు, యిట్టుల చేయుటకు సాధ్యముకానివి బాధలపాలు కాకుండ యిష్టానుసారముగ చోరులపాలు చేయుటయు వారి సలహాయై యున్నది. ఈ మార్గము కొంతవఱకు ధైర్యముననో నిబ్బరము వుండి చేసిన కొంతనష్టము తగ్గింప వచ్చును. వీరు గృహబందిపోటులు కాగడా బందిపోటులు చేయుదురు. ఏముప్పది నలువదిమంది యర్ధరాత్రముననో వారు కొల్ల గొట్టదలంచిన గృహము కాగడాలతోను, గొడ్డండ్రతోను యొడిశేలలతోను, కత్తులతోను, కర్రలతోను, తుపాకులతోను, రాళ్లతోను, నింకవారికి దొరకు నితరయాయుధములతోను చేయుదురు. గొడ్డండ్రతో తలుపుల బ్రద్దలకొట్టెదరు. లోన బ్రవేశింతురు. లందున్న దంతయు కొల్లగొందురు. అందని దాని నిమిత్తం యజమానిని బాధింతురు. అతడాక్షణమైన వప్పగింపవలె. లేదా దాచిన తావయిన చెప్పవలె. లేదా తాళపు చెవులైన నీయవలె. లేదా తనప్రాణములనైన కోలుపోవుటకు సిద్ధముకావలె. వానిసర్వవిధముల నొవ్వచేతురు. కొడుదురు. తిడుదురు. కాల్తురు. వేడిచమురు మీదపోయుదురు. కొందరు బయటనుండి గ్రామస్థులెవరు రాకుండక యొడిశెలతిప్పుచుందురు, కొంత మంది రాళ్లు రువ్వుచుందురు. కొంతమంది లాఠీ కసరతు చేయుచుందురు. కొంతమంది కత్తుల త్రిప్పుచుందురు. కొంతమంది ఆవీధిలోని యిండ్లన్నియు బయట గొళ్ళెములు వేతురు. కొంతమంది తుపాకుల కాల్చుచుందురు. తుపాకులెక్కడివాయని సంశయింప నక్కరలేదు. ఇదివరకువారు కొల్లగొట్టిన తావుల సంపాదించిన యాయుధములు వారితోనే యుండును. గ్రామస్థులలో తుపాకి లైసెన్సుదార్ల సాహాయ్యమును పొంది వారి తుపాకుల గైకొందరు. ఒకసమయమందు గ్రహచారవశమున గ్రామస్థులకు వీండ్లకు పోరాటము కలిగిన వారిలో నెవరైన చిక్కిన వాని విడిపించి తీసుకునెళ్ళుట కనేకయత్నములు చేతురు. దుస్సాధ్యమని తోచినకాని వాని విడిచి వెళ్లరు. ఆపోరాటములో వారి వారెవరైన మడసినయెడల గుర్తించుటకు వీలులేకుండ వానితల నరుక్కొని పోవుదురు. వీరు నేరముల యందెప్పుడును మారువేషమునయుందురు. వీరుయిండ్లలో బహిరంగము గాబ్రవేశింతురు. ఒకప్పుడెవరో బందు

గులు వచ్చినట్టు వచ్చి తలుపు తీయగానే లోనప్రవేశింతురు— ఒకప్పుడే బంధువువద్ద నుండియైన యుత్తరము తెచ్చినట్టువచ్చి తలుపుదీయించి లోన బ్రవేశింతురు. ఈయేబది నుంది యెన్నిదినములనుండియో యాలోచించి యాలోచించి నియమిత దినమున నియమిత కాలమున నియమిత యాయుధములతో కలిసి నేరమునకు జనుదురు. వీరలింత క్రూరులు కావుననే మనవారలు వీండ్లకు గ్రామ గ్రామమునకు మామూలు యేర్పరిచినారు. వీరిలో యొక్కొక్కని కనేకనామములుండును— పచ్చకుట్టుయెరుకలవారు మూల శంఖ వ్యాధినివారణ చేయుదురు. వీరలు యిండ్లకప్పులగూడ కోసి లోనికిదిగి దొంగతనము చేతురు_ వీరికి కాకులన్న నతిప్రేమ. శుభాశుభములు కనుగొనుటకు కాకిగమనము నెక్కుడాలోచింతురు. ఉత్తరక్రియల కాలమందు అయిదవ దినముననో ఆఖరు దినముననో కాకులకన్న మిడుదురు. వీరుశవముల బాతిపెట్టుదురు. కానిదహనముచేయరు. వీరికొక మరుగుభాషయున్నది. ఇయ్యది నేరములుచేయు కాలమందు నుపయోగింతురు వీరునేరము చేయుకాలమందు స్త్రీలజెరుతురు. స్త్రీలు వారిహస్తములలో చోరీమాస్తి దాతురు. వీరిలో నిటీవల తెలగ పాముల వాండ్లని యొక తెగబయలు దేరినది. వారినేయెజ్జిగొల్లలందురు. వీరు పై చెప్పిన నేరములన్నియు జేతురు. వీండ్లు సాధారణముగా కృష్ణా గోదావరిజిల్లాలయందు తిరుగుచు గ్యాంగు నెంబరు 24 గా రిజిష్టరు కాబడినారు. వీండ్లు సాధారణముగా పోలీసు కానిస్టేబిల్సు నిగహాలో తిరుగుచుండ్రు. అంతమాత్రమున నేరములు చేయుటకువీరికి సందులేదని మునమను కొనకూడదు. ఈపోలీసుజమానుల కాపలా మరీ అభాసుగానున్నది. ఇది వారినిబాధించి నిర్బంధించుటకన్న యుత్తర సాక్ష్యమున కెక్కువగా పనికి వచ్చుచున్నది. వీరలెక్కడో సంచరించుచుందురు. అసలుగుంపులో కూడ నిదురించుచు రాత్రిళ్లు 2, 3, పర్యాయములు లేచివారిలో అందరుయున్నారో లేరో చూడవలయునని నేమముకలదు. అటులవీరుచేయరు. వీరెక్కడనో నిదురించుచుండగ గుంపుయే యర్ధరాత్రముననో వారిపనివారు చక్కపెట్టుకుని మరలనేమియు నెఱుగని నంగనాచులవలె తెల్లవారుసరికి గుంపుచేరి యథేచ్ఛగ నుందురు. ఎందైన యనుమానింపబడిన జవానులు వారికిసాక్ష్యము. తాము రాత్రియంతయు గుంపులో యుంటిమనియు రాత్రియొకటిరెండు పర్యాయములు గుంపు హాజరు గైరు హాజర్లు చూచితిమనియు, అందరు హాజర్ యనియు సాక్ష్యము. ఇక కేసు యెవరి మీద? ఇంత కన్న నిగహా లేకున్న మంచిది కాదా?

## క్రిమినలు సెటిలుమెంట్లు.

ఇటీవల గవర్నమెంటు వారు యీ జాతికి క్రిమినలు సెటిలుమెంటు అనియొక సెటిల్మెంటు స్థాపించినారు. ఇయ్యది సీతానగరము, బాపట్లవగయిరా కొన్ని తావులలో నేర్పరచినారు. దీనిముఖ్యోద్దేశము యీ నేరములు చేయు వారి నందరిని యొకచో చేర్చి రక్షక సైన్య భటుల యాజమాన్యము క్రింద నుంచి వారికేమైన బనులుగల్పించి కుటుంబ రక్షణోపాయ మొనర్చి నేరములుచేయువృత్తినుండి

తప్పించుట. కానియిది కొనసాగుచున్నట్టుల యొంతమాత్రమును తోచుటలేదు. సెటిలు మెంటులోనివారు నేరములుచేయ రనుటకువీలులేదు. సెటిలుమెంటు పరారులనిఅనుదినము ప్రతిస్టేషనుకు జాబితాలు వచ్చుచునేయుండును. వాండ్లగుడిసెలపైన రాత్రిళ్లు కాపలాయుండును. అట్టితటికూడ వీరలెటుల పలాయనమగుచున్నారో భగవంతునికే తెలియవలయు, అటులపలాయనమై కొలదిదినములు యేకొండలమీదనో పొదలలోనో దాగియుండి స్వేచ్ఛావృత్తినవలంబించి కావలసిన ద్రవ్యమార్జించుకుని మరల సెటిలుమెంటు చేరుదురు. ఈ సెటిలుమెంటును గురించియు ఫలితముల గురించియు పలువురుపలువిధముల చెప్పుకొనుచుందురు. కాని అయ్యవి మనకప్రస్తుతములగుటచే విడిచి వేయుచున్నాను. కానియీమాటలలోను చెప్పుళ్లలోను సత్యములేకపోలేదు. ఆసెటిలుమెంటు లోనికి ఆసెటిలు మెంటుయధికారి యుత్తరువులేని మరొకరు వెళ్లకూడదు. అక్కడవారితో మాటలాడకూడదు. అక్కడనుండి మనకెవరైన యనుమానపుమనుష్యుడు కావలయునన్న నెంతయోదుర్లభము మీదకానివాని తీసుకుని రాలేము. తుదకిత్తురో యివ్వరో కూడసందియంబే. ఒకవేళయిచ్చినను సెటిలుమెంటు అధికారులు వారికుత్తరసాక్షులుగా నిలిచెదరు.

## క్రిమినలు ట్రైబ్సుఆక్టు.

ఈ చట్టము 1911 వ సంవత్సరములో ప్యాసుచేయబడినది. దీనిముఖ్యాంశములివి. నేరములు స్వాభావికముగా చేయ నభ్యాసము గలయేజాతినైనను దీని క్రింద చేర్చి క్రిమినలుట్రైబ్సు అందురు. ఈచట్టము క్రింద వారుచేర్చబడుటతోనే ఆజాతివారు యేడిప్యూటీ కలెక్టరు వారిజూరిసుడిక్షను లోనున్నవారో ఆడిప్యూటీ కలెక్టరు వారిచేత క్రిమినలు ట్రైబ్సురిజష్టరు కాబడుదురు. అటుల యగుటతోడనే వారుండునది గ్రామమైన గ్రామాధికారితోను పోలీసుస్టేషనైన స్టేషను హవుసు ఆఫీసరుతోనైనను చెప్పనిది వారియిండ్ల వద్దనుండి గైరుహాజరు కాకూడదు. ఒకానొక సమయమందు పగటివేళ యే భిక్షాటనముకైనను సోదిచెప్పుకొనుట కైనను మరేయితర వృత్తిమీదనైనను వెళ్లినను ప్రొద్దుగుంకువరకు యిల్లుచేరవలయు అటులచేరనియెడల దోషులుగాపరిగణింప బడుదురు. రాత్రికాలములయందు వారుగైరుహాజరు కావలసిన యగత్యమేకలిగిన యెడల వారుగ్రామాధికారి యొద్దనుండి కాని స్టేషను హవుసు ఆఫీసరు యొద్దనుండికాని రహదారీ పొందవలయును. ఆరహదారిలో వార లేకార్యము నిమిత్తము పోవునదియు, యేదారిపోవునదియు యెంత కాలము గైరుహాజరు కావలసినదియు యుండును. వారిమధ్యదారిలో వారాగు ప్రతిగ్రామమందునుగ్రామాధికారులయొక్కగాని హవుసాఫీసరు యొక్కగానిసంతకము పొందవలయును. అటులపొందని యెడల దోషులుగాపరిగణింప బడుదురు. వీండ్లను యిన్నినిర్బంధముల క్రింద పెట్టినను వారి యాటలకు మితిలేకనే యున్నది. ప్రతిచోటను కృత్రిమ దస్కతులను పొందుదురు. అవెంతయో వీరికి ఉత్తర సాక్ష్యమునకు సహకారిగా నుండును.

# ఆదికవి



(చిర్రావూరు కామేశ్వరరావుగారు, బి, ఎ,)



క్రౌంచ మిథునము సుఖ ప్రపంచమునఁ
బ్రణయామృతము గ్రోలు స్వర్గకాలమున,
కాలాంతకాకార కఠినాత్మకుం డగు,
క్రూరనిషాదుఁడు కూల్చె బాణమున!—
విషసాయకాఘాత విగతాత్ములగుచు,
విలపించి దివికేగు ప్రియావధూవరులఁ
గాంచియే హృదయంబు కన్నీరు గార్చె,
నా మహాత్మకుఁ బూజలర్పింతు నేఁడు!
సౌందర్య ప్రతిభలో శాశ్వతానంద—
మమరించి, ప్రేమరాజ్యము నేలెనెవఁడు?
బాష్పస్రవంతిలో భవ్యానురాగ-
కౌముదీ కాంతులు గల్పించె నెవఁడు?
మహనీయవాణిని మంత్రదండమున
నిహలోకమును స్వర్గమెవఁ డొనరించె?
విమలాత్ము రాత్మక ప్రేమమంత్రములు,
హృదయంబునకుఁ బేర్మి నెవఁడు బోధించె?
ప్రేమ మోహంబుల భేదతత్త్వమున,
స్వర్గంబు నరకంబు చాటించె నెవఁడు?
ఫలజలాహారియై పర్ణగేహమున,
భువన మోహనగానమును జేసె నెవఁడు?
ఆమునిచంద్రున కాయాది కవికి
ననవరతము బూజలర్పింతు నేఁడు!
కవిసార్వభౌమ యోగ్యకమనీయ కావ్య
రామలీలాసుధారస మెంతవఱకు,
హృదయ క్షేత్రంబున నింకదందాక
నిష్కళంకంబునై నీకీర్తి గరిమ,
శుక్రతారాశుభ్ర శోభానుభూతి
దలపించి వెలయు నిస్తంద్రమై జగతి!
భక్తియో, రక్తియో, పారవశ్యంబో,
యంగీకరింపు నా యాత్మ శుశ్రూష!



# రాజనీతిశాస్త్రము

## అందు చర్చనీయములగు ప్రధాన విషయములు.



( మామిడిపూడి వెంకటరంగయ్యగారు )

ప్రస్తుతము— అనగా మన ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున నూతనశక మారంభమైన ఈకాలములో— విద్యాధికు లనేకులు రాజనీతిని గురించిన గ్రంథములను వ్రాయబూని యున్నారు. ఇది ఎంతయో కొనియాడదగిన ప్రయత్నము. దేశమందంతట స్వరాజ్యోద్యమము వ్యాపించి యున్నది. దానియెడల ప్రజలెల్లరు సుముఖులై యున్నారు. ఇట్టితరి రాజకీయ విషయములకు సంబంధించిన సిద్ధాంతములు ప్రజానాయకులకును జనసామాన్యమునకును చక్కగ తెలిసియుండుట మిక్కిలి యవసరము. ఇదిగాక, ఇప్పుడు ప్రపంచ పరిస్థితులు మారుచుండుటచేత ఈసిద్ధాంతముల గురించిన అభిప్రాయములందు భేదము లనేకము లుత్పత్తియగుచున్నవి. పుస్తకములందును పత్రికలందును ఇట్టి యభిప్రాయ భేదములను పండితులు విమర్శించు చున్నారు. ఈసందర్భములలో రాజనీతిని గురించిన గ్రంథములు కొలది కాలములో మనమాతృభాషయందు బయలు వెడలునను నమ్మకము కలుగుచున్నది. కావున అట్టి గ్రంథములలో చర్చనీయములగు ప్రధాన విషయము లేవియో సూచించుట ఆవశ్యకము.

రాజ్యతత్త్వమును, దాని ననుసరించి స్థాపింపబడిన ప్రతిష్ఠాపనలను వివరించు శాస్త్రము రాజనీతిశాస్త్రము. ఇందలి తత్త్వభాగము చక్కగ బోధపడినగాని ప్రతిష్ఠాపనభాగము స్పష్టము కాజాలదు. కాని, ఇదివరకు మనభాషలో వ్రాయబడిన రెండుమూడు రాజనీతి గ్రంథములలో నీతత్త్వవిచారము విపులముగ లేదు. ఈవిచారము శాస్త్రమున కంతకు పునాదివంటిది. ఇందు రాజ్యము యొక్క నిజస్వరూప మేదియో నిర్ణయింపబడవలెను. అనగా, ఇందు రాజ్యమన నేమి? అనుప్రశ్నకు సమాధానముండును.

ప్రభువులు ప్రజలు అను రెండుకక్షలతోఁ గూడిన సంఘము రాజ్యమని మనము సాధారణముగ చెప్పుచుందుము. ఈనిర్వచనము సరియైనదా కాదాయను విమర్శ ప్రతి గ్రంథకర్తయు చేయవలెను. రాజ్యమను మాటను మనము వాడినప్పుడంతయు మనకీ యర్థము స్ఫురించుచుండును. ఒక రాజ్యమునకును మరియొకదానికిని ప్రభుత్వవిధానాదులందు భేదము లెన్నియున్నను రాజ్యములన్నిటికిగల సామాన్య లక్షణమిదియే. రాజ్యములను సంఘములు—అనగా, ప్రజలు ప్రభువులను విభాగముతోఁ గూడిన సంఘములు——అనాదిగనుండినవా? లేక మధ్యకాలమున బుట్టినవా, అట్లైనచో నేలాగు పుట్టినవి? అనువిషయము లీసందర్భమున విమర్శింప బడవలెను.

రాజ్యమనుమాటకు నిర్వచనముచేసిన తర్వాత ప్రభుత్వమనగా నేమియో తెలుపవలసియున్నది. ప్రభుత్వమనగా నొకవిధమగు నధికారము. మనయనుభవములో మన మనేకవిధములగు అధికారములను చూచుచున్నాము. కుటుంబమందు తండ్రికి పిల్లలపై అధికారమున్నది. పాఠశాలలలో ఉపాధ్యాయునికి బాలురమీదను, మతవిషయములలో శంకరాచార్యాది మఠాధిపతులకు వారి శిష్యులమీదను, ఒకకర్మాగారము (Factory) లోపనిచేయు కూలివాండ్రపై యజమానునికిని అధికారము కలదు. కాని ఈయధికారములకును ప్రభువుల యధికారమునకును భేదమెట్టిది? ఈభేదనిర్ణయమే రాజనీతిశాస్త్రములోని ముఖ్యవిషయము. శాస్త్రజ్ఞులు చేయవలసిన పనులలో నింతకంటె శ్రేష్ఠమైనది మరియొకటి లేదు. దీని నిగురించి శాస్త్రకారులలో ననేకములగు నభిప్రాయభేదములున్నవి. "స్వయంకృతములగు చట్టముల ప్రకారము దండమును విధించుటయే ప్రభుత్వలక్షణము." అనుసూత్రమును అనేకులామోదించి యున్నారు. అధికారమెల్లప్పుడు దండనతోఁ గూడుకొని యుండును. తండ్రిపిల్లలను దండించుచున్నాడు. గురువు శిష్యులను దండించుచున్నాడు. కాని, వీరిదండనము యుక్తమా కాదాయను నిర్ణయించు అధికారము ప్రభుత్వము వారికున్నది. ప్రభుత్వపు చట్టములకు విరుద్ధముగ తండ్రిగాని గురువుగాని దండించెనని తోఁచినయెడల వారే శిక్షకు పాత్రులగుచున్నారు. అనగా వీరికి దండనాధికారముండినను "స్వయంకృతములగు చట్టముల ప్రకారము" వీరుదండింపలేరు. వీరికంటె శ్రేష్ఠులగు ప్రభుత్వము వారిచట్టములకు లోబడియే వీరు వీరిదండనాధికారమును చెలాయించుచున్నారు. ప్రభుత్వమువారి అధికార మిట్టిదికాదు. వారు మరియొకరు చేసిన చట్టముల ననుసరించి ప్రజలను శిక్షించువారు కారు. తాము చేసుకొనిన చట్టముల ప్రకారమే అమలుజరిపించుచుందురు. ఏదియుక్తమో ఏదికాదో నిర్ణయించువారు వారే, నిర్బంధపరచుట అధికారులందరికి సమానధర్మము, చట్టము నతిక్రమించినప్పుడే శిక్షగాని తక్కినప్పుడు శిక్షలేదను సూత్రమును అధికారులందరు పాటించుచుందురు, కాని రాజ్యాధికారులకు చట్టములచేయుయోగ్యత ఉన్నది; ఇతర అధికారులకట్టి యోగ్యత లేదు. ఈయంశమును విపులముగ చర్చించి,

దీనిలోని లోపాలోపములను స్పష్టపరచుట శాస్త్రకారులకు విధిమైయున్నది. పై సూత్రిము నంగీకరించనివారలనేకులు కలరు. అంగీకరించినను లేకపోయినను ప్రభువుల యధికారమునకును తక్కినవారి యధికారమునకును గల భేదమెట్టిదో తెలియపరచుట శాస్త్రజ్ఞులందరికి ప్రధానముగు కార్యము.

విధినిషేధరూపమగు చట్టములుచేసి, తప్పొప్పుల నిర్ణయించి తప్పుచేసిన వారిని శిక్షించుట ప్రభుత్వమునకు లక్షణమగుటచే, రాజ్యమందు వ్యక్తిస్వాతంత్ర్య ముండుటకు వీలులేనట్లగు పడుచుండును. కానిఇది సత్యమా? కొన్నిరాజ్యములలోని ప్రజలకు స్వాతంత్ర్యమున్నదనియు, అట్టిది లేని రాజ్యములలోకూడ ప్రజలు దానికై పాటుపడుచున్నారనియు స్వతంత్రములేని జన్మమువృథయనియు మనము చెప్పుచున్నాము. ఇప్పుడుమనకు స్వాతంత్ర్యము లేనిదనియు, స్వరాజ్యములభించినయెడల స్వతంత్రముకూడ లభించుననియు మనమువాదించుచుందుము. కావున స్వతంత్ర్యము యొక్క నిజస్వరూపమెట్టిదో రాజనీతి శాస్త్రజ్ఞులు వివరింపవలెను. అధికారమునకు లోబడుటయనిన స్వతంత్ర్యమును కోల్పోవుటయా? స్వతంత్రము పెక్కురూపములగలదా లేక దాని రూపమెల్లప్పుడొకేరీతిగ నుండునా? రాజకీయ విషయములలో స్వాతంత్ర్యముండుటయు తక్కినవానిలో లేకపోవుటయు సంభవించునా? స్వాతంత్ర్యముయొక్క విలువ యెట్టిది?

సాధారణముగ శాస్త్ర చర్చలు రెండు రకములుగనుండును. వర్ణనీయాంశముల లక్షణమును హేతుసహితముగ నిర్ణయించు చర్చలు మొదటిరకములో చేరినవి. ఉన్నదియున్నట్లువివరించుటయే ఈచర్చలయొక్క యుద్దేశము. ఇట్లుగాక, ఇవియెట్లుండిన బాగుండునో నిర్ణయించుచర్చలు రెండవ రకములోనివి. రాజ్యమననేమి? అధికార స్వాతంత్ర్యములకు గలపరస్పర సంబంధమెట్టిదియను చర్చ మొదటి రకములో చేరినది. కాని, రాజనీతిశాస్త్రమును వ్రాయువారింతటితో విరమించకూడదు. నిరంకుశాధికారమే లక్షణముగా గలరాజ్యము లుండుట మంచిదికాదా? ప్రభుత్వ మొకప్పుడు మంచిదగుటయు మరియొకప్పుడు కాకపోవుటయుసంభవించునా? ప్రభుత్వ మెల్లప్పుడు ధర్మసాధనమేయైన యెడల ప్రభువులపై కలహించుట న్యాయమా? తలిదండ్రుల మాటదాటరాదని కొందరు గురువులమాట తప్పకూడదనిమరికొందరును ప్రతిమనుష్యునికి వానిమనస్సాక్షియే పరమగురు వగుటచేత దానినతిక్రమింపకూడదని కొందరును చెప్పుచుందురుకదా? ప్రభువుల చట్టమునకును తల్లిదండ్రులయు గురువులయు మనస్సాక్షియొక్కయు సలహాలకు పరస్పరవిరోధముసంభవించినపుడు చట్టము ననుసరించుటయా అతిక్రమించుటయా? ప్రభుత్వమునకు లోబడుట ధర్మమని సిద్ధాంతపరచుటయెట్లు? ఇట్టివిషయములను నీతిశాస్త్రకారులు విమర్శింపవలసియున్నది. మంచిచెడుగులననేమియో, మన పరమావధియెట్టిదో, దానినిచేరుటకు రాజభక్తి కులభక్తి జాతిభక్తి దేశభక్తి కూడనుండవలెనా, అనుప్రశ్నలకు సమాధానముల నిచ్చుటకు శాస్త్రకారులుప్రయత్నింపవలెను.

ఇదంతయు చెప్పినగాని రాజకీయవిప్లవముల (Political revolutions) స్వభావము మనకు తెలియజాలదు. అకస్మాత్తుగ జరుగు గొప్ప మార్పునకు మనము విప్లవమను పేరుపెట్టుచుందుము. స్వతంత్రమునకై ప్రజలు విప్లవముల గలిగించిరని మన దేశచరిత్రనుండి మనకు తెలియకపోయినను పాశ్చాత్యుల చరిత్రల జదివిన వారికిట్టి విప్లవము లెన్నియో జరిగినట్లు స్పష్టమగుచున్నది. సాధారణముగ నధికారవర్గములోనివారు వీని నిగర్హించుచుందురు. కాని యివి ఎంతవరకు గర్హనీయములో ఎంతవరకు ప్రశంసనీయములో రాజనీతిలో శాస్త్రజ్ఞులు నిర్ణయింపవలెను.

ప్రభుత్వముయొక్క మంచి చెడుగులను విప్లవములయొక్క ఆవశ్యకతానావశ్యకతలను నిర్ణయించునపుడు ముఖ్యముగ రెండు విషయములను శాస్త్రకారులు గమనింపవలెను. (1) ప్రభుత్వమును చేయువారు ప్రభువులు. ప్రభువులుకూడ మనుష్యమాత్రులే. సామాన్యముగ మనుష్యులందరికిగల వికారములు దుర్గుణములు వ్యసనములు ప్రభువుల యందుకూడ నగపడుచుండును. అధికారమందున్నంత మాత్రముచే మనుష్యునికి సహజములగు నీగుణముల దృశ్యములు కావు. ఒక్కొక్కప్పుడు అధికార కారణముచే నివి ప్రభువులందు వృద్ధినిగాంచును. ప్రభువులు సుగుణసంపదలయందు ప్రజలకంటె నధికులని చెప్పుటకు వీలులేదు. సర్వకాలములందు పరిపాలనా యోగ్యత కలవారలే ప్రభువులగుచుందురని నిశ్చయించుటకు హేతువులు కనుపింపవు. సంస్కృత భాషయందు నీతిశాస్త్రములను వ్రాసిన కామందకాదులీవిషయమును చక్కగ నెరిగియుండిరి. ఇదిగాక మనుష్యులందరు సమానులే. కొందరధికులు కొందరల్పులు అను వాక్యమందు సత్యమేమియులేదు. అని వాదించిన రూసో మొదలగు పాశ్చాత్య తత్త్వవేత్తలీ విషయమును నొక్కి చెప్పియున్నారు. ప్రభువులుకూడ మనుష్యమాత్రులగుటచే సర్వజ్ఞత్వము సర్వశక్తి సర్వగుణములు వారియందుండునని తలచుట గొప్పపొరపాటు. యీసత్యమును గ్రహించిన యెడల రాజకీయ సిద్ధాంతములలో నిప్పుడున్న అపోహలు చాలవరకు తగ్గిపోవును. (2) ప్రభువుల యుద్దేశమును బట్టి మాత్రమే ప్రభుత్వము మంచిదా చెడ్డదాయని మనము నిర్ణయించకూడదు. యీసందర్భమున ఉద్దేశముకంటె ఆచరణయు ఆచరణ వలనగలిగిన ఫలితములు ఎక్కువ ప్రధానములు. ఉద్దేశములు మంచివైనను ఆచరణయందవి యెట్లు పరిణమించుచుండునో మనము గమనింపవలెను. సాధారణముగ మనము దీనిని మరచుచున్నాము. ఆచరణయందు ప్రీతి ఫలించని యుద్దేశములున్నను లేకపోయినను ఒక్కటే.

ఈ విమర్శను ముగించిన తర్వాత ప్రభుత్వము వారాచరింపదగిన కార్యములెవ్వి యను విషయమును చర్చింపవలెను. మనయందే లోపముండినను దానిని సవరించుట ప్రభుత్వమువారి పనియని మనమనుకొనుచుందుము. కానియిది సరికాదు. జీవయాత్రయందు మనుష్యునకనేక సాధనములు తోడ్పడుచున్నవి. కుటుంబము విద్య

మతము మొదలగునవి యిట్టి సాధనములు. ప్రభుత్వమీసాధనములలో నొకటి. ఒక్కొకసాధన మొక్కొక్క విధమున తోడ్పడుచుండును. దేనివలన నెట్టిసహాయ మపేక్షింప తగునో అట్టిసహాయముచే దాని నుండి అపేక్షింప వలెను. ప్రభుత్వలక్షణ మెట్టిదియో మనము నిరూపించితిమి. గాన అట్టిసాధన మేవిధముగ మన ముపయోగింపవచ్చునో నిర్ణయించుట కష్టతరము కాదు. ఆపనిని కూడ రాజనీతి శాస్త్రజ్ఞులు చేయవలెను.

పైఅంశముల జ్ఞాపక ముంచుకొని ఎట్టివారు ప్రభువులుగ నుండవలెను అను విషయమును చర్చింప వలెను. (1) ప్రభుత్వము వంశ పారంపర్యముగ నొక కుటుంబమందు గాని కొన్ని కుటుంబములందు మాత్రమేగాని సంక్రమించి యుండవలెనా? అట్టి పద్ధతివలన గలుగు లాభ నష్టము లెవ్వి (2) లేక, ప్రభువులను నిర్ణయించు అధికారము ప్రజల యందుండవలెనా? ఈరెండుపద్ధతులకునుగల తారతమ్యమెద్ది? ప్రజాభిప్రాయము ననుసరించు ప్రభువులుండుట మంచిదా? లేక ప్రజల క్షేమముగోరి, అందుకై పాటుపడువారు ప్రభువులుకావలెనా? ఈరెండు పద్ధతులను సమన్వయించుటకు వీలున్నదా? లేక యివిపరస్పర విరుద్ధములైనవా? ప్రజాభిప్రాయము ననుసరింప వలయు ననిన, ఆయభిప్రాయమును కనుగొను టెట్లు?

తత్వభాగములోని విషయములలో ముఖ్యములైన వేవియో యిచట సూచించితిని. వీనినిగురించి పాశ్చాత్యభాషలలో నతిబాహుళ్యముగ శాస్త్రవేత్తలు వ్రాసియున్నారు. వారిపద్ధతుల ననుసరించి, మన దేశపు స్థితిగతుల కనుగుణ్యముగ మనవారు గ్రంథముల వ్రాయబూనుకొన వలెను.

# భక్తహృదయము

(పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు)



౧

శా॥ అల్లుండ్రంచును గూతులంచు బహు భార్యాపుత్ర మోహాంధులై
యిల్లే ముక్తిగ నెంచినాజనుల నేయే వేళ నేన్ గూడకా
వల్లిన్ జిక్కక తప్పి యింద్రియజయప్రజ్ఞుండ నాపద్ధతిన్
జెల్లన్ జేయగ యుష్మదీయమగు నాశీస్సిమ్ము సర్వేశ్వరా!

శా॥ ఆలుం బాధుల సాకజాలక కులత్యాగమ్ము గావించి వా
చాలబ్ధంపు విరాగవర్తులయి ధీచాతుర్యముల్ జూపుచున్
వాలాయంబుగ బొట్టబోసికొను సన్న్యాసంబులన్ గోర
యాలుంబంధుల గూడి మోక్షధనమే నర్థింతు సర్వేశ్వరా!

శా॥ ఆలుం బాదుల సాకకందరను సన్న్యాసంబులన్ బూనుటల్
చాలుంజాలు గృహస్థధర్మము దురాచారంబొకో యింటనీ
లీలల్ జూడగలేకబోయి విపినోర్విన్ జూతురే? వట్టిద
యాలుంబంధుల గూడి మోక్షధనమే నర్థింతు సర్వేశ్వరా!

శా॥ చావన్ గాలము వచ్చెనంచెరిగి యాశల్ జంపగా లేక యిం
డ్లో వాకిండ్లో మరేని యో మనసునన్ యోజించి కాంక్షింతురా
భావంబెప్పుడు నన్ను జేరకయె సంప్రాప్తేంద్రియ ప్రాజ్ఞతా
భావస్ఫూర్తి మనంబునం జొనుపు మయ్యా భక్తకల్పద్రుమా!

శా॥ శ్రద్ధాభక్తుల నిన్ను గొల్వకయె తీర్థంబుల్ విలోకింప బో
సృద్ధిన్ గాంచెదమంచు నేగి ధనమున్ వెచ్చింతురా? విత్తమే
బద్ధున్ జేయదు నిన్ను భక్తధన సర్వస్వంబు వెచ్చించినన్
బద్ధున్ చేయును గాన నట్టిధనమున్ యాచింతు భక్తప్రభూ!

శా॥ ఆదర్శంబులు గొప్పగా గలుగు నాహా యంచు వెన్వెంటనే
మోదంబందుచు వానన్నిటిని సంపూర్ణంబు గావింపగా
నౌదార్యంబును బూనువాని బ్రతుకే యాగాని జీవచ్ఛవం
బై దృష్టాంతము నొందువాని బ్రదుకే నాశింప భక్తప్రభూ!

శా॥ ధ్యానింతున్ నిను సంతతంబెదను బ్రహ్మానంద సౌఖ్యంబునన్
బూనన్ జేయుము దానికిన్ ఫలముగా భూముల్ కరుల్ గుఱ్ఱముల్
సూనుల్ ధాన్యము నిండ్లు వాకిళులు ముల్లోకాధిపత్యంబుగా
నీనేనొల్లను నిక్కమీ శపథమే నిక్కంబు సర్వేశ్వరా!

# అడయారు జాతీయ మహా విద్యాలయము



[ వి. ఎన్. శర్మగారు బి. ఏ., బి. టి ]



ప్రస్తుత విద్యా పద్ధతులను ఆర్య సాంప్రదాయానుసారముగ తగిన మార్పుల జేసి, భారతజాతి నుద్ధరించుటకుగాను గత ఇరువది సంవత్సరముల నుండియు ఉత్తర హిందూస్థానమున ఎన్నియో ప్రయత్నము లు చేయబడుచున్నవి. ఇందులకు శ్రద్ధానంద స్వాములవారి గురుకుల విద్యాలయము బిసెంటుగారి కాశీ పాఠశాల రవీంద్రనాథ కవి చంద్రుల శాంతినికేతనము, మొదలగు ప్రఖ్యాత పాఠశాలయములు దృష్టాంతర ములు. కాని యేలవలననో ఇట్టిప్రయత్నములు దక్షిణ ప్రాంతమున అంతగ సలుప బడలేదు.

ఇది సాధారణమైన కార్యముకాదు. ఎంతయో ధనసంపత్తి కావలయును, బల సంపత్తి కావలయును. అప్పుడె ఈమహా కార్యము సక్రమముగ నిర్వహింపబడగలదు. దక్షిణదేశ వాసులు ఏరీతిని ఉత్తరదేశము వారికి దీసిపోరు. దేశమున కావలసిన ధన సంపత్తిగలదు. ఉదారవంతులగు ప్రజలు గలరు. ధనమును అనేక ధర్మకార్యములకు వెచ్చబెట్టగల లక్ష్మీపుత్రులు కావలసినంత మందిగలరు. విద్యావినయ సంపన్నులును, స్వార్థత్యాగ మూర్తులును; నగుమహనీయులు ఈప్రాంతమున లేకపోలేదు. ఈసంపత్తి నంతయు సేకరించి ఈమహాకార్య నిర్వహణమునకు బూనుకొనువారు మాత్రము మన దురదృష్టమువలన, లేకపోయినందున, ఇంత వరకు మనప్రాంతమున ఆర్య శిక్షణాలయములు సంస్థాపింప బడుటకు అవకాశము దొరకినదికాదు.

ఉత్తరదేశమున వారణాసి మహా క్షేత్రమున గొప్ప సర్వకలాశాలను నెల కొల్పి ఆర్యధర్మముల నన్నిటిని పునరుద్ధరించి భారత విద్యాచరిత్రమున నూతన యుగము నొకదానిని సంస్థాపించిన, అనిబెసెంటమ్మ గారు దక్షిణదేశమునగల యీకొరతను దీర్చుటకు ఆరు సంవత్సరముల క్రిందట అడయారు నందొక మహావిద్యాలయమును సంస్థాపించి యున్నారు. ఈవిషయమున వారు చూపుచున్న పట్టుదల ఇంతింతయని సూచించుట అనవసరము. తమ సర్వస్వమును ఈ మహావిద్యాలయ పోషణమునకు వినియోగించి కీర్తివంతులై యున్నారని వ్రాసిన చాలును.

ఈవిద్యాలయము చెన్నపురమునకు సమీపమున సముద్రతీరమున అడయారు క్షేత్రమున నొకగొప్ప యుద్యాన వనమున నిర్మింప బడినది. ప్రస్తుత విద్యావిధానమున గల లోపముల నన్నిటిని నివారణచేసి, ఆర్య సంప్రదాయముల ననుసరించి యువకబృంద మునుద్ధరించుటకు అన్నిరీతుల ప్రయత్న



కలాశాలాశ్రమములు ఒకభాగము మాత్రమే

ములు సలుపబడుచున్నవి. బాలుని సహజ సంపత్తినిగుర్తించి దాని యభివృద్ధికి అన్ని విధముల తోడ్పడుట విద్యయొక్క పరమోద్దేశ్యమని అందరు నొప్పుకొని యున్నారు. మన ప్రాచీనులీ తారక మంత్రమును గ్రహించి కీర్తిశాయులైరి. ఇప్పుడిపుడు పాశ్చాత్య దేశములవారు సైతము ఈమహోద్దేశ్యమును గ్రహించుచు నాగరకత సభ్యతను బడసి ప్రపంచమునంతయు నేల గలుగుచున్నారు. అన్ని దేశములవారు బాగుపడుచుండ, పూర్వ మొక్కసారి ప్రపంచ మంతయు ప్రఖ్యాతి గాంచి కీర్తి గాంచిన భారతభూమి ఎంతకాలం దాస్యమునబడి యుండవలయును? భారతజాతి యితర జాతులవంటిది గాదా? వారి కున్నంత వ్యక్తిత్వము మన వారికి లేదా? భారత పుత్రులొక విధముగను, పాశ్చాత్యయువకు లొకవిధముగను పరిగణింప బడవలయునా? ఏమాత్రము కాదు. భారతపుత్రులు ఇతరులతో ఏమాత్రము తీసిపోజాలరు. కొన్ని విషయములలో వారికన్నను నొకమెట్టు అత్యున్నత స్థితిలోనున్నారని చెప్పినను దోషమేమియులేదు. అడయారు జాతీయవిద్యాలయమున ఈసూత్రమును సమన్వయ పరచు.

టకు చేయబడుచున్న ప్రయత్నములు అనంతములు.

ఇచ్చటి విద్యాలయము సాశ్రమము. బాలుర యోగక్షేమముల నరయుచు ఉపాధ్యాయులు విద్యాలయముననే నివసించుచుందురు. కుఱ్ఱవాండ్రపట్ల ప్రేమాభిమానములు గలిగి, వారివృద్ధికొరకె కాలము అందరు గురువర్యులే. అట్టిగురువర్యుల శిక్షణమున నారితేరిన విద్యార్థులే విద్యార్థులుగదా!

పెరిగి పెద్దవారై లోక వ్యవహారములను నతినిపుణతతో నిర్వహించుకొనుటకు గాను బాలురకు గురుకులవాసమున అన్నివిధముల అవకాశము లీయబడుచుండును. ఇందువిషయమున ఉపాధ్యా



బాలుర నివాసగృహములు వుపాధ్యాయులు సైతమిచ్చటనే నివసింతురు.

నంతయు వినియోగపరచువారినే తప్ప మరెవరినిగాని యిచ్చట యుపాధ్యాయులుగ నియమించరు. బాలుర సహజ గుణసంపత్తిని గ్రహించి, దాని నభివృద్ధిచేసి, వారినిమాతృసేవారాధకులుగ చేయుటకు ఇచ్చట ఉపాధ్యాయులు అహోరాత్రములు శ్రమసల్పుచుందురు. ప్రాచీన పద్ధతిలోవలెనె, గురుకులవాసమున నున్నంత కాలము, బాలురకు తలిదండ్రులు బంధుమిత్రాదులు



బాలుర ఉపాధ్యాయులు కలసి భోజనముచేయుట.

యులు బాలుర సహజభావముల గ్రహించి వాని యభివృద్ధికి తోడ్పడుటకు తగిన విధానము నరయుచుందురు. గురుకుల వ్యవ



ఆశ్రమము నందలి ఒకగది

హారములను చాలవరకు బాలురే నిర్ణయించుకొనుచుందురు. శిక్షణ విషయములో సైతము వీరికి చాలవరకు బాధ్యత గలదు.

ఏసేవ చేయవలయునన్నను శరీరబల సంపత్తి యుండవలయును. ఇందునుగురించి యిచ్చట జెప్పనక్కరలేదు. బాలుర దేహారోగ్యముల గుర్తించి, వానిని పెంపొందింప జేసి, వారిని బలసంపన్నులుగ చేయుటకు



బాల భటుల వేడుకలు

ఈమహావిద్యాలయమున చేయబడుచున్న ప్రయత్నములు చెప్పనక్కరలేదు. వైద్యాధికారు లొక్కరుగు గురుకులముననే సదా బాలురతో నివసించుచు ఆరోగ్య విషయమున వీరికి కావలసిన సహాయమునంతయు చేయుచుందురు. బాలురనీతిమునుగురించి చెప్పనక్కరలేదు. అన్నిభూతముల యెడ్ల సమభావము జూపుచు కీర్తిమంతులుగ గురుశిష్యులు సదా వారికి తోడ్పడుచుందురు. అంతవరకుపోనేల ఈకాలపు ప్రజానాయకులకే క్లిష్టములని తలంపబడుచున్న సాంఘిక సమస్యలను ఇచ్చటిబాలురు బాగుగ గ్రహించి సాంఘిక విషయములన్నిటిని శాంతసంతముగ కార్యరూపమున బెట్టుకొని కృతకృత్యులగుచున్నారని చెప్పిన, ఇచ్చట బాలురవ్యక్తిత్వమును జూపెట్టుటకు ఈయబడుచున్న అవకాశము లెట్టివో పాఠకులు గ్రహింపగలరు గదా!

ఇచ్చట బాలుర శిక్షణమంతయు



వృక్షచ్ఛాయల శిశువులు చదువుకొనుట.

మాతృభాషలోనే గరుపబడుచున్నదని వేరుగ జెప్పనక్కరలేదు. చిన్నతరగతి మొదలు

విద్యాలయము నందలి అత్యున్నత తరగతి వరకు బాలురకు వారి మాతృభాషలోనే పాఠములన్నియు గరపబడుచున్నవి. బాలురకు అఖిలశాస్త్రములలో నిచ్చట ఈయబడు చున్న శిక్షణ దానివలన బాలుర సహజసంపత్తి యెంతవరకు వృద్ధిపొందుచున్నదియు సూచించుట అనవసరము. ప్రభుత్వ విద్యార్థి బాలుర ప్రభుత్వపరీక్షలకెల్లను పోవచ్చునని యుత్తరవుల నిచ్చియున్నారు. గత మూడు సంవత్సరముల నుండియు స్కూలు ఫైనలు పరీక్షలకు ఇచ్చటి విద్యార్థులు వెళ్లుచు ఉత్తీర్ణులగుచున్నారని సూచించిన చాలును. ఈసంవత్సరమునుండి ఇంటరు మీడియెటు తరగతులకుసైతము సంస్థాపకులు తెరచి, బాలుర



దామోదరు మందిరము. ఇచ్చట సైన్సు విద్యార్థుల తరగతులు గలవు.

కొరకు ప్రతిసంవత్సరమును ఇచ్చటి విద్యావిధానమును పరీక్షించుచు ఇట్టివిధానమునే వారు సైతము ఇతర ప్రతిష్ఠాలయముల అవలంబించిన బాలుర చరిత్రమున ఈ రాష్ట్రమున నొక నూతన యుగము ప్రారంభమగునని ప్రవచించుచున్నారు.

ఈవిద్యాలయమువారిపద్ధతులనుప్రభుత్వమువారంగీకరించి, యిచ్చట చదువు నీగురుకుల పద్ధతులలోనే మరికొంత కాలమువరకు శిక్షణ సేయ సంకల్పించుకొనినారు. మదరాసు విశ్వవిద్యాలయమువారి తరపున డాక్టరు కాండేతుగారు రివరెండు మోఫటు గార్లు ఈగురుకులమును దర్శించి యిందలి విద్యాపద్ధతుల నామోదించి ఇంటరు మీడియెటు తరగతుల సంస్థాపించుటకు విద్యాలయమువారికి అవకాశమిచ్చియున్నారు. మరి

కొంతకాలమునకు విద్యాలయమును సర్వకళాశాలగ సైతము చేసి బాలుర నిచ్చటినుండియే పట్టభద్రులు జేయుట ప్రతిష్ఠాపకుల యుద్దేశ్యము.

భారత విద్యాదర్శములు చిరస్థాయిగ వర్ధిల్లి భారతోద్ధారణమునకు ముఖ్యాంగము



బాలుర పఠన మందిరము.

లైయుండవలయునన్న ఉపాధ్యాయుల స్వార్థత్యాగము అత్యవసరము. ఇట్టి విషయమున ఎట్టి కొరంతయు లేదు. విదేశములలోను, భారతదేశమునందును గొప్ప గొప్ప పరీక్షలలో నారి తేరి ఇతరచోట్ల గొప్ప గొప్ప పదవులబడసి, కావలసినంత ధనము గడించుటకు అవకాశమెంతయున్నను, దానినంతను తృణప్రాయముగ చూచుచు ఎట్టిభోగభాగ్యముల మీద ఏమాత్రమాసక్తి యుంచుకొనక తమ వ్యయములకు కొద్దిగ సొమ్మును బుచ్చుకొనునట్టి గురువర్యులే ఈవిద్యాలయమున అధ్యాపకులుగ నున్నారు. ఇట్టి స్వార్థత్యాగులచే పవిత్రవంతములగు ఆశ్రమములె పరమపావనములగు ఆశ్రమములుగదా? ఇట్టి స్వార్థత్యాగ మూర్తుల యాజమాన్యమున నడుపబడుచుండు విద్యాలయములు చిరస్థాయిగవర్ధిల్లుట కెట్టి కష్టముండగలదు?

విద్యాలయకర్తలగు శ్రీయుత వేంకటసుబ్బారావు పంతులుగారు ఆంధ్రులు. భారతవిద్యాసమస్యల నిర్ణయించుటలో వారిని పేర్కొని ఇతరులను ప్రస్తావించవలయును. స్వార్థత్యాగమున ఆయనకు పెట్టినదేపేరు. అట్టినాయకులు యాజమాన్యమున తమ యా



బాలురు ఈదులాడు చుండుట.

వజ్జీవమును విద్యాలయమునకు ధారపోసిన సహాధ్యాయుల సహాయ సంపత్తివలనను దేశీయులప్రోత్సాహమువలన విద్యాలయము తన విద్యుక్తధర్మముల నిర్విఘ్నముగ కొనసాగించుటకు భగవానుడు అన్నివిధముల తోడ్పడునుగాత! వందేమాతరం.





# ఆరోగ్యమైన పాలు.

[ చి. వె. నరసింహం గారు ]

పాలు మన శిశువులకు రోగులకు ముఖ్యఆహారముగా నున్నవి. అయితే పరిశుభ్రమైన పాలు దొరకుట కష్టము. ముఖ్య పట్టణములలో కలితిలేని, యేమికొరతలేని, పాలుదొరకవు. గాన యిటువంటి పాలు మన శిశువులకు అనారోగ్య కరము. మ్యునిసిపాలిటీ వారి యాదరణక్రింద పట్టణములలో వేరువేరు ప్రదేశములలో పాలమ్ము యేర్పాటులుండుట యుపయోగకరము.

ఆరోగ్యకరమైన పాలు కావలెననిన పాలుతీయుప్రదేశము, పాలను యితరస్థలములకు తీసికొనుపోవు విధము, సరియైనవిచారణ జేయు వానిక్రింద నుండ వలయును. ఇటుల సరియగు నధికారమును జేయగలిగినది మ్యునిసిపాలిటియే. ఇదిసరిగ జరుగుటకు చిన్నవిగాని పెద్దవిగాని పాలమ్ము ప్రదేశములన్నిటిని రిజిష్టరు జేయవలసియుండును. క్రమశిక్షపొందిన పశుశాస్త్రజ్ఞులను తరుచుగా యీపాలమ్ము ప్రదేశములను పరీక్షించునటుల జేయవలెను. ప్రతిచోట కొలది పాలను తీసికొని దానిలోని క్రిములను పాలలో నుండు వివిధవస్తువులను పరీక్షించుచుండవలెను. పాలమ్మువారలు నిబంధనలను, సరిగ నెరవేర్చునటుల జేయవలెను. వారలపైన ముఖ్యాధికారి యొకరుండి యీపనులను తనిఖీ జేయుచుండవలెను. వారందరుగూడఆరోగ్య శాఖాధికారి క్రింద పని చేయవలెను. లైసెన్సులేని గొల్లవారు గాని, పాలమ్మువారలు గాని ఎవరు నుండకూడదు. ఎక్కడెక్కడ పాలమ్మువారి యాస్థలములను తటాలున వెళ్లి పరీక్ష జేయుచుండవలెను. ఏవిధమైన తప్పున్నప్పటికి తగిన శిక్షను విధించవలెను. ఈతనిఖీ జేయువారలకు జీతమెంతివ్వ వలెనను సమస్యవచ్చును. వారల జీతముకొద్దిదైన

తక్కువకొద్దిజీతం వారు సహజముగా లంచములు దీసికొనుట వలన యంగడిలో మంచి పాలుండవు. కాన మంచి జీతము లేర్పరచి లంచగాండ్రు కారని తెలిసినవారికే ఈపాల తనిఖీపని నిచ్చిన యిటువంటివి తటస్థించవు.

పాలు పెరుగమ్ము ప్రతి స్థలములోను మంచి పాలెటులుండునో వర్ణించుకాగితముల నంటించవలయును. ఈకాగితములను యింగ్లీషు, తెలుగులో కూడ వ్రాయవలెను. చాల మందికి చదువురాదు గాన నాటియర్థములను యీతనిఖీ జేయువారలు జెప్పుచుండవలెను.

పశువైద్యులు యీపాలగొడ్లను తరుచు పరీక్షించుచుండవలెను.

పాలను తీయుటలోను, వాటిని యితరులకు పంచుటలోను, యీక్రిందిసంగతులను గ్రహించవలయును.

1. అనారోగ్యపు ఆవుపాలను అమ్మకూడదు. ఆవుయీనిన తరువాత 21 దినముల వరకు పాలుపనికిరావు.

2. ఆవులలో క్షయ క్రిములు లేవని రూఢిపరచు కొనువరకు యీయావుపాలను వాడరాదు.

3. పాలచెంబులు, గిన్నెలు బుడ్లును లోన పైన శుభ్రముగా కడిగి నీళ్లలో నుడక పెట్టవలయును. ఈ యుపకరణముల అంచుల సందుల నుండు ఒకఅణా యెత్తు మురికిలో సుమారు 500,000 మొదలు 50,000,000 వరకు క్రిములున్నట్లు అమెరికాలో లెక్క వేయబడినది. వానిపైనుండుదానిలో చాలవేల క్రిములున్నట్లు లెక్కించబడినవి. సరిగ శుభ్రపరచబడిన పాలలో నిటులనుండరాదు.

4. ఇంకొకగంటకు పాలు తీయుననగా పేడ మొదలగు మురికిపదార్థములను తీసివేయవలెను.

5. పాలను తీయబోవుముందర పొదుగును దాని ప్రక్క ప్రదేశములను శుభ్రముగా తడిగుడ్డతో తుడువవలెను. ఇందువలన పాలలోపడు క్రిములసంఖ్య తగ్గిపోవును.

6. పాలనుతీయు పాత్రల మూతలు జాలచిన్నవిగా నుండవలెను. ఇటులుండిన మురికి విస్తారముగాపడదు. వెడల్పు మూతిగల పాత్రలో సుమారు ౩,400,000 క్రిములున్నట్లును సన్నమూతి దానిలో 100,000 క్రిములున్నట్లును లెక్కించబడినవి.

7. సీసాలో రెండుగంటలు కాలము పాలుపోసి యుంచిన యాసీసా అడుగుభాగములో యేదైన పదార్థము దిగబడిన నాపాలను వాడరాదు. ఇటులనడుగున చేరినదానిలో 90 పాళ్లు ఆవుయొక్క పేడపదార్థమును 10 పాళ్లు ఆవువెండ్రుకలును పాలతీయువాని చేతిమురికిన్ని గడ్డిపదార్థములని జెప్పబడుచున్నవి. కాన యిటువంటి పాలు మనుజులకు పనికిరావు. శుభ్రమైన పాలలో నిటుల నడుగునకు యేమియు తేలదు.

8. పాలను తీయునపుడు శుభ్రమైన బట్టను గట్టవలెను. తీయుముందర చేతులను శుభ్రముగా గడుగు కొనవలెను. మొదట వచ్చు ధారలలో యెక్కువ క్రిములుండును గాన వానిని విసర్జించవలెను. శుభ్రముగాను నుడకపెట్టబడిన సన్నని గుడ్డతో నాపాలను వడియగట్టిన జాలమంచిది. పాలను పితుకగనే వేరేగదిలోనికి తీసికొనిపోవలెను. ఆగదిలో మంచిగాలి వెలుతురు యుండవలెను. గవాక్షు

ములకు ఈగలు మొదలైనవి రాకుండ యేర్పాటుండవలెను. పాల పాత్రలను చల్లటి నీటిలో పెట్టవలెను. చల్లగానున్న పాలలోని క్రిములు యెదుగవు. కాచినపాలలో కాచని వానిని యెప్పుడును కలుపగూడదు,

9, మంచుగడ్డలను పాలలో వేయరాదు. ఏలనన మంచుగడ్డ కరగి పాలతో కలయును గాన పాలుచెడిపోవును.

10. పాలగిన్నెలను ఎండలోపెట్టియుంచరాదు. ఇదిగాక వేడిగానుండు వంట యిల్లలోను నుంచరాదు. ఈవేడిమివలన పాలు విరుగును.

11. పాలున్నపాత్రలను మూతలేకుండ నుంచరాదు.

12. ఆవులకు వెల్లుల్లి నీరుల్లి దుంపలును పెట్టిన పాలువాసనవేయును.

13. పొదుగుమీద తొడలమీద తోకమీద విశేషముగా వెంట్రుకలున్న కత్తిరించవలెను. ఇందువలన ఆవులు శుభ్రముగా నుంటకు వీలగును.

14. ఆవులను కట్టుస్థలములను శుభ్రముగా నుంచవలయును, గోడమీద బూజును మురికిని తీసివేయవలెను. ఒకమారు సున్నము కొట్టిన లెక్కపెట్టలేనన్ని క్రిములునశించును.

15. పాలుపోయుటకు యిల్లకు తీసికొని పోవునపుడు మంచి మూతలుగల పాత్రలే యుపయోగించవలెను.

16 పాలుచల్లగా నుండునటుల ఈ పాత్రలమీద చల్లని నీటిలో తడపినగుడ్డను వేయవలెను.

17. అమెరికాలో యీపాలను చిన్ని వూళ్లనుంచి పెద్దపట్టణములకు తీసికొనిపోవుటకు ప్రత్యేకముగా త్వరగా నడచు రైళ్లున్నవి. ('Fast milk trains') రైలు వచ్చువరకు యీపాలను నిలవయుంచుటకు ప్రత్యేకమైన గదులు రైలు స్టేషనులో నున్నవి. బళ్లలోగూడ పాలు చల్లగానుండునటుల యేర్పాటులున్నవి. ఈబళ్లను నిత్యము చాల వేడినీటితో గడుగుచుందురు. గాన జాల శుభ్రముగా నుండును.

ఇటుల శుభ్రమైనపాలు గావలెననిన పాలఖరీదు యెక్కువగును. ఖరీదుఎక్కువైనప్పటికి యిటుల జాగ్రత్తగా యేర్పాటులుండి సప్లయిచేసిన పాలెప్పుడు ఖర్చుకాకుండా యుండవు ఖరీదు ఎక్కువైనప్పటికి జనులు యెప్పుడును మంచిపాలనే తీసికొందురు. ప్రత్యేకమైన నిబంధనల వలననే యిటువంటి యేర్పాటులు జరుగుట కష్టము. జనులకు సరియైన చదువు యున్న యీపనులు సులభము.

కాన చిన్నయిస్కూళ్లలోనే వీనియొక్క విలువను గురించి నేర్పవలెను. తరువాత నుపన్యాసములద్వారాను ప్రదర్శనములవలన కూడ నేర్పవలెను.

ఆరోగ్యమైన పాలున్న ప్రతి వత్సర మునిశువులలో తక్కువ మరణములుండునని మనస్త్రీలకు నేర్పిన దీనియొక్క విలువను గ్రహింపగలుగుదురు.



# పశ్చాత్తాపము.



చండతర కాంక్ష విద్యాతురుండ నగుచు
సుఖములను రోసి, మేధాసుషుప్తి వదలి
జ్ఞానసంపాదన ప్రయత్నమున నొకట
నమితరుగ్మత యాసింప నమితదీక్ష
చిన్ననాఁడుఁ బదఁపడి మొన్నదనుకఁ
బెద్దకృషి సల్పితిని జయబిరుద మబ్బ.
పరులెరుంగక మేనిపై బట్టలేక
ప్రథమగురుఁడగు నాతండ్రి బడిన జేరి
అక్షరజ్ఞాన మొక్కింత యబ్బకుండ
బాలరామాయణ శ్లోక పాఠినగుచు
సప్తవర్షంబులకె వైశ్యసదనములను
బటిక బెల్లంపు బహుమతుల్వడసినాఁడ.
గురుని వెలుపున గాపీన ధరుఁడనగుచుఁ
బొరుగు బడికేగి నాలుగు తరగతులను
నూరివారెల్ల రచ్చెరువొందఁగొంత
పూర్ణవిద్యాభిరుచి గాంచి యుంటినంత
జన్మభూమికి వందన శతము లిచ్చి
కన్నులను గ్రమ్ముకొను జలకణము లణచి
సెలవుగొని, పట్టణమున వసింప వచ్చి
భాగ్యవశమునఁ గవిరాజు పంచఁజేరి
యుత్తమాదర్శ ముపదేశ మొందినాఁడ.
ఆయుత్తరగతులను వడి నధిగమించి
"మేడపై కెక్కితిని' గొంత మెప్పుగంటి.
సెలవుదినముల మాయూరఁ జేరినప్పు
డాఁడు పిల్లను నీకిత్తు మనని వారు
వరుసగలవారిలో నొకరెలుగిఁగాదురు
విద్యపై గల యాసక్తి విడువలేక,
వృద్ధి చెందనియు గృహస్థవిధుల నసమ
బెండ్లి యాడక రెండు మూఁడేండ్లు గడపి
దూర దేశంబులకు బోయి దుర్భర ప్ర
యాసములకోర్చి సఫలీకృతాశయుండ
ధన్యుడను నైతి బట్ట భద్రత్వమంది!
తండ్రి పేరున ననుబిల్చి తనయులందు
నమితవిశ్వాసమున జూచునట్టి వాడు—
వృద్ధుడైనట్టి నాతండ్రి మృత్యుతల్ప
గతుడునై యుండు సమయాన గంటగనక
పట్టణంబున గూర్చుండి పఠనసేసి
బహుమతిగ గొంటినయ్య యీపట్టమిపుడు.
దుర్భరావస్థ జెంది హృద్రోగవశత
మరణమాసన్నమైన ప్రేమైకమూర్తి
నాజనని శయ్యపై బడి నాల్గుదిశలఁ
గలయజూచెనటందు" రాకాలమందుఁ
జీకుచింత యెఱుంగక యేకశార్థ
తర్కమున నుంటినేమొ! విద్యాలయమున!

* * *

జన్మభూమి పయింబ్రేమ చంపివైచి
తల్లిదండ్రుల నవసాన దశను గనక
తనువులోనున్న దార్ఢ్యంబు ధారవోసి
ధన్యతన్గాంటి నన్న సంతసము లేదు
ఆర్జితఫలంబు విఫలబ్ధమైనదేలొ॥

(ఆంధ్రవిద్యార్థి.)



# పెంకి పాటలు-

( పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు )



శ్లో॥ ఆఘ్రాతంపరి లీఢముగ్ర నఖరైః
క్షుణ్ణంచ యచ్చర్వితం
క్షిప్తంయద్భత నీరసత్వకుపితే
నేతివ్యథాంమాకృథాః
హేసద్రత్న! తవైత దేవ కుశలం
యద్వానరేణాగ్రహా
దంత స్సార విచారణ వ్యసనినా
చూర్ణీకృతం నాశ్మనా

భారతియొక్క వైశాఖ సంచికయం దుగల పెంకిపాట విమర్శనమును చదువగనే పండితరాజుగారు అనుగ్రహించిన పైసుభాషితము జ్ఞప్తికివచ్చినది. నిరతిశయమగు భావనా సంపదచేతను ప్రతిభా ప్రకర్షము చేతను అద్వితీయులగు కవిరాజు లెల్లరును ఇట్టులనే తమతమకాలము లయందలి జనతచే నిరాకరింప బడుచు వచ్చుట అనూచానము నుండి మనలో వచ్చు సంప్రదాయముగా బోలు ననుకొంటిని. లేనిచో పండిత రాజం తటి వాడిశ్రేల యనవలసి వచ్చును?

ప్రస్తుతకాలమునందు ఔచిత్యమునకు మొక్క దారయనీయక జాతీయతనుసుకుమార ములగు పద్ధతులలో వెలయించుచు సరస మగురీతిని కవితచెప్పెడి ఆంధ్రయువకులలో నండూరి సుబ్బారావుగారొక్కరు. సుబ్బా రావుగారి పరిచయము నామట్టునకునాకు వారికవితా రసాస్వాదనము వలననే కల్గినది. అనగా వారియొక్క స్వరూప స్వభావాదు లెరుంగనియట్టిస్థితినుండియే వారిమృదుమధుర ములగు రచనల జదివి యానందించి వారి భావనాశక్తికి అచ్చెరువంది క్రమక్రమముగా తత్పరిచయము చేసి కొంటిననిమనవి. ఈమా టలను వ్రాయుటలో నాయుద్దేశమేమనగా నా యీవ్యాసము వాదమునకు ప్రతివాదముగా వ్రాయుచున్నది కాదనియును శ్రీయుతులు లక్ష్మీనారాయణగారు ఆరోపించుచున్న దోష

* శ్రోత్రిశాక దానికి ఉజ్జ్వలమగురత్నముదొరికినది. ఆరత్నము నయ్యది భక్ష్యణార్హము గంథిలమగువస్తువును నూహతో ఆఘ్రాణించినది. కానిసంతృప్తి కలుగ లేదు. అనంతరము నాల్కతో నాకినది. ఆపైని వాడిగోళ్లతో రక్కినది. కానిఆవానరమున కందే దియును రసముఅగుపడలేదు. చివరకుకోపమునచ్చి ఛీ ఛీ! అని విసరి పారవైచినది. ఇట్టిరత్నమును గాంచి కవియను చున్నాడు. కోతిచేత నవమానింప బడితినిగదాయని ఓరత్నమా, వ్యధనొందకుము. నీకీ చేతయేఒక విధముగా కుశలమను కొనుము ఏమందువా? ఆవానరము అన్ని విధముల పరీక్షించియు తృప్తినొం దకచూతము లోన నేమున్నదో, యన్నతలంపుతో జాతితో నిన్ను పొడిచేసి యుండి యుండ వలసినది కానిఅట్లు చేయక పరీక్షామాత్రముతో తృప్తినొంది విసరిపారవైచినందులకై నీవుఇప్పట్టుల సంతసింప వలయునుసుమా — అనితాత్పర్యము

ములు ఎంతవఱకు సత్యబద్ధములో అనువిషయమును చర్చించుటకు నాకు అర్హత కలదని రూపించుటకనియు నెఱుంగనగును. ఇక ప్రస్తుతమునకు వచ్చెదను.

సెంకిపాటలు అసభ్యములును క్రమవిరుద్ధములును అనియును అట్టి అసభ్యతా క్రమవిరుద్ధత్వాదులను తొలగించి పెద్దలు చిన్నలకు మార్గదర్శకులై యాంధ్రకవితామ తల్లికి వన్నెపెట్టవలయునని యును లక్ష్మీనారాయణగారి వ్యాసము నందలి సారవంతములగు నంశములు, ఈయంశములను నిరూపించుటకై వారు వ్యాసము నిట్టుల ఉపక్రమించిరి.

"లోకము స్వాతంత్ర్య వాయు పూరితమై యొప్పారుచున్నది. స్వీయభావంబులే పరమప్రామాణ్యములగుచున్నవి. ఈపరిణామ మాంధ్రకవితాను తల్లికినిసంభవించినది. ఆయమయెత్తు వారిచేతి బిడ్డయయ్యె."

ఈపై వాక్యముల వలన లోకము స్వాతంత్ర్య వాయుపూరితమగుట చాలతప్పని వారూహించుచున్నట్టులున్నది. కనుకనే వారు తర్వాత వాక్యములో స్వీయభావంబులు పరమ ప్రామాణ్యము లగుటకు చింతిల్లుచున్నారు. కానిఇదిఅంత దోషముగా మాకు కన్పడలేదు. లోకము స్వాతంత్ర్య పూర్ణమగుట ప్రకృతిసిద్ధము. జరాయుజాండజాది జీవకోటులు మొదలుకొని పర్యాత్మ వఱకుగల సమస్త విశ్వము స్వాతంత్ర్యము గోరుటయే సహజము గాని కోరకుండుట సహజముకాజాలదు. లోకమునన దొక్కటి యుండుటకును అయ్యది అభివృద్ధి నొందుటకును దొలుదొల్త ఒప్పుకొందురేని దానితో బాటుగ సంభవించు పరిణామములనుకూడ అంగీకరింప వలసియే వచ్చును. ప్రపంచమునకే పరిణామమును అంగీకరించి నప్పుడు తదంతఃపాతి యగు ఆంధ్రకవిత్వములో మాత్రము పరిణామము కల్గినచో రాగల తప్పేమి? పైగా తత్త్వాభినిష్టులగు పెద్దలు ఆంధ్రకవిత్వముకూడా (కేవలమొక్క ఆంధ్రకవిత్వమే కాదు.) ప్రపంచము నందలి యన్ని భాషలలో గల కవిత్వముకూడా ఆదినుండి నేటివఱకును క్రమపరిణామముల నొందుచువృద్ధికి వచ్చుచున్నదేగాని ఒక్కమారుగా ఆకసమునుండి యూడిపడి నట్టిది ఎంతమాత్రముకాదనియే తలంచుచున్నారు. ఇది సర్వాంగీకృతమైన విషయమేకదా? అయినచో వీరువందురనేల? ఎత్తువారిచేతి బిడ్డయయ్యెననగా నర్థమేమి? అల్లారుముద్దుగానందఱచే గారవింపబడుచున్నదని యేయగునా? అయినచో పైభావము సమన్వితమెట్లగును? ఉపక్రమవాక్యములందే గమనింపదగిన వాక్యము లింకొన్ని గలవుచూడుడు.

"ఇక్కాలంబున కవనమల్లలేని వారరును ఏదియోకొంచెము భావమున్నజాలును. ఛందోని యమంబులగాని పదసౌష్టవమునుగాని భాషా సాహిత్యమునుగాని పూర్వకవి ప్రయోగంబులంగాని సరకుసేయనక్కఱలేదు. అలంకారంబుల దలపబనిలేదు. నిజముగ నక్కఱలేదా? కావలెనని శాసించు వారు లేరు. + + + కొందఱు సుప్రసిద్ధ విమర్శకుల దృష్టికూడ నీవిషయమై మఱల కుండుటకేమి కతము?."

ఈ వాక్యములు ఆపాత రమణీయములు. ఏగతినో కవిత్వమునకేకులు సెప్పెడి

వారలుండ" అని తిరుపతి కవులు చెప్పినట్టులు గాపేదో విధముగా కవనమల్లువారు అన్ని కాలములలోనుకలరు. కానికవిత్వమును పరికించి అల్లెడివారు అప్పుడునూతక్కువయే ఇప్పుడునూ తక్కువయే! ఛందోనియమములను పదసౌష్టవమును భాషాసాహిత్యమును పూర్వకవి ప్రయోగములను సలకు సేయనివారు అన్ని దేశములలోను అన్ని కాలములలోను గలరు. ఈవిషయమును శ్రీ లక్ష్మీనారాయణగారితో పాటు నేను నంగీకరించెదను. కానివారు ఇప్పుడు తప్ప ఇంతటి విలాసు మెప్పుడును లేదందురు. నేనుఎప్పుడునున్న దందును. వారుభావోద్వేగము చేతకవితా స్రవంతిని వెల్లువలు వారింప దలంచువారిని శాసించుటకై కొందఱు కావలయునని కోరుచున్నారు. నేనట్లుగాక భావోద్వేగముతో పరవశుడై కవితాస్రవంతిద్వారాచిదానందాంబుధినోలలాడుభావనాఘనులను ఛందోనియమాదులు అవరోధింపజాలకపోవుట యేగాక శాసింప దొరకొను శాస్త్రులుకూడన పాస్తతనొందెదరని మనవి సేయుదును. మాకుగలభేద మిదియే.

" ఇట్టి కవికల్పనలు ప్రస్తుతాంధ్రసారస్వతమునందు పెక్కులు గానిపించు చున్నవి. చిత్ర విచిత్ర రీతుల గవితా వధూటి నాట్యము సేయు చున్నది. ఛందస్సుసున్న. ఉన్నచో స్వంతము. "

ఈ వాక్యములందు ఇట్టి కవికల్పనలనగా ఛందో నియమాదులులేని కవి కల్పనలని కాబోలును. ఇయ్యది కేవలము అసత్యము. సుబ్బారావుగారి గేయములలోఈ నియమము లన్నియును గలవు. లేవను కొనుట పొరపాటు. ఛందస్సుకూడా వారు స్వంతముగా రచించినదికాదు. ఇదివరకు వాఙ్మయ కారకు లనేకులు వాడినట్టిది. ఉదాహరణములు వలసి నన్ని కలవు. మున్ముందీ విషయము నిరూపించెద. కాని ఇంతవరకును వ్యాసము నందలి ఉపక్రమాంశములతో బ్రొప్పుచ్చితిని. ఇక విషయమునకు బోదము. అందు తొలి వాక్యములివి.

" యెత్తి నా యెంకి యందలి భావము నెవ్వరికిని వివరింప బనిలేదు. కొదువ విషయంబులందీ యది కవనమని పించు కొనజాలదు. "

లక్ష్మీ నారాయణగారి విమర్శక వాక్యములివి. యెత్తి నాయెంకి భావము నెవ్వరికిని వివరింప బనిలేదట. ఎందువలన? ఈప్రశ్నమునకు సమాధానమును విమర్శకులు ఈయ నలసియున్నది. కాని వారట్టులు చేయలేదు. ఒక్కచేయక పోవుటయేగాక పైపెచ్చు "కొదువ విషయము లాదీయది కవన మనిపించుకొన జాలదు." అనుచున్నారు. విమర్శింప దలచిన ఈపెద్దలు ఇదివరకు కొన్ని విషయములను యెంకి పాటల నుండి ఉద్ఘాటించి చర్చించి త్రోసిపుచ్చినప్పుడు గదా కొదువ విషయములని చెప్ప వలయును. కాని వీరింత దనుక అట్టి కార్యము నేమియు నొనర్పలేదు. శ్రీ లక్ష్మీ నారాయణగారు ఏ కారణముల వలన నైననేమి ఇంత యార్భాటమును చేసి చివరకు విషయమును చల్లగ జారవిడచినారు. కాబట్టి మనమైనను ఈ విషయమును ఓపిన కొలది చర్చింతము.

వెంకిపాటలో భావములేదా ? ఉన్నను అదికవనముకాదా ?

యేట్టి నాయెంకిలో భావమున్నదాలేదా? ఉన్నచో నయ్యది కవనమని పించుకొనునా? అనిపించుకొనదా ? — అన్న విషయము లను చర్చచేయుటకు వెంకిపాటల నన్నిటిని మనము పరీక్షింప వలసి యున్నది. కాని అట్లు చేయుట కిచ్చట తగినంతటి యవ కాశములేదు. కనుక మన మిచ్చట స్థాలీపు లాకన్యాయము ననుసరించి ఏదో యొక్క పాటను ఆదర్శముగా గొందము. అందు నను రోషమునురూపించుటకై శ్రీయుతులు లక్ష్మీనారాయణగారు ఏపాటను ఉద్ఘాటించి ప్రదర్శించిరో దానినిగూర్చియే చర్చింపవలసి యున్నది. కనుక నుపక్రమింతము. వారుద్ఘా టించిన పాట ఇది.

"యెలక జల్మములోన — యెవరమో" నంటి
సిగ్గొచ్చి నవ్వింది — సిలక — నాయెంకి
"ముందు మనకీ జల్మముందోలె" యంటి
తెల్ల తెలబోయింది — పిల్ల — నాయెంకి
"యెన్నాళ్ళు మనకీలె యీసుకము" లంటి
కంటనీరెట్టింది జంట — నాయెంకి ॥

ఈ గేయములో కవిమూడే మూడు చరణములను రచించినను అందు నుప్పది పుటలలోనిముడగ లంతటి భావనా సంపదను గుది గ్రుచ్చినాడు. బ్రహ్మానంద సహో దరమని విబుధులు పేర్కొన్నట్టి రస స్వరూప మును పొందిటి పరిణత బుద్ధులకుగాని వేద్య ముగా నట్టి ఆ యద్వితీయానందము యొక్క కలరూపును మన హృదయములందు ప్రద ర్శించుటకై ఆయన సప్తభూమికా ప్రసా దములందు హంస తూలికా కల్పముల నధి వసితులైన ఆ జన్మభోగులగు నాయికానాయ కులను ఆలంబనముగా గొనలేదు. రసవ్యగ్ర హృదయులగు సరసదంపతుల నూతగా గొనలేదు. కైకొన్నను అందంతగ కవియొక్క భావనాశక్తిని ప్రదర్శించుటకు తావు కల్గదు. గనుకనే ఆయన దినదినము ను మన కన్నులయెదుట నవిరళముగా ననర్థ ముగా నప్రయత్నముగా వాఙ్మన స్సులకు నయితము సాదరాని యానంద మును ననుభవించు ప్రాకృత దంపతులను ప్రేమైక నిధులను మనయెదుట ప్రదర్శించి నాడు. చూడుడు గేయమును మరల నొక్క పరి మననము చేయుడు. బాల్యమునుండి యొకరి నొకరు విడిచి యెఱుగని ఆదంప తులు అంతదనుక సుఖ పరాకాష్ఠను అభివ సించి తన్మయత నొందిన ఆదంపతులు క్షణ కాలము వాఙ్మనసకిని యనిర్వ చింపలేని యానందసారమున మహోత్సాహముతో నోలలాడి యాడి అంతలో మరల ప్రస్తుతస్థితి జ్ఞప్తికిరాగా రాగార్ద్రములగు చూపులతో ఆనందాభివ్యంజకములగు హృదయములతో వర్తమానస్థితిని తలపోసికొను చున్న సమ యము ఇయ్యది. కనుకనే నాయకుడు నాయి కను ప్రశ్నించినాడు- మనమింతటి గాఢమను రాగమునలో అనవచ్ఛేద్యమగు అఖండానంద ము ననుభవించుటకు పూర్వజన్మమున గూడ నిట్టులనే దంపతులమై యుందుమేమో యని ఆతని ప్రశ్నము. ఈప్రశ్నమును విన్న వెంటనే- ఆతవఱకును తామనుభవించిన ఆనం దానుభవములన్నియును స్మరణకు రాగా- వెనువెంటనే లజ్జాభావాదులు అలము కొని తదుద్బద్ధమైన చిఱునవ్వుతో నాయిక

నాయకుని ప్రశ్నమునకు మిగుల నిపుణము గా ప్రత్యుత్తరమును ఇచ్చినది. ఇది మొదటిచరణములోని భావ సంపదయని మనవిచేయుచున్నాను:-

ఇక రెండవ చరణము మొదటిభావాను భవస్థితి గడచి కొంతపరివర్తనము జరిగినది. క్రమముగా ప్రాథమిక స్థితియందు గల మోహాశయము మెల్లమెల్లగా దిగజారినది. మరలచేతనము గలిగి ప్రాపంచికాను భవమునకు ఆదంపతులిద్దరును వచ్చినారు. తా మనుభవించిన ఆనంద మద్వితీయమైనదే కాని శాశ్వతమైన దగునా కాదా యన్న ఆందోళనములవారి హృదయము లుయ్యాల లూగుచున్నవి. అట్టిస్థితిలో నాయకుడు వస్తుతః కొంత ధైర్యము కల ప్రకృతిగనుక ప్రశ్నించినాడు ఏమని? ముందు మనకీజన్మము న్నదా. ప్రశ్న శ్రవణముతో సమానముగానే ఏకకాలమున నాయిక హృదయమునందును ఆందోళనము హెచ్చినది. వస్తుతః ఆమె అధీరహృదయ అందునను ముగ్ధ విచారణ నేయుకొలది ఆమె హృదయమునకు ఆయానందానుభవము అస్థిరమైనదేమోయన్న సందేహము కల్గినది దాన ముఖమునందు అప్రయత్నముగా నిర్వేదమును సూచించుచు వెల్లదనము స్పష్టముగా నావరించినది.

ఇక మూడవ చరణమున్నది- యీచరణమును ముగించుటలోనే కవియొక్క నేర్పంత యును గలదు. క్షణాత్పూర్వము అనుభవమునకువచ్చిన యానందమును తదనంతరక్షణముననే ఉద్భూతమైన సందిగ్ధహృదయతను ఆదంపతుల నిద్దఱిని తుల్యవేగముతో ఆవేగముసు సుడిగుండమున త్రోసి గిరగిరత్రిప్పుచున్నవి. నాయికానాయకులు సమానుభవము కలవారైనను నాయకునికి నాయికకంటె నొక్కింత లోకాను భవము యెక్కుడగుటచేతను పురుషప్రకృతి యగుట చేతను ధైర్యమును పూర్ణముగా నవలంబించి నాయికకు ప్రపంచాస్థిరత్వాను భవమును కల్గించుటకై యెన్నాళ్ళు మనకోలె ఈసులుముంటి అని అన్నాడు. నాయిక ముగ్ధయగుటను అధీరురాలగుటవలనను అప్రశ్నమున కేమియును జవాబు నీయజాలక అశ్రుపులతో ప్రత్యుత్తరము నిచ్చినది. ఈ ప్రత్యుత్తరము లో గల సారము వాక్కుచేతగాని క్రియచేత గాని ఇతరులకు ప్రదర్శింప వీలులేని యట్టిది. సహృదయులు ఎవ్వారిమట్టునకు వారు భావనాబలముచే ననుభవింప దగినది. చదువరులారా! ఇంతటి భావమును మనస్సు నందుంచుకొని కవి యీగేయమును కొన్నిమాసములు శ్రమించి కూర్చినాడేగాని మనవారను కొనురీతిని వెఱ్ఱిమొట్టిగా కూర్చలేదు. నిజముగా విచారణచేసినచో ప్రస్తుతకాలమున నింతటి భావపూర్ణముగా కవితను అందును గేయములలో నిట్టి శయ్యతో వెలయించుట చాలఅరుదు. లక్ష్మీనారాయణగారు ఇందులో ఛందస్సునున్న యనియును స్వాంతమనియువ్రాయుచున్నారు. లక్ష్మీనారాయణగారిసున్న 'కు నేను సంపూర్ణమని యర్థమును కైకొనుచున్నాను. (ఇందులకు వారు మన్నింతురుగాక) కాని ఛందస్సుమాత్రము సుబ్బారావుగారి స్వంతము కాదు. అది యావదాంధ్ర జాతికి పుట్టుకతోవచ్చిన ఛందస్సు. కన్నతల్లి తొట్టిలో నుంచియూచి ఆలించి పాలించి పెంచి పెద్ద వానిని చేయు

దేవ:— (పరిహాసముతో) గౌతముఁడు చాల ఘనకార్యమును జేసెను. ఎంత ధైర్యము! యెంత సాహసము! యెట్టి పరోపకార పారీణత! కాని వాని పొగరునకేమందువు? భూతదయ యఁట! నేను కోలంగూలనేసిన పావురమును జేరదీసి, హృదయమున నాటినయమ్మును బెఱికి పదిలముగ బ్రతికింపఁ బాటుపడుచున్నాఁడు. సేవకుని బంపిన సరకుసేయక కసరికొట్టెను. దేవదత్తుని సామర్థ్యము తెలియదు కాబోలు!

ఆనం:— ఏల నిర్హేతుకముగ క్రోధదూషితమానసుఁడవయ్యెదవు? నిరపాయకరమగు పులుఁగును నేలంగూలనేసిన వాఁడవు నీవు. దాని ప్రాణమును గాపాడిన వాఁడు సిద్ధార్థుఁడు. ఇంకెవ్వరిదా పావురము!

దేవ:— నీన్యాయ్యావిచారణ నటులుండనిమ్ము. దేవదత్తుఁడట్టియవమానముల సైరించువాఁడు కాఁడు.

హిమవత్పర్వతములనుండి సాక్షాత్కరించిన దివ్యమునీంద్రవచనంబుల మనంబుననిడుకొని, శుద్ధోధనుఁడెట్టులేని సిద్ధార్థుని యౌవన ప్రాదుర్భావమైన వెనుక ద్వాదశ వత్సరంబులు రాచ నగరున నిలిపి, తన గాదిలిపట్టి యఖండ మహీమండల పర్యంత ప్రాజ్య సామ్రాజ్యంబు శాసింప, నయనోత్సవముగఁ జూచి యానందింప నువ్విళ్లూరుచుండెను. గౌతముని ప్రాపంచిక సౌఖ్యముల మఱఁగి, పరమార్థచింత పైకిబోకుండఁగ, శుద్ధోధనుఁ డాతనికి వయసు వచ్చినతోడనే, యత్యంత సౌందర్యవతియు, నశేష సుగుణసంపదలు గలదియునగు యశోధర యను కన్యకను బరిణయము గావించెను. ఈతరుణదంపతులు తమ సురూపయౌవనములు ధన్యములుగా, నిరంతర క్రీడల నానంద వార్ధి నోలలాడ, ఋతుత్రయంబున కనుగుణ్యముగఁ బ్రాసాద త్రియమును గల్పించి, వానిచుట్టును సకల ఋతువులందును సంతత వసంతోత్సవ లీలఁ జెలంగు నుద్యాన వాటికల నాటించెను. అందు తమనృత్యగాన నైపుణిచే యువరాజ దంపతులఁ జొక్కింప సౌందర్య విజిత మారకాంతలగు సుకుమార వారవనితా సహస్రంబు నియమించి శోకహేతువగు నిలోకము గౌతముని కంట బడకుండునటుల శాసించెను. కాని బలవత్తరమగు విధిప్రేరణచే, బాహ్యోద్యాన విహారమాణ తత్పరుండై సిద్ధార్థుఁడు మహానీయస్యందనంబు నెక్కి, పురవీధు నేగుచుండ, నొకతరి యొక జరాపీడితుని, యొకమారా కుష్ఠరోగిని, మఱి యొక పర్యాయము మృతకళేబరమును జూచి నోస్నోయమానమానసుఁడయ్యె. నగరువెడలి నట్టడవులకు బోవునను శంక నగరద్వారముల నభిరక్షితములు చేయుచుండెను.

ఇటులుండ నొకపుణ్యదినమున శాక్యసింహుఁడు సంసారమును రోసి సంపదల బరిత్యజించి దేహాభిమానంబువీడి భైక్షకవృత్తిని దేహయాత్ర గడపుచు బ్రహ్మానందము ననుభవించుచుండిన యొక భిక్షుని కర్తవ్యమును నిశ్చయించుకొని నాటికి సకల భోగముల ననుభవించెను. ఆసాయంకాలముననే గౌతమునకు రాహులుఁడను పుత్రుఁడు జన్మించెను. నగరమెల్లను మహావైభవముతో నలంకరింపబడెను. నాగరులుత్సవముల సల్పిరి. నాటిరాత్రి నిశీథి సమయమున శాక్యసింహుఁడఖండ సామ్రాజ్యము నమునంగు సతీసుతులను నఖిలభోగముల దిగనాడి చెన్నుఁడు తోడరా నశ్వరాజము నధిరోహించి నగరు వెడలి నరుణోదయమగుసరికి ననోమాతీరమును జేరెను. అట నుండి చెన్నుని కపిలవస్తు నగరమునకు బంపి సిద్ధార్థుఁడొంటిమై కాషాయాంబరముల ధరించి తత్త్వాన్వేషణకు గడంగెను.

వేదవిదులాయనను దృప్తిపఱుప లేకపోయిరి. ఉరువేల పర్వతప్రాంతముల నారు సంవత్సరము లశనవ్రతము నవలంబించి యోగాభ్యాసము చేసినను వానిమనమునకూరట గలుగదయ్యె. తుదకు నిరంజరా పుణ్యస్రవంతీతీరమున కనతిదూరమున నున్న పిప్పిల వృక్షచ్ఛాయ నిశ్చల సమాధియందుండ గౌతముని

హృదయమున జ్ఞానతేజస్సు ప్రవేశించెను. నాటనుండియు సిద్ధార్థుడు బుద్ధుడయ్యెను. తనకు గల్గిన జ్ఞానోదయము నెల్లరకెఱిగింప నుత్సుకుడై బుద్ధుడాయా ప్రదేశముల ధర్మోపదేశముల జేసి శిష్యుల జేర్చికొనుచు తుదకు మగధరాజమునకు రాజధానియగు రాజగృహమును జేరి దానిని బాలించుచుండిన బింబిసారుని హృదయము నాకర్షించి వానిచే భక్తిపూర్వకముగ సమర్పింపబడిన వేణువనమున శిష్యులతో ధర్మగోష్ఠి గాలము బుచ్చుచుండెను.

కానకగన్న సంతానంబు గావున సిద్ధార్థు విరహ్యముల నిడుమలు గుడుచుటకు మిగుల వగచియు, జేయునదిలేక, శుద్ధోధనుడు హృదయమును బదిల పఱచుకొని, కుమారుని క్షేమ మప్పటప్పటికి దెలిసికొనుచుండెను. తరువాత గౌతముడు బుద్ధుడై వేణువనమున నుపన్యాసములజేసి ప్రజల ధర్మాభిరతుల జేయుచున్నాడనివిని కొంతసంతసించి, యెట్టకేలకు శాక్యమునిని గపిల వస్తునకు రావించి గౌరవించెను. ఆసమయమున ననేకులు బుద్ధునిమతము ననుసరించుటకియ్యకొనిరి. ఆనందదేవదత్తులు సర్వమును బరిత్యజించి, కాషాయాంబరములధరించి భిక్షుకులలో జేరదీక్ష గొనిరి.

దేవదత్తుడు:— ఆనందా! మన సిద్ధార్థుడు లోకమునకెల్లతానొక్కడగురువునని తలంచుచున్నట్లున్నది ఆధర్మోపన్యాసముల జేయుటకు వానికెన్నటికేనివిసువుజనించునట్టుదోచదు.

ఆనందుడు:— సందియమేమి? దత్తా! నీహృదయమింకను శంకాకళంకితమగుటజూడ నాకుగడు విచారముగనున్నది. వినష్టధర్మముల బ్రతిష్ఠించి భూప్రజలధర్మప్రధానువర్తులను జేసి భూతదయను పరమోత్కృష్ట ధర్మముయొక్క ప్రాశస్త్యము తనపవిత్రజీవితము చేలోకమునకు జాటనవతరించిన మహానుభావుడు మనపురాకృతసుకృతవిశేషంబున నామహనీయుని సేవించుభాగ్యమొదవినది.

దేవ:— ఆయినదానిస్తుతిపాఠము! నీమనస్థితి యెట్టిదో నేనూహింపజాలకున్నాను. లోకమెల్ల సిద్ధార్థుని శాక్యముని యని గీర్తించుచుండ మన మనామధేయులమై వానిశిష్యకోటిలో బడి యుండవలసిన దేనా! ఆనందా నీవెన్ని చెప్పినను సరే నేనిట్టులూరును పేరును లేక బడియుండనొండొకని కీర్తిదశదిశల వ్యాపించుచుంట జూచి సహింపజాల.

ఆను:— దేవదత్తా. నీవిట్టి యీర్ష్యాళువు వని నేనెన్నడెఱుగ. అరిషడ్వర్గముల జయింపుమని గదా బుద్ధుని బోధవానికి దాసుడవయ్యెదవే

దేవ:— శ్రావస్తీనగరోపాంతమునందు సంపత్సిఖామణియగు అనాథపిండకునిచే భిక్షువుల యుపయోగార్థ మొసంగబడిన యుపవనమునందా ననాథుడై యింకనొక్క ముహూర్తమాత్రమయిన నుండనోప. అయినను సిద్ధార్థుడు పెద్దవాడగుచున్నాడు కదా నన్నేల తనస్థానమున నియమించుటకిష్టపడడు? ఇంతకు మన మేలవేఱొక భిక్షుక సమాజము నేర్పరచి దానికధిపతులుగా నుండరాదు! గౌతముని యందున్న విశేషమేమి మనయందు లేనిదేమి దీనికి నీవేమందువు.

ఆను:— బుద్ధదేవునకు మనకును గల తారతమ్యము గ్రహింపజాలని నీయట్టివానితో ప్రసంగమేల పనివినియెద శలవొసంగెను.

మగధ రాజ్యమును బాలించుచుండిన బింబిసారుడు బౌద్ధధర్మాభిమాని. ఆయనబుద్ధునియెడ భక్తిగలిగి ప్రవర్తించుట దేవదత్తునకు గిట్టకుండెను. ఆరాజ్యమున నెట్టులేని గౌతముని పలుకుబడిని మతప్రచారము నరికట్టవలెనని దేవదత్తుడు కంకణము గట్టుకొని ప్రత్యర్థి భిక్షుకగణమునొకదానిని నేర్పరచెను. బింబసారుని కుమారుడగు నజాతశత్రుడు పరువంబు కలిమి దొరతనము అరయామి యనునాల్గింటిని గలవాడు. అట్లగుటంచేసి వాడు దేవదత్తునిమాయావాగురుల

లోఁ జిక్కికొని జంత్రకాని గేలకీలుబొమ్మవలె నాడుచుండెను. తుట్టతుదకు వాని దుర్బోధచే సింహాసనము నాక్రమించి పూజ్యుఁడగు తనజనకుని కారాగృహమున కంపి యన్నోదకముల నివ్వక నార్తిఁ గుందించుచుండెను. కొలది కాలమువఱకు తన జననియగు వాసవిని మాత్ర మాయనను దర్శించుట కనుజ్ఞ యొసంగెను. అంత నా పతివ్రత తన యొడుపు మడుపుల కుదుపును కటక కంకణాద్యలంకారములలో నీరము గొని తన ప్రాణ విభున కొసంగుచుండెను. దీనిం దెలిసికొని వాసవినిగూడ జనరాదని శాసించెను. పక్షి పర్వతముపైని బుద్ధదేవుని దర్శించి, సుఖమున నునయించుకొనుట కనువుగనున్న వాతాయనము సహితము మూయించి కన్న తండ్రికి యంధకారావృతమగు నా కారాగృహమున బలవన్మరణమును సంప్రాప్తము జేసెను. ఇట్టి క్రూర రాక్షసుండొక్కనాఁడు తన ముద్దులపట్టి చిటికెనవ్రేలిని చిదుక గొట్టుకొనెనని యక్కున నదిమికొని యనురాగ రసము వెల్లివిరియ ననునయించుచుండెను. అది గాంచి యచటనే చింతచే జివికి శల్యావశిష్టయై పడియున్న వాసవి కన్నుల నుండి బాష్పధారలు కాల్వలుగట్ట కుమారుని దిక్కు మొగమై 'నాయనా! నీ శైశవమున నీ తండ్రియు నిన్నిట్టులే యుపలాలనము చేయ,' అని దుఃఖరసము పొంగి పొర్ల నేడ్చెను. వజ్ర కఠినమగు నజాతశత్రుని గుండె నీరయ్యెను. తోడనే శోకమూర్తి యగు జననికి ప్రదక్షిణము చేసి సాష్టాంగ దండప్రణామ మాచరించి మన్నింపుమని వేడి జనకుని బంధమోచనము జేయఁ పరిజనుల బంపెను. కారాగృహము యొక్క కవాటమును దెరువ బింబిసారుని కళేబరము కఠిన శిలాతలముపై బడి యుండెను. ఆవృద్ధుని శరీరమునుండి యాకలి దప్పుల కోర్వక జీవుఁడెప్పుడో వెడలి పోయెను.

అజాతశత్రుఁడు పశ్చాత్తప్త హృదయుఁడయ్యెను. కాని దేవదత్తుని సాంగత్యము మానఁడయ్యె. ఈ కపట బౌద్ధ భిక్షుకుని దురంతములకు మేర లేకుండెను. గౌతమున కెట్టి యపకారముజేయ లేకుంటి గదాయని తుదకీ యసూయాపరుఁడా మహనీయుని ప్రాణములకు దెగించెను. ధనాపేక్ష గల్పించి దుష్టుఁడగు దాక్షిణాత్యు నొక్కని బుద్ధుఁడు కుటీరములో నుండ యంత్ర సహాయ్యమున గండశిలల దొర్లించి హత మొనరించుట కియ్యకొనునటులజేసెను. కాని యానిర్భాగ్యుఁడును వాని యనుచరులును దమ దుష్కృత్యమును నెరవేర్పజాలక శాక్యముని యెదుట కేగి పాదముల కెరగి తా ముదలంచిన ద్రోహము నెరిగించి మన్నింపుమని దీనాతిదీనముగ వేడికొనిరి. ప్రేమమూర్తి యగు నా పుణ్యపురుషుఁడు వాత్సల్య చంద్రికలు గాయుచుదన చంద్రమండలమున చిఱున గవు మొలక లెత్త వారిని లేవనెత్తి, తనయంతికమున నుంచుకొనెను. అదివిని దేవదత్తుఁడా దారుణకృత్యమును దానేచేయ నిశ్చయించుకొని, గండశిల నొండు గౌతముని పైకిదొర్లింపనది యా మహాత్ముని పాదమును గాయపరచెను. అజాతశత్రునకు సవతి సోదరుఁడగు జీవకుఁడు వైద్యశాస్త్ర ప్రవీణుఁడు. గౌతమునకు గడుంగూర్పు వాఁడాఁ గాయమును ద్వరలో మాన్పజాలెను.

తన యభీష్టము నెఱవేర నందులకు మిగుల వగచుచు, దేవదత్తుఁడు నిరుత్సాహమును జెందక సిద్ధార్థుని జీవితముల హరింప మార్గముల నన్వేషించుచుండెను. అజాతశత్రుని గజయూథములలో నొక మదపుటేనుఁగుండెను. దానిపేరును జెప్పిన పౌరుల గుండెలు తల్లడిల్లును, దానిరాక యెరింగించుటకు కంఠమున నొక ఘంటిక గలదు. దేవదత్తుఁడాయేనుంగు మావటీని లోబఱచుకొని గౌతముఁడు వీధిలో నున్నప్పుడు దానిని విడుచుట కేర్పాటు చేసెను. ఒకనాఁడు శిష్యగణ పరివృతుఁడై, రాజగృహ రాజవీధిని రాచతపసి యేగుచుండ భీకర కరీంద్ర కంఠనిక్షిప్త ఘంటికానినాదంబు వినవయ్యెను. అంతఁ బ్రాణభీతి నొడలి చీరలెఱుంగక, దండకమండలముల దారిం బడవైచి, యొకరు బోయిన త్రోవ నొకరుపోక, శిష్యగణమెల్ల చెల్లాచెదరయ్యెను. కాని శాక్యసింహము చలింప

వాయె. ఆనందుఁడు బుద్ధుని యండ వదలలేదు. ఘీంకృతులఁ గావించుచు, మారి వసగినగతి తన నిక్కన కుఱుకుచున్న దుష్టగజము సమీపించి, శాక్యముని సాధు వాక్యములఁ బలికి, ప్రశస్తమగు తన దక్షిణహస్తమున దానిదేహమును నిమిరెను. అంత నాయేనుంగు పరమ సాధువై, బుద్ధుని ననుసరించి పురవీధుల దిరుగసాగెను. చూపఱు లెల్లరే యద్భుతశక్తి కాశ్చర్యపడ సాగిరి.

కాని దేవదత్తుని హృదయమున నెట్టి మార్పును గలుగలేదు. వాని దుర్బోధలంబడి, బుద్ధుని ధిక్కరించిన భిక్షువు లందఱుఁదిరిగి యా దివ్య పురుషుని సన్నిధికేగి, తమ యపరాధముల క్షమింపుఁడని వేడికొనిరి. సంతత సుస్మితాననుఁ డగు శాక్యముని వారల ప్రార్థన నంగీకరించి, యనుగ్రహించెను.

తుద కజాత శత్రునకు దేవదత్తునియం దయిష్టము జనియించెను. జీవకుని ప్రోత్సాహముచే నా రాజగృహాధి నాథుఁడొక శరద్రాత్రి రాకాచంద్ర మండలము నభోవీధి నలంకరింప, పాలమున్నీరు వెల్లి విరిసినదో యన బ్రహ్మాండము నిండ పండు వెన్నెలలు గాయ, మాకందవృక్ష చ్ఛాయ, తారాగణ పరివృతుండగు రజనీకాంతుండునుం బోలె, భిక్షువుల మధ్య, జ్ఞానముద్రను స్వీకరించియున్న బుద్ధదేవుని జూచి, మహదానందమును బొంది, యా మహనీయుని జ్ఞానతేజస్సుచే తన యజ్ఞాన తిమిరమును బాపికొనెను.

అసూయా పిశాచముచే నావరింపబడిన దేవదత్తుఁడు మాత్రము తన ప్రయత్నములు కొనసాగనందులకుఁ జింతించుచు, ధైర్యమును వీడక, బౌద్ధమతమునకుఁ బ్రత్యర్థిగ వేఱొక క్రొత్తమతమును స్థాపింప సమకట్టెను. కాని వాని దురంతముల నంతవఱకు నెంతో యోపికతో సైరించిన, భూదేవి, యపఖ్యాతిని దెచ్చు కుమారు నందఱిలో నుండి యావల కీడ్చుకొనిపోవు జనకునివలె, వానిని తనలో లీనము జేసికొనెను. పృథివిబీటిక వాలెను. దేవదత్తుఁడు భూగర్భమును జొచ్చెను. కాని బుద్ధదేవుని చరిత్రతోపాటు యీర్ష్యాళువగు దేవదత్తుని చరిత్రయు నాచంద్రార్కము వెలయగలదు.



# జాపానీయ చిత్రవిద్యావృత్తాంతము.



(శ్రీ. రామశాస్త్రి గారు.)

ఒక మ్రానిపై నొక పక్షి విశ్రమించి తురు. స్త్రీపురుషుల యన్యోన్య వర్తనము నది. ఈ యల్పవిషయమును జపానీయ చిత్రనం దేమహిమ ప్రకాశించుచున్నదో, కళా వేత్తలలో వర్తమానయుగమున సుప్రసిద్ధులగు వారొకరు చిత్రించిరి. ఈ చిత్తరువును చూచి సాధారణముగా "ఇందేమున్నది? చెట్టులకును పిట్టలకును మధ్య చిత్రకళారహస్యములెట్లు గోచరములగును?" అని ప్రశ్నింతురు. కాని జపానీయ చిత్రకళాసంప్రదాయము లెఱిగిన వారికి సంశయము రానే రాదు.

జపానీయులే పదార్థమును గాని యల్పమని యెంచి నిర్లక్ష్యముగ చూడజాలరు. చరాచర వస్తుజాలము నందంతర్వ్యాప్తమై యున్న రసరూపమును సందర్శించి యానందింతురు. పశుపక్షుల యందును క్రిమికీటకములయందును నామహిమయె ప్రకాశితమగుచున్నది. చిన్నపెద్ద, మంచిచెడ్డ మొదలగు భావము ...యు జపానీయ చిత్రకారునకు సమానములు. ఈసందర్భమున శిల్పాచార్యులగు అవనీంద్రనాథ ఠాకూరు గారిట్లు వ్రాసియున్నారు. "జపానీయ శిల్పికి సుందరమనియసుందరమని స్వర్గమని, మర్త్యమని భేదదృష్టి లేదు. పరోక్ష అపరోక్షముల యందలి మర్మమును గ్రహించి సహజముగాను సంయతముగాను పరిష్కార రూపముతో నతడు చిత్రించును."



వ్యాఘ్రము.

15 వ శతాబ్దమునాటి... వ్యాఘ్రముయొక్క హింస్రభావము వ్యక్తము.

వారి రేఖాంకణమునకు ఒకవిధమగు భాషాసామ్యమున్నది. ఎడారి, నది, సముద్రము, చెట్టుమున్నగు భిన్నవస్తువులయొక్క (Character) అనగా విశేషత్వమును ప్రకాశించుకొరకు వారు విభిన్న మార్గముల నవలంబింతురు. దీనినే ఇంగ్లీషున (Calligraphy) అందురు. జపాను చిత్రకారుని తూలికయందిదియే ఒక విధమగు ఐంద్రజాలికముగా పరిణమించుచున్నది. వారు తూలికయొక్క రెండు మూడు విక్షేపములచేత అపూర్వమగు సౌందర్యమును ప్రస్ఫుటమొనర్తురు. ఈ సంఘటనము ప్రపంచమునందే చిత్రకారులయందును కాన్పింపదు. దేశాంతరములందలి చిత్రకారులు ఒక విధమగు సైకాలజీ నాశ్రయింతురు. వారి శిల్పమునందును ప్రత్యేక తత్వమేదియు నిర్ణయింపబడదు. వారు విశేషించి తత్వ నిరూపణమునకు పూనుకొనక సహజముగు ప్రేమతో చిత్రించుచుందురు.

జపానీయుల ఈవైలక్ష్యణ్యమును



ముచిజాన్ ఇది పట్టుబట్టపై చిత్రింపబడినది. 9 వ శతాబ్దమునందున్న 'కానోకా' చిత్రించెను ఇంటినుండి బయటికి వెడలిపోవునపుడు తనపూలతోటకేగి పుష్పించిన "పం" వృక్షములనుండి సెలవుగైకొని పోవుట ఇందు వర్ణింపబడినది.

'తావు' పంథీయులు రచించిన యొకకథయందు వ్యక్తమగుచున్నది. చాలప్రాచీనకాలమందున లాంగుమాన్ పర్వతముయొక్క శిఖరమునందు ఒక వనముండెను. అందలి సమస్త వృక్షజాలమును మేఘలోకము తాకునంతటి పొడవైయుండెను. దానిక్రిందిభాగమున పర్వతగుహాయందు రూపాలి అను రాక్షస సర్పము నిద్రించు ప్రాంతములందు ఆవనస్పతి సంచరించుచుండెను. ఒకమారతడు ఆతని ఐంద్రజాలిక శక్తితో ఒక అద్భుతమగు వీణను నిర్మించెను. ఆవీణను గానవిద్యాధురంధరు లెవ్వరును వాయింపలేకుండిరి. చీనా చక్రవర్తి ఎంతో ప్రయత్నమొనర్చి తాను విఫల మనోరథుడయ్యెను. నానాదేశములనుండి విఖ్యాతులగు వైణికులువచ్చి ఆవీణను పలికింప యత్నించిరి. ఆవీణ వారి ప్రయత్నములకు లొంగక కర్కశమగు ఒక ధిక్కారధ్వనిని మాత్రము వ్యక్తపరచెను. వారందరును ఖిన్నులై యంతట తలవంచుకొని వెడలిపోయిరి. అంతట వైణికమండలి యందలి ప్రఖ్యాతుడగు పీవుపండితుడు వచ్చెను.

అతడా వీణను తన కోమలహస్తముతో స్పృశించిన వెంటనే ఆతంత్రులనుండి ప్రకృతి సంగీతము ఋతుసంగీతము. గిరికందరముల సంగీతము నిర్ఝరముల మధురగానము తరంగాయతమై ఒక్కమారు విజృంభించెను. వీణయొక్క పూర్వజన్మము నందలి వృక్షజీవనస్థితి జ్ఞాపకమునకు వచ్చెను.

వసంతుని యొక్క మధుర నిశ్వాసములచే వృక్షములన్నియు శాఖశాఖయందును చిగురించెను. నిర్ఝరములు మర్మర శబ్దములతో శిలావేదికలపై కేళియొనర్చెను. పర్వతసానువులయందలి ఒక్కసారిగా పూవులన్నియు పుష్పించెను. అట్లే గ్రీష్మవర్ష హేమంత శీతరుతువులందలి గానమును జగన్మోహనముగ బహిర్గత మయ్యెను. అన్నియు ముగిసిన తరువాత ప్రేమగానము ప్రారంభ మయ్యెను. వనమునందలి శాఖాప్రశాఖలుయ్యాలలూగ జొచ్చెను.



(4) కోతులు. శిల్పి:—18 శతాబ్దమునందలి "శోషన్" అనునాతడు ఇతడుముఖ్యముగా జంతువుల చిత్రించుట యందు సిద్ధహస్తుడు. 'ఒసాకా,' వనమునందీత డనేకదినములు ఫలమూలముల నారగించి కాలము గడపెను. అచ్చటసంచరించు చుండు వానరముల జీవనయాత్రను లక్ష్యము నందుంచికొనినాడు.

అపూర్వలావణ్య మూర్తియగు సుందరీమణుల వలె మేఘ శకలములు ఆకాశమందు నర్తించినవి. కత్తులఘుణ ఘుణధ్వనితో ఆపై అశ్వముల ఖురధ్వానములతో యుద్ధగానము వినిపించెను. ఆపర్వత గృహాయందు నిద్రించిన రాక్షస సర్పము మైకము వీడి వ్యాకుల గమనముతో సంచరింపజొచ్చెను. అంతట చీనా చక్రవర్తి ఆ వీణాపండితుని సమీపించి ఆవీణారహస్య మేమని ప్రశ్నించెను. అతడిట్లు చెప్పెను.

"మహారాజా తక్కిన వారందరు విఫలులగుటకు కారణమేమనగాతము ఆత్మకథాంశమును గానముచేయ ప్రయత్నించిరి. నేనట్లు గాక వీణాగానమును వీణచేత నేపాడించితిని. వాయించు సమయములందు వీణయేనేనుగా నేనె వీణగా పరివర్తించి నాఆత్మవేదనము నంతను మరచితిని. జపానీయ శిల్పులు రసరూపములను సాక్షాత్కరింపచేసుకొని తమ వైలక్షణ్యములను మరచి పోవుదురని ఈకథయందు మనకు బోధపడినది.

విశ్వమునందలి సమస్త పదార్థములను సుందరములుగా నొనర్పగల మైత్రీభావమొకటి వారియందున్నది. జపానీయులు స్వభావముచే రసోపాసకులు. ప్రాచీన గ్రీకులందువలె కేవల రసోపాసనయే వారియందు గోచరమగును. Gymnastic for the Body and Music for the soul వారి ఆదర్శమిది.

అంతరంగమునందును బాహ్యమునందును సౌందర్యమునే వారుచిత్రించెదరు ప్రాచీనభారతీయులును సౌందర్యము మిక్కుటముగ నభిమానించియుండిరి. గిరిగుహాదుల రామణీయకమును వైచిత్ర్యమును కావ్య నాటకాదుల యందు రమ్యముగవర్ణించిరి. గాని జనసామాన్యమునందు ఆసౌందర్య ప్రియత గభీర భావముతో వ్యాప్తి గాంచలేదు. ఇక వ్యాపించిన దేమనగా ఒక విధమగుధర్మబోధ.



(౫) దృశ్యచిత్రము. ఇప్పటి చిత్రకారులలో నొకరువ్రాసినది. ఇది అంతగొప్పది కాదు. పూర్వకాల చిత్రరువులందలిరేఖా సౌందర్యమిందు కాన్పింపదు.

జపానుదేశమే జపానీయులను సౌందర్య ప్రియులనుగా నొనర్చినది. జపానుదేశము నానావర్ణములతో భాసిల్లు చిత్తరువుల సంఘాటము వలె విరాజిల్లు చుండును. జపానునందే ప్రాంతమున కేగినను చిత్రరచనలే గోచరమగుచుండును. చిన్న చిన్న కొండలు వానిక్రింద చక్కని కుటీరములు ఆకుపచ్చని ప్రాంతముల చక్కని పూదోటలు ఇవిఅన్నియు చిత్తరువులే. అనంత సౌందర్యమునకు ఆకారమైన 'ఫూజిసాను' గిరి పద్మమువలె గోచరమగుచుండును. ఆపర్వతము, భారతీయులకు హిమాలయమువలె జపానీయులకు అత్యంత పూజనీయమై యున్నది.

ఎందరో కవులు తమ కావ్యములందును ఎందరో శిల్పులు తమచిత్రరచనలయందును ఫూజిసానునకు అమరత్వము నాపాదించిరి.

జపానీయులందలిదరిద్రులుగాని ధనికులుగాని పువ్వులపై అత్యంత ఆదరము

కలిగియుందురు. గృహాలంకరణము లందును గృహనిర్మాణమునందును ఆడంబర రహితమును స్వభావరమణీయమును అగుపద్ధతులను వారవలంబింతురు. చిత్రకారుని యెడ వారికభిమానము మెండు.

మన దేశమునందు వలె చిత్రకళావేత్తదరిద్రులై దుఃఖింప నవసరములేదు. జపానుదేశమున ఈకాలమున ససంఖ్యాకులగు చిత్రకారులు సుఖజీవనము చేయుచున్నారు.

ఒక్కటోకియో నగరమునందలి వారిసంఖ్య ఎనిమిది వందలు. సమస్త ప్రకృతితో నీమైత్రీభావమును వారెట్లు సాధింపగలిగిరి. బుద్ధదేవుడు ఈమైత్రీభావమును వారికి మొదట ననుగ్రహించెను. అది ఆదేశమున దృఢముగా నాటుకొనినది.



దరుం (ధర్మము) 15వ శతాబ్దమున 'షోయామి' చిత్రించెను. ధర్మము తన కనురెప్పలను కత్తిరించుకొనినట్లు చిత్రింపబడినది. మామూలు సిరాతో వ్రాయబడినది

మూడవ శతాబ్దమునందు చీనాదేశమునందలి పరివ్రాజకులు జపానునకువచ్చి కన్ఫ్యూసియస్ యొక్క ధర్మమును ప్రచారమొనర్చిరి. ఆరవ శతాబ్దమున బుద్ధుని ధర్మబోధ ఆరంభ మయినది. అప్పటినుండియే జపానీయ చిత్రకళా సాంప్రదాయములు పరిస్ఫుటమైనవి.

జపానునందలి ప్రాచీన చిత్రసంచయితలలో కొందరు చిత్రకారుల నామములు పెక్కులు కానవచ్చుచున్నవి. ఆసమయమునందు రాజకుమారుడగు షొటోకు వారికితగిన ప్రోత్సాహ మొసంగెను. అతడు తన ఆలేఖ్యమును (Portrait) చిత్రించుకొనెను. 'నారా' యుగము (109) నుండి (184) వరకును సుందరములగు అనేక చిత్రములు రచింపబడినవి. 'హోరియూజ్' మందిరమందీ నాడుచాల (Fre_scoe paintings) నిల్చియున్నవి. ఇవి మన అజంతాచిత్తరువులవంటివి. అజంతాయందలి 1వనం॥ మందిర ద్వారమున కెడమ ప్రక్కగా చిత్రింపబడి యున్న బోధిసత్వ మూర్తికిని "హోరియూజి" యందలి బోధిసత్వమూర్తికిని చాల సాదృశ్యమున్నది. "కోకా" అను జపానీయపత్రికయొకటి ఈసంబంధము నిట్లువర్ణించినది. మన "హోరియూజి"

యందలి బోధిసత్వమూర్తికిని యందలి బోధిసత్వునకును గల సాదృశ్యమును పరిశీలించి చూడగా అజంతాయందలి రూపమే మన చిత్రమునకు ఆదర్శమైనట్లు కాన్పించుచున్నది. కాని మన చిత్రమునందలి వర్ణసంయోజనము అజంతా మూర్తి యందలి వర్ణసంయోజనముకన్న కొంచెము ఉత్కృష్టముగనున్నది.

నారాయుగము (అనగా బౌద్ధయుగము) తరువాత "హాయమాటో" చిత్రకారుల యుగమారంభమైనది. ప్రాచీనజపాను దేశమునకు 'హాయమాటో' యని యందురు. అప్పటి చిత్రకారులందరిలోను ప్రఖ్యాతుడైన "కానోకా" అనునాతడు తొమ్మిదవ శతాబ్దపువాడు. ఆతడు ఆలేఖ్యములను దృశ్యచిత్రములను పెక్కులు లిఖించెను. "నారీజల ప్రపాతము" అనునది మిగుల ప్రఖ్యాతమైన చిత్రము. పర్వతశిఖరము రాత్రియందు మేఘాచ్ఛన్నమై యున్నది. ప్రచండమగు ధ్వనితో అత్యున్నత భాగములనుండి జలము ప్రవహించుచున్నది. క్రింద ఒక విశాలమగు వనము నానా పుష్పములతో విరాజిల్లుచున్నది. పిమ్మట టోసాయుగము. "ఇందలి"



శంకరుని కుటుంబము. రాజపుత్రి చిత్తరవు. (కాంగ్రాస్కూలు)

అజంతా శిల్పులు సాధారణముగా చక్రవర్తుల యొక్క చిత్రములను లిఖించుచు వచ్చిరి. మరల పదునారవ శతాబ్దమునందు విఖ్యాతశిల్పియగు "కానోజిన్సు" చిప్రత్యేకమగునొక సంప్రదాయమును నెలకొల్పెను. ఈతని యనుచరులు సహాధ్యాయులు జపానీయుల చిత్తము నొక్కసారిగ ఆకర్షించలేదు. వారికర్మము లిప్పటికిని క్రిమ క్రమ

ముగా అనుసరింప బడుచునే యున్నవి. ఈచిత్రకారుల యందలి విశేషమయినది రేఖ యందు దార్ఢ్యమును వర్ణమునందు ఉజ్జ్వలత్వ మును వెలుగు నీడలయందు అసమాన కౌశ లమును వీరు చిత్రించియున్నారు. ఈమూడు లక్షణములును జపానీయ శిల్పమునందు శాశ్వతముగా నిల్చిపోయినవి.

'కానో' మార్గమున ననుసరించిన వారం దరును మొట్టమొదట చీనాపద్ధతి ననుస రించి దృశ్య చిత్రముల లిఖించిరి. కానో చిత్రకారులలో కోరిన్ ఓకియో మొదలగు ఇతర సంప్రదాయ ములు కూడ మిళితములైయున్నవి. కోరిన్ చిత్రకారులు లక్కపై చిత్తరువుల వ్రాయు టయందు ప్రవీణులు. ఓకియో చిత్రకారులు మిగుల స్వాభావికముగ చిత్రించుటయందు ప్రఖ్యాతిగాంచిన వారు. వీరినామములు జపా నుదేశమున ప్రతిగృహమునందును నేటికిని పే ర్కొనబడుచున్నవి. జపానుదేశముయూరపు తోసంబంధము కల్పుకొన్న నాటనుండియు జపానీయులందరు తమ శిల్పమును హేళన మొనర్చి యూరోపీయు చిత్తరువులందలి చాక చక్యమును చూచి ముగ్ధులై ఆ విజాతీయ శిల్ప సాంప్రదాయములనే స్వీకరించినారు. వీరిలో "గాహో" ప్రధానుడు. అతడు శిల్ప శిక్షణమునకై పాశ్చాత్యదేశములకేగి యుం డెను. 1908 సంవత్సరమున అతడు స్వర్గస్థు డాయెను. అతనికి దృశ్యరచనలయందు నైపు ణ్యమెక్కువ. "యోకోనోగూచి" అనునాతడు ఈతని చిత్తరువులను పాశ్చాత్య చిత్రకారు డగు "టర్నరు" రచనలతో సమానములైన వని అభిప్రాయపడెను.

భారతీయ చిత్రములందెచ్చటను దృశ్యచిత్రములకు తావులేదు. రాజపుత్ర చిత్రవైఖరులందాక కొంతకలదుగాని యద్ది యు నేచిత్రమునకో పశ్చాద్భాగమై (Back ground)యుండును. ఎందుకనగా మన భారతీయులు తమ శిల్పమునకు స్త్రీపురుషుల నాశ్రయముగా స్వీకరించిరి. జపానీయు లట్లుగాక ప్రకృతినే ఆశ్రయముగాగొనిరి. మనలో మానవుడు ముందు ప్రకృతివెనుకగా నుండును. జపానీయులందు ప్రకృతిముందు మానవుడు వెనుకగానుండును. మానవుని శరీరసౌందర్యమునందు వారిహృదికి ఎన్నడును సంచరింపదు. మానవదేహమునందు వారి కేవిధమగు మోహమునులేదు. అందువలననే నగ్నస్త్రీలను గాని దిగంబరులగు పురుషు లనుగానివారు చిత్రింపరు. జపానీయచిత్ర కళ ఓకియో చిత్రకారుల కాలమునందు సర్వజన సాధారణవిద్యయే (Folk art) అయి యుండెను. భారత వర్షమునందెన్నడును folk artఇంతవిశేషముగాయుండి యుండలేదు. అజంతాచిత్రములు ఈశాఖకుచెందినవికావు. కాని రాజపుత్రచిత్రములు సర్వజన సాధార ణములే అయియుండెను. మొగల్ చిత్రమును కూడ(folk art)అనుటకువీలులేదు. ఎందుకన గా వానియందు దర్బారుసంబంధమెక్కువ గా నున్నది. మనముచ్చి వాంద్రకళావైఖరిని మాత్రము (folk art) అనవచ్చును. ఓకియో చిత్రకారులు కొయ్యలతో బ్లాకులు చెక్కి తక్కువధరలకు ఏరమణీమూర్తియో ఏనాటక సందర్భమునో దైనందిన జీవనము నందలి వస్తువులపై ముద్రించి సాధారణుల కమ్ముకొను చుండిరి. ఆకాలమున ననేక

ములగు జాపానీయ చిత్తరువులు ప్రచారము చేయబడెను. కాని ప్రసిద్ధులగు శిల్పులు వానినాదరింపకుండిరి.

ఇప్పుడు జీవించియున్న చిత్రకారులలో టాఇక్కన్‌షాన్ అనునతడు ప్రఖ్యాతుడు. అతడొకమారు భారతవర్షమంతయు తిరిగి స్వదేశమునకు వెడలి పోయెను. వంగశిల్పాచార్యులగు అవనీంద్రనాథ్ ఠాకూరుగారికతడు ఆప్తుడు. ఆతడు అవనీంద్రుని యింట చాలదినములు అతిథిగానుండి అనేక విషయములను గ్రహించెను. ఆతని శిల్పము జపానీయచిత్రకళను యూరోపు చిత్రకళకు బలికాకుండ అడ్డగించినది. అతనినిప్పుడు అనేకులు అనుసరించుచున్నారు. అతడు యూరోపు ప్రభావముచే ఆచ్ఛన్నమైన జపానుదేశమున నిల్చి జాపానీయ శిల్పముయొక్క మహిమా సౌందర్యముల కీర్తించుచున్నాడు. టా ఇక్కాన్ షాన్ ప్రభృతులగు చిత్రకారులను యీ మార్గమునకు త్రిప్పిన మహామహుడు "Ideas of the East" "the book at the ten" ఉద్గ్రంథములు రచించిన "కౌన్‌టు ఒకకూర" అనునాతడు. ఇతడిటీవలనే మరణించియున్నాడు. జపానుదేశము నందీనూతనోత్సాహముతో శాం హావెల్ అవనీంద్రనాథుడు మొదలగు వారిచే మనదేశమందు కూడ ఆరంభింపబడినది. ఆంధ్రదేశమునందును మరికొన్ని రాష్ట్రములయందును భారతీయ చిత్రకళ దినదిన ప్రవర్ధమానమగుచున్నది.

## కృష్ణనినవ్వు.

(బెల్లంకొండ కనకమ్మగారు.)

నవ్వరనాన్నా — నవ్వరకృష్ణా
తళతళలాడే — పలుతీరగపడ
తెలిముత్యమ్ములు — జలజల రాలగ
నీడలుతేలే — నీబుగ్గలపై
మవ్వపు మల్లెల — పువ్వులు పూయగ
కార్తికనెలలో — కాసేవెన్నెల
వెలవెల బోవగ — కలకల నవ్వర
నవ్వర నాన్నా — నవ్వరకృష్ణా—

# భారతీయుల రాజనీతి.



## యుద్ధ సంబంధమగు అంతర్జాతీయ నియమ ములు.



( వి. వెంకట రంగనాధ రావుగారు. )

కొలది వత్సరముల క్రిందటనే హేగ్గునగర మందు అంతర్జాతీయనియమరక్షణ కొరకొక సభను స్థాపించిరి. కాని యింతకంటెను యుద్ధ సంబంధమంగు భారతీయ శాస్త్రము లుదారభావమును వ్యక్తీకరింపు చున్నవి. యుద్ధము ప్రారంభమైనపిమ్మటదూతను చంప గూడదు. కూటాస్త్రముల (కర్రియందిమిడ్చిన తీవ్ర నారాచములు) తోడశత్రువును గొట్టవలదు. విషముతో గూడిన బాణములను, అగ్నివలన నుత్తప్తమైన బాణములను విడువరాదు. రధమునుండి క్రిందికి దిగినిలచిన వానిని, పౌరుష హీనుని, కృతాంజలుని, తలవిరియబోసుకున్నవానిని, యుద్ధమునందు తలక్రిందులైన వానిని శరణాగతుని సంహరింపవలదు. నిద్రింపు చుండినవానిని, డస్సినవానిని వివస్త్రుని నిరాయుధుని యుద్ధమునుతోడ సంబంధములేక యుద్ధమును జూచుచుండు వానిని గొట్టవలదు. ఇతరులతోడ సంగ్రామ మొనర్చుచుండు వానిమీద బాణములు వేయరాదు. సంహరింప జనదు. భగ్నాస్త్రుని గాయములు తగిలి పడిపోయిన వానిని, భీరుని, యుద్ధమునుండి పారిపోవు వానిని సంహరింపజనదు.

ఈనియమములు అంతర్జాతీయధర్మమును నెరవేర్చుచున్నవి. కాని విశేషస్థలముల యందీ ధర్మములు పాటింపబడవు. ఏలయన దుర్మార్గులను దండించుట కట్లుచేయవలసి వచ్చుచుండును కురుక్షేత్ర సంగ్రామమే దీనికిసాక్ష్యము. యుద్ధోపరతుడగు ద్రోణాచార్యుని వధించుట, సాత్యకీ భూరిశ్రవులు యుద్ధమొనర్చునప్పుడు అర్జునుడు భూరిశ్రవుని సంహరించుట, కర్ణుని చక్రము భూమియందు పాతుకొని పోయినప్పుడు కర్ణునివధించుట మొదలగునవి యుద్ధనియమములకు వ్యతిరేకములు. ఇచ్చట దుర్యోధనుడు పరమ దుర్మార్గుడు. పాండవులను లక్కయింట ప్రవేశపెట్టి దానిని తగులబెట్టించెను. వారికి విషమిడెను. ధనము నపహరించెను. రాజ్యమును వశపరచుకొని దాని ననుభవింప జొచ్చెను. రాజసభయందు ద్రౌపదికి మానభంగ మొనర్చెను. బాలుడగు అభిమన్యుని మహారధుల తోగూడి యన్యాయముగ వధించెను. ఇందువలననే కురుపాండవ సమరమందు ధర్మయుద్ధ నియమములు పాటింపబడలేదు.

"నాతతాయి వధే దోషో హంతర్భవతి కశ్చన:
ప్రకాశంవా ప్రకాశంవా మన్యుస్తత్ మన్యుమృచ్ఛతి"
యనినలన నాతతాయి వినాశము సాధింప బడుచున్నది.

### రాజులయొక్క వ్యక్తి నియమములు

శత్రుజయమునకు బయలుదేరుటకు పూర్వము రాజు తనను తాను జయించుకొనవలయును. పిమ్మట సేవకులు భృత్యులు మొదలగువారిని దాన ధర్మముల ద్వారమున సంతుష్టిపరచి వశపరచుకొనవలయును. తర్వాత దేశజనులను నగర వాసులను సుముఖులుగ నొనర్చుకొని దేశముయొక్క స్థితిగతుల ననుసరించి ప్రజా సమ్మతితోడ శత్రుజయమునకు గడంగ వలయును. ఈవిషయమును గూర్చి విష్ణుపురాణ మిట్లు చెప్పుచున్నది.

కామః క్రోధో మదో మానో
లోభో హర్ష స్తథైవచ
జేతవ్యోరి పుషడ్వర్గ
అంతరఃప్రృధివీక్షితా॥

కామము– క్రోధము– మదము– మానము– లోభము – హర్షము– మొదలగు అంతరంగిక శత్రువుల నారింటిని జయింపవలయును.

ఏతేషాం విజయం కృత్వా
కార్యో భృత్యజయస్తథా
కృత్వా భృత్య జయంరాజా।
పౌరాన్ జానపదాన్ జయేత్
కృత్వాచ విజయం తేషాం!
శత్రూన్ బాహ్యాం స్తతో జయేత్

అంతరంగిక శత్రువులను జయించి భృత్యులను వశపరచుకొన వలయును. తత్వాత పురవాసులను జానపదులను సుముఖులుగ నొనర్చు కొనవలయును. పిమ్మట శత్రుజయమునకు ప్రారంభింపనగును. ఇంద్రియలోలుడగు రాజు ప్రజను వశ పరచుకొనజాలడు. అజితేంద్రియుడగు రాజు భోగవిలాసముల యందు దగుల్కొని జాతిని నియమరహితముగ నొనర్చును. అందువలన జాతిబలవీర్యములు క్రోల్పోయి నాశనమగును. యాదవులు స్వేచ్ఛాచార పరులైరి. మానవలోకము పీడింప బడునను తలంపున శ్రీకృష్ణ భగవానుడు వారిని వినాశన మార్గమున నడిపించెను. అజితేంద్రియులగుట వలన వారాత్మకలహముల యందు దగుల్కొని నాశనమైరి. దుర్బలులు– విలాసులు–కాముకులు–మొదలగువారు సామాన్య విషయముల గూర్చి తమలోదాము కలహముల సృష్టించు కొందురు - అజితేంద్రియు డెప్పుడును పరవశుడై యుండును. అందువలన వాని ప్రభావ మెవరిమీదను వ్యాపింపదు. యోగసూత్ర వ్యాఖ్యానమందు వ్యాసుడిట్లు నుడివి యున్నాడు. "బ్రహ్మచర్యజనితమగు వీర్యము లేనివాడు శిష్యుల కుపదేశింపజాలడు"

ఇంద్రియాణాంజయే యోగం।
సమాతిష్ఠేద్దివానిశమ్।
జితేంద్రియో హిశక్నోతి।
వశేస్థాపయితుంప్రజాః (మనువు)

ఇంద్రియ జయరూపమగు యోగము నందు రాజు, రాత్రింబవళులుండవలయును. జితేంద్రియుడగు వాడుమాత్రమే ప్రజలను స్వవశ మందుంచుకొనగలడు. కావున కామసంబంధమగు వ్యసనముల పదింటిని విడువవలయును. వేట, జూదము, దివానిద్ర, పరనింద, స్త్రీలతోడ నామోదము, నృత్యగీత వాద్యములు పనిలేకతిరుగుట అనునవి కామజవ్యసనములు. బంధువులయందు దోషములు వెదకుట సాధుపుంగవుల నిగ్రహించుట ఉత్తములచేత నీచకార్యములను చేయించుట, అపరాధమునకు మించిన దండనను విధించుట, ఈర్ష్య– అసూయ– అర్థాపహరణము వాక్పరుషత్వము మొదలగునవి క్రోధజ వ్యసనములు. కామక్రోధముల మూలమందు లోభముండును. లోభమునుండియే కామము బుట్టుచున్నది. కామమునకాటంకము గలిగినప్పుడు క్రోధముత్పన్న మగును. కావున మున్ముందు లోభమును జయించుట రాజునకు ప్రథమకర్తవ్యము. మద్యపానము జూదము స్త్రీసంభోగము వేటస్వల్పదోషమున కెక్కుడు దండనము వాక్పరుషత ధనాపహరణము అను సప్తవ్యసనములవలన రాజు మిక్కిలి దుఃఖితుడగును. వ్యసనము మృత్యువునందేది యుత్తమమనిన మృత్యువే సర్వోత్తమమైనదిగ దోచును. వ్యసనము దురంత దుఃఖమునకు మూలము. వ్యసనాసక్తుడగు వ్యక్తి క్రమముగ నధోగతి పాలగును. వ్యసనరహితుడు మరణానంతరము స్వర్గమును జేరును. మన దేశమందలి మహమ్మదీయరాజ్య వినాశనమునకు ముఖ్యకారణము భోగపరాయణత్వమేగదా? సామ్రాజ్యమత్తవలనను లోభమువలనను, రోము సామ్రాజ్యమస్తమించినది. భారతవర్షమందలి రాజసూయములు మొదలగునవి సామ్రాజ్యద్యోతకములు. కాని యజ్ఞ

శ్వరుడు నారాయణుడగుటవలన సామ్రాజ్య మదోన్మత్తతగాని రాజనైతిక అత్యాచారములుగాని కలుగకుండెను. అత్యధిక లోభము వలన జాతీయచరిత్ర కలుషితమగును. యూరపు దేశవాసుల లోభమునకు నేడంత్యము గనుపడుటలేదు. వారాఫ్రికాదేశమును ముక్కలు ముక్కలుగజేసి గుటుక్కున మ్రింగవలయు నని కనిపెట్టికొనియున్నారు. కాని వీరు లోభఫలము ననుభవింపక తీరదు. యుధిష్ఠిరుని రాజసూయమందు యజ్ఞేశ్వరుడు శ్రీకృష్ణుడు. ధర్మరాజు సమస్తమును కృష్ణార్పణ మొనర్చి కృతార్థుడాయెను. కాని మదాంధుడుకాలేదు. ఛత్రపతి శివాజీమహారాజు తన సర్వస్వమును గురువర్యుడగు రామదాసస్వామికి ధారవోసెను. పిమ్మట నాగురువరుని రాజ్యమునకు తాను ప్రతినిధియై రాజ్యపాలనం బొనర్చెను. ఇట్టి విషయములతోడ గూడుకొని యుండుటవలన భారతీయ శాసనతంత్రము రాజుల మత్తత కెడమీయకుండెను.

అశ్వమేధయజ్ఞ మందశ్వమును విడచుచుండిరి. కాని యందువలన గూడ భారతవర్షమందలి రాజులు మైమరచినటుల గనుపడదు. యజ్ఞఫలమును భగవానుని యందర్పించుటవలన మత్తత కవకాశము లేకుండెను జితేంద్రియుడు మాత్రమే కర్మ ఫలమును భగవదర్పణము చేయగలడు. రాజుల రాజశాసనమును కర్మయోగమందురు. భగవానుడు గీతలయం దిట్లు చెప్పియున్నాడు. "సకాలే నేహమహతా యోగో నష్టః పరన్తప" కావున పరరాజ్యాక్రమణము సామ్రాజ్యనిర్మాణము, శాసనయంత్రరక్షణము, మొదలగునవి కర్మయోగమునకు సంబంధించినవి. కావున జితేంద్రియుడు కాని వానికి కర్మయోగమునందధికారము లేదు. రాజు జితేంద్రియుడై యుండవలయును.

తన్నుదాను జయించుకొనినపిమ్మట భృత్యుల వశపరచుకొనవలయును. భృత్యులు వశులైయుండనియెడల వారిని సునాయాసముగ శత్రువులు వశపరచుకొందురు. అందువలన రాజ్యవినాశము గలుగును. గృహశత్రువుల మించిన శత్రువు జగత్తునందు మరిలేదు. భృత్యుల మీద విశ్వాసముండుట మానవ స్వభావము అందువలన వారవిశ్వాసులయిన యెడల సర్వనాశనము సంభవించును. ఈ విశ్వాస సంబంధమందుగూడ మనువాక్యమనుసరణీయము. "అవిశ్వాసిని విశ్వసింపవలదు. విశ్వాసినిగూడ నెక్కుడుగ విశ్వసింపరాదు" అత్యంత విశ్వాసమువలన సమస్తము గోల్పోయిన వారిలో ననేకులున్నారు. సురాజద్దౌలా నాశనమునకు విశ్వాసమే గదా కారణము. మొగలుసామ్రాజ్య వినాశనమునకు విషబీజమును నాటినవాడు ఔరంగజేబు. ఏలయన అవిశ్వాసమే కారణము. ప్రజలయందు విశ్వాసములేని రాజును ప్రజగూడ విశ్వశింపరు. విశ్వాసముయొక్క ఫలము విశ్వాసము. కాని "అతిసర్వత్ర వర్జయేత్"

రాజు స్వదేశీయుల సమ్మతి లేని యుద్ధమందు జయమొందజాలడు. ఏలయన దేశీయులు సమరానలమందు దుముకుటకు సంసిద్ధులైయుండవలయును. అట్టి తరుణమున నగరవాసులు ధనము జనము సుఖస్వాస్థ్యములు మొదలగునవన్నియు దేశముకొరకును రాజుకొరకును సమర్పింతురు. జన సాధారణముగూడ దేశముయొక్క సమృద్ధికొరకు సర్వస్వ మర్పించుటకు సంసిద్ధులగుదురు. కావున నట్టిస్థితియందే రాజు పరరాష్ట్రములపై దండెత్తి వాని నాక్రమింప దలచుట కర్తవ్యము.

యుద్ధప్రకటనకు తగిన కాలము

యుద్ధమును ప్రకటించుకాలమును గూర్చి శాస్త్రకారులిట్లు చెప్పియున్నారు "ప్రజలుత్సాహయుక్తులు అనురాగులు దానమానముల ద్వారమున వశీభూతులై యుండవలయును. ధనాగారమునిండ ధనముండవలయును. సైన్యము బలిష్ఠమైస్వాస్థ్యముగల్గి యుండవలయును. శత్రుసైన్యములుబలహీనమైయుండు నప్పుడు యుద్ధమును బ్రకటింపవలయును." ఇంత కంటెను నుత్కృష్టమగు శాసనము మరియొకచోట కానరాదు. వర్షములాగినపిమ్మట పృథ్వి సస్యశాలినియై

యుండును. అప్పుడు సైనికులకు భేదాభావ ముండదు. కావున నాకాలము యుద్ధయాత్రకు తగిన సమయము. మాఘ ఫాల్గుణ చైత్రమాసములు యుద్ధయాత్ర కనుగుణ్యములు. కాని జయముగలుగునను నిశ్చయమున్న యెడల నెప్పుడైనను యుద్ధమునకు బయలుదేరవచ్చును. శత్రువు విపత్తునందున్నప్పుడే యుద్ధమునకు గడంగవలయునను మనువాక్యమను సరణీయము.

## సమర సన్నాహము.

స్వరాజ్య రక్షణకు సంబంధించిన మర్గములను తగిన బందోబస్తు నందుంచవలయును. దేశరక్షణ కవసరమగు సైన్యము నచ్చటచ్చట నుంచవలయును. పరదేశము నాక్రమించుట కుపయోగపడు యాన వాహనములు అశ్వములు, సైన్యము, మొదలగువానిని సమకూర్చుకొనవలయును. సైన్య శిబిరమున కుపయుక్త స్థానముల నిర్ణయించుకొనుచు మార్గమందలి యడ్డంకుల దొలగించుకొనుచు సైన్యమును నడిపించవలయును. గుంటలను త్రవ్వించి వానిని వృక్షశాఖలు మొదలగు వానితో గప్పి యాత్మరక్షణకు వీలగు నట్టి యేర్పాట్లుచేయవలయును. సందర్భము ననుసరించి సైన్యమును దండ-శకట-వరాహ-మకర-సూచి-గరుడ పద్మ వస్త్ర మొదలగు వ్యూహములుగ నేర్పరుప వలయును. అని మనువు జెప్పియున్నాడు. సమ్ముఖమున బలాధిపతియు, మధ్యరాజును, వెనుక సైన్యాధిపతియు, ఇరువైపులయేనుగులును, వానినంటి గుర్రములును, గుర్రముల తర్వాత పదాతులుండుదానిని దండ వ్యూహమందురు.

రథిక—పదాతి—అశ్వారోహి—గజారోహి—అని సైన్యము చతుర్విధములు. నౌకాయుద్ధమును గూర్చియు మనువు చెప్పియున్నాడు. వృక్షములు గుల్మములు పొదలు మొదలగువాని చాటుననుండి యుద్ధమొనర్ప వచ్చుననియు కొలదిసైన్యమైన యెడల సూచీవ్యూహమును రచించుకొని యుద్ధ మొనర్ప వలయు ననియు ధర్మశాస్త్రమందున్నది.

మిత్రులు మొదలగు వారి సంబంధమున నడుచుకొనవలసిన విధులు

మిత్రులు( allies) ఉదాసీనులు (Neutrals) సంబంధమువందునను శత్రువుయొక్క-మిత్రులు మొదలగు వారి యాచరణను రాజుమిక్కిలి జాగరూకతతోడ పరిశీలింపవలయును, శత్రువులకును తనకును మధ్యనుండు రాజుల వ్యవహారములగూర్చి జాగ్రత్త పడవలయును, శత్రువును శత్రువుయొక్క మిత్రుని ఉదాసీనుని మధ్యముని సామదానభేదముల యందేదియోయొక మార్గమున వశపరచుకొనుటకు బ్రయత్నించ వలయును. అసమర్థులయినచో దండోపాయము నవలంబింపవలయును, చివరికు దండప్రయోగమేవిధి. శత్రుపక్షమందలి మిత్రులలో భేదభావము గలిగించుటకు తగినటుల యత్నింపవలయును. శత్రురాజునకును వాని మంత్రి భృత్యులు మొదలగు వారియందు పరస్పర కలహములు బుట్టునటుల చూడవలయును. వారికి ధనమొసంగి వశపరచుకొనవలయును. కాని వారి నెప్పుడును విశేషముగ విశ్వసింపజనదు. యుద్ధమొకప్పుడు తనకొరకును, మరియొకప్పుడు మిత్రులకొరకును చేయవలసి వచ్చుచుండును అని మనువు వ్రాయుచున్నాడు.

## సాధారణ నియమములు.

యుద్ధకాలమందు సైన్యసామంతుల మనోభావములను విశేషభావమున గమనింపవలయును. వారియందు నీతిబలము తగ్గకుండునటుల చూచుచుండవలయును. సైనికులమీదనే యుద్ధమాధార పడియుండును. నైతికబలము లేని సైన్యము విచలిత మగును. కావున నెప్పుడును సైన్యమును ప్రోత్సాహ పరచుచుండుట రాజుకు ముఖ్యకర్తవ్యము. మరియు శత్రువు యెడల సైనికుల భావమెట్లుండునను విషయమును తెలిసికొనుట యందత్యంత జాగరూకతతోడ మెలంగ వలయును. ప్రచ్ఛన్నముగ నెప్పుడునుశత్రువును భయపెట్టుచుండ వలయును. శత్రుసేలనుండి తొలగి వచ్చువానిని మిక్కుటముగ యోచించి కొలువులోనికి దీసికొన

వలయును. శత్రు మిత్ర యుదాసీనుల యందెవరి వలనను పరాభవింపబడ కుండునట్టి యుపాయము నవలబింపవలయును. అను భావములును మనుస్మృతియందున్నవి. జాతీయజీవితమును రక్షింప వలయు ననిన యీమతానుసార మెప్పుడును మెలంగు చుండవలయును. శత్రువు ప్రబలుడైన చోట సాధుపురుషుడగు రాజునాశ్రయించి యుండవలయును. దీనినే సంశ్రియ మందురు. సాధుపుంగవుడన నెవరు? సదాచార సంపన్నుడును ఆపదనుండి తప్పించ శక్తిగలవానిని సాధుపుంగవు డందురు. కాని దుష్టుల నాశ్రయింప వలదు దుష్టులన నెట్టి వారలు?

> "దత్వాను తాపః కృత పూర్వహోమః।
> విమానవాదుశ్చరి తానికీర్తనమ్
> దృష్టిర దానాం ప్రతికూలభాషణ।
> మేవాచ్ఛ నుష్టస్యభవంతి వృత్తయః ॥

శత్రువు ప్రబలుడని దోచిన సామమార్గమున వానిని శాంతింప చేయుటకు ప్రయత్నింప వలయును. యుద్ధమే దప్పనియెడల సైన్యమును ద్విభాగ ములుగ నొనర్చి యొక భాగమును దుర్గరక్షణయందు నియోగించి రెండవ భాగముతోడ యుద్ధమునకు గడంగ వలయును. ఈవిషయమున మనువిట్లు చెప్పియున్నాడు. శత్రువు నోడింపగలమను నాశలేనప్పుడు వెంటనే ధార్మికుడును బలవంతుడు నగు నృపతినిఆశ్రియించుట శ్రేయము. వానినిగురువును సన్మానించినటుల సన్మానింపుము. కాని వానియందు దోషములు గనపడినప్పుడును, దుష్టప్రికృతి యుతుడగు నప్పుడును వానితోడ నిర్భయముగ యుద్ధ మొనర్పుము.

రాజునకు చింతనీయ విషయములారు. సంధి, విగ్రిహము, యుద్ధము, యానము. (శత్రువు నాక్రమించుటకుగమనము) ఆసనము, శత్రువు ప్రత్యుపేక్షా ప్రదర్శనము) ద్వైధీభావము (సైన్యమును ద్విభాగములుగ విభక్త మొనర్చుట. యిందొకటి రిజర్వుసైన్యము రెండవది యుద్ధ మొనర్చునది) సంశ్రయము (సాధుపుంగవులగు వీరనృపతుల నాశ్రియించుట) నృపతి యీయారువిషయములందెప్పుడును జాగ్రత్తగ మెలంగుచుండవలయును. మరియు సమయానుకూలముగ ఆవశ్యకమగు విధమున మెలంగవలయును. సంధి ద్వివిధములు. కొంతమారము నడచినపిమ్మట యుద్ధ మొనర్చు పద్ధతియొకటి స్వస్థానముననుండి భయప్రదర్శన మొనర్చుచు సంధియొనర్చుకొనుట రెండవది ఫలమునను సరించి సంధిద్వివిధములు ఒకటి సద్యోఫలితము రెండవది భవిష్యత్తునందు ఫలించునది. జయమును గాంచినప్పుడే సంధికోరబడవలయును. అదియే సంధికి తగిన కాలము. ధనధాన్యములు మిక్కుటముగ వ్యయపరుపబడక పూర్వమే సంధికి గడంగవలయును. ధనధాన్యములు వ్యయమైనయెడల మిక్కిలి నష్టము గలుగును. వాణిజ్యము నశించును. ధనలోపమువలన రాజకార్యములు నడిపించుట దుస్తరమగును. విగ్రహము ద్వివిధములు. ఒకటి స్వదేశరక్షణముకొరకు. రెండవది మిత్రరాజ్యరక్షణకు. మిత్రుడగు రాజును రక్షింపనియెడలను, మిత్రునికొరకు అతని శత్రువుతో యుద్ధమొనర్పకున్నను ముప్పువాటిల్లును. ఏలయన అన్యదేశముల జయించుటకు సహాయ్యముండదు; ఆక్రమణ ప్రితిరోధములకొరకు మిత్రత్వ మావశ్యకము. సంధి సమయమందుగూడ మిత్రరాజ్యముల యెడల దృష్టియుంచి తగినటుల సంధిచేసికొనవలయును. శత్రువు నాక్రమించుటకు సుయోగము లభించిన యెడల యుద్ధయాత్రను ద్వివిధములుగ నడిపింప వలయును. ఒకటి యొంటరిగ యుద్ధమునకేగుట. రెండవది తగినంత శక్తిలేనియెడల మిత్రునితోడ గలసి శత్రువు నాక్రమించుటకు బయలుదేరవ లయును. శత్రువుయెడల నుపేక్షను ప్రిదర్శించుటగూడ ద్వివిధములు. ధనాగారమున ధనములేనప్పుడును మిగిలిన విషయములు గూడ దుర్బలములై యున్నప్పుడు నుపేక్షను వహింపవలయును. ఏవిధమగు లోటును లేనప్పుడుగూడ అసమర్థుడగు మిత్రునికొరకు శత్రువు నాక్రిమింప జనను. సైన్యమును ద్విభాగములుగ నొనర్పవలయును. దీనివి ద్వైధీ భావ

మందురు. ద్వైధీభావ సంబంధమందు కామందనియమ మందీ క్రిందివచనము గాన్పించుచున్నది. "ద్వైధీభావేనవర్తేతకాకాక్షి వదలక్షితః" కాకియొక్క చక్షువు లుభయదిక్కులకు గనుపడు చుండునటులనే యుభయ దిక్కుల దృష్టి నుంచ వలయును. అలక్షిత భావమునను అతి గోపనముగను సైన్యముల సమకూర్చు కొనవలయును. శత్రువుయొక్క యాక్రమణమునుండి దప్పించుకొనుటకు సాధుపుంగవుడు వీర హృదయుడు పరాక్రమ వంతుడగు నృపతిని యాశ్రయింప వలయును. దీనినే సంశ్రియమందురు. ఈయారువిషయములను రాజెప్పుడును మరువజనదు.

మిత్రులు ఉదాసీనులు గుణములు.

ధర్మజ్ఞుడు కృతజ్ఞుడు సంతృప్తుడు అనురక్తుడు అచంచల చిత్తుడునగువాడు మిత్రుడు. క్రూర రహితుడు మంచి చెడుగుల విచారించు శక్తియుతుడు వీర్యవంతుడు తగు క్షేత్రములయందు దయను చూపించువాడు దాత యగువానిని యుదాసీనునిగ దలంప వలయును.

---

# స్వేచ్ఛ

(వాసిరెడ్డి ఛాయాభాస్కర వరప్రసాద్ గారు)

నేను సంతసింతును స్వేచ్ఛనిర్మలుడుఁగ
జకచక ప్రభలీ నెడుసవిత్పృకరము
లవని జానీక నగతతి నమరుఁగాన
సింధు సెలయేళ్ళపై నాడుచుండుఁ గాన.
హారితసుమమొండు దనకాంతి బరపికొనుచు
వరసమాధి దనర్చిదాపాటఁబాడు
విహగమొకదాని చెంతఁదావిరియుఁగాన
సరసశోభల నెమ్మిపింఛంబువోలె
విప్పునాకసమున హంసపిండురీతి
శారదాంబుద పటలి నిశ్శబ్దముగను
యాత్రసల్పుచు నేగెఁనంగవలన॥
హారిత శిఖిభాసురంబగునట్టికవిత
గతిదనర్చు వనవిపంచి గాడ్పుగములు
యించుగీతంబుల్లల్ల వాయించుగాన
నేనుసంతసింతుస్వేచ్ఛ నిర్మలతను
నాదుభౌతిక శారీరవీధినొక్క
విమలదీధితిఁ జల్లెడు శమనకీల
బాహిరిల్లంగరాక ప్రజ్వరిలుఁ గాన॥

---

* "హరీంద్రు"ని గీతానువాదము.

# భగవద్గీతావళి.

—(:●:)—

[శ్రీ రాజా మంత్రి ప్రెగడ భుజంగరాయ కవికృతము.]

వ. అంత నర్జునుం డిట్లనియె.

గీ॥ మాధవా! కర్మ సన్న్యాస మహిమ దెల్పి
కర్మ యోగంబు మరల ముఖ్యమని తెలియ
జేయుచుంటివి నిశ్చిత శ్రేయ మెందు
గలుగునో వెంట నొక్కటి బలుకుమయ్య.

వ. అనవుడు శ్రీకృష్ణుం డిట్లనియె.

కర్మ సన్న్యాస కర్మయోగములు రెండు
నరయ శ్రేయస్కరంబు తానందులోన
గర్మ సన్న్యాసమునకన్న గర్మయోగ
మతి ఘనంబగు; నెద్దాని నభిలషింప
కద్దియును మచ్చరింపక యిల జరించు
నాతడే నిత్య సన్న్యాసి యనగ జెల్లు.
ద్వేష రాగంబుల జయించు ధీరు డెందు
బంధ మోక్షంబు నవలీల బడయుగాదె?
కర్మ సన్న్యాస కర్మ యోగములు రెండు
భిన్నములటంచు నవివేకు లెన్నుచుందు
రంతియే కాని నొకదాని నాశ్రయింప
గాంచు రెండింటి ఫలము సుజ్ఞాను లెట్టి
పదము గాంతురు యోగు లప్పదము గంద్రు
సాంఖ్యమును యోగమును నొక్క సరణి గాంచు
నతడె సమ్యగ్వివేకుడౌ నండ్రు బుధులు
కర్మ యోగంబు లేక సౌఖ్యంబు నంద
గడిది కష్టంబు యోగ యుక్తుడగు వాని
శీఘ్రకాలంబున న బ్రహ్మ జేరగలడు
స్వాంత శుద్ధియు దేహేంద్రియ విజయంబు
నఖిల భూతంబులకు నాత్మ యైనయాత్మ
సిద్ధమగు యోగి కర్మముల్ జేసెనైన
నంట కెందును తత్త్వంబు నరయు యోగి
కనుచు, వినుచును, వినుచు, మూర్కొనుచు దాకు
చును, జరించుచు, నిట్టూర్చుచును, శయించు
చును, వచించుచు, విడుచుచు, గొనుచు గన్ను
తెరచుచును, మోడ్చుచును, నిజేంద్రియము లింద్రి
యార్థములకేగు గాని యావంతయైన
దాను జేయనటంచు దథ్యమ్మెఱుంగు
నఖిల కర్మల బ్రహ్మ యందమర నిల్పి
సంగమెడబాసి తాల్మినే జనుడొనర్చు
నతడు పద్మ దళంబు తోయమును బోలె
బాపలేశంబు నంట డోపాండవేయ?
యోగి జనులు ఫలాపేక్ష నుజ్జగించి
యాత్మ సంశుద్ధికై యింద్రియముల మేన
మనసుచే బుద్ధిచేత గర్మ లొనరింత్రు
యోగి కర్మ ఫలంబుల నుజ్జగించి
దివ్యనిష్ఠా పరిభూత శాంతిని వహించు
కర్మ ఫల సక్తుడై కోరికల బెనంగ
బడుట నిత్యంబు బంధింప బడునయోగి

సకల కర్మల మనసుచే సన్యసించి
ఘన నవద్వార పురమైన తనువునందు
నెద్ది సేయక యేది సేయింపకయును
నిమ్మల వసించియుండు జితేంద్రియుండు
నాత్మ జనులకు గర్తృత్వమైన, లేక
కర్మములనైన దత్ఫలాకాంక్షనైన
నమర జేయుటలేదు నిరంకుశముగ
ప్రబలుచున్నది మాయా ప్రభావమిట్లు
గైకొనం డాత్మ యెప్పుడొక్కని యఘంబు
నైన బుణ్యంబునైన జ్ఞానకలన
జ్ఞాన మావృతమయ్యె నజ్ఞానివలన
నఖిల భూతంబులును విమోహంబుగాంచు
నట్టి యజ్ఞాన మెవ్వారి కాత్మవిషయ
సిద్ధ విజ్ఞాన వశత నశించునట్టి
వారి జ్ఞానంబు భానుని పగిదిఁ బ్రకృతి
మించు తత్వంబు వ్యక్తీకరించుగాదె
తన్మతులును దదాత్మకుల్ తత్పరాయ
ణమును దన్నిష్ఠులగుచు వర్తిలెడు మునులు
జ్ఞాన నిర్ధూత నిజ సర్వ కలుషులగుచు
నపున రావృత్తమగు పదం బందగలరు.
వినయమును విద్యయును గల్గు విప్రునందు
గోవునందును బదపడి కుంజరమున
శునకమందును శ్వపచునందును సమాన
దృష్టిగలవారె పండితుల్ పృథివియందు
చిత్త మెవరికి సమభావ సిద్ధిగాంచు
వారు సర్గంబును జయించు వారలిందె
బ్రహ్మము సమంబు ఘటియు నిర్మలమునగుట
వార లున్నారుగద పరబ్రహ్మమందు
మోహమును వీడి సుస్థిరబుద్ధిగల్గి
బ్రహ్మము నెఱింగి యా పరబ్రహ్మమందె
నిలుచు ధీరుండు ప్రియమొంది నెమ్మిగనడు
అప్రియమునఁది పరితాప మందబోఁడు
బాహ్య విషయంబులను దగుల్కొడనివాడు
స్వాంతమున నెట్టి సౌఖ్యంబు ననుభవించు
నట్టి యక్షయసుఖము బ్రహ్మానుభూతి
విమల యోగంబు వలన లభించుగాదె
విషయ సంయోగ జములగు వివిధసుఖము
లెన్నగా దుఃఖ బీజంబు లింతె కాక
కలిమిలేములు గలవందు వలన బుధుడు
వానియం దనురాగంబు బూన డెపుడు

ఇంకెతను తాపమున కన్నముంకెనందు
కామరోషజమైన వేగము సహింప
గలుగు నాతండె యోగి సౌఖ్య నిధియనగ
నెవడు దనలోన దాసుఖియించు చుండు
నెవడు దనలోన దారమియించుచుండు
నెవడు దనలోన దాజ్వలియించు చుండు
నట్టి యోగీశ్వరుండు బ్రహ్మస్వరూపు
డగుచు బ్రహ్మను భవసౌఖ్య మందగలడు
కలుషములడంచి సంశయ కలనదుంచి

హృదయము జయించి బహుభూత హితము నెంచి
యిల బ్రవర్తించు నట్టి ఋషీశ్వరులకు
గడక మోక్షపదంబు సాక్షాత్కరించు
నిలిపి మనసుగా మక్రోధముల దొరంగి
తన్నెఱింగిన యమని యమోన్నతునకు
నెల్ల యెడల బ్రహ్మానంద ముల్లసిల్లు
బాహ్యవిషయంబు లెల్ల వెల్పలననిల్పి
దృష్టి భ్రూమధ్య రేఖపై దీటుకొల్పి
ప్రాణమున పానమును నాసికాంతరముల

సమగతి జరింపజేసి చిత్తమునుబుద్ధి
నింద్రియంబుల బంధించి యిచ్ఛగినుక
భయము నెడబాసి మోక్ష తత్పరత గాంచు
ముని యెవండాతడే నిత్య ముక్తుడుగద
యజ్ఞ తపములకును భోక్తయైనవాడు
నెల్ల లోకములకును మహేశ్వరుండ
ముఖ్య మిత్రుండను సమస్త భూతములకు
శాంతిగను మాని యిట్టి నాసత్వ మెఱిగి

# గంజాంమండలమందలి శైవక్షేత్రములు.

( దేశరాజు రామదాసుగారు. )



గంజాం మండలమున శైవ దేవాలయము లనేకములు కలవు. కాని వాని నన్నిటిని క్షేత్రము లనఁజెల్లదు. అందనేకములతి నవీనములు. "దేవాలయము లేని గ్రామమున నివసింపరాదు" అనుసిద్ధాంతము ననుసరించి కట్టబడిన దేవాలయములుగా భావింపవలసి నవే. కాని మైదారుమాత్రము వాని కపవాదములని చెప్పవలసి యున్నది. ఇవినాటి ప్రాచీనము లైనను నాత్యర్వాచీనములు గూడ ననవలసియున్నది. అందు కొన్ని కథలను బట్టిబహు ప్రాచీనములుగాఁ గాన్పించుచున్నవి. వానినమ్మను నమ్మకుంటను కష్టసాధ్యముగాఁ దోఁచును. అవి నిర్మింపఁబడిన స్థలములతిమనోహరములై యాత్రికుల నాకర్షించును.

౧ మొదటిది ప్రతాపపురము నందలి తుంచేశ్వరాలయము. ఇది ప్రభుత్వపాలన స్థానము లందున్నది. దీని ప్రక్కను మహానది (కటకమువద్దనున్న మహానది కాదు; ఉత్కళమున చూడనది యనఁ బహునది) యుత్తర వాహినియై ప్రవహించును. ఆపల్లి యున్ననూరు గజములు తప్పతక్కిన భాగము పూర్వపశ్చిమలగా బారుచున్నది. యుత్తర వాహినియైన గంగానదివలెపవిత్రమని ప్రజల నమ్మకము. ఇచ్చట ప్రతిదినమును శివునకు భోగము జరుగుచుండును. కార్తికమాసమున పల్లుగానగును. మహాశివరాత్రికిని, వైశాఖ మాసము నను యాత్ర యగును. ఇచ్చట మాను సంపెగ వృక్షములు విశేషముగాగలవు.

తుంచేశ్వరుని దేవాలయము నూరు సంవత్సరములకు పూర్వమును గట్టియుండినట్లు తోచుచున్నది. మండపము నవీనముగా నిరువదివర్షములకు మునుపటఁ గట్టఁబడినట్లు తోచును. అందర్వాచీన నాగరకత కొంచెము మెరయుచున్నది. ఈశ్వరాలయము ప్రక్క నారాయణాలయ మొకటికలదు.

తుంచేశ్వరుని గూర్చి యొక కథఁ జెప్పెదరు. త్రేతాయుగమున శ్రీరాములవారు వనసంచారమునకై యిటకువచ్చినప్పుడు తనతో నొకయాన బతుంచకూడ బట్టుకొని, మజిలీకడ తుంబను పూజించి నైవేద్యము చేయకపూర్వము తానేమియు భుజించువాడు కాడట. రామురా నుత్తర వాహిని యగుదీనికడకువచ్చి కొంతకాల మిచ్చట గడపెను. తదుపరి మఱియొక మజిలీకి పోవ తుంచ నెత్తగా నది రాకుండెను. ఏమిరాయని నదితరించు సర్కిలక్ష్మణాదు

తిరుగుబాటు చేయదొడగెనఁట. దాని కతఁడాశ్చర్యమగ్నమానసుఁడై తిరుగ నీదేవాలయము కడకువచ్చెను. అంత లక్ష్మణుడు తనచేసినదానికి క్షమాపణ కోరుకొనెను. దానిని గాంచి రాముఁడంతయు ఈ భూమి, యిచ్చటనుండి పరధనాపహారక మనియు, నవిధేయుల కాలవాల మనియు గ్రహించి నదీసాగర సంగమమును దివ్యక్షేత్రమును నగు శ్రీకూర్మమునకుఁ బోనుద్యుక్తుఁడయ్యు నాతలంపుమానుకొని పంచవటికిఁ బోయెనందురు. అతఁడు పోవునపుడు లింగమును మూఁడు భాగములగునట్లుగీసితుంచేశ్వరుఁడనై కలియుగమున తీరింపచేయుమని ప్రసాదించెనఁట. పూజారులు రామ పాదమనియు, నతఁడు గీసిన గీరలనియుఁ జూపుదురు పానువట్టముమీఁద నొకపాద చిహ్నముకలదు. లింగమును మూఁడుభాగములు చేయు రెండు గీతలున్నవి. స్థాణువు పిండిరాతితోఁ జేయబడెను.

౨ రెండవది కృష్ణగిరి వద్దనున్న ధాడేశ్వరము. కల్లికోట సంస్థానమందున్న కృష్ణగిరి యష్టగిరి గిరులలో నొకటిగా జెప్పఁబడుచున్నది. ఈగిరివద్ద మామిడి తోపులో పదునాల్గు దేవాలయములు కలవు. ఆదుపంచ నారాయణులను వైదు దేవాలయములును, చాముండి యనునొక వైష్ణవ దేవాలయమును కలవు. సత్యసావిత్రి, గంగాదేవి, గణేశ్వరుఁడు, ననుమూఁడు దేవస్థానములును పంచమహాదేవులను నైదు శైవాలయములు గలవు. ఈ యైదు శైవాలయము లందునే గాక యచ్చటనున్న పదునాల్గు దేవస్థానములకును ముక్తేశ్వరునియాలయము మిక్కిలి పెద్దది. పురాతనమైనదిగాఁ గూడ గాన్పించును. ధాడేశ్వరుని దేవాలయమును, గంగాదేవి యాలయమునొక దాని ప్రక్కనొకటి యున్నవి. ఇవి మిగిలిన వానికి బాహ్యభాగమునకు కృష్ణగిరి పశ్చిమ భాగమునకు నగము పాదములకడనున్నవి.

ఇన్నియుండియు నిది ధాడేశ్వరమని యేలఁబిలువఁబడవలెను? ధాడేశ్వరాలయ మచ్చటనున్న వానియన్నిటికన్నను పెద్దదని కాని చిన్నదని కాని చెప్పుటకు వీలులేదు. స్థాణువుమాత్రము చిన్నదనవలసినదే, నంది మాత్రము పెద్దదనుటకు వలను పడకున్నను సాధారణ నందులవలె చిన్నదికాదు. వెంకల యధికారమునకే కాంబోలు ప్రభువుల గౌరవము.

కృష్ణగిర్యుత్తరభాగమునుండి యొక వాఁక వచ్చుచున్నది. దానిపుట్టువచ్చటనో యెవ్వరికి నెఱుఁక రాకున్నది. కాని యది మానవగోచరమగుట నీదేవాలయమువద్దనే. అదికొండనుండి బయటికి వచ్చునప్పుడు ముప్పాయుక్తమై కనఁబడును. కొండనుండి ధాడేశ్వరాలయము క్రిందనుండి యొకవాఁకయు, గంగాదేవి యాలయము క్రిందనుండి మఱియొకవాఁకయు, రెండుదేవాలయముల మధ్యనుండి కొండొకవాఁకయుఁ బ్రవహించి కొండనుండి పదిగజముల దూరములో మూఁడునుకలసి యొకధారగాఁ బ్రవహించును. ఈధారపడుటకై యైదుగజముల చదరమును గజమున్నర లోతును గలిగిన యొకబావి రాతితోఁగట్టఁబడెను. వర్షాకాలమున నాభావి నిండిన వెనుక నీరుపోవుటకొక కాల్వయుఁ గలదు. ఇందునాల్గు కాలములను నీరు

హెచ్చుతక్కువయు లేకయుండును. ఉష్ణకాలమున చలువయు, చలివేళల నుష్ణమునను సముచితముగా నుండును.

ఈమూఁడు వాఁకలలో నొకటి నాల్గంగుళముల లోతుగను నాల్గంగుళముల వెడల్పుగను ప్రవహించును. మఱియొకటి నాల్గంగుళముల వెడల్పుగను రెండంగుళములలోతుగాను బ్రవహించును. మూఁడవది యంగుళమున్నర లోతును మూఁడంగుళముల వెడల్పుగను బ్రవహించును. మూఁడుకలసిన ధార సుమారెనిమిదంగుళముల వెడల్పును నైదంగుళములలోతును గలిగియుండును.

ఈధారల వలననే ధాడేశ్వరమునకుఁ బ్రసిద్ధి వచ్చియుండును. వ్యోమకేశుఁడు విను వాఁక దాల్పుగదా. ధాడేశ్వరమనఁబడుటకు పూర్వము ధారేశ్వరమునఁబడియుండవచ్చును. అనఁగా ధారవద్దనున్న యీశ్వరుఁడు. ఆపేరు వచ్చుటయు నపురూపముకాదు. అచ్చట నున్న కొన్ని దేవాలయముల కట్టిపేరులుకూడ కలవు. ఈశాన్యదిశనున్న స్థాణువున కీశాన్యేశ్వరుఁడనియు, పశ్చిమదిశనున్న యీశ్వరునకుఁ పశ్చిమేశ్వరుఁడనియు, లింగము తెల్లరాతితోఁ జేయఁబడుట ధరణీశ్వరుఁడనియు నచ్చటనున్నవి. నామము విభేద మేర్పరుచుటకేగదా. ఎట్లైనను నిచ్చటనున్న దేవాలయములవలెగాక ధాడేశ్వరునకును రామచండికిని నిత్యాన్న భోగములు జరుగును. కార్తికమాసమందును నాతకన్న మిక్కుటముగా వైశాఖమాసమందును నిరతాన్న భోగములగును.

ఈదేవాలయమునకు మైలుదూరము లోపున నెచ్చటను గ్రామములులేవు. దేవస్థానమునకు కృష్ణగిరి చేరువనున్న తోపున, అనఁగా దేవాలయములకడ మారుతమతి మనోహరముగా నుండును. చక్కని యాశ్రమ మొకటి నిర్మించుకొని యాకుక్రీడలను వసియించుట కతికన్న సౌఖ్యప్రదమైనస్థలము దొరకుటరిది. నీటికి నీరు గాలికిగాలి. ఇచ్చటి నీరును గాలియు నారోగ్యప్రదములు. ఈవాఁక జీవనముల కన్నను బలీయమైన శేలిక కలది. కృష్ణగిరి మేఖలాప్రదేశమున రెండు ఋష్యాశ్రమములు కూడఁ గలవని చెప్పుదురు. కాని వానిని దర్శింప నెండాకాలముగాని వలను పడదఁట.

ధాడేశ్వరుని దర్శింపఁబోవుట కొక రాజబాటలేదు. గట్లఁబడిపోవలెను, కొడ ళాయను గ్రామమునకు రెండుక్రోసులను పురుషోత్తపురమునకు నాల్గుక్రోసుల దూరము నున్నది.

3 మూఁడవది మహేంద్రగిరిపై నున్న భీమేశ్వరాలయము. మహేంద్రగిరి మందసా సంస్థానములోనిది. మందసా రాజీకొండెలకుఁ బోవుటకై కొన్ని సదుపాయములను కూడఁ జేయించెను. కొండపైని భీమేశ్వరాలయమునకు దిగువ నొకబంగళా కట్టించెను. బంగళానకుఁ జక్కని బాట గావింపఁబడెను.

ఈకొండ మందసాకోటకు పండ్రెండు మైళ్లదూరమున నున్నది. కొండపాదముల నుండి శిఖరమెక్కుసరి కెనిమిది మైళ్లకు తక్కువ కాకుండ నడువవలెను. వర్షాకాలమున నీకొండపై నాలుగైదు బత్తెలు పోర్లుచుండును. బంగళాకు దిగువ గోకర్ణేశ్వరాలయ మొక్కటికలదు. ఆదేవాలయము ప్రక్కనొక చిన్నవాఁకకలదు. అదియొండా

కాలమున నుండునట్లు తోచదు. ఆబట్టి ప్రక్క నొకనూయి కలదు, ఎండాకాలమున త్రైర్థికుల కిదియే గతి.

బాగాళకు పైని యగ మైలు దూరమున భీమేశ్వరాలయము కలదు. ఆయాలయము నకు ద్వారముగాని పైకప్పుగాని లేదు. అక్కడ భీమేశ్వరుడు స్వయంభువై యల రారుచుండు. దీనికి ప్రతిదినమును రాగిభోగ ములు లేవు. మాఘమాస మందలి మహాశివ రాత్రినాడియ్యది యవశ్య దర్శనీయము. ఇచ్చట గొప్ప యాత్రయగును. భీమేశ్వరుని దర్శించుటకు మందసా వైపునుండి యేకాక పర్లాకిమిడి వైపునుండి మఱియొక దారి కలదు. ఆమార్గమున ననేక విచిత్రములు కలవని చెప్పుదురు.

పరశురాముడు క్షత్రియ వధానంత రము కశ్యపునకు సామ్రాజ్యమును ధార పోసి తపోనిష్ఠుడై యీమహేంద్రగిరికి వచ్చె నని పురాణములు చెప్పుచున్నవి. అతడు ఖండ పరశుని శిష్యుడగుట జగద్విఖ్యాతము. అతడీ భీమేశ్వరుని పూజించుచు మహేంద్ర గిరియందు నివాసమేర్పరచు కొనెనని చెప్పు దురు. అతనిచే నిర్మింపబడిన సమస్తకూప ములును, అతని యాశ్రమమును కలవని చెప్పు దురు. ఇవి విశ్వాసపాత్రములైనను కాకు న్నను భీమేశ్వరాలయము మిక్కిలి ప్రాచీన మైనదనుటకు సందియములేదు.

**౪** నాల్గవది ముఖలింగ క్షేత్రము. ఇది పర్లాకిమిడి సంస్థానములోనిది. దీని ప్రక్కను వంశధారానది ప్రవహించుచున్నది. ఈదేవా లయ మీమండలమందె కాక చాలవఱకు ప్రఖ్యాతిజెంది యున్నది. ఇదిచాల యెత్తైన దేవాలయము. ఇందష్ట దిక్పాలురచే ప్రతిష్ఠ చేయబడిన శివలింగము లష్టదిక్కుల యందును గలవు. దీని మాహాత్మ్యమును గుఱించికొన్ని కథలను చెప్పుదురు. వానిలో కొన్ని విశ్వసనీయములు గాన్పించును.

ఈదేవాలయమున ద్వారము పట్ట నంత గోలెమొక్కటికలదు. అదిభగివత్క టాక్షముచే నెట్లు కిబోయెనట, సుమారు ముప్పదియేండ్ల క్రితమున, ముఖలింగగ్రామ మున నొకకుమ్మరి వానికి చాలకాలమువరకు సంతులేకుండ నుండెనట, అంతచేవాడు తనకొక బిడ్డపుట్టిన నొకగోలెముచేసి స్వామి సన్నిధినుంతునని మ్రొక్కుకొనెను. సంవత్స రమునాడు వానికొక మగశిశువుపుట్టెను. వాడు తన మ్రొక్కిన మ్రొక్కుచొప్పున పెద్ద గోలెముచేసి ద్వారము పట్టకుండుటకు చింతించి, స్వామిని ధ్యానించి, గోలెమును ద్వారము కడనుంచి యింటికి బోయెను. మఱల ప్రాతఃకాలమున వచ్చిచూడ గోలెము గర్భగుడిలోనుండెను. ఆగోలెము మిక్కిలి గట్టిది. దానిపై టెంకాయలుకొట్టి యీశ్వరున కభిషేకింతురు. అదిపగలదు. గాతికన్న కఠి నము. ఇదిస్వామి మాహాత్మ్య చిహ్నము.

ఇచ్చట ప్రతిదినమును భోగరాగ ములు జరుగును. గ్రామమున కన్నివైపుల నుండియు రాజబాటల సహాయముకలదు. మహా శివరాత్రికిచ్చట గొప్పయాత్రజరు గును. ఇచ్చటికి పర్లాకిమిడి రాజుగూడ దర్శ చువచ్చుటయు కలదు.

**౫** ఐదవది నాగావళీతీరమునయున్న శ్రీకా కుళమునందలి కోటేశ్వరాలయము. ఈకోవెల వెనుక భాగమునొక నాగావళీనది ప్రవహించు

చుండును. శ్రీకాకుళము ప్రస్తుతము చికిత్సలోనికి వచ్చుచున్నను, అది యొక తరము క్రిందట గంజాం మండలము నందలి చాల పెద్దపట్టణములలో నొకటి. ఇప్పటికిని యీకోవెలయందు రాగభోగములు లే కాక ప్రతిసోమవారమునను తిరువీధి సేవచేయబడును. తిరువీధికై యిత్తడి వాహనములు గలవు. ప్రాకారమును మండపమును కడు రమ్యముగా నున్నవి.

ఇక్కడ నున్న విశేషములలో విశేషము నందిజోడు షుమారు వెయ్యి రూకలు చేసిన యాంబోతంతయెత్తరియో యీ నంది యంతయెత్తరి. ఆంధ్రమండలము లందలి సుప్రసిద్ధ మహానంది క్షేత్రము నందలి నందితప్ప తక్కిన నందులింత యుండవేమోయని తోచించును. కాని శ్రీకాకుళమున కారుమైళ్ళదూరమున సింగుపురము కొండల కూడ నింత నంది యున్నదని కొందరు చెప్పుదురు. ఈస్థలమున దైవభక్తి కన్న వ్యవహారయుక్తి మెండు.

ఈపై దేవాలయములే కాక విజయనగర సంస్థానము నందలి శ్రీకూర్మము నందు పాతాళ సిద్ధేశ్వర దేవాలయమును మొదలైనవి కొలవు కాని శ్రీకూర్మనాయకు ప్రసిద్ధివలన ననేక దేవాలయముల ధరభూతము లగుటను శ్రీకూర్మము పాతాళ సిద్ధేశ్వరుని వలననే ప్రాముఖ్యత గాంచక పోవుటచేత ను నిచ్చట జేర్కొన బడలేదు.

ఈదేవాలయములున్న యన్నిస్థలములయందును దేవళ ప్రాకారములలోనో, చేరువనో వైష్ణవాలయములుంట సామాన్యముగా గోచరించును. పైక్షేత్రములకుబోవువారు శైవ వైష్ణవాలయములను భేదముగా జూచుచున్నారు. దీనిబట్టి మనము సనాతనమునుండి శైవ వైష్ణవులకభేదమనియు స్పర్ధమే ప్రబలియుండెననియు దలపవచ్చును. లేదా ప్రతిగ్రామమునందును శైవులును వైష్ణవులునుండిరనియు తమతమ దేవాలయములను స్థాపించుకొనిరనియు రానురాను తమ పూర్వ వైషమ్యములను బోరాడి యేకమైరనియు నూహింపవచ్చును. ఎట్లైనను పూర్వమువలె గాక శైవవైష్ణవ వైషమ్యములు తగ్గుచున్నవని చెప్పవచ్చును. ఇవి పూర్ణముగా నశించుచున్న కొలదియు నాంధ్రభూమి యైశ్వర్యవంతమై, బలయుక్తమై తేజోవంతము కాగలదని బుద్ధిమంతుల నమ్మిక.



# గ్రీష్మ ఋతు వర్ణనము.

( నాళము కృష్ణరావుగారు. )

౧

పాలకడలని వెన్నెలను పవ్వళించె
మంచుకొండను ముక్కంటి మఱుఁగుజొచ్చె
తమ్మిగద్దియపై నెక్కి బమ్మ యుండె
నందనంబున విహరించె నాకవిభుఁడు
మెండుగాఁ గాయు వేసఁగియెండ సెగకు
వేల్పుపెద్దలె యీరీతి వెగడుగుందిన
పుడమి జనముల గొడవలు తెలుప నేల.

౨

వేడియెండల మలమల మాడిమాడి
పాముపడగలక్రింద గప్పలు వసింప
నెమలి పింఛంబు గొడుగులనీడ జేరి
పడగలను వాల్చి పన్నుండ బన్నగములు.

౩

మెండుగాఁ గాయు నెండకు మిడికి మిడికి
నోరు తెఱచుచుఁ జెలువుల నురువుగార
పాలసుముద్దల బోలు నాల్కలు వెలార్చి
మన్నెబోతులు తిరిగె దుంపడుకు నెండి

౪

మిటమిటని గాయు నెండల గటకటబడి
కుత్తుక లెండగ దప్పిచే గొడమలేళ్లు
ఎండల గాటుకెమబ్బులు జలములంచు
బమ్మెరలుచు నాసచే బరుగులెత్తె.

౫

దారుణంబగు నెండకు తాళలేక
నీగ లింకినమడుగుల జేరఁ బంది
మున్నె తెగ్గఁగ పదువాడిముట్టెతోడ
గ్రొచ్చికోరాడె బురదమిం జొచ్చుకరణి.

౬

చండతరమైన యెండకుజలములెండి
పడియయందలి యడుసు గెల్లఁ బగులువాఱ
బీటికలవెంట దనరుడు పాటితోటి
గుబ్బిబొమ్మదాయెఁ మెక్కెఁ గొక్కరాయి

౭

దావపావకకీలల దగ్ధ మొంది
చెట్లయాకులు సుడిగాలిచేత రేగి
గగనముల బల్లటీల్ గొట్టి యెగురుచుండ
పావురము లంచు డేగలు పట్టఁ దరిమె.

౮

దండిగా గాయు నెండలు దాళలేక
పాదపచ్ఛాయ నిదురింప పాంథజనులు
మాటిమాటికి దావుల మార్చిమార్చి
పొరలి యాడిరి నీడలు జరుగుకొలది.

౯

మల్లెపువ్వులు సిగదాల్చి మచ్చుల [illegible]
చేరకు రసమాన గానుగుచెంత జనము
కూడె రానున్నవృష్టికై గ్రుష్మ మోంచి
మధువుచుట్టును మూగు చీమలో యనంగ.

౧౦

మిగుల గాసిన మిడియెండ బొగిలి తమ్ము
నాశ్రయించిన జాహ్నవీయమున లనగ
మల్లిపులతోఁడి కీల్జడ ల్లాడ
చలువ పందిళ్ళ బొలిచిరి జలజముఖులు.

౧౧

లలిత మంజీరరవ మొప్ప లత్తుకలను
జొత్తువాఱిన పదములు శోభిలంగ
అమల పటముల దాల్చి రాయంచ లనఁగ
మందయానలు నడచిరి మద మెలర్ప.

౧౨

భాను తేజంబు జలముల బ్రజ్వరిల్ల
హ్రదము లొప్పారె నెండిన నదులయందు
వార్ధివిరహాగ్నిఁ బాయుస్రవంతి కాంత
అలుతఁ దాల్చిన ముత్యాలహారము లన

౧౩

చండ మార్తాండు నెండకు మండి మండి
జగము దరికొన గాలిచే నెగసినట్టి
బూది యో యన బూరుగుదూది పిగిలి
పింజపింజగ నంబరవీధి కెగిరె.

౧౪

చండతర మైన వేసంగియెండసెగకు
పుడమి నడుగూని నడవఁగ నడలుచున్న
జనుల బడలిక వెడలింప జలజభవుడు
వారియనుగుల మనుగులఁ బరచె ననఁగ
నెండమావులు మెఱుఁగ గండుకొనియె

౧౫

వాన గురియించి మును దన్ను వార్ధిఁ గూర్చి
జీవనంబుల నిలిపిన చెలిమికాఁడు
కాన, నిప్పుడు గ్రీష్మునిఁ గాంతు గూర్చ
ననుచుఁ గాన్కగ విత్తమాఘునున గొనఁగ
కరచరణంబుల బైడి సూకలను దాల్చి
గ్రీష్మవిరహాగ్ని తప్త సరిల్లతాంగి
బాళి మింటికిఁ జాఁచిన బాహు లనఁగ
ఉదకి మిపురంగఁ బాఱిన నదులయందు
వాళములు కేలు, చేకులు వ్రేళులుగను.
కర్ణికలు స్వర్ణటంకముల్ గా వెలుఁగ
నంబుజాతవితానంబు లలరుచుండె.

౧౬

ధరణి దాచిన తేమరసద్రవ్యమెల్ల
నబ్జబాంధవ కిరణాళి యపహరింప
వేగ నింద్రునితో మొఱవెట్ట నేగు
పాడువాఱిన నూతుల పగిది దోప
సుడియు సుడిగాలిచే రేగి చుట్టుదిరుగు
తృణ కణంబులతో రజఃకణము లెనసి
గగనమున మండలాకృతి నెగయుచుండె.

౧౭

పగటియెండల సెగలకు మిగుల గ్రాఁగి
పుడమి పైనమున గట్టావిషాగలు లేవ
ప్రీతిమీఱ జకోరక పోతములకు
తోసెలను వండ పిండిని బోసిరనఁగ
మఱికు వేసంగి వెన్నెల మెండుకొనియె.

౧౮

బెట్టిదం బగు వేసవి వెట్టకతన
చెఱకు పీలుకానిమే నెల్ల జెమట వట్టి
కేల దుసికిలి విలు జాఱె నేలగూల
నాటుకొనె గాదె చెరకులు నాటగోల.

౧౯

మొనసి తనలోన రాయిడి గొనిన యట్టి
యున్నతం బైన వంశంబు లొక్కపెట్ట
నీల్గుటయు గాగ త మాశ్రయించి మెలగు
ఘనతరుల గూడ బొలియించు ననెడినీతి
దెల్లముగ నెల్లవారికి దెలుపులీల
చండతర మైన మండు వేసంగియందు
వెదురు లొండొంటి నొరయుచు భీకరగతి
కాలిదరి నున్న మ్రాకుల గాల్చివైచె



# హిమబిందు



## పన్నెండవ ప్రకరణము.



### 'నేనును మనుష్యబాలికనే'



సభ్యులందరు భీతులై వైవర్ణ్యమొందిన మోములతో దావానలముఁజూచు అరణ్య మృగములవలె వణకిరి. స్థౌలతిష్యులు వికృతానందముతో కలకల లాడు పెదవుల నొక శంఖమొత్తుటయు పలువురు సేవకులు విచ్చేసి యా శవమును తరలించిరి.

మలయ నాగుడు ఆంధ్ర దేశములో నివసించు కొన్ని నాగ వంశములకు ప్రభువు. ఆంధ్రులను ఆర్య తెగవారు ఆంధ్రి భూముల నాక్రమించు కొనని ముందుఆంధ్రదేశమునంతను నాగులాక్రమించుకొని యుండిరి. ఉన్నత శరీరులై శ్యామలాంగులై నాలు గుత్తర భూములనుండి వచ్చి దక్షిణాపథము రామాయణము కాలమైన వెనుక నాక్రమించిరి. అంతకుముందే స్వల్ప సంఖ్యాకులగు నాంధ్రార్యులు కృష్ణవేణీ ముఖ ప్రాంతము ననివసించి యుండిరి. పాండవకాలమునాఁడార్యులు విరివిగావచ్చిజొ నాగదేశముజొచ్చి నాగులతో సంబంధ బాంధవ్యముల నెరపు చుండిరి. ఉలూపి కథయు పురుకుత్సుని గాథయు నిట్టివియే. ఇప్పటి బలిజ, తెలగ, కమ్మ, రెడ్డి మొదలగు శాఖల వారా నాగవంశాకులే.

మన కథాకాలము నాటికి బ్రాహ్మణక్షత్రియ వైశ్య జాతుల వెనుక వీరు ముఖ్యస్థాన మాక్రమించి యుండిరి. వీరిలో చాలా మందికి సామంత రాజ్యము లుండెను. అట్టివారిలో మలయ నాగుడొకడు. నాగు లందరును బౌద్ధమతావలంబకులే. కానిపట్టుదల గలిగిన బ్రాహ్మణులు కొందరు వీరికి హిందూమత దీక్షయిచ్చి తమ వైపునకు తిప్పికొని వారిచే మిక్కుటముగ సహాయము నొందుచుండిరి. బౌద్ధులలోగూడ వివిధశాఖ లున్నను, వివాహాది విషయములలో నవి యంత పాటింపఁ బడకుండెను.

సభ్యులలో భయ మిసుమంతయు తగ్గలేదు. మహావనశాల గ్రామమున సభా కార్యక్రమము నిర్వర్తించిన యా నూతన వ్యక్తి లేచి బెదరుపిలుపు

కన్నులతో స్థాల తిష్యుని దిక్కు మొగంబై యిట్ల నియె. "మహా ఋషీ! మలయ నాగుడు నాగులలో గౌరవనీయుడు. అతఁడు మాయమగుట ప్రజలకును, ఆంధ్ర రాజునకును తెలిసిన నట్లయిన మన జీవ యాత్రలు ధాన్యకటక కుడ్యాంతర్గర్భిత పాతాళ గృహంబులగడపవలసినదే! ఇప్పుడుమనకుదారియేది!"

స్థాల:— ఓ శివభూతీ! నీవు మాగధుఁడ వగుట తెలిసి పోయినది. మలయ నాగుని ఇప్పుడు ఓషధీరసంబుల చెక్కు చెదకుండును. ఏ భక్తునకు ఫాలనేత్రుడు సర్వసృష్టి కారణుడు మహా లింగమూర్తి సర్వ విషశక్తుల నిచ్చెనో యాతనికాపరంజ్యోతి వాసి విరుగుడుల ప్రసాదింపడా. సర్వభువన దగ్ధ హాలాహాల విషంబుల నవలీలగ్రావిన లోకేశ్వరుఁడు విష నివారణ యంత్రముల నాతని పాదముల భజించు భక్తులకు సమకూర్పడా అప్పుడేమలయనాగుని శరీరము ఓషధులతడుపబడెను. మహావిష పూరితయగు నాబాల! నా ప్రాణమునకుప్రాణము! నా కోర్కెలకు నిధానము. చంద్రబాలఅమృతాధరి యొక్క నాసికాంతర్గత నిశ్వాసములవడిని తగ్గింప ఒక వారము దినములు పట్టును అంతవరకు నా తుచ్ఛుఁడటుల పడియుండ వలసినదే.

అవృద్ధుఁడు కన్నుల మెరయు కిరణములు ప్రజ్వలింప ఉచ్చైస్స్వనముతోనిట్లనియె. "సభాసదులారా మీరే యిట పంచాయితీ దారులు కండు. నా బాలను పరమేశ్వరున కంకిత మొనర్చితిమి పవిత్రమై వేదమత పునరుద్ధరణార్థమై ఉత్కృష్ట భావి ఫలపూజ్యమగు నొక మహాకార్యమునకు నియోగించిన యీశుభాంగి యందు పాతక మొనర్పనెంచినయీకర్మఛండాలుడు జీవింప వలసినదేనా! ఒకవేళ జీవ మిచ్చిన ఈ దైవాయుధమగు నీ బాలయందు మరులుకొని మన ప్రయత్నముల భగ్నము చేయడా?"

మహేశ్వరానందుడు:— స్వామీ! ఈతని మరణ మెట్లు గప్పి పుచ్చగలము?

స్థాల:— రెండుదినములలో, నొకరథము ఈతని శరీరమును ఈతని గ్రామమునకుఁ గొనిపో గలదు. ఊరిబయట చేతనొక కఱ్ఱతో నీతఁడు పడియుండును. ప్రక్కనె నాకడ నున్న పామొకటి నడుము విరిగి కాలికడె నుండును. ఆతని కాలిమీద పాముకాటు స్పష్టముగ కనఁబడును.

అక్కడనుండు సభ్యులకు దేహము జలదరించెను.

వికృతహాసముచే భీత్నమగు తాతగారి మోము చూచుచు అమృతాధరి చటుక్కున వచ్చి యాతని పాదముల కడ మోకరించి వానిపై మోముంచి కన్నుల నీరు వెల్లువలుకారనిట్లు పలికెను "బాబయ్యగారూ! ఆమనుష్యుడన్న నాకు అసహ్యము, కోపమే! వానిని భస్మీకరణమొనర్ప నేకోరితి. కాని—ఇప్పుడు నావలన—నాతడు—మృతుడగుటకే నోర్వలేను—వానిని రక్షింపుడు—వానిని బ్రతుకనిండు"

స్థాలతిష్యుడు విసుగుదలతో నామెను లేవనెత్తెను. ఈమె ఓర్వలేక పోవుటయేమి. ఈబాలిక తన చేతిలోని శస్త్రము! సహించుట సహింపక పోవుట యెట్లు? చిన్నతనమునుండియు నీమెకు హృదయము నశించునటుల తా నొనర్పలేదా? ఈమె సుకుమారాంగముల క్రూరత్వము నింపినాడు, మృత్యువును పూరించినాడు. ఎన్నిసారు లీమె పసి బాలికయై యుండ లేగదూడల హరిణముల ప్రాణములు హరించి అది ఆటగా కిలకిల నవ్వలేదు? ఇది యేమి, ఇదియేమి?

స్థాలతిష్యుని భ్రూయుగ్మములు దరిచేరినవి. ఆతని విశాల ఫాలమున నున్నతభూమియందువలె ముడతలు వేనవేలు జనించినవి. ప్రస్తుత మీకన్యకా హృదయమున కింకను క్రూరత్వమే పోసెదగాక యని యాతడాలోచించుకొనెను "అమ్మాయి!

దేహము కౌగలించి నిన్ను ముద్దియ్యనెంచి యాపాపి నీకడకు వచ్చినాడు. నీవు పుట్టినది ఉన్నతకులమున, వాడు నీచుడు. నీవు వానిని మోహించినావా. వాడు నిన్ను ఒడిచేర్ప నీకు ఇష్టమా, నీభుజములు గట్టిగా పట్టిన పట్టువలన ఎరుపెక్కి కందినవే! నీ పెదవుల వాడంటియున్నచో నీకు సంతోషమా! ఎంగిలియన్న అసహ్యమని పలుసారులు నీవు నాతో చెప్పియుండలేదా! దోషము చేసినవారిని దండించెదము. నీయెడ గాఢమగు దోషమొనరింప నాతడు సంకల్పించెను. అట్టివానికి మరణమే. మనుష్యుడిచ్చు శిక్షకు నివృత్తియున్నది. భగవంతుడొసంగు దండనము మానవుడు తప్పించ నెంచిన అతడధోగతి పాలగును. నీకడ కాతడే తెంచి మ్రగ్గిపోయెను. అతని పాపమున కాతడే యనుభవింపవలెను."

అమృతాధరి యెట్టకేల కాతని మరణమున కనుమతించెను. సభ్యులు భయముతో నల్లెయనిరి.

స్థాలతిష్యులంతకు మహేశ్వరార్చన చేయ నారంభించెను. పవిత్ర మంత్ర పారాయణము జరిగెను. సమస్త పుష్పపత్రిపూజ స్ఫటిక లింగాకార మూర్తిని ముంచివేసినది. నాల్గువేదములు పఠన మొనర్చిరి. దీపారాధన అయినది. నైవేద్యార్పణము జరిగెను. స్థాలతిష్యు లాపుష్పముల కొన్ని తీసికొనివచ్చి విషబాల మూర్ధమున నుంచి సంస్కృత భాషతో నీపాట గాన మొనర్చెను.

"చండ మహానల ఫాలవిలోచన
దండధరా ఖలగర్వ విదారణ
అండజ వాహన మిత్ర శుభంకర
హర! హర! హర! హర! యీశ
మహేశ మహేశ మహేశ ||

## పదమూడవ ప్రకరణము.

### —యౌవన ఫలము—

ప్రహార కుమారుడు హిమబిందునుచూచినాడు. మహావైభవముతో శకటపరీక్షయందు విజయియై ఇంట ప్రవేశించినాడు. విజయము గాంచిన సంతోషమంతయు నాతని ముఖమున కన్పట్టకుండెను.

ఆ బాలయెవరు, సార్వభౌమ కుటుంబములోని బాలిక కాబోలు ఎవరైనచో తనకేమి. కాని అట్టి సర్వాంగయన సౌష్ఠవము కలిగిన సుందరీమణి ఏదేశమునందు కనబడదు. ఇంతవరకే చెక్కడమూ ఏచిత్రరేఖనము అంత అందముగా లేదు. ఆభుజరేఖలు సువ్వున జారి అంగుళీరేఖలలో తేలిపోయినవి బాహుమూలమునుండి పార్శ్వరాజిద్వయము వక్షోపరి భాగ పరిసరంబున విపులమై మనోహర వక్రాకృతిపతనంబున సన్నమై కటిప్రదేశముల చక్రాకారత దూరమై అత్యద్భుతముగ మీగాలులంటి పదరేఖలలో మిశ్రమైపోయినవి. అట్టి సౌందర్యరాశిని గన్నందుకు ధాన్యకటకమే గాక ఆంధ్రదేశము పవిత్రమగుచున్నది. ఆబాలికా విగ్రహము చెక్కని శిల్పియొక్క విజ్ఞానము, ఆరూపము లిఖించని లేఖకారుని ప్రజ్ఞ వృథా! వృథా!! తాను తప్పక ఈ రెండుమార్గముల ఆమె సుస్వరూపము లోకమునకు చాటువాడు. కాని ఆమెకడ ఏదియో లోటున్నది.

ఈయాలోచనలు ప్రహార కుమారుని హృదయము నాందోళన పరచుచునే యున్నవి. అతడామె విగ్రహము చెక్కుటకు సంకల్పించెను. కాని అది యేమియు సఫలముకాలేదు. ఎన్నడును జరుగనిది ఒకటి రెండు శిలలాతడు పాడుచేసెను. విసువు చెంది యాతడా ప్రయత్నము మానివేసెను, చిత్రలేఖనమునందు నాతడు వర్ణముల వృథాచేసెను. ఆమె అందము మానవాతీతమగుటచేతనా ఇట్లు తాను విఫల మనోరథుడగు చుంటయని యాతడను కొనియెను. లేక ఆమె విగ్రహమునం దేమైన లోటున్నదా ?

ప్రహార కుమారునకు స్నేహితు లెవ్వరును లేరు. "ప్రహారా యని పలుకరించి, వీపుతట్టి వేళాకోళములు చేసి నవ్వులాట లాడినంత మాత్రమున

స్నేహితులు కారు. అట్టివారన్న అతనికి అసహ్యము సోమదత్తాచార్య వ్యాయామ ప్రదేశంబుల తన దేహము కండలు కట్టించుకొనుచున్నప్పుడేమి కృష్ణానదీకూలమున నున్న అమరావతీ పరిషత్తు శాసనంబుల విద్యా రహస్యంబుల నేర్చుచున్నప్పుడేమి ప్రహారకుమారుని స్నేహితుడు ప్రహార కుమారుడే. పదునారవయేటనే విద్యమాని తండ్రికడ శిల్ప చిత్రలేఖనాది జ్ఞానంబుల లవరచుకొనుట సాగించి నప్పటి నుండియు మరింత ఏకాంత జీవియై తన కళాపరిశ్రమయే తనకు మిత్రుడుగా మెలంగుచుండెను.

స్నేహితు డెచ్చటనుండి వచ్చును ఇప్పుడాతని తోటి వాడొక డుండని లోటు కాన్పించినది. ఇంటిలో చెల్లెండ్రతో నప్పుడప్పు డాటలాడు వాడు. వారిప్పు "డన్నయ్యా" యని కడకు వచ్చి నప్పుడు లేనిసంతోషము మోమునకు తెచ్చికొని ఒక నిమిషము మాత్రము వారితో సల్లాపించి "అమ్మాయీ నాగ బంధునికా, మీరువెళ్లి ఆటలాడు కొనం డమ్మా" అని యాతడు వాక్రుచ్చును. కాని అప్పటికిని ఆతడు చిన్న చెల్లెలగు సిద్ధార్థినిక వదలునది కాదు. విసవు కలిగి ప్రహారకుమారుడు చెల్లెలిని కోపపడునాడు.

సమరకుమారుడు కుమారుని యవస్థగాంచి యాశ్చర్యపడెను. ఎప్పుడును శిల్పగృహమునందో లేక వ్యాయామ ప్రదేశములందో కాలము గడపు వాడు బండి పందెముల విజయము గాంచిన నాటనుండియు పరధ్యానముతో పనిచేయ కుండుట కాతనికి విచిత్ర మయ్యెను. సమర కుమారుడు భార్యనుం జేరి; "అబ్బాయి విచారముతో నున్నాడు. కారణమేమో నీకు తెలిసినదా!" యనిపలు కరించెను. శక్తిమతీదేవి భర్తనుకనంగొని "నాకునూ దట్టినది. ఏమయి యుండును. భోజనము తిన్నగాచేయుట లేదు. ఏవో రెండు మెతుకులు నోటవేసికొని ఎక్కడెక్కడనో తిరుగుచుండును." అనిజవా బిచ్చెను.

సమర:— ఆ సంగతి ఎన్ని దినముల నుండికనిపెట్టినావు

శక్తి:— మొన్న పందెములు జరిగినప్పటి నుండియు ఒక వేళ ఏబాలిక పైననా మనసుం గొన్నాడేమో చిరంజీవి.

సమర:— వాడికేమి మరులేమి! ఇప్పుడు చిరంజీవికి మానస పథమున మహోత్కృష్టమగు మార్పు జరుగుచున్నదని నాతలపు. పందెములకు బోయి నెగ్గివచ్చినాడు బాహుబలగర్వ మొందుట కంతకన్న ఏమికావలయును. దేహబలమునకు ఆయుధ వ్యాపారమునకు దగ్గిర బంధుత్వము. యుద్ధములో కీర్తిగొనుట సురాపానము చేయునట్టిది. ఆనాడు అనేక బిరుదావళులు ధరించిన మేటి మగలగు శూరుల చూచినాడు. తానును జయశీలుడైనాడు ఆసమయమునందు వారివలెనే యుద్ధమున పేరుమోసి మహాసైన్యాధ్యక్షులలో నొకడేల కాకూడదు? ఈఆలోచన లొకచోట తెలిసినదా! వీనినన్నిటి కతీతమై పవిత్రమై సత్యప్రయత్నములలో నొకటై పరమాత్ముండగు బుద్ధదేవునకు ప్రియమై వెలుగునది, నిర్వాణ మార్గములలో నొకటియైనది, తాను చేయు శిల్పపుంబని ఈరెంటికిని ఇప్పుడు సమర మరుగుచెంచినది. అబ్బాయిని మారదేవుడు పరీక్షించుచున్నాడు.

సమరకుమారు డిట్లు మాట్లాడుచు నిమీలితలోచనుడై సర్వమొకలిప్తకాలము మరచిపోయెను.

శక్తి:— తామిట్టి సమయమం దూరకుండుట న్యాయమా?

సమర:— (కన్నులు తెరచి) వెర్రిదానా! ఎవరి యుద్ధమున వారు జయమందవలయును "తేజోమూర్తి" కెవ్వరు సహాయము చేసినారు? అమరావతీ స్తూపముపై నేను చెక్కిన చెక్కడము చూడలేదు? అబ్బాయికి రెండు మార్గము లిప్పుడు గోచరమైనవి. ఒకటి ప్రాపంచికమై పూల వాసనలు, సెలయేటి గానములు, నీలగిరుల రూప సదృశములు, కాంతి

మనోహర వాక్యములు, సువర్ణముల తళుకులు, నాట్యాంగుల దిమికిటల, నవ్వుల హాస్యములతో సుడిగాలిరీతి, సుడి గుండము వలె చోద్యమై యుండును. ఇంకొకటి నిమీలిత నేత్రములు, ఆరాధనలు, ఉపవాసములు, దానములు, యాత్రలు భిక్షువులతో భక్తిపూరిత ఉపదేశములతో కూడి యుండును. ఇప్పుడే యాత ఏది యేని మార్గము ననుసరించును.

శక్తి:— ఎవ్వరైన చేయూతనీయక పోయిన, అబ్బాయి పని యేమగును.

సమర :— నీవు చదువుకున్న దానవు. ఎవరికర్మకు వారేకర్తలు. ఈమాత్రము తెలియదా. దశ కుశలములు, అష్టమార్గములు మానవు డాచరించునపుడు అరిషడ్వర్గముల జయించుటకే వ్యక్తి కాతడు సమర్థుఁడు కానిచో సహాయము చేయ వీలులేనప్పుడు కాముడు మోహుడు మనుష్యునియపలీలగ తమ బాని సగఁ జేసికొందురు. చిరంజీవి యీయుద్ధమున పందెములలోవలె విజయము గాంచెనా మనకులము తరించును—లేదా.

శక్తి :— అయినచో మనమేమి చేయగలము దేవా!

సమర :— భగవంతుని ప్రార్థించుటయే? ఆ “విజ్ఞానస్వరూపుడు” బోధిసత్వుఁడై యెందరి భక్తుల సంరక్షింపలేదు?

సాయంతనము క్రీడాశైలమున తల్లియుకుమార్తె లిరువురు కలిసికొనినపుడు శక్తిమతీదేవి నాగబంధునికనుగాంచి “అమ్మాయి అన్నయ్యను పలుకరించినావా? ఏమట్లు విచారవదనముతోనున్నాడు కనుగొన్నావా?” అనియడిగెను.

నాగ :— అమ్మా! మేము మాట్లాడుటకుఁ బోయినప్పుడు మాతోరోజువలె పలుకలేదు. పరధ్యాన్నము. నాల్గయిదు సారులు ఏదియో చిత్రము లిఖించ బోయినాడు. అది తానను కొన్నట్లు రాలేదనియో ఏమిటో వరల చెరిపి వేసి ఫలక మొక మూల పారవేసినాడు.

సిద్ధార్థినిక :— అమ్మా! ఒక్క బొమ్మలు వేయుటే కాదు. విగ్రహము కూడా చెక్కుట ప్రారంభించినాడు. ఒక బాలిక రూపమే! కాని తిన్నగా రాలేదని కాబోలు. అవిగ్రహము విసుగుదలతో వేయి ముక్కలు చేసినాడు.

ఇంతలో మహాలి తన చీరకుచ్చుల మడతలలో ఒక విగ్రహము శిరస్సుగొనివచ్చి శక్తిమతీదేవికిచ్చి చిరునవ్వు నవ్వెను. నాగబంధునిక యా శకలమును తేరిపార చూచి “అమ్మా నే నెరిగియున్న యొక బాలిక రూపమువలె ఉన్నది. ఎవరు చెప్పమా?” యని తలపోయ చొచ్చెను. అప్పుడా రెండ్ల బాలిక యగు సిద్ధార్థినిక ఒక్క గంతువేసి చప్పట్లుగొట్టుచు “ఆఁ నాకు తెలిసింది! మీరు చెప్పకోండి!” అని కిల కిల నవ్వెను.

శక్తిమతీదేవి యా రాతి తలను తదేక దృష్టితో తిలకించి “యీముఖము నా బాల్య స్నేహితురాలగు ప్రజాపతి మిత్రిమోమువలె నున్నది.” అని యనెను. అప్పుడు మహాలి “అ తెలిసిన దమ్మా తెలిసినది. చారుగుప్త కోటీశ్వరుని తనయ ప్రజాపతి మిత్రి కుమారిత హిమబిందు కుమారిక మోము. ఇక నేమి! అబ్బాయి హిమబిందుపై మరులు గొన్నాడు. మొన్న ఉత్సవమునాడు అబ్బాయికి బహుమాన మిచ్చినప్పుడు నాట్యమాడిన బాలలలో హిమబిందు కుమారిక యొక్కతె” అని యామె యేమియో చెప్పఁ బోవుచుండ సిద్ధార్థినిక మోము చిన్న బుచ్చుకొని కన్నుల నీరు తిరుగ నేను చెప్పబోవుచేరు మీరందరు చెప్పకొన్నారు. నన్ను చెప్పనిచ్చి నారు కాదు, ఈ మహాలి మరీను మీ ఎవరిజత ఉండనని మూతి ముడుచుకొని గబగబ పరుగిడి పోయెను.

ఆమె యట్లు శిల్ప మందిరము లున్నతోట లోనికిఁ బోయి యొక కేళాకూళికడ దమనకపుమడు లున్నచోట పండుకొని వెక్కి వెక్కి ఏడువఁజొచ్చెను. ఇంతలో ప్రతిహార కుమారుఁ డామెను డాసి చెల్లెలి నెత్తి తన యొడిఁ జేర్చుకొని చెక్కిలి ముద్దుగొనుచు

కంట నీరు తుడిచి బుజ్జగింపుచు ఏమమ్మా చిట్టికన్నె ఏమిటి యీ యేడుపు? అమ్మ కూకలు వేసినదా లేక అక్క తగాదా పెట్టినదా? అని ప్రశ్నించెను. సిద్ధార్థినిక మరియు వెక్కి వెక్కి యేడువ సాగెను. అన్నగారు పరిపరి విధముల బ్రతిమాలి ఎత్తికొని తీసికొనిపోయి తాను తన చెల్లెలికై చెక్కిన యొక బాలకుని బొమ్మను ముద్దుల మూటగట్టు దానిని కిలకిల నవ్వు మోము గలిగిన దానిని నామె కిచ్చి "ఇదిగో మీ అబ్బాయి బొమ్మ ఆడుకో ఏడవకు అక్కకీ ఎవ్వరికీ ఈయకు" అని యిచ్చెను. తోడనే కళ్లనొత్తుకొనుచు ఆ బాల చిరునవ్వు నవ్వుచు "ఈ బొమ్మ అబ్బాయిని అక్కయ్యను అమ్మనూ ఎత్తుకోనివ్వను లే. మహాలికి కొంచమైనా చూపించను. నేనే నీళ్ళు పోసుకొంటాను. నగలు పెట్టుకుంటాను. మరే నీవు చెక్కిన బొమ్మ తలకాయ వాళ్లమ్మాయి హిమబిందని నేను చెప్పుకో పోతోంటే వాళ్లే చెప్పుకొనినారు కోపం తెప్పించారు అన్నయ్యా"! అని యీ వెఱ్ఱిబాగుల శిశువు అన్నగారికి చెప్పెను. ప్రహరకుమారు డామాట వినగానే ఉలిక్కి పడెను. చెల్లెలిని సాగనంపి అక్కడనున్న యొక రత్న కంబళిపై చతికిలంబడి యదేవిధముగ నాలోచింప సాగెను. ఉజ్వల శ్యామల వర్ణుండగు నాతని కపోలము లెఱ్ఱబారెను.

హిమబిందు పోలిక వారెట్లు గ్రహించిరి. తనను పోలిక లేనట్లే కనంబడెనే ఆమె రూపమణు మాత్రమైన రాలేదు. హిమబిందు పేరు విన్న తనకీ ఆందోళనయేమి? తన కళానైపుణ్యము మంట గలసెనా? అయోఘనము తప్పి నారి చేయికి రెండు మూడు సారులు దెబ్బలు తగిలినది. టంకము చేత పట్టినప్పుడు చేయి వణకి పోయినది. కారణమేమి? ఇదివర కెప్పుడైనను ఒంటిగా నుండుట తన కత్యంత ముదము సమకూర్చు చుండునది. నేడు తనవారితో కూర్చుండి వారితో సల్లాపము లాడలేదు. తానొంటిగా యుండలేదు. వేసవి కాలములో మిట్టమధ్యాహ్నమున గాలిలేని సమయమున నిద్రయు బట్టదు. మేలుకొండి ఏపనియు చేయజాలదు. తన గతి యట్లయినది. తన మానస పథమందు తన్ను గజిబిజ లాడించు తుపాను గాలులైన పుటవు. నిశ్చల శీత వాయువులైన ప్రసరింపవు. అబ్బా తన కెడియో దిగులు. గంటలకొలది ఇటునటు తిరిగినను తన హృదయమునకు శాంతి కలుగదు. గ్రంథముల చదువులకు మనస్సు పోదు. పెద్ద చెల్లెలి వీణాగాన మాలకించుచు ఆ స్వనముతో శ్రుతి గలిపి మనోహర గాన మొనరించు తెనమామాలు అలవాటన్న అసహ్యమయినదే అని యాతని ఆలోచనలు ప్రసరింప సాగెను.

## పదునాలవ ప్రకరణము.

### చారుగుప్తుని కోర్కెలు భగ్నమయ్యెనా?

సమవర్తి తిన్నగా చారుగుప్తుని యింటికి పోయెను. తన మేనమామ కోటీశ్వరులలో కోటీశ్వరుడు. ధనము మాట యటుండనిమ్ము. ప్రపంచము నెవ్వరును తేరి చూడజాలని మహాసుందరాంగికి జనకుడు మేనమామ కుమారిత. ధర్మశాస్త్ర ప్రకారము తనకు హక్కు. హిమవంతుని తనయను కైలాసనాథుడు వివాహ మాడినాడట, సముద్రుని పుత్రికను, సముద్రమున వసించు వటపత్రశయనుడు వివాహమయ్యెనట యని బ్రాహ్మణ పురాణము లనుచున్నవి. చిన్నతనమునుండి తాను చారుగుప్తుని తనయతో ఆటలాడుకొన్నాడు. ఆమె నాకిది కావలెనని యనినంత తానది తెచ్చినాడు. ఒకసారి యామె కృష్ణానది కావలి యొడ్డున నున్న పచ్చతురాయి పూలగుత్తుల పట్టుకొని రమ్మని యన్నప్పుడు తాను పదునారేండ్ల యీడువాడై యున్నప్పుడు కృష్ణానది యావలకీది ఆపూలు తెచ్చి యిచ్చినప్పుడు హిమబిందు తన్నెంతో మెచ్చుకొని బావా నీయంత గొప్పవారెవరును లేరు నేను నిన్నే వివాహమాడెదనని యన తన మెడచుట్టును తన బాహులతల పెనవేసి బుగ్గల ముద్దుగొనలేదా. ఆనాటి కౌగిలింత యిప్పటికిని తన స్మరణకు వచ్చుచుండుటలేదా. సౌందర్యమున తనతో సీడగు వారెవ్వరును లేరు.

బాహుబలమున జెప్ప నవసరములేదు. తన వంశము అనేక యుగంబులనుండియు ప్రసిద్ధికెక్కిన శాతవాహన వంశము. తాను బీదవాడైననేమి. కొలది దినములలో ఉపసైన్యాధ్యక్ష పదవి, ఆవెన్క సర్వసేనాధిపత్యము, ఆవెనక ఏమో ఎవరికి తెలుసును.

ఈయాలోచనలు కన్నుల కొక కాంతినీయ, మోమున కొక విలాసము కూర్ప, రూపమున కొక శ్రీ విజేర్ప గుఱ్ఱమును మంద మందగతుల నడుపుకొనుచు సమవర్తి శాతవాహన కుమారుడు చారుగుప్తుని సౌధము సమీపించెను. కోటవలెనున్న యాభవన ముఖద్వారము సమీపించగనే గుఱ్ఱము స్వారితో పోవుటకు మహాతోరణ వామకవాటమును మాత్రమే ద్వారరక్షకులు తెరిచిరి. స్వారిచేయుచునే సమవర్తి నిస్సరణముదాటి ద్వితీయ ద్వారము కడచి ప్రాంగణము జేరునప్పటికిని అశ్వరక్షకులు గుఱ్ఱము కళ్లెమును బట్టికొన, సమవర్తి అవరోహణ మొనర్చి పగ్గపుతాడు వారికిచ్చి పాదరక్షలు చప్పుడుకా మీసములు వడివేసికొనుచు సభాశాల దాటి అభ్యంతర గృహంబుల లోనికిఁ బోయెను.

అట్లు నడచి నడచి ప్రతీహారుల నమస్కృతులందుకొనుచు ఆ సౌధశాలలకు అందున్న సమస్తమునకు ప్రభువునా విసవిస నాతడు లోనికి జనెను. ఒక మందిరముకడ నాగి పాదరక్షలు వదలి యచ్చట నున్న పరిచారికతో తాను వచ్చినటుల చెప్పుమనియు లోనికిరా ననుమతి యీమనియు కబురుపంపెను,, ఆమె లోపలికిఁబోయి ఒక క్షణికము గడచిన వెనుక మరలివచ్చి "రావచ్చునని" తెల్పెను. సమవర్తి శాతవాహన కుమారుడు ప్రవేశించిన గృహము వైకుంఠమున లక్ష్మీదేవి నివశించు మందిరము లిట్లుండునుగా యను భావము కలుగఁజేయును. వెండి బంగారము దంతము చందన తరువులలో సృజింపఁబడిన పీఠములు మంజూషలు కాశ్మీర దేశపు కంబళ్లు సహ్యాద్రి పర్వతపు పులుల హిమవన్నగ సంచార శ్వేత చమరీ మృగముల వింధ్యాటవి సింహముల కామరూప ఖడ్గమృగముల హిరణ్య ద్వీపవార్జాలముల చర్మములతో సొగసుగా నమర్చిన చాపలు మచిలీపట్టణపు కలంకారీ అద్దకముల తెరలు లిచ్ఛవీ దేశముకూలావనికలు బ్రహ్మదేశము నుండి వచ్చు తళతళలాడు నొక రకంపు గడ్డి అల్లికల యచ్చట చూచిన కన్నులకు పర్వమొనర్చుచుండెను. సర్జరసము మల్లిగంధి జోంగికము శ్రీవాసము జాయకము మొదలగు ననేకములలో తయారుచేసి యందులు బంకతో మోటుపల్లి సన్నని వలిపెములకు పులిమి వత్తెలగాఁ జేసిన ధూపకళికల హృదయము రంజించు సువాసనపు పొగల గముల నెల్లెడ విదజల్లుచుండెను. ముత్యముల జాలరులు నవరత్నములు పొదిగిన ఉపకరణము లెల్లయెడల చెన్నారుచుండెను.

ఇక అభ్యంతర మందిరమున, "మూల్యమగు" నొక పల్యంకముపై తూలికల శయనమున, ఎత్తుగాఁ జేర్చబడిన ఉపధానముల నానుకొని ఊర్వశివలె బంగారుమేని జిగిబిగి గాత్రానులేప నివర్ణకమున మెరుగులీన ఒయ్యారమున హిమబిందు కుమారిక చెలులు వింజామరలు వీవ అధివసించి యుండెను. మేనబావ వచ్చుటయు దాపుననున్న నొక పీఠముపై కూర్చుండుమని సైగచేసి యాబాల "కుశలమా ?" యని ప్రశ్నించెను. ఆమె కటి ప్రదేశము చుట్టును క్షౌమాంతరీయము మనోహర నీల వర్ణముల జెలువారు నది నీటి యూట యుబుకుల మడతలలో శృంగార రేఖల కుమ్ములతో చెన్నారి యుండెను. గంభీరవక్షములు కనపడికనబడనియట్లు దాగుడుమూతలాడు పొగమంచులోనుండి అస్పష్టముగా గోచరించు బంగారు కొండలవలె నుబుక ఆంధ్ర సుచేలనివీత మొక్కటి యామె రొమ్మున చుట్టబడి వెనుక ముడివేయఁబడెను. కాళ్ళకు మంజీరములు కింకిణీ ద్వయములు నూపురములు పాద కటకములు ఆమెపాదములకు మహత్తరమగు హిరణ్య గౌరవ మిచ్చె. వెలలేని హారములు పాములవలె మెడనుచుట్టి వక్షోన్నతములపై మిలమిలలాడు చుండెను. మణులు పొదిగిన మేఖల ఆమె సన్నడుము క్రిందుభాగమున చూచువారికుండె

కొట్టునటుల వంకరల వంకరల చుట్టి ప్రవహించు చుండెను. బాహు పురులు మర్మము విడిచి యామె రహస్యముల బట్ట బయలు చేయ సంకల్పించినవి. పది వేళ్ళను అంగుళీయకములు గలవు. లలాటికము రతీదేవి మూడవ నేత్ర మైనది.

ఆమెకీ నగలున్నను, లేకున్న నొకటే. కాని హిమబిందు గర్వభూయిష్ఠ. తన యందము అకుంఠిత మైనది. సాటి లేనిది యని యొరులకు చాట నామె కోరిక. ఆమె విలాసముల మహాస్త్ర జాలంబున సర్వ భాగములకువి సరివేయ నామె కోర్కె. తనయందమునకు రసజ్ఞులగు పురుషులలో నుత్తముల కూడ బానిసలఁ జేయుట యామెకు మిక్కిలి యిష్టము.

క్రీగన్నుల బావగారినిఁ జూచుచు మృదువము లగు పెదవుల కాంతులు ప్రసరింప నెమ్మదిగ తాంబూలము నములుచు విలాసముగ ముంగురుల సవరించు కొనుచు సన్నని బాలచంద్రుని శిశు కిరణములవంటి వేళ్ళతో పూల చెండుల దొర్లించుచు బావా యుద్ధ వార్తలు చెప్పెదవా? యని ప్రశ్నించెను.

“సుందరీమణీ, హిమబిందు మరదలా! నీవు రోజు రోజునకూ అందమునందున మించిపోవు చున్నావు. ఆ హారము క్రొత్తగా చేయించినట్లున్నది. ఆ నాణెము లేమిటి? నేను చూడవచ్చునా?

“చూచుట కభ్యంతరము లేదుగాని! మగ వారికీ స్త్రీ హారములతో పనియేమిటిలే. యుద్ధములని సైన్యములని గుఱ్ఱపు పందెములని యుండవలెను గాని,”

“ఆ! మరల మొన్నటి పందెముమాట జ్ఞప్తికి తెచ్చుచున్నావు. నేనారోజున చెప్పినటుల వాడు పిశాచములతో స్నేహము కలిగి యుండవలెను. లేకపోయిన కాకుండక కుల ఫాలకలకు ఓటమి యేమిటి?”

“ఓటమి ఏమిటి? నడుపువాడు శక్తిలేని వాడయిన సరి.”

“ఇంతయుఁ జేసిన నేను శక్తిలేనివాడ ననా నీ అభిప్రాయము క్రితము సంవత్సరము ఎవ్వరు నెగ్గినారు? అక్రిందటి ఏడు వ్యాఘ్రజయము కాంచినారు.”

“ఎన్నిసారులు నెగ్గినా ఒక్క ఓటమితో చెల్లు.”

“నీ వనేది వేళాకోళమా? లేక మనస్ఫూర్తిగానా?”

“వేళకోళముకాదు. నిశ్చయముగానే అను చున్నాను.”

“ఇదే నీతో వచ్చిన గొడవ. అత్యంత సుందరీ మణులకు ఏదియనినా చెల్లును.”

“నేను అందగత్తె నయినందుకు, నాకు ప్రాణ ప్రద మయిన గిత్తలను నెగ్గించినావా ఏమన్నానా!”

“నీ చిన్నతనమునుండి నీవు కోరినది నిమిషములో సమకూర్చుటలేదా.”

“దిట్టమయిన కోర్కె వచ్చునప్పటికి వెనుకకే వెళ్ళినావు.”

“ఇన్ని నాళ్ళనుండి చేసినది వ్యర్థమేనా?”

“అమ్మో! నీకు కోపము వచ్చుచున్నది.”

“నాకు కోప మేమిటి. నన్ను మరచి పోవు చున్నావు కదా యని విచారము.”

“నిన్ను మరచిపోవునారు తమ్ము తా మేమరచి పోయెదరు.”

“అయితే నేను నీవు చిన్నతనము నుండియు ఆడుకొనిన ఆటలు జ్ఞాపకమే?”

“ఎందుకు జ్ఞాపకమునకు రావు.”

“అయిననో ఎన్నిసారులు మనము ఆటలు నీ బొమ్మరింట్లో ఆడుకొని నాము.”

“ఆటలు, ఆటలే. కాని నాకు యుద్ధము కబురులు చెప్పెద నన్నావు,”

“చిన్నతనమున సంతోషములగు ఆటలుస్మరించుట పాపమా, నీకు యిష్టములేదా?”

“చిన్నతనపు సంగతులు పెద్దవారికి ఎందుకు గాని—”

"నీవు పెద్దదానివై పోతివా,,

"నేను కాకపోయినా నీవు కాలేదేమిటి?,,

"ఇరువది యైదేండ్లకే పెద్దతనమా? నాకు మీసము గడ్డము నెరిసిన బాగుండును. రేపటినుండి కర్ర చేత పుచ్చుకొని వణకుచు వీధుల వెంట తిరిగెదను.,,

"అదిగో కోపము పెద్దతనమంటే. ముసలితనమా! నీవు పెద్దవాడవయినావు. ఎక్కడ చూచినను నీ విక్రాంతము నీకీర్తి వ్యాపించిపోయినది. యుద్ధములో ఆరి తేరిన బంటువైనావు. అని యర్థముతో అన్నాను.,,

"ఎంతపేరుంటే యేమి. దానికివన్నె లేదు

"ఏమి కారణము,,

"ఆ కీర్తిని ఆనందించువారేరి.,,

"అత్త అమృత లతాదేవి లేదా? నీ స్నేహితులు లేరా, నీ చుట్టములైన మేమందరము లేమా?,,

"ఏమో, వీరందరు సామాన్యులే,,

"అవును గాని నేను చేయించుకొనిన హారము చూపమంటివి కాదా. ఇదిగో."—

ఏమి జాణవు! ఈ సువర్ణము లెచ్చటనుండి వచ్చినవి?,,

"ఎక్కడనో పశ్చిమ సముద్ర మావల రోమ రాజ్యమున్నదటగా. ఆచక్రవర్తి నాణెములివి. మానాయనగారీమధ్య పదియోడల మీద వివిధ వస్తు సామగ్రుల నెగుమతి చేసినారు. అక్కడనుండి మారువచ్చిన వస్తువులలో రెండులక్షల సువర్ణము లివికూడ వచ్చినవి."

"ఈనాణెములయందమేమిగాని, ఇవి నీ మెడ నలంకరించుటచే నిజమగు నందమును సంపాదించినవి."

"నీ పొగడ్తల కేమిలే!"

"అయిన నీ వందక త్తైవు కానెదవా."

"కావంటే నీవు వొప్పుకొనవుగా"

"ఈ హారము ధరించు పద్ధతి నీకు తెలియదు గాని నేను వేసి చూపెదను.,,

"మీయాబిడ వచ్చినప్పుడు చూపవచ్చును గాని, యుద్ధపు కబురు లేమియు చెప్పినావు కావు'.,

"మా ఆబిడ వచ్చినప్పుడెట్లు వేయవలయునో ఇప్పుడు నేర్చుకొనెదను.,,

"అదుగో మా చెలికత్తె బాలనాగి మెడ వైచి నేర్చుకో"

సమవర్తికి నిజముగా కోపమువచ్చెను. ఎన్ని విధముల ప్రయత్నించినను సులువుగా నామె ఇంగిల మత్స్యమువలె పట్టు తప్పించుకొనినది. వీరిట్లు సల్లాపము లాడుచుండగా శాంతచిత్త వచ్చి "అమ్మా నాయనగారు వచ్చుచున్నారని,, నుడివి సమవర్తిని చురుకు చూపుల చూచి ఏమియు నెరుగనట్లు వెనుకకు పోయెను.

రక్తచందన పాదరక్షలు చప్పుడుగా చేతనొక ఏమియు చెక్కడములేని సాధారణమగు ఎఱ్ఱ జువ్వికఱ్ఱ నూతగాకొని చారుగుప్తుడు వీరున్న మందిరమున కేతెంచెను. ఈవారము దినములలో నాతడు విచారముతో కృంగిపోయెను. ఆతని మొదటియెత్తు భగ్నమైనది. కాని అంతటితో తానూరకుండ వలసినదేనా! మొన్న జయశీలుడగు నాబాలుని యెదుట నాట్యమాడు నప్పుడు, యువరాజగు శ్రీకృష్ణ సాతవాహనుడు తదేకదృష్టితో తన తనయను చూచినాడు. చక్రవర్తి యుద్భుతమొందు కార్యము లోకదాని వెనుక నొకటి చేయావలెను తన వలననే సమస్త కార్యములు నెరవేరినవిగా యాతనికి తెలియవలె, మొన్న తన వేగులవారు కనుగొనిన వృత్తాంతమున నొక బ్రాహ్మణ బ్రహ్మచారిని చక్రవర్తి పట్టుకొనినాడు. ఇంకను తన కావిషయమై చాలాసంగతులు తెలియవచ్చినవి_ కాని యీసమవర్తి యేమిటి? పలుసారులు హిమబిందుకడకు రాజనదు. వచ్చినచో పితృభక్తి పరాయణయైనను హిమబిందు మనస్సు ఏదుర్ముహూర్తమునవయిన నీవెఱ్ఱి వానిపై పోయినతన వాంఛలన్నియు శకలములగును. సమవర్తిని దేశాంతర గతుని గావింపవలయు, నొకటి, రెండు చక్రవర్తి మనస్సు సంతోషవార్ధిలో నోలలాడు

మహామాత్యపదమొందు కోవింపవలయు, ఇంకను "ఇన్నాళ్లనుండి నాకీ విచారమేలనుక, విధిని నాచెంకిలలో నొకనిగాఁజేసి ఆంధ్రరాజ్యము ఊపి ఊపి చక్రవర్తితో నేను వియ్యమందవలయు." అది యాతని సంకల్పము.

చారుగుప్తుఁడు గదిలోనికి వచ్చినతోడనే హేమబిందు లేచి తండ్రికడకువచ్చి యాయన చేయిగొని ఒక సుఖాసీనముపై నధివసింపఁజేసి యాయన ప్రక్కనే తాను గూర్చుండెను. సమవర్తి మేనమామకు పాదాభివందన మాచరించి నిలువఁబడి యుండ, చారుగుప్తుఁడు చేయి యూపెను. ఆతఁడును తన పూర్వపీఠముపై నొరఁగెను.

చారు:— సమవర్తీ! నీ కోశమందక వలపాల కల జత కావలయునేమో యని కబురు పంపినాను జవాబే పంపినావు కావేమి?

సమ:— మామయ్యా! అట్టియుత్కృష్టముల గిత్తలు నీకడనే యుండవలయును.

హేమ:— నీకడ నేల నుండకూడదు?

చారు:— ఉండు తల్లీ: నేనాతనికి జవాబు చెప్పెదను గాదా, అవునయ్యా, నాకు వానియందు మక్కువ పోయినది. ఓడిపోయినవని కోపమును కొందువేమో అది కాదు. నాకు క్రొత్తజతలపై మక్కువ ఎక్కువ. మహాకాంతార నగరమున ఈమధ్య మావాడు ఇంద్రగోపుఁడు అత్యద్భుతమగు జతను కొనినాఁడట. కతిపయ దినములలో నవి యిచ్చటకు వచ్చును. ఆర్యావర్తమునగాని దక్షిణాపథమందుగాని అట్టి పసరములుండ బోవని స్పష్టముగా తెలియవచ్చినది.

సమ:— అయినచో వానిని తప్పక చూడవలెను.

చారు:— నీకు మాళవమునకు బోవు సైన్యమునకు ఉపసేనాధిపత్య మిచ్చినారు. చక్రవర్తి ఆజ్ఞాపత్రమగు రాగిరేకు నీకందినదా?

సమవర్తి చటుక్కున గంతువేసి లేచి "ఏమిటి మామయ్యా! నిజముగా, నీకెప్పుడు తెలిసినది' అని ప్రశ్నించెను.

చారు:— నామాట యబద్ధమనియా?

హేమ:— వేయించిన వాఁడే బాబయ్యగారయిన ప్పుడు—

సమ:— మామయ్యా! నీకు వేయివేల నమస్కారములు. నీవే నాకారకుఁడవు. ప్రయాణ మెప్పుడు ఎంతసైన్యము? ఆహా నాకత్యంత సంతోషముగా నున్నది. నాకా శాసన మెప్పుడువచ్చును! అయినచో నేనింటికి పోయి ప్రయాణ సన్నాహమున నుండెద. కాని నీప్రతిన యూడనాె. నీవేమెన్నిటికి మరచిపోను.

చారు:— నా హేమబిందు నోట నివ్వఁగింజాగదు.

హేమ.— తొందరపడి అన్నాను

సమ:— అయితే అపరాధము కాదుగదా!

చారు:— ఓయి వెఱ్ఱివాఁడా!

సమవర్తి, అయినచో నేను పనిపనియెద, నని విస విస వెడలిపోయెను. చారుగుప్తుఁడాతఁడు పోయిన దిక్కున కనుబొమలు ముడివడి దరికి జేర తీక్ష్ణ దృష్టులఁ బరపి, పుత్రిక వంకఁ జూచి "అమ్మాయీ, నీవీతనితో చనువుగా నుండుట తగ్గించివేయి. నాకాతఁడు జామాత యగుట కేమాత్ర మిష్టములేదు. నీమనస్సేమయిన నాతఁడన్న జాలిచూపు చున్నదా?" యని యడిగెను. "లేదు నాయనగారూ! చిన్నతనపు స్నేహమున చనువు." "అదే వద్దన్నది నీహృదయ పథంబులనుండి ఆతనిని పూర్తిగా మాయమొనర్పుము."

"అమ్మాయిగారి కొఱకెన్న, ఏ మాత్ర మిష్టము లేదని ఒక పరిచారిక చెప్పెను. హేమబిందులోచనములు నీజమనెను.

## పం దొమ్మిదవ ప్రకరణము.

రహస్యాలోచన మందిరమున రాజుగారి కోటలో శ్రీముఖ సాతవాహన చక్రవర్తియు, మహామాత్యుఁడు అచీర్ణుఁడు, సర్వసేనాధ్యక్షుఁడు స్వైతుఁడు మంత్రనమునన్నుండిరి. శ్రీముఖుఁడు పొడుగరి. ఆరడుగుల రెండంగుళములమనిషి. జబ్బపుష్టికలిగి ఒక్కఁడు సింహముతో ఆయుధములు లేక పోరాడు నంతటి

పోటుమానిసి. పచ్చని దబ్బ పండువంటి చాయకల వాడు జుట్టు పొడుగుగా ఉంగరములు చుట్టుకొని వీపుమీదను భుజముమీదను పడుచుండెను. కాని కన్నులు చిన్నవి అయినను నాగమణులవలె తళ తళలాడుచు తీక్ష్ణకాంతుల నెదుట వాని హృదయము చొచ్చిపోగలవు. నాసిక గరుత్మంతుని ముక్కువలె పొడుగై యాతని చిన్ననోరును మాటలాడిన వటువ్రలు తిరుగు సుందరమగు పెదవులను తొంగి తొంగి చూచుచుండెను. మీసమును బవిరి గడ్డమును విశాల ఫాలమును ఆతని ముఖమునకు వన్నె తెచ్చినవి.

ఆలోచన మెండయినప్పుడు శ్రీముఖుడు నిశ్చలతి కలిగి యుండలేదు. మొలనున్న కరవాలికా సువర్ణమేఖలపై చేతులు వేయును. పక్కనున్న నిశిత శాక్షేయకోశముపై దృష్టి సారించును. కిరీటరత్న కాంతులు దశదిశలపర్వ తలయాడించును. ఆతని మొలకొక దుకూలమున్నది. మెడను హారములున్నవి. హస్తమున కంకణములు బాహువులకేయూరములు కలవు. ఆతడొక్కొక్క సంగతి ముచ్చటించినప్పుడు తలతిప్పి మణికుండలములు పెద్దవియగు కర్ణరంధ్రముల చుట్టియుండినవి భుజములు మీసములు గడ్డములు కాంతులీన యందరి మోములను చురచురచూచును.

శ్రీముఖుడు:— నా ఉద్దేశ్యము మనము ప్రథమమున పుళిందుల దేశముపైకి పోయి వారికి బుద్ధిచెప్పి యటువెనుక మాళవముపై దండువిడిసిన మంచిదియని; లేనిచో మాళవముపైకి పోవు మన వెనుక నీపుళిందులుకమ్మి మనయాత్రసాగనీయరు. ప్రప్రథమమున పుళిందులకు బుద్ధిచెప్పి తిమా మాళవునకు నిముషమునబుద్ధిచెప్పగలము.

అచీర్ణుడు:— దేవా మీరు నక్కాణించినది బాగున్నది. రేపటిదినమున సైన్యసంఘములకు జైత్ర యాత్రాసంఘములకు శాసనములు పంపెదను. సర్వసైన్యాయత్తమైనవెంటనే శుభముహూర్తముచూచి రణభేరీమోగించెదము గాక.

స్వైత్రుడు:— మహారాజా వినీతమతికి ముందర సమవర్తినడుపున కొన్ని దళములు పంపుటకు దేవర యనుజ్ఞయేమి. త్వరలో సహాయము కావలె ననికదా వేగిరావు వాడు తెచ్చిన వార్త. లేనిచో నాతనినుడి దుర్గము బలహీన మగుచున్నదట సమస్త సైన్యముతో తాను ఆహుతి కావలసిన ముహూర్త మరుదెంచునే మోయని యాతడు పంపిన వార్త దేవరకు విశదము. ఆజ్ఞ—

శ్రీముఖుడు:— సమవర్తి స్వతంత్రముగా సైన్యములు నడపగలుగు వాటివాడా? వీరుడు కావచ్చును. తినంతట తానొక సైన్యమును నడుప శక్తి కలిగియుండక పోవచ్చును.

స్వైత్రుడు:—అందునకు నేను పూచీ. మహామాత్యుల ఉద్దేశ్యము దేవరకనుగొనవచ్చును.

అచీర్ణుడు:—దేవా సర్వసేనాధ్యక్షుల మాట బాగున్నది. అర్వు రుపసైన్యాధ్యక్షుల లోను వినీత మతి మాళవమున నున్నప్పుడు కౌకుండ కుడు పురము కాపాడనున్నప్పుడు అత్యఘ్నుడు కళింగమున నున్నకాలమున, అఘబలుడు ప్రతిష్ఠానమున, చిత్రకుడుదక్షిణాపథమున, జఘన్యుడు సిద్ధపురమున నుండ నింక మనకు సమవర్తియో మరియొకరో క్రొత్త ఉపసైన్యాధ్యక్షుడు కావలయును. అవిషయమున స్వైత్రులవారే చెప్పవలయును. నా వినికిడి సమవర్తియే సేనాధికారులందరిలోను తగినవాడని.

స్వైత్రుడు:— రాష్ట్రికులతో యుద్ధమున సమవర్తి ఉపసైన్యాధ్యక్షుని కంటె అద్భుతములొనరించినాడు. కాన అతడే దీనికి తగును.

శ్రీముఖుడు;— సరే అతని నెప్పుడు పంపెదరు?

ఇంతలో ద్వారముకడనుండి పారిపార్శ్వకుడు "జయము! జయము!! మహారాజాధిరాజునకు!!!" అని నక్కాణించెను. అచీర్ణుడు "లోపలికిరా" యని యనుటయు నాతడువచ్చి యందరకును సాష్టాంగ నమస్కృతులొనర్చి "జయము! జయము!! దేవరశాసనాజ్ఞానుసారము వణిక్సంఘాధ్యక్షులు చారుగుప్తులవారేగుదెంచినారు" యని యాడెను. సార్వభౌముడు

తలనూపెను. అచీర్ణుడది చూచి "తోడ్కొనిరా" యని ఆజ్ఞయిచ్చెను. చారగుప్తుడు లోనికి వచ్చి యందరకు నమస్కారములు చేసి మహారాజునకు సాష్టాంగమాచరించెను. అందరును లేచిరి. శ్రీముఖుడు చారగుప్తుని హస్తములబట్టి లేవనెత్తి పార్శ్వమున నున్న పీఠము పైనధివసింపజేసెను.

శ్రీముఖుడు:— వర్తకసార్వభౌమా! మాళవాధిపతి యేమి చేసెనో యెరుగుదువుగదా, ఇదివరకు మన చేనోడి మనకు కప్పము గట్టుచుండెను. తిరుగుబాటు చేయుచున్నాడని వినినంతనే వినీతమతిని పంపితిమి. ఆతనికి లొంగిపోయెనని వార్తాహరులు వచ్చియుండిరి. ఇంతలో ఏమరుపాటున పుళిందుల తిరుగబాటు చేయించెను. భోజుల సహాయముగా గొనివచ్చి ఉజ్జయినిలోనున్న వినీతమతిని ముట్టడించెను. ధైర్యముతో కోటకాపాడుచున్నాననియు త్వరలో సైన్యములతో సహాయము రానిచో తాను తన దళములతో నశించిపోవలయుననియు వేగిరావుల పంపుచున్నాడు. వినీతమతిని మాళవుడు ఓడించునట. పుళిందులు ప్రతిష్ఠాన నగరముపై దండువిడియనున్నారు. నీవు పుళిందులతోను మాళవముతోను మహత్తరమగు వర్తక వ్యాపారము కలిగియున్నావు. నీయాలోచన మాకత్యంతము ముఖ్యమైనది.

చారు:— జయము! దేవా! ఈ విషయమంతయు నేను శ్రద్ధగా నాలోచించితిని. ఒక సైన్యము ముందు ప్రతిష్ఠానమునకు యువరాజుగారికి సహాయముపంపి మనము సర్వసైన్యములతో అతివేగముగ తొందర మజిలీలను చేయుచు మాళవమునకుపోయి అచ్చట అగ్నిమిత్రుని సంతతి వానికి బుద్ధిగరపి మాళవమంతయు స్వాధీనమైన వెనుక పుళిందుల నడంచి భోజులపని పట్టించి వారిరాజ్యము మనము స్వాధీనము చేసికొనవలయు, తర్వాత పుళిందులకు తగినశిక్షయీయ వచ్చును.

అచీర్ణుడు:— అట్లయినచో పుళిందులు వెనుకనుండి మన యాత్రసాగనీయరు కదా.

సైత్రుడు:— చుట్టును శత్రువులతో మనము లాతివిలాతుల నాడుట అపాయకరము కాదా.

శ్రీముఖుడు:— పుళిందులెప్పుడును ప్రబలశత్రువులు.

చారు:— మీరు తెలుపు కారణములు మనకేమియు భయము కలిగింపవు. వారల సైన్యము లడవులు కొండలు విడచి సమ ప్రదేశముల లోనికి వచ్చి శిక్షితులైన సైనికుల నెదిరింపలేవు. వారినినడుపుటకు శిక్షితులగు సేనానాయకులు కావలెను. లేనిచో వారివలన భయము లేదు. కావున మాళవమునకు కళింగము వారి ప్రయాణము సాగించెదము. విరోధులకు మనపోకడ వృత్తాంతము గ్రాహ్యము కాకమునుపే మాళవమున నుండగలవారము. పుళిందుల నడచుటకు ఆఅడవులలో మనకు చాలా కాలము పట్టును. ఈలోన వినీతమతి దగ్ధమైపోవును. అటువెనుక ఏనుగులదండడవి బడినటుల దావానలము కాంతారము బొచ్చునటుల వింధ్యాటవుల బడి పుళిందులనుక్కడగింపవచ్చును. పైభాగములో బరచుకొనిమనము అటునుండి యువరాజు రా మధ్య పుళిందులు చిక్కుకొనగలరు. భోజులు పూర్తిగా మాళవునకు సహాయము రాకమునుపే మనము ఉజ్జయిని నుండవలయు. దీనివలన మనకు చెప్పరాని లాభమింకొకటి యున్నది.

అచీర్ణుడు:— ఏమది?

చారు:— (సార్వభౌముని దిక్కు మొగంబై మధ్యమధ్య మంత్రిని సేనానాయకుని జూచుచు) ఇది భరుకచ్ఛము పశ్చిమసముద్రపు రేవుపట్టణముల లో ముఖ్యమైనది. దానిలాభము భోజులు పూర్తిగా అనుభవించుచున్నారు. ఇప్పుడు భోజరాజ్యము స్వాధీనము చేసికొని ఒక ప్రతినిధిని అక్కడ భరుకచ్ఛమున నేర్పరచినచో

పాశ్చాత్యదీవులతో వర్తకము విచిత్రముగా మనకు స్వాధీనము కాగలదు. రోమకాది పాశ్చాత్యదేశములతో వర్తకము మచిలీపట్టణమునుండియు మోటుపల్లినుండియు జరుగుటచే మనకు అమితనష్టము కలుగుచున్నది. కావున భరుకచ్ఛము ఆంధ్ర చక్రవర్తుల స్వాధీనమందుండవలయు.

శ్రీముఖుడు:— బాగు! నీవు వర్తక చక్రవర్తివనిపించుకొంటివి. నీవుచెప్పినదంతయు నాకు సంగతమైనది. మహామాత్యా! ఈవ్రకేణీశిష్టుని యాలోచన ప్రకారము నడుపుట మనకు బాగున్నది సర్వసైన్యాధ్యక్షా! ఆ ప్రకారము సేనల నడుపుము. మేమును సిద్ధముగా నుండగలారము. చారుగుప్తుడు మనతో వచ్చునది. కోశాధిపతికి మహామాత్యుడాజ్ఞల నంపునది. వలయు నంతయు సిద్ధముచేయ యుద్ధసంఘములకు ముదల నీయవలసినది. స్తూపాధికారి జయమునకు బుద్ధభగవానునకు పూజల సలుపునది. ప్రజాలోకము దైవారాధన చేయవలసినది. మరియు—

చారు:— దేవా! తమకు అడ్డమువచ్చినందుకు వేయి క్షమార్పణలు. కాని యీజైత్రయాత్రికగు కర్చంతయు చారగుప్తుడు భరించ గలవాడు.

## నిరాశ.

(పాపినేని వెంకటేశ్వరరావుగారు.)

కార్మొయిలు దొంతరలిన హృద్గగనమందు
జవ్వనపు వింతవలవంత సందడింప,
కలికి! నెఱవాడి నీకడగంటిచూపు
మెఱసి మెఱంపిచిపోయె క్రొమ్మెఱుగుపగిది॥

పూలసరులతో గీతిక బొందు పఱచి,
పవడములరాశి! నీకునర్పణము సేసి,
జగతిపై నాసవీడి, యంజలిఘటించి,
పాడుకొనుచుంటి నెపుడునీనీడ నాచు॥

కంటకన్నీటి చుక్కయు గాకపోతి,
కన్నెహృది నెక్కు పూవైనగాకపోతి,
కంఠమునరత్నహారమ్ముగాకపోతి,
హీనమైపోతి కడకుదపించిపోతి॥

అభ్రపథమున భర్మహర్మ్యమ్ముచూపి
రమ్యతారకా తరళహారములజూపి,
శాఖిశాఖలలో చంద్రరేఖజూపి,
ఏల? ఆసలగొలుప, నద్రాలతునక;

చుఱుకునేలపై పన్నీటి చుక్కయనుచు,
తీక్ష్ణపుంటెండలో మృగతృష్ణవనుచు,
చివురుజొంపాల పలుగురాచిలుక వనుచు,
పూలనెదజల్లు గ్రీష్మాభ్రమాలవనుచు,
నెంచనైతిని కలనైన నెఱుగనైతి॥

ప్రణయగీతి నాహృదిబడ భాగ్నయాయె,
నైంద్రజాలికా! ఓహూం! మాయాకుమారి!
ఆగుమాగుము— సాంద్రదుఃఖాశ్రు మలిన
ధార భవదీయచరణ పద్మములపైన
దొలకరింపగ జేతు నిర్మలతగాంతు॥

# తోకచుక్కలు.



[నిడుమోలు కనక సుందరంగారు]



అనంత పథమున మన కగుపించెడి జ్యోతిర్మండలములన్నియు గోళాకారముగల విగనున్నవి. అవి సర్వసాధారణముగా ఘన పదార్థభూయిష్టములై కూడనున్నవి. కాని, మనమిపుడు పరిశీలింపబోయెడి తోకచుక్కల స్వభావము చాల వింతగ నుండును. అవి గోళాకారముగలవిగాని, బరువుగల ఘనపదార్థముతో కూడికొన్నవిగాని కావు. వానికి నిర్ణీతములగు ఆకారములు లేవు. వానియందిమిడియుండెడి ఘన పదార్థము బహుస్వల్పము. కావుననే గ్రహగోళముల యొక్కయు యింక నితరనక్షత్రములయొక్కయు విస్తీర్ణతలను, వాని బరువు మొదలగు విషయములను తెలిసికొనగలిగిన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు తోకచుక్కలబరువును నిర్ణయించుట దుస్సాధ్యముగనున్నది. కాని, యీ తోక చుక్కలకును గ్రహగోళములకును నింకొక గొప్ప తారతమ్యము కలదు. అదేదన, గ్రహగోళముల సంచారమెంత సక్రమమైనదో, తోకచుక్కలసంచారమంత అక్రమమైయుండును. అనగా, గ్రహములు సూర్యుని చుట్టును తిరుగ నప్పుడు భవిష్యత్కాలమందుయే క్షణమందుగాని యవియే యేస్థానములం దుండునో మనము సులభముగ నిర్ణయింప గలము. గాని తోకచుక్కలనుగూర్చి యిట్టిజ్యోతిషము చెప్పుటకు వీలుకాదు. తోకచుక్కలొక్కొకపుడు హఠాత్తుగానాకసమున బ్రత్యక్షములగుచుండును. అంతనవి కొలదికాలములోనే వృద్ధివియై, ప్రజలకు నమితమగు భయోత్పాతము కలుగజేయును. పిదప గొన్నాళ్లకవి యదృశ్యములై మరల నెన్నటికిని తిరిగి రావు. తోకచుక్కల స్వభావములను నిర్ణయించుటకును అవి కలిగించెడి భయమును పారదోలుటకును ఆధునిక శాస్త్రజ్ఞుల ప్రయత్నములు కొంతవరకు సఫలములైనవి. దానిసంచారమును గూర్చిన కొన్ని విశేషములు మన కిప్పుడు తెలియవచ్చుచున్నవి. కాని, యిప్పుడైనను, వానిని గూర్చి తెలసిన విషయములకంటె తెలియని వేయెక్కుడని యొప్పుకొనక తీరదు.

"తొలగెను ధూమకేతుక్షోభజనములకు" నని వ్రాయబడినకాలమందు, ధూమకేతువులు ప్రజలకు క్షోభగలుగ జేయు ననియెడి వదంతి ప్రబలియుండెననుటకు సందేహము లేదు. 1910 సంవత్సరమున సంభవించిన ఎడ్వర్డు చక్రవర్తి మరణమును నదును ఆసంవత్సరమున నగుపడిన తోకచుక్కకును సంబంధముండినట్లు ప్రజలెంచి యుండుట మనము మరువలేదు. కాని, యిది నట్టి భ్రమయే యనియు, సహేతుకములగు నాధారములులేని

వనియు, క్రింది విషయములను గమనించుట వలన గ్రహింపగలము.

**మొట్టమొదట**, 1874 సంవత్సరమున నగుపించిన 'కాగియా' యను పేరుగల ధూమకేతువును దూరదర్శని యంత్రసాహాయ్యమున పరిశీలింపగా నెట్లగపడినదియు నిచ్చట వర్ణింతును. ఈ తోకచుక్కయొక్క తలప్రకాశవంతమై యచ్చోటనే యందలి పదార్థము దట్టముగ కూడియుండినట్లు తోపజేయుచుండును. ఈ ప్రకాశవంతమగు భాగముచే (nuclens బీజమనియందురు- ఈ బీజము (nuclens) చుట్టుకొని 20,000 మైళ్లమొదలుకొని 1 000 000 మైళ్లవరకును ప్రకాశవంతమగు పరివేషముండును. అందునుండి మొదలుకొని ప్రకాశవంతమగు తోక చాలదూరమువరకును వ్యాపించును. సాధారణముగా తోక చుక్కలన్నియు నీయాకారమునే కలిగియుండును. గాని సూక్ష్మముగ పరిశీలించిన యెడల నివి యొన్నడునొక దానినొకటి పోలియుండవని విశదమగును. కొన్నిటికి తలయుండదు. మరికొన్నిటికి తోక యుండదు. ప్రపంచమును తల్లడపెట్టెడి ధూమకేతువులకన్నిటికి సర్వసాధారణముగ నతిదీర్ఘమగు తోక యుండుచునేయున్నది. తోకపెద్దదైన యెడల ప్రపంచమునకు రానున్న యనర్థముకూడ పెద్దదిగనే యుండునని ప్రజలు విశ్వసించి యుండవచ్చును. దూరదర్శనియంత్రద్వారమున నాకాశమును చూచుచుండిన యెడల ప్రతి సంవత్సరమును రెండుమూడు తోకచుక్కలను గమనింప గలుగుదుము. అవియంత్రసహాయ్యము లేక కంటికగుపడునంతటి సూక్ష్మములు. కాని వీనిలో సాధారణముగా నన్నిటికిని తోకలుండవు. ఈ తోకచుక్కలు ఒకదానినొకటి పోలియుండక చిత్రవిచిత్ర రూపములుగ నుండుటయేగాక నొకే తోకచుక్క, తనయాకారమును తరచుగా మార్చుకొను చుండుటయు సంభవించుచుండును ఒక్కొక్కప్పుడొక్కొక తోకచుక్క యతిశీఘ్ర కాలములో వైశాల్యమునందు వృద్ధిజెందు చుండును. ఒక్కొకటి యంతలో క్షీణించిపోవును. ఒక్కొకప్పుడు దాని తోక విపరీతముగ పెరిగిపోవును. ఇంకొకప్పుడది సంపూర్ణముగ యంతర్హితమగును. తోకచుక్కల విస్తీర్ణతను కొలువవలెనని ప్రయత్నించుట నిరర్థకము. ఏలనన వాని వైశాల్యమును నిర్ణయించిన కొలది గడియలలోనే యవి యాకారమును మార్చుకొని మనప్రయాసలను వృథపుచ్చగలవు. ఏ తోకచుక్కనైనను వర్ణించి దానిలక్షణములను నిర్ణయించినను దానినిమరల గుర్తింపజాలము. ఏలనన దాని యాకార మీమధ్య కాలములో సంపూర్ణముగ మార్పుజెందియుండవచ్చును. కాని యాతోకచుక్కలను గుర్తింప గలుగుటచాలముఖ్యము. దానియాకార మెట్లున్నను దానిని గురుతించుటకు నలయుసాధన సామగ్రిని శాస్త్రవేత్తలు ఆయత్తపరచుకొనియున్నారు.

ఈ ధూమకేతువులలో ననేకములు నియమిత కాలమున నొక్కొకసారి మనకగుపడవచ్చుచుండుట యెల్లరును గమనించియే యుందురు. ఒక తోకచుక్క యాకాశమునుండి యదృశ్యమై కొన్ని సంవత్సరముల వరకును మనకగుపడక, మరల నొక్కసారి మనదృష్టిపథమును ప్రవేశించుచున్నది. అదియటు

కొన్ని దినములు మనకగుపడి మరల క్రమక్రమముగ మనకు దూరస్థమై మరలనింకొక ప్రదక్షిణ మొనర్చుటకు అంతర్హితమగుచున్నది. అది తిరిగి వచ్చినప్పుడు దానిగుర్తించుట యెట్లు? అనెడి ప్రశ్నమునకు మనము సమాధానమునాలోచింపవలసియున్నది. దాని వైశాల్యము గాని ప్రకాశతగాని క్షణక్షణముమార్పు జెందునదగుటచే మనకవి సహాయకారులు కాజాలవు. అటులనే దానికి పెద్దదిగాని చిన్నదిగాని యగు తోకయున్నను, లేకున్నను, మనము గమనింపవలసిన పనిలేదు. కాని 'కెప్లర్' అనెడి ప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు నిర్వచించిన యొకనూతన సిద్ధాంతముయొక్క సహాయమువలన యీతోకచుక్కలను గుర్తించుట సులభ సాధ్యమగుచున్నది.

న్యూటన్, అనెడి పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞుడు, బ్రహ్మాండమునందున్న గోళములన్నియు పరస్పరము ఆకర్షించుకొనుచుండునని యొక సూత్రమును నిర్ధారణచేసి యుండెను. ఈసూత్రమే గ్రహగోళములయొక్క సంచారములను నిర్ణయించుటకు తోడ్పడుచున్నది. ఈసూత్రమునే తోకచుక్కల సంచారమును నిర్ణయించుటకుగూడ ప్రయోగింపవలెనని ఆతడే ప్రయత్నించి, సఫలమనోరథుడయ్యెను. ఆతడు గణితమువలన, 1680 వ సంవత్సరము డిశెంబరుమాసమునుంచి 1681 వ సంవత్సరము మేనెలవరకు ప్రపంచ వాసుల కగుపడుచుండిన యొకతోకచుక్కయొక్క సంచారమును నిర్ధారణచేసి, తన సూత్రమును ధృవపరచుకొనియెను.

తోకచుక్కలు సాధారణముగా చాల దూరమునుండి వచ్చి, మనసూర్యకుటుంబము (Solan System) యొక్క ఆవరణలో ప్రవేశించి, సూర్యుని చుట్టివచ్చి మరల ననంత దూరమునకు బోవుచున్నవని గమనింపబడియున్నది. అనగా, నివి బాణాకారముగల యొక పెద్ద కక్ష్య (Parabola) వెంట ననంత పథమున దిరుగుచు, సూర్యుని సమీపించిన సమయమునమాత్రము, భూమియందు నివసించువారి కగపడుచు, మరల సూర్యునకు దూరమైన కొలదిని, మన దృక్పథమును వీడి తొలగిపోవుచుండును. బ్రహ్మాండమునందలి గోళములచే నాకర్షింపబడు వస్తువులుకొన్ని బాణాకార కక్ష్యవెంట దిరుగుచుండునని, న్యూటను నిర్ధారణచేసి యుండెను. అందువలన, యీతోకచుక్కలు బాణాకార కక్ష్యవెంట తిరుగు నవియేయగుటచే, నవికూడ నాయాకర్షణ సూత్రమున (law of gravitation) కు బద్ధులైయున్నవని న్యూటను నిశ్చయించుకుని, యీసూత్రమువలననే, వాని సంచారమును నిర్ణయింపవలెనని యాతడు ప్రయత్నించెను. మన గ్రహవర్గమునకు నాయకుడగు సూర్యుడు తోకచుక్కల నాకర్షించునని యాతడెరుగును; యీతోకచుక్కలు హఠాత్తుగా ప్రత్యక్షమై, సూర్యుని చుట్టివచ్చి, మరల నెన్నటికిని తిరిగిరాకుండ యంతర్హితము లగుచుండునని యాతడు గమనించియే యుండెను. ఈతోకచుక్కలు నిశ్చయముగా బాణాకారముగల కక్ష్య (Parabola) వెంటనే తిరుగుచున్నవా? యనియాతడు సంశయించెను. కాని, యీసంశయనివారణమునకు వలయు పరికరములన్నియు నాతని

యెవట సిద్ధముగనే యుండెను. జ్యోతిశ్శాస్త్రవేత్తలు అతిజాగరూకతతోను శ్రద్ధతోను కృషిచేసి సంపాదించి యుంచిన విషయములను గ్రహించి, 1680 వ సంవత్సరములో నగుపించిన తోకచుక్కయొక్క సంచారమునుగూర్చిన ముఖ్యాంశముల నన్నిటి నాధారము చేసికొని, యాత డీవిషయమును నిర్ధారణజేయ సమకట్టెను. ప్రజ్ఞావంతుడగు న్యూటను, తనకు తెలియవచ్చిన ముఖ్యాంశములనుండి, తోకచుక్కల యొక్క కక్ష్య (orbit) ను నిర్ణయించుట కొకసులభ మార్గమును కనిపెట్టెను. ఆమార్గమును గ్రహింప గలుగుటకు గణితశాస్త్రమందు ప్రావీణ్యత యవుసరమగుటచే నిచట వ్రాయుటలేదు. కాని, న్యూటనుయొక్క కృషివలన, తోకచుక్కలు బాణాకార కక్ష్యగలవియే యని ధృవపడెను.

తోకచుక్కలలోన నేకము లిట్టిబాణాకార కక్ష్య వెంటనే తిరుగుచు, నవిసూర్యునికి చేరువలోనికి వచ్చినపుడు మాత్రమే మనకు దృగ్గోచరము లగుచుండును. కాని వానిలో గొన్నిటియొక్క కక్ష్య ఆద్యంతము లేని బాణాకార కక్ష్య కాకపోయినను, ఘనమగు అండవృత్త (Ellipse) మైయున్నది. ఆఅండవృత్తము (Ellipse) యొక్క కేంద్రమున సూర్యుడుండును. మన సూర్యకుటుంబములోనున్న గ్రహములు (భూమి, కుజుడు, మొదలగునవి) కూడ నిట్టిఅండవృత్తాకారముగల కక్ష్య వెంబడినే తిరుగుచున్నవని గత వ్యాసములందు తెలిపియేయుంటిని. కావున యీతోకచుక్కల యొక్క కక్ష్య ఘనమగు అండవృత్తము (Ellipse) అయి యుండుట, వలన, భూకుజ గుర్వాది గ్రహములవలెనే నవియును సూర్యుని చుట్టునొక నియమిత కాలములో నొక ప్రదక్షిణము చేయుచుండును. ఇట్టికక్ష్యలుగల తోకచుక్కలే మనకు తిరిగి నియమిత కాలమున కొక్కసారి కానవచ్చుచుండును.

ఈరీతిని నియమిత కాలమున కొక్కసారి తిరిగివచ్చెడి ధూమకేతువులను గూర్చి విచారించుటకు జ్యోతిశ్శాస్త్రజ్ఞు లత్యుత్సాహముతో పూనుకొనియుండిరి. అనతికాలములోనే వారి యూహలన్నిటికిని ఆధారములు లభించినవి.

హాలీ (Halley) యను శాస్త్రజ్ఞుడొక డిట్టితోకచుక్కనొకదానిని గుర్తింపగలిగెను. అదియప్పటి నుండియు నాతనిపేరనే పిలువబడుచున్నది. న్యూటను యొక్కసిద్ధాంతముప్రకారము తోకచుక్కలు అండవృత్తాకారము గలకక్ష్య (Elliptic orbits) వెంబడి తిరుగవచ్చునని హాలీ గ్రహించి నప్పటినుండియు సుమారు యిరువది నాల్గు తోకచుక్కలను గూర్చియప్పటివరకు తెలిసియుండిన ముఖ్యాంశముల నన్నిటిని సేకరించి వాని నన్నిటి నొకదానితో నొకటి పోల్చిచూచి యాతడు విశేషముగ కృషి సల్పెను. తుదకాతడా తోకచుక్కలసంచారములను నిర్దుష్టముగ నిర్ణయింప గలిగెను. వానిలోనొకటి 1682వసంవత్సరములో నగుపించినదే. హాలీ దానిని ప్రత్యక్షముగ చూచియుండెను. దాని సంచారమును గమనించి యుండెను. న్యూటను సిద్ధాంతము ప్రకారము గుణించి ఆతోకచుక్కయొక్కరాకను హాలీ తత్పూర్వమే వెల్లడిచేసియుండెను. ఇట్లు1682వ

సంవత్సరమున నగుపించిన తోకచుక్క యంతకు పూర్వ మెన్నడైన మనకు దర్శన మిచ్చియుండెనా యని యాతడు నిర్ణయింప బూనుకొనెను. ఈ ప్రశ్నకు సమాధానము గుదుర్చుటకై యాతడు అనాది నుండియు తోకచుక్క లెప్పుడెప్పుడు భూమియందలి ప్రజల కగుపడి యుండెనో యనెడి విషయమును పూర్వ గ్రంథములనుండియు, శిల్పములనుండియు సాధ్యమగునంతవరకు సంగ్రహించెను. అట్టి జాబితాలోనుండి 1682 వ సంవత్సరములో తన కగుపడియుండిన తోక చుక్కను దాదాపుగా పోలియుండి నది, యొకటి 1607 వ సంవత్సరమునందును మరియొకటి 1531 వ సంవత్సరమునందును భూలోకవాసులకు దర్శనమిచ్చి యుండెనని యతడు నిర్ణయించెను. ఈమూడును వేర్వేరు గాక నొక్కటియేమై యుండవచ్చునా? తోక చుక్కలు బాణాకారకక్ష్యవెంబడినిగాక ఘన మగు నొక అండవృత్తాకారముగల కక్ష్య వెంబడినే తిరుగవచ్చుననియు. యీతోక చుక్క 75 లేక 76 సంవత్సరముల కొక్క సారి తన కక్ష్యను చుట్టి వచ్చుననియు నూహించినంత మాత్రమున మనమిందులకు సమాధానము సమకూర్ప గలము. ఈ యూహ సమంజసమైనదగునా యని యాతడుసాధ్యమైనంతవరకుతరచిచూచెను. కాని, మూడుసమయములందగుపడిన తోక చుక్కలయొక్క కక్ష్యలను పోల్చిచూడగా, వానియొక్క సాదృశ్యము తెలిసిపుచ్చుటకు వీలుగాకుండెను. కావున, హాలీ తనయూహ ను సమంజసమైనదని సిర్ధారణ చేసికొని, దానినిజ్యోతి శ్శాస్త్రజ్ఞుల యెదుట నుంచెను. అతడా తోకచుక్కను గూర్చికొంత జ్యోతి షమునుగూడ చెప్పసాహసించెను. ఆతోకచుక్క 75, లేక 76 సంవత్సరముల కొక్క సారి తనకక్ష్యచుట్టును తిరిగివచ్చునని తేలి యుండుటచేత, దానిని యితర గ్రహము లేవియు బాధించని యెడల మరల నది 1757 లోనో లేక 1758 లోనో యగుపడ గలదని యాతడు చెప్పియుండెను. ఆకాలమువరకు తాను జీవించియుండననియు, తనజ్యోతిష మందలి సత్యాసత్యములు, తనకు తరువాత తరతరముల వారు నిర్ణయింప గలుగుదు రనియు, నాతడెరుగును. కాని, దానియొక్క ప్రదక్షిణకాల పరిమితియందుకొద్దిమార్పులు కలుగు చుండు ననియు, నందులకుగల కారణములును కూడ హాలీ సూచించి యుండెను. ఈతోకచుక్కయొక కాలమందు బృహస్పతి గోళమునకు చేరువయగుననియు, నందువలన సూర్యకుటుంబములోని గ్రహ ములలో నెల్ల పెద్దదగు నాగ్రహము వలన నాకర్షింపబడి, నిజమార్గమునుండి కొంత వరకు తొలగిపోవుననియు, నందువలన నది 1758 వ సంవత్సరాంతముననుగాని 1759 వ సంవత్సరారంభమందుగాని రావచ్చుననియు హాలీ నిర్ణయించెను.

ప్రపంచమున కనర్థదాయకములని యెడి ప్రతీతిని బడసినట్టియు, నియమబద్ధ ములుగాక హఠాత్తుగా నాకసమున ప్రత్యక్ష ములై, మరల నంతర్హితములగు నట్టియు ని వింత వస్తువుల స్వభావమును గూర్చియు, వాని భావి సంచారమును గూర్చియు స్థాపింపబడి నయీనూతన నాంశములు ఆధునిక జ్యోతిశ్శాస్త్రజ్ఞుల ప్రజ్ఞాశక్తులను వెల్లడిచేయు చున్నవి. హాలీ తాను కనుగొనిన విషయ ములు చాలప్రాముఖ్యములని యెరిగియే

యుండెను. కాని, ఆతోకచుక్కయొక్క ప్రదక్షిణము పూర్తికాక పూర్వమే, తన యొక్క జీవయాత్ర పూర్తియగునని కూడ యాతడెరిగియే యుండెను. ఆతడాసమయమున వ్రాసియుండిన యీక్రిందివాక్యమును బట్టి యాతని భావములెట్లుండునో గ్రహింపనగును. "నేను చెప్పినప్రకారము ఆతోకచుక్క తిరిగి 1758 వ సంవత్సర ప్రాంతముల ప్రజలకగుపడినయెడల, నిష్పాక్షికబుద్ధితో నాలోచించువారందరు నీతోకనాశము నొకయాంగ్లేయుడు మొట్టమొదట కనిపెట్టియుండెనని యొప్పుకొనక పోరు."

ఈ నియమితకాలము చేరువదైన కొలదియు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులీవిషయమై యత్యుత్సాహముతో నాలోచింప జొచ్చిరి. క్లయిరో అను సుప్రసిద్ధ గణిత శాస్త్రజ్ఞుడు, నూతన పద్ధతుల వలన, గ్రహముల ఆకర్షణకులోనైన యీతోకచుక్క యొక్క సంచారమున నెట్టి మార్పులు కలుగునదియు గుణించెను. ఆతని లెక్కలవలన, యీతోకచుక్క శనిగ్రహముయొక్క ఆకర్షణ వలన 100 దినములును, బృహస్పతిగ్రహము యొక్క ఆకర్షణవలన 518 దినములును ఆలసింపబడుననియు, నందుచే, 1759 వ సంవత్సర యేప్రియల్ మాస మధ్యమందు సూర్యుని కతి చేరువలోనికి వచ్చుననియు నిర్ణయించెను. హాలీయొక్క మార్గమునే పట్టిపోయి, సూక్ష్మతరములగు కొన్నిగణిత పద్ధతులవలన క్లయిరో, తోకచుక్క వచ్చెడి మాసమును నిర్ణయింపగలిగెను. ఈక్లైరో కాలమునాటికి, యురేనస్, నెప్ట్యూన్ అనుగ్రహములు సూర్యునిచుట్టును దిరుగుచుండెనని శాస్త్రజ్ఞులు గమనించియుండకున్నను, ఆతడు దూరదృష్టి గలిగినవాడగుటచేత, నిట్టిగ్రహముల యునికి నూహించి, వాని యాకర్షణ వలన నాతోకచుక్క యునికను కొన్నినాళ్లు తడవు చేయవచ్చునని వ్రాసి యుండెను. కావుననే, ఆతోకచుక్క తిరిగి వచ్చుటను గూర్చి తాను నిర్ధారణ చేసియుండిన సమయమున కొకనెలదినములు వెనుకగాని, ముందుగాని, యది మనకగుపించవలెనని యాతడు వ్రాసెను. క్లైరో యీవిషయములను 1758 సం॥ రము నవంబరు 14 వ తేదీని శాస్త్ర పరిషత్తు ( Acadamy of Sciences ) వారికి తెలియజేసెను. జ్యోతిశ్శాస్త్రవేత్తల కిందు నమితశ్రద్ధ జనించి, డెబ్బదియారు సంవత్సరముల క్రింద నగుపడియుండిన యాతోక చుక్క మరలవచ్చునేమో చూడవలెనని యెడి ఉత్సాహము హెచ్చెను. ప్రతిరాత్రియును, ప్రపంచమున వేర్వేరు స్థానములందనేకమంది శాస్త్రజ్ఞులు దూరదర్శనియంత్రముల సహాయమువలన నాకాశమును పరిశీలింప జొచ్చిరి. 1758 వ సంవత్సరము డిసెంబరు 25 వ తేదీ నాడాతోకచుక్క యాకాశమునందు ప్రథమదర్శనమిచ్చెను. 1759 వ సంవత్సరము మార్చినెల 12 వ తేదీనాడు దాదాపు అర్ధరాత్రివేళ నది సూర్యుని కతి సమీపస్థమై యుండెను. అనగా క్లయిరో నిర్ణయించి యుండిన సమయమున కొకనెల పూర్వమే యదియగుపడెను. అయినను, క్లయిరోయొక్క గణితమును మనము మెచ్చుకొనకతీరదు.

హాలీ కనుగొనియుండిన యీతోక చుక్క, ఆతనిపేరనే (Halley's comet E)

అని పిలువబడుచున్నది. అదిమరల నొకసారి 1835 వ సంవత్సరమునందును, 1910 వ సంవత్సరమందును మనకగుపడినది. అంతేగాక ప్రాచీనకాలమందగుపడియుండిన తోకచుక్కల చరిత్రలను పరిశీలించి చూడగా, హాలీ తోకచుక్క, యిదివరకనేక పర్యాయములు ప్రపంచవాసులకగుపడియుండెనని తేలినది. క్రీస్తుశకారంభమునకు పదునొకండు సంవత్సరముల పూర్వము ప్రకాశవంతమగు నొకవింత వస్తువాకాశమున గొన్నాళ్లగుపడెనని ప్రాచీనగ్రంథములందు వ్రాయబడియుండెను. అది యీహాలీ తోకచుక్కయే నని శాస్త్రజ్ఞులూహించుచున్నారు. ఇది 1066వ సంవత్సరములో నగుపించియుండెను. ఆకాలమున రంగుదారములచే నల్లబడిన యొకచిత్తరువులో, యీతోకచుక్కదృశ్యము చిత్రింపబడియున్నది.

ఈ హాలీ తోకచుక్క వలెనే అండవృత్తాకారముగల కక్ష్యవెంబడి తిరుగుచు నియమిత సమయమున కొక్క పర్యాయము కక్ష్యనంతను చుట్టివచ్చెడి తోకచుక్కలింకను అనేకములు కలవు. కానియివియన్నియు దూరదర్శిని యంత్రము ద్వారా చూచిన గాని మనకగుపడవు. ఇదియే హాలీ తోకచుక్కకును వీనికిని తారతమ్యము. హాలీ తోకచుక్క చాల పెద్దది యగుటచే నెల్లరకును గాన్పించును. కాని మిగిలినవన్నియు చాల సూక్ష్మములగుటచేత వాని రాకయు పోకయు మనకు తెలియనే తెలియదు. ధూమకేతువులు పెక్కులు, హాలీ తోకచుక్క కంటె తక్కువ కాలములోనే తిరిగితిరిగివచ్చుచుండును ఎంకీ(Encke)యను శాస్త్రజ్ఞుడు కనుగొనిన తోకచుక్క యిట్టివానిలో ప్రాముఖ్యమైనది.

ఈతోకచుక్క సంచారము చాల వింతగనున్నది. దీనిని గమనించుచుండుటచేత న్యూటను నిర్మించిన చలన సూత్రములును (Laws of motion) ఖగోళములయొక్క పరస్పరాకర్షణ సూత్రమును (Law of gravitation) ఋజువైనవి. ఇది గ్రహగోళములను బోలి నియతిదప్పక సంచరించునది కాదు. సూర్యుడు ప్రతితోకచుక్కను ఎల్లప్పుడును ఆకర్షించుచునేయుండును. అంతేగాక సూర్య కుటుంబములోని యితర గ్రహగోళములును కొంతవరకు వానిని ఆకర్షించుచునేయుండును. గోళములు పరస్పరమెట్లాకర్షించుకొనునో ఆకారణముచేత వాని సంచారమునందెట్టి మార్పులు కలుగుచుండునో నిర్ణయించుటయందు ఆధునిక గణిత శాస్త్రజ్ఞులసమాన కౌశలమును కలిగియున్నారు. సూర్యుని ఆకర్షణశక్తిలోనై, యేగ్రహగోళమే స్థానమున నుండునదియు యితరగ్రహగోళములు దానినెట్లాకర్షించి యేస్థానమున కీడ్చునదియు నిర్ధారణచేయుట సులభసాధ్యము. వానిలో తోకచుక్కల వంటి అస్థిమితకక్ష్య గలవాని సంచారమును గ్రహగోళములు తమఆకర్షణశక్తి వలనవిశేషముగ మార్పుదల చేయగలుగుచున్నవి. తోకచుక్కలు కొన్నిసమయముల యందు గ్రహగోళముల కతిచేరువగా పోవుచుండును. అట్టిసమయముల యందు తోకచుక్కయు గ్రహగోళమును డీకొను నెడల నాగ్రహగోళమునం

దును, అందుమూలమున యితరగ్రహగోళములయందును మహావిప్లవము తటస్థింపగలదు. కాకున్న తోకచుక్కయొక్క గ్రహగోళమున కతిచేరువలో నుండిపోయిన యెడలనైనను ఆగ్రహము యొక్క ఆకర్షణశక్తి అపరిమితమై ఆతోకచుక్కను ముందునకు కదలిపోకుండ చాలకాలము ఆపివేయగలుగుచున్నది.

ఎన్నడో యొకప్పుడుమాత్రమే మనకు హఠాత్తుగ దర్శనమిచ్చి కొలదికాలమున కంతర్హితములై మరలనెన్నడును తిరిగిరాని అస్థిమిత ధూమకేతువుల పరిశోధనలయందు కావించెడి పరిశ్రమ యంతయు సాధారణముగా తోకచుక్కల సంచార క్రమమును నిర్ణయించుటకు మనకు విశేషముగ తోడ్పడవు. అట్టివి ప్రథమ పర్యాయము మనకగుపడి, మరలనెన్నడును మనకంటబడవు. ఇట్టి తోకచుక్క అతిదీర్ఘమగు నొక బాణాకార కక్ష్య వెంబడి తిరుగుచు సూర్యుని చుట్టు నొక్కసారి ప్రదక్షిణమొనర్చి మరల నంతరిక్ష మార్గమున నంతర్హితమగుచున్నది. కాని గ్రహగోళములు తోకచుక్కల నెట్లాకర్షించునదియు వాని సంచారక్రమమున నెట్టి మార్పులను కలిగించునది తెలిసికొనవలెనన్న నియమితకాలమున నొక్కసారి సూర్యుని చుట్టివచ్చుచు ననేకపర్యాయములు మనకగుపించెడి వానిపైననే పరిశోధనలను సలుపవలసియున్నది. వీనిలో మనకు చాలవీలుగానుండు దానినే మనము యేరికొందము. దీనిని ఎంకీతోకచుక్క (Enekis Comet) యందురు. దీనిని మొట్టమొదట కనుగొనినది ఎంకీకాకపోయినను దీనిని గూర్చిన విశేషాంశములను పరిశోధన చేసిన దాతడే యగుటచేత నిది యాతనిపేర పిలువబడుచున్నది. ఆధునిక పరిశోధకులు దీని సంచారమును గమనించి చాలపరిశ్రమ మొనర్చినందున యిదియే మనకు చాల సలువైనది.

1818వ సంవత్సరమున ఫ్రాన్సు దేశములోని మార్సెలీసు పట్టణవాసియగు పాన్సు (Pons) అను సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడొక తోకచుక్కను కనుగొనియుండెను. ఇదిఆకాశమున నొకమనోహరదృశ్యముగ నెల్లరకును గన్పించెనని యనకొనకుడు. అది కంటికగుపడునంతటి పెద్ద వస్తువు కాదు. దూరదర్శిని యంత్రద్వారమున చూచిన యెడల నదియనేక నక్షత్రములు గుమికూడియుండిన మండలబీజము (nebela) వలెనగుపించుచుండెను. ఇది చూచుటకు మండలబీజము వలెనేయున్నను నిజముగ తోకచుక్కయే. రెంటిలో నేదైనదియునిర్ణయించుటకు మనమాకాశమును కొన్నాళ్ళు పరీక్షించుచుండినచాలును. ఏలననగా మండలబీజములు ఆకాశమున స్థిరములు. యుగములు గడచినను అవి యొకేస్థానమునునిలుకడగ నుండును. కానితోకచుక్క యట్లు కాదుగదా? యది ఎల్లప్పుడును కదలుచునే యుండును కావున యట్లగపడిన వింతవస్తువు దిన దినము కదలుచుండుటను గమనించి పాన్సుపండితుడు యిది తోకచుక్కయేనని నిర్ణయింప గలిగెను. 1818వ సంవత్సరమున పాన్సు యీ క్రొత్త తోకచుక్కను చూచి యీ విషయమును తనదేశమున వెల్లడిచేయగా ననేక శాస్త్రజ్ఞులు దూరదర్శిప

యంత్రముల వలన దానిని గుర్తింపగలిగిరి. యీతోకచుక్క షుమారు మూడుసంవత్సరములలో నొకసారి సూర్యుని సమీపించుచుండునని ఎంకీ యనునాతడు ప్రచురపరచెను. ఈప్రకటన చాల ఆశ్చర్యమును కలుగజేసెను. ఇంత స్వల్ప కాలములో సూర్యుని చుట్టివచ్చెడి తోకచుక్క యొక్క టివైనను అంతకు పూర్వమెవ్వరును గమనించియుండక పోవుటవలననట్టిదాని యొక్క ఉనికియు నది మనసూర్య కుటుంబములో చేరియున్నదని యెడివిశేషమును చాల ఆశ్చర్యమును కలుగజేసెను. ఇంత తరుచుగా సూర్యుని చుట్టును తిరుగుచుండెడి ఈతోకచుక్కను అంతకు పూర్వమెవ్వరును గురుతింప జాలకుండుటకు కారణముల నరయ జూచిరిగాని తత్పూర్వము కనుపడిన వందలకొలది తోకచుక్కలలో పాన్సుచే కనుగొనబడినది యేదియో నిర్ణయించుట యెట్లు?

ఈ తోకచుక్కలను చూపులను బట్టిగుర్తింప బూనుట నిరర్థకము. కాని ఆకారము మారి పోయినప్పుడు కూడవానిని గుర్తించుటకు వలయు సాధనములు మనకు లభ్యమైనవి. దాని యొక్క ఆకారము మారినను, అది ఆకాశమునందు తిరిగెడిమార్గము మార్పుజెందదు. ఈతోకచుక్క తిరిగెడి కక్ష్య యొక అండ వృత్తము. ఈ వృత్తముయొక్క కేంద్రమున సూర్యుడున్నాడు, ఈతోకచుక్క కక్ష్యయందే భాగముగాని బృహస్పతి కక్ష్యను దాటిపోలేదు. అనగా యిది యెన్నడును బృహస్పతి కంటె యెక్కువదూరమునకు పోదు. సూర్యుని ఆకర్షణశక్తివలన నీతోకచుక్క అండవృత్తాకారముగల కక్ష్యనెంట సుమారుమూడు సంవత్సరములలో నొకసారి సంపూర్ణప్రదక్షిణము చేయుచున్నది. అది యీకాలములో నొక్కసారి సూర్యునికి బుధగ్రహముకంటె కూడ నతిచేరువలోనికి వచ్చుచున్నది. సూర్యునకత్యంత దూరస్థమై యున్నప్పుడది బృహస్పతి కక్ష్యకు చేరువయగుచున్నది. ఈతోకచుక్కయొక్క కక్ష్య అండవృత్తాకారమునునుండుటకు సూర్యుని ఆకర్షణశక్తియే ముఖ్యకారణము. ఈతోకచుక్కలోని పదార్థము యొక్క బరువు ఒక వీశెడైనను మణుగైనను వేయిబారువులైనను కోట్లకొలది బారు ప్రతైనను అదిసూర్యునికి పదిమైళ్ళదూరములోనున్నను అదియెంత బరువుగలిగి సూర్యునికెంత దూరములోనున్నను దానియొక్క కక్ష్యమారదు. ఈఅండవృత్తముయొక్క ఆకారమునుబట్టియు దాని విస్తీర్ణతనుబట్టియు, దాని స్థానమును బట్టియు మాత్రమే మనమాతోకచుక్కను గురుతింప గలుగుచున్నాము. దీనిని 1786 1795, 1805 సంవత్సరములందు చూచియుండిరేగాని దీని కక్ష్య కోణాకారము గలది కాదనియు అండ వృత్తాకారము గలదనియు, అందువలన నొక నియమితకాలములో తిరిగి రావచ్చుననియు నెవ్వరును తలచియుండలేదు. ఆరహస్యమును గ్రహించిన గౌరవము1818 న సంవత్సరమున పాన్సుపండితునకు లభింపవలసియుండెను.

ఈ ఎంకీ తోకచుక్కసాధారణముగా సూక్ష్మతరమై యుండుటవలన ఎంతటిశక్తిగల దూరదర్శిని యంత్రముగుండా చూచినను, అది మనకగుపడక పోవచ్చును. నియమిత

కాలముననది సూర్యునకు చేరువలోనికివచ్చిన పిదప క్రమక్రమముగానది మనకు దూరస్థమై దాని కక్ష్యయొక్క దూరప్రదేశమువరకు పోయి మరల సూర్యుని సామీప్యమునకు తిరిగి వచ్చుచుండును. సూర్య కిరణ ప్రసారమువలన దాని ప్రకాశత యుప్పొంగుచున్నట్లు పరిశోధనలు సూచించుచున్నవి. అదిసూర్యునకు చేరువలోనికి వచ్చునపుడు భూమికికూడ చేరువయగుచుండును కావున దాని ప్రకాశత దినదిన ప్రవర్ధమానమగును. తుట్టతుదకు అది చాలప్రకాశవంతమగుటచేతను భూమికి సమీపస్థమైనదగుటచేతను దూరదర్శని యంత్రద్వారమున చూచినయెడల మనకు అగుపడగలదు. అదియెన్నడు సూర్యున కతిచేరువలోనికి వచ్చునో ముందుగనే తెలిసికొనగలము. అది ఆకాశమున యేభాగమున నగుపడునో కూడ యెరిగి మనదూరదర్శనియంత్రములను ఆదిక్కునకు యెక్కుపెట్టుకొని యుండినయెడల దానిని చూడగలుగుదుము. ఈ తోకచుక్క గణిత శాస్త్రజ్ఞుల బారినుండి తప్పించుకొని పోజాలదు. వారు ఈతోకచుక్క యెన్నడు యేభాగమున నగుపించునదియు చెప్పగలరు కాని అది యేఆకారమును దాల్చి యుండునో యెవ్వరును చెప్పలేరు.

(సశేషము)

## ప్రేమబలము ‡

[పాతూరి అంజయ్యగారు.]

తీపిగోల్పోయె ప్రమదమాధ్వీరసమ్ము
జాఱె జీవిత సుషమ వసంతశోభ
బీసువడి, ముగ్ధశారద శోభితముగాని,
శిథిలఖిలమయ్యె భౌతికజీవితంబు.
విఫలమయ్యె నానంద గవేషణంబు
వ్యర్థమై పోయె సౌహార్ద ప్రార్థనంబు
ఈశుఁడీ దీనురాలి భరింపఁడేని
నామనవు లేమొ శుష్కతృణాధమములు.
కాని మఖ్ఫి † కనుల్విచ్చి కాంచవమ్ము
భీకరనిరాశ హర్షగర్భితమొ యేమొ
ప్రణయ పథమున జరణముల్ బడల వేని
అభినవాశా బలమ్ములు హత్తునిజము

‡ 'జేబున్నిసా' కు అనువాదము.

† జబ్ — ఉన్ — నిసా కింకొక పేరు.

# మాతృదేశము



(కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు జమీందారుగారు)

చం॥ పరిభవతప్త సంభరిత • భావకృశత్వము మాన్పి ధర్మసం
గరవిజయాను మోదపరి • కల్పిత చిత్తనుగా నొనర్చి త్వ
చ్చరణ సరోజభక్తి వివ • శత్వము గాంచనివాఁడు పుత్రుఁడా
మరియనుకూల శత్రుసుతుఁ • మా? తలపోయగ మాతృదేశమా॥

చం॥ ఇరువది యైదువేల సుతు • లందనుకన్ జెరసాల కేగుదెం
చిరిభవదీయ దాస్యమున • శింపఁగఁ జేయ మహాత్ముఁడాఱువ
త్సరముల శిక్షకై కొనెని • తత్పరమే మెఱుగంగ రాద ఈ
శ్వర కరుణారస ప్రభవ • శక్తిఁ దరింతుము మాతృదేశమా

ఉ॥ కారలఁ జిక్కినట్టి సుతి • కాండముగాక ననేక మందియు
న్నారలు నాయకుల్ కొదవ • నాకొకటుండ దటంచు లెంచి తే
వారలు ద్రోహులై పిఱికి • పందలకంటెను హీనులౌచు నీదా
దారికి రారు లాభమొ? వృథా దురపేక్షల మాతృదేశమా॥

చ॥ చెఱలఁ గృశించి వెల్వడెడి • సింగములో యన దండ తాడిత
స్ఫురదురు కాల సర్పముల • బోలిన నాయకులెల్ల మారితో
త్కరయుత నైజసత్వసము • దాయ పరిగ్రహణైక శాంతి మా
ర్గరతిఁ జరించి తప్పక స్వ • రాజ్యము దెత్తురు మాతృదేశమా॥

ఉ॥ మానవ జన్మమెత్తి యభి • మానవిహీనతర ప్రభాపరా
ధీన నికృష్టదాస్యధ్వత • ధీరసమున్నతులౌట కంటె తీ
వ్రానల దగ్ధదేహులగు • టర్హము భారత పుత్రులెంచు నే
డాన వహించి యుంటిమి త్వ • దగఘ్రిలసాక్షిగ మాతృదేశమా!

ఉ॥ ప్రాణము లొడ్డియైనను స్వ • రాజ్య లలామ పరిగ్రహింప నీ
సూనుల నూన సత్వగుణ • సూనృతసంభృత సత్యులైరి ఏ
మైనను దాస్యముక్తి తిర • మంచు దలంపగవచ్చు నేడో రే
పో నియలావ నివిదిత • పూజిత వయ్యెదు మాతృదేశమా॥

చం॥ బ్రతుకుట సంభవించిన స్వ • రాజ్య ఫలాను భవప్రభాయశో
న్వితులయి సంచరింత్రు మర • ణించిన స్వర్గసుఖానుభోగ సం
తతి దులదూగ నేర్తురి ద్వివి • ధంబుల నెందును భారతాదివనీ
సుతులిక గాఁగఁలారు పరి • శుద్ధ చరిత్రులు మాతృదేశమా॥

ఉ॥ రాదు స్వరాజ్యలక్ష్మి మనఁ బ్రాంతిలఁ గూర్తల బంధు మిత్రపు
త్రాదికళత్రయుక్తముగ హైందవ వంశము లెన్నియో స్వతం
త్రోదయ భాస్కరోగ్ర కిరణోద్ధతి భస్మము గాక యున్న పరి
హ్లాదసమాను లట్టి సమయంబున గావలె మాతృదేశమా. ౫౩

చం॥ పలుకుల సత్వరిం స్వపరి పాలన మబ్బునె। కౌర్య హీనసం
కలితగుణ ప్రభాతనయ కాయ విధూత గవోష్ణ రక్తధా
రలు బలిలేక సాత్వికని రాకరణోద్యమవృత్తి బ్రాణమీ
వలసిన యాత్మసంగి గల వాఁడె కృతార్థుడు మాతృదేశమా.

ఉ॥ శ్రీవరిపరాక్ర మోగ్రసము దీర్ఘకళాకలిత ప్రభాసిదా
రావరిత సాహసోద్ధతి స్వరాజ్యము సంగ్రహించి యిచ్చి మాతృధా
స్వవ్రణ బాధమాన్పుట పసవ్యపథంబని త్యాగశాంతి స
త్యవరిత దీక్షనూనిరి మహత్తర మయ్యది మాతృదేశమా॥

ఉ॥ ఖద్దరె పారతంత్ర్య జనకాండనికృష్టదశాపరాభవా
పద్దమ దివ్యమంత్రమని బంధితు డయ్యెను గాంధిపద్దవే
అద్దియు స్వాత్మగౌరవ పదేతర చిహ్నవిదేశ వస్త్ర స
మ్మర్దహ నాప్రమేయమె అమోఘ తరాస్త్రము మాతృదేశమా॥

ఉ॥ గాంధి మహాత్మ బోధల ప్రకారము ప్రస్తుతపున్ ప్రభుత్వని
ర్బంధ విధానమందిన స్వరాజ్యము వచ్చుటె కాదు చిత్తసం
బంధ విశుద్ధ వర్తన శుభంబొనగూడును స్వాత్మ గర్వదు
ర్గంధ విమోచనాది గుణ కాండము వెల్వడు మాతృదేశమా॥

ఉ॥ న్యాయములేని నేరమెది యైనను మోపియు రచ్చకీడ్చి దే
శీయమహా సభావిధుల జిందరవందర జేయఁ గల్చిపో
పాయములన్ బరిభుత్వమది బన్నిన సెక్యురిటీలు స్యూరిటీ
లీయక త్యాగబుద్ధి జెలఁ లేవరి యింతుము మాతృదేశమా॥

చం॥ అనఘులు మున్ను నేడు సుఖ మబ్బదు కష్టము లేక నంచుఁ జా
టినదె మహాత్మగాంధి ప్రకటించె పరిభుత్వపు శిక్షలెల్లనో
ర్చిన యపుడే స్వరాజ్యముఁ బరిగ్రహియింపఁగ నేర్తురుగాక నీ
తనయులు స్వేచ్ఛయా? తనకు దాలభి యింపదు మాతృదేశమా॥

ఉ॥ పొట్టలపైని బ్రాఁకుగతి పుట్టకయుండెడి యట్లు వీధులన్
బట్టిన లంతలన్ విగత వస్త్రుల జేయని యట్లు తప్పులే
నట్టి జనాళి శస్త్రవిలయాగ్నుల బ్రేల్చని యట్లు ఖద్దరి
ప్పట్టున నిర్వహించి నిరపాయ మొనర్చును మాతృదేశమా॥

# నవలల ప్రభూతి



[ ధర్భా యజ్ఞేశ్వర సోమయాజులుగారు బి. ఏ. ఎల్. టి ]



## నవల లందలి ప్రీతి.

నవలనుఁగూర్చి విస్తీకరించి వ్రాసిన వాదము లందొక కొన్ని మాత్రమే వాని రామణీయమును వాని నైతిక విశేష భావాది నైసర్గిక గుణములును, వాని సర్వజనాను రంజన గుణప్రభావమును, గూర్చి స్వల్పముగా వాకొనుచున్నవి. ఆయా దేశస్థులకు వివిధ యంతరముల యభిరుచులీనవలలందున్నట్లు మనకుఁ దెలియుచున్నది. ఇంతియుకాక యొక్కొక దేశమునం దొక్కొక జాతి నవలయన్న నాదరము మెండుగ నుంటనుకూడఁ జూచుచున్నాము. వివిధ విమర్శన విద్వేషములు గల ప్రఖ్యాత కాల భాగము లందుఁ గూడ నివి పెంపొందుచునే యున్నవి. ఇవి యాయా దేశము లందనేక శతాబ్దముల పూర్వము నుండియు వృద్ధిఁ జెందుచున్నట్లు వాఙ్మయ చరిత్రల పూర్వకముగఁ దెలియవచ్చుచున్నది.

అందఱకును నవలయం దనురాగమున్న దనుటచే నవలలకు మిక్కుటమగు ప్రభూతి గలదని భావించుటనుచితము. వాచకుల బుద్ధి చాపలమును ప్రకటించుచుండునేగాని వారి నైసర్గికగుణములం దెట్టిమార్పును గూడ నవలలు కల్పింప నేరవను ప్రతీతి యొకటికలదు. ఇయ్యది నిక్కమే యైనచో సాంఘిక పరిస్థితులను సాంఘికోద్యమాశయాదులను ప్రకటించుచు, చదువరులకు సంఘ విజ్ఞానమును కల్పించుటకై నవలలుపయోగించుచుండ వలెనను నవలల ముఖ్యాశయమున కిదియే ప్రతిఘాతముగా పరిణమించుచుండుట తథ్యము. చాల విషయములనుఁ బట్టిచూడ నవలలు సాంఘిక విశేషములమీద విశేష ప్రభూతిగల వానివలె కాన్పించుచున్నవి.

## బీజములు.

స్వీయ చరిత్రము లందలి చరిత్రాంశములు నవలల ప్రచారవిషయ జాలమునకు నాధారభూతములగుచున్నవి. విమర్శకుల యభిప్రాయములు నను కృత్యములు వినోదార్థాను కారణ కవితలు నాటక ప్రకటనములు మున్నగు వీనినిఁబోల్చి చూచినచో నవి యన్నియు వివిధ చారిత్రక కాలభాగముల మీదను సాంఘిక సమ్మేళనముల మీదను ప్రభూతి గలవానివలె కనపడుచు తమతమ ప్రభూతి తీక్ష్ణమును ప్రకటించుచుండును. స్వీయ చరిత్రముల మూలమున నవలల నాయా కాలములందలి ప్రఖ్యాత విద్యాధికు లెట్లామోదించిరో తేటపడుచుండును. ఆయా మానవులయొక్క సహజ మానుష వికారములకు తగినంత యెడమును విడిచి, యాయా నవలలను గూర్చి యాయా మానవులకును, వారివారి మిత్రబృందములకును నెట్టి యాంతరంగికోద్దేశములును భావములును, గలవో యను విషయమును కూడ తీవ్ర విమర్శనముతోఁగూడిన గ్రంథజాలావలోకనమునం జేసి నిర్ణయింప వచ్చును. ఇవి యన్నియు బాహిర బీజములని పిలువఁ బడుచున్నవి. ఇట్టి యుద్దేశాదుల నెల్లఁబోగుచేసి పరీక్షించిన తరువాత, నా నవలనే తీసికొని శ్రద్ధతోఁ జదివి యాయాప్రభూతుల యదార్థ కారణములను తెలిసికొన వచ్చును.

## కాల విభాగము.

నవల లందు ప్రభగల విషయములు మానవస్వభావాదు లంత ప్రాత విషయములు. నవలయొక్క రూపమునందలి ప్రాథమిక విషయజాలమగు నిర్వృత్తము, సంభాషణము, పాత్రసమ్మేళనములు నన్నవి లిఖితములైన విషయములకంటె చాల పురాతనములైన వానివలెనే పొడగట్టుచున్నవి. అన్యోన్యస్థితులును, నీతి వృత్తముయొక్క బాహ్య రేఖలును, నాదర్శక పాత్రములును నన్నవికూడ చాలపురాతన విషయములుగనే పొడగట్టుచుండును. వివిధ నవల జాతుల తత్వ నిరూపణమును నేదేని యొక రీతిగ ప్రకటించితిమేని వానియందు నిశ్చయముగా గర్భితములైన చరిత్రాత్మకములగు నాకర్షణ గుణములున్నట్లగపడును. ఏదేని గ్రంథము యొక్క జీవిత కాలమున్నది. దానిమీద నొక కొందఱికి మాత్రమే గల చరిత్రాత్మకాభిలాష యున్నకాలమునో లేక దానికి ప్రఖ్యాతిగల కాలావధినో లేక దానియందందఱకునుఁ గల యభిలాషయు ప్రస్ఫుటమగు ప్రాశస్త్య మున్నట్లు భావింపబడు కాలమునో ప్రకటించుచుండును. ప్రఖ్యాత నవలలను జాగ్రతతోఁ జదువునపుడది ప్రప్రథమమున వెలువడినప్పటినుండియు దానికి ప్రగమసంవత్సరమునను తరువాత రెండుమూఁడు దశల వఱకును గల వ్యాప్తత ప్రభూతులను గూర్చి కూడఁ దెలిసికొను టుచితము. ఆయా గ్రంథ జాలమునందేని లేక యాయా గ్రంథములందేని తాత్కాలికములగు నుల్లాసాదులు కొన్ని, కొన్ని కాలావధు లందు తిఱుగగల్గుచుండుట యన్నది గూడ నొక సామాన్య ధర్మమే.

## అంశీకరణము.

ప్రఖ్యాత నవల లన్నియు దేశ పరంపరల సంబంధ యుతములగు ప్రాముఖ్యమును వాఙ్మయాత్మక ప్రభూతినిఁగూడ గలవియే యగుచున్నవి. వివిధ దేశస్థులకు నేదేని యితర దేశస్థులందుండెడి యేజాతి మానవుల జీవితాదులగూర్చి చెప్పు సాధనములుగ వర్తించునవి నవలలే.

ఏదేని యొక నవలకు, దాని స్వదేశమున దానికి గల గౌరవ విశేషములు, పరదేశమునందు కూడ నుండుననుకొనుట కేవల మనుచితము. అభిప్రాయ వ్యత్యాసములు ప్రస్ఫుటముగఁ గాన్పించుచుండినచో నాయావాచకుల సాంఘిక, రాజకీయ విషయములకు సంబంధించిన విజ్ఞానావలంబనము విమర్శన వ్యాపారములకుఁ దోడ్పడి, హృదయరంజన మొనరించుచుండును. గ్రంథము యొక్క యనువాదముల సంఖ్య యాగ్రంథమున కితర దేశములందు గల వ్యాప్తత, ప్రఖ్యాతులను ప్రకటించుచుండును.

## వాఙ్మయముమీద నవలలకు గల ప్రభూతి.

భారత భాగవతములకు వలెను, మనుచరిత్రాదులకు వలెను వాఙ్మయముమీద ప్రభూతిగలదియు భాషాసమితులచే నాదర్శభూతగ్రంథముగఁ బరిగణింపఁబడి శ్లాఘింపఁబడుచున్నదియు నగు ప్రఖ్యాత నవలయొద్దియునుఁ గానరాదు. వాఙ్మయముమీద నేదో యొక విధమైన ప్రభూతిగల నవలలొకకొన్ని యున్నవి. వాఙ్మయమున నూత్న రీతులను కల్పించుటకేని లేక రూపుమాపుటకేని నవల కర్త సామర్థ్యముఁ గలవాఁడగుచున్నాఁడు. నవల కర్తకు దృఢనిశ్చయులైన శిష్యులును, వాని విధుల ననుసరించెడి చపల చిత్తులగు నొక కొందఱనుచరులును కూడనుందురు. కొన్ని సమయములందు వీరికి ప్రతిహతముగ ప్రవర్తించుట యందే బుద్ధిగల వారుకూడ పొడగట్టుచుందురు.

ఇతర నవలల మీదనే దేనియొక నవలకుఁ గల ప్రభూతిని సులభముగ గ్రహింప శక్యమగు నట్లొనర్చునది యానవలయందలి ప్రధాన విషయము యొక్క స్వయం ప్రకాశగుణమే. చాల నవీన నవలలకు మాతృకలుగ గాన్పించు ప్రఖ్యాత నవలలలో

కొన్నిటిని సాధారణముగఁ జూచుచునే యున్నాము. ఇట్టి మాత్రుక గ్రంథములతోడి చిర పరిచయము నవలల చరిత్రను సంపూర్ణముగ గ్రహించుటకు తోడ్పడుచుండును. నవలలన్నియు నొకకొన్నిటికి మాతృకలైనట్లుగను మఱికొన్నిటికి సంతతులైనట్లుగను కనబడుచుండును; ఇవి నూత్న నవలల సంతతులకు ప్రేరకములుగఁ గూడ పరిణమించుచున్నవి

నవలల యభివృద్ధి యొకవిధముగా వాఙ్మయము యొక్క విమర్శనముమీద కొంత ప్రభూతి గలది యగుచున్నది. లాక్షణికు లొనర్చు పృథక్కరణములను గూర్చిన వాదములను నవలలు ప్రచారములోనికిఁ గొని వచ్చుచుండక పోయినను వానిని రూప పరిణామ మొందు నట్లొనర్చుచున్నవి. నవలల విమర్శనమే వాఙ్మయముయొక్క విమర్శన మని యొక కొందరి యభిమతము.

చరిత్రలను గూర్చి సామాన్య మానవులకుఁ గల యూహలను మార్చుటకే కాక, చరిత్రల రచన యందుఁగూడ మార్పుల నొడ గూర్చుటకుఁ గూడ నవలలు తోడ్పడుచున్నవి.

## సాధారణసంఘ సమ్మేళనములు.

నవలని సాధారణ స్థితులందొక్క మానవునికి మాత్రమే సంతోషమును కల్పింపగలదు. శిల్పము, గానము, ఉపన్యాసము, నాటకము నను నితర కళలు చాలమందికేక కాలమున సంతోషము కల్పింప గల్గుచున్నవి. సంకేత సాంఘిక సమ్మేళనముల యొక్క మార్పుల ప్రభూతిచే సంఘములయొక్క యంగీకారములను బడసి వానిని రంజింపఁజేయుటంత సులభమైన పనికాదు.

ఆశ్చర్యమును పుట్టించు విషయ జాలమెంత మట్టునకు గ్రంథకర్త స్వాధీనమగుచున్నదో దాని ననుసరించి యాతఁడు వ్రాసిన నవల పూర్వకముగ దానియందలి సాంఘిక విశేషముల జ్ఞానము చదువరులకుఁ గల్గుచుండును. నవలను చదువు నపుడు విద్యార్థికి మిక్కిలి హృద్యములుగ నుండు విశేషముల వలన నాసని యావేశమును, సౌందర్య భావనల స్థితి గతులును, మున్నగు నితర యాంతరంగిక విశేషములును ప్రకటమగుచుండును. ఆదర్శీభూతాంతరంగముల విమర్శన ధీవికాసముమీఁద నవలల కొకకొంచెము ప్రభూతి గలదు. నవలల యాహ్వానములకు ప్రతీకారము లొనర్చుటకు నా ప్రతీకారములను మిక్కిలి జాగ్రతతో గమనింప వలెను. చాలమంది విమర్శకు లితర వాఙ్మయ విభాగములను పరిశీలించినంత తీవ్రబుద్ధితో నవలలను మాత్రము పరిశోధింపరు. వాచక బృందములందుఁగూడ నవలలను తీవ్రబుద్ధితోఁ జదువువారి సంఖ్య స్వల్పముగ నుండుటే చూచుచున్నాము.

సామాన్య వేదాంతము మీద నవలల కెట్టి ప్రభూతియు లేదు జీవితాదులను గూర్చిన వేదాంత భాగముల సారములను నవలకర్తలప్పుడప్పుడు తమగ్రంథములందు ప్రకటించుటయు గలదు.

బాలురమీఁదను, వృద్ధులమీఁదను నవలలకు ప్రభూతియున్నట్లు తెలియుచున్నది. ప్రప్రథమమున నవలల నీయుభయ వయస్కుల కొఱకే వ్రాసియున్నారు. ఆధునిక స్వానుభూతి ప్రకటనాను రక్తులగు నవల కర్తలు మాత్రమే యనుభవశాలులగు వృద్ధుల నాకర్షింపఁ గల్గుచున్నారు.

## ఆయామానవులపై నవలలకుఁ గల ప్రభూతి.

బలిష్ఠులగు ఇతరమానవులను గూర్చి ప్రకటించుచుండుట చేతనో; నాయా పాఠకుల మనంబులకు సంతుష్టిని కల్పించు జీవితాంశముల ప్రకటనలతోనో; సంఘసమ్మేళనముల విచిత్రాచారముల ప్రకటనలతోనో; మనోరంజకములగు విషయముల లేక రోషమును ప్రజ్వలించు విశేష విషయములతోనో ప్రకటనములతోనో నవలలు నిండియుండుటచే నవి వాచకుల నాకర్షించుచుండును.

నవలలు రసజ్ఞులకొఱకై ప్రత్యేకించి వ్రాసిన గ్రంథములు మాత్రము కాకపోయినను, ప్రఖ్యాత పురుషులే కొందఱు ప్రఖ్యాత నవలలను గూర్చి తమ యభిప్రాయములను వెల్లడించుచుందురు. ప్రతి మానవుడును గ్రంథములను తన బుద్ధి నుపయోగించి విచారణల చేయుటకే పూనుకొనుచుండవలెనుగాని, యితరులు ప్రకటించిన యంటు జాడ్యములవంటి యుద్దేశములను మనంబున నిడికొని పక్షపాత బుద్ధితో మాత్రము గ్రంథపరిశోధనమునకుఁ గడంగఁజనదు. ఒకరు ప్రకటించిన యుద్దేశములకు లొంగిన యామానవుల బుద్ధి తన పార్థక్యమును జెఱచికొని పలువురు పెద్దలచే నంగీకరింపబడిన యుత్కృష్టాశయములనుఁగూడ పిచ్చి పిచ్చి ప్రతిఘటనముల నొనరింప ప్రేరేపించుచుండును. విమలమనస్కులైన సరసులగు జ్ఞానులు ప్రకటించిన యుద్దేశములు గ్రహణార్హములు. ఆయానవలలు, నిక్కమగు కారణాంశములను, మానసికానుభవభూతశరీరముయొక్క యంగములవంటివి.

## ప్రభూతియొక్క జాతి తీక్షతలు.

ఇవి వాచకుని కాయా ప్రత్యేక నవలలతో గల పరిచయము ననుసరించి యుండుటేచూచుచున్నాము. తీవ్ర విమర్శనమునుఁజేయుతఱిని నవలను మానవ జీవితాను ఘనము నందలి యావేశ కల్పన విషయ సమన్వితమగు విపుల ప్రకటనముగ భావింపవలెను. మఱియు తీవ్రబుద్ధితో పరీక్షించి చూచువారికిది యొక మానవుని జీవితమునకు బాహిర విషయములగు ప్రకృతి విశేషముల ప్రకటనముగఁ గూడ పొడగట్టుచుండును.

చిత్రలేఖనము నందును, కట్టడము లందును, వానిని నిర్మించిన కర్త ఆ విద్యయందు ప్రవీణుఁడగుటకై యొనర్చిన యత్నములయు, నాయా కళల స్వతస్సిద్ధ విశేషములయు, చిహ్నా లేక కొన్ని యెట్టివారికైన నవలలందుకంటె చక్కగ కనబడుచుండును. కళా నిర్మాణములయొక్క సంపూర్ణాభిప్రాయమును గ్రహించుటకు ధీ సూక్ష్మత యావశ్యకము. శరీరాత్మకమైన నవల సద్భావమును శిల్పకళయే చక్కగ ప్రకటింప గలుగుచున్నది. గాయకుని స్వరభేదములను స్థాయి వ్యత్యాసములను గ్రహించుటకు వినువాడు చాల ధీనైసర్గిక గుణయుతుఁడు గావలెను. నవలయొక్క నైసర్గిక గుణమును గ్రహించుటకు కొలది విజ్ఞానమును, సాత్వికత్వమును చదువరుల కున్నఁ జాలును. చదువరుల దృష్టి నాకర్షించుటకును, దాని నుద్దామ యోగ్యముగ నొనర్చి ప్రోత్సహించు వస్తునిష్ఠగల విషయ మెద్దియు నవలలందుఁ గానరారు. స్వతస్సిద్ధమగు శ్రద్ధతో కృషి చేసిననేగాని నవలయొక్క సంపూర్ణ ప్రాశస్త్యమును వాచకులు గ్రహింపఁ జాలరు.

## అవలోకన ఫలితములు.

ఒకే నవలనుఁ జదివిన యిద్దరు మనుజులకు బానినిఁ జదువుటచే నొకేరీతి యభిప్రాయములు గల్గుట యన్నది. యొక యసంభవ విషయము. గ్రంథకర్త తాను ప్రకటించుచున్న విషయముల యొక్క సౌందర్యమును సంపూర్ణముగా గ్రహించెనో లేదో తెలిసికొనుట యంత సులువైన పనిమాత్రము కాదు. దీనిని సౌందర్యమును గూర్చిన కళా విధానముల పూర్వకముగ నరసియో లేక యాయా వాచకులధీ సూక్ష్మతచేత గలుగుపరిశోధనఫలితముల వలననో కొంతవఱకు నిర్ణయింప వచ్చును. గ్రంథమున ప్రకటించిన ప్రతి స్వల్పవిషయమును గ్రహించుటకు సామాన్యుల కశక్యము. కొన్నికొన్ని యల్పాంశముల మూలముననో లేక గొప్ప విశేషముల మూలముననో చాల యితర యంశములు మరుగుపడి యుండుటను సాధారణముగఁ జూచుచున్నాము.

కన్నుల పండువ చేయుచు వీనులకు విందుగొల్పు విషయజాల పూరితము లగు నవలలీఫలితమును సుస్థిరముగఁ గల్పించుచుండును. ఒక్కొకరుగనో లేక సంఘములుగనో గల్గు పాత్రముల రాకపోకలును, స్థానికోపాధుల వర్ణనలును, నవలలందు

చూచుటకు రమ్యముగా నుండు విషయములు. నవల లందొక కొన్నిట శాస్త్రీయ తరాంశములకంటె శ్రవణ జ్ఞాన గ్రాహ్యాంశములే చాల గల్గుచుండుటను చూచు చుందుము.

నవల లందలి పాత్రముల సంభాషణములే మనము విను నంశములు. వివిధశబ్ద సంతతులును సాంఘిక జీవితాదుల కను గుణములగు వాగ్విత్తా నాడంబ రాదులును నవల లందంతగా గానరావు. ఏదేని పాత్రముయొక్క కంఠ ధ్వనిని యాపాత్రము యొక్క సంభాషణ భాగములను బిగ్గరగాచదివి గ్రహింప శక్య మగును.

## లోకానురాగ ఫలితములు.

శరీరాత్మకములగు ననుకంపాములతో గలిగిన యావేశాదులను లోకాను రాగముల వ్యవహరింతురు. నవలలందలి విషయ వర్ణనలు వాచకుల విజ్ఞానమును కల్పనా శక్తిని ప్రోత్సహించి వారికి లోకాను రాగ మును కల్పించు చుండును. నవలలు నాటక రంగముల వలెను, చిత్తరువుల వలెను, మననయ నేంద్రియమున కెట్టి దృశ్య విషయ జాలమునుమాత్ర ము ప్రకటించు చుండవు. కాని నవలలు తమప్రాణ ములు మెలఁగు ప్రదేశములను పృథః కరణ పూర్వక ములగు విమర్శనములతో పరిశోధించుచు నాయా పాత్రములకును పాత్ర సమ్మేళనములకును గల యను బంధాదులను విమర్శించుచు వీని కన్నిటికి వస్తునిష్ఠ కల్పించి ప్రస్ఫుటముగఁ జేసి ప్రకటించు చుండును.

తీవ్రమగు బుద్ధితో నఱసితిమేని లోకానురాగ ము నవల ప్రభూతి కావశ్యకమైన విషయముగఁ బొడగట్టు చుండును. ఏ నవలయం దిద్దానిని విశేషించి ప్రకటించదచేరో "దానినిలోకానిరాగ నవల" యందురు. స్వానుభూతిక నవలలందును కల్పితనవల లందును కూడ లోకానురాగ మవశ్య విషయమై నట్లే పొడగట్టు చున్నది. రసానుకారి నవలలం దియ్యది విషాదముతోను గ్లానితోను నను సంధించు ప్రకటితమగు చుండును. స్వానుభూతిక రచనాదక్షుల గు నవల కర్తలొక్కొకతఱి లోకానురాగ ప్రకటనములందు కేవల కల్పనాను రక్తుల యాశయముల పురస్కరించికొను చున్నారు. మఱికొంద ఱిద్దానిని వారి వారి యనుగ్రహాదుల నుండియే యెన్నుకొన నిచ్చించు చున్నారు.

## ఆవేశ గుణము.

ఆవేశ జనకాంశ విషయము మానవులను రంజించు విజ్ఞాన విభాగములలో నవలయేమిన్న. చిన్న కథలు, గీతములు, గానములన్నియొక్కొకటియొక్కొక విశేషమును ప్రస్ఫుటముగా ప్రకటించు చుండును. విషయముల విభేదన, తీక్ష్ణతాన్విత తత్త్వాన్తత్త్వ ముల యోగమునకును, ప్రకటనలయు, ప్రకటిత భావాదులయు సిద్ధాంతీ కరణములకును, ఉత్కంప స్వాస్థ్యముల సరళతలకును, నవలయే యుత్కృష్ట మైన ప్రకటన సాధనము. ఆవేశములతైన విజ్ఞానమును గూర్చి ప్రకటించుచునుటే నవలయొక్క ముఖ్యాశయమను తత్త్వమిద్దానిమీదనే యాధారపడి యున్నట్లు తేట పడు చున్నది.

ఆయా పాత్రములయొక్కయు, గ్రంథకర్త యొక్కయు నావేశములలోనికి వాచకుడు తనదీ సూక్ష్మతచేత ప్రవేశింప గల్గుచున్నాడు. ఇంతియ కాక యాతడు తన యావేశమును ప్రజ్వలింపజేయు భావాదులనుగూర్చి చనువు తరిని యాతని కావేశము పుట్టుచుండును. నవలలు చదువరుల నావేశపూరి తుల చేయుననుట కొంచెము సంశయాస్పదమైన విషయమే.

పాత్రముల మూలమున వాచకునియం దద్భుత మగు యావేశమును, దాని సాధారణ ఫలితములను మనము నిర్ణయింప వచ్చును. మిక్కిలి తీవ్రములైన యావేశములనేని సాధారణములగు నావేశ పరంపరల నేని యుపపన్నముఁజేయ వచ్చును. ఈ ఫలితము పాత్రములకు సంబంధించియో, గ్రంథకర్తకు సంబం ధించియో లేక జీవితాదులకు సంబంధించియో స్థైర్యము గల్గినదిగనేని, లేక చంచలత్వము కల్గినదిగ

నేని స్పష్టము గల్గినదిగ నేని లేక దోష భూయిష్టమైనదిగ నేని సర్వభాజనాను రంజక మైనదిగ నేని లేక యేహ్యభాజన మైనదిగ నేని పొడగట్టుచుండును.

రమ్యములగు నావేశ ఫలితములకును, యేహ్య భాజనములగు నావేశఫలితములకును, గల తారతమ్యములను ప్రకటించుటకు విమర్శకులు ప్రయత్నము చేయుచుందురు. కళాభిజ్ఞుని కళా వైదగ్ధ్యవిశేషము లందలి యభిలాషయు కష్టము కడతేరినదను నిశ్చయమును, జీవ పటముయొక్క సౌందర్యమువలన గల్గు భావికాహ్లాదములును మొదలగునవియే రమ్యమగు నావేశ ఫలితములకు జెందిన విశేషాంశములు. అనుభవములకు జెందిన యావేశములును నాయావాచకులవగు నేహ్యతాను కంపలును, నావేశములకు జెందిన నేహ్య భాజనాంశములు. వీనిని వేరుచేయుటకు ప్రస్ఫుటముగ పొడగట్టు బాహ్య చిహ్నము లేవియు గానరావు. ఇవి ప్రాముఖ్య భావోద్రేక బీజములు మాత్రము కావు. ఇట్టి ఫలితముల పృథక్కరణము నందీ విచక్షణము చాల సహకారముగా నుండును.

## భావన ఫలితములు.

నవలలకథలకొలకు మాత్రము చదువు వాచకులు వాని యందలి భావములను వాస్తవ విషయాంశ జాలమును మాత్రము గమనింప జాలకయే యుందురు. విషయ సంధాన నవలలందు మిక్కిలి సమాహితములైన భావములు కూడా కడవిధులయొక్క సామాన్య పద్ధతుల ననుసరించియే ప్రకటమగుచుండును. వీనికిని పాత్రములకును, తటస్థాంశములకును గల యనుబంధములను ప్రత్యేకముగా పరిశీలించుచు గ్రంథమును చదివినచో దానియందలి కథయంత సుహృదము కాజాలదు.

నవలలు సాధారణముగా కొన్ని కొన్ని నూత్నాంశములను వాచకులకు ప్రకటించు చుం

## ఇచ్ఛా ఫలితములు

గ్రంథకర్తయొక్క కళాకౌశల్య భూయిష్టమైన వైపరీత్యము గాంచినవైనను కాకపోయినను సరే నవలలు మానవులయు, మానవ సమ్మేళనములయు సంకల్పముల మీఁదను, జీవితముల చాకచక్యాదుల మీదను ప్రభూతి గలవియే యగుచున్నవి. ఇవి వాచకుల మనంబులందు సంపూర్ణమగు నమ్మకమును పుట్టించుటో లేక యపనమ్మకమును పుట్టించుటో యనునట్టి రెండు సంకల్పముల కల్పించి పెంపొందఁ జేయుచుండును. సాంఘికాచారములకు లోఁబడుటో లేక లోబడకుండుటో, తీవ్రమైన బ్రతుకు బ్రతుకుటో, జీవితాదులకు సంబంధించిన సందిగ్ధాంశములనుండి తప్పించుకొనుటో యను నీవిషయములం గూర్చి కొన్ని మెలుకువల నవలలనుఁ జదువుటచే తెలియుచుండును; మానవుల చేయు కార్యముల మీద నవలలకే యెక్కువ ప్రభూతి గలదని భావింపఁ జనదు. విమర్శకు లిట్టి దుష్ఫలితములయొక్క చేటునకును, సత్ఫలముల యొక్క ప్రఖ్యాతికిని, గ్రంథకర్తను కారణ భూతునిగా జేయఁగూడదు.

## ప్రభూతాంశములు.

ఏదేని యొక నవలను నిక్కముగా మెచ్చవలెనని దాని నొక యేకభూతకల్పనగా భావించి పరిశోధింపవలెను. నవలలందలి వివిధాంశములకు వివిధ ప్రభూతి తీక్ష్ణములుండును. ఒక వాచకునికి హృద్యములైన విషయములే మఱియొకని కేహ్య భాజనములుగ పొడగట్టుచుండవచ్చును. మనల నొకప్పుడు రంజింపఁజేసిన విషయములే మఱి యొకప్పుఁడు వెగటుగ దోచుచుండును. వాఙ్మయమున నేదేని యొక విషయమును గూర్చి యొక్కొక్కనికి అనిష్టములేల గల్గుచున్నవో; నిక్కముగా మంచి విషయములం దిష్టమును; చెడ్డవానియం దనిష్టమును మానవ సామాన్యమునకుఁ గల్గుచుండుటకు కాద.

ణము లెవ్వియో యను నీయంశములను మనము నిర్ణయింపవలెను.

విమర్శకులును, నవలకర్తలును, సాధారణముగా గ్రంథముయొక్క సలక్షణత విలక్షణతలను గూర్చి మాటాడుచుందురు. లక్షణజ్ఞానము కుమరని వారు నవలలఁగూర్చి యోగ్యమైన తర్కయుత విచారములను చేయఁజాలరు. నవలలఁగూర్చి విచారణములను సల్పుటకు వలయు జ్ఞానమును జానపదులైన ప్రయత్నించి సంపాదింప వచ్చును. నవలల రూపములను గూర్చి నవలకర్తలందరును కూడ తగు శ్రద్ధ వహించుచున్నట్లగపడరు.

నవలల నిగ్గని చెప్పఁబడుచు, వానియందు ప్రకటమగుచున్న మానవుల యనుభవములు, నాయా మానవుల జీవితాదుల వగు విజ్ఞాన తత్త్వములు నీవిజ్ఞాన తత్త్వముల విచారణములు నన్నవాయా విమర్శకుల యాత్మవిచారణ ఫలితములే యగును. ఏదేని యొక ప్రభూతాంశమును గైకొన నిచ్ఛగింప కుండుటయు, నవలకర్త చేయు నాహ్వానములను తత్క్షణమ యంగీకారపూర్వకముగ గైకొనుటయు, నన్న రెండు విషయములును కూడ వాచకునియందు గొప్ప లోపములుగ పరిగణింపఁబడును.

## ప్రభూతియొక్క కారణములు.

చరిత్ర, నీతిశాస్త్ర, జీవశాస్త్రములందు వలెనే; వాఙ్మయ విమర్శనమునందుఁగూడ నాయా యంశములయొక్క కారణములందైన జ్ఞానము ప్రేక్షకుల నొక కొన్ని యిక్కట్టుల పాలుచేయును. వృక్షముయొక్క యభివృద్ధి దాని విత్తనముమీదను, దానిని నాటిన భూసారముమీదను, వాస్తానిక శీతోష్ణ స్థితుల మీదను నాధారపడి యున్నట్లే నవలల ప్రభూతి యానవలల ననుసరించియు, దానిని జదువు వాచకుల ననుసరించియు, నాయా సాంఘిక స్థితుల ననుసరించియు నుండుటనే సాధారణముగ చూచుచున్నాము. ఈయనుసరత కేవలము వాస్తవము కాకపోయినను కొంతవఱకు విజ్ఞానదాయకమై చాల తోడ్పాటొనరించునట్లు గోచరించుచున్నది. వాచకుఁడును గ్రంథకర్తయు నొకే సాంఘిక ప్రభూతులకు వశులైయున్నచో వారిపట నానవలల యొకరియంశముల మఱియొకరికి ప్రకటించుటకు వినియోగపడు సాధనముగ నుపకరించుచుండును.

వాచకుఁ కదృశ్య మానమగు నాంతరంగిక విషయములలో నొకటి యగు. నిక్కంపు శీలభావాదుల పరీక్షయందు న్యాయపత్రముల కంటెను, నవలలేమిన్నలై నెగడుచు వారి నాశ్చర్యముగ్నలుగ నొనర్చు చున్నవి. మానవ కోటిచే గర్హితుఁడ నగుచున్నాడనను కొను వానియంతరంగమున నుండు సర్వజనానురక్తి యాతడు చదువుట కెన్నుకొను గ్రంథముల వలననే వ్యక్త మగుచుండును. ఆయా మానవులందేని లేక యాయాసంఘ సమ్మేళనము లందేని యీ యదృశ్య మాన చైతన్యము ప్రస్ఫుటముగ నుత్తరోత్తరము లందు గాన్పించుచుండును. రసానుకారి రచనల వలన ప్రజ్ఞాశాలు లగు విమర్శకోత్తము లాగితమును గ్రహింప సామర్థ్యముగల వారగుచున్నారు. వాఙ్మయమున ప్రకటితము లగు మానసికాకాంక్షలు తొలుదొల్త హాస్యభూయిష్టము లైన ట్లగపడుచు తుట్టతుదకు తీవ్రప్రభూతిగల విషయము లట్లు పరిణమించు చుండును. ఏవేని రెండు దూరస్థ కాలావధులందు ప్రకటింపఁబడిన నవల లందలి సాంఘిక కారణములను పృథక్కరించి చూచినచో మొదటి గ్రంథము రెండవ దానికి యెంతవరకు మాతృకయై యుద్బోధకమగుచున్నదో యను నంశమును నిర్ణయించితిమేని యిది రెండవ గ్రంథమును బాగుగ గ్రహించుటకు తోడ్పడుచుండును.

వాఙ్మయము నందలి తాత్కాలిక యిష్టానిష్టములు, సంఘ సంస్కర్తల చేనుగ్గడింపఁబడు నింద

యసంబంధ ములకు విరసా తాను కంపలయొక్క-తత్త్వపరీక్షల కవితరంగము లుగ పొడగట్టుచుండును ఏయేస్థితు లందున్నపుడే యేనవలలందే యేవాచకులకు మక్కువ గల్గుచుండునో యాస్థితి గతులన్నియు నాయావాచ కులకా గ్రంథముతో సంబంధము గల్గినప్పుడెల్ల జ్ఞప్తికివచ్చుచుండును. ఇట్లే నవలకర్తలకుకూడ తామా యాగ్రంథములను రచియించుతరి ప్రేరకములుగ నర్తించిన విషయ జాల మాగ్రంథమును చూచినప్పుడెల్ల జ్ఞప్తికి వచ్చుచుండును. కేవలము సాధారణ నవలలైనను సరే కొందర కవి వారి వారి యాహ్లాదవిషాదాదులతో కలసిపోవుట చేత నవి వారికెల్లపుడును పరిస్ఫుటముగ జ్ఞప్తియం దుండుటే తటస్థించుచుండును.

# సింధుగేయగీతము.

(సీరిపి ఆంజనేయులు గారు,)

దివ్యబలమున వెలయు ప్రవా । దినులలోన
నీదుశక్తి యమేయమై । నెగడుకతన
నమితవరా నీకు మహిమాంచి । తమును గూర్చి
గానమొనరించు సుకవి స్వ । ర్గమున సింధు:—
పందెమును నీవు గెలువన । మందరయము
తోడఁ బరువిడు సమయానఁ । ద్రోవసూపి
తోడుపడుఁ గాల్వఁదీసి తో । డ్తోడ నీకు
వరుణదేవుండు భువన జీ । వన విభుండు—
నాయకుఁడు ముందుఁజనుచు సై । న్యంబునడుపు
విధమున సరిత్ప్రపంచంబు । వెంటఁగొనుచు
నురవడినిఁ బర్వువాఱుచు । నుందువెపుడు
తుహిన తలముల శైల ప । ఙ్క్తులను గడచి—
అద్రిశిఖరాగ్ర మందుండి । యవతరించి
పెనుతుఫానునఁ బడియెడు । పిడుగు మాడ్కి—
పటుతరంబగు శక్తి సం । పద సెలంగ
నశని ఘోషించుగతి మహో । గ్రారవమున
వీర హుంకార మీవు గా । వించి మించి
పరువిడుదు వమ్మ! యున్మత్త । పశువు కరణి—
వత్సములు పాలుద్రావంగ । వలచి, తల్లి
కడకు నుఱికెడు రీతి శా । ఖలు తమంత
రభసమున నిన్నుఁ జేరు. సం । గ్రామ రంగ
మునను సైన్యాళిఁ బిల్చెడు । మనుజనాథు
పోల్కి, వాని నాదేశించి । పొల్తువీవు—
వానితో నీవు దివ్య ప్ర । భాస మెసఁగ
రాష్ట్రముల దాఁటిసుంత వి । శ్రాంతిఁ గనక
విపుల జయముల మెఱుపుఁ దీ । వియ విధాన
నాణెమున మించి చిత్ర వ । ర్ణముల నీను
నాఁడు గుఱ్ఱంబు వోలె నీ । వసగుచుండ,
ఆప్రయాణ వేగము నెవ్వ । రాఁపువారు—
అమ్మ! యఖిల సంపదలు నీ । కమరి యుంట
స్వర్ణమయ భూషణాంబ రా । వళి ధరించి
సౌరభముఁ జిమ్ము కమ్మ పూ । సగలఁ దాల్చి
జవ్వనముఁగుల్కఁ గరుణా ర । సమ్ము చిల్కఁ
గనక రథముల ఘనతురం । గముల నెక్కి—
సారివెడలుదు వమరులు । సంస్తుతింప—
కాంత! నీకృపామృత । వర్షకారణమున
వన్నె వస్త్రంబుల కొకింత । యలఁత లేమి
నినుసంతతి భోగ భా । గ్యాను లంది
విజయ కాంక్షాభిరతిఁ గల్గి । వెలయుచుందు.
నిన్నుఁ గొల్చెడు భక్తుల । కున్న కొఱఁత—
నిరధము—నీహాయఁ బులు—నీప్రగాఢ
శక్తి—విజయంబె పొందించు । సతతపుట్టి
పూర్ణబలమున జయసిద్ధిఁ । బొందనిన్ను
నేము నర్థింతు మాశీర్వ । దింపు మమ్మ ॥

# విజ్ఞాన విషయములు

(క. రాజేశ్వరరావుగారు.)



## సముద్రగర్భమున రైలుమార్గము.

ఇంగ్లాండునందలి డోవరు (Dover) నౌకా స్థానమునకును ఫ్రాన్సునందలి 'కలై' (Calais) నౌకాస్థానమునకు, మధ్య ఇరువదియొక్క మైళ్ల దూరమున్నది. ఇప్పటికి దాదాపు నూరు సంవత్సరముల నుండియు ఈ రెండు దేశములకును మధ్యనున్న యల్పసముద్ర భాగమున రైలుమార్గమును నిర్మించుటకుపాయము లన్వేషింప బడినవి. ఆయుపాయములన్నిటిలో ఈక్రింది చిత్రమున చూపబడిన 'ట్యూబ్' (Tube Railway) ముఖ్యమైనది. నేడుభయ దేశీయుల స్వప్నము సఫలమగు నట్లు తోచుచున్నది. సముద్ర మధ్యమున ముప్పది మైళ్ళ పొడవు గల బ్రహ్మాండమగునొక 'టన్నెల్' ఉక్కుగొట్టమును నిర్మించుటకు ఏర్పాటులు జరిగినవి. ఈమార్గము ద్వారా లండనునుండి 'కలై' పట్టణమున కేగుటకు షుమారు 6, 7 గంటలు పట్టునని అంచనా వేయబడినది.




సముద్ర గర్భమందలి రైలుమార్గము.



వ్రేలి గడియారము.

## వ్రేలియుంగరము నందలి గడియారము.

ఇంతిదనుక స్త్రీపురుషులు తమ జేబుల యందును మణి బంధముల యందును గడియారముల నుంచు

కొనుచున్నారు. ఇప్పుడొక క్రొత్తవిశేష మొకటిగను పెట్టబడినది. చిన్ని చిన్ని యుంగరములందు కెంపులుపుష్యరాగములు మొదలగువానికి బదులుగా చిన్ని గడియారముల నతికించుచున్నారు. దీనిమూల్యము సరిమితముగా నుండుటచే సాధారణులు కొనజాలరు



టములు పతంగముల యొక్క యంత్రము.









క్రిమికీటకములు పతంగములు వీనియొక్క సహజ యంత్రోపకరణములు.

మానవులు తమగృహముల నిర్మాణముకొఱకును వేయిసంవత్సరములకు పూర్వమే యంత్రసాధనముల కనుపెట్టి యుండిరో అవిపక్షులకును క్రిమికీటకాదులకును సృష్ట్యాదినుండియు స్వభావసిద్ధముగ నేర్పడియున్నవి. అవి సుతీక్ష్ణములును నానాకర్మలకు నుపయోగపడునవియు నైయున్నవి. ఈయంత్రోపకరణములు







ముమీద అన్ని దేశములలోను కలిపి సంవత్సరమునకు నాలుగువేల భూకంపములు వచ్చు



యోకహోమా ఓడరేవు.



సముద్రపుష్పాలు.

చుండును. ఒక్క జపానునందే నేటివరకు ఒక లక్ష ఏడువేల భూకంపములు వచ్చినవట. ఈ

అత్యాచారములను నివారించి యాత్మరక్షణ మొనర్చుటకై ప్రొఫెసర్ 'మానో' యను నతడును, 'ఇనోకుటీ' అనునతడును ప్రయత్నములు చేయుచున్నారు. వీరిద్దరును సుప్రసిద్ధులగు ఇంజనీరులు. ఈచిత్ర పటములోన్న గృహనిర్మాణపద్ధతిని వీరేకనిపెట్టిరి. ఈవిధ

ఆకీట పతంగముల యవ యవములందు కూర్చబడి యేమాత్రమును అపాయములేక సంచరించుటకై యుపయుక్తము లగుచుం



టోకియో రాజమార్గము యొక్క దురవస్థ.

డును. మానవుని యంత్రోపకరణమువలె ఇవిశిథిలములు కావు. ఒకవేళ విరిగిపోయినను మరలత్వరగలో వృద్ధినొందును. ప్రకృతిదత్తములైన ఈ యంత్రోపకరణములందు ఆంపనులు, తెడ్లు, గొడ్డళ్ళు, అంకుశములు, కత్తులు, బాడిశలు, సీలలు,కత్తెరలు, సూదులు మున్నగు నసంఖ్యాకములగు ఉపకరణము

## అచలాయతనములు.

ఇటీవల 'టోకియో' 'యోకోహామా' మొదలగు పట్నములందు సంభవించిన భూకంపముల సంగతి మాపాఠకు లెరిగియే యుందురు. ఈభూకంపములు నివారించు నుపాయము లన్వేషించుట మిగుల యుక్తపూర్వమే వేరొక భూకంపము వచ్చి పడుట సామాన్యమైనది. ఈభూకంపములు ప్రత్యేకించి




భూకంప మూలమున చెడిపోకుండ నూత్నపద్ధతులతో కట్టిన గృహము.

యొక్క దేశమునగాక ప్రపంచము నందన్ని భాగములందును తటస్థించుచున్నను. మొత్త

ముగా నిర్మింపబడిన యిండ్లు ఎంతటిభూకంపము వచ్చినను భగ్నములుకావు. ఈగృహములకు ముఖ్యముగ నొకపరీక్ష కావలసియున్నది.

భూకంపము వచ్చినప్పుడు గృహమునకధోభాగమున భూమి రెండుచీలికలై ఇండ్లు పాతాళమున పడిపోవకుండ ఏర్పాటులు చేయవలసియున్నది. గాలి యంత్రములు జర్మనీయందలి 'రూరు' ప్రదేశమును ఫ్రాన్సువారాక్రమించిననాటనుండియు జర్మని దేశము దుర్భిక్షముచే పీడింపబడుచున్నది. అచ్చట బొగ్గుపనివాండ్రిందరును బొగ్గు త్రవ్వటకై కావలసిన యంత్రముల నడిపింపజాలని స్థితిలోనున్నారు. అందువలన వారికి నూతనముగా వాయుసహాయమున యంత్రముల నడిపించుటను కనుపెట్టియున్నారు. విజ్ఞానోదయమైన మొదటి యుగము నుండియు వాయుశక్తి సహాయముచే చిన్నచిన్న గాలి యంత్రములు నడిపింపబడుచు వచ్చినవి. అందువలన పెద్ద పెద్ద ఫ్యాక్టరీలనుకూడ గాలిసహాయముననే వారునడపింప యత్నించి విజయమొందిరి.

ఈనాడు పరిష్యాదేశమందొక భాగమున పెద్దపెద్ద బొగ్గు ఫ్యాక్టరీలు కేవలవాయుసహాయముననే నడపబడుచున్నవి. ఇక మీద రైలు ఇంజనులందును, పొగయోడలందును ఆవశ్యకములుగా గాలినే వినియోగింప ప్రయత్నములు చేయుచున్నారు.







సముద్ర మందలి పుష్పములు

సముద్రగర్భమునందలి పుష్పములు.

గభీరమగు సముద్ర గర్భమున అన్ని విధములుగను మన యుద్యానవనములందలి పువ్వులతో తులతూగ గలిగినంతటి మృదువగు పదార్థములు కానవచ్చుచున్నవి. అవి చూచుటకుమాత్రము మనపువ్వుల వలెనున్నను సూక్ష్మముగ పరిశీలించినచో చేతనములగు ప్రాణులనిమనకు గోచరమగును. మన

పుష్పోద్యానము లందలి మనోహర పుష్పముల సౌందర్యమును గూడ తిరస్కరింప గలిగి నంతటి చక్కదనము వీనికెట్లల వడెనో!



(1) రోగులు పడుకొనుటకు సూక్ష్మముగా నిర్మింపబడిన మంచము.

## రోగులకు సౌఖ్యప్రదము లగు నేర్పాటులు.

చికిత్సా విజ్ఞానము ప్రతిదినము నూతనములగు ఉపాయములతో వృద్ధినొందుచున్నది. ప్రతిభావంతులగు వైజ్ఞానికులు కొందరు రోగుల సౌఖ్యమునకై మూడు చిత్రములగు వస్తువులను తయారు చేసియున్నారు. వీనిలో ముఖ్యమైనది. క్రొత్తపద్ధతిగా చేయబడిన యొక మేజాబల్ల (Table) దానిపై కొంచెమెత్తుగా రోగులు శయనించుటకు (Mammock) ఊయెల యమర్చబడి యుండును. ఈశయ్యపై రోగివరుండిన యెడల తనకు బాధ కలుగకుండ అన్నివైపులకు కదలుచు సుఖముగ విశ్రమింప గలడు.

రెండవది:— యుష్ణజలము నుండి ఆవిరి నిశ్వాసనసహాయక మొనర్పు యంత్రము. దీనిద్వారమున ఆవిరిస్నానము కడుసుఖముగా చేయవచ్చును.

మూడవది:— దీర్ఘవ్యాధులచే పీడింప బడురోగుల కేర్పరచిన సుందరమగు శయ్య. దీనిపైపరున్న రోగికెప్పుడును శీతల వాయుస్పర్శచే హాయిగా నుండును. మలమూత్ర విసర్జనమునకు రోగి లేవకయే వీలగునట్లు చిత్రముగ నేర్పాటు చేయబడినది

(2)





(3)

## దృష్టిదోషము.

“మూడేండ్లకే ముక్కద్దము”లను సామెత ననుసరించి మనలో చత్వారము మున్నగు నయనవ్యాధులు ప్రబలుచున్నవి. యూరప్ దేశమునందు నేత్రవ్యాధుల చికిత్సలకై గట్టి

ప్రయత్నము చేయుచున్నారు. ఇరువది సంవత్సరములు దాటినవెంటనే నేత్రములను వైద్యునకు చూపించి వానియందే దోషము లున్నవో ప్రతివారును తప్పక తెలిసికొనవలయునని వారభిప్రాయ పడుచున్నారు.



పరీక్ష.



దృష్టి దోషమును దెల్పుగడియారము.

ఎక్సరే (X Ray) లతో రాచపుండును కుదుర్చుట.

రాచపుండు (Cancer) ను చికిత్స చేయుటకు సుప్రసిద్ధ వైజ్ఞానికుడగు డాక్టరు 'ఫ్రీడ్‌మాన్' తన శిష్యుల సహాయమున ఎక్సరేలతో నిర్వహించుచున్నాడు.

ఇప్పటి పద్ధతి ననుసరించి విద్యుచ్ఛక్తితో చేయుచున్న ప్రయత్నములు విఫలములైనవి. 'ఫ్రీడ్‌మాన్' చికిత్సా పద్ధతి జయప్రదముగనే సాగుచున్నది. 'రేడియం' చికిత్సకన్నను 'ఎక్సరే' చికిత్సయే సర్వోత్తమమని యభిప్రాయ పడుచున్నారు.



దృష్టి నాశన కారణమునరయు యంత్రము.

# సాయంతనము*

(వాసిరెడ్డి ఛాయాభాస్కర వరప్రసాద్ గారు)

అనల దేదీప్యమాన దినాంతమందు
హరిత శాద్వల భూములు నఖిల వనులు
చరమ దినవిలక్షణ కాంతి సమితిమున్గి
కానబడు నామహాజాలు కలయనంగ॥

ఒప్పమరుదిన మాతంబు నొందుచుండ
పక్షిసంతతి గూండ్ల కైబరచుచుండ
వృక్షనగసార సాకర వీధులందు
నామహాజాలు పింఛంబె యమరియుండు॥

నీడలతి దీర్ఘతమమ్ములై యాడుచుండ
కృషిక కంఠస్వనంబులు శృతులఁ బడఁగ
గ్రామదీపంబు లింపారఁగ్రాలు చుండు
నమ్మహా మహాజాలు కల్యాణమంసు॥

వడకు దార్చుచు రే బ్రాకి వచ్చుచుండ
నీపురాణ ధరణి నిద్రనెసఁగుచుండ
నామహిత జాలుకనులు నాగోముమీరు
స్వచ్ఛతరనభోగతసు నక్షత్రపఙ్క్తి.

---

* “హార్ఁద్రు”ని గీతానువాదము.

# తాపసుడగు జాఫేర్ సాదేక్.



(పా. నరసింహముగారు.)



జాఫేర్ సాదేక్ అను నతడు ప్రవక్తయగు మహమ్మదులవారి దౌహిత్రుడు. ఆనాటి సాధుమండలిలో నితడు అగ్రగణ్యుడై యుండెను. సమస్త జనులును అతని యెడల మిక్కిలి విశ్వాసము గలవారై యుండిరి. అతడు ఏకేశ్వర వాదులకు గురువరుగను, మహమ్మదీయ సంప్రదాయమునకు ఆచార్యుడుగను, ఈశ్వర విశ్వాసులలో ప్రథమ గణ్యుడుగను, అక్కాలపు భక్తులలోను వైరాగ్య సంపన్నులలోను ప్రముఖుడుగ నుండెను. తత్వశాస్త్ర రచనయందేమి, శాస్త్రవ్యాఖ్యానముచేయుట యందేమి, ఖురానుయొక్క గూఢార్థముల గ్రహించుట యందేమి అతడు అద్వితీయుడై అలరారుచుండెను.

తత్కాలమున 'మన్సూరు' అను పేరు నంబరగు ఒక పురుషుడు అరబియాదేశమునకు ఖలీఫాగా నుండెను. సాదేక్ యొక్క ప్రఖ్యాతినిగూర్చి విని అతడు ఈర్ష్యాగ్రస్థుడయ్యెను. ఒకనాడు ఖలీఫా తనమంత్రిని పిలిచి "నీవు వెళ్ళి సాదేకుని పట్టి తెమ్ము. అతని నేను వధింపవలయును" అని చెప్పెను. ఈ మాట విని మంత్రి ఆశ్చర్యమునుజెంది "ఇదియేమి? సంసారమును విసర్జించి, నిర్జన ప్రదేశమున నొక్కడు భగవద్ధ్యానము చేయువానినా! యిట్లుచేయుట" అని పలికెను. తన ప్రధాని నుడివిన యీపలుకులకు ఖలీఫా మిక్కిలి విరక్తుడై "అతనిని తీసికొనివచ్చి తీరవలయును" అని గట్టిగా చెప్పెను. అయినను నూరకుండక మంత్రి యట్టిపని తగదని పలుమార్లు హితవు గఱపెను. కాని ఫలము లేదయ్యెను. అటుపిమ్మట మంత్రి వేఱుమార్గము గానక సాదేకుని తోడ్కొని వచ్చుటకు వెళ్ళెను. అపుడు ఖలీఫా తన భృత్యులతో "సాదేకువచ్చి కూరుచున్నపిమ్మట నేను నాకిరీటము నెప్పుడు తీసివేతునో అప్పుడు మీరు వాని శిరచ్ఛేదనము గావింపుడు" అని ఆనతిచ్చెను. కొంతసేపటికి రాజుగారి ఆహ్వానము ననుసరించి సాదేక్ విచ్చేసెను అపుడు "మాన్సూరు" తన పీఠమునుండి లేచి సవినయముగా నెదురేగి ఆతాపసోత్తముని తీసికొనివచ్చి ఉచ్చాసనముపై కూరుచుండబెట్టి తానుగూడ నతనికి సమీపమున నమ్రభావముతో నాసీనుడై యుండెను. ఈచర్యను జూచి ఖలీఫాయొక్క భృత్యులు విస్మితులైరి. అంతట 'మన్సూరు' ఆభక్తవరేణ్యుని గాంచి "తమకేమి కావలయునో సెలవిండు" అని అనియెను. "మఱియొకసారి యిట్లు

నన్ను పిలిచి నాతపస్సునకు విఘ్నముగావింప వలదని నేనుమిమ్ము కోరుచున్నాను. ఇంతే నాకుకావలసినది." అనిసాదేకు ప్రత్యుత్తరమొసంగెను. ఇందులకు సమ్మతించి సన్మానపురస్సరముగా ఖలీఫా ఆభక్తునియొద్ద సెలవుగైకొనెను. సాదేకును పంపివేసి నప్పటి నుండియు మన్సూరు యొక్క శరీరముగజగజ వడకసాగెను. అంతట మూర్ఛితుడై పడిపోయెను. మూడుదినముల వఱకునతడుఅట్లె స్పృహ తప్పియుండెను. తిరిగి తెలివి వచ్చిన తరువాత "ఇట్లు జరుగుటకు కారణమేమి?" యనిమంత్రి ఖలీఫాను అడిగెను. అందుపై మన్సూరు "సాదేకుద్వారమున బ్రవేశించి నాకడకు వచ్చుచున్నప్పుడే నేనుఅతని వెంట నొకభయంకర సర్పమును గాంచితిని. అది పడగనువిప్పి నీవు సాదేకునకు హాని చేయుదువేని నేనునిన్ను మ్రింగివేసెద నని నాతో చెప్పుచున్నట్లుండెను. ఆఅజగరము యొక్క భయముచే నేనేమి మాట్లాడనెంచితినో దానినెల్ల మఱచిపోతిని. అతని నేను క్షమార్పణము కోరితిని. తరువాత నేను స్పృహ లేకపడిపోతిని." అనిబదులు చెప్పెను. పుణ్యపురుషులకు నపకారము చేయనెంచెడు దుర్మార్గు లిట్టులనులికిపడుట వింతగాదు.

ఒకసారి తపస్వియగు దావూదుతాయి సాదేకువద్దకు వచ్చి "నా అంతరంగ ముమలిన మయిపోయినది. నాకెద్దియేనిసదుపదేశమొండు గావింపుడు" అనిఅడిగెను. "భక్తుడవగుదావూదా! వర్తమాన యుగమునందునీతో సాటివచ్చు వైరాగ్య సంపన్నుడు మఱియొకడు లేడు. అట్టినీకునాయుపదేశము వలన ప్రయోజనమేమి?" అనిసాదేకుమాఱుపల్కెను. "నీవుప్రేరితపురుషుడగు మహమ్మదు వారిసంతతి వాడవు. అందఱికంటెను నీవు ముఖ్యుడవు. ఉపదేశము చేయుటనీకు విధాయకము." అనిదావూదు చెప్పెను. దానిపై సాదేకు దావూదుతో నిట్లనెను. "నీవేల నాఆనుగత్యమును స్వీకరించితివి? వంశానుసారముగా సరియైనధర్మోపదేశము జరిగి యుండలేదు" అనిపరీక్షా దినమున నామాతామహులగుమహమ్మదులవారునన్ను ఆక్షేపింతురేమోయని నాకు అనుమానము కలుగుచున్నది. అసమానభక్తి సంపన్నుడగు సాదేకు అట్లు వచింపగనే దావూదు తన సంగతిని గూర్చి తలపోసి దుఃఖించుచు "ఈశ్వరా! ఎవ్వని స్వభావమునందు ధర్మప్రవర్తకులకుండు సద్భావము మిళితమయి యున్నదో, ఎవ్వని జీవన చరిత్రము అట్టి మహనీయుల సాంగత్య విశేషముచే పవిత్రీభూతమయ్యెనో, ఎవ్వని మాతామహుడు ప్రవక్తయగు మహమ్మదో, ఎవ్వని జనని పరమ ధార్మికురాలో అట్టి సాధాకే తన్ను గూర్చి యిట్టివిధమున శంకాన్వితుడయ్యెనేని యిక దావూదు తనకార్యములచే మహమ్మదును సంతుష్టపఱుప నేర్చునా" అని పలికెను.

ఒక దినమున సాదేకు తనబంధువులను గాంచి "రండు. మనమొక నిబంధన మేర్పాటు చేసికొందము. విచారదినము నందు మనలో నెవ్వరు మోక్షప్రాప్తిని బొందుదురో వారు తదితరులను పాపవిముక్తుల జేయుటకై పరమేశ్వరుని వేడవలయును." అని చెప్పెను. "సాదేకా! అట్టి ఒడంబడిక వలన నీకేమి ప్రయోజనము?

నీమాతామహుఁడేగదా సకలజనుల నిమిత్తమును ఈశ్వరుని క్షమార్పణమును గోరువాఁడు?" అని అతనిబాంధవులు బదులు పల్కిరి. అటుపై సాదేకు "నాకొఱకై నా మాతామహుని సమీపించుటకు నాకు సిగ్గగుచున్నది." అని నుడివెను. వినయమన నిట్లుగదా యుండవలెను!

సాదేకు ఒకసారి ఉత్కృష్టమయిన వలువను ధరించెను. దానిని జూచి "నీవు ప్రేరిత పురుషుఁడగు మహమ్మదు యొక్క సంతతివాఁడవు. ఇట్టి సుకోమల అమూల్యాంబరముల దాల్చుట నీకు పాడియే?" అని ఒకరు అనిరి. అంత నాతని చేయి పట్టుకొని తన పరిచ్ఛదమునకు నడుగునకు బోనిచ్చెను. అడుగున మిక్కిలి మోటుగానుండు వస్త్రముండెను. అది తాకుటకు కఱుకుగా నుండెను. దానిని జూపుచు "నావస్త్రములలో నొక్కటి లోకులనిమిత్తము మఱియొకటి ఈశ్వరుని నిమిత్తము" అని సాదేకు నుడివెను. "నీవు వంశముయొక్క నయనజ్యోతివి. అందువలననే కాబోలు నీవు విశేషగర్వితుఁడవై యున్నావు." అనిసాదేకుతో నొకరనిరి. "నేను గర్వితుఁడనుగాను. కాని నాకు గౌరవమున్నది. ఎపుడు తన గొప్పతనమును విసర్జించునో అపుడు ఈశ్వరుని గౌరవము లభించును. తన గొప్పతనమువలన నెవ్వడును గౌరవమును బొందనేరడు. కాని తన గౌరవముచే గౌరవాన్వితుడు కానగును" అని సాదేకు పల్కెను.

ఒకడు తనధనపాత్రను పోగొట్టుకొనెను. అతడు సాదేకును తార్కొని నీవు దానిని అపహరించితివని చెప్పెను. సాదేకునకు ఆపాత్రవిషయమేమియు తెలియదు. దానిలో నెంతసొమ్ముండెనని సాదేకు వానిని ప్రశ్నించెను. వెయ్యిరూకలని అతడుబదులు చెప్పెను. సాదేకు వానిని వెంట బెట్టుకొని నిజగృహమునకుబోయి, అతనిచేతిలో వెయ్యి రూకలను సమర్పించెను. తరువాత కొంత కాలమునకు ఆరూకల గోల్పోయినవాఁడు తనసొమ్మును వేఱొకనియొద్ద నున్నట్లు తెలిసికొని వానియొద్దనుండి తనధనమును బడసెను. అందుచే నాతడు సాదేకునికడకు జని నేను పొరపడితిని. నీసొమ్ము నీవుగైకొనుము అనిచెప్పెను. "నేను దేనిని దానము చేసితినో దానిని నేనుతిరిగి గైకొనజాల" నని సాదేకు వానితోచెప్పెను. అతడు మహాతపస్వియగు జాఫేరు సాదక్ అన్న సంగతిని గ్రహించి అతడు మిక్కిలి లజ్జితుడయ్యెను.

ఒకనాఁడు సాదక్ భాగవన్నామమును స్మరించుచు ఒకవీధిని జనుచుండెను. అదే రీతిని ఈశ్వరుని స్మరణ చేయుచు ఒక బీదవాఁడుగూడ నాతని వెంట నరుగసాగెను. "ఈశ్వరుఁడు కట్టుకొనుటకు వస్త్రము కానేరడు" అనిసాదేకు అనుచుండెను. ఈశ్వరానుగ్రహమువలన తక్షణమే ఒకవస్త్రము లభించెను. దానిని అతడు వెంటనేధరించెను. అప్పుడు వెంటవచ్చుచున్న బీదవాఁడు "భగవన్నామ స్మరణయందు నేనుగూడ నీతో పాల్గొనుచుంటిని. నీకుక్రొత్తవస్త్రము దొరకినదిగనుక ప్రాతది నాకొసంగుము" అని అతడు పలికెను. ఈమాటలు సాదేకునకు సంతోషజనకము లయ్యెను. అతడుకోరినట్లే ఆపేదవానికి తన పురాతన వస్త్రమును సాదేకు ఇచ్చివేసెను.

ఒక మనుష్యుడు సాదేకు సామీప్యమునకు విచ్చేసి "నాకు ఈశ్వరుని దర్శింపవలయునని యున్నది. అతనిని నాకు ప్రత్యక్షము చేయుడు" అని కోరెను. మోసెసును గూర్చి చెప్పినమాటను నీవు వినలేదా 'నీవు నన్ను చూడజాలవు,' అని మోసెసునకు భగవంతుడు ఆనతిచ్చెను అని సాదేకు వానితో ననెను. "ఆమాట నిజమే కాని మోసెసు యుగము గడచి పోయెను. ఇది మహామ్మదీయ ధర్మవిధానముగదా!" అని అతడు మారుపల్కెను. దానిపై "ఇతనిని తీసికొని వెళ్లి బంధించి నదిలో పడవేయుడు" అని తన అనుచరవర్గమునకు సాదేకు ఆజ్ఞచేసెను. తదనుసారము అతనిని వారుగొంపోయి బంధించి నదీజలములో పడవేసిరి. అతడు కొంచెము మునిగిన వాడై పయికి లేవదొడంగెను. అపుడు అతడు "ప్రేరితపురుషుని సంతతి వాడవయిన సాదేకా" అని పిలువసాగెను. ఆపిలుపును విని అతనిని నీటిలో తిరిగిముంచుడని ఆనతిచ్చెను. అట్లేజరిగెను. మఱల లేచుటయు మఱల ముంచుటయు లేచినపుడెల్ల "రక్షింపు" రక్షింపుమని సాదేకుని ప్రార్థించుటయు నిట్లుకొన్ని పర్యాయములు నడచెను. తదుపరి అతడు అగాధజలములలో పడవేయబడెను. అంతటితో నతనికి బ్రతుకుపై నాసతీఱిపోయెను. రక్షకులెవ్వరును అతనికి కనుపించలేదు. నీటిలో మునిగి చావవలసిన వాడనేయని అతడు గ్రహించెను. అట్టివిపత్సమయమున అతడు "ఈశ్వరా!" అని ఆర్తనాదము చేయనారంభించెను. అదివిని సాదేకువానిని నీటిలోనుండి లేవదీసికొని రండు అని తన అనుచరులతో జెప్పెను. వారు వెంటనే వానిని తీసికొనివచ్చి సాదేకు యెదుట నిలువబెట్టిరి. జలములోబడి తన్నుకొన్న బడలిక తీఱి శాంతచిత్తుడయిన పిమ్మట వానిని జూచి సాదేకు "ఈశ్వరునెట్లు చూచితి" వని అడిగెను. "ఎంతకాలము నేను అన్యుల ఆశ్రయమును అపేక్షించితినో అంతవఱకు నాకు అడ్డమే యుండెను. కాని నేనెప్పుడు సంపూర్ణముగా ఈశ్వరుని శరణు జొచ్చితినో ఆతనికొఱకై పరితపింప సాగితినో అప్పుడు హృదయ ద్వారము తెఱవ బడిన దయ్యెను. తత్కాలమున నేను వానిని చూడ గల్గితిని. మనస్సులోని అశాంతి తొలగి పోయెను." అని ఆతడు ప్రత్యుత్తర మిచ్చెను. ఎప్పుడు నీవు నన్ను పిలచితివో అపుడు నీవు భ్రమపడుచుంటివి. ఇపుడు నీకేద్వారము తెఱవబడియెనో దానిని నీవు శ్రద్ధతో రక్షించుకొనుము" అని సాదేకు వానికి హితోపదేశము చేసెను.



# కన్యాశుల్కము.



స్వదేశమును వీడి విశ్వకుటుంబముతో దేశాంతరములందు ప్రవేశించి మెప్పు వడసిన యభినవాంధ్ర కావ్యములలో కన్యాశుల్కము మొట్టమొదటిది. రాజకార్యపరాయణత్వమున చిరకాలము మాటుమణగియున్న శ్రీగురజాడ అప్పారావుగారి ప్రతిభయొక్కసారి విజృంభించి వయసుచెల్లినవెనుక నీ యసమాన కార్యమును వారిచే రచింపజేసినది. గ్రాంథికము గ్రామ్యమున నకృత్రిమ భాషా వాదములచే వ్యాకులమై యున్న సమయమున నీనాటకము ప్రకటింపబడుటచే ప్రజా మధ్యమున పొందవలసినంత యాదరమును పొందలేదు. కాని యందంతర్గర్భితమైయున్న కళానైపుణ్యమును వినూతనకావ్యరీతియును నానాటి కాంధ్రరసికుల యనురాగమునకు పాత్రములైనవి. కొంచెమో గొప్పయో మెచ్చుకొనువారేగాని కన్యాశుల్కము రచింపదగని గ్రామ్యగ్రంథమను వారిపుడు కానరారు.



గిరీశం ప్రవేశము.

కన్యాశుల్కమునకు పూర్వము తెనుగునాటకముల స్థితి యథోగతి యందుండెను. పురాణగాథలయందలి సన్నివేశములగు నాఖ్యానములను ఫారసీ మట్లతోను పాశ్చాత్య పద్ధతులతోను రంగస్థలముల నధిష్ఠింపజేసిరి. పాశ్చాత్య నాటకకవివతంసుల మార్గముల ననుసరించియు సంస్కృతసంప్రదాయముల నాదరించియు కొన్ని నాటకములు రచింపబడినవి. కాని యెన్ని ప్రయత్నము లొనర్చినను నవి ప్రతిభాశూన్యములగుటచే కావ్యరూపము నొందజాలక పోయినవి. నాటకకవులకును తదితర కావ్యోపాసకులకును పరస్పర వైముఖ్య మేర్పడినది— అందువలన నాటక

ప్రదర్శనముల నాదరించువారును ఆంధ్ర సారస్వతము నందలి గుణదోషములను విమర్శించుచు నిరంతరము భాషా సేవయందనురక్తులగు వారును భిన్నలక్ష్యములందు దృష్టి నుంచుకొని జొచ్చిరి. రానురాను నాట్యశాలలు సాహిత్యాభినయములకు ప్రధాన స్థానములగుటకు బదులు గీత వాద్యములచే రాత్రిళ్లు వినోదశాలలుగా మారినవి. అంతట నవి వినోదశాలలే యని తత్సంబంధు లందరును గ్రహించియుండిన బాగుండెడిది. అట్లుగాక వినోదమే నాటకమని ప్రేక్షక సామాన్యము నందొక అపోహ ప్రబలినది. సంస్కృత సంప్రదాయము లందుగాని విజాతీయ ప్రయోగ పాండిత్యము నందుగాని స్థిర ప్రవేశము లేకుండుటచే నెప్పటికప్పుడు దృగ్గోచరముగు ప్రదర్శన విధానములే చింతించుచు సుశిక్షితమగు దృష్టితో నాటక కళా సంబంధములగు విషయములను విచారింపకుండిరి. ధరించు వస్తుల యందును తెరలయందును గీత వాద్యములందును తోచిన విధముగ నేదో కొంత మార్పొనరించిన నాటక ప్రదర్శనములు లాతి కన్న నెక్కువ దర్శనీయములగునని తలంచిరి.



I am dreadfully in love with her.

పురాణ గాధలందంతగా మాధుర్యము లేదని చారిత్రక నాటకములు, అందును సౌఖ్యము లేదని భయోత్పాతమునకు బదులు పరిహాసమును బుట్టించు విషాదాంత నాటకములును బయలుదేరినవి. కాని యెంత మార్చినను యెంత రమ్యముగ నొనరింపబడినను జీవకళ మాత్రము గోచరింపలేదు. నాటకకవియున్న నకలంకమగు రసరూపము సాక్షాత్కరింపలేదు.

అట్టిసమయమున కన్యాశుల్క మవతరించినది. చదివినంతనే సాష్టాంగ పడవలసినంతటి కావ్యశిల్పము కన్యాశుల్కము నందు లేనిమాట నిజమే. పూర్వకవీంద్రుల నాటకముల ననుసరించి యది రచింపబడలేదు. అంక విభజనమునందు గాని, వస్తు పోషణము నందుగాని విశిష్ట కావ్య రూపమున కననుకూలములగు నల్పాంశములను వదలి కేవల కావ్యశిల్పము నందలి దీక్షతో సర్వావయవ సంపూర్ణముగ సర్వతోముఖసౌందర్యము కలదిగా నది వ్రాయబడి యుండలేదు. కన్యాశుల్కము సర్వలక్షణ లక్షితమగు నొక కావ్యరూపము కాదు. అసమాన ప్రతిభా

మొదటి ప్రదర్శనము తెనాలిలో జరుపబడెను. ప్రేక్షకులు కన్యాశుల్కము ప్రదర్శన యోగ్యమగునా కాదాయను సంశయముతో వచ్చియుండిరి. కాని త్వరలో గిరీశము 'జంఝుప్ప్వాస' లో కనిపెట్టినట్లు కన్యాశుల్కమున గూడనేదో ప్రయోజన



(మధురవాణి రామప్పంతులు నుండగా గిరీశం ప్రవేశించును. రామప్పంతులు మంచము క్రింద దూరును)

గిరీ:— అదేమిటా వికారం?

మధు:— ఆఖరు వికారం.

మున్నదని స్థూలముగ గ్రహించిరి. అంతట గిరీశంగారి క్రీగంటిచూపులకును, పరిహాసములకును, మధురవాణీ మధురహాస్యములకును రామప్పంతులు ప్రేమప్రలాపములకును, కరటక శాస్త్రిలవారి గంభీరములగు నత్తి మాటలకును సభ్యులు వశులై యానందించిరి. అంతట నీనాటకము ఆంధ్రదేశమున నైదారు దిక్కుల యందు జయప్రదముగ ప్రదర్శింపబడినది.

కొంతకాలముక్రింద నీసభవారు బందరులో ప్రదర్శించిన సందర్భమున తీసిన ప్రధాన పాత్రల ఛాయాపటముల కొన్నిటి నిందుముద్రించు చున్నాము. ప్రధాన భూమికలుధరించిన వారిలో గోవిందరాజుల సుబ్బారావుగారు (గిరీశము) స్థానం నరసింహారావుగారు (మధురవాణి) తంగిరాల ఆంజనేయులుగారు (రామప్పంతులు) కరటక శాస్త్రి (పులిపాక వెంకటేశ్వర్లు గారు) పేర్కొనదగియున్నారు. ప్రత్యేకముగ వారు ను వీరు నుగా క

సభవారందరును ప్రశంసార్హులనిమాయుద్దేశము. కొందరు గోవిందరాజుల సుబ్బరావు గారు గిరీశంభూమిక ధరించుటకు స్థూలకాయు లగుటచే తగియుండలేదనియు మధురవాణి సందర్భమున సంతపిల్లదనమవసరము లేదనియు నేవో కొన్ని ప్రత్యేక విమర్శనములు మామిత్రులలో కొందఱు కావించి యున్నారు. కాని ప్రేక్షకులలో నొక్కొక రొక్కొక విధముగా గిరీశమును తమమనస్సులందిడు కొనియుందురు. ఇందఱను మెప్పింప నేనటకునికిని తరముకాదు. కాని యింత మాత్రము చెప్పక తప్పదు. రామ విలాస సభ



రామప్పంతులు — మధురవాణి.

యందలి సభికు లెవరు శ్రోవను వారు పోవక మిక్కిలి యన్యోన్యముతో కలసిమెలసి, యొక నిర్ణేతకు బద్ధులైరె నాటక ప్రదర్శనమున రసభంగముకాకుండ ప్రదర్శింతురు. తదితర నాటకము లందువలె ఈకన్యాశుల్కము నందును గోవింద రాజుల సుబ్బరావుగారు తమ ప్రయోగవిజ్ఞానముతో సభికు లనేకముఖముగ నడిపించిన ధీమంతులు. వీరును ఆంధ్రదేశము నందంతటనుసుప్రసిద్ధులగుస్థానం నరసింహారావు గారు, తంగిరాల ఆంజనేయులు గారు మున్నగు వారీసభను నాట్యకళామందిరముగ నొనర్తురు గాక.



# వరశుల్కము

(క. రాజేశ్వరరావుగారు.)



రంగావధాని పుత్రునిపేరు వేంకటశాస్త్రి. వేదశాస్త్రములు చదువుకొనుటవలన లాభములేదని వెంకటశాస్త్రికి యింగ్లీషు చదువు చెప్పించెను. వేంకటశాస్త్రి చిన్నతనమునుండియు శ్రద్ధాభక్తులతోడ చదువుకొనుటవలన ౨౦ వ సంవత్సరము దాటునప్పటికే యం. ఏ. పరీక్ష ప్యాసాయెను. రంగావధాని పుత్రునికి వివాహము చేయ ప్రయత్నమందుండెను.

అనేక సంబంధములు రాసాగెను. రంగావధాని పలుచోట్లకేగి సంబంధములు చూచి వచ్చెను. కాని యే సంబంధమూ నచ్చలేదు. యం. ఏ. ప్యాసయిన కొడుకునకు తగిన పిల్ల దొరకవలయుననిన కష్టముకాదా? పిల్ల చక్కనిదిగా నుండవలయును గదా? వ్రాతకోతలుగాక నాలుగు ఇంగ్లీషుముక్కలుండినయెడల మరీ మంచిది. సాలంకృత కన్యాదానము గావలయును. లేనియెడల యం. ఏ. ప్యాసయిన వాని మర్యాదకు భంగము— ఇక కట్నము బి. ఏ.కు ఐదువేలయినప్పుడు యం. ఏ.కు పది వేలుండుట న్యాయ విరుద్ధమెట్లగును? కాని చక్కదనము— చదువు— డబ్బు మొదలగునవి గల పిల్ల యెక్కడ దొరకును? అందుకనే రంగావధాని కాలు బలపమయ్యేటట్టు వత్సరమునుండి దేశమంతయు దిరిగెను. డబ్బున్న చక్కదనములేదు. ఇక చదువున్నవాండ్రెందరు పదివేలు కట్నమిచ్చువారుకూడ కనుపడలేదు. ఒకరిద్దరున్నను వారి పిల్లలు కురూపులు వారుమాత్రము పది వేలు కట్నమిచ్చుట. గాక పిల్లకు ఐదు వేల రూప్యముల నగలకూడ నియ్యగలరు. కాని చేయునదియేమి? పుత్రుని వివాహ విషయమున రంగావధాని యిదమిద్ధమని నిర్ణయింపజాలక తొక్కిళ్ళాడుచుండెను. గ్రుడ్డిలో మెల్ల యన్నట్లు ఐదు వేలిచ్చువారిలో మంచిపిల్లను చూచుచుండెను. ఒకనాడు వేంకటశాస్త్రి తండ్రిని సమీపించి యిట్లనియె "కట్నము కానుకల సంగతి మాట్లాడ వలదు,,

ఈమాటకు రంగావధాని విస్మయము బొందుచు "ఎందువలన,, అని యడుగ వేంకటశాస్త్రి లజ్జితుడై యొకింతవడి యోచించి సెమ్మదిగ ఇట్లనియె "కట్నము గైకొనుట యన వరుని యమ్మట యనియేగదా? యర్థము,, ఆమాట వినినంతనే రంగావధాని మండిపడుచు నిట్లనియె "ఔరా"? బుద్ధిహీనుడా? నీచదువు సంధ్యలు ఏడ్చినట్లె యున్నది. అమ్మటయా? ఆ. అమ్మటయే. అమ్మినవేమి? నిన్నమ్ముటకు నాకు సంపూర్ణాధికారమున్నది. లేనియెడల నీ చదువుకు బెట్టినది యెక్కడనుండివచ్చును? నీకొరకు ఖర్చు బెట్టినదెంత? వేలకువేలని తెలియదూ? ఇంతడబ్బు ఖర్చుబెట్టించి ఇన్నాళ్ళుచదివినచదువిదేనా? వెర్రితలలు వేసిందే? కట్నమంటె అమ్మడమా? చెట్టుచెడుకాలమునకు కుక్కమూతి పిందెలన్నట్లు— "

వెంకటశాస్త్రి తలవంచుకొని మారుమాట చెప్పక యటనుండి బయలుదేరెను. కాని యీవిషయము చుట్టుప్రక్కలనుండు గృహములయందలి మిత్రుల చెవికెక్కెను.అందొక మిత్రుడు "వేంకటశాస్త్రి గంటలకొలది కాలముపన్యసించెదవే వరశుల్కము కన్యాశుల్కము గూడదని! రహస్యంగా ఐదువేలకు బేరమా? బాగున్నది! ఉపన్యాసములతోడ బనియేమి? చెప్పునదొకటి చేయునదొకటియా? పది చెప్పుటకంటె యొకటి చేసి చూపించుట మంచిది" అని నుడువ వేంకటశాస్త్రి తలవంచుకొని నిట్టూర్చుచు ఇట్లనియె। "ఏమిచేసేదీ? చిన్నప్పటినుండి మానాయనయెదుట మాట్లాడి యెరుగను. అడ్డుచెప్పిన కోపం. ఏమిచేయుటకు దోచుటలేదు" ఈమాటలకాతని మిత్రులు ఈతడు పితృభక్తియందు రామచంద్రసార్వభౌము డురాయని నవ్వజొచ్చిరి. వేంకటశాస్త్రి మాత్రము విచారముగ నుండెను. వేంకటశాస్త్రి తండ్రితోడ మరుమాటాడలేదు. అతని తల్లి గతించినప్పటనుండియు తండ్రియే యీతని పెంచి పెద్దవానిని చేసి చదువు సంధ్యలు చెప్పించెను. అందువలన తండ్రిమాటల కాతడు ఎదురు చెప్పుట కష్టపడడు. ప్రతివిషయమున నాతని కోరిక దీర్చుటయే ధర్మమని యెంచుచుండెను. మరియు, తల్లి నగలు, భూములు బుట్ట మొదలగునవి యాతని చదువుక్రింద వ్యయమగుటయె గాక ౨౦౦౦ లదాక ఋణమాయెనను విషయము వేంకటశాస్త్రికి తెలియనిది కాదు. అందువలన వెనుకకు జనిన గొయ్యి ముందుకు జనిన నుయ్యి, అను సామెత ననుసరించి యెవ రేవిధముగ వెక్కిరించినను; మౌనమును దాల్చి సహింపుచుండెను.

చివర కొక సంబంధము కుదిరెను. వరకట్నమయిదు వేలు. నగలు మొదలగునవి మూడువేలు. లగ్నముగూడ స్థిరమాయెను.

వివాహమైన తరువాతమాగృహప్రవేశమై,మూడు దినములుండి మనుగుడుపులకు వెంకటశాస్త్రి భార్యతోడ అత్తవారింటి కేగెను. అచ్చట పదునైదు దినములుండి నెలకు 75—0—0 ల వేతనముమీద స్కూలు మాష్టరీ సంపాదించెను. తిరిగి స్వగ్రామమునకు రాలేదు. నేటివరకునచ్చట నెలకు ౧౫౦—౦—౦ పుచ్చుచున్న హెడ్డుమాష్టరు పదవికిరాజీనామా యొసంగెను.

రంగావధానులు పుత్రుని బంపించమని రెండు మూడుత్తరములు వ్రాసెను. మనుష్యులను బంపించెను. జబాబు లేదు. నే నిక యింటికి రానని మాత్రము వేంకటశాస్త్రి చెప్పుచుండెను. కాని కారణమును వెల్లడించలేదు. అందు వలన రంగావధాని మరియొక స్నేహితునితోడ బయలుదేరి వియ్యాల వారింటికి వచ్చెను. కాని పుత్రుడేడీ? పూటకూటింట—అందువలన భుజింపక గబ గబ పూటకూటింటికేగి పుత్రుని కౌగిలించుకొని యేడ్వజొచ్చెను. ఆదృశ్యమును చూచుచున్న చుట్టుప్రక్కలనున్నవారి హృదయము లదరజొచ్చెను. అప్పుడు రంగావధానులు పుత్రుని జూచి యిట్లనియె. "నాయనా? ఇంటికిరావా? నీ వింట లేకుండిన నేనెందుకు? ఆరుమాసముల వయసునుండి పెంచి పెద్దవానిని చేసిన నేను నిన్ను విడచి యుండగలనా? రా? యింటికిరా! ౧౫౦—౦—౦ల ఉద్యోగము వీడి ౭౫—౦—౦ల ఉద్యోగమా? నాకర్మ"మనితలబాదుకొనజొచ్చెను. కొంతవడికి వెంకటశాస్త్రి తలవంచుకొని "నేనింటికి రా"ననెను.

రంగావధాని— ఎందుకురావు?

వేంకటశాస్త్రి— రాను. ఋణము తీరువర కిచ్చటనే యుండవలయును. ఈగ్రామము వీడరాదు.

రంగావధానులు:— (ఆశ్చర్యచిత్తమున)నఋణమేమిటి?

వేంకటశాస్త్రి ప్రత్యుత్తర మీయ కుండెను. రంగావ ధాని "ఋణమేమిటిరా?" యని కొంతరగ నడుగు చుండ కొంతవడికి ధైర్యము దెచ్చుకుని తలవంచుకుని యిట్లనియె "నేను వీరికి క్రీతదాసుడనైతిని. నన్ను నీవుపెంచి పెద్దవానినిచేసి

అయిదువేల రూప్యములకు విక్రయించితివి. అందు వలన నీగ్రామమందేయుండి వడ్డీతోసహా అయిదు వేల రూప్యములు మామగారికి చెల్లించినగాని యీవూరు దాటుటకు వీలులేదు. ఋణముదీరిన తర్వాత నీకడకు వత్తును.,,

ఆమాటలు విని ప్రక్కనున్నవారిలో కొందరు నవ్వజొచ్చిరి. కొందరు విచారింప జొచ్చిరి. ఆత్మ గౌరవమున్న ఇట్లుండ వలయునని కొందరు నుడువుచుండిరి. ఆమాటలు రంగావధానుల చెవులకు ములుకులువలె నుండెను. వియ్యంకుని మోము విప్పారెను. అతనిమోము విప్పారిన కొలదిని రంగావధానికి అరికాలిమంట తలకెక్కుచుండెను. దుఃఖము-క్రోధము-భయములవలన తల్లడిల్లుచు చేయునదిగాన రాక వియ్యంకుని మోముకేసి చూచి చూచి భుజింపక స్వగ్రామమునకేగి నాల్గవదినమున తిరిగి వచ్చి వియ్యంకునికి ౫ వేల రూప్యము లిచ్చి "వెంకటశాస్త్రిని బంపించు"మని యడిగెను.

# పండ్లబేరము

ఉ॥ గాయకసింత యేమిటి కకాలపుఁ బండ్లకు? రాలుగాయ కా
దాయిది? జీడికంపెచట దాచెదు? పైపయి కావిరంగుఁ
మాయముసేసి మేల్తరము మామిడి పండ్లని బూకరింతు వే
మోయి? లసద్రసానుభవమున్నది మాకును! టెంకపుల్పులేఁ
గాయలనేటి నీకడుపు కక్కుటతీఱ బదిమందిలోనఁ బం
డ్లోయని యెట్టులమ్మెదవొకో? పరిపాకముఁ జెందునంతకున్
జేయఁగ రాదొకో కృషి? యిసీ చెడఁ గొట్టితి చెట్టు వేరిటుల్
కోయకు కోఁతలింక నసగొంతుకఁ జుట్టెడు, చొల్లునోటి పు
ల్లాయకు నచ్చునీరసము! ఆవలి పత్రపుటాంతరంబునన్
జేయిడి చూతునా రక? ఓసీ! కలగల్పొనరించితే విజా
తీయము దేశవాళి? విడఁదీసినఁ గొందుము దేశవాళులన్
తీయదనంబు చిప్పిలెడు తేనెల సోనల వోలె సారమున్
మాయవి వర్ణసౌష్ఠవము, మాకు హితంబులు దేశవాళులన్
పోయియు, మేలుపల్కుబడి, యర్థసమృద్ధియు సాధువృత్తి దే
శీయపుఁ బండ్లబేరమునఁ జేకురు, బేరములందు నెల్లఁ బై
చేయిగ లెక్కవచ్చు, ధనసిద్ధికినై కసుగాయ బేరమున్
జేసుకుమింకమీఁద! ఁగృషిఁజేసి ఫలించి రసానుభూతినా
ప్యాయమునీకుఁ జేకురి రసానుభవజ్ఞులు మెచ్చునంత కున్ ॥

( కం॥ వీ॥ బసవరాజుగారు. )

# పులికేశుని అశ్వమేధము

(చిల్లరిగె శ్రీనివాసరావు గారు)

రాజనగా నెవరు? ప్రజయనగా నేమి? రాజు ప్రజకు ఆత్మ ప్రజ రాజుకు శరీరము. ఒకానొకప్పుడు మన ఆంధ్రదేశమున చాళుక్యవంశమునం బుట్టిన పులికేశుడు మనదేశీయుల కాత్మయయ్యెను. ఆయనను కేంద్రముగాగొని మన యాంధ్రులొక్క మహారాష్ట్రముగా విజృంభింప నారంభించిరి. ఆవిజృంభణము అశ్వమేధయాగమని యాకాలమున సాధింపబడుచుండెను. పులికేశ మహారాజు ధన ధాన్యసంపదల సేకరించి దానధర్మములను చేతబట్టి ధర్మపత్నీసమేతముగ యాగదీక్షను స్వీకరించెను.

ఫాల్గుణమాస శుక్లపక్ష దినంబులు ముద్దులవెదజల్లుచు దయసేసి యున్నవి. యాగాశ్వమును యజ్ఞశాలకు దీసికొనివచ్చిరి ఋత్విజులు మంత్రములను చ్చాటనముసేసి. పవిత్రజలంబుల నాయశ్వంబుపై పోసి స్నానంబు చేయించిరి. సోమయాజియగు పులికేశుడు మహావీర్యవంతమ్ములగు మంత్రముల నాయశ్వముయొక్క చెవిలోపల్కెను. శత్రువులచే బట్టుపడకుండనొక్క సంవత్సరము భూసంచారముచేసి మరల నాయజ్ఞవేదికకు వచ్చి దేవతలను ఆత్మతోడను మానవులను తన శరీరముతోడను తృప్తిచేయుటకు తనను సమర్పణచేసుకొనవలెనను హెచ్చరిక వాక్యములను ఆయన చెప్పెను. ఆఅశ్వము ఆమాటలను గ్రహించినట్లు సకిలించి తన కాలును నేలపై దువ్వెను. ఆపనులు శుభశూచకములని యచ్చటి సభాసదులెల్ల సంతోషించిరి.

ఆ అశ్వమున కనేక చిత్రవిచిత్రమైన యలంకారములను జేసిరి. జాతీయ పతాకమును దాని వీపున గట్టిరి. అది స్వేచ్ఛగ విహరింప నారంభించెను. అదిపోయిన నెల్లెడల పోయి యాపదల నెదుర్కొనుటకు సంసిద్ధులై యరచేతులలో ప్రాణములను బెట్టుకొని యవసరమైన తఱిని పారవేయుటకు సంసిద్ధులై నాలుగువందల యోధాగ్రేసరులు వెంట నడిచిరి. ఈనాలుగువందలును రథతురగ హస్తి పదాతి బలంబుల కొక్కొక్కవంద చొప్పున చేరిన వారై యొప్పియుండిరి. వీరు వింధ్యపర్వతంబులు హద్దు చేసుకొని సేతువువరకును గలదేశమును జుట్టి తిరిగిరి. ఈమధ్యదేశములోని రాజులెవ్వరును పులికేశుని యధికారమును థిక్కరింప సాహసింప లేరు. అందఱును చక్రవర్తి పులికేశవల్లభునికి కానుకలను సమర్పించి పులికేశుని తమ సార్వభౌమునిగా స్వీకరించిరి.

సంవత్సరము మీఁద నొక్క మాసము నడచెను. వసంతఋతువు తన నవలావణ్య విలాసంబు లన్నిదిశలకు చిమ్ముచు తాండవంబాడుచు పుడమిపై కేతెంచెను. ఆసమయమున రాజధానియగు వాతాపి నగరము యొక్క శోభ చెప్పఁదరంబుగాదు. రాజధానియందు రాజసేవకులు బయలుదేరి తమ శిల్పచాతుర్యంబుచే ప్రకృతి సౌందర్యంబునకు వన్నె వెట్టుచుండిరి. మనుజుని నైపుణ్యంబును కృత్రిమంబని యాక్షేపింతురేగాని యానాడు చూచిన వారికి పరమేశ్వరుని పుత్రుండైన మనుజుని కళానైపుణ్యంబు తండ్రి చాతుర్యంబునకేమియుఁదీసిపోవునట్లుగాన్పించ లేదు. దేవమానవుల చాతుర్య సమ్మేళన మారోజు పట్టణమున కద్భుత విలాసమొసంగెను. ఎత్తుపల్లములపై రచియింపబడినఁ యాపట్టణము తరంగమాలాలంకృతంబైన మహా సముద్రంబుగా గాన్పించెను. వీధులెల్ల నద్దంబు పరచినట్లు మెరయుచుండెను. వివిధ దేశములనుండి వచ్చిన పండితసామంత యోధమంత్రి బాంధవ ప్రేక్షకాది జనులకు తగిన విడుదుల నేర్పాటుచేసిరి. పాతాళగంగను బయటకు తీసి స్నానపానంబుల కనుకూలమైన యేర్పాట్లు చేసిరి. వచ్చినవారందఱును సంతోషమునఁ బ్రొద్దు పుచ్చుటకు వివిధ వినోదంబు లేర్పాటు చేసియుండిరి.

ప్రధాన యజ్ఞశాల చాలపెద్దది. అచ్చట యజ్ఞాశ్వము యూపంబునకు గట్టబడియుండెను. దానితోపాటు మఱి కొన్ని* గృహ్యాజంతువులును అక్కడ ఇతర యూపంబులకు కట్టబడి యుండెను. అనేకఅరణ్యక జంతువులును బలియగుటకు తీసుకొని రాబడియుండెను. పులికేశుఁడును ఆయన పట్టమహిషియు దీక్షగైకొని యజ్ఞశాలను గాచుకొని యుండిరి.

రాత్రి రెండుజాములాయెను. కాని పట్టణము మాటుమణగలేదు. వెన్నెల పిండి యారబోసినట్లుండెను. అక్కడక్కడ జనులు గుంపులు గుంపులుగా గూడి కబురులు చెప్పుకొనుచుండిరి. కొందరు నేలమీఁద కూర్చొని వాద ప్రతివాదములు సేయుచుండిరి. కొందరు వీధులమధ్య నిలచియుండి పులికేశుని గూర్చి యాహాహా యని స్తోత్రము చేయుచుండిరి.

ఆసమయమున నొక్క యాగంతుకు యజ్ఞశాలకు వచ్చి మహారాజు సందర్శనము వెంటనే కావలెనని కోరెను. మహారాజుతక్షణమే యాతని కొక్క గుప్తదర్శన మిచ్చెను.

ఆగంతుకుఁడు:— మహారాజా సాహసము చేయుదురా?

పులికేశుఁడు:— సాహసము సేయకున్న మహారాజు నెట్లగుదును?

ఆగం:— అట్లైన నా వెంట రండు మాఱు వేషముతో.

పులికేశుఁడు:— అవశ్యము వచ్చెదను.

ఆగంతకుని వెంట మహారాజు ఒకవృద్ధభటుని వేషముతో బయలుదేరెను. పురబాహ్యప్రదేశమున నొక పర్వతపంక్తి గలదు. ఆపర్వతములలో నొకదానియందు పూర్వమెన్నఁడో బౌద్ధులచే నొక చైత్యము దొలవబడియుండెను. ఆచైత్యమే మఱికొన్ని

శతాబ్దములకు హిందూ సన్యాసులకు నివాసమైయుండెనని యాగోడల మీద చెక్కబడిన పౌరాణిక విగ్రహముల వలన దెలియుచుండెను. కాని యానాటి కాలమున నదిపాడుపడియుండెను. అందు పిశాచము లుండునను భయముచే నెవ్వరు నచ్చోటికి వచ్చుటలేదు. చెట్లుచేమలచ్చట పెరిగి లోపల భయంకరముగ నుండెను.

వీరలిద్దరును లోపల ప్రవేశించు సరికి లోపల నలుగురైదుగు రెవ్వరో యొకసన్నని దీపము ముందర కూర్చొని మాటలాడుచుండిరి. పులికేశుడొక మూల దాగుకొని యుండెను. ఆగంతకుడు పోయి యక్కడ వారితో కలుసుకొనెను.

"ఏమంత యాలస్యము చేసితి" వనియా యోధులలో ప్రధానమూర్తిగా గాన్పించిన పురుషుడు ప్రశ్నించెను.

"లోకమునంత కన్నుమూయుట కెన్నిపనులు చేయవలసియున్నది?" అనిఆగంతకుడుజవాబు చెప్పెను.

"నీకొరకే వేచి యున్నాను." అని యాప్రధాన పురుషుడు తనయుపన్యాసమును ప్రారంభించెను. "సోదర వీరులారా! స్నేహితులారా! ఈయజ్ఞము నెన్నికష్టములబడి ఈవిజయమునకు తెచ్చితిమో మీకు నేను వేరుగ జెప్పనక్కరలేదు. ఈ జయసంకీర్తనమును నిర్వక్రముగా నేను మీనాయకుడనై నడిపించితిని. నేనెన్నాళ్ళు వేచియుండినను ఎంత కష్టపడినను నాకీరాజ్యాధిపత్యము దూరమగుచునే యున్నది. నాతండ్రియెంత పెద్దవాడైనను రాజ్యాధికారమును వీడ లేకున్నాడు. ఇకత్వరలో వీడకున్న మాయన్నదమ్ములలో కలహములు తప్పవు. దీపటితో యజ్ఞము సాంతము కాగలదు. వారందరును నాకు వత్తురైయున్నారు. వృద్ధరాజును రహస్యముగ గడతేర్చిన వెండల వారందరుండగనే నాకు పట్టాభిషేకము సేయగలవారు."

రాజద్రోహులలో నొక్కడు- గృహస్థుడు వయసుమించిన పిమ్మట సంసారభారమును తన యనంతరమున సూనులపై బెట్టి వాన ప్రస్థమున కేగుటలనే రాజులు వృద్ధులైన రాజ్యభారమును బలపరాక్రమసంపన్నులగు పుత్రులపై వైచి తపస్సుచేసుకొన వలెను గదా.

ప్రధానపురుషుడు — రాజ్యాధికారము కంటెను ఆయన యశఃకాంతి నన్ను బాధించుచున్నది. ఎక్కడవిన్నను ఆయనకీర్తనమే. ఎక్కడ చూచినను ఆయన శాసనములే. ఆయన ఎన్నటికైన చనిపోయినను ఆయనపేరు ఆచంద్రార్కముగ నీభూమి మీద నుండును గదా. ఉండినను నుండనిమ్ము గాని నాపేరు ఎన్నటికైన ఈభూమిమీద నిలిచియుండునట్లు చేయుటకు అవకాశము వచ్చునా? ఆవిషయమై నాకు నిస్పృహత వాడముచున్నది. జీవితము క్షణభంగురము. నేనీ యశ్వమేధమును నడిపించుచు నెప్పుడో యేదో పోరాటములో పేరు నూరును లేకుండ చచ్చిపోవుదునని తలంచి నప్పుడెల్లను నాకు దిగులగుచున్నది. నేదీని భరింపజాలను. పోరు బల

మంతయునాది పేరు బలమంతయు మహారాజుది. అహాహా నేనింక సహింప లేను.

ద్రోహులు — మాదిగులు తీర్చుటకు ఇవిగో మీఖడ్గములన్నియు సిద్ధముగా నున్నవి.

ప్రధాన పురుషులు — ఏదీ ప్రమాణము సేయుడు.

ద్రోహులు — మీపాదమాన. మాఖడ్గము లాన (అని ప్రమాణము చేయుదురు.

ప్రధానపురుషుడు — మీకు జయమగును గాక పొండు. వారు బయలువెడలఁ బోవుచుండిరి. అంతలో పులికేశుఁడు బయటకువచ్చి యిల్లుబిగ్గరగా చెప్పెను. 'యోధులారా! మీరువిశేషదూరము పోనక్కరలేదు. నాకుమారునిది పోరుబలము. నాది పేరు బలము. నాపేరు బలమున నాదేశప్రజలకు సుఖబలము సంపదబలము లభించు చున్నవి. ఈ పేరు ఈకీర్తి ఇది వట్టి భ్రమ. నాపేరు నాతల్లిదండ్రులు పెట్టినదిగాని నాతోడవచ్చునదికాదు. ఈ పేరును, ఈపేరును గొన్న ఈశరీరమును ఇచ్చట విడిచి పెట్టుటకు వచ్చియున్నాను. మీలో విశేష సాహసమున్న వాడు ముందువచ్చి ఈరొమ్ము మీద మీఖడ్గమునుంచి ఈ మాయ శరీరమును నాశనము సేయుడు సందేహింపకుడు. ఇదిగో రొమ్ము' నారాజద్రోహులు నిర్ఘాంత పోయికత్తులుక్రిందపడవేసియామహాత్మునకు నమస్కరించిరి. రాజకుమారుడు కత్తి నెత్తి హా యని తనను పొడిచికొనబోయెను. పులికేశుడు పరుగెత్తుకొని పోయి యాతని చేయి పట్టుకొను నంతటిలో నాతడు ఆత్మహత్య చేసుకొనెను.

పులికేశుఁడు కన్నుల నీరు బెట్టుకొనెను. కాని వెంటనే సంయమనము చేసుకొని యాసంగతి రెండవ వారలకు తెలియకుండ యజ్ఞమును బూర్తిచేసి యతిథులనందరకును మర్యాదలు చేసి పంపివేసి తన రాజ్యమును మనుమని కప్పగించి తాను వింధ్యపర్వత గుహలందు తపస్సుచేసుకొనన రిగెను.

~ ❧ ~




తపస్సననేమి? మానవుడు విశుద్ధాత్మయందు తనసర్వస్వమును రూపాంతర మొందించుకొనుటను తపస్సందురు. శరీరము ప్రాణము మనస్సు బుద్ధి మొదలగువానిని యాత్మయందు సన్నివేశ మొనర్పవలయును. అప్పుడా పరశమణి స్పర్శవలన నవియన్నియు దివ్యసువర్ణచ్ఛాయలతోడ తేజోవిరాజితమగును. అదియే నిజయమగు జన్మాంతరము. మనశరీరము మొదలగునవి దోషయుక్తములు. అందువలన వానినన్నిటిని రూపాంతర మొందించు సాధనను తపస్సని గ్రహింప వలయును.

*    *    *    *    *

ఆద్యప్రకృతియొక్క లీలా భూమిని ఆధారమందురు. వాసనా సంస్కారముల వలననాధారమంగు ప్రవహించు దివ్యశక్తి ప్రవాహము ప్రతిపదమున నడగింప బడుచుండును. అందువలన జీవితఘటనలు రసహీనములై గన్పడుచుండును. కావున సాధనచేయవలయును. సాధనకు ముఖ్యాంగము శుద్ధి. మానవుడు. లేక జాతి—సంఘములు—శుద్ధిబొందిన గాని సజీవమగు దివ్యశక్తి ధారాళముగ బ్రవహించిన గాని మానవునకు లేక జాతి—సంఘములకు ముక్తి గలుగదు. ఆత్మసమర్పణ యోగుల శుద్ధినీతి వేరు. వారు బహిర్విషయముల నెక్కుడుగ బాటింపరు. వారి సాధనయంతయు మనస్సుతోడ గూడియుండును. అంతర్జగత్తునకు సంబంధించి యుండును. అందువలన బహిర్విషయముల నెక్కుడుగ చాటించువారు వీరియందెక్కుడు తప్పులను గాంచు చుందురు.

భారతీయుల పురాతన సాధన భజనలు నేడినుప సంకెలలుగ మారినవి. అందువలన జీవితమునెట్టి నియమముల నడిపింపవలయుననుటయే ముఖ్యయోచన. ఈ విషయముననే మత భేదములు కలహములు గలుగుచుండును. భగవచ్చింతనము ప్రారంభమైనవానికి నిద్రను త్యజింప వలయునను ఉపదేశము నిరుప యుక్తముగదా? శుద్ధి సాధనయందును విచారమందును జాతిభేదమును గమనించుట యసంభవము. పరమేశ్వర సాధనయందు మనోనివేశన మొనర్చిన వానిని జాతి ధర్మముల వలన వేరుగ భావించుటకు వీలులేదు. అట్లొనర్చిన యెడల నది యసంగతమగును. శుద్ధియననేమి? సర్వవృత్తులను నంతర్ముఖమునకు త్రిప్పియుంచుటను శుద్ధియందురు. సర్వరూపములను స్వరూపమందు మేళవించి భావజలధియందు సంతరణ మొనర్పు చుండవలయును. ఈవిషయమును విపులీకరించుటకు ప్రయత్నింతును.

*    *    *

శుద్ధి యనునది సాధనకు ముఖ్యాంగమని యిదివరకే చెప్పియున్నాను. అందువలన సాధన విషయమును స్పష్టీకరించిన యెడల శుద్ధియొక్క యావ సుస్పష్టముగ గోచరించును. సాధనకు గురువుండవలయును. సద్గురువు లభించని వాని యధోగతికి మేరయుండదు. సద్గురుడన నెవ్వడు? భగవానుడే సద్గురుడు. సాధనయందు సమర్పణము ముఖ్యము. తనను లోపింప జేసుకొనజాలని వాని సమర్పణము సార్థకముగాదు. దీనినే జీవించియుండగనే మరణించుటయందురు. ఈమరణమందే యమృతముత్పత్తి యగును. దివ్యజీవితమున కిదియే రససింధువు. అందువలన నెవ్వని కొరకు సమస్త మర్పింప గలమో యట్టి సద్గురుడు లక్షలకొలది సాధకులయందొకడైన దొరకుట దుర్లభము.

*    *    *    *    *

భావము ఘనీభవించినప్పుడే మాధుర్య సృష్టి. నీకెట్టి భావముండునో యట్టిలాభమును బొందుదువను సాధుపుంగవుల వాక్యము స్మరణీయము. ఈశ్వరుని యందు విశ్వాసములేని వానికి భావము గలుగదు. ఆంధ్రుల సాధన పూర్ణము. ఆత్మ స్వరూపముయొక్క పరిపూర్ణ వికాసము. ఇదియంతయు మనము కేంద్రీకరించు దానిమీద నాధారపడియుండును. భావ ఘన మాధుర్యమే గదా ప్రేమ.

* * * * *

ఆనందమునకు మూలము ప్రేమ ప్రేమోత్పత్తికి స్థానము ఆత్మ సమర్పణము ఒకని యందు మరియొకనికి భావ ముండవలయును. కాని యది యనన్య మమతా విశిష్టముగ నుండవలయును అప్పుడే ప్రేమ సంభవమగును. భగవానుని మీద భక్తునకును, భర్తమీద భార్యకును, పరమేశ్వరునియందు సాధకునకును మానవుని యెడల మానవునకును ప్రేమగలుగును. ప్రేమోదయమైన యెడల సాధకుడు నిరవచ్ఛిన్నానందమందునిమగ్నుడగును

ప్రేమ యత్యంత మమతాయుక్తమును, ఘనీభూతమునైన కొలదిని హృదయము నిర్మలమగుచుండును. అప్పుడు పులకలు బుట్టును. ఘనీభూతమగు ప్రేమద్రవించినకొలదిని సాధకుని హృదయము పరిశుభ్రమగుచుండును.

* * * * *

ఈసాధనకు ముఖ్యాటంకము నివృత్తి. కొన్ని స్థలములయందు ప్రవృత్తిముఖమును ద్రిప్పినయెడల నది యెప్పటికిని సహజమార్గమును బట్టదు. అందు వలన సాధకుడు మిక్కిలి మెలకువతోడ మెలంగుచుండవలయును. ప్రవృత్తి సహస్రముఖముల నడచుచుండును. అయినను గతియొక్క మూలోద్దేశము ఈశ్వర ప్రాప్తియై యుండవలయును. ఈశ్వరముఖమై ప్రవహించు ప్రవృత్తిని ప్రవృత్తియని నుడువుటకు వీలులేను అప్పుడది రతిరూపమును దాల్చును. ప్రేమయొక్క గాఢ రూపమే రతి. పులకలు రతి యుదయమునకు సూచన. ఈశ్వరునియందు రతి బుట్టినయెడల రసము స్రవించును. దీనినే రతి యాస్వాదనమందురు. బహిరంతముల యందు పరమశుచి గలిగిన వారెల్లరీ యవస్థను బొందగలరు.

మానికమని చెప్ప వలనుబడదు. ప్రతియొక్కడును ఆత్మ ధర్మమువలన దీక్షితుడు గావలయును. ఆత్మ ప్రత్యము—భాగవత జీవితము— గావలయునను తీవ్రాకాంక్ష గావలయు. ఇది గలిగినవాడు గమ్యస్థానమును జేరును.

* * * * *

ఆత్మశోధన కెట్టి వ్యవస్థయు లేదాయని ప్రశ్నింపవచ్చును. ఉన్నది. కాని త్రుటిలోన కాపీనమును ధరింపవచ్చును. కాని యాత్మ సమర్పణ యోగుల శోధన నీతిమాత్రము దురవగాహము. కఠోరము. దీనిని బుద్ధితోడ గ్రహించుటకు వీలులేదు. ఇది బుద్ధికి యతీతమగు స్థలమున మొలకలెత్తును. కఠోరమనుటకు కారణమేమన నిది ప్రయత్నము వలన లభించునది కాదు.

* * * * *

మధ్యయుగ సాధనయందు దివ్యప్రకృతి నార్జించవలయునను ప్రయత్నముండెను. దీనికిముఖ్యోపకరణములు త్యాగము. నిగ్రహము కాని నిగ్రహమువలన వృత్తులు సమూలముగ నష్టముగావు. అందువలన భోగనీతియే ప్రవర్తితమగును. పరితృప్తినొందని యాకాంక్షయత్యధికముగ జ్వలించును. కావుననే జీవితము యొక్క యీ మహాసమస్యామీమాంస కొరకు శ్రీకృష్ణభగవానుడు సర్వధర్మముల బరిత్యజించి తననే శరణు జొరుమని చెప్పియున్నాడు. భగవద్గీత యందలి యాత్మసమర్పణ యోగము మన దేశమందనేక ఛందముల ఆత్మప్రకాశ మొనర్చుచున్నది.

* * * * *

త్యాగభోగములకంటెను, నిగ్రహములకంటెను, మనన ముత్తమము. మంచి చెడుగులకు సంబంధించిన వృత్తులు మనోక్షేత్రమందెన్ని యుత్పన్నమగుచున్నను, మనన మొనర్పగలిగిన యెడల వాని నతిక్రమించ గలుగుచున్నాడు ఏ మనోవృత్తియు మిథ్యకాదు. మాయకాదు. అవియన్నియు స్వరూపము యొక్క రూపములు. కావున వానిని జీవిత స్రోతమున బడనీయక భగవానునికేసి త్రిప్పవలయును. అటుల త్రిప్పుటకూడ సుసాధ్యము. కావున సమస్త వృత్తులు—చింతనలు—కార్యములు మొదలగువాని నన్నిటిని భగవానున కర్పించి తన సర్వస్వమును రూపాంతరిత మొనర్చుకొనిన యెడల సాధకుడు చరితార్థుడగును. సంఘము—జాతి మొదలగునవన్నియు సముద్ధరింపబడును.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

గ్రంథకర్తలు.

మామిడిపూడి వెంకటరంగయ్య ఎం. ఏ.
అకుండి వెంకటశాస్త్రి.

చంద్రగుప్త చక్రవర్తికి ప్రధాన మంత్రియు చాణక్యుడను నామాంతరము గలిగినట్టియు కౌటిల్యునిచే రెండు వేల సంవత్సరములకు పూర్వము వ్రాయబడిన సంస్కృత గ్రంథమునకు సరియైన తెనుగు. పరిపాలన విధానమును గురించి మన పూర్వులు వ్రాసిన గ్రంథములన్నిటిలోను నగ్రగణ్యము. దీనినాధారము చేసికొనియే కామందకాదులు గ్రంథములు రచించిరి. పాశ్చాత్యులు సహితమిట్టి యుద్గ్రంథము లేదని పొగడియున్నారు. ప్రాచీనకాలమందలి మన దేశములోని రాజ్యము లెట్లు పాలింపబడుచుండెనో తెలిసికొనగోరు వారికిని, చారిత్రపరిశోధకులందరికిని, నిది యమూల్యమైనది. గ్రంథకర్తలచే నీ గ్రంథమందు వ్యాఖ్యానింపబడిన రాజ్యాంగముయొక్క ప్రధానలక్షణములు తెలియగల విషయములను విమర్శించి యుపోద్ఘాతము చేర్చబడినది. 500పుటల గ్రంథము. కాలికో బైండు ఖరీదు రు4-0-0 మాత్రము. వలయువారు మామిడిపూడి వెంకటరంగయ్య ఎం. ఏ., విజయనగరము అని వ్రాయవలెను.



# ఆంధ్రిక రత్నాగారము లిమిటెడ్ గుంటూరు

1913 సం॥ ఇండియాకంపెనీల చట్టము ప్రకారము రిజష్టరు చేయబడినది)

ప్రొస్పెక్టస్ స్టేటుమెంటు జాయింట్ స్టాక్ రిజిష్ట్రారుగారివద్ద దాఖలు చేయబడినది.

మూలధనము **500000** రూప్యములు.

12 వేల షేర్లు దరఖాస్తు కాబడినవి. స్థలము కొనబడినది. షేర్లు మొత్తము వసూలు కాగానే పని ప్రారంభింపబడును.

వాటాలు **5 0,000** లు వాటా 1కి 10 లు మాత్రమే. సొమ్మంతయు నొక్క సారిగా చెల్లించ నవసరములేదు. దరఖాస్తుతో 1 రూపాయిన్ని మంజూరు అయినతరువాత రు 3 లున్ను పిమ్మట రెండేసి మాసములకు తక్కువ కాని వ్యవధితో దఫాకు రు 2 లు చొ మూడు దఫాలుగాను వసూలు చేయబడును. సామాన్య స్థితిమంతులకు గూడ అవకాశముండునట్టి సులభమైన ఏర్పాటు చెయ్యబడినది. నూరు భాగములు కొన్నవారు డైరక్టరు పదవికి అర్హులు.

1. నడింపల్లి వెంకట నరసింహారావు పంతులుగారు ఎం. ఏ. ఎల్. ఎల్ బి. బార్— అట్ లా ఏజంటు కలకత్తా నాయకట్ ఇండస్ట్రియల్ బ్యాంకు గుంటూరు బ్రాంచి ప్రొప్రయిటరు, మ్యునిసిపల్ చైర్ మన్ గుంటూరు
2. పాతికమూరి వీరబ్రహ్మంగారు ప్రొప్రయిటరు పి యం పండిత అండ్ సన్సు గుంటూరు
3. మోతే నారాయణరావుగారు జమీందార్ ఏలూరు
4. బాకురుపంపా వెంకటరమణమూర్తి గారు; జమీందార్, విశాఖపట్నం.
5. మోతే నరసింహారావుగారు జమీందార్ ఏలూరు.
6. గద్దె వెంకట్రాయుడుగారు బ్యాంకర్, భూస్వామి, గుంటూరు.
7. శంకర వెంకట్రావు పంతులుగారు ఎల్ ఎం అండ్ ఎస్ గుంటూరు
8. రుద్రవరపు కాశీపతిరావుగారు ప్రొప్రయిటరు గుంటూరు.
9. నూకా వెంకటరత్నంగారు మర్చంటు బ్యాంకరు అండు డైరక్టరు తెనాలి వెంకటేశ్వర రయిస్ మిల్లు గుంటూరు.
10. నేరెళ్ల వెంకటసుబ్బారావుగారు మర్చంటు అండ్ బ్యాంకరు గుంటూరు
11. పన్నాల వెంకటకృష్ణమూర్తిగారు, బ్యాంకరు భూస్వామి గుంటూరు.

## ముఖ్యోద్దేశము.

(1) ఒక ఫ్యాక్టరీని నిర్మించి అందు ఐరన్ కాస్టింగు (ఇనుము కరగుట మోల్డింగు అచ్చులువేయుట సైజింగు, ప్లెయినింగు సాయింగు రైపింగు క్రాస్‌కటింగ్ (మూలలుకోయుట) మైటరింగు జాయింటింగు రిపెంటింగు టటింగు గ్రూయింగు పాలిషింగు టర్నింగు ఫైలింగు సాష్టింగ్ మొదలగు పనులను చేయుటకు కావలసిన యంత్రములను (మెషీనరి) యేర్పరుచుట (2) ఇనుము ఉక్కు యిత్తడి మొదలగు లోహములను కలపలను, కొనుట అమ్ముట వాటిలో పనిముట్లను తయారుచేయుట తయారు చేసిన వాటిని అమ్ముట (3) మంచములు కుర్చీలు ఇనుప పెట్టెలు పలక కమ్ములు గుండ్రని కమ్ములు పటాలు సోడామెషీనులు తాళములు చాకులు కత్తెరలు బ్రష్షులు పాకెట్ పెన్లు వగయిరాలు చేయుటకు (4) బంగారు వెండి రేకులు తీయు మెషీనులు రాములవారు లక్ష్మీహనుమంతులు మొదలగు మహనీయుల విగ్రహములు మొదలగునవి నిర్మించుట (5) మిషనలతో సున్నము గానుగాడించుట బెంగుళూరు పెంకులు చేయుట సైపు పోతపోయుట.

ఈ పరిశ్రమము లాభకరమైనదా కాదా యని సందేహించినవారు ఇంగ్లాండు అమెరికా జర్మనీ మున్నగు దేశముల భాగ్యస్థితులను గమనించినచో దీనియందు ఉత్సాహముగలుగక మానదు. మన దేశమున తాతాకంపెనివారి లాభములను గూర్చి వినియే యుందురు. మన ఆంధ్రదేశమున నిదియొక నవీనమైన పరిశ్రమము ఫ్యాక్టరీలు మిల్లులు కొల్లగానున్నవి. వీటికన్నిటికి సామానులు సప్లయి చేయుటకు నెన్ని ఫౌండ్రీలు స్థాపించినను లాభమురాగలదు. అన్నిపరిశ్రమలకంటె నీపరిశ్రమ యందెక్కువలాభము రాగలదని గొప్ప యింజనీయరుల యభిప్రాయము. ప్రస్తుతము మనప్రదేశమున నిట్టిఫాండ్రీలు లేకుండుటచేచిన్న మేకుదగ్గరనుంచి యితరదేశములపైనాధారపడి ధనము గోల్పోవుచున్నాము. గానదేశమున నిట్టి పనితనము నట్టిశిల్పవిద్య కుదురునా యని కొందరు సందేహించుచుందురు అవకాశములులేక వేలకొలది శిల్ప విద్యార్థులు మనదేశమున హీనస్థితియందున్నారు. అట్టివారికిందగిన ప్రోత్సాహమిచ్చిన యొడల చేయరానిదేదియులేదు. మనము తగినంత పి. యమ్. పండిత అండ్ సన్స్ కంపెనీవారు యీకంపెనీకి మేనేజర్లుగా నుండుటవలన వివిధములగు శిల్పములను నిర్మించుటకు మంచిమార్గము యేర్పడినది. యీ కర్మాగారమునందు ధనము వెచ్చించిన కొలది లాభము చేకూరును.

ఇందున సాలుకు 100 లకు సుమారు 50 లాభము రాగలదని అంచనా వేయబడినది. గాన ధనాఢ్యులెల్లరు దీనిలో వాటాలు త్వరితముగ పుచ్చుకొనగోరెదము

బ్యాంకర్సు:— రాయల్ ఇండస్ట్రియల్ బ్యాంక్ ఆఫ్ కలకత్తా గుంటూరు బ్రాంచి

మేనేజింగు డైరెక్టరు—

నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు పంతులుగారు ఎం, ఏ, ఎల్,బి.

రిజిష్టర్డుఆఫీసు:— గుంటూరు




సచిత్ర మాసపత్రిక.

సం|| చం 6-0-0 .వి పి. ఖర్చులు వేరు. అ|| సం|| చం|| 3-4-0

ప్రతి ఆంగ్లమాసముచివర వారము ప్రకటింపబడును.

## —సూచనలు.—

### —విలేఖకులకు—

ఇందలి విలేఖకుల యభిప్రాయములకు సంపాదకుడు ఉత్తరవాదికాడు.

కథలలోని పాత్రములు కల్పితములు ఎవరినుద్దేశించి వ్రాయునవి కావు.

వ్యాసములు, కథలు, పద్యములు, పటములు మొదలగునవి సంపాదకుని పేర పంపవలెను. ప్రకటింపబడని వ్యాసములు అణా చీటి పంపిన పంపబడును.

విలేఖకులు కాగితమున నొకప్రక్కనే స్ఫుటాక్షరముల వ్యాసము వ్రాయ ప్రార్థితులు. ఏమాసములో పడవలసిన వ్యాసములా మాసము 1, 2 తారీఖుల లోపల మాకు చేరవలెను.

### —చందాదారులకు—

తమచిరునామా మారినపుడు చందాదారులు తప్పక మాకు తెలుపవలెను. ఈవిషయమున నశ్రద్ధచే చేరనిసంచికలు తిరిగి పంపబడవు.

నియమిత కాలమునకు తరువాత 15 రోజులలో పత్రిక చేరనియెడల చందాదారులు మాకు రిపోర్టు చేయవలయును. ఆలస్యముగ రిపోర్టు చేసినయెడల చేరనిసంచికలు పంపబడవు. చందాదారులు మాకు వ్రాయునపుడు తమ చందాదారు నెంబరు వ్రాయుచుండవలె

## —కావలెను.—

(1) భంగిమముల చిత్రములు. (poses) ఆంధ్రనటకుల అభినయ కళాకౌశలమును తెలుపు చిత్రపటములు మా పత్రికలో ప్రకటించుటకు కావలెను. ఛాయాపటముల పంపుచు వాని విశేషాంశములను వ్రాయవలెను.

(2) ప్రాచ్య చిత్రకళను సంబంధించి ప్రాచీనులచే లిఖింపబడిన చిత్రములు, నవి పంపవీలులేనిచో వాని ఛాయా పటములుగాని విశేషాంశములతో బాటు కావలెను.

(3) కావ్యజగత్తు నందలి ప్రాక్తన భారత సభ్యతను సమాలోచించు విమర్శనా వ్యాసములు కావలయును.

(4) ప్రహసనములు, ఏకాంక నాటకములు చిన్న చిన్న కథలు, కావలయును.

(5) ఆంధ్రదేశమునందలి రమ్యదృశ్యములు వాని అభివర్ణనములు కావలెను.

కృతజ్ఞతతో స్వీకరించి ప్రకటించెదము. ఏకారణముచేగాని ప్రకటింపబడకున్నవి తిరిగి పంపివేయబడును.

మానేజరు "శారద"

మచిలీపట్టణము.

గుణము అత్యద్భుతము !

# అమృతధృతి.

నాడి పరీక్షింపుము!

## అమృతధృతి.

చెవిపోటు, పంటిపోట్లను పోగొట్టును.

తామర, గజ్జి, చీట మూడుపూతలలో మాన్పును,

గాయములు, కోత్లు, కాల్పులు, బెణుకులు, పగుళ్లు ఒకపూతలో నయమగును.

తేలు, జెర్రి, యితర విషపురుగుల కాట్లు తక్షణమె గుణమునిచ్చును

తలనొప్పులు, పార్శ్వపునొప్పులను పారదోలును.

మూలవ్యాధికి మంచిమందు

జలుబు, శైత్యభారము, తలదిమ్ము ఒక్క మోతాదులో నయమగును

వాయునొప్పులకు రామబాణము.

## అమృతధృతి

రాత్రియైనను, పగలైనను జైలునందున్నను లేక మరెచ్చట ప్రయాణమునందున్నను ఒక సీసా అమృతధృతి యుంచుకొనుట మిగుల క్షేమకరము.

---

కలరా, యిన్‌ఫ్లుయెంజా మరియు యితరరోగములు ప్రబలు సమయములందు 3. బొట్లు నీటిలో ఉదయము సాయంకాలము యుపయోగించిన రోగము అంటజాలదు. అమృతధృతి ప్రభావము అనుభవజ్ఞులకు దెలిసియేయున్నది.

వెల 80 మోతాదులుగల సీసా 1. కి.

రు 2-0-0,

వి. పి. రు 0-8-0.

## అమృతధృతి

దగ్గుల ( ఎట్టిదగ్గులైనను ) పోగొట్టును.

ఉబ్బసమునకు సాటిలేని మందు

అజీర్ణమును పోగొట్టును.

కడుపునొప్పులు ( ఎట్టినొప్పులైనను) ఒక మోతాదులో పోగొట్టును.

వాంతులు, విరేచనములు, నెత్తురుబంక ఒక్క మోతాదులో నయమగును.

కలరాను యింతకు మించినమందు లేదు.

జ్వరములు ఒకేమోతాదుతో నిలచిపోవును.

సక్షవాయువునకు సాటిలేనిది.

వైద్యరత్న
పండిత డి. గోపాలచార్లుగారి

# ఆయుర్వేదాశ్రమము

4-, ఆచారప్పన్‌వీధి, జార్జిటవున్, మదరాసు.
సకలవిధరోగములకును సుప్రసిద్ధములగు
శాస్త్రీయాయుర్వేదౌషధములకు ఖని

## జీవామృతము

అన్నివిధములగుబలహీనములను పోగొట్టును వ్యాధులను రాకుండజేయును. రక్తవృద్ధిజేసి, బలమునిచ్చి, నిస్సాణను పోగొట్టి, శరీరమును గాపాడును. సీసా రు. 6—4—0

## అమృతామలకతైలము

విద్యార్థులకును, యోచనాపరులకును చాల యుపయోగకారి, శిరో రోగములను, కండ్ల వ్యాధులను పోగొట్టి, కండ్లకు బలువనిచ్చి, మెదడును, వెండ్రుకలను, మొత్తముమీద శరీరమును గాపాడును. 6 అవున్సు సీసా రు. 1-0-0

## ప్లేగు మందులు

లోకప్రసిద్ధములైనవి. దేశ దేశములందును విరివిగ ఉపయోగింపబడుచు శ్లాఘింపబడుచున్నవి.

జ్వరమునకు పానకముగడ్డలకు ఘృతము (కలసిన) పెద్దసెట్టు రు. 2-2-0 చిన్నసెట్టు రు. 1-6-0

## కలరామందులు

వాంతిభేధి వ్యాధికి చికిత్సింపబడు మందులలో కెల్ల శ్రేష్ఠమైనవని ఖ్యాతి గాంచినది.

6 అవున్సుల ద్రావకము, 12 మాత్రలును గలిసిన ఒకసెట్టు రు. 1—2—0.

అన్నిటికి ప్యాకింగు పోస్టేజి ఖర్చులు ప్రత్యేకము.

ఇంకను అనేక దివ్యౌషధములు మాయొద్ద సిద్ధముగ గలవు. వ్యాధి వివరములు వ్రాయుడు, మా క్యాటలాగునకు వ్రాయుడు.

# కుసుమరోగనివారణి.

ఈఅవుషధము కుసుమరోగంబులుగల స్త్రీలు 15 దినంబులు సేవించిన స్త్రీలు ఋతుకాలమునకు బహిష్టుకాకుండుట, తరుచు బహిష్టగుట ఋతుకాలముండగాక తరుచు తెలుపు, యెరుపు పసుపు రంగుగా బట్టలగుచుండుట, కాళ్లు, చేతులు, నడుము లాగుచుండుట, నిస్సత్తువ, శరీరము శుష్కించుట, ఆకలి మందగించుట, అధికనిద్ర సంతానహీనత మొదలగు కుసుమరోగ దుర్గుణములన్నియు నివారణయి సంతానవతులయ్యెదరు. అవుషధమును సేవించినమూడు పూటలలో గుణము తెలియగలదు, అవుషధము యొక్క ఘనతకుమెచ్చి కొందరు యోగ్యతాపత్రములనుగూడ యిచ్చియున్నారు.. కఠినపథ్యమేమియులేదు. వి. పి. ఖర్చులు వేరు.

15 దినములకు సరిపడుమందు.

వెల డబ్బా 1కి రు. 5—0—0.

## ఋతుశూలసంహారిణి

ఈ మందు బహిష్టయినప్పుడు వచ్చే కడుపు నొప్పి వ్యాధిగల స్త్రీలు వారం దినములు సేవించిన అమోఘముగా పనిచేయును. అవుషధము సేవించిన 24 గంటలలో గుణము తెలియగలదు. ఇదివరకు అనేక డబ్బాలు ఖర్చుఅయినవి. ఖర్చు అగుచున్నవి. పెక్కుమాటలేల? ఒక డబ్బా తెప్పించి నాడి చూడుము. వి. పి. ఖర్చులువేరు. వారం దినములకు సరిపడుమందు వెల. డబ్బా 1 కి రు. 2—8—0

షరా:— అవుషధములు కావలసినవారు రోగవివరము వయస్సు, వ్యాధి ఎంతకాలమునుండి వున్నది. వివరముగా తెలుపుడు.

ప్రొప్రయిటర్సు, పి. యస్. రెడ్డి అండుకో.
శ్రీరామ విలాస ఫార్మసీ, రావులపాడు.
కొత్తపేట పోస్టు, గోదావరి జిల్లా.

బంగారు వెండినగలు, సామానులు, కోరువారు.

# తప్పక చదివిచూడుడు!! చాలముఖ్యము!! జరూరు!!

21 (8)
















# విషయసూచిక

పుట.

## త్రివర్ణచిత్రపటములు

(౧) నివేదనము,
(౨) విశ్వరూప ప్రదర్శనము



చైత్రము, రక్తాక్షి.

రెండవ వత్సరము | మచిలీపట్టణము, ఏప్రియల్, ౧౯౨౪. | సంపుటము ౧ సంఖ్య ౨

# హిమబిందు.

[అడవి బాపిరాజుగారు.]

## మూడవప్రకరణము, సేనాధికారులు.

:o:

సమవర్తి మధ్యమ వర్చస్వి. అయిదడుగుల ఏడంగుళముల పొడవు, కమ్మచ్చుల తీసిన అవయవ స్ఫుటత్వముకలిగి రాతి విగ్రహమువలె ధూమచ్ఛాయగలవాడు. పోటుమానిసి. అనేక యుద్ధముల గట్టిబారిన దేహముతో మదించిన మాగధ మహిషమువలె మత్తిల్లియుండును. ఉపసేనా నాయకులలో నుత్తముడు. ఇరువదియైదువర్షములదడిసినవాడు. మెలికల గట్టిన మీసములు, ఎడమచేతనున్న కళ్లెము గుఱ్ఱము మెడమీద వదలి వడితిప్పుచుండెను. కుడిచేత చబుకున్నది. అతడారోహించి స్వారిచేయు నాతని గుఱ్ఱము అశ్వములలో నుత్తమమైనది. అతడు జవంబున ధాన్యకటక నగరవీధుల జనుచుండ ననేకులు నమస్కృతులొనరించుచుండిరి. సమవర్తి ధాన్యకటక నగరవాసులకు పరమయిష్టుడు.

అతడట్లు జనిజని సైన్యశాలకుఁ బోయెను. సమవర్తి ఆంధ్రచమూపతులలో నొకడు. ప్రఖ్యాతి గాంచినవాడు. అనేకులు సైన్యాధికారు లతనిచుట్టు మూగిరి. "ఆంధ్రవీర" యని వారు తమ సంతోషము వెలిబుచ్చిరి. "రేపు ఖేలనా మహోత్సవములో విజయము నొందునది సమవర్తి" యని ఆనందవసువు వాక్రుచ్చెను. సార్వభౌమునికి సమవర్తియనిన సంతోషమునకు కారణమదియే. అని ప్రభాతకుమారుడు పలికెను. అందరును సైన్యాధికారసభాభవనము ప్రవేశించిరి. వారి తలలకు తళతళమను రాగి

శిరస్త్రాణము ‡ లు, వెండి బంగారపు చెక్కడపు కేయూరం పొదిగినవి కలవు. భుజములకు బంగారపు కేయూరము † లు గలవు. అశ్వ సైన్యాధి కారులకు కూర్పాసము * ను, రథిక చమూపతులకు కంచుకము ♦ ను, పాదచారులకు వారబాణ § కమును గలవు. నవరత్న స్థగితములగు లోహ దేహత్రాణ ములతో వారు భయంకర మూర్తులై యున్నారు. సైన్య స్థానముల నున్నప్పుడు సర్వసైన్యాధికారితప్ప తక్కిన వాహినీధవు లందరు సంపూర్ణ కవచ ధారులై ఆయుధోపేతులైయుండవలెననిఆజ్ఞ. సమవర్తి మొదలగు వీరాగ్ర పురుషు + లు కవచములు ధరించు చుండిరి. వారి కంఠ త్రాణములు ¶ బంగారపువి. అందరి చేతులకును నాగోదా రికము ◎ లుండి తీరవలెను. అపరాక్రమ మూర్తుల నవలోకించిన వారాంధ్ర సైన్యము లేల సకల భారత వర్షమునకు యెదిరింప నలవిగానివో తెలియఁ జేయును.

వీరలోకమంతయు వివిధాసనముల నుపవిష్టులైరి.

"సమవర్తీ! సర్వసైన్యాధ్యక్షు నిభవనము చుట్టుప్రక్కలవారికి, యుద్ధమనుమాట వినబడు చున్నదట!" అని యొక వృద్ధవీరుడు సమవర్తి దిక్కు మొగంబై ప్రశ్న వేసెను.

సమ:— ఏమున్నది మొన్న వేగిరావువాడు మహామంత్రికడనుండి వార్త తేగనే, పెద్ద రథముమీద సచివునింటికి బోయి, వారియవు రచ్చటనుండి కలసి, రాజాంతఃపురమునకు బోయిరట. అంతకుముందే ఉజ్జయినినుండి వార్తాహరులు వచ్చినమాట నిజము.

వృద్ధ:— మాళవమున గడబిడలేమైన జరిగెనాయేమిటి చెప్పుమా?

అనందవసు.— ఊరుకోనండిమామగారూ! మొన్ననే నాపెద్ద వినీతమతి ఆధిపత్యమున మాళవము నకు సైన్యము పంపుటయు అంత కొన్నిదినములకే వార్తాహరులు మాళవము శాంతముగ నున్నదని కబురుతెచ్చుటయు జరిగినది.

విశాలవసు:— అనంద! నీకు తెలివి తేటలు లేవు. ముగ్గురు సార్వభౌములకడ పనిచేసిన అమలనాథ మహాసైన్యాధ్యక్షులు నీపాటి ఆలోచన చేయలేదని యనుకొంటివా!

అనందవసు:— చేయలేదని కాదు.

అమలనాథుడు:— ఏమోవృద్ధులయెడ యీనాటి యువకులకు నమ్మకమున్నదోయి, మాచిన్నతనమున పెద్దల కెప్పుడైన జవాబుచెప్పి యెరుగుదుమా?

అక్కడనుండు యువకులు పలువురొకరి మొగమొకరు చూచుకొనిరి.

గజ సేనాధికారులలో నొకడగు ప్రభాతశూరుడు మాటల ధోరణి మార్చుట మంచిదియని తలచి యిట్లనియె. "ఈ గొడవ యటుండ నుంచి ప్రస్తుత కర్తవ్యమాలోచింపుడు. రేపు మన వారలలో వృషభశకటకౌశల పరీక్షకు నిలబడినవారెవరో సమవర్తిని చెప్పనిండు."

సమవర్తి:— అహా! సార్వభౌముని తరఫున రాజకుటుంబములోనివాడగు సువర్ణశ్రీ, నేను మామేనమామగారి తరఫున, నిలువగలము. కళింగమునుండి ఆదేశాధిపతి పంపిన శివస్వాతి వచ్చు

---

‡ తలపై నుంచు లోహపు టోపి.

† భుజముల పైకత్తి పోటుడు నాపు గొలుసులు, గొట్టములు.

* నడుమువరకు చేతులతోపాటుకప్పు యినుప చొక్కా.

♦ మోకాళ్లవరకు కప్పుయినుపగొలుసులచొక్కా.

§ చీల మండలవరకుకప్పు యినుప చొక్కా.

+ దేహమునకు విడి విడిగా ధరించు లోహపు గొట్టములు.

¶ మెడకాపాడు గొట్టము.

◎ చేతులకు తొడుగుకొను ఇనుపచేయి.

మన్నాడు. సాళవము, కుంతలము, మగధ, పాండ్య రాజ్యములనుండి దిట్టరులగువారు వచ్చినారట. ఇంకను చాలా పేరులున్నవి.”

ప్రభాత:— విజయలక్ష్మి నెవరునకు సమర్పణ మెయ్యవి?

సమవర్తి:— ప్రతివర్షము నిచ్చునదిగాక యీసంవత్సరము సార్వభౌముడేదో నూత్నాలంకారము కొన్క నిచ్చునట.

ఆనంద:— అయ్యది చెప్పగలిగినవారికి పదిపణములు కొన్క.

చాలామంది వివిధవస్తునామముల నుచ్చరించిరి.

ఇంతలో ప్రతీహారియగు నొక సైనికుడు లోనికి విచ్చేసి నమస్కరించి “జయము, జయము వీర శ్రీమంతులకు. ఉపాధ్యక్షులవారు విజయము చేయుచున్నారు. వారిరథము ఏబది ధనువులదూరమున నున్నది. జయము జయము” అని అభిలుడు నిర్గమించెను.

ఇంతలో నల్వురాయుధపాణులగు అంగరక్షకులు వెంటరా ఉపసైన్యాధ్యక్షుడగు కాకుండకుడు లోనికి సంపూర్ణకవచధారియై విచ్చేసెను. ఒక్కసారిగా సేనాధిపతు లందరు లేచి నమస్కరించిరి. కాకుండకుడొక దంత పీఠము నలంకరించి అందరిని కూర్చుండుడనిసంజ్ఞచేసెను. “రేపటిమహోత్సవమునకు రక్షకాధికార్లు సితస్కంధుడు, ప్రమానందుడు, చండకేతుడు, గుణవర్మ, రథ గజ తురగ పదాతులతో వచ్చునది. ముప్పదియేనుగులు, రెండువందల రథములు మూడువందల యేబది గుర్రములు, సహస్రపదాతిదళము మహాశైలనాగామము కడ నుంచవలసినది.

“ఇక్కడ వంతుగా కావలి యుండవలసినవా రుండవలసినది. తక్కిన వారు మహోత్సవమునందు పాల్గొనవలయు. ఇందుకనియే మిమ్మందర నిక్కడ సమావేశము కావించినది. ఇక నేను వెళ్ళుచున్నాను అని కాకుండకుడు యథోచితముగ వెడలిపోయెను.

## నాల్గవ ప్రకరణము.

### బంధితుడు

అంతట వారందరును “ధమ్మసూత్రమును” గ్రంథముచేత పంచుకొని ఆసంవత్సరము తాము విని నాలియచు గ్రామముసర్వముగాను, లౌకికరముగాను, భక్తితోను పరిపాలించెదమని వాగ్దానములు చేసిరి. అక్కడ చేకూడిన జనసమూహమంతయు గానములు చేసిరి. గ్రామ వాద్యగాండ్రు తమవిద్యల చూపిరి. బౌద్ధ దేవునకు పూజలు జరిగెను. సంతర్పణ పూర్తియైనది. అందరును తాంబూల చర్వణ మాచరించి యెవరి యిండ్లకు వారుపోయిరి.

కాని, చంద్రస్వామి. ఉత్సవమునందేమియు పాల్గొనక తలవాల్చికొని యింటికి వెడలిపోయెను. చంద్రస్వామి బ్రహ్మచారి యగుట చేతను, తలిదండ్రులు గతించిన వారగుటచేతను, ఒక ముసలి మేనత్త తనకును తనతమ్మునకును ఇల్లుచూచుచుండెను. చంద్రస్వామి అప్పగారు కాపురము చేయుచున్నది. కాన ఇతర స్త్రీలెవ్వరింటలేరు. ఇంటితలుపు మేనత్త తీయగా పోయి తన పూజాగృహము ప్రవేశించెను. ఆగృహము తలుపువేసి చెకుముకిచే మంటచేసి దీపము వెలిగించి ఎదుట సాక్షాత్కారమై కనబడు మహేశమూర్తికి సాష్టాంగ నమస్కార మొనరించి వెలుపలికిఁబోయి కాళ్ళు చేతులు గడిగికొని శుచియై వచ్చి ఆమూర్తికడ కూర్చుండి తపస్సుచేయ నారంభించెను. తలారి అర్ధయామపుంగేకలు వేయుచు వచ్చినంతవర కాతడట్లేయుండెను. అటు తరువాత నాతడులేచి మహేశ్వర విగ్రహము నెదుట సమాలింగిత భూతలుడై లేచి దొడ్డిలోనికి జనెను.

చుక్కలు మిన్కు మిన్కుమచుండెను. దూరమున పొలములలో శివారవములు కోయనివినవచ్చుచున్నవి. దొడ్డిలోనున్న వృక్షజాతులు మహానిశ్చలత దేవదేవుడగు నీశ్వరుని గూర్చి సమాధిలోనున్నట్లు చంద్రస్వామికి తోచినది.

అహో భరతఖండ మంతయు నాస్తికులపాలయినదే. ఎక్కడ యీబుద్ధుడు! ఎక్కడ మనవేదములు! బ్రాహ్మణుల ప్రతాపము తగ్గినది. బిక్కుల ప్రతాపము మీరినది. కాని ప్రజలిప్పుడు వైవారాధన దూరులై పాపుడగు బుద్ధుని నెట్లు పూజించు

చున్నారో యచిరకాలములో తెలుసుకొందురు. గ్రామములందు పంచాయతీదారుల నెన్నుకొను సంవత్సర ప్రారంభ మహోత్సవదినమందు దేవళ్ల పూజించుట యేని బుద్ధ విగ్రహమునకు నమస్కృతులా? పాటలా! వేదములపై ప్రమాణములుపోయి ధర్మ సూత్రము, జాతకము, పితాకములమీద నొట్టు పెట్టుకొనుటా. మూఢులను నోవప్రజలారా అనుభవించెదరు గాక. చక్రవర్తి బౌద్ధమతస్థుడు. కాని అన్నిమతముల వారిని సమానముగా జూచుచున్నాడు. కాశిలో జరిగిన పరిషత్తుకుంబోయి వచ్చినందుకు తాను చేయవలసిన కృత్యము తనకింక అవగాహము కాలేదు. ప్రజ్ఞామూర్తి, బ్రహ్మాండ శక్తి సంపన్నుడగు మహేశుండింకను తనకు సాక్షాత్కారము కాలేదు. అయిన శుభముహూర్త మాసన్నమగు వరకు తానేమియు చేయలేదు. ఈవిధంబున చంద్రస్వామి కలత జెందిన మనస్సుతో నిటు నటు పచారు చేయుచుండెను.

ఎవరో వీధితలుపు తట్టినట్లయినది. "ఎవరు వా"రని చంద్రస్వామి కేకవేసి ఇంటిలోనుండి వచ్చి ముందటి చావడి దాటి సింహద్వారముకడకు విచ్చేసెను. గ్రామణి తలుపు తీయవలసిన దని కోరెను. చంద్రస్వామి తలుపు తీయగనె కాగడాల వెలుగున, గ్రామాణియు, గ్రామ పంచాయతీదార్లు, ఇరువురు తలారులును, చక్రవర్తి సైనికు లిరువది మందియు ఒక సైన్యాధికారియు గోచరమయిరి. చంద్రస్వామి వెరగుపడి "ఏమియిది,, అని ప్రశ్నించెను. గ్రామాణియగు శ్వేతవుడు "అయ్యా, నమస్కారము. తాము చక్రవర్తిపై నేదియో కుట్ర సలుపుచున్నారనియు, అందుకై తమ్ము బంధించి ధాన్యకటక నగరమునకు కొనితేవలయుననియు మహాసైన్యాధికారి ముద్రివేసిన యాజ్ఞా పత్రముగొని యీ దళవాయి వచ్చియున్నారు. కాన మీరీ క్షణముననే వీరివెంట పోవలయునని ప్రార్థన. తాము వేదము ప్రమాణముగాగల బ్రాహ్మణులు, యోగ సంపన్నులుకాన వీరు మిమ్ముల బంధింపకయే తీసికొని పోదురు, తాము పోవలసినదిగా గ్రామవృద్ధులను నేను ప్రార్థించుచున్నాము. ఒక నాళికక్రింద వీరరుగుదెంచిరి. ఇది యేదియో పొరపాటు తాము తమ పవిత్ర జీవనము వెలిబుచ్చి త్వరలో నిటకు విముక్తులై వచ్చెదరని మేము బుద్ధ భగవానుని కోరుచున్నాము". అని వాక్రుచ్చెను.

చంద్రస్వామి చకితుండై, "ఇది యేమి చిత్రమైయున్నది. ధర్మస్వరూపుడై దయామూర్తి యగుమన సాతవాహన చక్రవర్తిపై కుట్రలు పన్నువారు గలరా! విజయములచే నితరదేశస్థుల అవనత ముఖులుగా చేసినందున వారట్టి కుట్రచేయ వలయును గాని, ఆంధ్రప్రజలలో చక్రవర్తిపై కుట్రచేయు పరమనీచు డెవ్వడైనగలడా!" యని యాతడు విషాదమున పలికెను.

సేనాధికారియగు నాపురుషుడు చంద్రస్వామి నుద్దేశించి "స్వామీ, మీరనునది నిజము, కాని యేదో పొరపాటు జరిగియుండవచ్చును. తమ్ము గూర్చి వృద్ధశ్వేతవులు ఘనముగా చెప్పియున్నారు. మీకు సకలసౌఖ్యముల నొడగూర్చుచు తీసుకొని పోదుము. చక్రవర్తి తన జన్మదిన మహోత్సవ సందర్భమున ఇక వారము రోజులనుండి మహోత్సవముల చేయనున్నాడు. కాన ఈలోననే తమ వృత్తాంతము పరీక్షింపంబడు. జాగుచేయక రావలసినదిగా మిమ్ము కోరుచున్నాము!."

చంద్రస్వామి యించుకసే పాలోచించి, మనస్సున కైలాసేశ్వరునకు నమస్కృతులిడి "కానిండిదిగో వచ్చుచున్నా"నని గడపదిగెను. గ్రామ పెద్దలలో నొకడు "అయ్యా తాము ఇంటిలో చెప్పినచో మంచిదేమో" యనియెను.

"వద్దు, మామేనత్త యేడ్చును, చిరంజీవి తమ్ముడు వాపోవును. వారిని సముదాయించుట యాలస్యమగును రేపు శ్వేతవులవారు మాగృహమునకు విచ్చేసి వాళ్ల నూరడించెదరుగాక" యని యాతడు వేదమంత్రమొకటి పారాయణముచేయుచు ఆదళము

వెంట బయలుదేరెను. గ్రామ పెద్దలందరి కంఠ్నును సను తిరిగెను. అం దొకరికడ నొకరు శలవుగైకొని వారు పయనము సాగించిరి. తెల్లవారు సరికి కృష్ణాతీరస్థమగు నింద్రకీల పర్వత సమీప గ్రామముగు విజయపురము ప్రవేశించిరి. అచ్చట వారు గ్రామ సత్రమున బసచేసి చంద్రస్వామి కోరికప్రకారము కృష్ణానదికి స్నానార్థము పోయిరి.

ఇంద్రకీల పర్వతము ఛేదించి, కృష్ణానది, మధ్యగా ప్రవహించుచుండెను. వేసవికాలమగుటచే పది ధనువుల వెడల్పున ప్రవహించుచు నిర్మలనీల నీరములకొలది లోతుగలిగి విరహతాపమున కృశించిన సుందరియగు బాలవలె అధునీమతల్లి ప్రయాణము చేయుచుండెను. స్నానమయిన వెనుక దళవాయియు కొందరు సైనికులు ఇంద్రకీల పర్వతము మొదలనున్న స్తూపకముకడకు బుద్ధపూజలకై పోయిరి. చంద్రస్వామి నీటనేయుండి సూర్యబింబముఖుడై ఒక ముహూర్తము జపమాచరించెను. జపము పూర్తికాగా సైనికులవెంట నాతడు గ్రామములోనికేగి స్వయముగా వంటచేసికొని భుజించెను. దళవాయి ఆ గ్రామమందున్న దళ గ్రామాధికారి యింటను, సైనికులు వంటచేసికొనియు, సంతృప్తులయిరి. అటు తర్వాత బయలుదేరి రాత్రి పడుచుండ ధాన్యకటకనగరము వారు ప్రవేశించిరి.

దళవాయి కోట యీవలనున్న ఉపసైన్యాధ్యక్షుని గృహమునకు దీసికొనిపోయి తెలుసుకొనవలసిన యంశముల నెరిగి చంద్రస్వామిని కోటలోనికి గొనిపోయెను. దారిలో నాతడనేక సంకేతములు తెలియజేయవలసియుండెను. ద్వితీయ ముహూర్తము కొట్టకముందే చంద్రస్వామి కారాగృహప్రవేశ మొనర్చెను. అతడు రాత్రిభోజనము చేయనని నిరాకరించినందున దళవాయి యాతని భోజనాదికముల కేర్పాటు చేయలేదు.



## ఆయిదవ ప్రకరణము

—• విషబాల •—

బుస్సుమని యాపాము లేచినది. దానికన్నులలోనవ్వు తాండవమాడినది. పామునకునవ్వు పాతాళమునకు లోతు పాపమునకు మంచియు ఉండనే ఉండవు. కాని యవి అసగాహమయినచో నావిచిత్రదర్శనము దేహమునకు గగుర్పాటుగలుగజేయును. హృదయమున తియ్యని విషయము ప్రవహించి నటులగును. అది సువాసనాలహరివిరజిమ్ము మంచిగంధపుమానుల దరిగొని ఫణమును వగ్గించెడిది. ఆకన్యయాపాము నెత్తికొని ముద్దాడినది. మిక్కిలి బలువగుటన్నెత్తికొనలేక క్రిందపడవేయకుండ యాపన్నగేంద్రము నల్లత్రాచు, ఆరుమూరల పొడుగుగలది ఆమెను అవిసిచెట్టునలముకొన్న నాగవల్లివలె పెనగొన్నది.

“వాసుకీ. నీవెంతమంచివాడవోయి! ఈరోజున నీవింత సంతోషముగా నున్నావు. శుభవర్తమానమేమైనవచ్చినదా? నీకన్నులు నీరములవలె నిగనిగలాడుచున్నవిగదా! రత్నవర్తకుల కడకు బోనకుసుమా! నీనాలుకలు చాచినా పెదవుల నంటకుము. నాకెంగిలి అన్న మసహ్యము. ఈరోజున పసుపుపందెములో నిన్నోడించెదను. నాట్యములో నిన్నిదివరకే యోడించినానుగదా,, అని సౌందర్యరాశియగు నాబాల యాపెనుబాముపడగ రెండు చేతులబట్టి మోముకడకు లాగికొని మేలమాడజొచ్చినది. ఇంతలో మొగలిరేకువలె నొక తెల్లత్రాచాయువతి కడకు వేగమున ప్రాకికొనుచు వచ్చెను. దానిని చూడగనే వాసుకి యాకన్యకా హస్తములనుండి జారి చుట్టలు విప్పుకొని నేలమీదకు ప్రవహించె. పడగవిప్పుకొని ఆడుచుండెను. ధవళ ఫణియు గ్రక్కున నాబాలపై కెగప్రాకి శిరస్సుపైనుండి తలక్రిందకు వ్రాల్చి యాపెం ముక్కు, బుగ్గలు పెదవులు గడ్డము నాల్కల నంటసాగెను.

చంద్ర కిరణమువలె, మిలమిలలాడు స్నిగ్ధస్నిగ్ధాంగము శ్వేత కాంతులనిన నాభుజగి, జవ్వనియొక్క లేత పాన్నాకు చెవికడ సంగీత స్వనమున బుసకొట్ట సాగెను. "ఏమి ఉలూపీ భర్తమీద నేరముల చెప్పుచున్నావా, మీ కిరువురకు ఈరోజునను కలహములు వచ్చినవా. నీవంటి అందకత్తియపై వాసుకికి కోపము రాను, కాన తప్పు నీయందేయున్నది. మీరిద్దరు నన్ను ప్రేమించినట్లయిన నేను చూచుచుండ నొకరినొకరు కౌగలించు కొనుడు." అని యాచిన్నది కోకిల పులుగుపలుకుల కువకువలాడినది. అంతతక్షణమే యా శ్వేతోరగి, క్రిందకు జారి వాసుకిని మెలివేసికొని పోయినది.

ఆమందిరము నందెల్లయెడల విషోరగములు భయంకరములైనవి తిరుగాడుచుండెను. పాములు నివసించుటకు గోడలపొడుగునను మట్టితో కృత్రిమ వల్మీకములు నిర్మింపఁబడినవి. ఆబాల యటూసర్ప గృహమునుండి వెడలి యామందిర లోహకవాటము బంధించి ఒక కక్ష్యాంతరము దాటి తన ఉద్యానవన వాటిక ప్రవేసించెను. అందు నాభి వసతీగెలు కంచెల యందల్లికొని దట్టముగా పెరిగి ఎఱ్ఱనగు మృదుపుష్పముల పూసియున్నవి. ఒండొక్కచో ఉమ్మెత్తవనము కలదు. పూతిక, కరహాటక, శృంగీ, మదన వృక్షములు అచ్చటచ్చట తమవిషపత్రముల నాడించుచు విడిసియున్నవి. ఆభీభతోస్రద్యానవనమున మహావిషోషధులు విరివియై పెరుగుచున్నవి. ఆ ప్రదేశమున వృశ్చికములు నల్లనివి తెల్లనివి మొదలగు ననేక విషకీటకములు తిరుగాడుచుండెను. ఆవియేవియు మనకుమారి వచ్చినట్లయినను లెక్కచేయకయే ఆడుకొనుచున్నవి. అంత నాకృశాంగి యౌవనాంతమున రాతితో కట్టబడిన జలాశయమును సమీపించి విగతవస్త్రయై యందుదుమికి నీదు లాడఁజొచ్చెను. ఆనీరముల యందు వివిధసౌరభములు, వివిధభయంకర విషములుఁ సమ్మిళితము చేయబడి యున్నవి. కానిమన న్వంగి యందు గాలికినూగులాడు కమలమువలె కృతావగాహినియై లేచియొడలు తుడుచుకొని కట్టించిన దేహకాంతితో వెలుగుచు కాటువేయబోవు పాము నోటికోరవలె జెన్నారెను.

ఆహాయేమి యామెసౌందర్యము. ఆసౌందర్యము, భయంకరము. జెబ్బలియందమే మృగమునకు కలదు? సింహము అందమయినది, విషవాహములగు పాములు సుందరములైనవి, నాభిపువ్వు మనోజ్ఞమైనది. మహాగ్ని సమ్మోహ పూరితమైనది. దిసమొలతో కుంతలములు వీడియుండ చేతనొక వసనముతో నొడలు తుడుచుకొనుః ఆ వరాంగి సౌందర్యము తళతళలాడు సర్వ రత్నఖచితమగు నిశిత కృపాణమువలెనున్నది.

ఆమెతండ్రి ఆమెకు చంద్రబాల యని పేరు పెట్టినాడు. ఆమె నాల్గుధనువుల దూరమునకు వచ్చిన మాత్రమున ఏప్రాణియైనను నిముషమున చచ్చిపోవును. అహో! ఏమి సార్థక నామధేయము. అమృతాధరి కన్నులు నీలమణులు చిరివెలుగులు. ఆమె దేహచ్ఛాయ కుందనము సువర్ణకర వీరపుష్పము. నల్లని నిడుబారు నామె కుంతలములు దీర్ఘములై జానువుల వరకు నల్లతాచువలె వేలాడినవి. ఆమె మిక్కిలి పొడుగరియై పాము నాల్కవలె కలకలలాడిపోవు చుండెను.

చంద్రబాల వస్త్రము చుట్టబెట్టుకొని త్వరితముగ పుష్పారామము ప్రవేసించి యచ్చటనున్న కళవీర మాలతీ మాధవీ మల్లికాది కుసుమముల గని దూరమున నుండియే ఆనందించి అచ్చట నిర్మల నీలనీరముల నున్న కమలముల గని ఒక్కసారి వానిని దూరము నుండియే ఆఘ్రాణించి త్వరితముగ నావనమువదలి తన క్రీడా సౌధమునకు జనెను. ఆమె మోము వైవర్ణ్యమొంది యుండెను. ఉస్సురనుచు అచ్చట వైచియున్న సెజ్జపై నామె మేను వాల్చెను. మానవ ప్రకృతి యెచ్చటకు పోవును. ఉత్కృష్ట విషాదమొకటి యిప్పుడామె కంకురించినది. మానవ నైజప్రియములగు ఆనందము లామెకు పడవు. కమలములు, చామంతులు నామె తాక

ప్తిలులేవు. అవి నిముషమున చచ్చిపోవును. అవు దూడలన నామె యంతర్యామ్నన సపధంబున అపరిమిత మోహము; కాని, అవి ఒక్క విచిత్రప్రకృతి ననుసరించి తమకీ మెకడకు వచ్చుట మరణమని యెరిగిరావు. ఆకసంబున బారు చిలుకలు వృక్షముల బాడు వసంత కోకిలలు యామె పిలిచిన పలుకవు. బంగారపు పిచికెలు ఆమె కొలదిదూరమున నున్నదనగనే తుఱ్ఱుమని యెగిరిపోవును.

ఆమెకు జ్ఞానము రానంతకాలము స్నేహమైన పాములు తేళ్ళు పెద్దపులులు చిరుతలు సింగులు సంతోషము నిచ్చుచునే యుండెను. ఆమెకు క్రూరత్వ మలవడ చేయుటకవి నిర్దేశింప బడినవి. ఆమె కఠిన హృదయము వజ్రరూపమై నిష్కారణముగ ప్రాణుల నశింపజేయుటయం దత్యంతి ముదమునం దున్నది. కాని పమనారేంద్ర జన్వనియైన యాబాలకు నెచ్చటనో మహామాత్మ్యమై యణగియున్న దివ్యప్రేమ లభుక్కరని హృదయమునకు గోచరిల్లి మాయమగుచుండ నారంభించినది. ఆసమయముననే ఆమె గాఢవిషాదమునకు లోనగు చుండును.

ఇంతిలో కవాటము తెరచి, పండువంటి యొక ముదుసలి, తేజస్వి, యటకు విచ్చేసెను. ఆతడు రాగానే అమృతాధరి లేచి నమస్కరించినది.

“అమ్మాయీ సౌభాగ్యవతీ నేడునీవు సర్వ సౌందర్య వారాశివై నాకోర్కె నీ డేర్చు దినము సమీపించినది. బ్రహ్మ సరస్వతిని విద్యాతేజము వెదజల్ల సృజించినాడు. కమలాక్షు చక్రమును కంటకుల నిర్మూలింప కల్పించినాడు. నిన్ను నాహృదయ పరివేదనా మూలమగు గంభీరేచ్ఛ తీర్ప పెంచితిని, తల్లీ; నీకన్నులు జాజ్వల్య మానంబులగు హాలాహల ధారలయి పోవుగాక, నీవక్షము ప్రళయాంతక శాద్రీభూతములగు స్ఫులింగ కలశములౌగాక! నీదేహము ఘోరమృత్యుదంష్ట్రి మగుగాక. నీకుజయముగలుగ నాశీర్వదించు చున్నాను. నాయభిమతి మీడేర నీజన్మమును సాఫల్యమొందు గావుతమని దీవించుచున్నాను. “తథాస్తు తథాస్తు” యని యావృద్ధ తపస్వితనహస్తము చాచియామె మూర్ధమున నుంచెను. అమృతాధరి నణకిపోయినది. ఆతేజస్వి మహాకోపమున కంపించి పోయినాడు.

## ఆరవ ప్రకరణము.

ధాన్యకటకమునకు ఒకగోరుతము దూరమున కృష్ణానదీకూలమున పురబాహ్యోద్యానమునకు సమీపముననే మహాఖేలనాప్రదేశమున్నది. అదిసుమారు నాలుగునివర్తనము లున్నది. ఆవిశాలస్థలమున సర్వకాలములయందు, మల్లయుద్ధములు, పందెములు ఆటలు, మొదలగునవి యగుచుండును. ఒకచో కుస్తీలు పట్టుదురు. ఒకచో రథములు పందెములకై పరుగెత్తించెదరు. ఒకచో ధనర్విద్య నేర్చుకొనుచుందురు. వేరొకచో గుఱ్ఱపుస్వారియందు నిమగ్నులయి యాశిక్షల నలవరచు కొనుచుందురు. ఆపవిత్ర స్థలము మహావీరులకు ఉనికిపట్టై యుండును. ఆ ప్రదేశమునకు చిక్కిపోయిన బక్కవారిని రానీయరు. దానికి వెళ్లలేనందుకు పలువురు ఆంధ్రబాలురు ప్రాణత్యాగము చేసికొనినారు.

మహోత్సవములే వైనవచ్చినప్పు డచ్చట అతుల ప్రదర్శనములు పందెములు జరుగుచుండును భారతఖండమునందు మిక్కిలి యిష్టములగు వానిలో ఎద్దుబండి పందెములు ముఖ్యమైనవి. ఆంధ్రమహాదేశాధిపతి మహారాజగు శ్రీముఖుని పుట్టిన దినమున ప్రతిసంవత్సరమును అఖండోత్సవము లనేకములుజరుగును. ఆసందర్భమున భారతీయ దేశములన్నింటికిని అచ్చట వృషభశకట గమన పరీక్ష జరుగును. రాజ్యాధిపతు లనేకులు తమజన్మదిన మహోత్సవ మట్లే జరుపుకొనెదరు.

ఆర్యావర్తమునకు దక్షిణాపథమునకు పరీక్షకై ఆహ్వానము లంపబడినవి. కురు పాంచాల సాల్వమద్ర శూరసేన మగధాది ఉత్తర రాజ్యములు పాండ్య,

* నివర్తనము= సుమారు మూడు ఎకరములు.

చోళ, కేరళాది దక్షిణ రాష్ట్రములు తమతమ ప్రసిద్ధ వీరుల యశోవంతములగు వృషభములు పూన్చినరథముల నిచ్చి పంపినారు. కొండలవలె నెత్తైన కైలాసములవలె తెల్లనై ఎత్తయిన మూపురములు గలిగిన జతల వరవించికొని మగధ శూరుడగు కాత్యాయనుని, మహారాణ్వవంశజుడగు సుశర్మ చక్రవర్తి పంపెను. ఉజ్జయినినుండి ప్రసిద్ధికెక్కిన రథకుడగు పుష్పహావుడువచ్చెను. సౌరాష్ట్రమునుండి పొట్టివియు బలము కలవియు లేళ్లవలె చురుకు గలిగిన పసరముల బండివచ్చెను. నిడుపాటి కొమ్ములుగలిగి నాలు కన్నుల బెదరుచూపు చూచుచు క్రీమయను నది యెరుగని నల్లగిత్తల గట్టుకొని దక్షిణమునుండి వీరత్తుణి వచ్చినాడు. ఆరోజున నలుబదిమూడు దేశములు పందెమునకు తమ తమ రథికులను పంపినవి.

తెలుగు పోటుమగలగు రౌతులు పదినేనుగురు పందెమునకు వచ్చిరి. సమవర్తి మేనమామ బండి నడుపుటకు నిశ్చయింప బడినది. రాజకుమారుడగు సువర్ణశ్రీ కూడ పరీక్షకై వేరిచ్చెను. పట్టణమంతయు కోలాహలముగా నున్నది.

సార్వభౌముని కొడుకుమారుడగు సువర్ణశ్రీ నెగ్గవలెనని రాజభక్తిచే ప్రజలను కోరుచుండిరి. కాని సమవర్తి జయము గాంచునని అందరికిని తెలియును. పట్టణ ప్రజాసమూహమునకు సమవర్తి యనిన ప్రేముడి యెక్కువ. లాతివిలాతులకు బోయి యచ్చట జరిగిన ప్రదర్శనముల విజయమొంది ఆంధ్ర గౌరవము కీర్తి నిలిపినది సమవర్తియేగాదా? అతడు నడప జాలనిరథము లేదు. ఎక్కజాలని గుఱ్ఱములేదు. అతడు చెప్పిన వినని బరీవర్దమున్నదా?

రంగస్థలమంతయు ప్రేక్షకులచే నిండిపోయినది. ఆంధ్రవైభవమంతయు నచ్చట చిత్రితమయ్యెను. మచిలీపట్టణపు కలంకారీ బట్టల మనోహరమైన రంగులతోనున్నవాని వేనవేలు ప్రజలుధరించి మహేంద్ర చాపము భూమివాలెనన జేసిరి. ఉత్తరాంధ్ర దేశము యొక్క సన్ననిదుకూలములు చిరుమబ్బులవలె గాలికి తేలిపోవుచున్నవి. ఆంధ్రదేశము వజ్రభూమియనిపేరు. ఆంధ్రులు రత్నాలరాజులు, రత్నవర్తకులు రత్నభూషణాలంకారులు. స్త్రీలు, పురుషులు యిప్పుడుమన మొగవారు పంచెలకట్టుకొను నట్లు ఒక్క అంచుగు ఒట్ట మీగాలవరకు రామొలకు కట్టుకొనిరి. ఒకవస్త్రముపైన గప్పికొనిరి, ఒకవలిపెము కొందరు తలచీరలుగా ధరించియుండిరి. స్త్రీలకు కాళ్లకుకడియములు చేతులకు కంకణములు, మెడలో వివిధములగు హారములు, బంగారునగలున్నవి. అనేకులు రాజవంశమువారు తలపై వివిధరూపముల రత్నములు ముత్యాలహారములు పొదిగిన కిరీటముల ధరించియుండిరి, స్త్రీలు కచభారములపై బంగారు భూషణములు కిరీటములు దాల్చియుండిరి.

ప్రేక్షకస్థల మధ్యమున రాజవంశమువారి మందిరమున్నది. అనేక దంతహేమ, గంధాసనములందమర్చించిరి. అన్నింటికిని మధ్యమున సార్వభౌముని మహాసింహాసనము, దానింజేరియే రాణులపీఠములు గలవు. ఆమందిరమునకీవల లావల మంత్రుల దండనాయకుల సేనాధిపతుల మందిరములు వారివారి గౌరవములననుసరించి వెలుగుచున్నవి. సార్వభౌమునిమందిరమునకు కుడిప్రక్కగా అన్నిమందిరముల ఆఖరున సామాన్యజనము చూచుటకు తగిన పందిరి యొక్కటి నిర్మాణ మొనర్చిరి.

ఎడమప్రక్క మూడుమందిరము లావల చారుగుప్తుని మందిరము సూర్యకాంతమణివలె నాప్రదేశమున ధగధగాయ మానమైయుండి ఆవచ్చిన లక్షలకొలదిప్రజల చూపునాకర్షించు చుండెను. మూడేండ్లనుండి ఆమందిరము నలంకరించిన బాపానపోలేదు. పూర్తిగా శూన్యముగా వదలి యుండినదికాదు. ఏలయన ఆమహోత్సవమునాడు ఏమెుక్కరి ప్రదేశమును బాడుపడి యుండ కూడదని రాజాజ్ఞ. కానినేడు దానికళ్యాణా లంకారము సుధర్మకు కూడ లేదని చెప్పవచ్చును. కుబేరుడగు నావర్తకుడు తనమందిరమీసంవత్సరము ధనము లక్ష్యము చూడక అలంకరించవలసినదని అలంకారకుడగు కుయవునకు నాజ్ఞ

యిచ్చెను. రాజమందిరముతో తులదూగునది అది యేయని వేనవేలు ప్రజలొకరి నొకరు చూచి చెప్పుకొనిరి.

“పన్నెండవ మహూర్తము కొట్టినారు. సార్వభౌముడు వచ్చువేళ అయినదని మహాశ్రీ చండకేతుని చూచియనియెను. వారిరువురు గుఱ్ఱములపై నధివసించి రంగస్థలమున నిటునటు తిరుగుచుండిరి. అంతచండకేతుడు పురమార్గము వంక చేయి అడ్డమునుంచి చూచుచు “అదిగో సార్వభౌముడు వచ్చుచున్నాడు” అనిఅనెను.

## ఏడవ ప్రకరణము.

### పంచెము.

“ఆవచ్చునది సార్వభౌముడు కాడుగాని, ఎవరో మహావైభవముతో వచ్చుచున్నారు. ఆకేతన మేమిటో చూడుచండకేతా”

“అర్యా ఆ— అది తెలిసినది. రత్నకలశధ్వజము. చారుగుప్తునిది. ఏమి ఈవైశ్యుని బడాయి”

“కోటీశ్వరులు చేయరానిదెద్ది,,

ఇంతలో చారుగుప్తుని రథము పరివారముతో వారి మందిరము సమీపించినది. అందుండి ఆవర్తకుడును, హిమబిందును, ముక్తావళీదేవియు దిగిరి. హిమబిందు తన మేలి ముసుగు తీసి ఒక్కసారి ఆమహాలోకము పరిశీలించి అత్యంత గాంభీర్యముతో నొయ్యారముగా ముక్తావళీదేవి చేయియు చెలికత్తె తారాదత్త చేయియు పట్టుకొని మందిరములోనికి జని తన గద్దె నలంకరించెను.

ఆమె అందాలప్రోవు, విలాసములమూట, ఓయ్యారములకుప్ప, ఆమె మహా సౌందర్యమునకు ముగ్ధులై, ప్రభులు చమూపతులు దళవాయులు వర్తకులు రాజోద్యోగులు, సైనికులు ఒకరనేల అందరును ఆమెనే చూచుచుండిరి. ఎందరిగుండెలు కొట్టుకొనెనో ఎందరు నిట్టూర్పులు విడిచిరో ఎరుక లేదు. పడుచువారలగు విలాసపురుషులు తమ మీసముల మెలివేయుచు గుఱ్ఱములపై నధివసించి ఏదియేమి పనియున్న నామందిరముకడకు బోయి యుండునటు లరుగాక నారంభించిరి. ఇట్టి సమ్మోహనాస్త్ర మీడి తులగు ప్రజలు సార్వభౌముని రాకను దెలుపు శంఖ వేణుకాహళాది సుషిరములు, భేరి, ఢంకా, మృదంగాదివాద్యములు తాళములు తప్పెటులు వినుకొను కొనలేను.

సార్వభౌముడు మహామంత్రులతోడను, సచివులతోడను రాజకుమారులతోడను అత్యంత వైభవముగ విచ్చేసెను. అక్కడజేరిన జనసముద్రమొక్కసారి జయజయనాదములతో లేచినిలువబడె. సార్వభౌముడు వేదికపై నధివసించిన యంతన తక్కుంగల వారు తమ తమ స్థానముల నలంకరించిరి. అంత ప్రజాసమూహమంతయు విశ్రమించెను. ఇంతలో శకటాధ్యక్షుడు మహాశ్రీ విచ్చేసి జోహారొనరించి పోటీదారుల నాయనకు జూపుటకు సను మతివేడెను. సల్లెయని మహారాజు తెలుప ఖేలనోత్సవమునకు తగినట్లు వేషముల వైచికొనిన శూరోత్తముల నాతడు గొనివచ్చెను. వారు సమాలింగిత భూతలులై లేచినిలువబడిరి. ప్రజాలోకావలోకన మంతయు నవ్వారిమీద నేకీభవించినది. అప్పుడు వారివారి దేశములకు తగిన బిరుదములు వహించి నిలిచియున్న యావీరులగూర్చి మహాశ్రీ నివేదింప రాజు వారిని దిలకించి నామధేయాది విషయముల నెరింగెను. సాతవాహనునికడ సెలవునంది వారందరు నక్షత్రముల వలె ప్రారంభస్థానమున వారివారి సేవకులచే గొనిరాబడిన శకటముల నధిరోహించిరి. బయలుదేరినకడ నుండి శకటములు ఒకక్రోశము దూరముపోయి అచ్చటనుండి తిరిగి మరల ప్రారంభ గమ్యస్థానముచేర మరలబోయి మరల వెనుకకు తిరిగివచ్చి గమ్యస్థానము చేరవలె. ఆతావులందు చక్రాకారముగ నిర్మించిన బద్దెలలోనికి పోయినచో పంచెకాడు తిరుగవలెను. పరీక్ష మొదలువెట్టు గుర్తు నలువురు వందులు శంఖముల నొత్తుటయే. మొత్తము పరుగు 4 క్రోశములు.

ఆంధ్రులందరకును తమవారిలో నొక్కడు నెగ్గితీరునని దృఢనిశ్చయము. శకటములు చాలా తేలికగానుండు తరుకాండములతో నిర్మించినవి.

వివిధవర్ణంబులచే చిత్రితములై అనేక భూషణములచే నలంకృతంబులై యవి దేవవిమానములవలె గాన్పించు చుండెను. ఒక్క చివర కబండ్లు నలువదిమూడులో అత్యద్భుతమగు చిత్రశిల్పప్రౌఢిమ గలిగి తెల్లనై జవసత్త్వముల తెలుపు సన్నని ఒంకపు కేశము గలిగినగిత్తల పూన్చియున్న ఒక శకటముపై నొకస్ఫురద్రూపియగు బాలు డొక్కడధివసించి తన కోడెలతో కబుర్లు చెప్పుచుండెను. "అన్నా శైబ్యక సుగ్రీవకములార! మనము తొందరపడుట యెందుకు జాగ్రత్త" యను సరసపు బల్కులు ప్రక్కనున్న కాళింగుడు విని నవ్వుకొనియెను. "ఈ తెలుగు దద్దమ్మకు తొందర యెందుకు అక్కడనే ఉండవచ్చును, అని యాతడు గొణుగుకొనెను. కొందరు మూపుల ముద్దుగొని తట్టి రథమెక్కిరి; కొందరు తమ పసరముల ప్రార్థించిరి మరికొందరు తమవానిని అదలించిరి. కాని సమవర్తి "కామందక కులపాలకులతో" మాట్లాడక సగర్వముగ తన కంబళి వ్యాహక మారోహించి పగ్గముల బట్టికొనెను. చారుగుప్తుడాతని సగర్వముగ జూచెను.

అందరును తమతమ యానముల నధివసించిరి. విపలు యామములుగా జరుగుచుండెను. ప్రజాసమూహముల గుండెలు కొట్టుక యాగిపోయినవి. రేచకపూరకములు స్తంభించి పోయినవి. అంతలో సృష్ట్యారంభమందు నిశ్శబ్దమందుద్భూతమైన శబ్దబ్రహ్మము బోలె ఒక్కసారి నాల్గు శంఖంబులు "భో, భో,! భో, భో,!" అని ధ్వనించినవి. ఆ ధ్వనికి భీతచిత్తములై మాళవుని యెద్దులు పాంచ్యాని వృషభములు అడ్డగోలుగా పరువిడి పందెమునకై సరీగావచ్చు గస్త్రీపాతంబులబడి తుత్తునియలైపోయె. వానితలలు శతశకలములై ఎగిరిపోయినవి. బరు కచ్ఛపువాని బండిగిత్తలు భయమున సాగక వెనుక తిరిగి విశ్రామాంగణముల వైపుకు పరుగిడిపోవ నొల్లమని ప్రజలొక్కుమ్మడి కేచిరి. అంత గజదళాధికారి యగు ప్రమానంగు వచ్చుటనే యుండుటచే ఏనుగుపైనుండి పాశమువిసరి ఒక్కెద్దునుపడగొట్టెను. తోడనె బండితలక్రిందయ్యె కాని ఏప్రాణికిని అపాయమురాలేదు. తక్కిన వారంపు ఏమియు జరుగనట్టులనేక దీక్షతో శకటముల దోలుచుండిరి.

కాళింగునిబండి అన్నింటికి ముందున్నది. తర్వాత సమవర్తి వెళ్లుచుండెను. అతనితోపాటు సమముగ సింహలాంధ్ర కేరళ ఘూర్జర వంగ వీరులు జనుచుండిరి. మొదటిసారి సగముదూరము వెళ్ళునప్పటికే విచ్ఛిన్నని మూడలు పరుగిడలేక ఆగిపోయినవి. వెనుక సమముగా "శైబ్యక సుగ్రీవకముల" కట్టిన శకటము గల తెలుగు పిల్లవాడు మాగధుడు మొదలగువారు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. ఆ బాలుడు నవ్వేమియు లేక నిర్మలాకాశమున తేలిపోవు చంద్రమూర్తివలె పోవుచుండెను. నురుగులతోనున్న కెరటములవలె ఎద్దులు వేగముగా ముందుకు జనుచున్నవి. అన్నియు వెనుకకు తిరుగుస్థానమునకు పోయి మరలి వచ్చుచున్నవి. కొన్ని యీదారిలో పనికిరాక ఆగిపోయినవి. ఇంక మిగిలినవారు కాళింగుడు, సమవర్తి, మాగధుడు ఆంధ్రబాలుడు, సువర్ణశ్రీ.

ప్రజలందరు పందెము వైచికొనుచుండిరి. అందరికిని సమవర్తి విజయమందునని తెలియును. చారుగుప్తుని యుద్యోగులు సమవర్తికై ధనము లొడ్డుచుండిరి. కాని యొక్క బ్రాహ్మణు డాంధ్రబాలుడే విజయమందునని వొడ్డుపెట్టుచుండెను. వేలకొలది, లక్షలకొలది పణములు, సువర్ణములు టంకములు వొడ్డబడినవి, కొందరు వజ్రాది మణుల నొడ్డిరి. కొందరు భూముల తోటల నొడ్డిరి. కాని భాగ్యవంతులగు ఆంధ్రప్రజల కాకాలమున నవి యొక్క లెక్కకాదు. వేలకొలంది ఆ ఉత్సవము చూచుటకై వచ్చిన కళింగ జనులు తమదేశీయుడే తప్పక విజయమునందునని పందెమునకు కవ్వుచుండిరి. ఆ బ్రాహ్మణుడు, "కోటీశ్వరుడగు చారుగుప్తుని ఎద్దులబండి యోడిపోవును. నూత్నబాలకుడు విజయమందునని నేననుచున్నాను కాదన్న ఆరువేల పణము"లని యాతడే కేకవేసెను. చారుగుప్తుని యుద్యోగి "పదివేలని" తిరిగి జవాబిచ్చెను.

రెండవసారి శకటములు వెనుకకు తిరిగినవి. చెవులునిండ, నాల్కలు జాపుచు నురగలు గ్రమ్ముచు కండ్లు కొలికల క్రిందికి నల్లగుడ్డులు తిరుగుచు పేరెన్నికగాంచి ఆయుత్తర దేశముల యొక్క నరమయోగ్యాన జాలడని పేరుగాంచిన కరూరవుడు తోలినట్టి (పేరునకు చక్రవర్తి మహాకర్త్రృడు సుశర్మ సార్వభౌముడు తన స్వహస్తములతో పెంచిన) ఆరెండుగిత్తలు, గరుడము హనుమంతము అని పేరుగలిగిన వానిముతకము ప్రేక్షకములు చివర భాగమునే గమ్యస్థాన, మింక క్రోశమున్నదనగనే పడిపోయినవి. తత్క్షణమే దారిప్రక్కగున నుంప బడిన సహదేవశాస్త్రజ్ఞులు పశువైద్యులు వచ్చి అవసరములకు నత్యవసరమగు చికిత్సచేయ నారంభించిరి. వానిని మంచములపై బరుండబెట్టి పశువైద్యశాలకుం గొనిపోయిరి. కరూరవునకు కొంచెముగా గాయములు తగిలినవి.



# రూ ప మ తి .

మాళవదేశమును పాలించిన పాదుషాలలో చివరవాడగు బజ్‌బహద్దూర్, 1554 సం॥ మొదలు 1564 సం॥ వరకు మాండవగడ (మండూ) ను రాజధానిగ నేర్పరచుకొని రాజ్యపరిపాలనంబొనర్చెను. ఆతడు మృగయా ప్రియుడు. విలాసుడు; సంగీత లోలుడు. ఆతని హృదయపీఠమున విలసిల్లినది రూపమతి. నీరసమగు మాళవదేశ చరిత్ర వీరి ప్రేమ విలసనము వలన రస భరితమై చిత్తమును ద్రవింప జేయుచుండును.

ఉజ్జయనికి 55 మైళ్ళదూరమందున్న సారంపురమందు రూపమతి జన్మించెను. ఆమె బాల్యజీవితమును గూర్చి వ్రాయుట కెట్టి యాధారములు లేవు. సర్జను మాలీకం అనునాయన 'సారంపురమునందలి సారంగనయన యను వేశ్యను బజ్‌హద్దరు మోహించియుండెను" నని నుడువుచున్నాడు. మరియొక యింగ్లీషు చరిత్రకారుడు రేవానదీతీరమందు మండలేశ్వరమందలి యొక రాజపుత్రుని కన్య కరూపమతి యని వ్రాసియున్నాడు. ఫలితమేమన రూపమతి హిందూస్త్రీ. అపూర్వ రూప సౌందర్య సంపన్న. సంగీత విద్యా పారంగత. ఆమెవీణాగానాదమునకు కఠినశిలలు గూడకరిగు మెండెదనుట యతిశయోక్తిగాదు.

బజ్‌బహద్దరొక శుభముహూర్తమున వేటాడుటకు బయలుదేరెను. నర్మదానది సుందరమగు ప్రకృతి శోభనలరారుచుండెను. ఆనదీ తలమున నొక్క తరు తలచ్ఛాయ యందు రూపలావణ్యమయియగు రూపమతి వీణాస్వరమున శృతి గలిపి సుస్వరమున నొక యపూర్వగానమును పాడుచుండ ఆగానము ప్రకృతి కతీమై దాని చాంచల్యమును నిస్తబ్దమొనర్చెను. వేటాడుచున్న బజ్‌బహద్దరా యపూర్వగానము వలన నాకర్షింపబడి వేట వీడి గానము ననుసరించి వచ్చి యాశ్చర్యా న్వితచిత్తుడై రూపమతిని దిలకించెను. ఆసౌం

దర్పరూప మధురిమను ఆతని నేత్రములు వశో పరచుకొన జాలకుండెను. నిర్విణ్ణుడై తిలకిం పుచు ఇది స్వప్నమా లేక యథార్థమాయని తలపోయుచు కొంత వడికి తెప్పరిల్లి యామెను వివాహమాడి ప్రధాన బేగముగ (పట్టమహిషి) చేయ నిశ్చయించుకొనెను. అప్పుడు రూపమతి బాదుషాను జూచి యిట్లనియె. "నేను రాజపుత్రబాలికను. ముసల్మానుని వివాహమాడను" అన బాదుషా యామె పాదముల మీద వ్రాలి సవినయముగ నిట్లనియె "సౌందర్యరాసీ? నీవు నన్ను చేపట్టనియెడల నాతను విడ్చుటనే విడచెదను."

రూపమతి— మండూదుర్గమునందు నర్మదా నదిని బారింపగలిగినయెడల నిన్ను వివాహమాడుదును. బేగమునగుదును.

1200 అడుగుల యెత్తున నుండు మండూదుర్గములోనికి నర్మదానదిని దీసికొని యేగుట యెట్లు? ప్రేమాంధునకు సాధ్యాసాధ్యములు తెలియవుగదా? అందువలన నతడట్లులనే బారించెదనని చెప్పి రాజధాని కేగి నర్మదానదిని కోట సమీపమునకు దెచ్చుటకు ధనభాండారమును దెరచి విచ్చలవిడిగ ఖర్చు బెట్ట సాగెను. నర్మదను కోటయందు బ్రవహింపజేయుటకు విపుల ప్రయత్నము ప్రారంభమాయెను. చిట్టచివరకు విశ్వప్రయత్నము మీద నర్మదానది యందలి యొక ధార కోటకనతి దూరము నుండి బారజొచ్చెను. అప్పుడు నర్మదానది బజ్‌బహద్దరునకు స్వప్నమందు ప్రత్యక్షమై యిట్లనియె. "బాదుషా? నీప్రయత్నమున కానందించితిని. రూపమతికై నీప్రాణమందు పొంగి పొరలు ప్రేమామృతమున కెంతయు సంతసించితిని. దుర్గములోనికి నన్ను దీసికొని యేగజాలవు, ఆవ్యర్థప్రయత్నమును మానుము. కోటకనతిదూరమునకు చిన్నదగు నాశాఖయొకటి వచ్చియున్నది. అచ్చట నొక పుష్కరిణిని నిర్మించుము. దానిలోనికి నేను బ్రవహింపుచుందును. అది మీయిద్దర కలయికకు చిహ్నమై యలరారుచుండును."

తర్వాత మాళవరాజు రూపమతిని వివాహమాడెను. ఈవిషయమున జనప్రవాద మిట్లున్నది. బజ్‌బహద్దరు రూపమతిని తన కిచ్చి వివాహమొనర్పవలయునని యామె తండ్రి నడిగెను. కాని దానికాతడంగీకరింపక మహమ్మదీయునకు పిల్లనిచ్చుటకంటె చంపివేయుట యుత్తమమని నిశ్చయించుకొని రూపమతిని నర్మదానదీతీరమునకు దీసికొని వచ్చి విషగుటికనిచ్చి మింగుమనెను. రూపమతి యావిషగుటికనుచే ధరించి మృదుమధుర స్వరమున ఆశుధారా కవిత్వము తోడ నర్మదానదిని స్తవమొనర్ప జొచ్చెను. ఇంతలో నాకస్మికముగ బజ్‌బహదూరువచ్చి యామెను గైకొని మండూదుర్గమున కేగెను! ఆవిషగుటికనుచే ధరించి చెప్పిన కవిత్వమున కింగ్లీషుభాషాంతరీకరణము నీక్రింద బొందుపరచుచున్నాను.

King of the crystal depths! Ah! where,
Nurbudda, shall thy sparkling wave
The young Rajpootnie's ashes bear?
Leave them where thy ripples lave
The emerald marge, and lilies wave
Their deathless petals. Let the chime
Of thy glad wave sound o'er her grave,
Cut off in virgin prime."

* * *

# బోధివృక్ష శాఖ

సింహళద్వీపమున "అనురుద్ధపురంబు" ననునచ్చటి.

—: రెండు వేల సంవత్సరముల వయస్సు :—

ఇది బుద్ధగయలో బుద్ధుడు కూర్చుండి తపస్సు చేసిన బోధివృక్షము యొక్క యొక శాఖ. ప్రపంచములో కెల్ల మిక్కిలి గొప్పది. క్రీస్తు పూర్వము 307 సం॥ లో బుద్ధమతమునకు ప్రథమశిష్యుడగు —దేవా—నాం— పూజా—తిస్సా అనురాజు

బ్రతికియుండి యీ పటమునందు చూడబడు నట్లు విరాజిల్లుచున్నది.

ఈవృక్షముచుట్టు నున్న గొప్పకట్టడమును బట్టియు దానిని కాపాడుచున్న శ్రద్ధనుబట్టియు దానిని దర్శింప వచ్చుచున్న వేలకొలది యాత్రికుల వలనను ఆవృక్షము యొక్క పవిత్రత గ్రహింపనగును.



కాలములో సిలోన్ ద్వీపమునకు అశోకుని కుమారుడగు మహీంద్రా వలన తేబడి అనురుద్ధాపురమునందు నాటబడెను. ఆశాఖ మహోత్తర మగు వృక్షమై రెండువేల సంవత్సరముల ముదుసలియైనను ఇప్పటికి

ఈముసలి చెట్టుయొక్క చరిత్రము మనోరంజకముగా నుండును. దీనిగురించి గ్రంధము లెన్నియో వ్రాయబడి యున్నవి. ఇంత పురాతన వృక్షము మరియొకటి భూమండలమందు లేదని చెప్పుచుందురు.

" And if, perchance, of foreign blood
But kindred soul, a warrior come
To ponder o'er they twilight flood,
And seek the form for ever gone,
Tell him the maid of Rajasthan,
True to her faith nor false to him,
Thus binds her bridal garland on,
Cut down in virgin prime."

1557 సం॥ బజ్‌బహద్దర్ రూపమతిని వివాహమాడెను. అప్పటినుండియు నాతఁడు రూపమతియొక్క రూపోపాసనయందు తన్మయుఁడైయుండి యంతఃపురమును వీడివెలుపలకు రాకుండెను. రాజ్యపరిపాలనమును గూర్చి యోచించువారలు గానరారైరి. ఆవిధముగ నారు వత్సరములు గడచిన పిమ్మట 1564 సం॥ మొగలు చక్రవర్తియగు అక్బరు పాదుషా మాళవదేశముమీఁద దండెత్తి దాని జయించెను. ఆయుద్ధసందర్భమున నీప్రేమ దంపతులు దేహములవీడిరి.

ఈయుద్ధమునకు కారణమొక పారశీ వ్రాత ప్రతియం దిట్లు చెప్పబడి యున్నది. బజ్‌బహద్దరు దర్బారునందు మాన్‌ఖా, యనునొక సంగీత విద్వాంసు డుండెడివాఁడు. ఆతఁడేదియో యొక కోపకారణమువలన బజ్‌బహద్దరును వీడి అక్బరు చక్రవర్తి దర్బారున కేగి రూపమతియొక్క యపూర్వ సౌందర్యమును వర్ణించి చెప్పెను. వెంటనే అక్బరు చక్రవర్తి రూపమతిని ఢిల్లీకి పంపించవలయునని బజ్‌హాబద్దరున కుత్తరము వ్రాసెను. ఆ యుత్తరమందుకొని బజ్‌బహద్దరు క్రోధావిష్టుఁడైన త్రాచును బోలి మండిపడుచు నిట్లు ప్రత్యుత్తరమొసంగెను. "మహారాణి జోధభాయిని నాకడకు పంపించినయెడల రాణీరూపమతిని ఢిల్లీకిపంపించెదను" ఈయుత్తరమునుగాంచి చక్రవర్తి యుగ్రుఁడై మండిపడ జొచ్చెనేగాని తన తప్పును దాను తెలిసికొనజాలకుండెను.

చక్రవర్తియాజ్ఞానుసారము ఆదంఖాననను సైన్యాధిపతి యుద్ధమునకు వచ్చెను. సారంపూరు అనుచోట ఆదంఖానునకు బజ్‌బహద్దరునకు యుద్ధము జరిగెను. మొగలు సైన్యములకు బజ్‌బహద్దరాహుతి యాయెను. ఈసందర్భమున నొక చరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాఁడు. "రూపమతి మొగలులచే జిక్కునను తలంపున బజ్‌బహద్దరు రూపమతినిచంపి యుద్ధమున కేగెను." శాఫీకాఖాన్ యిట్లు వ్రాయుచున్నాఁడు. "రూపమతి మొగలుల సైన్యాధిపతియగు ఆదంఖానుచే జిక్కెను. ఆమె నితఁడు మోహించెను. కాని కృతకృత్యుఁడు కాజాలఁడాయెను. పిమ్మట బజ్‌బహద్దరు విరహము వలన రూపమతి విషము త్రావి మరణించెను."

నేటికిని యీదంపతుల స్మృతిచిహ్నమగు రేవా పుష్కరణివారి ప్రేమవిలసనమును హృదయమున దాల్చి నిట్టూర్పులు విడచుచున్నది. బజ్‌బహద్దరు ప్రసాదము రూపమతి సౌధములయొక్క శిథిలములు నేటికిని గాన్పించుచున్నవి. అచ్చటనుండి చూచిన నర్మదానదీ ధార కనపడుచు పురాతన స్మృతిని మనమునకు దెచ్చుచుండును.

ఆమె బజ్‌బహద్దరును లక్ష్యమందుంచుకొని లక్షలకొలఁది పద్యములను రచించి యుండెను. విషమును తిని చనిపోవునప్పు డీ క్రిందిభావముగల పద్యమును రచించెను.

"నీవులేని యీజీవితము మొదలగున
విన్నియు వ్యర్థములు బహుదూరా లేని
రూపమతి చరిత్ర దుఃఖపూరితము గాక
మ రేమియున్నది"

రూపమతి రచించిన పద్యములింకను ముద్రింపబడలేదు. కాని యీదేశ జనులెల్లరు సర్వసాధారణముగ బాడుచుందురు. ఆమె హిందీ భాషయందు సుప్రసిద్ధకవయిత్రియై యుండెను. ఆమె పద్యములలో కొన్నిటిని కన్నింగ్‌హాము ఇంగ్లీషులోనికిట్లనువాదించి యున్నాడు,

Friend! let others boast their treasure
Mine's stock of true love's pleasure,
Safely cared for every part;
Neath that trusty lock, my heart;
Safe from other women's peeping,
Fo the key's in mine own keeping;
Day by day it grows a little;
Never loses e'en a little;
But through life will ever go,
With Baz Bahadur, weal or woe."

ఒక యింగ్లీషు చరిత్రకారుడిట్లు వ్రాయుచున్నాడు

She was a high-minded woman who did not choose to survive the loss of her honour, and who bore such enthusiastic attachment to her lord that she deemed her existence insupportable without him. The end of her career has some resemblance to that of Cleopatra, but her history is more romantic as well as much more moral. "The Calcutta Reveiw."

రూపమతి భూపకల్యాణి రాగమును ప్రస్తరించెనని చెప్పుదురు.



 ఆహారము

శరీరారోగ్యమును గాపాడుకొనుట కాహారము ముఖ్యావసరమై యున్నది. సాధారణ వ్యాయామమునకు, శరీరకష్టమునకు, శరీరమునందలి యుష్ణమును నిల్పుటకు దగినంత వేడిమిని యివ్వగల నాహారము శరీరమున కవసరము. ఆహారపదార్థములోనుండు జీవపదార్థము (Vitamines) ముఖ్యమైనది. మనము భుజించు నాహార పదార్థములలో నీ జీవపదార్థము సరిపోవునంత యుండవలెను.

ఇవి రెండు విధములు.

౧. నీటిలో కరగునట్టివి.

౨. క్రొవ్వుపదార్థములలో కరగునవి.

క్రొవ్వుపదార్థములలో కరగునట్టి జీవపదార్థములు శరీరపోషణమున కెంతయు నుపయుక్తములు. ఇట్టిజీవపదార్థము, వెన్నయందున, కోడిగ్రుడ్డులోని పసుపుపచ్చని పదార్థములలోను, పచ్చని యాకుకూరలలో గూడ నుండును. నీటిలోకరగునట్టి జీవపదార్థము బియ్యముపై పొరలలోను(తవుడులో) గోధుమలలోను నున్నది. మనయాహారములో యివి లేకపోయిన నంజువ్యాధి లవణరక్తమను వ్యాధి (Scurvy) వచ్చును.

బియ్యమును, గోధుమలను దంపిన యీజీవపదార్థములున్న పొట్టుపోవును. ఈ విలువగల పొట్టును మన మావులకు కుక్కలకు కోళ్లకు పందులుమొదలైన నాటికి బెట్టుచున్నాము. కాన మనము తినుబియ్యములోను గోధుమ పిండిలోను, యీ జీవపదార్థములుండవు సరికదా శల్యములకు పుష్టినొసంగు భాస్వర—ఉప్పులు (Phosphorous salts) గూడ నుండవు. కావుననే నంజులు మొదలగు వ్యాధులు సాధారణముగ మనకు వచ్చుచున్నవి. ఈ పొట్టు లేకుండ బియ్యములను గాని గోధుములను గాని తినకూడదు. అవి యీజీవపదార్థము లేకుండిన తేలికగా నరుగవు.

ఆహారము రెండువిధములు.

౧. నత్రజని మిళితమైనవి.

౨. పిండి పదార్థములు.

వానిలో ౫ వస్తువులున్నవి.

౧. మాంసపదార్థములు.

౨. క్రొవ్వు పదార్థము.

3. చక్కెర.

౪. ఉప్పు.

౫. జలము.

వీనిపనులు.

౧. మాంసపదార్థము:— మాంసము మత్స్యములు, నత్రజనిసంబంధమైనది. పప్పులు మొదలైనవి. ఈ పదార్థముల పని యేమన దేహమునందలి కండలను, అవయవములను వృద్ధిపొందించును. శరీరమునుండి వ్యయమగు పదార్థములస్థానమును తిరిగి పూరించును. ఆహారమరుగుటకు గాను కావలయు రసము

లను అన్నకోశములలో తయారుచేయును.

౨. క్రొవ్వు పదార్థములు:— వెన్న, నెయ్యి, మొదలైనవి. ఇంకులో కర్బనము (Carbon) ప్రాణవాయువు, జలవాయువు (Hydrogen) నున్నవి. ప్రాణవాయువు తగినంత లేని కారణమున యుక్తముగ నీపదార్థములు జలమును తయారుచేయజాలవు. కాన ఈ విధమగు నాహారము శరీరమునకు వేడిని కలుగ జేయును. శరీరకష్టమునకు వలయుశక్తిని విశేషముగ జేయును. క్రొవ్వునేర్పరచును.

౩. చక్కెర:—దీనిలో కర్బనము జలవాయువు ప్రాణవాయువునున్నవి. దీనిలో ప్రాణవాయువు జలోత్పత్తికి వలయు దానికంటె నధికముగ నున్నది. క్రొవ్వుపదార్థములు చేయుపనినే చక్కెరయు జేయును గాని యవియుష్ణము నిచ్చునంతగా నిది యొసంగ జాలదు.

౪. ఉప్పు పదార్థములు:— దీనిలో మనము మామూలుగా వాడుకొను లవణము గాక ఖటకము (Calcium) పొటాసియము సోడియము ఇనుముయొక్క ఉప్పు పదార్థములుగూడనున్నవి. దేహమునందలిశల్యముల వృద్ధికొరకు ఖటికాస్ఫురితము (Calcium Phosphate) మిక్కిలి యవసరము. ఈ ఉప్పు పదార్థము పాలలోను కోడిగుడ్డులలోను చక్కగా నున్నది. చిన్న పిల్లలకీ ఉప్పు పదార్థముల యాహారములు, మిక్కిలి యవసరము. దీనిని వాడకున్న పిల్లలకు మెత్తని బొమికలుండు (Rickets) నొక వ్యాధి వచ్చును.

౫ జలము:—శరీరమునుండి దినమునకు సుమారు మూడు శేర్ల నీరు మూత్రము చెమట రూపమున బోవుచున్నది. దానితో చెడు పదార్థము లనేకములు కొట్టుకొని పోవును. దేహము ననారోగ్యము బొల్పడకుండ నుంచును. కావున, జలము, దేహములో నంతకు తక్కువున్న యెడల శరీరమునకు జబ్బు చేయును.

బాగుగా నెదిగినమనుష్యుని శరీరమునుండి దినమునకు 250—300 గ్రెయినుల నత్రజనియు, 4000—5000 గ్రెయినుల కర్బన పదార్థము వెలుపలకు పోవుచున్నది. ఈ నష్టమును పూర్తి చేయుటకు తుల్యమైన పదార్థములనైన మనము నిత్యము భుజించవలెను.

ఒక అర్ధశేరు మాంసములో సుమారు 300 గ్రెయినుల నత్రజని యున్నది. కాని కావలసిన కర్బనములో 2/5 వంతే యీఅర్ధశేరులో నున్నది. కాని మాంసాహారమే కావలెననిన దినమునకు శేరుంబావు మాంసమును భుజించవలెను. దీనిలో మొత్తమున నత్రజని యెక్కువగును.

ఇటుల గాక బియ్యమును మాత్రమే తినవలెననిన దినమునకు $2\frac{1}{2}$ శేర్ల బియ్యమును తినవలెను. ఈబియ్యమునుండి అప్పుడు 300 గ్రెయినుల నత్రజని వచ్చును. కాని, యింత యాహారము నెవరును హరించుకొన జాలరు. కనుక తేలికగా నరుగు నటువంటిన్ని కావలసిన నత్రజనిని కర్బనమును యిచ్చు నాహారమును మనమేర్పరచు కొనవలెను. ఎట్లనిన యివియన్నియు కలసిన ఆహారమును వాడుకొనవలెను. ఆహారములో $3\frac{1}{2}$ ఔన్సుల మాంసపదార్థము $3\frac{1}{2}$ ఔన్సుల క్రొవ్వు $1\frac{1}{2}$ శేరుచక్కెరయూవ్వనుడగు మనుష్యునికి కావలయును.

ఈ వివరణములను దిలకింపుము—

## శాకాదుల తినువారికి.

| | చటాకులు. | ఖరీదు. | మాంసకృత్తు పదార్థము. ఔన్సులు. | క్రొవ్వు పదార్థము. ఔన్సులు. | చక్కెర. ఔన్సులు. | నత్రజని గ్రెయిన్లు | కర్బనము (carbon) గ్రెయినులు |
|---|---|---|---|---|---|---|---|
| 1. బియ్యము. | 4 | 0 0 9 | 0, 56 | 0, 07 | 6, 66 | 30 | 1400 |
| 2. పిండి. | 4 | 0 1 0 | 0, 98 | 0, 17 | 5, 68 | 65 | 1330 |
| 3. పప్పు. | 2 | 0 0 9 | 1, 00 | 0, 04 | 2, 33 | 65 | 600 |
| 4. ఉర్లగెడ్డలు. | 2 | 0 0 8 | 0, 06 | 0, 05 | 0, 66 | 5 | 180 |
| 5. కాయకూరలు. | 2 | 0 1 0 | 0, 20 | 0, 20 | ... | 15 | 300 |
| 6. పాలు. | 8 | 0 2 0 | 0, 50 | 0, 50 | 0, 50 | 45 | 480 |
| 7. నెయ్యి, నూనె. | 1 | 0 2 6 | 0, 01 | 0, 09 | ... | 5 | 300 |
| 8. చక్కెర. | 1 | 0 0 6 | ... | ... | 1, 80 | 0 | 340 |
| 9. వెన్న | 1 | 0 3 0 | 0, 02 | 1, 80 | ... | 2 | 600 |
| 10. చిరితిళ్లు. | 1 | 0 1 6 | 0, 30 | 0, 40 | 0, 80 | 50 | ... |
| 11. సువాసన వస్తువులు. | * | 0 0 6 | ... | ... | ... | 0 | ... |
| మొత్తము. | | 0 14 0 | 3, 65 | 4, 14 | 17,21 | 282 | 5530 |

## మాంసాదుల తినువారికి.

| | చటాకులు. | ఖరీదు. | మాంసకృత్తు పదార్థము. ఔన్సులు. | క్రొవ్వు పదార్థము ఔన్సులు. | చక్కెర ఔన్సులు. | నత్రజని గ్రెయిన్లు | కర్బనము గ్రెయిన్లు |
|---|---|---|---|---|---|---|---|
| 1. బియ్యము. | 4 | 0 0 9 | 0, 56 | 0, 07 | 6, 16 | 30 | 1400 |
| 2. పిండి. | 4 | 0 1 0 | 0, 98 | 0, 17 | 5, 61 | 65 | 1330 |
| 3. పప్పులు. | 1 | 0 0 4½ | 0, 50 | 0, 02 | 1, 17 | 33 | 300 |
| 4. చేపలు, లేక మాంసము | 2 | 0 2 0 | 1, 00 | 0, 10 | ... | 80 | 440 |
| 5. ఉర్లగెడ్డలు. | 1 | 0 0 6 | 0, 08 | 0, 06 | 0, 64 | 5 | 180 |
| 6. కాయకూరలు. | 1 | 0 0 6 | 0, 10 | 0, 10 | ... | 20 | 150 |
| 7. పాలు. | 4 | 0 1 0 | 0, 25 | 0, 25 | 0, 25 | 25 | 240 |
| 8. నెయ్యి, నూనె. | 2 | 0 4 0 | 1, 02 | 1. 80 | ... | 10 | 600 |
| 19. చక్కెర. | 1 | 0 0 6 | ... | ... | 1, 80 | ... | 340 |
| 10. వెన్న | ½ | 0 1 6 | 0, 01 | 0, 90 | ... | ... | 300 |
| 11. చిరితిళ్లు. | ½ | 0 0 9 | 0, 15 | 0, 20 | 0, 40 | 25 | ... |
| 2. సువాసన వస్తువులు. | ... | 0 0 7½ | ... | ... | ... | ... | ... |
| మొత్తము. | | 0 13 6 | 3, 65 | 3, 67 | 16, 10 | 298 | 5280 |

## ౩. బీదలకు.

| | * చటాకులు. | ఖరీదు. | మాంసకృత్తు ఔన్సులు. | క్రొవ్వు ఔన్సులు. | చక్కెర. ఔన్సులు. | నత్రజని గ్రెయిన్లు | కర్బనము గ్రెయిన్లు |
|---|---|---|---|---|---|---|---|
| 1. బియ్యము. | 16 | 0 2 0 | 2, 5 | 0, 60 | 24, 0 | 120 | 4800 |
| 2. పప్పులు. | 2 | 0 0 9 | 1, 00 | 0, 04 | 4, 7 | 65 | 600 |
| 3 కాయకూరలు. | 2 | 0 0 3 | 0, 20 | 0, 20 | ... | 20 | 300 |
| 4. నూనె. | $\frac{1}{4}$ | 0 0 3 | ... | 0, 50 | ... | 5 | 150 |
| 5. సువాసన వస్తువులు. | * | 0 0 3 | ... | ... | ... | ... | ... |
| మొత్తము. | | 0 3 6 | 3, 70 | 1, 34 | 28. 7 | 210 | 5850 |

ప్రథమ వివరణ మందలి నిర్ణయము శాకాహులు భుజించువారికిని, ద్వితీయ వివరణము నందలి విధానము మాంసాదుల గ్రహించు వారికి నై యున్నది. స్వచ్ఛమైన శాకాహులే వలయువారికి ప్రథమ వివరణ మునందలి యాహారము యుక్తమైనది.

ఆహారమెల్లప్పు డొకటిగానే యుండక మార్చుటకు ననుకూలముగ నుండవలెను. కాని యీవివరణములను బట్టి ఆహారమెల్లప్పుడు నొకేవిధముగ నుండవలెనని గాదు.

శరీర కష్టమువలన ప్రతిదినము నష్టమగు పదార్థముల నెట్లుపునర్లభ్యములుగ చేసికొన నగునో యాపద్ధతి మాత్రము పైవివరణములవలన వ్యక్తము కాగలదు.

ఈవివరణమును బట్టి మనుజుడొక పాల మీదనే జీవింపవలెనన్న దినమునకు ౫ శేర్ల పాలను త్రాగవలెను. ప్రస్తుతస్థితుల బట్టిచూడ నిదియెంతయు విలువ యధికమగుచున్నది.

మాంసము మీదగాని పాలమీదగాని మనము జీవింపగలిగినను మనకు కావలసిన దానికన్న నత్రజని కర్బనములలో నేదోయొకటి యెక్కువయి సులభముగా జీర్ణములు కావు గాన యివిపనికిరావు.

పి. వె. స. న.

* చటాకనగా—1½ తులములు



గొడ్డూ గోద చూసుకోడం, తర్వాతపిల్లల్ని చూసుకోడం,...మళ్లీ,ఇందులో ఏమైనాతినక నచ్చక పోయిందా? అదుగో! అక్కడే— ముఖ్యంగా అతను తాగున్నప్పుడు...అయ్యో రామా! ఇదేంబ్రతుకో గాని నాయనో—

బ్రదిమ్మరి:— (నమలుచు) నిజమే. అంతకు మూలం అదే. తేనసేది జీవుడికి ఆపత్తులన్నీ సురాపానంవల్లేను.

వనమయ్య:— నీకూడా దాని దెబ్బ తగిలిందల్లే వుందే!

వెళ్లమిమ్ముతా. కాని, లేచానా? ఇకచూడండి—చేతికిదొరికింపల్లా ఎగరవేశానే.

అంకమ్మ:— అదంతా మనిషిలో ఉందనుకొంటా.

దిమ్మరి:— తాగనంతసేపు. అంతే అనుకోండి. కాని, ఇది ఒక రకం రోగం ఇంటిది.

వనమయ్య:— మంచిరకం రోగమే. దివ్యమయిన లంప కాయలు రెండు విరుగ వసుకుంటూ దీనికి— వెళ్ళివస్తా. (వెళ్ళును.)

(మంగమ్మ చేతులు తుడుచుకొని వెళ్ళబోవును. బ్రదిమ్మరి అన్నము తినివేయుట జూచి)

# అంతకు మూలము.

## ౧

### రాత్రివేళ

(ఆకురాలుకాలము. ఒక బీదరైతు పూరిల్లు; ఒకసావిడి ఒకగది, ఒకవంటయిల్లు; అంకమ్మ కూర్చుని నూలు వడుకుచుండును. మంగమ్మ కూర తరుగుచుండును. చిన్న పార్వతి ఉయ్యాల నూచుచుండును.)

మంగమ్మ:— అమ్మోయ్యారామా! నాకేమో దడగా ఉంది. ఏదో కష్టం వస్తుంది... మరి ఆయన అక్కడ ఆట్టేవుండడానికేమిటీకారణం? మొన్నట్లాగే—అవును ... పట్నానికివెళ్ళి పుల్ల లమ్మి సగం పైగా తాగుడికి పెట్టిరాలేదు? పైగా అన్నిటికి నన్ను పట్టుకుని తిట్టడం.

అంకమ్మ:— మొదలుపెట్టావు. ఇంతలోకే? పట్నం చాలాదూరం... ప్రొద్దయినా పోలేదు. ఈపాటికి—

మంగమ్మ:— పొద్దుపోలేదట! వాళ్ల వెంకన్న అప్పుడే వచ్చాడు. మీ అబ్బాయి వెళ్ళిం తరువాతేనా అతడు బయలుదేరింది? ఇంకా మీఅబ్బాయి రానేలేదు...ఇంకా ఆ స్తమానం కాలేదని—అది ఒకటే—సంతోషం.

అంకమ్మ:— వెంకన్న సూటిగా తనకొత్తా దారు దగ్గరకే వెళ్ళాడాయును...అబ్బాయిబజారుకి వెళ్ళాలి.

మంగమ్మ:— ఒక్కడే అయితే ఆయన భయం లేదు. విస్సన్నున్నాడు కూడాను. ఆ చచ్చు కుక్కతో — అనకూడదు — ఎవరైనా వెళితే తాగాడన్నమాటే...లేచింది మొదలు ఎవడైనా కష్టపడాలి అంతా రెక్కలమీదుంది...దాని వల్ల ఫలం ఏమాత్రమైనా? ఉదయాస్తమానం బలాదూరు తిరగడం లాభం కనబడుతోంది.

(తలుపు తెరచుకొని, వనమయ్య, ఒక దేశద్రిమ్మరితో ప్రవేశించును.)

వనమయ్య:— అంతా బాగున్నారు? ఇదుగో మీ యింటికి, ఈరాత్రి తిండికీ పడక్కీ వంతువేసి ఇతణ్ణి తీసుకొచ్చా.

బ్రదిమ్మరి:— (నమస్కరించి) దణ్ణంతల్లీ!

మంగమ్మ:— మాయింటికే ఎప్పుడూ తీసుకొస్తావేమిటయ్యా! మొన్న బుధవారం ఒక ముష్టివాడికి బసయిచ్చాం. అంతకూ

(మాసరయ్య విస్సన్న తోటాలుము ప్రవేశము)

విస్సన్న:— అంతా క్షేమంగా వున్నారా?

(రాముని విగ్రహానికి నమస్కారము చేసి)

ఇదిగో మీయిల్లు నల్లకాడుగాను! వేళకొచ్చాం గుళ్ళోకి వెళ్ళాం... అక్కడ కూడు దొరక్క పోయింది. కాఫీహోటేలికి వెళ్ళాం... సరిగ్గా వేళకక్కడ వున్నాం. హహహహ! ఇదుగో మాకు కొంచెం గంజిపోస్తే మేం కొంచెం సారాయి పోస్తాం.

మాసరయ్య:— (దిమ్మరిని చూచి) ఈదొరగారెవరు?

[illegible] ...దు. అంతవరకు రాలేదు. కొంచెం బాధపడ్డానేఅనుకోండి—తాగుడునల్లే నాజీవన మార్గం ఈవిధంగా అయిందిగాని లేకపోతె ఇంకొక విధంగా—

వనమయ్య:— నా ఉద్దేశ్యం మితిగా తాగితే ఏమీ చెరుపుండదని.

దిమ్మరి:— నేచెప్పేది, కాస్త అందితేచాలు—అధఃపాతాళంలోకి మనిషిని లాగేసే సత్తాదీనికుందని.

మంగమ్మ:— నేననేది అదే. చేతనైనంత కష్టం చెయ్యడం ఒళ్ళు హూనం చేసుకోడం దీనిమూలాన చివరకు వచ్చే బహుమానాలు తిట్లు, కుక్కను కొట్టినట్లు చెప్పుదెబ్బలు—

దిమ్మరి:— అంతటితో అయిందీ? దాని మూలంగా బుద్ధిచెడి చేయరాని పన్లు చేస్తారు. తాగనప్పుడు వాడికేమిగాని ఇయ్యి. తందిక్కాకపోతే ముట్టుకోడు. కానితాగాడా చేతికందిందల్లా కొట్టేశాడే. తన్నుల్ తింటాడు. తిట్లుతింటాడు. కొట్లోకివెళ్తాడు ఎందుకు నామట్టుకు నేను తాక్కుండా ఉన్నంతసేపు మర్యాదగాను గౌరవంగాను కాలం

మాసరయ్య:— నూరేళ్ల కోమాటైనా సంతోషం అనుభవించాలి. ఇవాల్టి డబ్బు రేపటికికాదు.

మంగమ్మ:— ఏమిటీ వాగుడు?

మాసరయ్య:— (వేలితో భయపెట్టుచు) మంగీ—

మంగమ్మ:— ఏం ఎందుకుమంగి, చూసిన కొద్దీ అసహ్యం వేస్తుంది.

మాసరయ్య:— ఏమిటంటావు?

మంగి:— ఏమిటనేది?

మాసరయ్య:— అప్పుడే మరుపొచ్చిందీ, (భివాలున లేచిపోయి మంగమ్మను నెత్తిమీద మొట్టి) ఒకటి—

---

అంకమ్మ:—మంగమ్మా! మంగమ్మా అంటూ! ఇంకా కొంచం అన్నమా అబ్బికి వడ్డించు

మంగమ్మ:— వాడినంప తెగిరి. నేను వెళ్ళి గంజిమాట చూసుకోవాలి.

(అంకమ్మలేచి కుండలో అన్నము తెచ్చి దిమ్మరికి వడ్డించును)

దిమ్మరి:— వందనము. నాకీరోజున దిట్టమైన ఆకలి వేస్తోంది.

అంకమ్మ:— కూలి చేసుకొనేవాడివా?

దిమ్మరి:— ఎవరు! నేనా? మేస్త్రీగా ఉండేవాణ్ణి.

అంకమ్మ:— మజూరీ ఏందొరికేది!

దిమ్మరి:— యాభైరూపాయలు... ఒకొక్కమాటు డెబ్బయి దొరికేవికూడాను.

అంకమ్మ:—ఈగతిఎట్లావచ్చింది—మరి—ఏకు?

మంగమ్మ:—(గంజిపట్టుకొనివచ్చి) రామరామా! అతడుతాగేవస్తాడు. నాకు తెలుసు.

అంకమ్మ:— వాడుకొంచెం ఉబలాటంపడ్డాడని నాకూఅనుమానంవేస్తోంది.

మంగమ్మ:— అంతేతంటాలుపడి వడ్లుదంపి వంట చేసిపెట్టి, ఇల్లుచక్కబెట్టుకొని అంతామారెక్కల మీదుంది.

మాసరయ్య:— ఇదిగో మూట తీసుకుపో

(మంగమ్మవచ్చి రూపాయిలు మూట ఇంట్లోకి తీసుకు పోవును.)

మాసరయ్య:— ఏం పెంకివాళ్లండీ ఆడవాళ్లు.

(దిమ్మరికి మరల సారాయినిచ్చును) త్రాగు.

ద్రిమ్మరి:— (తలయూపుచు) నీవే త్రాగు.

మాసరయ్య:— మొగమాటం పడకయ్యా! తాగు.

ద్రిమ్మరి:— (త్రాగుచు) నీకు శుభం.

విస్సన్న:— నీవు తెలిసినవాడివి లాగున్నావయ్యా. చొక్కా గిక్కా వేశావ్. పట్నంవాడవ్ కాబోలు! ఆబుజంమీద చిరిగిందేం. అట్లా లేవ్వుంచుకో బాగుంది. అయినా ఏంచేస్తాం.

అంకమ్మ:— అట్లా అనకూడదు విస్సన్నా! వాడి సంగతి సందర్భాలు తెలియకుండా, ఎంత బతుకు బతికాడో. పదిమందిలో హాస్యం ఆడకు.

దిమ్మరి:— అన్నియ్యమ్మా. అజ్ఞానం.

విస్సన్న:— స్నేహంలో అన్నాను. కోపంవద్దు. తాగు (సారాయిచ్చును.)

అంకమ్మ:— ఎందుకిస్తావ్. అతడే అన్నాడు ఇది చాలా చెడుపని. దీనిమూలాన జైనులో కూడా పడ్డాడట!

మాసరయ్య:— నీవు జైనులో ఎందుకుపడ్డావు?

ద్రిమ్మరి:— గ్రహచారం. డబ్బుకోసం ఒక షాహుకార్ని దారిలో అడ్డంకొట్టాం. ఆజోక్కి ఎట్టా తెలిసిందో మేం పట్టుపడ్డాం. అయితే ఆకోర్టులో నా ప్రిజ్ఞ చూపించా. "డబ్బు దొంగిలించావు కాదు." అన్నారక్కడ. "దొంగలు దొంగిలిస్తారు. మేం మాసంఘం కోసం పాటుపడ్డాం." అన్నానేను. అంటే డంగైపోయాడు. మళ్లీజవాబు చెప్పలేదు. అయితే ఖయదులో వేశారు. అంటే ఇష్టం వచ్చినట్లు తిరగ నియ్యలేదు.

విస్సన్న:— తెలివైన సన్నాసివే. (సారాయిచ్చి) కాని, తాగు, నీదగ—

అంకమ్మ:— ఏంమాట్లవి?

విస్సన్న:— అవ్వా తిట్టాలనికాదు నాఉద్దేశం. అది నామోస్తరు.

(మంగమ్మ వచ్చి కంచములోనడ్డించుచుండును)

మాసరయ్య:— అది బాగుంది. కోపం వచ్చిందట చూడండి. నాముసలిదంటే నాకాపేక్ష—

(మంగమ్మను కౌగలించుకొని.)

దేనికోసమైనా దీన్ని విడిచిపెట్టను.

విస్సన్న:— అబ్బా. అందరు తాగండరా. అవ్వా! తాగు. విందుచేసేదీ నేను.

దిమ్మరి:— దానియర్థమేమిట భలం, శక్తి, విచార మంతాపోయి సంతోషం ఉండాలి ఒక్కటే. నాకు అంతా ఒకటే.

(అరాజక గీతాలు పాడును.)

మాసరయ్య:— తాగుడు బాగాపని చేసింది.

## ౨

## ఉదయవేళ.

(మాసరయ్య ఇంకానిద్ర లేవలేదు. అంకమ్మ కుండతోముతోంది. మంగమ్మ దొడ్లోకి వచ్చును.

మంగమ్మ:— పొయిలోకి పుల్లలు పట్టుకురావాలి.

అంకమ్మ:— రాత్రి చాలాగొట్టేవాడే. పుణ్యామా అంటూ అతడుండబట్టిగాని. ఏడీ? కనపళ్లేదు వెళ్లిపోయాడా ఏమిటి:

మంగమ్మ:— అవుననుకుంటా!

(అక్కడనుండి మంగమ్మ వెళ్లిపోవును.,

మాసరయ్య:— (లేచి మంచముమీద కూర్చుని) అబ్బా చాలా పొద్దెక్కిపోయింది. (దిగి) తలకాయ నొప్పిగా ఉంది. ఇకతాక్కూడదు. దాని దుంపతెగ (రాములవారి విగ్రహానికి నమస్కారంచేసి మొగము కడుగుకొనును) వెళ్లి బండీ కట్టుకుంటా?

(మంగమ్మ ఎంటుసతుకుతో ప్రవేశించును.?)

మంగమ్మ:— నిన్నటి ముష్టివాడు వెళ్లిపోయాడా?

మాసరయ్య.— వెళ్లాడనుకుంట!

మంగమ్మ:— తెలివైనఘటం.

మాసరయ్య:— నిన్ను బతికించాడు.

మంగమ్మ:— అయితే బెల్లంపొట్టాం దాచావా?

మాసరయ్య:— నీవు దాచావనుకున్నా.

(అంకమ్మ నీళ్లు తెస్తుంది.)

మంగమ్మ:— అత్తా! బెల్లప్పొట్టం దాచావ్రా?

అంకమ్మ:— నా కేం తెలుసు?

మంగమ్మ:— రాత్రి దిడ్డిగింతలో పెట్టాను. కనబట్టం లేదు.

అంకమ్మ:— అయ్యో, అయ్యో, ఏమైందే మరి.

(ఒక పొరిగింటివాడు ప్రవేశము.)

పొరిగింటివాడు:— ఏమోయ్! మాసరయ్య బావా! పొలం వెళ్ళవా?

మాసరయ్య:— బండీకట్టబోతున్నా ఇంటో ఏమిటో పోయింది.

పొరిగింట:— అదేమిటి?

మంగమ్మ:— ఇదిగో అన్నా! ఈయన పట్నంనుంచి బెల్లం తెచ్చారు. దిడ్డిగింతలో దాచా? చూస్తే కనబడదు.

మా సరయ్య:— పైగా నిన్న మాయింటికి వచ్చిన ఒక ముష్టివాడి మీద అనుమానంపడి పాపం కట్టుకున్నాం.

పొరుగింటివాడు:— ఎలా వుంటాడు వాడు?

మంగమ్మ— కొంచెం పలచని మనిషి. గెడ్డం పెరగ లేదు.

పొరుగింటివాడు:— జుట్టు ఉంగరాలు తిరుగుంటుందా? గరుత్మంతుడి ముక్కు—

మా సరయ్య:— అవు నవును.

పొరుగింటి:— ఇప్పుడే చూశా! ఎందుకో ఇంతలోంద రగా పోతున్నాడను కున్నా.

మా సరయ్య:— వాడేఆయి ఉంటాడు. ఎక్కడ కనబడ్డాడు?

పొరిగింట:— ఇంకా ఏంకెన దాటి ఉండడు.

(మా సరయ్య పొరిగింటివాడు కలసి వెళ్తారు.)

మంగమ్మ:— ఏమన్యాయం. ఏమన్యాయం. వాడే తిప్పుకుండా.

అంకమ్మ:— ఒకవేళ కాకపోతే? పాపం శరీరం చాలి.

మంగమ్మ:— కాదూపాణీ: మన అనుమానం నిజం కాక పోచ్చు. పాపం. బ్రతికిచెడ్డా మంచి వాళ్లా గున్నాడు.

అంకమ్మ:— అవును.

మంగమ్మ.— ఆయన కేకలు వేస్తూ వస్తున్నాడు వాణ్ణి పట్టుకు వస్తూవుండాలి

(మాసరయ్య, పొరిగింటివాడు, ఇద్దరుముగ్గురు పిల్లలు ద్రిమ్మరిని త్రోయుచు ప్రవేశము.)

మా సరయ్య:— (బెల్లపు పొట్లాం చేతికిస్తూ భార్యతో) వీడి దగ్గరే దొరికింది. (ద్రిమ్మరిజిక్కి) దొంగ గాడిదా!

అంకమ్మ:— (మంగమ్మతో) వాడే పాపం. తల యెట్లా వంచుకున్నాడో!

మంగమ్మ:— ఒక ముక్క నేవిస్తే చేతి కందిందల్లా లాగేశాడమే అని నిన్న వీడే ననుకుంటూ చెప్పిందే?

పొరుగింటి:— మునసబ్బుగారి దగ్గరకు తీసుకుపద.

ద్రిమ్మరి:— మీ యిష్టం వచ్చినట్లు చెయ్యండి అంటున్నాను. నాకు భయంలేదు. నా యభిప్రాయాలకోసం కష్టపడ్డానికి సిద్ధంగానే ఉన్నాను. మీరు చదువుకున్న వాళ్లైతే తెలిసేది.

మంగమ్మ:— రాముని విగ్రహం చూచి వీణ్ణి విడిచి పెద్దడం మంచిది. మనపొట్లాం మన కొచ్చిందిగా. వాణ్ణిపోనీ. మనం ఇంకో పాపం చెయ్యడం ఎందుకు?

మాసరయ్య:— (ఆక్షేపముగా) "పాపం" వేదాంతం చెప్పుతున్నావు! సలహా అక్కర లేకుండా ఏం చెయ్యాలో నాకూ తెలుసున్లే మొద్దూ! "వదలిపెట్టు" వెళ్ళితే వెళ్లొచ్చు వాడు కాని బుద్ధివచ్చే నాల్గుమాటలు. వాడు వినాలి, (దిమ్మరితో) ఇదుగోనండోయ్! కొంచెం నామాటలికి చెవి ఇయ్యాలి. నవెంత ధనంలేని స్థితిలో ఉన్నా— నీవు—తప్పు—చాలా తప్పు చేశావు. ఇంకొకడైతే నినరాల్తోడి పోలీసువాళ్ల కొప్పచెప్పేవాడే. కాని, నేను చెప్పేదింతే...ఎంతతప్పు చెయ్యాలో అంత తప్పూ నీవుచేశావు. అయినా చాలా హీన స్థితిలో ఉన్నావు. నిన్ను బాధించడంమాకిష్టం లేదు. (అందరునిశ్శబ్దం) (గంభీరంగా) పో! భగవంతుణ్ణి తల్చుకో. ఇట్లాంటి పన్లుమాత్రం చెయ్యమోకు. (భార్యను జూచి) నాకు — నాకు నేర్పవచ్చావ్ — (చేతిలో పొట్లం తీసుకొని) ఏదలిపెట్టేదిలేందినాయిష్టం. నాకు నేర్పవచ్చావ్' (పొట్లామును దిమ్మరికిచ్చును.) తీసుకో, దాన్లో ఉపయోగించుకోవొచ్చు. (భార్యతో) మహౌదార్యం నాకు నేర్పవచ్చావ్. (దిమ్మరితో) పో. వెళ్లిపొమ్మన్నా...ఇక మాట్లాడకు.

(అందరు నిశ్శబ్దముగా ఉందురు)

దిమ్మరి:— (పొట్లాము తీసుకొని) నాకేమి తెలియదని అను కొంటున్నారు. (గద్గదస్వరముతో) నాకు బాగా తెలుసును. నన్ను కుక్కను ఏలె చావగొట్టివుంటే నాకు తట్టుక పోయేదే. నేనెటువంటివాణ్ణో నాకు తెలియదు? నేను— హీనుడను బద్మాషీని అని నాఉద్దేశ్యం. భగవంతుణ్ణితల్చి నన్ను క్షమించండి. (ఏడ్చి పొట్లమక్కడ పడవేసి చటుక్కున పోవును.)

మాసరయ్య:— (భార్యతో) నాకు చెప్పవచ్చావ్!

పొరుగింటివారు:— ఏమి యేడ్చాడు పాపం.

అంకమ్మ:— అతడూ మనిషే.




తండ్రి కుమారుడు మనుమడు

# మాతృదేశము



[కోటగిరి వెంకట కృష్ణరావు బహద్దరు జమీందారు గారు.]



ఉ॥ రాణుల రాణివాసముల ♦ రాట్నము లెప్పుడలంకరించెనో
మానక నాఁడె జానపద ♦ మానితమై, భరతావనీపరా
ధీన నికృష్టదాస్య భవ ♦ దీనదశాప్తి నశించె, నూర్జితం
బైన స్వరాజ్య మా కరత ♦ లామలకంబగు మాతృదేశమా

ఉ॥ ఏలవృథా ప్రసంగము? అ ♦ హింసయు. సత్యము, ధీరసాత్త్వికాం
దోళన, త్యాగశీలత, మ ♦ నోబల. మాత్మసుశిక్షణంబుఁ గైఁ
జాలిన యుద్యమంబుఁ గనఁ ♦ జాలము వేఱు. మహాత్మగాంధి యీ
లీలను పెక్కుమాఱులవ ♦ లీలజయించెను మాతృదేశమా॥

ఉ॥ సల్పినతప్పులేకఁ జెఱ ♦ సాలలఁ గుక్కిన నే స్వరాజ్యసం
కల్ప వికల్ప మానె? భ్రమ ♦ గాని సముద్యమ భీషణాబ్ధి యీ
స్వల్పపుఁ గట్టఁ గట్టుబడఁ ♦ జాలదు మేల్కొనినట్టి హైందవా
నల్పవిజృంభణ ప్రభల ♦ నన్యతరంబులు మాతృదేశమా॥

ఉ॥ గమ్యముఁ జేరునంతదను ♦ కన్ విరమింపఁ గాఁబోము, జాతివై
షమ్యము లెంచఁబోము, చెఱ ♦ సాలలఁ జేరఁగ జంకఁబోము, చే
సౌమ్యపదంబునన్ నడవ ♦ సాహసమూనఁగఁబోము, పూర్వపున్
రమ్యతరాగ్రపీఠమున ♦ రంజిలనీవిఁక మాతృదేశమా॥

ఉ॥ కోటలదాటుమాటలను ♦ గూసితిమంచుఁ దలంపబోకుమ
మ్మాటికి, సుస్థిరంబుగ న ♦ మానుషశక్తియుతుండుగాంధియీ
రాటముఁ దీర్చనీకిదె, స్వ ♦ రాజ్యమువచ్చెను మాకు ధర్మమీ
నాఁటికి నైనగెల్చుతరు ♦ ణంబరుదేరెను మాతృదేశమా॥

చ॥ మఱవకు హైందవుల్ ముసల ♦ మానులు, శిక్కులు, పారశీకులె
ల్లరొకట జన్మసత్త్వముల ♦ లాభముఁబొందగ దీక్షఁబూనిసో
దరులయి సంచరించెడివి ♦ ధంబది, కొండల బిండిఁ జేయనే
ర్తురిఁకనసాధ్యముండదు బు ♦ ధుల్ వివరించిరి మాతృదేశమా॥

చం॥ నడుముబిగించి పౌరుషము ♦ నన్ గణరంగములోనికాంధ్రులుం
నడచిరి వెన్నుఁజూపరు ఘ ♦ నప్రతిభాయుతులెందుకేనియుం
జడియరు స్వాత్మగౌరవ ♦ మనఃపరికల్పులు నీదుకంటినీ
రుడిచిసముద్ధరించెదరు ♦ దుఃఖిలఁబోకుము మాతృదేశమా॥

చం॥ లజపతి నెహ్రూలు దాసు, మవు ♦ లాన మహాత్మ మహోకుతాలు లో
లి జగము లెత్తివచ్చినఁ జ ♦ లింపరు పైనవతారమూర్తిగాం
ధి జపతప ప్రభావగుణ ♦ ధీరుఁడు నాయకుఁడై చరింపఁగా
గజగజలాడిపోదె యఘ ♦ కాండ పిశాచము మాతృదేశమా॥

ఉ॥ శాంచెమొ గొప్పయో మరల ♦ గొంత "రిఫారము" చేసిరే నిశాం
తించెదమంచు నెంచకుఁగ ♦ తించిన దానిని ద్రవ్యభోక్తుసా
ధించెదమేము కోరినవి ♦ ధీర ఫోరపటోక సారిబుద్ధిదె
ప్పించెను పూర్ణసత్త్వములె ♦ పెద్దలు తెత్తురు మాతృదేశమా॥

ఉ॥ స్త్రీలసుశీల సంపదహ ♦ రించిరి పోశిశుహత్య జేసిపాం
చాలమునందు బాపమది ♦ చాలును వేయి తరాలకైనదో
శ్మాలురురానణాదులువ ♦ శంవదులై గత దార్ఢ్యులైరి స్త్రీ
శీలహరాసలాయుధవి ♦ శేషహతిన్ దగ మాతృదేశమా॥

ఉ॥ మానవతీల లాములవ ♦ మానభరంబున హైందవాంగనా
మానధనాభిరక్షణకు ♦ మార్గము లేదిపుడించెటింగి స్వ
పాణితృణీకృతోద్ధతని ♦ రాకరణాన్విత రాచకీయవి
జ్ఞానహితప్రచారవివ ♦ శస్థితి గ్రాలిరి మాతృదేశమా॥

ఉ॥ పెచ్చు పెటింగి స్త్రీపురుష ♦ భేదము మాని పరాభవాగ్నిసిర్
జచ్చుటకంటె మేలు చెఱ ♦ సాలలఁ జేరి నశించుటంచునీ
మచ్చున నైక్యకంఠమున ♦ మామతమున్ వివరించినాము పై
వచ్చెడిదాని కంతభగ ♦ వంతుఁడె దిక్కగు మాతృదేశమా॥

ఉ॥ వేలకొలంది సోదరుల ♦ వెచ్చని నెత్తురు లేదినంబు పాం
చాలమునన్ స్రవించెనో? ని ♦ జగంబుగఁ నాఁడె స్వరాజ్యలక్ష్మి మా
పాలిటిదయ్యె రూపడగ ♦ బాపము ధర్మము పక్షముండి శ్రీ
లోలుఁడు శాంతిగూర్చ శ్రమ ♦ లున్ నశియించును మాతృదేశమా॥

ఉ॥ దాస్యవిముక్తి జేయక స్వ ♦ తంత్రమొసంగక షౌకుతాలిపం
చాస్యము నిద్రగూరదు వి ♦ చారముఁదక్కుమ యెవ్వరెవ్వరే
హాస్యములాడుచుండినమ ♦ హాత్ముని శక్తినెఱుంగుదీవు సా
రస్యములన్ గ్రహింపుము ని ♦ రాకరణంబున మాతృదేశమా॥

ఉ॥ నాథుఁడు లేడటంచును స ♦ ణంగకు లోపమె "లోకమాన్యగం
గాధర చక్రవర్తి" మృతి? ♦ గాంధియు నంతటివాఁడె పూర్వపుణ్
గాథ లెఱుఁగుదీవదియుఁ ♦ గాక మహాత్ముని యందు బాలగం
గాధరు దివ్యతేజమును ♦ గానఁగనయ్యెడి మాతృదేశమా॥

# శ్రీ శంకరవిద్యాలయము (బాపట్ల)

——( :o: )——

ఆంధ్రదేశమున నూతనోజ్జీవమునకుఁ గేంద్రస్థానమునఁ దగిన గుంటూరు మండలమునఁ దూర్పుసముద్రతీరమున కనతిదూరమునఁ జోళరాజన్య ప్రతిష్ఠాపిత శ్రీ భావనారాయణస్వామి రక్షితమై ప్రథమాంధ్ర మహాజనసభా సమావేశముచేఁ బవిత్రితమై బాపట్లయను వ్యవహారనామముఁగల భావపురముగలదు. అయ్యది సముద్రతీరోష్ణస్థితి గల్గి, బహుజన సంకీర్ణమగు బట్టణము గాక, నాగరక విదూరమగు పల్లియ గాక, యున్నత విద్యాలయము గలిగి భాషావిశారదుల చేతను, న్యాయ స్థానములుమున్నగు వివిధములగు ప్రభుత్వ కార్యాలయముల చేతను నాగరక లక్షణములు గలిగి యలరారుచున్నది. చిత్రిపర్ణసమలంకృతిబంగు తరులతాగుల్మంబులు నిరంతర నూతనచైతన్యవిలాసముఁజూపుచుండ, నిబిడ తరుచ్ఛాయలచేఁ జల్లనై, తృణకాష్ఠజలసమృద్ధిఁగలిగి సాధుజీవనులకు వాసయోగ్యమై యుండుటచే విరాగుల నాకర్షించు ననుటకు సందియములేదు. నూతనభావోదయ ప్రభావముచేఁ బాశ్చాత్య నాగరకవ్యామోహాంతమము విరసి, సనాతనార్యవిద్యారహస్యజ్ఞాన కళా సందర్శనార్హులగు భావపురీవాసుల భాగ్యోదయము సమీపింప జొచ్చెను.

## శ్రీ శంకరవిద్యాలయము తత్ప్రతిష్ఠాపకులు

శ్రీమత్పరమహంస పరివ్రాజక శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామివారు, రాక్షస సంవత్సర ఫాల్గుణ బహుళ దశమినాఁడు వార్ధకమున బాపట్లను దయచేసిరి. శ్రీస్వామివారు తమ్ము సందర్శించిన ప్రజానీకములోఁ గొందరి ప్రార్థన మన్నించి భాష్యత్రయమును బోధించుటకు దయతో నంగీకరించి శ్రీ శివాలయ వేదికపై విరామముగ, వాహనశాలలోను తాము నివసించుచు, శ్రీశివాలయమునందు భాష్యపాఠములు చెప్పుచు, పురాణ కాలక్షేపము జేయుచు సద్విద్యా ప్రచారము సలుపుచు, పండిత పామరుల ననేకుల నాకర్షింపఁ బ్రారంభించిరి. సౌమ్య సౌశీల్య వైరాగ్య పాండిత్య సౌందర్య తపోబల బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై సంతత బ్రహ్మానందానుభవ సూచక ముఖవిలాసము చే జెన్నారి, పరిజాకర్షణశక్తిఁ గలిగి, తమఁ జేరిన వారికెల్ల సద్దివ్య శక్తిచే బరిశుద్ధులఁ జేయుచుండుటచే శ్రీ స్వామివారి సందర్శన కుతూహలులై వేనవేలు జనులు వచ్చుచు పోవుచుండుటవలన బాపట్లయొక యాత్రాస్థలమయ్యెను. శ్రీ స్వామివారి విద్యామహిమలు వెల్లడియైనకొలది వారియెడ భక్తిశ్రద్ధలధికమై, అట్టి మహాపురుషులు వసించుట కొక మఠము



శ్రీ. ప. ప. శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామి వారు.

నిర్మింపకుండుట బాస పుర పౌరులు తమ యాత్మగౌరవ భంగమని యెంచి బాపట్లలోను, బాపట్ల తాలూకా గ్రామములలోను విరాళములచే ధనము గూర్చి శ్రీ శివాలయమున కుత్తరమున నున్న స్థలమునందు శ్రీ దత్తాత్రేయమందిరము పేరనొక మందిరము నిర్మించి సమర్పించిరి గాని శ్రీ స్వామివారా మఠము మందిరమును తన మఠముగా నంగీకరింపక శ్రీశంకరవిద్యాలయమును వేదశాస్త్ర పాఠశాలకుపయోగింపుడనియాన తిచ్చి 11—8—1917 తేదీకి సరియగు పింగళసంవత్సర శ్రావణబహుళ నవమి శనివారముననొక సుముహూర్తమున దత్తమందిరము తెరచిరి ఈదత్త మందిరముననే సాహిత్య శాస్త్రపాఠములును జయంతులున్నుగునుత్సవములును శ్రీస్వామివారొనర్చిన యేర్పాట్ల ప్రకారము జరుపబడుచున్నవి. ఈశంకర విద్యాలయమున కనుబంధముగాఁ బుస్తకభాండాగారమును స్థాపించుటకు శ్రీ స్వామివారు సంకల్పింప, కీర్తిశేషులగు బ్రహ్మాండం బాపయ్య పంతులుగారి భార్యయగు రామాబాయమ్మగారు దత్తమందిరము వెంబడి నొక రమణీయసౌధనిర్మాణము చేయించి శ్రీ శంకరవిద్యాలయ పుస్తక భండారమునకొసంగిరి. ఈగ్రంథాలయమున వేదములు వేదాంగములు పురాణములు శ్రీ శంకరభాష్యములు విద్యారణ్యభాష్యములు ప్రకరణ గ్రంథములు మున్నగు వెలలేని సంస్కృత గ్రంథరాజములనేకములు గలవు. శివాలయస్థితి పూర్వమువలె గాక శ్రీ శంకరవిద్యాలయ సన్నిధానబలంబున నూతన వికాసము జెంది



శ్రీ యుత బ్రహ్మాండం వెంకట లక్ష్మీనారాయణ రావుగారు

నహో యనునట్లు నిత్యకళ్యాణము పచ్చతోరణమై నిరంతర యాతాయాత భక్తజనంబై వైభవోపేతముగ నున్నది.

కీర్తిశేషులగు బ్రహ్మాండం బాపయ్యపంతులు గారు తమ జీవితకాలములో నూతన ప్రతిష్ఠలు చేయదలచి శివాలయములో నిరుప్రక్కల చిన్నచిన్న గదులు కట్టించి ఆగమశాస్త్ర సాంప్రదాయ విమలగుమహాపురుషులు సన్నిధిలో లేక చేసిన ప్రతిష్ఠలరిష్ట దాయకములగునను భయముచేఁ సంకల్పము నెరవేర్పజాలకనే స్వర్గస్థులగుటచే వారిసంకల్పము నెరవేర్చి కృతార్థతనుజెందు సదుద్దేశముతో శ్రీస్వామివాలసహాయముతో శివాలయములో శ్రీయభినవసోమేశ్వరశ్రీబాలా త్రిపురసుందరీ గణపతిప్రతిష్ఠాపనలను గం॥ రామాబాయమ్మ గారు చేయించిరి. శివాలయమున నూతన పూజా విధానమును ఉదయమునందు భాష్య ప్రవచనమును సాయంతనమున స్త్రీలకు పురాణశ్రవణమును శ్రీస్వామివారియేర్పాట్లప్రకారముజరుగుచున్నవి.

శ్రీశంకర విద్యాలయ ప్రతిష్ఠాపకులగు ఆ స్వామివారి చారిత్రమిచ్చట సంగ్రహముగా సంస్మరించుట యప్రస్తుతముకాదు. శ్రీస్వామివారు పూర్వాశ్రమమందున్నత వంశీయులగు మహారాష్ట్ర బ్రహ్మచారియై పిన్నవయసునందే సాధుసేవా పరతంత్రుఁడై తీర్థ యాత్రాభిలాషను పుణ్యభూసంచార కుతూహలమును భగవద్భక్తియును గలిగి పదునాల్గవయేటనే యిల్లువిడచి దుర్గమారణ్య మార్గంబులనడచి శరీర

ప్రయాసము సహించి గంగానది మహానదీ తీర్థంబుల గుంటలాడి పుణ్యక్షేత్రంబుల దర్శించి హిమాలయ ప్రాంత కాంతార భూముల పర్యటనంబు సల్పి యు దంపలి సాధు యతి విరాగిసంతతితో గూడి బహ్మచ ర్యంబు గడిపి శ్రీదత్తాత్రే యావతారముగ సుప్ర సిద్ధిగన్న శ్రీ॥ ప॥ ప॥ శ్రీ వాసుదేవానందస్వామివా రి గురుశుశ్రూషలసల్పివారి యాజ్ఞానుసారము శ్రీ శృం గగిరి జగద్గురు పీఠాధిపతు లగు ప॥ ప॥ శ్రీ నృసింహ భారతీస్వామివారి కడనసిం చి శుశ్రూషసల్పి శ్రీవారి సన్నిధిలో వారి యాజ్ఞాను సారముగా సన్యాసమస్వీకా రమంది వారియొద్ద ప్రస్థా నత్రయశాంతిజేసి వాసుసిద్ధి నొందినపిదప జ్ఞాననిష్ఠులు సు బరమయోగులు నగు శ్రీ బ్రహ్మానంద



శ్రీ దత్తాత్రేయమందిరము.

తీర్థస్వామిజే? కైలాసయాత్రజేసినపర్వతపట్టణగాని మానససరోవరంబుల పర్యాయముగా వాసచారియై భరతఖండ మెల్ల రెండుమూడు పర్యాయములు తిరిగి సమస్త తీర్థం బుల సేవించిరి. సంస్కృతమునందే గాక ఐదారు దేశభాషలలోగూడ వ్రాయను జెప్పను ధారాళముగా నుపన్యసింపను శక్తి సంపాదించిరి. శ్రీస్వామి వారు బాపట్లలోనుండిన కాలము లో వెదుళ్ళపల్లిలో శిథిల మైనశివాలయమును పునరు ద్ధారణజేసి బాపట్ల శివాల యమున నూతన ప్రతిష్ఠలు జేయించి శ్రీశంకర విద్యా లయమును గ్రంథాలయ మును స్థాపించి చతుర్మాస దీక్ష కాశికాపురిలోజరుప దలంచి యచ్చటికేగి య చ్చటనేకాళీయుక్తి సంవత్సర శ్రావణ శుద్ధాష్టమి నాడు మణికర్ణికా ఘట్టమందు ప గలు తొమ్మిది గంటలకు బ్రహ్మసాయుజ్యమందిరి.



శ్రీ శంకరవిద్యాలయ పుస్తక భాండాగార సౌధము.

## శ్రీశంకరవిద్యాలయమునకొసంగబడిన ఆస్తి.

పింగళవత్సర మార్గశిర శుద్ధఏకాదశి ప్రభృతి పూర్ణిమవరకు శ్రీస్వామివారు జరిపిన శ్రీకర్తిజయంతులలో శ్రీశంకరవిద్యాలయ పోషణార్థమై పలువురు భక్తులు విద్యాభిమానులును విరాళములను వార్షికములను భక్తితో నొసంగిరి. గం॥ బ్రహ్మానందరామాబాయమ్మగారు రు 1176/-ల ద్రవ్య మిచ్చుటయేగాక య 2 లసుక్షేత్రమగు మాగాణిభూమిని తన పెంపుడు కుమారుడగు వెంకట లక్ష్మీనారాయణ రావుగారి పక్షమున దానము జేసి దానపత్రము వ్రాయించి యిచ్చెను. పైనను కుమారు డిప్పుడు పెద్దవాడై స్వతంత్రముగా వ్యవహరించుచు తల్లిగారియంగు భక్తి శ్రద్ధలు గల్గి శ్రీశంకర విద్యాలయమునకు రాజపోషకులలో నగ్రగణ్యులై పలు విధముల సాయము జేయుచున్నారు. వీరి యత్తగారు



శ్రీ. ప. ప. శ్రీబ్రహ్మానంద తీర్థస్వాముల వారు శ్రీశంకరభాష్యములు చెప్పుట.

గం॥ గండపరపు వెంకాయమ్మగారు 4 యకరముల మాగాణిభూమినొసంగి దానపత్రము వ్రాయించి యిచ్చినారు. మరిప్రూడి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ చెరువు శీతారామయ్యగారును వారి గోపాల శాస్త్రిగారలు చేరియొక అరయకరము మాగాణి మాన్యమును గం॥ భాలక్ష్మీ మహాలక్ష్మమ్మ గారొక యకరము మాగాణి భూమియును నరసారావుపేట వాస్తవ్యులగు చావలి వెంకటప్పయ్యశాస్త్రిగారరమారమి ఒక యకరం మాగాణి భూమియును దానమిచ్చిరి.



శ్రీ శంకర విద్యాలయ—ఉపాధ్యాయులు, విద్యార్థులు

ఇవ్విధమున శ్రీశంకర విద్యాలయమున కొసంగబడిన భూములును, రెండుభవనములును గీర్వాణ గ్రంథాలయము మున్నగు సమస్తాస్తి యొకపరిపాలనాసంఘమున కధీనము జేసిపరిపాలనా సౌష్టవము కొరకువలయు నిబంధనలతో కట్టుదిట్టముచేసి 1886 సంవత్సర 21 చట్టము ననుసరించి సంఘమును రిజష్టరు చేయించి నారు. పైనదెల్పిన భూపసతివల్లను తదితరవిరాళముల వల్లను యిటీవల య 4 ల మాగాని భూమిని పరిపాలక సంఘమువారు కొనియున్నారు. బాపట్ల వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ స్థానం అప్పారావుగారు బోడిపాలెం గ్రామములోని యొక యకరం మాగాని భూమియును కరవది గ్రామవాసులగు బ్రహ్మశ్రీ పిశుపాటి వెంకట రంగయ్యగారు పూండ్లగ్రామములోనియొక యకరము మాగాని భూమియును శంకర విద్యాలయ మునకొసంగిరి. ఈయాస్తివల్ల ప్రస్తుతధరల ననుసరించి వేయి రూప్యములు సంవత్సరాదాయమువచ్చుచున్నది.

## శ్రీ శంకర విద్యాలయ పరిపాలనా సంఘము

ఈసంఘమునందు విద్యాలయ ప్రతిష్ఠాపకులగు శ్రీ స్వామివారుగాక పదునేవురు సభ్యులుగలరు. ఈసంఘసభ్య పదవులలో ఖాళీలువచ్చినచో నీదిగువ కనపరచిన మండలినుండి పూర్తిజేయబడును. ప్రతిసంవత్సర మార్గశిర శుద్ధపూర్ణిమనాడు శ్రీదత్త జయంతిలో శంకరవిద్యాలయవార్షికసభజరుపబడును. ఆందుగతసంవత్సరాదాయ వ్యయములదెల్పు నివేదిక తయారుచేసి శ్రీశంకర విద్యాలయ స్థితిగతుల జేర్చి వార్షికనివేదికయచ్చువేయించి చదువబడును. ఈసంవత్సరమార్గశిర శుద్ధపూర్ణిమ కేడువర్షములు జరిగినవి. నివేదిక లచ్చువేయబడి చందాదారులకు బంచిపెట్టబడినవి.

## శ్రీ శంకర విద్యాలయ మండలి.

(1) పోషకమండలి :—పోషకమండలి రాజపోషకులు, ప్రధానపోషకులు పోషకులు చందాదారులు నని చతుర్విధములుగా నున్నారు. రు 500 లకు తగ్గని విరాళ మొకసారేగాని లేక రు 50 లకు తగ్గనివార్షికముగాని యిచ్చువారు రాజపోషకులు రు 200 లకు తగ్గనివిరాళముగాని లేక 30 లకుతగ్గని వార్షికముగాని యిచ్చువారు ప్రధానపోషకులు రు 80 లకు తగ్గని విరాళముగానిలేక రు 16 లకు తగ్గని వార్షికముగానియిచ్చువారు పోషకులు—రు 30 కు తగ్గని విరాళముగాని 8 తగ్గనివార్షికము గాని యొసంగువారు చందాదారులు. అంతకు తగ్గిన ధర్మమునిచ్చువారి పేర్లు శంకరవిద్యాలయ ధర్మచందాలపుస్తకములో మాత్రము చేర్పబడునుగాని వారభిమానమండలి సభ్యులుగాగణింపబడరు.

2. —: పండితమండలి. :—

పాండిత్యవిశేషము చేతను, బుద్ధిబలముచేతను, శాస్త్ర విషయికోపన్యాసముల చేతను, లేక యేయితర విధముగానైనను సహాయము చేయు పండితులను పండిత మండలిలో సభ్యులుగాఁ జేర్చుకొనవచ్చును. మత విషయక సాంప్రదాయములను, ఆచారవిషయములను విద్యావిషయములను పండిత మండలి వారి యభిప్రాయముల గౌరవించి యీసంఘమువారు సాధ్యమైనంత వర కనువర్తింతురు.

## ఉపాధ్యాయు లయిరువురు.

వీరికి మాసమునకొక యొనుబది రూప్యముల పారితోషికము మాత్రమే సంఘమువారివ్వ గలిగి యున్నారు. భూములనుండివచ్చు ఆదాయము రమారమిగా నుపాధ్యాయులకొసంగు పారితోషికములకు మాత్రమే సరిపోవుచున్నది. వేదము నేర్పుట కింకొక యుపాధ్యాయులు కావలసి యున్నారు. ధాన్యపుధరలు తగ్గుచో ప్రస్తుతమున్న యుపాధ్యాయుల పారితోషికమునకె భూములనుండి వచ్చు ఆదాయము చాలదు.

## విద్యాపద్ధతులు.

శంకరవిద్యాలయ పద్ధతు లితరచోట్ల పద్ధతుల కంటె విలక్షణములైయున్నవి. కేవలము సాహిత్యము శాస్త్రము మాత్రము పఠించుటకుగాని కేవలము వేదము స్మార్తము మాత్రమే పఠించుటకు గాని యిచ్చట వలనుపడదు. స్మార్తవిద్య లేనిచో బ్రాహ్మణ కర్మలొనర్పు నవకాశము లేకుండుటచే సామాన్య స్మార్త విద్యనుగూడ శాస్త్రవిద్యార్థులు విధిగా నేర్చుకొనవలయును. స్మార్త విద్యాప్రాధాన్యనముగల విద్యార్థులు సామాన్య సాహిత్య జ్ఞానము లేనిచో మంత్రార్థ ప్రయోగములు దెలిసికొను నవకాశము లేనందున స్మార్త విద్యతో సాహిత్య సమ్మేళనము శ్రీ స్వామివారు నిర్ణయించిరి. ఈ విద్యాలయములో వేద వేదాంత సాహిత్య తర్క వ్యాకరణములు నేర్పబడు చున్నవి. ద్రవ్యాభావము

చేత బూర్వ మీమాంసము జ్యోతిషము చెప్పఁబడుట లేదు. కేవల భాషా ప్రాధాన్య శాఖా పాఠశాల నేర్పరచుట యుచితమైనను ఆర్థిక స్థితి గతులను బట్టి యవకాశము గలుగుటలేదు.

## విద్యార్థులు.

శాస్త్రప్రధాన విద్యార్థుల సంఖ్య తగ్గుచున్నది. భోజన వసతిచేయనిచో నుత్తమ తరగతి విద్యార్థుల నిలుపుట యసాధ్యము. మధుకరముతో జీవించుచు సరిగా చదువుటకు వీలుపడదు. అది యుచితమును గాదు. మధుకర వృత్తి బ్రహ్మచారికి విధాయకమైనను తదర్థమై గడప పూజలు చేయుచు భోజనప్రయత్నమునకై కాల హరణముజేయుచు భోజనము దొరకునో దొరకదో యను పరితాపముతో నుండు విద్యార్థులు తాము సాధింపవలసిన కష్టతరమైన విద్యాభ్యాసంగమునం దత్యంత శ్రద్ధాళులైయుండుట కవకాశములేదు. అదియునుంగాక యుత్తమ తరగతి విద్యార్థులలో పలువురు వివాహితులై యుండువారుకలరు. ప్రస్తుతము శంకర విద్యాలయమున యిరువది మంది విద్యార్థు లున్నారు. అందునెక్కువ మంది స్మార్త ప్రాధాన్య విద్యార్థులు. వీరిలో కొందరికి మాత్రమే వారములు కలవు. తక్కినవారు మధుకరముతోనే జీవించుచున్నారు. అందుచే విద్యాభిమానులు మతాభి మానులునగు సహృదయులెల్ల తమ తమ శక్తికొలది శ్రీ శంకర విద్యాలయమునకు తోడ్పడనిచో విద్యార్థులకు భోజన వసతి యేర్పరచి మఱికొందరుపాధ్యాయుల నియమించుటకు సాధ్యము కాదు.

## సంఘ విజ్ఞాపన.

పరమపురుషార్థ సాధకములగు వేద వేదాంగాది విద్యలయందు ప్రాచీనార్య సాంప్రదాయక సుశిక్షణమే, ముఖ్యాశయముగా గలిగి అభ్యుదయ ఫలముగోరు ప్రవృత్తి మార్గ ప్రవర్తకులకు ధర్మ సూక్ష్మములను, కర్మరహస్యములను, నివృత్తిమార్గావలంబులకు వైరాగ్య రహస్యముల నుపదేశించుచు, మహాపురుషునిచే స్థాపింపబడిన శ్రీ శంకర విద్యాలయము నభివృద్ధిజేసి పోషించు భారము ఋషుల సంతతి వారమని యుప్పొంగు ప్రతిభారతీయు నందును కలదు. లౌకిక విద్యాపాఠశాలలకును, విశ్రాంతి మందిరములకును, నాటకశాలలకును ధనవ్యయము చేయగలిగి, సర్వానర్థముల తొలగింపగలిగి ఆత్మ జ్ఞానమును గలిగింప సాధనమైన వేద వేదాంగాది విద్యాప్రచారక పాఠశాలల యందుదాసీనులై యుండుటకంటె శోచనీయమగు విషయము వేరొండు లేదు. మతసంస్థాపనములే సమస్తసాంఘిక సంస్థలకును, సాంఘిక వ్యవస్థలకును మూలాధారములై యున్నవి. వర్ణాశ్రమ ధర్మముల నిల్పుటకై సనాతనాచారముల ననుసరించిసంఘసేవ చేయుటగూడ దేశశేవయేయగును. ఈశ్వర శేవయుగూడనగు ననుటలో సందియములేదు. ఇతర విధముల దేశశేవచేయు వారనేకు లున్నందున వారెల్లరిచేఁ జేయబడని యీదృశ దేశశేవ సేయుట వారి శేవకు విరోధముగాక జాతీయజీవనమునకు దోహదమై యిహపరసౌఖ్య దాయకమగుటచే భూస్వాములు భూదానములచేతను ధనవంతులు ధన సహాయము చేతను పండితులు విద్యాదానముచేతను శ్రీ శంకర విద్యాలయమునకు సహాయము జేయఁ బ్రార్థితులు.

# మహారాష్ట్రుల సాంఘికనీతి.

———:o:———

(ప. వెంకటసుబ్బారెడ్డిగారు)



మహారాష్ట్రులొకప్పుడు, పరిపూర్ణ స్వాతంత్ర్యమున నోలలలాడిరి. నవీన ప్రేరణమువలన జాతియంతయు మేల్కొనెను. జాతీయ జీవితాభివృద్ధికి భంగకరములగు వాని విషయమున పూర్వాచారమును విడనాడిరి. పతితులని దలంపబడువారిని తిరిగి స్వసంఘమున జేర్చుకొని జాతినిబలవత్తరముగ నొనర్చుకొనజొచ్చిరి. నేటికి పరమతముల స్వీకరించిన వారిని మనము పతితులని దలంపుచుండ ఆకాలమున పరమతముల స్వీకరించిన వారిని సాధారణముగ గాంచుచు, ఇష్టమున్నవారిని తిరిగి స్వసంఘమున జేరుటకవకాశ మొసంగుచుండిరి. ఇదియే యుత్తమమగు సాంఘికనీతి. ఇందువలననే మహారాష్ట్రులు భారత వర్షమందు చిరయశము సంపాదించుకొనగలిగిరి. మహారాష్ట్రుల విజయ దుందుభి దిగ్దిగంతముల ప్రతిధ్వనించునప్పుడు, మహమ్మదీయ మతమును స్వీకరించినవారిని తిరిగి హిందూసంఘమున జేర్చుకొనుచుండిరి. దీనికొకటి రెండు దృష్టాంతముల చూపించిన చాలును.

1644 సం॥ మాథోజీ నింబాల్కరు తోడ బీజాపూర్ సుల్తాను యుద్ధమొనర్చెను. ఆ యుద్ధమందు మాథోజీ హతుడాయెను. ఆతని పుత్రుడు బజాజీ నింబాల్కరు బంధింపబడెను. పిమ్మట సుల్తాను బజాజీకి ప్రాణదండనను విధించెను. సర్దారులు ప్రార్థింప సుల్తాను "మహమ్మదీయ మతమును గైకొనుము. నీకు జమీందారి నిచ్చెదను. లేదా? చావుతప్పదు" అనబజాజీ నింబాల్కరు ప్రథమమున నంగీకరింపకున్నను యోచించి చివరకు మహమ్మదీయ మతమును గైకొనెను. సుల్తాను సంతసించి పుత్రికనిచ్చి వివాహమొనర్చి కొన్ని జాగీరులను బహుమతిగ నొసంగెను. బజాజీ ప్రాణరక్షణకొరకు మహమ్మదీయ మతమును స్వీకరించెను. అందువలన మహమ్మదీయుడగుటవలన నాతడు శాంతచిత్తుడు కాలేకుండెను. స్వసంఘమున చేరవలయునను ఆకాంక్ష ప్రబలమగుటవలన తిరిగి స్వగ్రామమునకు వచ్చెను.

ఒకదినమున ఛత్రపతి శివాజీ మహారాజుతల్లి యగు జిజాబాయిని దర్శించి జరిగిన విషయమును వెల్లడించి తిరిగి స్వసంఘమున స్థానమిప్పింపవలయునని ప్రార్థించెను. బజాజీ రణనిపుణుడు. అట్టివారు పర మతమున జేరుటవలన స్వసంఘమునకు ముప్పు వాటిల్లునని తలచెను. అప్పుడు శివాజీ మహారాష్ట్రశక్తిని కేంద్రీకరింపు చుండెను. పర మతస్థులను

గూడ నిర్భయముగ స్వసంఘమున జేర్చుకొను శక్తి యప్పటి సందర్భముల ననుసరించి వీలు గాకున్నను పరమతమున జేరినవారిని తిరిగి స్వసంఘమున జేర్చుకొనజాలకుండుట మనో దుర్బలత్వము తప్ప మరి వేరు కారణము లేదనిజిజాబాయిగ్రహించి శిమలాపురమందలి శంభుమందిరమునకు మహారాష్ట్ర ప్రముఖులను రావించి వారికిట్లు చెప్పెను. "బజాజీ బుద్ధిపూర్వకముగ ఇస్లాంధర్మమును స్వీకరింపలేదు. ఆసందర్భమున మహమ్మదయ మతమున జేరి ప్రాణముల దక్కించుకొనవలసి వచ్చినది. అందువలన నీతడు దోషికాడు. కావున తిరిగి స్వసంఘమున జేర్చికొనుట కర్తవ్యమని దోచుచున్నది."

మహారాష్ట్ర సర్దారులీ విషయమును అంగీకరించి ప్రాయశ్చిత్త మొనర్చి బజాజీని తిరిగి మహారాష్ట్రులయందు జేర్చుకొనిరి. కాని యప్పటికిని జిజాబాయికియనుమానము తొలగక శివాజీ మహారాజు పుత్త్రికయగు సక్కుబాయిని బజాజీపుత్త్రుడగు మహాదాజికిచ్చి పరిణయ మొనర్చెను. వివాహానంతరము శివాజీయల్లునకు కొన్నిగ్రామములను జాగీరిచ్చెను. మరియు మహదాజీని మహారాష్ట్రులయందెవరును అగౌరవముగ జూడరాదని శాసించెను.

శాహుఛత్రపతి కాలమున గూడ ఇసలాంధర్మమునందు జేరినయొక మహారాష్ట్రుని తిరిగిస్వసంఘమున జేర్చుకొనిరి. దాబలజీయను మహారాష్ట్రసర్దారునకు సైన్యాధిపతి పూతాజీ. 1716 సం॥ పూతాజీ సూరతు పట్టణము నాక్రమించెను. అప్పుడు మొగలు లీతని బలవంతముగ మహమ్మదీయ మతమున జేర్చుకొనిరి. ఇట్లొక వత్సరము గడచెను. ఇట్లుండ పీష్వా బాలాజీవిశ్వనాథుడు సైన్యము తోడ ఢిల్లీకివచ్చెను. అప్పుడు పూతాజీ రహస్యముగ మహారాష్ట్రసైన్యముల బ్రవేశించి స్వగ్రామమునకు తిరిగివచ్చి బలవంతముగ తననుమహమ్మదీయులు ఇస్లాంధర్మమున దీక్షితునిగ జేసినవిషయమును వర్ణించి చెప్పితిరిగి స్వసంఘమున జేర్చుకొనవలయునని ప్రార్థించెను. అప్పుడు జింజి, హింగనీ, భావోదీ మొదలగు గ్రామ సభాపతులొకచో చేరి పూతాజీని సంఘమున జేర్చుకొనుటకు అంగీకార మొసగవలయునని ఛత్రపతి శాహునకు విన్నపమునువ్రాసి బంపించిరి. ఆవిషయమునంతయు గ్రహించి పూతాజీని స్వసంఘమున జేర్చుకొనుటకు ఛత్రపతి యంగీకరించెను. పూతాజీకి తిరిగి సంఘమందు స్థానము దొరకెను. దీనిని బట్టి యప్పటి మహారాష్ట్ర సంఘముయొక్క యుదారతయు, సాంఘిక నీతియు వెల్లడియగు చున్నదిగదా?



# ప్రణయమహిమ



(కె. రాఘవాచార్యులుగారు. యమ్. ఏ. బి. యల్.)



నిండు చందురు డుదయాద్రిపై దోచె. ఫుల్ల కుసుమిత శోభితమై మనోజ్ఞమై వసంత మలరారు చుండెను. రసాల పల్లవముల గమిచి మత్తిలిన కోయిలల పంచమ స్వరము మధుర ఫణితి వినవచ్చు చున్నది. మాలతీ మంటపమున సుఖాసీనుడై హేమంతుడు ప్రియ యగు లలితకుమారి ఫాలమున మంద మలయానిలముచే నిటు నటు దోగు ముంగురుల నెగదోయుచు నేమేమో ముచ్చటింప యత్నించు చుండెను. ఆతని మనం బానందాంబుధి నోలలాడు చుండెను. పాప మాతని గిల్గింతలకును, ప్రియ వాక్కులకును యామె వదనాబ్జమున చిన్న నవ్వును నటింప దయ్యె. శీత మయూఖ కిరణ ప్రసారిత రోదసీ కుహరము నందామె దృష్టులు లీన మగునట్లు దోచెను.

హేమంతు డామె కరపల్లవంబుల నిముకొని "రమణీ" యీరాత్రి యెంత రమ్యముగా నున్నదో చూచితివా యని యడిగెను. లలితకుమారియు నొకింతసేపు భర్తనుజూచి "సూర్యకిరణములు నంధకారము విరియునటుల నీ రామణీయకతను గను మొఱగిన యంతలో దగ్ధముచేయు మంత్రముల నెఱుంగుదేని వచింపు" మని చిరునవ్వు నవ్వుచు ననియెను.

లలిత "నాథా! యెన్ని దినముల నుండియో రహస్య మొకటి తమకు విన్నవింప యత్నించుచు ధైర్యము లేమి చెప్ప నయితి. నేడది చెప్పుచున్నాను. తమరు విధించు శిక్షకు పాత్రురాల" నని దీనస్వరముతో బలుకుచుండ, దూరమున నుండి క్రోధఘూర్ణిత మానసుడై రక్తాక్షుడై త్వరితగతి నరుదెంచు హరిహర మఖోపాధ్యాయుల పాదుకల చప్పుడు విననయ్యెను. హేమంతు డతి భయాకులిత హృదయుడై సాలోచనుడయ్యె. "హేమంతా! నీ భార్యను తత్‌క్షణంబ వెడల నడుపు" మను వాక్యములు కర్ణకఠోరములై హృదయ పుటభేదనం బానర్చుచుండ, లలితకుమారిని గనొని యామె భావమును గ్రహింప నేరక, హేమంతుడు తండ్రియొద్దకు జనియెను.

మందభాగ్యయగు నా లలితయు ముఖమును హస్తములతో గప్పుకొని దీర్ఘనిశ్వాసముల విడుచుచు విచారింపు చుండెను.

విస్పష్టముగ, మనోహరముగ, కోకిలారావము లెల్లెడల నెలంగు చుండెను. వివర్ణ వదనాబ్జయై, దీర్ఘాలోచన ఆతురయైన లలిత కాగానము వినవచ్చుటలేదు. ఆహా! యేమి యీ సృష్టివిచిత్రము ఆనంద దాయకమై సర్వశుభలక్షణ సంశోభితం బయ్యు నొక్క-

త్రుటికాలములో నెన్ని మార్పులఁ బొందుచున్నది. ఇదియే క్షణభంగోపలక్షిత మగు ప్రకృతీ విలసనము.

హేమంతుఁడు లోనికివచ్చి లలితా నిజమేనా? యింతవఱకేల జెప్పవయితివని యడుగ ధైర్యము లేక జెప్పనైతి. నే నదృష్టహీనురాలనని యామె ప్రత్యుత్తర మొసంగెను. లలిత తన వృత్తాంతమంతయు బూస గ్రుచ్చినయట్లు వచింప దొడగెను. అంతయును విని మాఱుమాటాడక హేమంతుఁ డవలికి జనియెను.

తనభర్త తిరుగ దనయొద్దకు రాడని లలిత తలంచెను. ప్రస్తుత మామెకది వింతయై కన్పట్టలేదు. ఆమె కప్పుడు ప్రపంచమును, ప్రణయంబును మిథ్యయైతోచెను. భర్తతో ననురక్తి కలసిమెలసి వర్తించిన దినముల దలచినకొలది గుండెలు జల్లుమన సాగెను. సంసార సాగరమునందలి యానంద వీచికల నోలలాడు నావయై ఆదిమధ్యాంత రహితమైన ప్రేమ మెంత శీఘ్రకాలములో భగ్న మవుచున్నది! హేమంతు డప్పుడే కదా యామెతో నేమేమో ముచ్చటింపుచుండెను. రాత్రి యింకను ముగియలేదు. కోయిల లింకను గాన మొనర్చుచున్నవి. మలయమారుతము వీచుచునే యున్నది. పిండి యారబోసిన యట్లు వెన్నెల కాయుచున్నది. ఇది యంతయు మిథ్యయేనా!

రాత్రి జాగరణముచేగను లుదయారుణిమ ధరింప నున్మత్తునివలె హేమంతుఁడు ప్రాతఃకాలమున శంకరు గృహంబున కరిగెను. కుమారా, యేలవచ్చితివని శంకరుఁ డడుగ హేమంతు డగ్నిశిఖవలె ప్రజ్వరిల్లుచు 'శంకరుడా! వర్ణాశ్రమ ధర్మమును జెఱచితివి కులనాశన మొనరించితివి. ఇంతకు ననుభవింతువులే' యని క్రోధముతో బల్కెను.

శంకరుఁడును చిరునవ్వు నవ్వుచు 'నీవో నాకులము నుద్ధరించి నన్ను గాపాడితివి గాబోలు, నన 'నీకెన్నఁడయిన నపకారము జేసినదెల్పు' మని హేమంతుఁడు గద్గద స్వరముతో నాతని నడిగెను.

పుత్రా! వినుమని శంకరుఁడు గంభీర స్వరముతో చెప్పసాగెను.

'నాకుమారి నీతండ్రి కేమి యపకారము జేసెను? నీవప్పటికి బాలుడవు గాన నీవది యేమియు నెరుగవు. పెక్కు వత్సరముల క్రిందట నాయల్లుఁడు చంద్రకాంతుఁడు భార్యావస్తువుల నపహరించి సీమకుం జని బారిష్టరుపరీక్షయందు తీర్ణుడై తిరుగ నింటికరుదెంచెను. అపుడూరియందల్లరులు పుట్టసాగెను. నీతండ్రి కులపెద్దనని వచింపుచు నాకుమార్తె నల్లుని యింటికంపినచోనే నామెను వదలుకొనవలసినదే యనియాజ్ఞాపించెను. నాకా పుత్రిక యొక్కతెయే యగుటచే నేనాతని దీనోక్తుల బ్రార్థించితిని. ప్రాయశ్చిత్తము జేసినను పనికిరాదని నీతండ్రిగట్టిపట్టుపట్టెను. ప్రార్థనలచే నాతని మనసాకించుకయు గరుగ దయ్యె. అప్పుడు నేనీ గ్రామమువిడిచి కాళీఘట్టమును జేరితిని గాని యచ్చటను నాకష్టము లంతరించినవి గావు. నామేనల్లుని వివాహమును నీతండ్రి కలుగిజేసికొని చెడగొట్టివైచెను. 'కుమారా! యీసరికి నీకీవింత కథకొంతవరకు బోధపడియుండును.

నీవుకలకత్తాలో నున్నపుడు లలితయందనురాగ యుక్తుడవయితివి. లలితకు దలి

దండ్రిలు లేకపోవుటచే విప్రదాసుని యింట బెరుగుచుండెను. మాయన్యోన్యానురాగ మునుగన్గొని వివాహముస్థిరపరచితిని. ప్రథమమున లలిత యందుల కంగీకరింపలేదు. కానియెట్టకేల కామెనతికష్టమున నొడబరచి కార్యభారమును దీర్చికొంటిని. లలిత శూద్రకులజ. వితంతువు.

'అది యిప్పుడేల తెలియబఱచి పాపమున కొడిగట్టితి'వని హేమంతుడు క్రోధమూర్తియై ప్రశ్నింప, 'నీకులమును జెఱుపవలయునని ప్రతిన యొనర్చితిని. నిసోదరికి వివాహము కానున్నదని విని బ్రాహ్మణకులము మాబాంధవ్యముచే జెడకుండుటకై యీతరుణమున రహస్యము వెలిబుచ్చితి'నని యాతడుత్తర మొసగెను.

'లలితను త్యజించిన యెడలనీవామె కన్నవస్త్రముల నొసగి పోషింతువా యేమి?' యని హేమంతుడనెను.

త్యజింపబడిన యితరుల భార్యల బోషించుట నావృత్తి కాదు— సేవకా! హేమంతబాబునకు దములపాకుల నొసంగుమని శంకరుడు కేకవైచెను.

సేవకుడు వచ్చునంతలో క్రోధారుణిత నేత్రుడై తత్క్షణంబ హేమంతు డింటికిం జనియె.

రాత్రినిశ్శబ్దమై తమోఘూరితమై యుండెను. పక్షులకలకలము వినవచ్చుట లేదు. దక్షిణానిలము నిశాచరునివలె చరించుచుండెను. నక్షత్రములంబరవీథి మినుకు మినుకు మనుచుండెను. హేమంతుని శయ్యాగృహమునందు దీపమార్పబడియున్నది. గవాక్షమును దెరచి హేమంతుడేదియో యాలోచింపుచు ప్రక్కపై కూర్చుండెను. లలిత యాతని పాదములపై తనముఖము నునిచి భూమిమీద బరుండియుండెను.

పాదుకలచప్పుడు తిరుగవినవచ్చెను. హరిహరముఖోపాధ్యాయులు ద్వారమువద్ద నిలుచుండి, హేమంతా! గడువతిక్రమించినది. తక్షణము లలితను వెడలగొట్టుమని కేకవైచెను. ఆమాటలు విన్నతోడనే లలిత భర్తపాదంబుల కతిభక్తి నమస్కరించి, కడసారి కౌగిలించికొని ముద్దిడి దూరమున నిశ్చేష్టయై నిలువబడియెను.

హేమంతుడు ద్వారమునొద్దకు జని 'తండ్రీ! లలితను విడువజాల' ననియెను. 'ఏమీ' కులభ్రష్టుడ వయ్యెదవా? అట్లయిన నిన్నుగూడ త్యజించితి, నని పల్కుచు ప్రళయకాలానలము వలెమండిపడుచు హరిహరుడదృశ్యుడాయెను.

ఆహా! ప్రణయ మహిమ!!!



# నన్నయకు పూర్వము పద్యములు గలవా!

———:0:———

(చిలుకూరి నారాయణరావుగారు)



'శారద' డిసెంబరు సంచికలో బ్రహ్మయ్య శాస్త్రిలుగారు లక్ష్మణరావుగారి వ్రాతను ఖండించు చు పై శీర్షిక క్రింద నొకఖండనమును వ్రాసిరి. అందు (1) లక్ష్మణరావుగారు, వీరేశలింగముగారి పక్షము వారు, పక్షపాతముతో విపరీత సిద్ధాంతములనుచేసిరి, అనియు (2) ప్రస్తుత విషయమగు నన్నయకు పూర్వము పద్యములు కలవు. అని చెప్పుటలో పొరపడి రనియు, రెండాక్షేపణలు కనఁబడుచున్నవి.

మొదటి ఆక్షేపణకు సమాధానము చెప్పుట కష్టము. "మాకు పక్షపాతములేదు. సత్యాన్వేష ణమే మాకు ముఖ్యము. ఊహలతో మాకు పనిలేదు. ఎదురుగా కనఁబడు విషయములే మాకాధారములు" అని లక్ష్మణరావుగారు పలుసార్లు చెప్పియుండిరి. వారి వ్రాతలును నట్లే పలువురకు గోచరించినవి. మా బోటి వారికి శాస్త్రిలవారి వ్రాతలే పక్షపాతములుగా కాన్పించినవి. గనుక, ఒకరినొకరుపక్షపాతులనియు ఆవేశము కలవారనియు నిందించుకొనుటవలన లాభ ములేదు. ఇంక రెండవ యాక్షేపణను విచారించ వలెను.

శాస్త్రిలవారి వాదపద్ధతినిగూర్చి లక్ష్మణరావు గారు ఒక్క ప్రాస చంపకమాలా వృత్తమును మాత్ర ముదాహరించి యూరకొనలేదు. ఆయొక్క వృత్తమునుబట్టియే వారు తమ పక్షమును సమర్థింప నెంచిన యెడల వారివాదము దుర్బలమైయే యుం డును. వారా వృత్తమును తమ వాదమునకు ప్రధా నాధారముగా నైనను చూపి యుండలేదు. దానిని వారు ఉప బలముగా మాత్రము స్వీకరించియుండిరి. దానిని పడగొట్టుటకే శాస్త్రిలవారి ప్రయత్నము. వారి వాదము నందెంత బలమున్నదో తొలుత కను గొందము.

(1) "సంస్కృతమున చంపకమాలకు ప్రాచుర్యముకలదు. ఇందుకు సాక్షులు హేమాద్రీశ్వర పండితుఁడు, ఒక నిఘంటు కారుఁడు, ఆప్తే. ధీర్ఘ సంస్కృత వృత్తములలో చంపకమాల ప్రధాన మైనదనిరి. అందుచేత దానికి సంస్కృతమున ప్రాచుర్యము కలదు." ఇచ్చట ప్రశ్న— గ్రంథము లేమని చెప్పుచున్నవి? వానియందు చంపకమాలా వృత్తము ధారాళముగా కనఁబడుచున్నదా? — అని తమ వాదమున్న యెడల నేఁ జాలని పండితులకుతప్ప సంస్కృత వాఙ్మయమును పరిశీలించినవారికి చంపక మాల విశేష ప్రచారము గల్లదిగా కన్పట్టఁజాలదు.

(2) "సంస్కృతము లోని చంపకమాలల కుదాహరణముల నిచ్చుచున్నాము. ఇవి ప్రాచీన ములే. మాఘములోకూడ నుదాహరణములు కలవు." ప్రశ్న— ఇవి యెక్కడివి? ఎంతటి ప్రాచీనములు? కేవలము ప్రాచీనములని నంతమాత్ర మున లాభములేదు. గుణగ విజయాదిత్యునికి పూర్వపు సంస్కృత కావ్యముల నుండి శాస్త్రిలవా రుదా హరణముల నీయఁగలరా? మాఘకవి మనకు ప్రాచీ నుఁడు. కాని ఆకాలమునకు ప్రాచీనుడు కాడని చరిత్రవలన తెలియనగును. శిశుపాలవధలో చంపక మాల లెన్నియున్నవి? ఒక్కసర్గలో మాత్రమే

అజంటా యందలి యొక్క చిత్తరువు.



బుద్ధభగవాను డుపదేశము చేయుచున్నాడు.

కాదా మాఘుడు వివిధ వృత్తముల నుపయోగించి యుండుట? అందు చంపకమాల నుపయోగించెను. గాని అంతమాత్రమున దానికి విశేష ప్రచారమున్న దని చెప్ప వీలులేదు.

(3) "సంస్కృతమునఁగూడ ప్రాసము కలదు" కాని, అది ఆంధ్ర కర్ణాటాది భాషలకు విశిష్టమైన ప్రాసయేనా? అది కేవలము అలంకారముకొరకువాడఁబడిన అనుప్రాస ప్రాయముకాదా? శాస్త్రిలవారు చూపిన యుదాహరణము లన్నియు అను ప్రాసమునకుగాని లక్ష్మణరావుగారు చూపినట్టి ప్రాసమునకు కావు. వారు శాసనమునుండి యెత్తి చూపిన చంపకమాలయందలి ప్రాస అను ప్రాసము కొఱకు గాక ఆంధ్రాదిభాషా సంప్రదాయము ననుసరించినదని తద్జ్ఞులకు గోచరింపకపోదు. శాస్త్రిలవారు సంస్కృతమున యతియు ప్రాసయతియు యతి ప్రాసలును గల శ్లోకములుగూడ నున్నవని చూప నుదాహరించిన శ్లోకములును కేవల శబ్దాలంకార విశిష్టములే.

(4) "నన్నయ్య, మల్లన, తిక్కన, విన్నకోట పెద్దన్నలు తమ గ్రంథముల మొదట వ్రాసిన శ్లోకములందు ప్రాసలేదే. అంతకుపూర్వపుశాసనమునందలి చంపకమాలలోని ప్రాసమునుజూచి, తెనుగునుండిసంస్కృత కవులు ప్రాసమును వాడుచుండిరని చెప్పుటయెట్లు?" సమాధానములక్ష్మణరావుగారట్లు చెప్పుటలేదు. ఒకశాసనములో సంస్కృతభాషయందు ప్రాసయుక్తమగు చంపకమాలా వృత్తమున్న ఆప్రాసము ఆంధ్రకర్నాటసంప్రదాయము ననుసరించి యున్నది. ఆకాలమునందు తెనుగు కవులను జూచి సంస్కృతకవులును ప్రాసము నుపయోగించియుందురు, అని మాత్రము వారిభావము. తక్కినసంస్కృతకవుల మాట యెట్లున్నను, లక్ష్మణరావుగారు చూపిన వృత్తమును రచియించినకవి ఆంధ్ర కర్నాట సంప్రదాయము ననుసరించి యుండెనని చెప్పకతప్పదు అంతమాత్రముచేత తక్కిన సంస్కృతకవులును నామార్గము ననుసరించి యుండిరని గాని అనుసరించి యుండవలెనని గాని లక్ష్మణరావుగారు చెప్పినట్లూహింప వీలులేదు.

(5) శాస్త్రిలవారు వ్రాసిన అప్రస్తుతాంశము గూర్చి యొక్కమాట. శుక్రునకు కవియను పేరున్న దని లక్ష్మణరావుగారనిరి. 'కవి' యనిన పండితుడు విద్వాంసుడు అనియే యర్థముకాని, కావ్యకర్తయని కాదని శాస్త్రిలవారు. వీరికి సాక్షులు ఆపట్టుదొరగారు. ఆదొరగారైనను శుక్రనీతిసారమును గూర్చి ముచ్చటించిరిగాని శుక్ర నీతినిగూర్చికాదే. రామాయణమునకు పూర్వము కవులులేరని శాస్త్రులవారి యాశయము. కాబట్టివారు దానిగూర్చి యింతగాముచ్చటించిరేగాని మరియొకటిగాదు. శుక్రుడు కవియాకాదా యను వివాదము వ్యర్థము. లక్ష్మణరావుగారు చెప్పినది యొక వాగ్విశేషము కాని వేరుకాదని గ్రహింపనగును.

ఇంతవరకును లక్ష్మణరావుగారు చెప్పినదేమి! నన్నయకు పూర్వము తెనుగు పద్యములున్నవని గదా దానికి వారు చూపిన ప్రధానాధారములు నన్నయకు పూర్వముండిన శాసనములలోని తెనుగుపద్యములు గదా! అందుచేత లక్ష్మణరావుగారి వాదమును పడగొట్టుటకు (1) అశాసనములో అపద్యములులేవనిగాని (2) అశాసనములు నన్నయకు పూర్వమందలివి కావని గాని సిద్ధాంతము చేయవలసియున్నది. అట్లుచేయక పట్టుదలకొరకు అముఖ్య విషయములను చర్చించుట వలన లాభముండదు.

## నన్నయకు పూర్వము పద్యములుగలవా?

శాస్త్రిలుగారు తుదకు అనుకున్నంతమాటయు అనివేసినారు. రామయ్య పంతులుగారు ప్రకటించిన యుద్ధమల్లుని శాసనము నన్నయకు తరువాతిది, లక్ష్మణరావుగారు చూపిన సీసపద్యమును, తరువోజయు పద్యములుకావు, అని వీరు చూపఁ ప్రయత్నించిరి. ఈవాదమునకు ఇంతకు పూర్వమే సమాధానములు చెప్పఁబడినవి. ప్రస్తుతవ్యాసమున కుత్తరముగా కొంచెము చెప్పవలసియున్నది. మొదట

శాస్త్రులవారి యాక్షేపణను, తరువాత దానికి సమాధానమును వరుసగ వ్రాయుచున్నాను.

## యుద్ధమల్ల శాసనము

శాస్త్రులవారు రామయ్య పంతులుగారు వ్రాసిన దానిని బాగుగ చదివినట్లు కనబడదు. రామయ్య పంతులుగారు "శాసనమెప్పుడు పుట్టినదియు నిర్ణయించుటకు ముఖ్యాధారములు రెండు కలవు. అక్షరముల పోలిక యొకటి. శాసనమునందు పేర్కొనబడిన యుద్ధమల్లు లెవ్వరైనదియు నిరూపించుట యొకటి. ముందుగా నీయుద్ధమల్లు లెవ్వరో చూతము. మొదటి శాసనములోని యుద్ధమల్లుడు చళుక్యరాజని (రాజసల్కి భూవల్లభుండు) చెప్పబడినది. చళుక్యరాజైనయెడల బూర్వ చాళుక్య రాజవంశములోని వాడు కావలయును. ఈ వంశములో నిద్దరు యుద్ధమల్లులున్నట్లు పూర్వశాసనములవలన గన్పట్టుచున్నది. 766 శక సంవత్సరము మొదలు 810 వ సంవత్సరము వఱకు రాజ్యముచేసిన గుణగవిజయాదిత్యుని తమ్ముడగు యుద్ధమల్లుడొకడు కలడు. ఈతనికొడుకు తాడరాజు. ఈతాడరాజు కొడుకు యుద్ధమల్లుడు. చాళుక్యవంశములో తాత మనుమలిద్దఱు యుద్ధమల్లులు వీరగపడుచున్నారు. వీరే శాసనములో జెప్పబడిన యుద్ధమల్లులని నామతము" అని చెప్పి కొన్ని యాక్షేపణలను కల్పించికొని "కావున మొదటి శాసనము ప్రథమయుద్ధమల్లుని కాలమునందును (గుణగవిజయాదిత్యునితమ్ముడు) రెండవది (అతనిమనుమడగు) ద్వితీయ యుద్ధమల్లుని కాలమునందును బుట్టియుండు ననుటయే సిద్ధాంతముగా గనబడుచున్నది." అని వ్రాసిరి. ఇట్లుండగా శాస్త్రులవారు రామయ్య పంతులుగారు చేసికొనిన ఆశంకయే వారి సిద్ధాంతమయినట్లుగా సెలవిచ్చి యేమేమో పెంచివ్రాసిరి. యుద్ధమల్లునికి మల్లపరాజను పేరుండుట కాధారమేమి? అని వీరి ప్రశ్న. దీనికి సమాధానము శాసనమునందే యున్నది. యుద్ధమల్లుడు, మల్లడు, మల్లపరాజు అను పేళ్ళు సమానార్థకములుగా ఏక పురుష వాచకములుగానందే వాడబడియున్నవి. శాసనములు రెండని రామయ్యపంతులుగారు శంకించినది తప్పనియు నొక్కడు (మనుమడైనయుద్ధమల్లుడు) వ్రాయించినదేయనియు లక్ష్మణరావుగారు చెప్పిరిగాని శాస్త్రులుగారుచెప్పినట్లు గుడికట్టించినవాడును మొగమాడువు కట్టించిన వాడును నొక్కడే యని వ్రాయలేదు. న్యాయముగ జూచిన యెడల శాసనము చెక్కించిన వాడొక్కడేయని తెలియకపోదు.

సల్కి శబ్దము చాళుక్య శబ్దభవముగునని శాస్త్రులవారే యొప్పుకొనిరి. కాని, 'రాజసల్కి భూవల్లభుండు' అను సమాసమునకు తప్పు పట్టిరి. సల్కియనునది రూఢిపదమనియు, తరువాతి కాలమునందుండి చాళుక్యశబ్దమును పుట్టించిరనియు అంగీకరించినచో ఈయాక్షేప ముండియుండకపోవచ్చును, 'సల్కి' పూర్వరూపము కాదను భ్రమకు లోనగుటచేతనే శాస్త్రులవారింకను పెనగులాడుచున్నారు. (యుద్ధమల్లుడనునది బిరుదమై 'రాజసల్కి' యనునది పేరైయుండునని యూహించి, ఆయూహ సరికాకపోవుటచే, యుద్ధమల్లుడు అనునది బిరుదనామమే యని నిర్ణయించుట వింతగ దోపకపోదు.

చాళుక్యుల ఇతరశాసనములలోని బిరుదములకును ఈశాసనములోని బిరుదములకును సరిపోలేదట. కాని మఱియే రెండు చాళుక్యశాసనములలోని బిరుదములైనను సరిగ సరిపోవుచున్నవాయని యడుగవలసియున్నది. ఒక శాసనమునందలి దానికిని మఱియొక దానికిని భేదము కాన్పించుచునేయున్నదే శాస్త్రులవారికిచ్చిన పండ్రెండు బిరుదములును వేర్వేరు శాసనములలోని గుత్తడముకాని మఱియొకటికాదు. ప్రస్తుత యుద్ధమల్లుని శాసనములోని బిరుదములను పైవానికి కలిపి యవియన్నియును చాళుక్యుల బిరుదములనుటయే యుచితము. శాసనములో చాళుక్య శబ్దమునకు ప్రకృతియైన సల్కిశబ్దము ప్రయోగింపబడినది. చాళుక్యులలోనివారగు నిద్దఱు యుద్ధమల్లులుదాహరింపబడి యున్నారు. అట్టియెడ నీశాసనములోని బిరుదములను చాళుక్యులవేయని యొప్పుకొనక తప్పదు.

“చేబ్రోలులోని విగ్రహమునె యుద్ధమల్లుడు బెజవాడలో బ్రతిష్ఠించెననియు చేబ్రోలునివాసులు దానిని మఱికొంతకాలమునకు దిరిగి తమ గ్రామమునకు గొనిపోయిరనియు జెప్పవచ్చును. లేదా యుద్ధమల్లుడు ప్రతిష్ఠించినది నూతన విగ్రహమనియు దాని యందు జనులకు భక్తి హెచ్చుటకై సుప్రసిద్ధమైన చేబ్రోలుదేవుని సత్వమే యీనూతన విగ్రహమందు బ్రవేశించెనని చెప్పుటయే శాసనోద్దేశమనియు జెప్పవచ్చును. ఇదియే సత్యమని తోచుచున్నది. “తిరుపతి వేంకటేశ్వరస్వామిని బట్టి యనేకులు వేంకటేశ్వరులు దేశమందు వెలసినారు” అని రామయ్య పంతులు గారు వ్రాయగా రెండవభాగమును చల్లగవిడిచి పెట్టి మన శాస్త్రులవారు శాసనమునందలి విషయముంబట్టిచూడ చేబ్రోలను గ్రామమునందలి కుమారస్వామి బెజవాడ రాగా నచట నీశాసనస్థభూవల్లభుండు గుడి కట్టించెననియు ననగా చేబ్రోలునందలి కుమారస్వామ్యాలయము పడిపోయి యందలి కుమారస్వామి విగ్రహము పూజా పురస్కారములు లేక పడియుండగా దానిని శాసనము చేయించిన యాతడు బెజవాడ తీసుకుని వచ్చి యిచ్చట గుడి కట్టించి యందు స్థాపించెనని భావమనియు శ్రీజయంతి రామయ్య పంతులు గారు వ్రాసినదానివల్ల తెలియవచ్చుచున్నది” అని వ్రాసిరి.

శాసనస్థ రాజ మతము వీరశైవమనియు, ఈవీరశైవము రామానుజునితరువాతిదనియు, చాళుక్యులు వైష్ణవులనియు అందుచేత చాళుక్యరాజు వీరశైవులకు మతము కట్టించి యుండడనియు, శాస్త్రులవారి మతము. శైవము రామానుజుని తరువాతి దనుటకు శాస్త్రులవారి కాధారమేమో? నన్నయకు పూర్వపువాడగు కర్నాటక నాగవర్మ శైవ బ్రాహ్మణుడు. తరువాతిచళుక్యరాజులు వైష్ణవులయిన యెడల నీయుద్ధమల్లుడు శైవుడనుటకు వారికేమి యాక్షేపమో? రాజు వైష్ణవుడైనను శైవులకు మఠము కట్టించ కూడదను వీరి నిషేధ మెందుకో కొందరు పూర్వరాజులు మతద్వేషము కలిగి పరిపాలించక అన్ని మతముల యెడలను సమానాదరము కలిగియుండిరి. యుద్ధమల్లుడట్టి వాడని చెప్పిన నేమి దోషము?

శాసన క్రమమును గూర్చి దీనియందు తరువాతి చాళుక్యుల గోత్రాదులు వివరింపబడలేదని యాక్షేపము. తప్పక యుండవలెనను నియమ మెక్కడనున్నదో! గోత్రాదికములు వివరింపబడిన చాళుక్య శాసనములు సంస్కృతమునందున్నవి. ఈశాసనము తెలుగునందున్నది. గోత్రాదికము సంస్కృతమున గద్యములో చెప్పబడి యున్నది. ఈశాసనము పద్యమయము. పద్యములో గోత్రాదిక మిముడనప్పుడు దానిని వదలిపెట్టుట యుచితము కానేరదు. ఇక కార్తికేయాలయముం గూర్చి యింతకు పూర్వమే ముచ్చటించి యుంటిమి. ‘వారి కాసినచ్చువారు, ‘గంగకరుసె, అను మాటలు క్రీ॥ శ॥ 11—వ శతాబ్దమునుండియు వచ్చుచున్న పదములని సోమశేఖరశర్మగారన్నారట. అవి ఈశాసనములో నున్నవి గనుక ఈ శాసనము తరువాతిదేనట. సోమశేఖర శర్మగారు బెజవాడ యుద్ధమల్లుని శాసనము నన్నయకు పూర్వపు దన్న వాదమునకు చేరినవారు. ఈ సంగతి వారి వ్యాసమువలననే తెలియగలదు. అందుచేత పైపదములు నన్నయకు పూర్వము కూడ నున్నవనియో వ్రాయవలెనని శర్మగారి నాక్షేపింపవలసియుండగా, వారన్న యీమాటను పట్టుకొని తమవాదమునకు సరిపోయినదిగదాయని యుదాహరించి యుండగూడదు. ఇతరులెవ్వరో యితర విషయములగూర్చి భ్రమపడిరని ప్రస్తుతశాసనము విషయమున గూడ భ్రమ కవకాశము వలదని చెప్పుట తగదు.

(1) యుద్ధమల్ల శాసనలిపియు, నందంపూడి శాసనలిపియు నొక్కతీరుగా నున్నవి. ప్రత్యుత్తరము. లేవు వేర్వేరుగానున్నవి. శాసనములం జూచిన దెలియగలదు.

(2) రాజరాజనరేంద్రుని తరువాతకూడ వ్రాతకత్తె నిలిచియుండుట సంభవము కానేరదు. ప్రత్యుత్తరము. రాజరాజు కాలమునకే కత్తుమారినది.

తరువాత నది నిలచియుండుట యసంభవము. సంభవమే యని చెప్పుటకు శాస్త్రిలవారొక్క శాసనమును తరువాత దానిని చూపవలసియుండును.

(3) రెండమృత గుళికలు: (i) ‘టి’ కారము. ఈయక్షరమును లక్ష్మణరావుగారు పరిషత్పత్త్రికలో వ్రాయుటకు పూర్వము ‘డ’ కారముగనే శాసన లిపిజ్ఞులు చదువుచుండిరి. కాని, ‘టి’ కారమును ‘డ’ కారము రెండక్షరములును శాసనములందగపడుచునేయున్నవి. రెండువేఱక్షరము లుండుటవలననారెండింటికిని వేర్వేరుగ నుచ్చారణ యుండియుండవలెను. యుద్ధమల్ల శాసనములో నట్టి యుచ్చారణ భేదముండెనని లక్ష్మణరావుగారి తలంపు. భేదము లేదని చెప్పుట కెవరి కధికారమున్నది. * అన్నిచోట్లను ‘టి’ ను చదివి, ‘బెడగు’ అనుదానిలోని ‘డ’ కారమును, ‘టి’ గా నెందుకు చదువలేదని శాస్త్రిలవా రాక్షేపించి, విస్తరించి వ్రాసిరి. శాస్త్రిలవారు సెలవిచ్చినట్లు శాసనములో ‘బెడగు’లో ‘డ’ యున్నదిగాని ‘టి’ లేదు. శాసనము చూడక వ్రాసిన శాస్త్రిలవారి నెవరేమనగలరు?

(ii) శాసనశిల: వీరుచూపిన శాసన శిలాక్రమము తాముకల్పించినది. అసలుశిలనుచూడకవ్రాసినది. ఈ కల్పితశిలపై యుద్ధమల్ల శాసనము నాలుగుప్రక్కలను వ్రాయబడియున్నది. కాని, రామయ్యపంతులుగారు శిలను స్వయముగా చూచి యేమివ్రాసిరో చూడుడు “ఇటీవల నేను శాసనస్తంభమును బ్రత్యక్షముగాఁ జూచినాడను. శాసనము స్తంభముయొక్క యెదుటి ప్రక్కను ఎడమప్రక్కను, కుడిప్రక్కను గొంత వరకును జెక్కబడియున్నది.” అనగా శాసనము మూడుప్రక్కలనే యున్నదిగాని? నాలుగుప్రక్కల లేదు. నేనును శాసన స్తంభమును చూచితిని. మూడుప్రక్కలనే కనఁబడినది.

(4) రెండు బట్టీలసారము:— లక్ష్మణరావుగారు బట్టీలుపెట్టి సారము దింపలేదు. వేణుగోపాలశెట్టి, బటర్వర్తుగార్లు నిపుణులేయైనను, సీస పద్యమున్న శాసనమును సరిగ చదువజాలకపోయిరి. లక్ష్మణరావుగారా శాసనమును తిరిగి సరిగా చదివికొనిరి. అందు సీసపద్యము కనబడుచున్నది. అసంపూర్ణమైన నగుగాక అది సీసపద్యము కాదనుటకు వీలులేదు. నెల్లూరు శాసనములలోని యీశాసనపు ప్రతిని నేనును చూచితిని. లక్ష్మణరావుగారు చదివినదే సరియైన సారము. అందుచేత ఈ విషయమై శాస్త్రిలవారు వ్రాసినదంతయు కేవల భ్రమగాని వేరుకాదు. ఇక నన్నయ్యభట్టు సీసపద్యములోని యతిప్రాసనియమము లిందులో లేవట. అందుచేత నది నన్నయ్యకు తరువాతిదట కాని తత్త్వమునాలోచింపగా నీసీసపద్యనియమము లొక్క నన్నయయందే కాన్పించునుగాని, అంతకు పూర్వముగాని, తరువాతగాని కాన్పించవు. దీర్ఘాసి శాసనములో నొక సీసపద్యమున్నది. అది నన్నయ కాలము నాటిది. దానిలో నన్నయ నియమములు లేవు.

(5) సీసపద్యమును, తరువోజయు గల గుణగవిజయాదిత్యుని గూర్చిన శాసనము లారాజును సంబంధించినవి కావనియు, అతడు చనిపోయిన తరువాత నెవ్వరో వాని నాతని పేర వ్రాయించి యుందురనియు శాస్త్రిలుగారు వ్రాసిరి. శాసన మసంపూర్ణముగ నుండుటచేత నిట్టి సందేహమున కవకాశము లేకపోలేదు. అట్లాతని యనంతరమే యవి పుట్టి యుండునని యొప్పుకొన్నను, నన్నయ్యకు తరువాతి వని చెప్పుట యొప్పదు. గుణగవిజయాదిత్యునికిని నన్నయ్యకును సుమారు రెండువందల యేండ్లు యెడమున్నది. గుణగవిజయాదిత్యుని తరువాత నెంతయో కాలమున కెవ్వడును నిట్టి శాసనమును వ్రాయించి యుండడు. అట్లు వ్రాయించుట

* కాని. ఈ ‘టి’ అను నక్షరము ప్రత్యేకముగా 14 శతాబ్దమువరకును కాన్పించుచున్నది. దాని యుచ్చారణము ‘డ’ కారోచ్చారణముగ నెప్పుడు మారిపోయెనో తెలియరాదు.

కవసరముండదు. ఎట్లయినను, ఈ శాసనములు అనఁగా, సీసమును, తరువోజయును నున్న శాసనములు నన్నయ్యకు పూర్వపు వేయని యూహింప వలసియున్నది.

సీసము కేవల మాంధ్రపద్యమని లక్ష్మణరావుగారన్నారని శాస్త్రిలుగారు వ్రాసిరి. లక్ష్మణరావుగా రట్లనలేదు. వారన్నది సీసమునకు తెలుఁగు నాఁటనెక్కువప్రచారమున్నదని. ఇట్లే చంపకమాలకు సంస్కృతములో నెక్కువ ప్రచారము లేదనియు, తెనుఁగు కన్నడములలో నున్నదనియు వారు వ్రాసిరి. ఇది కాదని యెఱుఁగుదురు శాస్త్రిలవా రనినట్లు తెనుఁగువారు, సీసమును కన్నడము నుండియే యెరువు తెచ్చికొని యుందురనియు, మాత్రాగణ బద్ధమై యున్న దానిని సంస్కృతగణ బద్ధముగా చేసికొని యుందురనియు వ్రాసిరి. కానిండు, దానివలన బాధ యేమున్నది. అంత మాత్రముచేత నన్నయ్యయే అట్లు సంస్కరించిన వాఁడని సిద్ధాంత మెట్లు చేయఁగలము.

# వసంతసంగీతము.

(పెనుమర్తి. వెంకటరత్నముగారు.)

కవిసెఁగకు బంతవీథి స్నిగ్ధప్రవాళ
దరవికస్వరహాస జాతప్రరోచి;
కలకల కషాయ మాధురీలలితఘటితి
సస్యపుష్ప సుగీతిక లఁమి కొసఁగె ॥
ఈనవవసంత ప్రత్యూష ప్రీణితయగు
ప్రకృతిదేవి ప్రహర్ష డోలికల నూఁగె
బాలమలయ సమీరుఁ డుయ్యాల లూపెఁ
గుసుమగంధము మోయినిండ నెసఁగనలఁది ॥
గొనబుదీగల మాటున గూరుచుండి
కమ్మతావినిఁ దాప్పు పుష్పమ్ము కెలన
బంభర కవీశ్వరుండు స్రవన్మరంద
పానలోలత గానముఁ బాసెనేలొ ?
నవవసంత విలాస ప్రాభవముఁ గుఱిచి
సర్వశక్త్యాత్మకుండు జగత్స్రష్టఁ గూర్చి
ప్రణయ వల్లకి లో శ్రుతి నెనయజేసి
కోయిలా ! పాడవే ! శ్రవః పేయముగను ॥
కాలగర్భములో వలఁ గలసినట్టి
ఆంధ్ర రాజులశౌర్య నిరంధ్ర పటిమ
దాస్యసంఛన్న సాహసోదగ్రగరిమ
లలితముగఁ బాడుమమ్మ ! కోకిలకుమారి!
ప్రణయ గర్జితమైన నీభావగీత ॥
జిగురుటాకుల మసృణత సేకరించి
ఈనవయుగ పరిభాతి కళ్యాణగీత



# చంద్రాలోకము

(పి. లక్ష్మీనృసింహేశ్వరశర్మగారు.)

## ౧

## పట్టపగలు.

నరుడు;— ఓనారీ? నిలుచుండి మాటలాడరాదా?

నారీ;— ఎందుకు?

నరుడు; నిన్నొకింత వడి గాంచెదను.

నారీ:— ప్రతిదినము నన్నేల బాధించెదవు? నిన్ను నేను కోరుటలేదు. నీవు నాకు వలదు.

నరుడు:— సఖీ? నేనునిన్ను వాంఛించుచున్నాను. నీవు సుందరివి.

నారీ:— నీవు కురూపివాయేమి?

నరుడు:— అందుకనేనా? నన్ను బ్రేమించుటలేదు.

నారీ:— ఆ. అవును. అందుకనియే.

నరుడు:— ప్రేమయనునది కొంచెమైనను లేదా?

నారీ:— రూపమందు వికసింపని ప్రేమయొక లెక్కలోనిదికాదు. అది యసంపూర్ణమేసుమా?

నారీ:— రూపమందు మధువుండును. కాని పుష్పము లామధువును పతంగముల కొసంగునా? భ్రమరము మాత్రమే దానినిపానము చేయగలుగును.

నరుడు:— మంచిది. భ్రమరము పుష్పమునుగోరును. అటులనే పుష్పముగూడ భ్రమరమును గోరును గాని "నీవు నలుపు" అని యనదుగదా?

నారీ:— పుష్పమనదు. నేననుచున్నాను. కేవలము నేను పుష్పమునుగాదు.

నరుడు:— అట్లయిన నీ వెవరు?

నారీ:— నేనా? నేనమృత మొసంగగలను. అమృతమును పానము చేయగలను.

నరుడు:— నీవుకేవలము పుష్పమేయైన యెడల—

నారీ:— నేను నిన్ను గోరకుండుటకు కారణమును దెలిసికొన్నావా? నేను భ్రమరమును, పుష్పమును గూడకానియెరుంగుము.

## 2
## వెన్నెలరాత్రి.

నరుడు:— ఆహా! జగత్తెంత మనోహరముగనున్నది!

నారి:— ఈపండు వెన్నెల పరిమళమునుగూర్చి వర్ణించుటెట్లు? వ్రాయుటెట్లు? భాషచాలదు. అత్యద్భుత-రహస్య—మాయా—మోహ-మయమై యున్నదే! నామనస్సు.

నరుడు:— సూర్యకాంతులయందు సమస్తము వికసించి స్వతంత్రమున విరాజిల్లుచుండును. కాని పండు వెన్నెలల యందట్లుగాదుసుమా! ప్రాణమునందు ప్రాణము—గానమందు గానము—ఇంతయేల? సమస్తము యేకమై పోవును.

నారి:— సమస్త మొక్క స్వప్నరాజ్యమునందు పరస్పరము మిళిత మగును.

నరుడు:— రజిత దీప్తుల నలరారు నొక్క గొడుగు క్రింద సమస్తము గలిసిపోవును సుమా? అయ్యో! నామనమేలనో తలక్రిందులగుచున్నది. ఎందుకో నాకేమియు దోచుటలేదు.

నారి:— నామనమును మోహ మత్యద్భుతముగ జుట్టుకొనినది. ఆ యనంతప్రేమ—అనాదిస్వరము—నాహృదయతంతువుల కదలించి...

నరుడు:— అదియనంత దూరమునుండి వచ్చు వీణాఝంకారము. నాకును ఆగానము వినబడుచున్నది.

నారి:— ఏల—నేనిట్లగుచున్నాను. ఇక నే నాగలేను.

నరుడు:— నీవెంత సుందరముగ గన్పడుచున్నావు? సుసౌందర్యమున నలరారు వానికిగూడ వెన్నెలరాత్రులు వన్నెదెచ్చును సుమా?

నారి:— నీవుకూడ సుందరుడవు.

నరుడు:— అవును, నేను సుందరుడను గావచ్చును. ఇది యంతయు చంద్రాలోక ప్రభావమే గదా? పండువెన్నెలల యందెట్టియాటంకములు లేక మనోకాంతి బహిర్గతమగుచుండుట సత్యము.

నారి:— నీవంతెగా చక్కనివాడవు కావు. అయినను నీవు సుందరుడవు.

నరుడు:— నీనేత్రములు మోహమయములు. విరాగముతోడ చూచినను రాగము గలుగును. నీవు ప్రేమించుచున్నటుల దోచును.

నారి:— నేను నిన్ను ప్రేమించుచున్నాను.

నరుడు:— ప్రేమతోడ చూచినయెడల నీనేత్రముల మోహ మేమగును? ఎవడు చెప్పగలడు? నీ నయనములు నన్ను తలక్రిందులు చేయుచున్నవి?

నారి:— అట్లయిన చూడను... కాని నీ నేత్రములయందుగూడ నేనెవరినో చూచుచున్నాను. స్వప్నమును గాంచుచున్నానా యేమి?

నరుడు:— ఈరాత్రియంతయు నిటునటు తిరుగుచుండవలయునను కోరికగలుగుచున్నది.

నారి:— నాకును నటులనేయున్నది. నీ చేయిబట్టుకుని...

నరుడు:— నన్ను పిచ్చివానిగ చేయదలచితివా?

నారి:— నేనుకాదు; చంద్రాలోకము. పండువెన్నెలలయందు ప్రేమింపకుండుట సాధ్యమగునా?

## 3
## పగటివేళ

నారి:— తిరిగివచ్చితివా?

నరుడు:— ఉండలేకపోయితిని. నామనమెటులనో యున్నది. అందువలన వచ్చితిని.

నారి:— వెడలిపొమ్ము?

నరుడు:— పోజాలను.

నారి:— నిన్ను నేను కోరుటలేదని గతించిన దినమున చెప్పలేదా? నిన్ను నేను ప్రేమింపజాలను?

నరుడు:— గతించిన రాత్రి?

నారి:— గడచిన రాత్రి యేమిజరిగినది?

నరుడు:— ఆవిషయము నీమనస్సునకు రాలేదా?

నారీ:— ఆ. జ్ఞాపకము వచ్చినది. కాని యదియేమి? స్వప్నమా? లేక యదార్థమా!

నరుడు:— గడచిన రాత్రి నాతృషితాధరమందు సుధారసమును బ్రవహింపజేయలేదా!

నారీ:— ఛీ. ఛీ. నేను నిజముగ గతించినరాత్రి నిన్ను బ్రేమించినానా?

నరుడు:— సౌందర్యమను సువర్ణపాత్రియం దమృతమును బోసి దానిని బ్రేమవలన తప్తమొనర్చి నామోమున కందీయలేదా?

నారీ:— నీవో!

నరుడు:— దానిని నిశ్శేషముగ పానమొనర్చితిని.

నారీ:— ఛీ. ఇట్టి నిందకు స్థానములేదు. కాని నాకు పిచ్చెక్కినట్లున్నది?

నరుడు:— అయ్యో! ఇది స్వప్నమా? లేక యభినయమా?

నారీ:— గతించిన రాత్రి యేదయిన సంభవించిన యెడల నది నాకు తెలియనిది— అనిచ్ఛతో గూడు కొనునది— అని యెరుంగుము. నేను నిన్ను బ్రేమింపజాలను. మరి బ్రేమించుట యసంభవము.

నరుడు:— అట్లయిన పండు వెన్నెలయందు...

నారీ:— ఎవడెరుంగును? ఇటనుండి కదలుము. తిరిగి రావలదు. మార్గము తప్పియైనను రాపీలు లేని స్థలమున కేగుము.

నరుడు:— నన్ను నీవేల యసహ్యించుకొందువు?

నారీ:— ఆ—అసహ్యించు కొనుచున్నాను.

## ౪

## వెన్నెలరాత్రి

నరుడు:— మళ్లీ వచ్చినావా?

నారీ:— ఉండలేకుంటిని. నీ కబుర్లు నాకానందమును గలిగించును. నీమాటలు మాటలుకావు. గాన సద్రృశములు...

నరుడు:— ఇంతకు నన్ను నీవు బ్రేమించుటలేదు గదా?

నారీ:— ఎవడన్నాడు? ఎప్పుడు...

నరుడు:— ఈదినము మధ్యాహ్నము నీవనలేదా?

నారీ:— నాకాసంగతి జ్ఞాపకములేదు. పదయిన యని యుండినను నేననవలెనని యన్నది కాదు. అందువలన నేమన్నానో నాకు తెలియదు.

నరుడు:— ఇట్టి ప్రేమ నాకు వలదు. నాతల తిరుగుచున్నది. హృదయము దగ్ధమగుచున్నది.

నారీ:— అట్లయిన నే నేగుచున్నాను.

నరుడు:— వలదు. వెళ్లవలదు. నిన్ను నేను చూచుచుందును. ప్రాణము నిండునటుల—ఈజన్మ సార్థకమగునటుల—నిన్ను చూచుచుందును.

నారీ:— అట్లయిన నీవు నన్ను ప్రేమించుట లేదనుట కర్థమేమి?

నరుడు:— నే నెప్పుడు చెప్పినాను? ప్రేమించుట లేదని. నీవు కయాళీమనిషివి. అందువలననే నెట్లుండినను నీకు బాగుగనే యుండును.

నారీ:— నేనిచ్చటనే గూర్చుండును. ఆహా! చంద్రకాంతి ప్రవాహమెట్లు ముంచివేయుచున్నది? కాని యిది చంద్రికాంతి ప్రవాహమా? లేక చంద్రకాంతితో గూడిన వాయువా? ఏదియైయుండును?

నరుడు:— రెండు నిజమే. నన్నానుకుని గూర్చున్నావా?

నారీ:— ఆ కూర్చున్నాను. మన యిరువురి శరీర స్పర్శవలన నొక యపూర్వమగు ఆనంద గానము నాకు వినబడుచున్నది. దానికి కారణమేమయి యుండును?

నరుడు:— ఎవరు చెప్పగలరు? ఏమిది? నీవు నాకంఠమును కౌగలించుకొన్నావా?

నారీ:— నేనా? కాదు. నన్నెవ్వరో గట్టిగ కౌగలించుకొనుమని చెప్పినారు. అందువలన నాగజాలకున్నాను.

నరుడు:— ఎవరుచెప్పినారు?

నారీ:— చంద్రాలోకమై యుండవచ్చును? కాని వెన్నెల మాట్లాడగలుగునా?... కాని నీవేమి భావించుచున్నావు?

నరుడు:— ఉదాసీనతను వహించిన యొకతలమును శరీరమును మరచిన యొక యలవచ్చి గొట్టుకొనినది. అందువలన జలప్రళయ మేర్పడినది. అది మంచి కొరకువచ్చెనో లేక చెడుకొరకు వచ్చెనో నాకు దోచుటలేదు.

నారీ:— నేనంచు మునుగునట్లు దోచుచున్నది.

నరుడు:— నాపనియునటులనే యున్నది. అందువలన నేమి సంభవించునో నాకు తెలియదు.

నారీ:— నీవు నన్ను గట్టిగ కౌగలించుకొనుము.

నరుడు:— ఎందుకు?

నారీ:— నిన్ను నేనడ్డగించను. ఒక్క ముద్దిమ్ము— రెండు—మూడు—నాలుగు—పది—వేయి— పదివేలు—ఇక నిన్ను నేనడ్డగింపజాలను.

నరుడు:— నే నివ్వను?

నారీ:— ఏల యియ్యవు?

నరుడు:— నీవు రజిత కాంతిస్పర్శ వలన నిద్రింపుచున్నావు. రేపు స్వర్ణకాంతుల స్పర్శవలన మేల్కొను నప్పుడు మనోవ్యథ నొందెదవు. నీకు మనోవ్యథను గలిగింపజాలను.

నారీ:— (నిట్టూర్పు విడచును.)

నరుడు:— కోపమువచ్చెనా? అయితే నేను నీకంత మును కౌగలించుకొను చున్నాను.

నారీ:— అహా? ఏమి? ఈయనంతసుఖము? అనంత తృప్తి—

నరుడు:— కౌగిలివీడుము. ఇక నేను వెళ్లుదును.

నారీ:— ఈరాత్రియంతయు నిటులనె కౌగలించుకొని యుండుము. ఇప్పటినాస్థితిని— నాహృదయ మును గ్రహింపగలవా? నేను నిన్నుమిక్కుట ముగ ప్రేమింపుచున్నాను.

నరుడు:— నిజముగ నన్ను ప్రేమింపుచున్నావా? కాని నేను నిన్ను ప్రేమింపుచున్నాను. చంద్ర జ్యోతి భూమిని ప్రేమించుట కంటెను మిక్కుటముగ— వేయిరెట్లెక్కుడుగ—ప్రేమింపుచున్నాను.

నారీ:— ఈపండు వెన్నెలల పరిమళమెట్లున్నది! ఈ రాత్రి యెంతమధురముగ విరాజిల్లుచున్నది?

నరుడు:— నేను నిన్ను ముద్దిడుకొందును. నీ నేత్రములు—అహా! యెట్లున్నవి. వానిని ముద్దిడుకొందును.

నారీ:— ముద్దిడుకొనుము.

నరుడు:— నాకున్న తృష్ణ యనంతము. అందువలననే ననేకమార్లు ముద్దిడుకొందును. చూడు—ప్రవాళముల ధిక్కరించు కాంతులతోడను, పుష్పములకంటెను కోమలమై మత్తు దిివ్యముల కంటెను మత్తును గలిగించు నీయధరమును ...

నారీ:— ముద్దిడుకొనుము.

నరుడు:— నీమోము నామోము నానుకుని యున్నదే? ఇది నిజమా? లేక స్వప్నమా? ఏమిచెప్పుదును. నాతల సరిగలేదు. నీపెదవులు నాపెదవుల నానుకొని యున్నవనుట నిజమేనా? ఎటు చెప్పజాల కున్నాను. భావింపజాలకున్నాను.

నారీ:— అంతయు సత్యము. మన మిర్వురము కనుదృక్కుల మిళిత మొనర్చుకొనుచు నొక్కచో నున్నాము.

నరుడు:— నిజముగానా?

నారీ:— నీ నేత్రములనుండి కిరణ ప్రవాహము ప్రవహింపుచున్నది. వెన్నెలల మించినదే. ఇది చంద్రాలోకమేగదా?

పగటివేళ.

నరుడు:— సఖీ? నీకొరకు పూలదండను తీసికొనివచ్చితిని. తెలతెలవారునప్పుడు మంచుతో దడసినపూలను గ్రుచ్చి తెచ్చినాను. గతించినరాత్రి స్వప్న మింకను నన్ను కౌగలించుకొని యున్నది కదా? అస్వప్న మెంత మధురము? ఎంత కోమలము? ఎట్టి సుగంధయుక్తము?

నారీ:— నీపూదండ నాకవసరములేదు. కాదు— కాదు. తే.

నరుడు:— ఇదేమి! దానిని కాళ్లతో దొక్కు చున్నావా!

నారీ:— ఆ. త్రొక్కుచున్నాను. పూదండతోడ నీప్రేమనుగూడపదతాడనంబొనర్చుచున్నాను.

నరుడు:— నాహృదయము బ్రద్దలగుచున్నది.

నారీ:— అయిననేమి?

నరుడు:— ఆహా! ఇదియొక యనంత దీర్ఘనిశ్వాసము. హాహాకారము.

నారీ:— నేను నిన్నుకోరుటలేదు. నీప్రేమనంతకంటె ను గోరను.

నరుడు:— సఖీ! నాప్రేమను పరిభవింపుచున్నావా? అంతకంటె నన్ను చంపివేయగూడదా?

నారీ:— నీవు నామార్గమునకు కంటకముగనున్నావు. నాజీవితమునకు పరమ శత్రుడవు.

నరుడు:— అట్లయిననే నేగుచున్నాను. చిరదినములుగ నేగుచున్నాను. కాని గతించిన రాత్రి నీవు నన్ను ప్రేమించలేదా?

నారీ:— అబద్ధము. అది సర్వాబద్ధము.

నరుడు:— అయ్యో? ఇందేదిసత్యము. కాని గతించిన రాత్రి....

నారీ:— గతించినరాత్రి యేమిజరిగినది!

నరుడు:— గతించినరాత్రి జరిగిన విషయమును సరిగ చెప్పజాలకున్నాను. ఆత్మదాన మొనర్చితినో, లేక యాత్మహత్య నొనర్చుకొంటినో. ...

నారీ:— ఆత్మదానమా? నాకా? ఏమిటది!

నరుడు:— నారీ! గతించినరాత్రి నీవొనర్చినది నీకు జ్ఞాపక మున్నదా?

నారీ:— ఏమిచేసితిని?

నరుడు:— నాకాత్మదాన మొనర్చితివి. నాకంఠమును కౌగలించుకొంటివి. నీయందలి యనంతవేగ మును నావక్షస్థలమున ప్రసరింపజేసితివి. నిన్ను నేనొక ముద్దనిడు కొంటిని. జ్ఞాపకములేదా?

నారీ:— నీకు నేనాత్మ సమర్పణము జేసితినా? ఇంత కంటెలజ్జాకరము ఘృణాజనకమగు కార్య ముండునా? నేనాత్మహత్య నొనర్చుకొందును.

నరుడు:— నీవెందుకు? నేనేయాత్మహత్య నొనర్చు కొందును. కాని నిన్నుప్రేమించుచున్నాను. నీ యెదుటనే మరణింతును. కాని నాప్రేమ వెలుతురువలె సత్యము. చంద్రాలోకమువలె మధురము. మృదుమధురము...

నారీ:— మరణముదప్ప వేరుమార్గము కనుపడలేదు. నాహృదయము దహించుకొని పోవుచున్నది. జీవితము విషసదృశమైనది. ఏల! నన్ను నాశ నము చేసితివి! నీవు కాలసర్ప సదృశుడవు. నీ చూపు, నిశ్వాసములవలన నేను దగ్ధమగు చున్నాను. చచ్చిపోవుచున్నాను. అయ్యో...

నరుడు:— అయ్యో, చంద్రాలోకము (మూర్ఛిల్లును)

నారీ:— ఎట్టిపతిత్రతుడు. సర్పసదృశుడు ... వీనికి మూర్ఛాభంగము గలుగకుండుగాత.

## ౭

## వెన్నెలరాత్రి.

నారీ:— మరణించెనా? నిజముగ—లేదు. ఇప్పుడేలేచి గూర్చుండును. స్వర్గమునుండి యమృతప్రవాహ మిప్పుడే వచ్చి వీనినిముంచును. లేచును. ఎక్కడ? మేల్కొనడా? కన్నెత్తి చూడడా? ఆనేత్రద్వయమునుండి పండు వెన్నెల బ్రస రింపదా? పెదవులు కదలవా? నోటిమాట రాదా? చేతులు శీతలము గ్రమ్మినవి. అయితే ప్రేమయనిన భ్రమయేనా? ఇట్టిభ్రమ జీవిత మందు గలుగకుండుగాత. జీవితమే భ్రమగా యున్నదే? ఎవడెరుంగును? నవ్వుచున్నాడు. స్వప్నమును గాంచుచుండవచ్చును. గతించిన రాత్రివిషయమును స్వప్నమందు గాంచి నవ్వు చున్నాడు. గతరాత్రి తిరిగివచ్చునా? ఇదేమి! నాకుముద్దీయడా? చంద్రకాంతులు నేడు ప్రాణవిహీనమై యున్నవేమి? అయ్యో! వాయువువెదురుగుమ్మలచేరి రోదనము చేయు చున్నది— అయినను నేను ముద్దిడుకొందును.

(తెరపడును.)

# సంధ్యారాగము.

---:o:---

(నాళము కృష్ణారావుగారు.)



## తొలిసంజ.

౧.

ఉదయ వేళను దినరాజు ముదము మీఱ
నంబరగృహ ప్రవేశోత్సవంబు సలుప
ప్రాగ్దిశాద్వారమునఁ గట్టు పల్లవముల
తోరణం బనఁ దొలిసంజ తుఱఁగలించె.

౨.

బాలభానుండు పద్మినీభామ గూడి
వేడుకలర వసంతంబు లాడువేళ
నొండొరుల్ చల్లుకొనిన బగ్గుండి యనఁగ
నుదయరాగ పరాగంబు లొప్పు మీఱె

3.

పగలు రేలకుఁ బగ మాన్పఁ బద్మభవుఁడు
భానుచంద్రులఁ జెరియొక పక్షమందు
నిలిపి రాగంబు సంధింపఁ గొలుపునట్టి
సంధ్య యన సాంధ్యరాగంబు చౌకళించె.

౪.

భవ్యశతపత్త్రి పుస్తకపాణులగుచు
సరసు లాగి మాధుకరవృత్తి సంఘటింప
కాలయోగీంద్రుఁ డరుణాంశుకంబు దాల్చి
యేగుదెంచెనో యన సాంధ్యరాగ మలరె.

౫.

సమయ మనియెడి జాలరి తిమిరనీర
పూరితాజాండ కాసారమున మెలంగు
నట్టి తారాఝషంబులఁ బట్టఁ దలఁచి
పఱచు నెఱ్ఱనివల యన వఱలె సంజ.

౬.

చిమ్మచీకటి పొగలచేఁ జేవ చెడిన
దివసవృక్షంబు క్రమ్మఱ నినుచేత
మూలముట్టగ జిగురించి మోసులెత్తె
ననఁగఁ దొలిసంజ పూర్వన నంకురించె.

౭.

కాలరసవాది బ్రహ్మాండగోళ మెల్లఁ
జిత్రరీతి సువర్ణంబు సేయ నెంచి
తరణిశిఖిమీఁదఁ జల్లు సిందుర మనఁగ
సాంధ్యరాగంపు దీధితుల్ సందడించె

౮.

నామనాసిక కెంజిగి నాఁచికొనియె
దొండపండౌర యెంతటి దుండగంబొ
కొండకండలుగాఁ జెండి గండడంతు
ననుచుఁ గీరంబు దానిఁ దనముకాల
నదిమిపట్టుచు ముక్కునఁ జిదిమి చించి
తునిమి తూటాడి దుమ్ములు తూరుపెత్తె
ననఁగఁ దొలిసంజ పూర్వన నవఘళించె.

౯.

అనుఁగుఁబతియైన చందురుఁ డస్తమింప
వనటఁ దారలు వానితో ననుగమింప
జతిని బేర్పంగ దరికొన్న చిచ్చు లనఁగ

మలుసంజ.

౧౦.

తొడిమపట్టును విడి క్రిందఁ బడఁగనున్న
కమియఁబండిన తాళఫలమొ యనఁగ
సంజకెంపును తిమిరపుంజంపునలుపు
బెరసి బ్రహ్మాండభాండంబు మెఱయుచుండె.

౧౧.

సంజకెంజాయ లలమంగ సగముపాలు
సాంద్రతమములు పర్వంగ సగముపాలు
ఎఱుపునలుపులకాంతుల నెసకమెసఁగ
నభము గురువిందగింజచందమున వెలిఁగె.

౧౨.

కారుకొనియున్న కటికిచీఁకటులలోన
సంజకెంజాయ లొక్కింత సందడింప
కారునలుపున నెఱ్ఱనిజీర లొలయు
అల్లనేరేడుపండు నా నలరె నభము.

౧౩.

పవలు పద్మినిఁ గేళిమైఁ దవిలియుంట
తెలియనీకుండఁ గుముదినిఁ గలియఁ గోరి
తోయజాప్తుండు మేనెల్లఁ దుడిచికొనఁగ
రాలు పుప్పొడియో యనఁ గ్రాలెసంజ.

౧౪.

కాలమనియెడి కాంచన కారకుండు
చరమగిరి యను కొలిమిలో తరణి యనెడు
జాళువాముద్దఁ గఱఁగింప చదలు పేరి
సానపైఁ బెట్టునొఱయన సంజమెఱసె.

౧౫.

ఆకసంబను లోహంపు తేకునందు
పదను చీఁకటికాటుక బట్ట నెంచి
అపరదిక్సతి యిడినదీపార్చి యనఁగ
సాంధ్యరాగంపుఁ గాంతులు చౌకళించె.

౧౬.

అంధకారంబు పేరిటి సింధురంబు
లపరభూధర తటులఁ గోరాడ, నొరసి
చదల నంటిన చెందిరచాయ లనఁగ
సాంధ్యరాగంపుఁ గాంతులు చౌకళించె.

౧౭.

తిమిరమదమున నంబరద్వీపము తేఁగి
తరణి పేరిటి మావంతుఁ దలఁగఁదోచి
గజిబిజి యొనర్ప నాతండు గ్రక్కినట్టి
రక్తపుంజమొ యన సాంధ్యరాగ మలరె.

౧౮.

తరణిమారుతి గగనసాగరము దాఁటి
అపరదిక్కను లంకకు నరిగి యచట
వహ్ని యంటింప నెగసినజ్వాల లనఁగ
చదల నరుణంపుదీప్తులు చౌకళించె.

౧౯.

సమయధీవరుఁ డాకాశ జలధియందు
తపనమత్స్యంబు బట్టంగఁ దార లనెడు
చిఱుతచేపల మచ్చిడి పఱచినట్టి
కావిజాలెమొ యన సంజ కడలుకొనియె.

అజంటా యొదలి యొక చిత్తరువు.



విరహిణి— శైత్యోపచారములు.

# నవలలు — పాత్రపోషణము.

[ దర్భా యజ్ఞేశ్వర సోమయాజి గారు. బి. ఏ. ఎల్. టి. ]

## పాత్రము, పాత్రపోషణము.

పాత్రమునకును, పాత్రముమీద వాచకునికి గల్గు యభిప్రాయము నకును, నా పాత్రము మీద గ్రంథకర్తకు గల యనురాగాశ యాదులకును గల తారతమ్యములను మిక్కిలి జాగరూకతతో జేయు విషయ విశ్లేషణమువలన తేటబడుచుండును. సాధారణముగా నీమూడంశములను పాత్రపోషణమని వ్యవహరించుచుందురు; కాని తీవ్రదృష్టితో పరిశీలించిన యెడల పాత్రమును ప్రకటించుటయను నదొక్కటి మాత్రమే దీనికణువైనట్లు గోచరించును.

మనుజులనొక కొందరి నుద్యోగించుకొనకయే నవలయందు ప్రకటించిన పాత్రములు గ్రంథకర్త మనంబునకును, వాచకుని మనంబునకును మాత్రము కేవల మానవులట్లగ పడుచుందురు. పాత్రముకూడ నొక్క మనుజుడేమో యనెడి భ్రాంతిని గల్పించు పాత్రమును సానుభూతిక పాత్రమని వ్యవహరించుచున్నారు. ప్రకృతిచేతను సంఘముచేతను వారివారి యిచ్ఛలచేతను సచ్ఛాస్త్రానుసార కాంక్షలచేతను, దైవికనియమములచేతను నాయామానవు లీప్రపంచమున సంభవించుచున్నారు. కాని నవలలందలి పాత్రములు గ్రంథకర్తయొక్క కల్పనా విశేషజములగు భావన వికార రూపములుగల వారగుచున్నారు. మానవులతోడి స్నేహము కంటె కల్పిత పాత్రములతోడి సాంగత్యము సరి జేసి యతిప్రయోజనార్హంబులగు ననుభవములను సంపాదింపవచ్చును; కాని స్వప్న చిత్రంబులు మాత్రమీ రెండువిధముల యనుభవములను సమ్మిశ్ర మొనరింపవు. కల్పిత పాత్రములాదర్శ భూతులగు నిజమైన మానవులను ప్రకటించుచున్నవా యనెడి విషయము కల్పనసౌకర్య తత్త్వవిచారణ విభాగమునకుం జెందినట్లగ పడుచుండినను నిది మానస ధర్మ విషయిక విద్యకే (Metaphysics) నెక్కువగా సంబంధించి యున్నట్లు పొడగట్టుచున్నది.

నవలకర్త చారిత్రిక ప్రాముఖ్య పురుషులను రూపమునందును, వాగ్వితానము నందును చేష్టలయందును తదితర స్వల్పవిషయములందును యదార్థముగ ప్రకటించినను, మొత్తముమీద నివి యన్నియు కల్పితములగు స్థాన, కాలపాత్రాదులచే నావృతములై యుండుటచేతే కల్పిత పాత్రములుగనే యగపడుచుండును. "తీవ్రముగ నాలోచించి కల్పించిన పాత్రములు యథేచ్ఛమై జీవనము చేయుచున్నట్లు పొడగట్టెడి" నని యొక కొందరు నవలకర్తలు తీర్మానించి యున్నారు. కల్పన విధానములదైన సౌందర్య నిరూపణములకును నాత్మతత్త్వనిరూపణములని యెడివిభాగముల గైనజ్ఞానమునకును, నిదియావశ్యకము; కానియిది నవలకర్తయే తనపాత్రము యొక్క నిర్ణేయనెడి శాస్త్రసిద్ధాంతమును మాత్రము మార్చుటలేదు. పండితుడొనర్చు కార్యము దైవంబు యెఱుంగు గాని కర్త తెలియ నేరడు జుండీ, యనువచనార్థము కవివర్యుల పట్లనెట్లో నవలకర్తల పట్లగూడ నట్లే ప్రవర్తించుచుండునని దీనివలననే తేటపడుచున్నది.

## నవలీయ పాత్రపోషణము

అనుదినానుభవములందును, అన్ని కళలయందును, స్వీయచరిత్రములందును, చరిత్రలందును పాటలయందును, వేయేల యితివృత్తముగల ప్రతిసారస్వత భాగములందును పాత్రపోషణమొక యావశ్యక కల్పనాంగముగ నివ్వటిల్లుచున్నది. ఏదోయొక యంశబిందువునందు మాత్రమే గాక యనేక యంశబిందువుల యొక్క సంఘానవిశేషమునందుఁ గూడ నవలలందీ పాత్రపోషణమునకు ప్రత్యేకవిధానమొక్కటి కలదు. చరిత్రానుసారముగ నటిసితిమేని, యితరసారస్వత భాగములందు నవలలందవలె విపుల వివరణలతోఁ గూడిన వ్యాప్తములగు సాకార పదార్థసంబంధములతోడను సాంఘిక విషయములతోడను నావృత విషయములతోడను గూడినవిధము పాటించి పాత్రమును పోషణముఁ జేయ నమకట్టరు. రంగమున ప్రదర్శింపఁ బడెడు నాటకములందట్లుగాక, వీలైనపుడెల్ల పాత్రముయొక్క యాంతరంగవృత్తుల నాదర్శీభూతబాహ్యావిశేషముల సంధానములేకయే వ్యస్తముగ ప్రకటించుటకూడ నవలలందు సాధారణముగ చూచుచున్నాము.

సారస్వతకళా భాగములలో సైద్ధానియందును కూడ సరళాసరళ పాత్రపోషణము నందింత క్లిష్టత కానరాదు.

ఆయా పాత్రముల గూర్చి యత్యంతాభినివేశమును, విస్తీర్ణతయుఁగల చింతనలదైన సంధానము నవలలయందుమిక్కిలి హృదయంగమైన విషయము. ఆత్మతత్త్వ బోధక విషయములదైన విశ్లేషణ మితర కళాభాగములందువలె గాక నవలలందే యధికముగాను, విపులముగాను, శాస్త్రానుగుణముగానున్నట్లు గాన్పించుచున్నది. పాటలయందిది యింత తీక్ష్ణముగాను, సారూఢముగాను నుండినను, యింత విస్తృతముగా మాత్రముండదు. పాత్రముయొక్క క్రమికవిస్తృతి నవలయొక్క ప్రత్యేక ధర్మమని చాలమంది విమర్శకుల యుద్యమము.

## పాత్ర విస్తృతము

ప్రకరణముల సంతరింపను విభాగమున ప్రాముఖ్యపాత్రల ప్రథమ, యంతిమ, మధ్య ప్రవేశములను గూర్చియు ప్రతి ప్రవేశమునకును నుచితములగు నావృత విశేషములనుఁ గూర్చియు, చెప్పియున్నాడ. విస్తృత విధానము (unfolding) ద్రవ్యరాశి రూపముననో లేక విదృతత్వరీతినో ప్రకటితమగుచుండును. సాధారణముగా నీరెండు విధానములదైన ప్రస్ఫుట సంఘానమొకటి కలదు. ఇతివృత్తముయొక్క ముఖ్య పరాఙ్ముఖ బిందువుల కడ పాత్రపోషణము ప్రధానముగా ద్రవ్యరాశి రూపమును దాల్చుచు ప్రాదిమ, ఆత్యోన్నత్య, విప్లవిక విస్తృతములను మూడుదశలను పొందుచున్నది. ప్రాకృతసానుభూతిక ప్రదర్శనముల యాచారము రాశీకృత విధానము వీనిని విడదీసి ప్రత్యేకముగా పరీక్షించి చూచినచో నివి యత్యల్పములుగఁ గాన్పించుచు. క్రమముగా వృద్ధినంద గతి బలముగల్గు విషయములచే పెంపొందుచు పాత్రవిస్తృతి జేయుచుండును. ఇదియే రాశీకృత విధానమనఁబడును.

ఆదిమాంతిమ ప్రవేశములకొక విధమైన యపరివార్యమగు నవధారణము గలదు. పాత్రములను ప్రదర్శించుటకు నియామకమగు కొన్ని రీతులు నాటక పౌరాణిక విధుల ననుసరించి సంస్కరింపఁబడుచున్నవి. నాటకములందు ప్రథమయాత్మగతభాషణములకును ముఖలక్షణ నిరూపణములకును, ముగ్ధాభినయములకును, సంభాషణములకును, సమన్వయముండును. నవలలందిట్టి నియమమును పాటించుట కేవల మసంభవము. శరీరవర్ణనముఁజేసి దానివెంటనే సంభాషణలను నెలకొల్పినచో నది కేవల పేలవంబగు కల్పనవలెనగపడి నిష్ప్రయోజనమైన దానివలెనే పరిణమించుచున్నది. పేరునందును, ఉపోద్ఘాతమునందును, ప్రస్తావనమునందును, ప్రాదిమనివేదనము ప్రకటితమగుచుండును. హటాత్తుగ రంగములోనికి పాత్రమును ప్రవేశమొనర్చుట కల్పిత విషయమనెడి భావ

మును కల్పించి పెంచి పెంపొందఁ జేయుచు జనానురాగమును, ఆశ్చర్యమునుఁ గూడ నొడగూర్చును.

అంత్యసందర్భనము అపసర్జనమును గూర్చిన జ్ఞానము, విప్లవమునుగూర్చిన విజ్ఞానముతో సాధారణముగా సంబంధించియుండును. తమనిష్క్రమణమును వాచకులెఱుఁగనిరీతినే కొందరు పాత్రములు యథాక్రమముగ కథాభాగమునుండి జారిపోవుదురు. నవీన నవలలందుసాధారణముగా ప్రాముఖ్యపాత్రములకు స్థిరమగు నపసర్జనము నొడగూర్చుచున్నారు, కాని యిది పూర్వపునవలలందువలె యంతయాడంబరమైనదిగా నుండుటలేదు. నాయకీ నాయకులను గ్రంథాంతమైన తరువాతకూడ బ్రతికియున్నట్లు ప్రకటించుచుందురు. ఇంతియకాక వారి భవిష్యజ్జీవితము కూడ విలేఖ్యమగును. నవల కర్త సాధారణముగా తన యభిమాన పాత్రములను వదలి పెట్టుట కిష్టములేమిని ప్రకటించుచుండును.

## నిర్దేశనామము.

పాత్రముల నామములును, తదితర నిర్దేశనామములును నిక్కములైనవేని కల్పితములైన వేని కావచ్చును. ఇవి యా యా పాత్రములకుఁ జెందిన ప్రత్యేక నిర్దేశ చిహ్నము లేని కావచ్చును. వారివారి జాతి లక్షణ సూచితాభిధలైన గావచ్చును. యేతచ్చారిత్రకాల విభాగానుసారములైన వేని కావచ్చును. వారివృత్తి విశేషాది కంబులైనఁ గావచ్చును. లేదా వారి నైజసూచితము లేని కావచ్చును. కల్పిత విషయముల కను గుణములుగ నుండెడి యర్థము నిచ్చుపద ప్రయోగములఁ జేసిముఖ్యపాత్రములను సాధారణముగ అజ్ఞాతుఁడు, అనామకుఁడు, అను నభిధలచే ప్రకటించుచుందురు. అముఖ్య పాత్రములను వారివారి వ్యుత్పత్తి వ్యంజకాభిధలచేత అనగా వర్ధి, వృషలుఁడు, భటుఁడు, నాటక పురుషుఁడు, అను నామములచేత ప్రకటించుచుందురు. నవలయొక్క పేరే దాని యందలి ప్రధాన పాత్రముయొక్క నిర్దేశనామమును సూచించుచుండును. పురాణాదులందు వలెనే పురాతన నవలలందుకూడ ''మష్టచతుష్టయ'' మన్నకీర్తి గుణాగుణ నియమ వాచక నామములుండును.

## రూపము.

పాత్రముయొక్క తనుస్ఫూర్తి, ముఖవిలాసము అంగ సౌష్టవము, మున్నగునవి వాని యంతరవియే యా పాత్రమున కొక విధమైన వికాసమునొడగూర్చుచుండును. ఇయ్యది వారిప్రకృతి జన్య గుణములగు బుద్ధిసూక్ష్మత, సదాచార సంపత్తి, మొదలగు వానిప్రకటనమునకుఁ గూడఁ దోడ్పడుచున్నది. ఆయా పాత్రములు తమ తమ యావయవములతోఁ జేసెడి పనుల వలనను, సాధారణముగా మనకు వారివారి గుణగణంబుల విజ్ఞానము గలుగుచుండును. నవలకర్త లీ విషయమును విస్తృతమగు సాధకముగఁ జేసికొని పాత్రముల గుణాగుణములను ప్రకటించుచుందురు.

మానవుని ముఖలక్షణము స్థిరాంశములగు మూర్తియు, ఆకార సమ్మితియు, నేత్రశిరోజాదుల వర్ణములు మొదలగువాని వలనను శారీరక మానసిక స్థితుల కను రూపముగా మారుచుండు నంశముల సంధానము వలనను, తేటపడుచుండును. నవల లందీ రెండు యంశములను చక్కగ పాటించుచునుందురు. శరీరమునకును, నాత్మకును గల శక్తి ప్రేరణముల సంబంధములను గూర్చిన ప్రత్యేక పరిజ్ఞాన విచారమున పైయంశములలో రెండవ దత్యావశ్యకము.

ఏదేని యొక పాత్రముయొక్క ముఖలక్షణములను చిత్రించుట, వానిని జ్ఞప్తియందుంచుకొనుట, వాని ముఖముయొక్క సాధారణ నైసర్గిక లక్షణములను ప్రకటించుట యను నివి, సులభమైన పనులు; కాని యాతని కన్నుల ప్రకాశము, పలువరుసల సౌరు ముక్కుతీరు, నొసలు సీటు, చెవుల చెలువము, యను వీనిని హృదయంగములగు నట్లొనర్చు కొనుట కష్టసాధ్యము. సాధారణముగా మనుష్యులందరు తమ యాప్తుల ముఖలక్షణములను, వారిని తఱుచుగఁజూచుచుండుటచేతనో లేక వారి ఛాయాపటమును జూచుచుండుట చేతనో జ్ఞప్తియందుంచుకొనఁ గలుగు

మన్నారు గాని లేనిచో వారిని కేవలము గుర్తింపలేక పోవుటనేకూడ చూచుచున్నాము.

ఏదేని యొకమానవుని యాకార సౌరభమునుఁ జూపినపుడా యాచూపరు మనంబులకు గోచరించు నుపలక్షితఫలము లాయా మానవుల చిత్తవృత్తుల కనుగుణముగా నుండును. తీవ్రమై యాదర్శీభూతముగా నుండు నీతివర్తనమే పాత్రముయొక్క సద్గుణ లవంబులను కొండంతలు జేసి మెచ్చుచు, వాని కపూర్వంబగు రామణీయకము గల్పించి శ్లాఘించుచు, శరీర లోపములను కప్పిపుచ్చుచు నుండును. ఒకానొక గ్రంధమునందొక పాత్రము యొక్క బాహువు లొకానొక పాత్రమున కొకప్పుడు హృదయాకర్షితములుగను, మఱియొకప్పు "డన్యాలోకనభీకరంబులుగను" కనపడినట్లు ప్రకటించి యున్నాడు. ఇది జూడ "శరీరమే యాత్మయొక్క గతులకు కారణభూతమగుచున్న" దను సిద్ధాంతమును ధృవపఱచుచున్నట్లగపడు చున్నది. వైశాల్య దృక్పథముకూడ పాత్రముల శరీరాకృతుల యందు కొన్ని రూపభేదములను కల్పించుచుండును. చిర పరిచయముగల వానినైనను, చాలకాలమునుండి చూచుచుండక పోయినచో వానిని విమర్శ పూర్వకావలోకనమునం జేసి తొలి చూపుతో గుర్తించుటయన్న దొక ప్రామద్భవాంశమగును. ‹దృక్పథము మారుచుండెనేని దాని ననుసరించియే తనుద్యుతి యందద్భుతములగు ప్రాముఖ్య విభేదములు జనించుచుండును.

6 వేషము భౌతికా వేష్టితములు.

ఎవ్వడేని యొకడు తనమిత్రుని, పాండిత్య ప్రబోధక దుస్తులను ధరించినపుడో, లేక మతగురువేషధారియై యున్నపుడో, లేక, యోధకూటోచిత స్థిరవేషధారియై యున్నపుడో ప్రప్రథమమునఁ జూచెనేనివానికాతని స్నేహితునిమీద గల్గు ననురాగాములు, వాత్సల్యము, వానినెయ్యపు టర్హత వీనిని గూర్చిన పరిజ్ఞాన మత్తవానినిఁ జూచినప్పటికంటె మిక్కిలి దృఢమైనవై యుత్కృష్టమైన వానివలె నగపడుచుండును. పాత్రోచితమైన వానివలె నగపడుచుఁ ను. పాత్రోచితమైన వేషము లేనిచో నాపాత్రముచిత సన్మానమునుఁ బొందజాలకుండును. పాత్రవేషమునుజూచియేవానినైసర్గికగుణముల నొక్కకొన్నిఁటి నిగ్రహింపవచ్చును. గుణవ్యక్తీకరణ నవలలందును, వీరరస ప్రధానకల్పిత నవలలందును, చరిత్రాత్మక కల్పిత నవలలందును, నిట్టిమఱికొన్ని యితరజాతి నవలలందును నాయాపాత్రముల వేషములకు ప్రత్యేక ప్రాశత్యములున్నవని మహామహుల యాశయము. చారిత్రిక, సాంఘిక, నవలలందు దుస్తులవర్ణనలను కొందఱు న్యూనమూల్యకృత్యముగ నొనర్చుచున్నారు; కాని యిట్టివర్ణనల నాదిసిద్ధ సాంప్రదాయములుగఁ గన్పట్టుచున్నవి. ప్రాచీన నవలలందు దుస్తుల వర్ణనలు సామాన్యముగ సర్వత్ర కనపడుచుండును.

గుణవ్యక్తీకరణమునకు రంగపూర్వ విశేషములెంతవఱకుఁ దోడ్పడి, దానికి ప్రశస్తమగు గుణమును కల్పించుచున్నవో యనునీయంశములు చిత్రకళాకుశలురగు చిత్తరుగాండ్రకును, ఛాయాపట ప్రకాశకులకును, బాగుగ దెలియును. ఇట్టిరంగపూర్వ విశేషములాయా పాత్రములచేత నెన్నుకొనఁ బడినచో వానికి ద్విగుణితగుణము గల్గుచుండుటే చూచుచున్నాము. నాటకపాత్రములకును, వారియావేష్టితములకును గల యనుబంధావశ్యకతలగూర్చి రంగములంగూర్చి చెప్పు ప్రకరణమున ప్రకటించియున్నాడ.

నాటకపాత్ర పోషణమునందేక పాత్రమునకును పాత్రముల సమ్మేళనమునకును గల యనుబంధమునకు ప్రత్యేక ప్రాశస్త్యముగలదు. ఏదేని యొక చోట పాత్రములందఱును సమావేశమై యేదేనిగోష్ఠి సల్పుచున్నపు డచ్చోటికి ప్రధానపాత్రముకూడ వచ్చిచేరనేని యాపాత్రముయొక్క ప్రాశస్త్యమున కొక కొంత సౌకుమార్య మొడగూడును. తనశరీరధర్మములకును, ధీవిశాలతకునుఁగూడ వైపరీత్యముగలవాండ్రతో నాగ్రంధాంతమున ప్రధానపాత్ర మగపడుచుండుటయన్న దానినికూడ తరుచుగ చూచుచుందుము. నవల కర్తయొక్క కల్పన సామర్థ్యాను సారముగ

నిట్టిపట్ల నాప్రధాన పాత్రముయొక్క సుగుణములను యేకత్వము రూఢిగ ప్రకటితమగుచుండును.

## ముగ్ధాభినయము.

మానవులు వారివారి పార్థక్యమును, వారివారి యాదర్శీభూతగుణములను, విషాదాహ్లాద, మూర్ఛన త్రపలు మున్నగు భావములను: సంగవిక్షేపము (guesture) విమోహము (Pose) ననియెడి చేష్టల మూలమున బ్రకటింతురు. వారివారి నుడువులకంటె నీభావసూచనా విచేష్టితంబులనే మిక్కిలి ప్రశస్తముగు సాధారణ ధర్మములైనట్లందురు నామోదించుచున్నారు. చాల స్థితుల యందాచారములోనున్న ముగ్ధాభినయ చేష్టల వర్ణనమే పాత్రపోషణమని కొందరు నిర్వచించియున్నారు. కల్పిత సంఘములందు మాటలును, విక్షేపమును, కూడ నాత్మయొక్క యథాస్థిత్యనుగుణ భావాదుల దాచుట కుపయోగపడుచుండును.

తొలుదొల్త నవలలను వ్రాసిన గ్రంథకర్తలలో నొక్కడు మాత్రమే యీముగ్ధాభినయముల ననన్య సామాన్యమగు నైపుణ్యముతో తన గ్రంథమున ప్రకటించియున్నాడు. ప్రస్తుత మప్రధాన విషయముగ భావింపం బడుచుండినను 18 వ. శతాబ్దమునకు పూర్వమున వ్రాసిన గ్రంథములందు దీనికారూఢమగు ప్రాశస్త్యముండెడిది.

పదునెనిమిదవ శతాబ్దాంతమున నుండినరసానుకారిశాఖ గ్రంధకర్తలకు (Sentimental School) నిట్టూర్పులు, అశ్రులు, మూర్ఛలు మున్నగువానిచే సూచింపంబడెడి ,, నిషణ్ణతగ్లానుల, యద్భుత విశేషములుచాల యిష్టముగ నుండెడివి. గుణవ్యక్తీకరణ నవలలందు ముగ్ధాభినయమునకు ప్రత్యేక మానుషవైశేషిక ప్రాశస్త్యము నాపాదించుచున్నారు. ఆధునిక సానుభూతికరచనలందిది మానుషవైశేషానలకు విరోధభావమగు చైతన్య గుణభావవికారములను పురస్కరించుకొనుచున్నవి.

## ఉల్లేఖనము.

ఏదేని యొక పాత్రముయొక్క సంభాషణము విశ్లేషించి చూచినచో వాని నైజగుణములగు మౌనవాచాలతలు, ఆసానుభావతయు, సభ్యతయు, కంఠధ్వనుల గుణభేదములు, అయావిధానములు, శబ్ద సంగ్రాహములయు, వాక్యములయు, పదములయు విన్యాస సౌకర్యాదులు నను నుల్లేఖనగుణంబులు తేటపడుచుండును. నవలలందు స్వరభేదములను యథావిధిగ ప్రకటించుట కష్టసాధ్యమైనను దీనిని యత్యల్పముగనే ప్రకటింపగలుగుచున్నారు. మారుమార్గముల నవలంబించి నిరూపింప వలెనన్న నారచన గుణరహితమగుటయే కాక యసంభవ గుణకలితమైనట్లు కూడ నగపడుచుండును. పాటలను పాడుట కలవాటైన ధ్వనిని గూర్చి చెప్పుతరి నీసిద్ధాంతములన్నియు నిక్కమైనట్లగపడుచునే యుండును. విషాద భూయిష్టములగు పాటలయందును పద్యములందును, నిమిడియున్న రసమును గాంధర్వవిద్యయే విశిష్టముగ ప్రకటింపగల్గును కాని, యెట్టి రచనా కౌశల్యముగల ధోరిణి చెనొప్పు కవియైనను నిట్టి రసజాలమును తన రచనచే యథోచితముగ ప్రకటింపంజాలడు.

పాత్రముల యొక్క శబ్దజ్ఞానమును, వాక్యవిన్యాసమును, గ్రంధకర్తయొక్క నిర్దేశ నిబంధన బంధురములే యైనట్లు పొడగట్టుచుండును. చాల పారిభాషిక పదములతోగూడి. యాయా పాత్రముల వృత్తి విభేదముల ననుసరించినవై నాయా చారిత్రిక కాలమందు వ్యవహరింపబడిననైన భాషను తీవ్రప్రయత్నపూర్వకముగ తగు రీతిని సంతరించికొని విషయ ప్రకటనముం జేసినచో నావిషయ మసంభవమో లేక యసత్యమోయను సంశయమును పొడమ జేయుచుండును. అనుపమ వేదనానల దందహ్యమాన మానసులును, ననన్య సామాన్యమగు దౌర్బల్యమయ పీడితులగు వారును, సలుపు బహు విస్తృతా సంబద్ధ సంభాషణములు శాస్త్రసమ్మతముల య్యు మనయూహకు మాత్రమసంభవములైన వాని వలె కన్పట్టుచుండును.

పాత్రముయొక్క చిత్తవీధిని సంచరించెడి ప్రతిపాటను వ్రాయుటన్నది యోగ్యమగు రచన కెంతమాత్రము సమ్మతమైనదిగాదు. దేవనింద జుఘు న్యతలను నాటకాలందచ్చటచ్చట ప్రయుక్తమగు చున్నను, నవలకర్తలు వీనిని నెన్నడును గ్రహించి ప్రయోగించుట లేదు. మిక్కిలి తీక్ష్ణములైన ధర్మ సంబంధములగు దేవకార్యములయు లౌకిక విషయ జాలములయు భావవిశేషములను వ్యక్తీకరించునెడ పదములనిచ్చవచ్చినట్లు ప్రయోగింపక యా యావేశో ద్రేకమంతయు నుట్టిపడునట్లొనర్చి వ్రాసినరీతిగ నగ పడునట్లు ప్రకటించుచుందురు. మత విషయికము లగు నుద్దేశములు మనమనంబులందు రగులుకొని ప్రజ్వలించు చున్నను వానిని శుభాసుభవముగ ప్రకటించుట యన్నది యాధునికులగు నవనాగరి కుల యభిప్రాయములకు భిన్నమైన విషయముగ పరిణమించుచుండును.

## ధర్మగుణ విషయి కాత్మతత్త్వజ్ఞానము.

మిక్కిలి నవీనములగు కొన్ని నవలలందు మాన వుల యాత్మను భౌతిక రసాయన ప్రేరణములచే ప్రేరితమగు క్షణికముగ వికారభావముగ పరిగణించు చున్నారు. విజ్ఞానవాదికిని కూడనాధునిక దేవాత్మ వాదమాకర్షకముగను సుసాధ్యముగను కనబడినట్లగ పడును. లౌకికానుభవములగు విషయములనెల్ల నా త్మతత్త్వ బోధితాంశములుగ ప్రకటించుట యనెడి సానుభూతిక రచనానురక్తుల యాచారమును ఆత్మ కును దేహమునకును సంబంధములేనట్లు పరిగణించు కేవలాత్మ తత్త్వవేదుల రచన పద్ధతులు ననుసరించు విధులను కూడ నాధునిక విమర్శనముగ గర్హించు చున్నది.

మిక్కిలి సులువుగ వ్యాకులత జెందు మనస్సు గలవారి శరీరముగూడ నతిత్వరిత గతిని వారి మనోవి కారము ననుగమించుచుండుటే చైతన్య సూక్ష్మతా గుణమైనట్లు రసానుకారి రచనవిధులు పరిగణించు చున్నవి. నేను కేవలము మరణ దేవతా ధీనుఁడను నేను చైతన్యమునకు సంపూర్ణముగా లొంగిబానిసనై తిని యనునట్టి యొకకొన్ని నుడులను నాయకీ నాయ కులుచ్చరింప తరుచుగా వినుచునే యున్నారము.

ఆధునిక సానుభూతిక పరిదర్శనములు శరీ రమునకును నాత్మకును గల సంబంధముల నేర్పరచుట లో జీవశాస్త్ర జంతు శాస్త్రములకు ఋణపడుచున్నవి. అన్ని విధములైన చైతన్యములకు ననుగుణములగు నాత్మ తత్త్వ విషయములు— అనగా తృష్ణ, యనాహారత, వైకల్యము, మరణవేదన యను నీ దశలయొక్కయు స్నాయు సంబంధ వికారములను మజ్జాతంతు సంబంధవికారములను— విశ్లేషించి నియమింపబడినవి. ప్రేమ కులధర్మభ్రంశము, మతావేశము, వాచాలత, మున్నగు నితర యసాధారణ చైతన్యావ్యవస్థలైన ధర్మగుణ విద్యా విషయకంబగు నాత్మతత్త్వజ్ఞానమును కూడ నిది విశదీకరించు చున్నది. దృఢకాయులయు ననన్య సామాన్యంబగు పరిశుద్ధస్థితి యుతులగు మాన వుల శరీర సౌఖ్య సంపత్తిని గూర్చికూడనిది మిక్కిలి రసవంతముగా వర్ణించినది. కొందఱిద్దానిని తమ గ్రంథము లందిచ్చోటను సారముగ స్వల్పముగనో, లేక యధికముగనో పాటించి ప్రకటించు చున్నారు.

## కేవల యాత్మ తత్త్వజ్ఞానము.

ఆరవ విభాగము చివర కలమున జెప్పిన యాద ర్శభూత పాత్రములు, మానవుల యాత్మతత్త్వజ్ఞానము లను గూర్చిన తీక్ష్ణ పరిశీలనమునకు మార్గదర్శకములగు చున్నవి: పాత్రముయొక్క చైతన్య విశేషమును భావన, స్మృతి, అవలోకనము సిద్ధాంతీకరణము, ఇంద్రియ నిగ్రహము ప్రత్యక్షజ్ఞానము, ఆవేశము, సంకల్పము, లనెడి వివిధాంశ వికారములుగ గ్రహింపవచ్చును. ఇవియొక మానవునికి సంబం ధించిన లింగభేదములు; వయస్సు, వృత్తి, జాతి మతభేదాదులు; మున్నగునవియేని కావచ్చును; లేదా జగత్సంబంధా వేశాదులు నైసర్గికాభి మానములు నైనగావచ్చును.

ప్రత్యేకముగా నాత్మయొక్కను గూర్చి చేయు ప్రకటనలందు నవలయనుదిన జీవితమునకు భిన్నముగ

నుండుటే సాధారణముగాఁ జూచుచున్నాము. అనుదిన జీవితాదులందు మనము మతియొక మానవుని యాంతరంగిక జీవితమునుఁగూర్చి ఖండఖండములుగనో, లేక యవివక్షితములుగనో మాత్రము తెలిసికొన గలుగుచున్నాము. నవలకర్త సాధారణముగా తన యనుభవముల నిచ్చవచ్చినరీతిని మార్చి వానిని తన పాత్రముల కారోపించి ప్రకటించుచుండును. ఇంతియకాక యొకానొకప్పు డాదర్శీభూతరచనలందు గూడనప్రమత్తుడగు చుండును. అర్థాపత్తి, సాదృశ్యము సిద్ధాంతీకరణము ఊర్జనము నాటక ప్రభావము మానుష్యానుకంప యున్న గ్రంథకర్త యొక్క పార్థక్యజ్ఞాన గ్రహణకౌశల్యమును బాగుగా పెంపొందఁ జేయును. వ్యక్తి మర్మములనే గ్రంథకర్తయుఁగూడ పరిశోధన పూర్వకముగా సిద్ధాంతీకరింపఁ జాలఁడు. చారిత్రక పాత్రముల నిరూపణమునందా యా మానవులచే వ్రాయఁబడిన యాయా పాత్రముల యనుభవానులను కొంతమట్టునకుఁ గైకొనదగును; కాని యివి యసంపూర్ణము లగుటయేగాక యదార్థము కాని వ్యాఖ్యానము లగుచుండుట కూడ సహజము. నవలకర్త యాదర్శీభూత కల్పననొనర్చినప్పుఁడే నిక్కముగా శాస్త్రీయ మగురచన మొనరించినట్లు పరిగణింప బడుచున్నాఁడు.

అంతశ్చైతన్యమును; బాలురయు, జంతుసంతానములయు, నపౌరుషేయములవియునగు చైతన్యములనుఁ గూర్చి నవలకర్త యొకానొకప్పు డన్వేషించు చుండును. కాని యివి ముఖ్యముగా పాత్రపోషణ విభాగమునకుఁ జెందిన వివిధ విషయాంశజాలికే జెందుచున్నవి. బ్రహ్మనేతలవైన విజ్ఞానసత్తినుఁగూర్చి వర్ణించునప్పుడు దేవతలకు మానుషాకారములను గుణములను నారోపించి వ్రాయుటవశ్యకర్తవ్యమే యగుచున్నది. మానవుల కనువైన వానికంటెనితరములగు నాలోచన క్రమములను, భావనలను; చిత్తవీధిని గూఢాత్మకముగ చింతింపనగును. కాని వానిని వస్తురూపకముగ ప్రకటింప ప్రయత్నించినచో నవియెల్ల మనకు చిరపరిచితములైన ప్రాకృత దర్శీభూత చైతన్యాకృతులు గలవిగ పొడగట్టుచుండును.

స్వానుభూతిక ప్రకటనములు గృహసంబంధ విషయజాలమునందును, వృత్త్యానుగుణ విశేషాంశములయందును, రాజకీయవిషయ సముదాయములందును వీని కనుగుణ్యములగు సాధారణ మానసిక వికారానులవైన జ్ఞానమునందును నప్రమత్తమగుచున్నను, నవల సాధారణముగా నంతరాత్మ యొక్క తీక్ష్ణానుభవమును కూడ పురస్కరించి కొనుచుండును. కల్పనా ప్రమత్త విశేషజములగు నద్భుత ప్రకటనలతోడను, విపరీతములగు నిర్దేశములతోడను, నీతివిషయకములగు స్వభావానుల వలనను, సమస్తవిషయ రిక్తానుభవవిజ్ఞానపు శాస్త్రాభిరుచి స్వభావానులనను, విపరీతమగు చైతన్యము నొకరీతిగా ప్రకటింపనగును. ఇట్టి పాత్రపోషణము ధర్మగుణ విద్యావిషయకంబగు నాత్మ తత్త్వజ్ఞానముయొక్క ప్రవృత్తి గలదగుచున్నది.

## సారూప్యము, పార్థక్యము, వ్యాంజకము

వార్జన్యము లొనర్పుమానవాధములను గుర్తించు రీతులచొప్పు నటయనవి ప్రతిమానవుని యందును ప్రత్యేకములగు చిన్నయాకార భిన్నములు గల్గియున్న వానివలెనే యగపడుచున్నవి. ఆధునిక నవలకర్తలు మానవుల శారీర విశేషములగు, పుట్టుమచ్చలు, చారలు మున్నగునితర ప్రకృతి జన్య వికారాదులను విశేషముగ పాటించి యున్నారు. కేవల కల్పనభూయిష్టములగు సారస్వత విభాగములందు సారూప్యముగల పాత్రములను పోల్చుటలో గల్గు భ్రాంతియే— శరీర లక్షణ సమత వలన గల్గినదైనను సరే, లేదా యొకేరీతివస్త్రముల ధరియించుట యను నాచారము నంజేసి గల్గినదైనను సరే— హాస్యాంతకమొలులేక విషాదాంతకములు ననెడి గుణములను రచనభాగముల కొడగూర్చు ప్రాముఖ్యాంశమగుచున్నది. సత్స్వవర్తనముల యందలి యభేదము కలిమిని జేసి యాయాపాత్రములయందు, భ్రాంతివలన నీతి

విషయికంబులును, నాత్మ తత్త్వ బోధకంబులును నగు గాఢఫలితములు చేకురుచుండును.

భౌతిక, నైతిక చరిత్రములు రెండిట పాత్రములకు సంబంధించిన విశేషాంశముల నన్నింటిని పాటించి ప్రకటించినచో వానిసహాయమున ప్రతి పాత్రమును గూడనట్టె విమర్శింపవచ్చును. ఒకేస్థానము నిరువురు మానవులొకేకాలమున నాక్రమించుకొని యుండ జాలరు. ఇంతియకాక యొకేరీతి యావేశములనుగాని యభిప్రాయములను గానికలవారును కానేరరు. నవలలన్నిట ప్రతి పాత్రమును తదితర పాత్రముల నుండి ప్రత్యేకములగు భిన్నభిన్న స్వభావాములచేవేరగుచున్నది. ఇట్టివివక్షతల గూర్చిన విమర్శనములు చదువు వలసినంత ప్రాముఖ్యములు మాత్రము గావు.

నైతిక పార్థక్యమనే కల్పన విధానమును బట్టి చూచినను సరే విశేష బాహుళ్యముగల తీక్ష్ణాంశముగనే కాన్పించుచుండును. నవల రచన కనుకూలించు రీతిగ దీనినిగూర్చి యిట్లువ్రాసియున్నారు:— నైతిక పార్థక్యమే ప్రపంచకమునందు మనమత్యావశ్యకముగ కావలయునని కోరున దయ్యును, ననుభవాదులందరని చూచినచో నియ్యది యంతగ పాటింప బడకుండుటే చూచుచున్నాము. ఇది మన సంకల్పములన్నిటికిని నాస్పదమయ్యును దుర్లభమైనదిగనే కన్పట్టుచుండును. మానవాకాంక్ష ప్రేరిత మయ్యును సంసిద్ధంబులు మాత్రము కావు; ఇచ్ఛాజనకంబయ్యు నింద్రియ వికారజంబుగాని, మనోవికార జంబగు భావవిశేషముగాని కాదు. యుక్తమూల్య విజ్ఞానార్థమయ్యు నిది వర్ణనా తీతంబగుచున్నది. ప్రేమాస్పద భూయిష్టంబయిన దయ్యు వాక్కులచే ప్రకటింప నశక్య మైనదగుచున్నది. జ్ఞానేంద్రియముల వలనను, సాదర్శీ భూత కల్పనా పురస్కృతంబులగు కల్పన వైచిత్ర్యంబు వలనను, వివిధములగు నుదాహరణముల పూర్వకంబగును సిద్ధాంతముల పూర్వకంబగును, విషయ తత్త్వజ్ఞానోత్పత్తిని జేయు ననుభవము వలనను దానిని దెలిసికొనఁగల్గుచున్నాము. నిర్దిష్ట గుణజాతంబగు నిర్గుణ్యకత దీనిని యింద్రియాగోచరంబుగ నొనర్చుచున్నను మనము దీనిమాయలో దగిలి దానికే నతులొనర్చు చున్నాము. విజ్ఞాన పూర్వకముగనేమి, ఇదికేవల మొక ప్రాపంచక వస్తువునను విలెనే నారూఢా కృతిగలట్లు కన్పట్టుచు ననంతాన్వేషణ కలితంబై విపలాయియగు నుద్దేశమే యగుచున్నది.

పైవిభాగములలోఁ జేర్కొన్న పాత్రపోషణ విధానములన్నియు పాత్రములకు పార్థక్యము నారోపించుటకును, నాదర్శకత్వము నొడగూర్చుటకును, నుపయోగించుచున్నవి. నాటక పాత్రముల సమ్మేళనముల వలనఁ గొన్ని సాంఘికములును: యాత్మతత్త్వ బోధకములునుయాదర్శీభూతములును, నగుపాత్రములు స్ఫురించుచుండును. నవలల విజృంభణమునుఁ గూర్చిన నవీనావలంబనము, నవలలందీ యాదర్శీభూత పాత్రములకుఁ గల ప్రభావమును గూర్చి చెప్పుచున్నది. నవలలందలి యాదర్శీభూత పాత్రములనుఁ గూర్చిన సంపూర్ణజ్ఞానమునకు గాఢమగు చరిత్రజ్ఞానమావశ్యకము.

ఏకపాత్రములు సాధారణముగ ననేకములగు లఘుసంపూర్ణాదర్శీభూత విశేషాదుల నారూఢముగ ప్రకటించుచుండును. ఆయాపాత్రముల పూర్వాచారధర్మములను ప్రకృతాచార విధులను కూడఁ దలపోసి విచారణలను చేయుచుండవలెను.

రూపకరచనలను గూర్చియు చిహ్న ప్రదర్శనమయపాత్రములను గూర్చియు నిదివరకే ప్రకటించియున్నాడను. రూపకరచనల దగు నభిరుచి, యస్థిరంబైనదిగనేని, యారూఢమైనదిగనేని సరససామ్యముగలదిగనేని యుండనగును. ద్వంద్వ రూపకరచనలు వచన గ్రంథములందుఁ గానరావు.

## పాత్రవైకృత్యము

అల్లనల్లన పాత్రములను ప్రకటించుచుండుటే నవలయొక్క ప్రధానకృత్యమని నుడివిన మహామహుని సిద్ధాంతము చారిత్రక, లాక్షణిక, కాల్పనికాధికములైన బాహుళ్య ప్రసరమునాపరించుచున్నది.

ప్రతి విస్తీర్ణతగల కల్పనయందును కూడ నేదోయొక విధమైన పాత్రవైకృత్యము (character change) కాన్పించుచుండును. కాని పూర్వగ్రంథములందీ మార్పు సాధారణముగా నతిత్వరితగతిని సంభవించుటయో లేక క్రియాపురస్కరణమునందు విజ్ఞానావలంబనమునకు నప్రయోజనముగ నుండునట్లు పక్వమునందని స్థితియందుటో చూచుచున్నాము. నాటకానులందెన్నియో నియమములకు వశీకరణములై యీవైకృత్యములు పెంపువహించుచుండియా యా పాత్రములతిత్వరితగతిని మారుచుండినను, నిట్టిమార్పులే పూర్వపు నవలలందు కాన్పించుచున్నవి. క్షణికమార్పులకు వశీకృతములగు నాటకములందలి పాత్రములకుఁ గూడ సరసమైనట్టియు క్రమమైనట్టి పాత్రపోషణమున్నట్లు గోచరించుచుండును.

ఆయా పాత్రముల వంశపరంపరముగ వచ్చునట్టి ప్రవృత్తులయు, వారికి సహజంబులగు నట్టియు, వారి సాంఘికాది సాంగత్య సంభవము లగునట్టియు వారి యదృష్ట ప్రేరితంబులగు నట్టియు, వారి దృఢనిశ్చయాదుల వలన గల్గు నట్టియు, ఫలితముల ప్రకటనమే పాత్రపోషణముగ భావింపఁబడుచున్నది. వీనిలో కనఁబడుఁ బేర్కొన్న ముఖ్యవిషయములన్నియు అభినివేశనము, సంయోజనము, ఆత్మపరిత్యాగము, ఆత్మనిగ్రహము, ననునట్టి ప్రాముఖ్య విభాగ విశేషముల వలననే వేరు చేయఁబడుచున్నవి. సాధారణముగా సాంప్రదాయ సిద్ధంబులగు నాచారములకును, గుణములకును, సాంఘికోద్యమములకును ప్రత్యాఘాత మొనర్చుట చేతనేగాక యితర మానవులతోడిదైన సాంగత్య విశేషాదులచే పాత్ర పోషణమునందు విశేష మార్పులు గలుగుచున్నవి. ఒక మానవుని వలన మఱియొక మానవునికిఁ గల్గు కార్యకారిత్వమునుగూర్చి తీవ్రముగాను, విపులముగాను చదివి తెలిసికొనుటకును, నవలలందే వీలగుచున్నది. గాని తదితర విజ్ఞాన భాగములందంతగా గ్రహింపనలవిగా నట్లుండుటే చూచుచున్నాము. సాంఘిక గ్రంథములందుకంటె మానవులను గూర్చిన నవల

పాత్రపోషణము పలుపోకడలకు వశీభూతమైనట్లగపడుచున్నది. ఇది విద్యను గూర్చి ప్రకటించు నవలలందు సాధారణ విజ్ఞానానుసారమైనట్లుగను నితరవిషయిక నవలలందావేశ పటుత్వానుసారమైనట్లును; కల్పనకౌశల్యానుసారమైనట్లును లౌకిక ప్రభావములందును మతవిషయిక సిద్ధాంతాదులందును నప్రస్తుతమైనట్లును కాన్పించుచున్నవి. సద్ధర్మాచరణ సంబంధములైనను నూర్ధ్వాధరగతిగతంబులగు విజ్ఞాన ప్రకర్ష ననుసరించి ప్రోదిచేయుచు ప్రకటించు పాత్రపోషణమే నవలకర్తలందరిచే నామోదింపబడుచున్నది. కొందఱూర్ధ్వగతుల గూర్చిన విశేషములను, మఱికొందఱధోగతుల గూర్చిన విశేషములను నికకొందరు వారివారి వృద్ధిక్షయ కారణములను, పురస్కరించుకొని పాత్రపోషణమును జేయుచు దాని నాచరణలోనికి గొనివచ్చిరి. నవలకర్తలు సాధారణముగ విషమస్థితులనుఁ గూర్చి మిక్కిలి శ్రద్ధతో విషయవిశ్లేషణ మొనరించి రసపుష్టికితగు దోహదములను గూర్చికొని పాత్రపోషణముఁ జేయుదురు కాని సుఖవిషయప్రకటన మొనరించు తరి నింత శ్రద్ధ దీసికొనకుండుటే చూచుచున్నాము. కల్పననైపుణ్యమునకు సంబంధించిన కారణములనేని, నీరీతి విహితంబులును, నాత్మతత్వజ్ఞానానుసారంబులును నగు కారణములనేని: పేర్కొనుట సులభము ఒక కొన్ని విషయములలో నాయా విషయముల వృద్ధియొక్క ప్రకటనముకంటె క్షయముయొక్క ప్రకటనము నేసరసగతినిరూపించి ప్రకటింపవచ్చును.

## విలోమా విలోమ పాత్రపోషణము.

పాత్రముయొక్క వాక్కులు, నాతఁడొనర్చు కృత్యములు, చిత్తవృత్తులు నన్నవియే యవిలోమరీతిని పాత్రములు మన కగపడెడి యూరూఢమగు రీతులు. గ్రంథకర్త యొక్క వర్ణనల వలనను, నితర పాత్రములకంటె నాయా పాత్రమునకు గల ప్రభావ విశేషములవలనను నా పాత్రము యొక్క రూపవిశేషాదుల పరిచయము చదువరులకు గలుగుచుండును.

కార రచనలు చాలవరకు పాత్రముల ప్రకటనమున కుచితమై పాత్రపోషణమునందు ప్రత్యేక ప్రాధాన్య ముగల కార్యములనునిర్వర్తించుచున్నది. భాణముల రీతినైన మఱియేరీతినైన ప్రకటితమగు నాత్మవిషయ ప్రకటనము తానెరుగకుండగనే తన్ను ప్రకటించు కొనుటయును దాని యంతటి యవిలోమ విధానము కానేరదు.

నవలకర్తలయొక్క విషయ విశ్లేషణములును నుద్దేశములును, పాత్రమునకును, వాచకునికినినడుమ మఱియొకనిని (గ్రంథకర్తను) ప్రవేశ పెట్టుచున్నవి; కానిగ్రంథకర్త యొక్క యీరాకపోకలు మిగుల వ్యత్యాసాంతరములు గలవిగ గాన్పించుచున్నవి; నాటక పాత్రనిష్ట యాకార వర్ణనాదుల యందే యుల్లంఘింప బడుచున్నది నవల కర్త యొక్క సమ్మతి వైషమ్యము, సద్ధర్మాచరణ పరాయణత్వము, మున్నగు వానికి సంబంధించిన ప్రతివాదములను, విమర్శ కోద్యమ విధికి ప్రతీకార ఘటనము జేయు విశేషములుగ భావింపబడుచున్నవి.

తీక్ష్ణమగు నాటక నవలలందు, నాటక పాత్ర ముల పూర్వకంబగు విలోమ పాత్రపోషణ మేర్పడు చున్నది.

ఏదేని యొక పాత్రమును గూర్చి యాతని మిత్రులకును శత్రువులకును నాతనితో నెట్టిసాంగత్య మేని గల యాబాల వృద్ధులకును తిర్యక్కులకును దేవతలకును గల భావనలును వృత్తులును గూడ పాత్రముల యొక్క సంపూర్ణ నిరీక్షణమందు జేరు చున్నవి. ఆ చరణయందీ సంపూర్ణత కల్పన లన్నైన యెన్నుగడలకు వశీకరమగు చున్నది. కాని ప్రతిదృ క్పథ విశేష విషయమునకును యథాసంభవమగు విచిత్ర ప్రాశస్త్యముగలదు. చంటిపిల్లలతోడను తిర్యక్కుల తోడను మెలగునపుడు తనవర్తనమునుగూర్చి నూత్న భావములు గలవాడగుచున్నాడు, కానియివి యెల్లపు డును నహమ్మతి రంజకంబులుగనే యుండజాలవు. అనుదిన జీవితాదులందు మనలను గూర్చిదేవుడెట్టి తలంపులు గల్గియున్నాడో యను భావన యాత్మీయ

పాత్రపోషణమునకును తోడిమానవులను గూర్చిన విచారణములకును సత్యాపత్యకము నవలకర్త సాధార ణముగా నాటక పాత్రములకెట్టి రీతి యభిప్రాయము లుత్తట్టుచుండునో వానినే యలతిమార్పులతో ప్రక టించు చుండును.

సాధారణవిధులు.

సారస్వత సంబంధనియమముల సాధారణముగ గనుగొను నొక కొన్ని పాత్రపోషణవిధులు గలవు; పాత్రములనుగూర్చి యాగ్రంథకర్తకెంతపరిజ్ఞానకౌశల మున్నదో యను దానితోగూడ సంబంధము గల మఱికొన్ని విధులు గలవు "వర్ణనాతీ తములు విశ్లేషణా సాధ్యములు" లోక విరుద్ధాభాసములు మున్నగు పడికట్టు ప్రయోగములు కుశాగ్రబుద్ధులరగు వారి యదార్థ వచనములే నిక్కావచ్చును. లేదా ధీ జడిమ జనితంబులైన నుడువులేనికావచ్చును. లేదా ధీ జడిమ జ్ఞాన ప్రేరితంబులగు వాక్కు లేనికావచ్చును. ప్రబలంబగు నవేశానల ప్రజ్వలి తంబగు రూపమును పాత్రమున నారోపించినచో నది కేవల సాహిత్యాత్మక కల్పనమని యనిపించుకొ ననేకాని యుత్కృష్టంబగు నాదర్శీభూత పాత్రముగ మాత్రమది చూపరకు గాన్పింపదు. పాత్రముల యవివక్షత లఘుమనోగతిత్వమునన్నవి వాచకులకుప దేశాధ్యాపము లొనర్చుటకును, వారి మనంబులకు విశ్రాంతిని కల్పించి వారికి సుమనోల్లాసమును సంప్రా ప్తింపఁ జేయుటకును, వ్రాయబడు కేవలకల్పనా కధాత్మికములగు నవలలందు మాత్రమే ప్రత్యేకార్థాన గలవగుచున్నవి.

అనుదిన జీవితాదులందాయా పాత్రముల యొక్క గుణావగుణములన్నైన విశ్లేషణ సంధానములే సంతుష్టికరమగు పాత్రపోషణమైనట్లు గ్రహించుచు న్నారు. పాత్రపోషణల నియమములందు పాటించు విశ్లేషణవిధులఁ గూర్చి చెప్పుచు నొకానొక విమర్శ కోత్తముడధికవిశ్లేషణమును గూర్చి యుల్లాసకల్పనమే మన యుద్యమము కాని, విషయ విచ్ఛేద్యన మొన ర్చుట మాత్రము మన యాశయముకాదని,, ధృవము

గా ప్రకటించియున్నాఁడు. నాటకశక్తివలనను సహజమగు నాత్మతత్త్వజ్ఞానమువలనను, మానవుల యెడల గల భావసామ్యము వలనను, గ్రంథకర్తవిశ్లేషణసంధానములకు నిక్కమగు యనుబంధమును కల్పింపఁ గల్గుచున్నాఁడు.

స్థంధన, ప్రభావర్థకము ఔన్నత్యము, వైలక్ష్యము మున్నగు సరళవిధులు, మిక్కిలి విరివిగా కల్పితరచనలందు మాత్రమే ప్రయుక్తములగుచున్నను పలువురచే సర్వత్రిఫలోత్పాదకములుగను, యదార్థసంజాతంబులుగను నెన్నఁబడుచున్నవి. ఒక్కమానవునిగూర్చి విజ్ఞానప్రకటనములందును, బాహుళ్య విస్తారతఁగల సంఘములంగూర్చిన ప్రకటనములందును, వైలక్ష్యమును పాటించి ప్రకటించుటే కర్తవ్యము. స్వానుభూతిక ప్రకటనములందు సంపూర్ణములగు వైలక్ష్యమునుఁ బాటింపరు. స్వల్ప విషయములందు విభేదసాధన మొనర్పరు. సమత్వవ్యత్యాసములదగు నానార్థ జ్ఞానము పరస్పరము సహకారములుగ నుండును వీనిలో నేదేని యొకదానినిఁగూర్చి మన మెంత యెక్కుడుగ గ్రహింపఁ గల్గుచున్నామో, రెండవదానినిఁగూర్చి యంత తీవ్రజ్ఞానముఁగూడ నప్పుడే మనకు గల్గుచున్నది. వీనినిఁగూర్చి విడివిడిగా దెలిసికొన సాధ్యము గాదు.

ఉన్నయన విధానము, బాహుళ్య ప్రకృత విషయము. గావున, పాత్రపోషణమునం దుత్కృష్టమగు ఫలితముల నొడగూడఁ జేయుట కుపయోగపడుచున్నది.

నవలలందు గలుగుపాత్రముల నిరూపణములకును, వారివారి జీవితములకును, ననేక ప్రాముఖ్య విభేదము లగపడుచుండును. నవలలందుపాత్రముల చరిత్ర మాద్యంతము కొలది గాలములోనే తేటతెల్ల మగుచుండును. మనకా పాత్రముతో ననేక సత్సరంబులు పరిచయ ముండినను, వానినిఁ గూర్చి మనకు గల యభిప్రాయము లెల్ల సంపూర్ణములగు మార్పుల నందినను, దానియంతటఁ నది నూత్న తత్త్వములను మాత్రము ప్రబోధింపఁ జాలదు. అను దినజీవితాదులందాయా మానవులకు వారివారి స్నేహితుల గుణ గణములొక కొన్ని యబ్బుచుండుటే చూచుచున్నాము. నవలలందలి పాత్రములు మానవుల గర్తనముల ననేక విధములఁ బోషించి యుపహానవ (Influencing) మొనర్చుచున్నవి.; కాని మానవుల వలన పాత్రము లుపహానమందుట మృగ్యము. కొందరు మనుజులకును, కుటస్థాంశములకును, స్థానములకును, కాలములకును, నావేశములకును, మాహలకును సంబంధించిన విషయ జాలముచే నుపహానము జెందుచున్నట్లే నవల లందలి పాత్రములను ప్రకటించునాచారమును చూచుచున్నాము. ఇది యితి వృత్తములందు మాత్రమే యగపడుచు, జీవితాదు లందగపడని యేకత్వనిష్ఠ గలిగి యుండుటే కనఁబడుచున్నది.

ఇదియు, నిట్టి యితర విషయములును, నవల లందలి పాత్ర పోషణ విధికి మిక్కిలి యుత్కృష్టమగు గుణమును కల్పించును. మన యనుభవమున కనుగుణముగ పాత్ర ముండవలెనని యారూఢముగా నిర్దేశించితిమేని, యానైక్యములగు విషయముల పట్ల యతిశయోక్తిగనే విషయ ప్రకటన మొనర్చుటచే నప్పుడప్పుడు గణనకెక్కిన ఫలితములుచేకురుచుండుటనుఁగూడ చూచుచున్నాము.

## సమూహ పాత్రపోషణము.

సమ్మేళనములను పురస్కరించి కొనినచో నాయా సమ్మేళనములయందును, నట్టి సమ్మేళన కర్తలగు విడి మనుష్యులయందును, నొక విధమగు నభిరుచి యుండును. మరికొన్ని విధములచే నొకటి కొకటి యుపచారముగా నుండును. కొందరు మానవులకు కొన్ని కొన్ని ప్రత్యేక గుణము లున్నట్లు నిరూపింపక పోయినను, మనము నిక్కముగాఁ జూచినవారిరూపమును, వినినవారిగుణములను, దృష్టియందుంచుకొని వ్రాయనిచో నవికేవలకల్పితాంశములుగనే పోడగట్టుచుండును. ఆయాపాత్రముల యొక్క యసంపూర్ణసార్థక్యములను, సమ్మేళనము యొక్క ప్రభావముచే మరుగుపడనిదిగ నుండుటనొక

కొన్ని నాటకాదులందుఁ జూచుచున్నాము. కూట సంభాషణము సమ్మేళనముల మానసిక విశేషము లకును, సద్వర్తనాదులకును నేకత్వమొనగూర్చుట కుపయుక్తపడును.

సమ్మేళనముకొక్క రూపముగ పరిగణించితి మేనిదానినిఁగూడనొక ప్రత్యేక మానవునిగ నిరూపింప నచ్చును. కాని యది యాదర్శభూతగుణయుతమగును. ప్రత్యేక ప్రభావముతో నొక్కసారి కంటె నెక్కువ పర్యాయములగపడ నేరదు. కానియది సాధారణముగా మానసిక విషయము లదియగు విజ్ఞానముసు పెంపొందఁ జేయఁజాలను.

——:o:——

# వారిదము.



ఉదయ వాతకి శోరముల్పొదలుచుండ
సంచరించెడి నిన్ను నక్షత్రవీథిఁ
గనుఁగొనఁ బ్రహర్ష చరిత హృద్వనధియందు
భావ కల్లోల సమితి యభ్రమును దాఁకె॥

కర్షకుఁడొకండు సానంద కలనమింట
నిన్నుఁగని వర్షమాసించె నీరదంబ!
వలయు నీరము నొసఁగి పంటలకు సాయ
మునుబొసర్పుము దాతృతా గుణముజూపి॥

నిర్మలాకాశ పథమున సిబెడంగు
బాలగోపాలు మైఛాయ బోలునట వె?
కవికుమారులు భావసంకలిత లలిత
గీతికలనీదు రూపునగ్గింపుచుందు॥

అసదృశ జవంబెలర్ప విహాయసమున
నుదితగంభీర గర్జన లొకట బరగ
వారిరాసుల నీటినవ్వారిగాఁగ
ద్రావు మేఘుడ! నాకవితను వరింపు;

(గీతా సత్తుఁడు.)

# ప్రాచీన జాతులు



(పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.)



పరమేశ్వరుఁడు, సృష్టి యందాదిని పృథివ్యాది భూతములను సృజించి ప్రారంభ జీవోత్పత్తిలో "వికారిణి" (అమీబా)వంటి సూక్ష్మజీవినే నిర్మించెననియు, పరిణామావస్థచే క్రమముగా కొన్నియుగములకు మనుష్యసృష్టి కలగెననియు, "డార్విన్" వంటి పరిణామసిద్ధాంత వేత్తలు చెప్పియున్నారు. మనదేశీయులు స్మరించెడుమత్స్య కూర్మ వరాహ నారసింహాద్యవతార దశకము కూడ పరిణామావస్థనే సూచించుచున్నదనియే మరికొందరు తలంచుచున్నారు. ఎట్టులైననగుగాక. "వికారిణి" వంటి సూక్ష్మసృష్టికి బిమ్మటనే కొన్ని లక్షల సంవత్సరములకు మనుష్యసృష్టికలిగెనను సిద్ధాంతమునే నమ్మెదము. కాని భూలోకమునందొక చోటునసే ఏ "మేరు" పర్వతమునందో, ఏ 'సీనాయి' పర్వతమునందో, ప్రారంభసృష్టి యనవలెనా? లేక పెక్కుచోటులను ప్రారంభ సృష్టి యనవలెనా? ఇందు మతభేదములు కలవు. మన పురాణములు కాని మేరువు నందాది సృష్టియనియు, మరికొన్ని పురాణములు, హిమాలయోపరిభాగమునందాది సృష్టియనియు, బైబిలు, పాలస్తీనా, లేక సీనాయి పర్వతమునందాది సృష్టియనియు చెప్పుచున్నవి. మనవేదము, పంచభూతోత్పత్తి క్రమముం చెప్పుచు నీటినుండియె భూమికలిగెనని చెప్పుటచేతను, ఆభూమి కలుగునప్పుడెత్తు భాగములు, నీటినుండి బయటపడునని, ప్రకృతిశాస్త్రజ్ఞు లూహించుటయేగాక, పురాణగాథలు పరోక్షముగఁ, జెప్పుట చేతను సముద్రోదకము నుండి సీనాయ్ ఆల్టాయ్ (మేరు, హిమాలయాద్యున్నతభాగములే, ఖండఖండములుగా, బయలుదేరెనని తలంపవలసియున్నది. అందు మేరునగము (ఆల్టాయ్ పర్వతములనుపేరున మధ్యఆసియాయందు మంగోలియా సైబీరియాల నడుమనుగల పర్వతమాలిక) నందు దేవజాతులు, లేక, ఆర్యజాతులు కలిగినవి ఈజాతులకు "కకేషియా"జాతులని కూడ చెప్పవచ్చును. హిమాలయోత్తరభాగము నుండి కాని, ఆల్టాయిపర్వతప్రాగ్భాగము నుండికాని మంగోలిజాతియనబడు యక్షరక్షోజాతులుద్భవించినవి. సీనాయి(అరేబియాలోనిపర్వతము) నుండి సెమిటిక్స జాతు

లుద్భవించినవి. "వెమూరియా" (నిరక్ష రేఖ పైనుండు, సండాద్వీపములు సింహళము, భరతఖండము లోనిద్రవిడదేశము ఆఫ్రికా తీరమునందుండిన, మడగాస్కర్, కలిసినమహాఖండము పూర్వముండెడిదట) యందు, శిలాయుగి పురుషులనబడు, దనుజులు, లేక, అసురజాతు లుద్భవించినవి. (అమేరికాఖండపు రెడ్ఇండియనుల గురించి మనకింకను దెలియదు) ఇట్టిజనసంఘము, కాలాంతరమునందు, కారణాంతరములచే చెదరి వేర్వేరు పేరులతో బిలువబడుచున్నది. మేరునగజనితులగు నార్య (కయికేషియా) జాతులు యూరపుఖండమునకును, పారసీక భారతదేశములకును, వలసపోయిరి. హిమాలయోత్తర భాగజనితులు (మంగొలియనులు) చైనా జపాన్ అంప్రాంతములకు, వలసపోయిరి. వెమోరియా సీనాప్రాంతముల బుట్టినవారు. ఆస్ట్రేలియా న్యూజిలాండు ఆఫ్రికాఖండములకు వలసిపోయిరి. మనపురాణములయందు కకేషియా మంగోలియా జాతులయుత్పత్తినిగురించిన గాధలు పెక్కులుగలవు. ఆర్యజాతులగాధప్రతిపురాణమునందును సృష్టికర్మమను శీర్షిక (హెడ్డింగు) తోనుండును. నాకు తెలిసినంతవరకు, మంగోలియా జాత్యుత్పత్తి వాల్మీకిరామాయణోత్తరకాండమునందు, బాగుగవర్ణింపబడెను.

భూలోకమునందతటను భరతఖండమునకు విచిత్రమగు ప్రత్యేక వ్యక్తిత్వముకలదు. నానాజాతులు, నానామతములు, నానాభాషలు,యిందుసమ్మిళితములైయున్నవి. అవిసంకీర్ణతనొంది సంకరజాతులు, సంకరమతములు, సంకరభాషలుగా పరిణమించినవి. భరతఖండపటము, యుగాంతరములక్రితము, నేటివలెలేదు. వంగ, అంధ్రోత్కళ మహారాష్ట్రదేశము లింపుమించు, సముద్రగర్భమునందుండినవి. నేటిద్రవిడదేశమించుమించు, వెమూరియాయనబడు లంకాద్వీపమునకుత్తరభాగముగానుండెను. దానినుండి యూర్యులకు పూర్వమునందే శిలాయుగిమనుష్యులు, ఆర్యావర్తమునకుకొందరు వలసవచ్చిరి. వారేనేటికోయచెంచు సవరగిదబాది జాతులవారు. వీరిప్రాచీననాయకులే ఋగ్వేదమునందు వర్ణింపబడిన "కుయవప్రమగందా" గలుహిమాలయోత్తర భాగమున జన్మించిన "మంగోలియా" జాతులనాయకులే రామాయణాదులయందు వర్ణింపబడిన మాలి సుమాలి మాల్యవంతాదులు. మంగోలియా జాతియులు పెక్కెంద్రునేపాళముఅసాంప్రాంతములలోకలరు. ఘూరాలనుమంగోలియనులనవచ్చును. ఆర్యజాతినిగురించి వ్రాయనవశ్యములేదు.

నేనార్యుడను, నాపూర్వులగు వసిష్ట మైత్రావరుణ కౌండిన్యులుఆర్యులే. అగస్త్యాద్యార్యులు, గంగానదీ ప్రాంతములయందు నివశించుకాలమున, భూమిలోనుండిన మహాగ్ని ప్రజ్వలించి వెమూరియానుభిన్నభిన్నములుగా జేసినది. అపుడే వింధ్య-ద్రవిడ దేశములను, సముద్రగర్భములనుండిన మృత్పిండము నేటియాంధ్రమహారాష్ట్ర దేశమానమైసంధించి బంధించినది. సింహళద్రవిడాది భాగములు విడిపోయినవి. దీనినే పురాణములయందు "వింధ్య" విజృంభించినదనిరి. ఈవృత్తాంతము జరిగినకొలది దినములకే అగస్త్యుడువింధ్యను దాటిదక్షిణమున గలభూభాగముగనుగొనెను.

అట్టి నాటి భరత ఖండమునందు, కకేషియా మంగోలియా, నీగ్రోజాతులనబడు ఆర్య యక్ష రక్షోజాతులవారు మొదలుపోరాడి యనుక్రమముగా స్నేహితులై సంబంధములను గూడ చేసికొనిరి. కాని నాటినుండి నేటికిని భరత ఖండమునందే గాక ఆర్య జాతియందుండిన ప్రతిదేశమందును, తనపిల్లను, అనార్యునకిచ్చుటకు, యిష్టపడడు. తాననార్యుని కన్యకను ద్వాహముగుటకూడ కామసంబంధముగాదలచునే గాని ధర్మసంబంధముగాదలంపడు. దానికిగల కారణములబిమ్మట వ్రాయగలను. పైజాతులలో ఆర్యయక్షజాతులకు సంబంధములు వేగముగ గలిగినవి. సమ్మేళనఫలితమే రామాయణగాధ యని తెలుపవచ్చును. రావణునితల్లి "కైకసి" యక్షజాతీయుడగు సుమాలికూతురు. రావణునితండ్రి "విశ్రవస్సు" నవబ్రహ్మలలో నొకడు. ఆర్యుడు. అనార్యస్త్రీని జేసికొని, మిశ్రజాతీయుడగు రావణుని బుట్టించెను. ఈ మిశ్రజాతీయున కార్యులెవరును బిల్లనీయరైరి. తుదకు అనార్యుడగు "మయుడు" తనకూతు "మండోదరి" నిచ్చెను. అందింద్రజిత్తు జన్మించెను. రావణునియందు ఆర్యానార్యగుణములు సంకీర్ణములై యున్నవి. ఈ యార్య గుణములు మండోదరీ గర్భమునందు సన్నగిలి యసుర కృత్యములే, యింద్రజిత్తునందు ప్రజ్వలించినవి. మరియు రావణునకు 'ధాన్యమాలి' యనుఅప్సరస (కకేషియా మంగోలియా జాతులసంకీర్ణమున బుట్టినది;) భార్యకలదు. ఆమెయందు అతికాయుడగువాడు జన్మించెను. వాని గుణములు ఇంద్రజిత్తు గుణములకు భిన్నములైనవి. విశ్రవస్సు గుణములు విభీషణుని యందు పూర్తిగ కలవు. కుంభకర్ణునియందు విశ్రవో బ్రహ్మగుణములు మృగ్యములు. మన లోనైనను మాతాపితృ గుణములు బిడ్డల యందు భిన్నములై యుండుట మనము జూచుచుంటిమిగదా; యదియుదా హరణమునకు వ్రాసితిని. రావణగాధవంటి పెక్కు నిదర్శనములజూచియే, యార్యర్షులు విజాతీయ సంబంధము జేయరాదనియు, అంతయవసరమైనచో తనకంటె తక్కువ క్షేత్రము గ్రహించి తనయుత్తమ బీజమునందు విత్తమనియు అందువలన క్రమముగా యుత్తమజాతి బయలు దేరుననియు నిశ్చయించి "స్త్రీరత్నం దుష్కులాదపి" అను సామెతం గల్పించిరి. అయితే ఇట్టి భిన్నజాతుల వృత్తాంతము, అనగా, "ఆర్యానార్య జాతుల ప్రస్తావన మాత్రము అనాదివాఙ్మయమగు ఋగ్వేదమున గలదు. కాని బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాదిజాతుల విభాగము ఋగ్వేదమున లేదు. అదిపిమ్మట గల్పింపబడిన విభాగమే" యని పాశ్చాత్యులును తన్మతాభిమానులగు మనవారును వ్రాయుచున్నారు. మంచికిగానిండు చెడ్డకుగానిండు మనవాఙ్మయమునందంతటను పంచవిధజాతు లున్నవని నాదృఢ నిశ్చయము. ఆజాతులు శ్రీకృష్ణ భగవానులు చెప్పినటుల "గుణకర్మ విభాగముల వలననే గలిగియుండును." "ఋగ్వేదమున వర్ణవిభాగము లేదు. దశమండలాంతర్గతమగు పురుషసూక్తమున 'బ్రాహ్మణ స్యముఖమాసీత్' అనునది చాతుర్వర్ణ్య విభాగములను చెప్పుచున్నది. కానిదాని భాషాపరిశీలనముం జేసిన చో నది యిటీవల గల్పింపబడినది" అని

నేనెరిగినంతవరకు మొదట రావుబహద్దర్ కం॥ వీరేశలింగం పంతులుగారు వ్రాసిరి. పిమ్మట కే. వి. లక్ష్మణరావు పంతులుగారు తమహిందూ యుగమునందు ఋగ్వేదయుగ చరితములో "వర్ణవ్యవస్థ"ను గురించి వ్రాయుచు నాటివారుజాతి బేధము నెరుగరనియుఆర్యానార్య బేధములను మాత్రమె యెరుగుదురనియు నేమేమో వ్రాయుచు ఆర్యులలో వర్ణవ్యవస్థ లేనందులకు 9-11-3 సంఖ్య గలముక్కను నిదర్శనముజూపిరి. అందిట్లుకలదట "చూడు నేను వేదమంత్రము లను రచించువాడను. నాతండ్రి వైద్యుడు, నాతల్లి పిండివిసరును" అనిరి. ఇపుడీ వ్యవస్థ అనగాకవిత్వము జెప్పుట వైద్యము జేయుట పిండివిసరుట యేజాతివారు జేయరాదు. ఇదిజాతి లేదనుటకు నిదర్శనమా! నేనుజూచినంతవరకు ఋగ్వేదము నందైనను వర్ణము లుండినటులకలదు. ఋగ్వేదము నందుండిన వర్ణవ్యవస్థనుగురించి పిమ్మటను వ్రాయగలను.

———:o:———

# నిరాశ.

[ జం॥ వెంకటశర్మ, శివన్నశాస్త్రిగార్లు. ]

పలుకులను చైదముల మున్నె స్పష్టమయ్యె
మఱియు ప్రేమ మహత్త్వ మర్మమ్ము నెఱుగు
నంతటి యుదార బుద్ధి నీ యందు గలుగు
నన్న యాశయు నంతకు మున్నె లేదు
కాని ప్రకృత పరిస్థితి జ్ఞాన మింత
కలిగియును గనికర మేని కలుగు నంత
పలుగు రాయి నీయెద యని తలంప నైతి
స్వార్థ వృద్ధిని నీ ప్రేమ మనను గాని
స్వార్థ హానిని నీ నిర్దయత్వ మందు
దయయు లేకున్న మాని చింతను గలంచు
మానమును మాని క్రోధమే నూని తేని
శాంతి మూలకమా నిరాశను వహింతు.

# నేత్రము:—దృష్టిలోపములు.

[ వేమూరి దుర్గానాగేశ్వరరావుగారు బి. యె; యల్. యం. అండ్ యస్. ]

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" (ఆర్యోక్తి)

దృష్టియొక్క మూల్య మింతయని నిర్ణయించుటకు శక్యముగాదు. నేత్రములాత్మ గవాక్షములని పిలువబడు చున్నవి. సృష్టియందలి యైశ్వర్య సర్వస్వమురానున్నను నేమానవుడుగాని బుద్ధిపూర్వకముగా దృష్టిని పోగొట్టుకొన జాలడు. ఏది లోపించినను దృష్టిలోప మంతటిలోటు జీవికి వేరొకటి యుండబోదు. ఇంగ్లాండుయొక్క అంధకవి ( The blind poet of England ) మిల్టను (Milton)దృష్టిలోపము, నెంతటి యావేదనతో, నుద్దేశించి "Oh! loss of sight! of thee I most complain" అని హృదయభారమును వెల్లడించుకొనెనో యూహింపుడు !

ఇంతటి యమూల్యమగు నింద్రియమును జాగ్రత్తగ నుపయోగించుకొన కుండుట వలననే గదా దృష్టిలోపము కల్గుటయు తన్నివారణ కొరకై యనేకోపకరణముల నుపయోగింప వలసి వచ్చుట యు సంభవమగు చున్నది. దేహారోగ్యముకన్న దృష్టి చెడకుండ జూచుట యందెక్కుడు శ్రద్ధ బూనవలయును.

దృష్టి చెడిన జీవిత మంతయు నిరర్థకము. సంపాదనావకాశ ముండదు. జన్మ మెత్తినందుకు బ్రహ్మ సృష్టియందలి సౌందర్యమును, లావణ్యవికాసములను చూచి యనుభవించుట యసంభవ మగునుగదా!

సృష్టియందు నేత్రముకన్న విపరీతమైన యింద్రియ మింకొకటిలేదు. చాల సులభముగా పాడగునుగాని బాగుచేయుట యతి కష్టము. నేత్రమును కాపాడుటకై చుట్టును బొమికలెత్తుగా నేర్పరుపబడి యున్నవి. కాన నేత్రభాగముమీద దెబ్బ తగిలి నప్పటికిని నేత్రములు చితకకుండ యీ బొమికలు కాపాడును. కనురెప్పలు కంటికేదైన హాని కలుగబోవు నపుడు సెకనులో నూరవవంతు కాలమున మూసునగలవు. చిన్ని చిన్ని పురుగులు, దుమ్మూర మీకంటిలోపల బడకుండ జేయుటకు రెప్పలకు వెండ్రుకలమర్పబడి యున్నవి.



నేత్రస్నానము.

ముఖముమీద జెమట కంటిలోనికి బోకుండ కనుబొమలు కాపాడును.

కంటిలో నెల్లప్పుడు తడిగా నుండు నటు లేర్పరుపబడియున్నది. కొలది సెకనుల

కాక కన్నీటి చుక్క నేత్రములోనికి వచ్చుచు నేత్రమును శుభ్రపరచుచు తడిగానుంచును.

ఏకకణప్రాణులలో (unicellular organisms) వెలుతురు కిరణములను కనుగొనగల శక్తి దేహమంతటిలోను వ్యాపించియున్నది. కాని బహుకణ ప్రాణులలో యిటులగాదు. దేహములో ప్రత్యేకమైన కణములు మాత్రమే యాశక్తిని గలిగి యున్నవి.

సూక్ష్మమైన జీవజంతువులో నేత్రమనునది ఒక చిన్నకణము అయి యున్నది. ఇది యొకసన్నని నరమువలన లోపలి యింద్రియముల(Central Organ)తో జేర్పబడి యున్నది. మనుజునిలోగూడ యిటులనే. కాని ఒక చిన్ని కణము మాత్రమే గాక వేలకొలది కలసి నేత్రాంతః పటము (Retina)గా ఏర్పరుపబడి నేత్రస్నాయువు(optic nerve) ద్వారా మెదడులో కలయుచున్నది. ఇదియే నేత్రములోని ముఖ్యమైన భాగము. నేత్రములోని తక్కిన భాగములన్నియు యీముఖ్య భాగమును కాపాడుటకుగాను నాహారపోషణ జేయుటకుగాను చూపును యేర్పరచుటకు గాను యేర్పరుపబడి యున్నవి. నేత్రములో మూడు పొర (coats)లున్నవి. నేత్రము బయటిపొర (cornea & Sclera) లోని భాగము కాపాడుటకు యేర్పరుపబడినది గాన చాలగట్టిదనముగలది గానున్నది. ఇదియేగాక దృష్టిలో కొంతభాగము పనిజేయును గాన ముందరి భాగము వెలుతురును పోనిచ్చునదిగా యేర్పరుపబడినది. శుక్లమండలము (Cornea) వెలుతురు ప్రవేశించుటకు స్వచ్ఛముగా నుండవలయును గాన యీశుక్ల మండలములో నెత్తురు గొట్టములు లేవు.

నేత్రములోని మధ్యపొరలో (uvea) విశేషముగా నెత్తురుగొట్టము లున్నవి. వాని వల్ల నేత్రమునకు ఆహారము వచ్చుచున్నది. లోనిపొర(Retina) యిది మెదడులోని భాగమని యెన్నబడుచున్నది. యిది యెుక్క దృష్టి వచ్చునట్లుగా యేర్పరుపబడి యున్నది. యిది గూడ వెలుతురును పోనిచ్చునట్లుగా స్వచ్ఛముగా నుండును.

బింబము (Lens)

ఇది శుక్లమండలము మాదిరిగనే ప్రవర్తించును. ఈ బింబములోని కణముల యభివృద్ధి మార్పులు ( metabolic changes ) చాల నెమ్మదిగా జరుగుచుండును. కాన ఏవిధమైన వెలుతురును జొరనియ్యని అస్వచ్ఛత యేర్పడినను అటులనె నిలువబడును, కావుననే యీయస్వచ్ఛత యెక్కువగానైతక్కువగానైచాలా కాలమువరకు కాదు.

నేత్రము దుర్భిణియంత్రమునకు పోల్పబడుచున్నది. ఏ వైపునకైనను నేత్రమును త్రిప్పగలము. మన దేహములో మరియే యితర యింద్రియము యొక్క గమనిక గాని యీ నేత్రముయొక్క గమని కంత మృదువుగా నుండదు.

వెలుతురు కిరణము శుక్లమండలము (cornea) ద్వారా నేత్రములోనికి ప్రవేశించి కంటి వెనుకటి భాగమున నమర్పబడి యున నేత్రాంతఃపటము (Retina) మీదబడి దాని నుంచి నేత్ర స్నాయువు ద్వారా మెదడులోని కొన్నికణములతో కలియుచున్నవి. ఈకణములే బయటనుండివచ్చు వర్తమానములను అర్థము జేసుకొనుచున్నవి. ఇవియె నిజమైన

కళ్లు. వానికొర కేకనురెప్పలు బొమలు కంట్లో మాంసకండరములు నేత్రగోళము నరములు నుండుట.

ఈ యింద్రియములకు సూక్ష్మమైన యేయిబ్బంది గలిగినప్పటికి విశేషముగాపరిణ మించునుగాన తగుశ్రద్ధను తీసికొనవలయును. దృష్టిభేదములేమాత్ర మేర్పడి నప్పటికి నేత్ర వైద్యుల సలహాను గొని లోపములను సవ రించుకొనవలయును.




దృష్టియననేమిః-

వెలుతురు కిరణములు శుక్లమండలము ద్వారా ప్రవేశించి బింబమువలన మార్పబడి కంటివెనుకటి భాగములోనున్న నేత్రాంతఃపటముమీద ప్రతిమగా నేర్పడును. దాని వద్దనుంచి స్నాయువులద్వారా మనఃకల్పన మేర్పడును. జబ్బులేని కంట్లో నిట్లగును. ఇటువంటి కన్ను దూరమున నున్న వస్తువు నైనను, దగ్గిరవస్తువునైనను శ్రమ యనునది లేక జూడగలుగును. ఈప్రమాణమునకు ఏవిధమైన వ్యత్యాసముగలిగినప్పటికి నేత్రము విరామముగా నున్నప్పుడు దూరముననుండు వస్తువులను రెటీనామీద ప్రతిబింబమును నేర్పరుప నేరదు. ఇందువలన స్పష్టమైన మన స్సృష్టి యేర్పడదు. దీనివలన అస్పష్టమైన దృష్టియేగాక వివిధములైన తలనొప్పులుకంటి కతిశ్రమ, మసకల దృష్టి యేర్పడును.



ఇందులో దూరమునుండి వచ్చుకిరణములు బింబమువలన మార్పబడి సరిగ రెటీనామీద బింబమేర్పరచుచున్నవి.

ఇటులకిరణములు రెటీనామీద పడక పోయిన అనేకలోపము లేర్పడుచున్నవి. అవి యేవన

1. చత్వారము (Old Sight)
2. సమీపదృష్టి (Short Sight)
3. దూరదృష్టి (Long Sight )
4. మిశ్రమదృష్టి (Astigmatism)

చత్వారము:—

ఈమార్పుసహజమైనదియుజంతుదేహ ధర్మములకు సంబంధించినదియే ఈమార్పు ప్రతి కంటియందును కానబడును. 40,45 సంవత్సరముల యీడున నేర్పడును ఏవిధమైన మార్పును జెందని నేత్రము మామూలు అక్షరములను పది అంగుళములదూరముననుంచిన ఏమియు శ్రమజెందక జదువగలుగును. ఈచత్వారము ప్రవేశించినకొలది యీదూరము ఎక్కువగానుండవలసి వచ్చుచుండును. ఇది యేమొదటిసూచన ఈమార్పునకు కారణమే మన బింబము (lens) యొక్క స్థితిస్థాపకత్వము(Elasticity)వయస్సువలన తగ్గును. కాన

నేత్రముయొక్క దృష్టిని సర్దుకొనెడు శక్తి (Power of accom odation తగ్గును. 40వత్సరములు వచ్చునప్పటికి దగ్గర చూపుసరిగ నుండకుండుటయే యాశక్తితగ్గును. అప్పుడే చత్వారము వచ్చినదందురు.



దీర్ఘ దృష్టి



హ్రస్వ దృష్టి



చత్వారము.

48 సంవత్సరములు వచ్చునరికి 10 అం॥ల దూరమున నుంచి చదువజాలక 13, 18 అంగుళముల దూరమున నుంచవలసి వచ్చును ఈదూరమున సుఖముగావిరామము లేకుండా పని జేయజాలడు.

చత్వారమువచ్చిన కొలది చదువుటకు యెక్కువదూరముగానుంచుకొనవలసివచ్చును అక్షరములు అస్పష్టముగనుండును. సన్నని అక్షరములను చదువుట చాల కష్టముకాన ఎక్కువ వెలుతురు నుండవలెను. ఇటుల నుండిన కన్నునొప్పితలనొప్పి, అతిశ్రమ కన్నునీరుకమ్ముట, దృష్టి మాంద్యము కనురెప్పల దురద మొదలిడును. ఈగుణములన్నియు దీపము నొద్ద పని జేయ వలసివచ్చినప్పుడు యెక్కువగా నుండును.

చత్వారము యొకటియేయున్న దూరమునవున్న వస్తువులను జూచుటలో దృష్టి లోపము లేమియునుండదు.

చికిత్స:-

దృష్టిని సర్దుకొనెడు శక్తి లోపమునకు తగిన ఉబ్బెత్తు అద్దములను దగ్గరపనికియేర్పరుచుకొనవలయును.

ఈచత్వారము వచ్చు వయస్సు మనుజుని శక్తిని బట్టి మారుచుండును. బలహీనుని కన్న బలముగలవానికి ఆలస్యముగా రావచ్చును.

ఈఅద్దములను వృత్తినిబట్టి యేర్పరచవలెను. చదువను, వ్రాయను,-సూదితో పని జేయువారికన్న సంగీతమువాయించు వారికి తక్కువశక్తిగలఅద్దములు గావలసి వచ్చును. ఏలన సంగీతము వాయించునపుడుపుస్తకము 20 అం॥ల దూరమున నుండును.

వయస్సు ముదిరినకొలది చత్వారము కూడ ముదురును గాన అద్దములను కొన్ని వత్సరములలోనే మార్చవలసియుండును. మరీ తరుచుగా మార్చవలసి వచ్చిన అదియొక హాని

కరమైనకంటిజబ్బు (Glaucoma) యొక్కగుణముగాన శీఘ్రముగా నేత్రవైద్యుల సలహా గొనవలెను.

సమీపదృష్టి (Short Sight)

ఈదృష్టి దౌర్బల్యమీ నాగరికపు రోజులలో చాలవిస్తారముగాగానవచ్చుచున్నది. ఇది చాల చిన్నతనములోనే ప్రవేశింప వచ్చును.



ఈదౌర్బల్యమున్న దూరమున నుండి వచ్చు వెలుతురు కిరణములు రెటీనామీద పడక దాని ముందర ప్రతిమ యేర్పడును. అందు వలన దూరమున్న నున్న వస్తువులు స్వచ్ఛముగా గనుపడవు. దగ్గరనున్న వస్తువులు స్పష్టముగా గానుపించును.

రెటీనాముందర తేజఃకేంద్రము యేర్పడకుండా మధ్య పల్లముగా నుండు (concave) అద్దముల నుపయోగించవలెను సరియైన అద్దములను సరియైన కాలములో ధరించిన యీదుర్బలత్వము ముదరక మరియేయితరజబ్బులు రాకుండును. సాధారణముగ రెండు నేత్రములు రెండువిధములుగ నుండును కానసరిగ పరీక్ష చేయించుకొనవలెను.

ఈదౌర్బల్యమునకు ముఖ్య కారణము నేత్ర గోళము ముందు వెనుకల పొడవులో యెక్కువగును. లేకశుక్లమండలము లోని వుచ్చుల వలన వంకర యెక్కువగును. కాని యిది అరుదు.

లేదా కంట్లో పొర (cataract) ప్రారంభమవుచున్నపుడు యీ సమీప దృష్టియే గృహ వచ్చును. మనము కొంతవయస్సు వచ్చిన తరువాత తమకు చత్వారముపోయి మరల జోడు లేకనే జదువ గలుగు చున్నామని యనుచుండుట వినుచున్నాము. ఇట్లుజరుగుటకు యీకంట్లో పొర ప్రారంభించుటయే కారణము. పొర ప్రారంభింపగనే నేత్రములోని బింబము కొంచముబ్బును. కాన చత్వారమునకు వాడబడు చున్న అద్దము అనవసరము. పొర ముదిరిన కొలది యీఅద్దము యొక్క బలము తగ్గవలసి యుండును. కాన కొంత కాలము యిటుల ముదిరిన అద్దము లేకనే జదువ గలిగి యుండును. ఇంకను ముదిరిన దగ్గరచూపు యేర్పడును.

ఈసమీపదృష్టి కొంత వరకు తల్లి దండ్రుల నుంచిరావచ్చును. కాని యీదృష్టి పుట్టుకతో మాత్రము రాదు.

కొద్దివయసులో కళ్ళను సరిగా వాడుకొనక పోయినను దగ్గరగ జదువుట యలవాటుపడినను యీదృష్టి మొదలిడును. వాని యొక్క శరీరారోగ్యము గూడ కొంతతోడ్పడును. ఈ దుర్బలత్వము పట్టణములలో యెక్కువ. సరియైన శరీరవ్యాయామములేక విశేషముగా జదువుట సన్నని అక్షరములు గల పుస్తకములను జదువుట సరియైన వెలుతురు లేకుండ జదువుట శుక్లమండలము మీద మహామారి మొదలగు వానివలన మచ్చలున్న యిస్కూళ్ళలో సరియైన బెంచీలు డస్కులు లేకున్న ఆరోగ్యము బాగుగానుండకున్న యెల్లపుడు కూర్చుండియే

పనులను జేయుచున్న యీ దుర్బలత్వము యెక్కువ యగును.

బాల్యములో కొద్దిగానుండి యెక్కువగాక నటులనే నిలవ బడ వచ్చును. లేదా, బాల్యములోనే యెక్కువగానుండి 25, 30 సం॥ వరకు వృద్ధియైలోన యంతయు జెడి కొంత కాలమునకు దృష్టి నాశనము కావచ్చును.

గుణములు :—

కొద్దిగా యీ దౌర్బల్య మున్నపుడు స్వచ్ఛముగా దూరపు వస్తువులు కనపడక పోవుట తప్ప మరియేమి యుండదు. దగ్గర పనిని కష్టము లేకుండ జేయవచ్చును. దగ్గరగా పెట్టుకొని చదివినకొలది తేలికగా యుండును. కానరానురానుపుస్తకము మొదలైనవి కంటికి సమీపముగా నుండవలసి నుండును. అటులదగ్గిర పెట్టుకొనిన కొలది దుర్బలత్వము హెచ్చగును.

ఒక మోస్తరుగా ముదిరిన దూర దృష్టి మాంద్యమే గాక కొంతసేపు దగ్గర పనిని జేసిన కంట్లో నొప్పి ప్రారంభ మవును. కాన కొంతసేపైనను దగ్గర పనిని జేయజాలదు. కళ్ళు త్వరలో అలయును. వెలుతురు జూడ జాలదు, కళ్ళుమంటలుగా నుండును. కళ్ళముందర నల్లటి చుక్కలున్నట్లు కానుపించుచుండును. ఒకప్పుడు కంటిముందర మెఱుపు లున్నట్లుండును.

ఈ దౌర్బల్యము విస్తారమైన కళ్ళు ఉబికి యున్నట్లుగానుండును. పాపలు పెద్దవిగానుండును. కళ్ళరెప్పలను చిట్లించుచు యేమాత్రముగూడ ఆనదు. దగ్గిరపనిని నొప్పి లేకుండా జేయజాలదు.

సమీప దృష్టియున్నవాడు ఎంత చిన్న అక్షరము లైనను జదువ గలడు దృష్టి దోషము లేనివాని కన్న చాలదగ్గరగా పుస్తకము నుంచుకొనవలెను,

భవిష్యత్తు :—

కొద్దిపాటి దుర్బలత్వమునకు సరియైన అద్దములను ధరించిన సాధారణముగా ఎను గదు. విశేషముగా నుండి క్రమముగా వృద్ధియగుచున్న కంటితో చేయు పనులను మానవలయును. ఈ చివరవారు దృష్టిని జాల జాగ్రత్తగా గాపాడుకొనవలెను.

చికిత్స:—

సరియైన అద్దములను ధరించి కంటికి నొప్పిలేనంతవరకే పనిజేయుచు నీదౌర్బల్యము వృద్ధిగాకుండ జేసుకొనవలెను.

చిన్నలకు కంటిపాపలను పెద్దవిగా జేసి చీకటిగదిలో నేత్రాంతః పట అద్దముతో (Reinoscope) పరీక్షించి సరియైన అద్దములను యేర్పరచవలెను. ఈ అద్దములను దూరపు చూపునకే గాక దగ్గరపనికికూడ వాడవలెను. చదువునపుడు అద్దములు వాడకపోయిన వృద్ధియగును. వీలైనంతవరకు దూరమునకు దగ్గరజూపునకు ఒకటే అద్దము వాడవలెను. 5, 6, నంబరు అద్దము దాక రెంటికి (దూరమునకు దగ్గరకు) ఒకే అద్దమును వాడవలెను. 45 సం॥ దాటిన ఒకే అద్దమును వాడుటకు వీలుండదు కాన చత్వారము అద్దముయొక్క బలమునుతగ్గించి

ఈ దుర్బలత మరీవిస్తారముగా లేనప్పుడు దూరమున కొకద్దము దగ్గిరజూపు కొకద్దము పనికిరాదు. దూరమును దూరపు అద్దములోను దగ్గరపనికి క్రింది అద్దములోను చూచుచున్న కంటికి కండరములకుపనియుండదు. కాన అవిబలవిహీనములౌను. ఒకేఅద్దమున్న దూరమునకు దగ్గరకు సరిపుచ్చుటకు కంటి కండరములు పని జేయును కాన అవి చెడవు.

త్వర లో వృద్ధియగునట్లున్న వానిని ఆరోగ్య వంతునిగా జేసి కంటిపనిని తగ్గించి, శరీర వ్యాయామ మును సరిగ నేర్పరచి దగ్గర పనిని తగ్గించ వలెను పుస్తకమును 13 అంగుళముల దూరమున పెట్టవలెను. సరియైన అద్దములను ధరించ వలెను. వెలుతురు సరిగ నుండ వలెను. వాని వెనుకనుండి వెలుతురు రావలెను. వెలుతురు బాగాలేనప్పుడు చదువ రాదు. దీపముముందగ పనిని మానవలెను.

ఇస్కూలులో బల్లలమీద పిల్లవాళ్లు వంగి చదువు నలవాటు యుండ కూడదు.

ఈ శ్రద్ధలన్నిటిని తీసికొనినను వృద్ధి యగుచున్న దగ్గిర పనినిపూర్తిగమానవలెను. చదువును మాన్పించ వలెను. దగ్గరచూడ కుండ జేయుపనియేదైన యున్నచేయ వలెను ఎల్లప్పుడు నారుబయలులో నుండుచు, తగిన శరీరవ్యాయామును తీసికొని నేత్రములను గాపాడుకొనవలెను.

చిన్నలలో యీదౌర్బల్యము మరీవిస్తారముగానున్న ( 15 డిగ్రీలపైన ) శస్త్రిచికిత్స చేయించవలెను. ఈకళ్ళలో బింబమును తీసివైచిన మరల మంచి చూపువచ్చును.

దూరదృష్టి:-

దూరవస్తువులనుండి ప్రసరించుకిరణములు యీదృష్టి దుర్బలతయున్న కంటిలో రెటినామీదగాక దాని వెనుకభాగమున ప్రతిబింబమేర్పడును.



దగ్గరనున్న వస్తువులనుండి వచ్చుకిరణములింకను వెనుకభాగమున ప్రతిబింబమేర్పడును కాన యీప్రతిబింబము స్వచ్ఛముగా నుండదు.

సమీపదృష్టిలో నేత్రము ముందు వెనుకలకు సాగును. ఈదృష్టిలో నేత్రగోళము ముందువెనుకలకు పొట్టిదగును. ఇదగాక శుక్రమండలము మొదలగువానియొక్క ఉబ్బెత్తుతగ్గుట వలనను రావచ్చును లేక కంటిలోని బింబము లేనందువలనను రావచ్చును. అన్ని దౌర్బల్యములలో యీదూరదృష్టిచాల తరుచుగ కానవచ్చును.

పుట్టుకలోనే యుండవచ్చును. తల్లి తండ్రులవద్ద నుండిరావచ్చును. జన్మించగానే శిశువుల కళ్లు సాధారణముగా దూరదృష్టి గలవిగానే యుండును. శిశువులు యెదిగినకొలది యిది తగ్గును. తగ్గి దుర్బలత లేని నేత్రముగామారి తరువాత సమీపదృష్టి గలదిగా గూడమారవచ్చును.

దూరదృష్టిగల నేత్రము దగ్గర వస్తువుల నేని సరిగ జూడ నేరదు. చూడవలెనన్న కంటికండరములు బింబము మొదలైనవి కొన్నివిధములుగా మారుచుండవలెను. ఇందువలన నేత్రమునకు నెప్పుడును విశ్రాంతి యుండు

టకు వీలుండదు. విశ్రాంతియుండుటకు దౌర్బల్యమునకు సరియైన యద్దముల నమర్ప వలయును.

ఇటుల విశ్రాంతిలేకుండ పనిజేయు చుండుటవలన కన్ను అలయును. కంట్లోపాపకు సంబంధించియున్న కండరములు పనియెక్కువ వలన పెద్దవై పాపను సరిగ ఆడకుండ జేయును. ఇది విస్తారమైన కన్ను చిన్నదై మెల్ల కన్ను యేర్పడును.

లక్షణములు:—

ఈలోపము విస్తారముగా నుండకుండిన దూరముననున్న వస్తువులు బాగుగనే గానిపించును.

ఈనేత్రము గలవాడు చిన్నవాడుగా నున్నను ఆరోగ్యవంతుడుగా నున్నను శరీర వ్యాయామము బాగుగా తీసుకొనుచున్నను లక్షణము లేవియు గానుపించవు. ఈ విధముగా యుండకపోయిన దృష్టిమాంద్యము కన్నునొప్పి యేర్పడును.



చదువుచున్న గాని కుట్టుచున్నగాని వ్రాయుచున్నగాని దీపము దగ్గర పనిజేయుచున్నగాని యీ కనునొప్పి దృష్టిమాంద్యము గానుపించును. కంటిలోగాని లేక కంటిపై భాగమునగాని నొప్పి యుండును. తలనొప్పి నుదురులోగాని తల వెనుకటి భాగములో (మెడలపైన)గాని గానుపించు. కన్ను యెర్ర పడుచుండును. కన్ను నీరుగారును. కళ్లుఆర్చుచుండును. వెలుతురును సరిగ జూడలేదు. కనురెప్పలు మంటలుగా నుండును. దగ్గర దృష్టి అలికి నట్లుండును. వయసు వచ్చిన కొలది యీబాధలు హెచ్చగుచుండును.

బాల్యములో యీదౌర్బల్య మేర్పడిన ఏక కేంద్రాభి ముఖమను మెల్లకన్ను యేర్పడును.

బాలురలో ఎదిగిన కొద్ది దౌర్బల్యము తగ్గును వయసు వచ్చినవారిలో పెద్దవారైన కొలది యిది వృద్ధియగును. లేదాఅటులనే నిలువబడును.

ఈ దూరదృష్టిగలవారు యీవ్యాధులకు లోనగుదురు. కళ్ళుకలక, రెప్పలవాపు గుడ్డుమీద కురుపులు, లోపలివైపునకు మెల్లకన్ను (Glaucoma) దృష్టికటముల వలన పరీక్షించిన యీలోప మెంతయున్నదియు సరిగ తెలియదు ఏలయన పాపకు సంబంధించియున్న కండరములు పనిజేయుచున్నందువలన యీలోపము కొంత వరకు కప్పబడుచుండును సరిగా తెలిసికొనుటకు పాపను పెద్దదిగా జేసి చీకటిగదిలో నేత్రాంతః పటదిఅద్దములతో పరీక్షించవలెను.

కన్ను అలయుట కనుపడినతోడనే అద్దములను ఏర్పరచుకొన వలయును.

చిన్నతనములో మెల్లకన్ను యేర్పడుచుండిన తక్షణమే తగినఅద్దమును ధరించునట్లు జేయవలెను. అద్దముతో పరీక్షించి యివ్వవలసిన సులోచనముకంటె తక్కువ శక్తిగలదానినే యియ్యవలెను కన్నునొప్పి, రెప్పలవాపుకళ్ల మెరుపు తలనొప్పులు గలవారు యీఅద్దములను యెల్లప్పుడును ధరించవలెను ఈబాధలు లేకుండిన దగ్గిరపనికి ధరించిన జాలును ఆరోగ్యులుగా నుండువారటుల ధరించగలుగుగారు 45 సం॥ దాటిన చత్వారముకూడ నుండును గాన దూరపుచూపునకు కావలసిన అద్దముల కన్న దగ్గిరచూపునకు యెక్కువ శక్తిగల ఉబ్బెత్తు అద్దములు కావలసియుండును.

మిశ్రమదృష్టి:

ఇది చాల తరుచుగా గానవచ్చుచున్నది. కంటిలోని బింబముక్రమముగా లేనప్పుడు, అసమమైన వంపుగలిగినప్పుడు యీ దౌర్బల్యత యేర్పడును అదిగాక శుక్లమండలములోని మచ్చలవలనను, శస్త్రచికిత్సవలనను వచ్చును.

నేత్రదృష్టి చాలమందముగా నుండును నక్షత్రములను చూచిన బంతిపువ్వులవలె గానవచ్చును పెద్దగడియారమును చూచుచుండిన కొన్నిగంటల మార్కులు స్పష్టముగా నుండును కొన్ని అలుగుకుపోయినట్లుగా నుండును. నిలువువి అయినా లేక అడ్డముగా నున్నవయినా స్పష్టముగా గానుపించును తక్కినవి స్వచ్ఛముగా నుండవు యీదుర్బలత సమీపదృష్టిలోనైనా దూరదృష్టితోనైనా మిళితమైయుండవచ్చును లేక ఒకటిగానే యుండవచ్చును.

లక్షణములు :—




దగ్గరవస్తువులుగాని దూరపువస్తువులు గాని స్పష్టముగా గానుపించవు దగరపని జేయుచున్నవాళ్ళు శీఘ్రముగా సలసిపోవును దూరదృష్టిలోని గుణములు జారియుండును యీదౌర్బల్యత కొద్దిగా నున్నప్పటికి గుణములు మాత్రము విశేషముగా నుండును బలహీనులలో గుణములు మరీ విశేషముగా పని జేయవలసి వచ్చునుగాని నేత్రమునకు మితిమీరిన శ్రమగలుగును. అందువలన తల తిరుగుట, విశేష తలనొప్పి, మనస్సునకు చిందరవందరగలుగును.

దృష్టి అట్టలతో పరీక్షించిన యెఅద్దమును సరిగ ఆనదు. కాన పాపను పెద్దది జేసియే పరీక్షించుకొనవలెను. అన్నిదృష్టులలో కన్న యీదౌర్బల్యమునకు అద్దములను యేర్పరచుట కష్టము. అందువలననే అనేక విధములైన యంత్రములను కనుపెట్టినారు (Astigmometer, Opthomometer ) వీనికన్న చీకటి గదిలో నేత్రాంతః పటయద్దముతోనే తేలికయని జెప్పవచ్చును.

* ఈ అక్షరములు చిన్న గీతలతో అమర్పబడియున్నవి. చిన్నగీతలన్నియు ఒకేవిధమైన రంగు గలవిగానున్నవి. ఒకకన్నుమూసుకొని యీఅక్షరములను చేయిచాచి పట్టుకొని చూచిన చిన్నగీతలన్నియు సమీపముగా నలుపుగా శుభ్రముగా గనుపడిన యీదృష్టి దౌర్బల్యములేదని గ్రహింపవచ్చును. రెండవ కంటినిగూడ నట్లులనె పరీక్షింపవలెను.

చికిత్స:—

ఇంతశాస్త్రీయముగా పరీక్షించి అద్దముల నమర్చినను మొదటచూపు బాగానుండదు కాని కొన్నిదినములిటుల అద్దములను వేసుకొనిన —చూపు బాగా వృద్ధియగును. "Retinoscope"తో గానుపించినదృష్టిలోపము నంతయు దిద్దవలయును. ఈఅద్దములను ధరించుటవలన వచ్చిన యుపశమనము నింతని చెప్పుటకు వీలుగాదు. ఈమధ్య నొకనరసు నుండి పి. శా. యను నాతడు రెండుసంవత్సరములు తలనొప్పివలన విశేషబాధపడి ప్రాణత్యాగము చేయవలెనను నంతబాధను గలిగినతరువాత వచ్చెను. ఈతలనొప్పిని వర్ణించుట చాలకష్టము బాధంతయు యీమిశ్రమ దృష్టివలన గలిగినదే. కాన యీదృష్టి దోషమును సవరించు నద్దమునుయివ్వగనే చేతితో తీసినట్లుగాయీబాధవానిని విడిచెను. దీనిని బట్టి యీ దృష్టి దౌర్బల్యములు కలిగించు బాధను గ్రహింపగలము.

బాలురదృష్టి:

పిల్లలను సోమరులని బద్ధకస్థులని యనుచుందురు. అటుగాదు వాళ్లకు దృష్టిలోపమువలన నేత్రమునకు మితిమీరిన శ్రమవలన నెమ్మదిగా చూచుట యలవాటగును. దానివలన వారుచదువు సంగతులను గ్రహించుటయు గూడ నాలస్యమగును. కాన నిటులనుండు శిశువుల నేత్రములను జాలజాగ్రత్తగా పరీక్షించవలెను.

తలనొప్పులు:—

తలనొప్పులుగలిగిన సాధారణముగా అజీర్ణమువలననో, కార్యము మందముగా నుండుటవలననో యని యనుకొనుటయేగాని యీవివిధ దృష్టిదుర్బలతల వలన గావచ్చునని మరచుచుందురు. తరుచు తలనొప్పి వచ్చుచున్న నేత్రదోషమువలననే యయియుండును.

దూరపు వస్తువులను కొంతసేపు చూచిన పిమ్మటగాని కొంతసేపు చదివినపిమ్మటగాని కళ్ళు అలసినట్లుగా నుండినగాని, చదువునపుడు అక్షరములు చెదురుచున్నట్లున్న గాని, చదువునపుడు పుస్తకమును మామూలుకన్న దూరముగగాని దగ్గరగగాని పట్టుకొనవలసివచ్చినప్పుడుగాని వెలుతురును జూడలేకుండినట్లున్నగాని కండ్లునుంటలుగ నున్నను, నీరుకారుచున్నను ఇటువంటి బాధలుగాని తలనొప్పిగాని యున్న యీనొప్పి నేత్రదృష్టి దౌర్బల్యములవలన నని గ్రహించ వలసియున్నది; ఎంతెంత కాలమునుండియో యున్నతలనొప్పులు సరియైన యద్దములవలన శీఘ్రముగా బోవుట చూచుచున్నాము.

నేత్రమునకు మితిమీరినశ్రమ:— (Eye strain)

దీనిలో చాల లక్షణము లిమిడి యున్నవి. నేత్రములోని పాపకు సంబంధించిన కండరములుగాని నేత్రగోళముతో సంబంధించిన కండరములుగాని మితిమీరిన శ్రమ



చేసినపుడు కలుగు బాధలన్నియు యీమాటలో యిమిడియున్నవి.

లక్షణములు:—

ఈబాధలను చాల తరుచుగా చూచుచున్నాము గుణములుగూడ విశేషములే

1. నేత్రములోగాని నేత్రముచుట్టుగాని నొప్పిలేక విశేష తలనొప్పి ఈబాధలు దగ్గిరపనిని జేయునపుడు గాని జేయగనేగాని వృద్ధియగును.

2. అలసట. దగ్గిరపనిని జేయగనే బాధగానుపించుట. దీనివలన కొంలదిసేపు కన్న దగ్గిరపనిని జేయలేకపోవుట. ఎక్కువసేపు పని జేసిన కళ్లకు మబ్బుగా గానుపించుట, మత్తు, కళ్లునీరుగ్రమ్ముట, కళ్లుఎఱ్ఱపడుట, వెలుతురు జూడలేకపోవుట, కళ్లరెప్పలు కురుదలు, మంటలు, మొదలగును. ఇవన్నియు రాత్రియగు నప్పటికి యెక్కువయగును.

3. తలతిరుగుట ఏవస్తువైనను రెండుగాగానుపించుట.

4. పార్శ్వపు నొప్పులు. వికారము ముఖకండరములు లాగుచుండుటయు కాన వచ్చును.

ఈగుణములన్నియు దృష్టిదోషము యొక్క పరిమాణముమీదనేగాక వాని యొక్క శరీరారోగ్యమును బట్టి కూడ యుండును. కాన దుర్బలులలో రక్తక్షీణమైన వారిలో నరములదౌర్బల్యముగల వారిలో యెక్కువగానుండును.

చికిత్స: దృష్టిలోపములను సరిగ సవరణ జేయవలెను.

నేత్రములకు సరిపోయిన విరామము శరీరారోగ్యమును సరిగనుంచుకొనుట శరీర వ్యాయామము సరిగనుండుట ఎల్లపనులను సరియగువేళలను చేయుచుండుట మొదలైనవి జేసిన యీబాధలన్నియు తగ్గును.

పత నార్థము

శారద సచిత్ర మాసపత్రిక సంవత్సరచందా ఆరురూపాయిలు అర్ధ సంవత్సరచందా మూడు రూపాయిలు. విడిప్రతి ఎనిమిది అణాలు మూల్యము. ఉత్తమపంగి వెలువడుచుండును.

1 అడుగు

శారద సచిత్ర మాస పత్రిక. చిత్ర విచిత్రములగు పటములతో భావప్రకటనములతో అపూర్వ వ్యాసములతో వెలువడుచున్నది.

2 అడుగులు

శారద నూటనలభై పుటలతో షుమారు యాభై మొదలు అరవై వరకు వివిధచిత్రపటములతో వెలువడుచున్నది.

4 అడుగులు

వీలైనంతవరకు అద్దములను ధరించకుండనుండవలయునను మతముతప్పు. ఇట్టియు జాగ్రత్తవలనకంటిజోడుమానిన మరలచికిత్స జేయుటకుకూడ వీలులేని నేత్రరోగములు రావచ్చును. ఇతరులకంటిజోడు నుపయోగించుట చాలతప్పు

సులోచనములను తయారుజేయుట:

ఈ నేత్ర బాధల యుపశమనము సులోచనముల నమర్చుటయందుగూడ కొంవరకుయున్నది. జోడును జేయునపుడు అద్దముల యొక్క తేజఃకేంద్రమును (optical Centre) పాపల సరిగ నెదురుగనుండవలెను అదిగాక తేజఃకేంద్రముల కొలతయు రెండుపాపల మధ్య కొలతయు సరిగ సరిపోవలయును. సులోచనములను ఎల్లప్పుడు ధరించవలసియుండిన యీ తేజఃకేంద్రములు పాపలకు కొంచెము క్రిందుగానుండవలెను.

దూరపుజూపునకే వాడినదానికంటె మరొక మోస్తరుగాను దగ్గిరజూపునకే వాడిన మరొక

మోస్తరుగాను నమర్చవలెను. అన్నిటిలో నద్దములను నేత్రమునకు వీలైనంత దగ్గరగానుండవలెను. ముక్కుచివర సులోచనములు పెట్టికొని చూచుట చాలతప్పు.

అద్దములు శ్రేష్టమైన యద్దములతో (crown glass) జేయుదురు స్ఫటికములోనుండి తయారు జేసినవికూడ నుందురు (pebbles) స్ఫటికము చలువజేయునని యనుకొనుట వట్టిభ్రాంతి యీయద్దములు తుడిచిన తేలికగా గీతలుపడవు. మిశ్రమదృష్టికి కావలసిన అద్దములు స్ఫటికములతో తయారుకావు. యద్దములు సరిగ నమర్చక పోయిన యవి చేయుమేలుకన్న కీడెక్కువయున్నది.

చాయ అద్దములు:

పట్టణములలోయిళ్లకు తెల్లనిసున్నము వలన అతి ప్రకాశ మెక్కువ (glare) ఈప్రకాశము వలన కన్ను సులభముగా అలయును. దుమారముకూడ కన్నును అలసట జెందించును. కాన యీ బాధకు లేత చాయగల అద్దములను ధరించిన మంచిది.

ఒక కాలమున నారింజ పసుపుపచ్చ కలసిన రంగద్దములు వాడుకలో నుండెడివి. తరువాత నీలవర్ణము వాడబడినది. తరువాత లేత ధూమచ్ఛాయ వాడబడినది.

తెల్లని వెలుతురు ఇంద్రధనస్సులో గనపడు రంగులన్నియు కలసిన యగును. ఈరంగులుగాక, వూదా రంగు అవతలకొన్ని కిరణములు, ఎరుపు వెనుక కొన్ని కిరణములు యున్నవి. ఇవి నేత్రమునకు హానికరములు. ఈపై రంగద్దములన్నియు నా కిరణముల నాపవు గాన కొన్ని అద్దములను తయారు జేసినారు. (Amphyl lenses & Crooks lenses) ఈ రెండు రకములు నా కిరణములను నేత్రమునకు హాని కలుగిజేయ నీయవు. కంటికి నిర్మలత కలుగజేయును. ఎక్కువ వెలుతురు గల దీపముల ముందర పనిజేసినను బాధ యుండదు.

నేత్ర మర్దనము. (Massage) :

ఈమర్దనము నేత్రమునకు బలము నందము నిచ్చును. రక్తనాళములలోని ప్రవాహమును వృద్ధిపరచును. రక్తప్రవాహము వృద్ధియైనందువలన నేత్రములో నేదైన మురికి పదార్థములున్న కొట్టుకొని పోవును. ఈ ప్రవాహమునుమనచేతి వేళ్లతో వృద్ధి పరచ వచ్చును. బొటనవ్రేలితోను రెండవ వ్రేలితోను కంటి చుట్టు నెమ్మదిగా మర్దనజేయు చుండవలెను. నేత్రగోళముమీద బహు మృదువుగా మర్దన జేయవలెను. ఇటుల గొన్ని నిముషములు జేయవలెను.

నేత్ర స్నానము.

ఈ మర్దనమైన తరువాత ఉప్పునీటి కంటి స్నానముజేసిన జాలమంచిది. లోతైన



విశ్వరూపదర్శనము.

వెడల్పాటి పళ్ళెములో నూతి నీళ్లనుగాని కుళాయినీళ్ళుగాని పోసి చెమిచాడు మంచి ఉప్పును గలుపవలయును.

ఊపిరి బిగబట్టి ముఖమును నీటిలో ముంచి కళ్ళునీటిలో నుండగనే పలుమారు నేత్రములను తెరచుచు మూయుచు నుండవలెను. ఊపిరిబిగబట్ట గలిగినంతసేపిటుల జేయవలెను. మరల రెండు మూడు మారులు జేయవలెను. ఈయలవాటు జేసిన నేత్రములు జాల యారోగ్యముగ నుండును. కొంతకాల మిటుల యలవాటుజేసిన కంటి జోడునుగూడ విడగలుగుదురు. ఎంతకాలమునకు జోడును విడగలుగుదురను సమస్య వానిదేహారోగ్యమునుబట్టి నేత్రముయొక్క లోపములనుబట్టియు నిర్ణయింపవలసియుండును. ఈపద్ధతి చాలనెమ్మదియైన చికిత్సయని గ్రహింపవలెను. ఈప్రకారము శ్రద్ధగా నవలంబించిన, నేత్రములు కొలది కాలములో పూర్వారోగ్య స్థితికి వచ్చునని సుప్రసిద్ధ నేత్రవైద్యులు వ్రాయుచున్నారు.



# లీలాకృష్ణ

చ. రసములు చిప్పిలంగ మధురానగరీవనులందు రాగముల్
విసరుచు నందముల్ బిదుకు వేణువు నెమ్మియి నూదుకొంచు రా
జసపుటా యారవున్నడల శ్యామలకాంతులఁ జిమ్మికొంచు నిం
పెసఁగఁ జరించు గోకులమణీ కరుణామతి నన్ను జూడురా!

(సాధకుడు)

# సయ్యద్ అహమ్మద్ అలీ షాఖాదర్ వలీయోగి చరిత్రము.

( బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు. )



ముప్పది సంవత్సరములకు పూర్వమొక భిక్షకుడు అమలాపురము తాలూకా కుండలేశ్వర గ్రామమున వీథుల వెంబడి తిరుగుచుండెను. బాలబాలికలా బిచ్చగానిపై రాలురువ్వుచు వానిని నానా విధ బాధల బెట్టుచుండిరి. గతిలేని వాడని యెవ్వరైన దయదలచి యింత యాహార మిడిన నాతడు భుజించుచుండెడివాడు. అత డెవ్వరి నేమియు ననెడివాడు కాడు. అందుచే రానురాను బాలబాలికల దుండగములు కడముట్టినవి. ప్రజలకీతని యందు జాలికలిగెను. ప్రేమయు నంకురించెను.

అత డైదడుగులన్నర పొడవుండును. శరీర వర్ణము చామన చాయగా నుండును. బక్కచిక్కిన యాతని శరీరమున శల్యముల లెక్క పెట్టవచ్చును. కేశములు పెద్ద పెద్ద జడలుకట్టి యాతని వీపుపై పడుచుండును. పూర్వమాతని యొడలిపై యొక మలిన వస్త్రము (దుప్పటివంటిది) ను, వల్కములైన శరీరాచ్ఛాదనము లుండెడివి. ప్రస్తుత మాతడు దిగంబరి.

అయూర నీయూర కొన్ని సంవత్సరముల పాటు సంచరించి కుండలేశ్వరమునకు మూడు మైళ్ళ దూరములో నున్న కొత్తలంకయను గ్రామ మందాతడిప్పుడు బహు శిష్య పరివృతుడై యున్నాడు. కాలక్రమమున నీతని యందు భక్తి విశ్వాస గౌరవములు కలిగిన ప్రజలు వందల కొలది చేరి యాయనకు సుశ్రూష జేయ మొదలిడిరి. కాని వానికివి యన్నియు నక్కర లేక పోయెను.

ఎవ్వరి పరిచర్య లాతని సంతుష్టి పరచలేదు. అంతకు పూర్వమున్న వల్కలముల గూడ తీసివేసెను. దుప్పటీగుడ్డను కూడ విసర్జించి వైచి మహాకవి వేమన యోగివలె పుట్టినప్పుడును గిట్టినప్పుడును లేని వసనవ్యసనము మధ్యకాలము నందేల" అని మహా వైరాగ్యమును గనుపరచెను. ప్రత్యంశమును యోగపురుష జీవితము ననుకరించుచుండెను. గడియకొక స్థల

మందుండును. ఏకాంత స్థలముల ముండ్ల డొంకలలోను, చెట్లనీడలను, పొలములలోను పండుకొనుచుండును. ఒకసారి గోదావరీ తీరమున కేవల చూపట్టిన వాడు మరుచటి గడియ కావల నుండును. ఈదినట్లుగాని నావలెక్కి పోయినట్లుగాని తెలియరాదు. ఎంతసేపు నిర్జన స్థలముల విహరింప గోరును. ముఖ్యులగు తనశిష్యులలో కొందరితో నప్పుడప్పుడు మాటలాడుచుండును. కాని యవియొకటి రెండు వాక్యములే. ఈతడు హిందూస్థానీ, తెలుగు, ఇంగ్లీషు భాషల మాట్లాడును.

ఏడెనిమిది మాసముల క్రిత మొకనాడీతడు యథారీతిని ముండ్లడొంకల లోనికిపోయి పండుకొనగా నొక త్రాచుపాము కరచినదట. దానిని చూచిన కొందరు త్వరితముగ వైద్యులకొరకును మాంత్రికులకొరకును పరువిడుచుండ, వారిని వారించి దానివిషమునదియే తీసికొనును, మీపనియేమియును లేదనిచెప్పి మందహాసము చేసెనట? తోడనే యాసర్పమట కరచెంచి విషమును గ్రోలి యచ్చట చచ్చి పడి పోయెనట?

ఈయన గొప్పధనికుడగు మహమ్మదీయుడని తెలియుచున్నది. బొంబాయిలోని కొందరు మహమ్మదీయ వర్తకులీతని సంరక్షణకై యీయన శిష్యులకు ధనపంపుదురు. కొత్తలంక గ్రామ కాపురస్థులును ధనవంతులునగు గేదెల వెంకటరత్నము గోవిందరాజులు అను నిరువురన్నదమ్ములీయోగివర్యుని ముఖ్య ఛాత్రులు. వారలీయన కుపచారములను చేయుచుందురు. వారిభక్తి శ్రద్ధల గణ్యము. ఈగేదెల వెంకట రత్నం గారు తాము కాపురమున్న భవనమును యోగీంద్రునికి వారిని చూడవచ్చు యసంఖ్యాకులగు జనమునకు వదలి వేరొక పూరియింటిలో కాపురముండుట చూడ చాల ఆనందము కలుగుచున్నది. ఇదివరకున్న భవనము సరిపడుట లేదనియు యోగికి ప్రత్యేక ముండుటకు వేరొక మందిర ముండ వలయునని యోజించి యిప్పుడు మఱి యొకటి కట్టుచున్నారు. బొంబాయి, కలకత్తా, హైదరాబాద్ పంజాబ్ ప్రాంతములనుండి యీయోగీంద్రుని గాంచువేడుకతో వచ్చు ప్రజలకు విరామము లేదు. వచ్చినవారు యోగికి ఫలములను వివిధ వస్తువుల నొసగెదరు. కాని యీయోగి కట్టి వేమియు నక్కరలేదు. మనసువచ్చెనా ఫలముల యందొకటి రెండింటి నారగించును.

దయ్యములు పట్టినవారు యోగి చెంతకు ఫలాదులను గొనిపోయి యాయనకు ప్రదక్షిణ చేసి నిలువబడుదురు. ఎవ్వరు తెచ్చిన ఫలముల నాతడు తిని “పో” అని యనునో వారి బాధ లానాటితో నంతరింప వలసినదే. ఇట్లనేక పర్యాయములు నిదర్శనముగాన వచ్చినది. ఈయనకు ౧౨౫ సంవత్సరములున్నవని వాడుక. ఈయన నామధేయము సయ్యద్ అహమ్మద్ అలీషా ఖాదర్ వలీసాహెబ్ గారని తెలియుచున్నది. దూరదేశ వాసులైన యీయోగి భక్తులు చాలమంది యుత్తరముల మూలమున తమ కష్ట నిష్టూరముల యోగికి తెలుపుకొందురు. ఆయుత్తరముల నాయన ముఖ్యానుచరులు చదివి వినిపించినంతనే వారికష్టములు తొలగునట.

ఈయోగిని చూచుట కేగవారు క్రొత్తలంక పోయి గేదెల వెంకటరత్నముగారియింటికిపోయెదరు. వారుకొందరు శిష్యుల వారికి తోడిచ్చి యోగి సాధారణముగ సంచరించు స్థలములకు గొనిపోయి వారిదర్శనము కలుగునట్లు చేయుదురు. లేకున్న యోగి దర్శనము కలుగునట్లు చేయుదురు. లేకున్న యోగి దర్శనము కలుగట కష్టము. త్యాగ మూర్తులును, భక్తులును నగు వేంకటరత్నము గోవింద రాజుగార్లనిందులకై చాలప్రశంసింప వలసి యున్నది. ఈవిశాల భారత భూమిని యిట్టి నివురు గప్పిన భక్తావతంసము లెందరో గలరు. వారిని తెలిసికొని పూజించుట మనభాగ్యము. వేమన యోగిని పోలిన నీమహా మహాని జీవితము సంస్మరణీయము.

---

# మోహిని

[భండారు వెంకటేశ్వరరావు సూరపనేని రామగోపాలరావుగారు]

అల్లయదిగో! తుషారమేఘము
తెల్ల వాలచుచు భానుదేవుడు
జల్లుచుండె కరాళి కాంతుల
వెల్లివిరియగ జీవ కళలను
చూడుమీ — నిద్రను వీడుమీ!

నివయః పరిపూర్ణ వార్నిధి
భావిసౌఖ్య తరంగ ముబికెడి;
భావగర్భము, తేట నగవుల
జీవతేజము పొంగి పొరలెడు
మోహినీ — సుందర కామినీ!

చరణ పల్లవ సౌష్టవంబుల
మురువు గొల్పుచు బాలలీలల
కెరలుచుండెను పాలకేడ్చుచు
చిరుత బిడ్డడు ముద్దుపవనుడు.
మోహినీ — సుందరకామినీ!

సార సౌరభ భాగ్యసారము
గోరి వచ్చెడి భ్రమర కటన
స్ఫార మోహన రాగలీలల
జేరిగాంచుము తన్మయత్వము
మోహినీ — సుందర కామినీ?

చిత్రవర్ణపు రచన నేర్పుల
జతిరితంబగు చూప విభ్రమ
చిత్రిసృష్టికి మనము లొగ్గుచు
చిత్రవిగ్రహ గతులు కంటిమి
మోహినీ — సుందర కామినీ?

# భగవద్గీతావళి.



(శ్రీ రాజా మంత్రిపగడ భుజంగరాయ కవి కృతము.)



వ॥ అంత నర్జునుండిట్లనియె
గీ॥ కర్మమున కర్మజ్ఞానంబు ఘనతరముగ
నీకు సమ్మతమయ్యె నానీరజాక్ష?
ఘోరమైనట్టి యీకర్మకూటమందు
నింతగా నన్ను నియమింతువేల కృష్ణ?
అకట! వికటంబుగాఁ దోఁచునట్టి వచన
మున మదీయ మనంబును మోహపరతు
వోయని తలంచుచుంటినే యుక్తివలన
నిక్కముగ మేలుగాంతు దానిని వచింపు
మొక్కదానిని నాకు మహోత్పలాక్ష:
వ॥ అంత శ్రీకృష్ణుండిట్లనియె
అనఘ! జగమున నిష్ఠాద్వయంబు మున్ను
గలయ బల్కితి జ్ఞానయోగంబువలన
సాంఖ్యులకు గర్మయోగ సంక్రియము వలన
యోగులకుఁ దరణోపాయ ముక్తమయ్యెఁ
గర్మ లొనరింపకున్న నైష్కర్మ్య సిద్ధిఁ
నందనేరడు జ్ఞాన శూన్యమయినట్టి
కర్మసన్న్యాసమునను నైష్కర్మ్యసిద్ధి
గాంచనేరడు మనుజుడొక్క క్షణమైనఁ
గర్మ లొనరింపక వసింపఁగలడె యెప్డుఁ
బ్రకృతగుణములచేఁ బరవశతఁ గాంచి
యెల్లజనుడుఁను గర్మఁజేయింపఁబడును
ఎవఁడు గర్మేంద్రియముల నెల్లఁ గట్టి
తనమనంబున నింద్రియార్థములఁ దలఁచు
చుండునట్టిది మూఢాత్ముఁడుర్వియందు
చెప్పఁబడును మృషాచార శీలుఁడనుచు

నెవఁడు జ్ఞానేంద్రియంబుల నెడద చేతఁ
గట్టి కర్మేంద్రియంబులఁ గర్మయోగ
ము ఫలాకాంక్ష లేక చేయునో యతండు
ఘనతరుఁడు గాన నిత్యమా కర్మ నీవొ
నర్చుచుండుము కర్మ కన్నను ఘనంబు
గానొకో కర్మ? ధాత్రి నకర్మ వలన
దేహయాత్రయు నీకు సిద్ధింపదయ్యె
భగవదర్థంబుగాని ప్రపంచకర్మ
వలన లోకంబు బంధింపఁబడును గాన
భగవదర్థంబు ఫలవాంఛ వదలి నీవు
కర్మలొనరించుచుంట యుక్తంబు సుమ్మ
తొల్లి పరమేష్ఠి యజ్ఞాళితోడఁ బ్రజల
సృష్టి గావించి యనె దీనిచేత మీరు
ప్రజల సృజియింపుఁడిది యిష్టవాంఛితముల
మీకొసంగును దీనిచే మీరు దేవ
తలను దన్పుఁడు మిము దేవతలును దనుపు
వారలీరీతి నన్యోన్య వర్ధనంబు
చేత నత్యంత భద్రంబుఁ జెందఁగలరు
క్రమతతులఁ దృప్తులైన దేవతలు మీకు
నిష్టభోగంబులను గూర్మి నీయఁగలరు
వారొసంగిన భోగముల్ వారికొసఁగ
కుండ భుజియించు వాఁడు చోరుండు గాడె!
యజ్ఞశేషంబు భుజియించునట్టివార
లఘవితతినుండి నిర్మోక్షమందఁగలరు;
ఎవ్వరాత్మార్థమై వచియింతు రట్టి
పాతకులు ఘోరపాపంబుఁ బడయఁ గలరు

అన్నమున భూతసంఘ ముత్పన్నమగును
వారిదంబున నన్నంబు వసుధగల్గు
యజ్ఞమున వారిదవితాన మవతరించు
బహుళకర్మల యజ్ఞమేర్పడుచు నుండు
వేదమునఁ గర్మనిరతంబు విహితమగును
తవిలి పరమాత్మ వలన వేదము జనించుఁ
గాన నామ్నాయ మది సర్వగతము నగుచు
నిత్యమును సధ్వరంబున నిల్పియుండు
నిట్లు వర్తించు చక్రంబు నెవఁడు వెంట
నేగడప్పాప జీవుండింద్రియైక
తత్పరుడు ధాత్రిమనుట వృథాగదయ్య
యేనరుండాత్మ నిరతుండాత్మనమోది
యాత్మ తృప్తుండునగుచు నిత్యమువసించు
నాతనికి జేయఁ దగిన కార్యంబులేల
చేయనాతనికొక యర్థసిద్ధిలేదు
చేయకున్న నర్థంబు చెనకబోదు
ఎల్లభూతంబులందును నితనికొక్క
యర్థసిద్ధికిఁ దగు నాశ్రయంబులేదు
గాన నెల్లప్పుడును నీవు కార్యకర్మ
ముల ఫలాకాంక్ష లేక యిమ్ముల నొనర్పు
మమరఫలవాంఛ లేక చేయఁబడు కర్మ
వలనఁ బురుషుండు వరదివ్య పదము నొందు
మున్ను జనకాదు లీకర్మమూలముననె
చిత్తశుద్ధిని వెలయ గాంచిరిగదయ్య!
లోకసంగ్రహమైనను లోనెఱింగి
యర్హకర్మల నీవు జేయఁదగునయ్య
శ్రేష్ఠుడే యేక్రియల నొనరించుచుండు
నొరులు దత్కృత్యములనె చేయుదురు ధరణి
నాతఁడేది ప్రమాణంబటంచుఁ దలఁచు
నదె ప్రమాణంబు గా నెంతురఖిలజనులు
నర్జునా! యీ జగత్త్రితయంబునందు
నాకుఁజేయంగఁ దగినదింతయును లేదు
ప్రాపణీయంబు లేదవాప్తంబులేదు;
ఐనఁ గర్మల నెపుడు నేనాచరింతుఁ
గర్మలను నేను జాగరూకత వహించి
వీక నొనరింప నేని యీ లోకులెల్ల
నన్నివిధముల నామార్గ మనుసరింతు
రేను గర్మలనొనరింప నేని లోకు
లెల్ల నుత్సన్నులగుదు రాహేతువువనె
వర్ణసాంకర్య మొనరించువాఁడ నగుచుఁ
బ్రజలనెల్ల నడంచిన వాఁడనగుదు.
మూఢులాసక్తులై కర్మల నొనర్చు
జాడ, విద్వాంసులెల్ల నాసక్తిమాని
సలుపఁదగుఁ గర్మలను లోక సంగ్రహేచ్ఛ
సక్తిఁ గర్మలొనర్చు నజ్ఞానులకును
బుద్ధిభేదంబు గలిగింపఁ బోలదెపుడు
సావధానతఁ గర్మల నాచరించి
యెలమి నజ్ఞులచేతఁ జేయింపవలయుఁ
బ్రకృతిగుణములచేఁ జేయఁబడెను నెల్ల
కర్మలంచును మది నహంకార వివశుఁ
డగుచు మూఢుండుదాఁ గర్తననుచుఁ దలఁచు
నరసి గుణకర్మల విభాగ మెఱిఁగి నట్టి
జ్ఞానియింద్రియములు తద్విషయములందుఁ
గూడి వర్తించుననుచు సక్తుండు గాడు
ప్రకృతిగుణముల నజ్ఞాన వికలు లగుచు,
గుణములందును దత్కర్మ కూటమందు
సక్తులైనట్టి కించిత్‌జ్ఞ జనులనెపుడుఁ
జేరి సర్వజ్ఞుఁడు చలింపఁ జేయరాదు;
సర్వ కర్మల నాయందు సన్న్యసించి
సంతత వివేక బుద్ధి నిష్క్రియవృత్తి
మమతవర్జించి తహతహమది దొలంచి
యాలమొనరింపు మిదియె శ్రేయమ్ము సుమ్ము.
శ్రద్ధ మదిఁ బాదుకొల్పి యీర్ష్యవడఁగించి
యేజనులనారతంబు నాయీమతంబు
ననుసరించుచు నుందురా జను లశేష
కర్మ నిర్ముక్తులగుట నిక్కంబ, కాని
కినుకచే నామతం బెవ్వరనుసరింప
రఖిల విజ్ఞాన మూఢులౌ నట్టిబుద్ధి
హీనులను బతితులనుగా నెఱుఁగుమయ్య,
జ్ఞానియైనను తనపూర్వ జన్మకర్మ

మనకుఁ దగినట్లు వర్తించు భూతగణము
ప్రకృతి వెంబడి నడుచు నిప్పగిదినుండ
నింక నింద్రియ నిగ్రహం బేమిసేయు
నెల్ల విషయంబులందు సర్వేంద్రియముల
కమరి యుండెను ద్వేషరాగములు రెండు!
నెన్నఁడును దద్వశంబున నెసఁగరాదు
మార్తురగుఁగాదె యని ముక్తిమార్గమునకు
భద్రముగ నాచరింపఁగఁ బడిన యితర
ధర్మమునకన్న నాత్మీయధర్మమగుణ
మైన శ్రేయంబు, నిజధర్మమందు మరణ
మైన నేమంబు, పరధర్మ మనభయంబు.

వ॥ అనవుడు నర్జునుం డిట్లనియె.

సరసిజోదర! ధరణినే పురుషుఁడైన
నిచ్చలేకున్న బల్మిమై భృత్యుపోల్కిఁ
దవిలి యత్ప్రేరణమునఁ బాతక మొనర్చు
నానతిమ్మట్టి కారణమ్ము నఘనాశ!

వ॥ అంతఁ గృష్ణుండిట్లనియె.

తడయక రజోగుణంబునఁ బొడమినట్టి
కామమే ద! యిందలి కారణంబు;
క్రోధముగ మారు నిదియె నిరోధమొంది
యమిత పాపాత్మకంబు మహాశనంబు
నిబిడ ధూమంబుచేత నగ్నియునుబోలె
ప్రబల మలినంబుచేత దర్పణము బోలె,
గ్రమ్ముకొను మావిచేత గర్భంబువోలె
జ్ఞాన మిద్దానిచేత సంఛన్నమయ్యె.
చాలిమియులేక నిండింప వీలుగాక
జ్ఞానిహృదయంబునకు నిత్యశత్రువగుచు
నమరు కామంబుచేత జ్ఞానము సమస్త
మావరింపఁగఁ బడియె ననారతంబు
బుద్ధియు మనంబు నింద్రియంబులును దీని
నిల్వ నిలయంబుగాఁగ వర్ణింపఁబడియె
వీనిచే నిది జ్ఞానంబు వెలయఁగప్పి
యెల్లవిధముల జీవు మోహింపఁజేయుఁ
గాన నీవింద్రియంబుల గట్టుతొలుత
జ్ఞాన విజ్ఞాన నాశకంబైన యట్టి
పాపరూపంబు గామంబు బాపుమయ్య
దేహమునకన్న శ్రేష్ఠమింద్రియ గణంబు
చిత్తమింద్రియములకన్న నుత్తమంబు
చిత్తమునకన్న బుద్ధి యత్యుత్తమంబు
పరము పరమాత్మబుద్ధి తత్వంబుకన్న
నిటులు బుద్ధికతీతుఁడౌ నీశుఁ దెలిసి
మానసము నాత్మచేత స్తంభన మొనర్చి
యత్నముననైన నిర్జింప నలవిగాని
కామమను మేటిపగతు జక్కాడుమయ్య?

[ ఇది కర్మయోగమను తృతీయాధ్యాయము. ]



# భక్త హృదయము



(పుతుంబాక శ్రీకృష్ణయ్య గారు)

౧

చ॥ సదయత మంజురూపమున శారదనాహృదయంబులోపలన్
బొదలగదివ్యవాక్యము లపూర్వఝురిన్ బ్రవహింప నక్కటా
మదిగల తాపమెల్ల చనుమానముతో నిను గూర్చి పల్క నా
హృదయముదందడించునది యెట్లొడగూడగ జేతువీశ్వరా!

మ॥ మతి జింతించుచు నిన్ నిరంతరము కామక్రోధలోభాదిసం
తతిచే గలిగెడు దుష్టబుద్ధుల వెసన్ ధ్వంసింపగా గోరినన్
హితమౌరీతిని నానుగా? దనుచు నాకెన్నాళ్లకేన్ దెల్పకా
తతదుఃఖమ్మున ముంపనీకఘముగా దాభక్తకల్పద్రుమా!

శా॥ పాపాత్ముండని రక్షజేయవాకో? నే బాపాత్ముడన్ గాని నీ
వే పాపాత్ముల బ్రోవలేదో? మదిలోనెంతే విచారింపకే
యీపాపాత్ముని గష్టబెట్ట మనసాయెన్ నీకహో మానులే
యేపాపంబుల జేసితో యెరుగవే యీశా జగన్నాయకా!

మ॥ వినలేదెప్పుడు ధర్మశాస్త్రతతులున్ వేదంబులున్ దర్కముల్
కనలేదెవడు పుణ్యతీర్థగరిమల్ కష్టంబు లెంతెంత లోం
దిన మంత్రంబొకటైన రాదిక "నమస్తే భక్తసంరక్షకా"
యను మంత్రంబును వల్లెవేతు మదినయ్యా భక్తకల్పద్రుమా!

ఉ॥ ఎంతగ వేడినన్ గృపనొకించుక యేమియు జూపవక్కటా
వింతగ దోచుచుండెనిది వేడుక గాదల పోయుచుంటివో
బంతము బూనినాడవొ కృపారహితాత్ముడవైతివో యికన్
బంతమువీడినీ దయకుపాత్రుని జేయుము భక్తవత్సలా!

శా॥ నీవేతల్లివి దండ్రివిన్ సఖుడవున్ బ్రేమించుబంధుండవున్
నీవే నేతవు నీవెదాతవనుచున్ నిక్కంబుగా నమ్మితిన్
లేవన్ లేనితనంబువచ్చెనిక నేలీలన్ సుఖిన్ జేతువో
నావృత్తాంతము లియ్యవే తెలిపితిన్ నాథా జగన్నాయకా!

మ॥ దురితాఖ్యల్ ఘనరజ్జువుల్ గననిచో దుఃఖమ్మువాటిల్లునా
యురిద్రాళ్ళన్ దవ్వులొందకుండ భవదీ యోత్నైకనామాక్షరో
త్తరబాణానలకీలచే లయము నొందన్ జేయుధైర్యంబు, చే
కురజేయన్ నిను వేడికొందు సతముక్రూరాత్మ? విశ్వాధిపా!

# ఆస్ట్రేలియా.



[ఆర్. రంగనాథశాస్త్రి గారు]



ఆస్ట్రేలియా యొకయుపనివేశదేశము. ఇది బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతమై యున్నది. నేడుఈ ద్వీపము సుసభ్యతతోడను సంపదతోడను నలరారుచున్నది. ఇది పూర్వకాలమున అనగా ప్రాగైతిహాసిక యుగమందు దక్షిణ మహాప్రశాంత సాగరగర్భమునుండివెల్వడియున్నది ఈద్వీపమున గల్గినయనేక ప్రళయముల వల్లను ప్రబలములగు తుపానులచేతను అగ్నిపర్వతముల విజృంభణముల వలనను నిచ్చటిపర్వతము లన్నియు చూర్ణములాయెను. అందువలన పర్వత గర్భస్థమగు రత్నైశ్వర్యము బయల్పడియెను. కాని యాయైశ్వర్యము నాదేశవాసులనుభవించు టెట్లు? వారనాగరికులు. బంగారము వెండిరాగి యినుము రాక్షసిబొగ్గు మొదలగు యమూల్య ఖనిజముల మంచి చెడుగులు తారతమ్యములు వారెరుంగకుండిరి. క్యాప్టెన్ కుక్కు అనునాంగ్లేయుడా ద్వీపమును బ్రిటీష్ సామ్రాజ్యాంతర్భుక్తముగ నొనర్చెను. అంతవరకును ఈద్వీపమును గూర్చి సుసభ్యజాతులకు తెలియదు. ఇదియైనా భారతవర్షములకు సమీపమందున్నది. అట్టిచో నిట్టి సమృద్ధిశాలియగు ఆస్ట్రేలియా దేశమును వీరు దెలిసికొనకుండుటకు కారణ మేమియో తెలియుట లేదు. చరిత్రకారులలింతవరకు సరియగు కారణమును చూపింపజాలకున్నారు.



ముంగాసర్దారు—ఆస్ట్రేలియాయందలి యాదిమనివాసి.
ఈజాతివారికి వ్యవసాయమొనర్చి ధాన్యమును పండించుకొని తినుట తెలియదు. కందమూలఫలములు మొదలగువానిని తినిజీవించెదరు.

ఇంగ్లీషు వారడుగిడు నప్పటి కాదేశమందలి వారుభూగర్భమునను భూమిపైనను నున్నసంపద యందొక చిల్లిగవ్వయైన నుపయోగించుకొని యుండలేదనుట యతిశయోక్తి కాదు. ప్రాకృతిక ఐశ్వర్యలక్ష్మియగు ఆస్ట్రేలియా రాకొమరి సర్వాలంకార భూషితయయి వరణమాల్యమును నింగ్లీషు రాకొమరుని గళమున నలంకరించినటుల దోచుచున్నది.

ఖనిజసంపద యందాస్ట్రేలియాధైశ్వర్యశాలిని

యైనను సస్యసంపదయందు సంపూర్ణముగ శూన్యమై యుండెను.

ప్రథమమున నాదేశమున కాలిడినవారాహార పదార్థములు మంచినీరు మొదలగు యభావముల వలన మిక్కిలి కష్టముఁ బొందిరి. కొలదికాలములో నాహారోపయుక్తములగు పదార్థముల నుత్పత్తి జేసికొనిరి. నేడు కాయధాన్యములు, ఫలములు, వెన్న, మాంసము, మొదలగునవి దేశ విదేశములకు మిక్కుటముగ నెగుమతి యగుచున్నవి.

నొనర్చుకొనిరి. ఈ నీలపర్వతము నతిక్రమించి దానిపైనున్న పీఠభూమిని చేరిరి. ఆవిశాలమగు భూఖండమును జెచ్చటజూచినను నిజపదార్థములు సమృద్ధిగా లభింపజొచ్చెను. దానికి పశ్చిమమున నున్న మిక్కిలి విశాలమగు భూమి సస్యోత్పత్తికిని పశుపాలనమునకు నెంతయు ననుగుణ్యామై యుండెను.

ఈ నీలపర్వతమును దాటి పశుపాలనకును సస్యోత్పత్తికిని అనుకూలమగు భూమినను సంధా



చెట్టుమీదనున్న శవమును దించి యెముకల పోగు చేయుచున్నారు.

సిడ్నీ, (పట్టణము) సముద్రతీరమందున్నది. దాని నలువైపుల కావలసినంత భోజనపదార్థము లభింప కుండెను. అందువలననుపనివేశికులు కృషికి భూమిని వెదకజొచ్చిరి. దీనికి పశ్చిమ భాగమున సముద్రతీరమున నలభై మైళ్ల దూరమందు విశాలమగు నీలపర్వత మొక్కటి మార్గము నరికట్టియుండెను. వీరెంత ప్రయత్నించినను ఆపర్వతమును సహజముగ దాటుటకు మార్గము గాన్పింపలేదు. అందువలన విజ్ఞాన సహాయమున నామశ్ఛిద్య పర్వతమును భేదించి యావల కేగుటకు మార్గము

నము చేయజొచ్చిరి. ఈ ప్రయత్నమున వారు పొందిన కష్టములు వర్ణనాతీతములు. ఒకొక్కప్పుడు మార్గముతప్పి వారు క్షుధా తృష్ణలవల్ల పరితపించుచు నాసన్న మృత్యువునుండి రక్షింపబడుటకు తంతి తీగలు తెగగొట్టి సహాయమునకెదురు చూచుచుందురు. అపుడు తంతివార్తలిటునటు చేరకుండుటవలన సిడ్నీనుంచికాని అంతకంటె సమీపమునందలి టెలిగ్రాఫు స్టేషనుల నుంచిగాని ఎవరుగాని వచ్చి తగుసహాయ మొనర్చుట యుండెడిది. ఒకొక్కప్పుడు వారు పచ్చులోపల

కొందరు క్షుధాతృష్ణలచే మృత్యువు వాతపడుటయు నుండెడిది. ఈనీలపర్వతముమీదినుండి సిడ్నీనుంచియు "వుయించసర్" నుంచియు రెండు ప్రశస్తములగు రాచబాటలను తయారుచేసిరి. రైలు మార్గముల గూడ వేసిరి. ఇదిగాక యాస్ట్రేలియా యుత్తర సీమాంతమునందున్న "డార్విన్" రేవు స్థలము లగు వాతపవాలములయందు స్వేచ్ఛావిహారము లొనర్చుచుండెడివారు. పరిశుభ్రమగు నాహార గుణము వలనను శుభ్రములగు వాతపవాలముల వలనను కృత్రిమ రహితమగు ప్రకృతియందు దిరుగుటవలనను నాబాలు రన్యదేశీయుల బాలురకంటె స్వాస్థ్యమునుగల్గి శౌర్యసాహస యుతులై యుత్సాహ



చనిపోయినవాని యెముకలు మొదలగువానిని మధ్యనుంచుకొని బంధువులు తీసికొని వెళ్లుచున్నారు.

నుండి దక్షిణ ప్రాంతమందున్న "అడలైడ్" వరకు తంతితీగల నేర్పాటుచేసిరి. మొట్టమొదట నాదేశము ప్రవేశించినవారు, పశువులు, గుఱ్ఱములు, కోళ్లు, మొదలగు జంతువులనుకూడ వెంట బెట్టుకొని పోయిరి. అచ్చట వీరుచేరిన తర్వాత వీరికి కావలసిన అవసరముల నన్నియును స్వయముగ నే చేసికొనవలసి వచ్చెను. అప్పుడచ్చటవారికి గల్గిన సంతానము ప్రకృతియొక్క యంకమున స్వచ్ఛము పూరిత ప్రయత్నముల నాద్వీపమందు నూతన శక్తిశాలినియగు నొక సర్వసుందర జాతిని నిర్మించిరి. ఈ నూతన శ్వేతజాతివారు ఆదేశమందలి యాదిమజాతులవారి కెట్టిసహాయమును జేయలేదు. అతి నిపుణతతోడ నాయనాది బర్బరజాతివారిని పారదరుము జొచ్చిరి. ఈ శ్వేతజాతియందు విశుద్ధమగు నింగ్లీషు రక్తమే ప్రవహింప వలయునను తలంపున స్త్రీలను గూడ వెంటగొని వచ్చుచుండిరి. కాని వీరి

యందుండు విపత్నీకులు అవివాహితులగుయౌవనులు, మొదలగు వారివలన స్త్రీలతో సంబంధించిన తగవులు నశాంతి మొదలగునవి కొంతకాలమువర కుండెను. ఆకాలమందలి యుపనివేశకులు ఆరబ్బు దేశమందలి "చేయలూన్" జాతివారివలె నెపు గుఱ్ఱములు కుక్కలు మొదలగు వానిరక్షణ కొఱకు ప్రాణము లర్పించుటకుగూడ వెనుదీయకుండిరి. అతిథిసేవకు దియు వివరముల వ్రాసిపోయెడివారు. వచ్చిన యతిథియు తనకవసరమైన వేళమాత్రమే యందున తనకు వలయునంత పదార్థమును మాత్రమే యుపయోగించుకొనెడువాడు. అతిథి అభ్యాగతుల యందీవిశ్వాస మపూర్వముగదా! ఈయపూర్వవిశ్వాసమే యిప్పటికినిసుసభ్యతా శిఖరమున నోలలాడిన భారతవర్షమున నామమాత్రావశిష్టమై యుండి యెచ్చట జూచిన వాని



శవమును చెట్టుమీదబెట్టి ఆకులతోఁ గప్పి వస్త్రములఁ గాపాడెదరు.

నౌకరిని మించియొకరు ప్రయత్నించుచుండిరి. సీమాంత మందుండు జవానులు మొదలగువారు కార్యార్థులై యేగవలసి వచ్చినపుడు నింటితలుపుల దెరచియే వెళ్లుచుండిరి. ఏలయన నేపాంథుడైనను మార్గముతప్పియో ఆన్నాతురుడయియో యరుదెంచిన యెడల సుఖారామము నిందు తీసికొనునని వారి ధర్మచింత. ఆగృహ కుడ్యముమీద యొకవిజ్ఞాపన పత్రమందు భోజనపదార్థములాయింట నెందెందున్న చిహ్నములు మాత్రము గన్పడుచున్న విషయము స్మరణకు రాకమానదు. నేడెవ్వడైనను స్టీమరునెక్కి ఆస్ట్రేలియా ద్వీపమున నేరేవుస్థలమున దిగినను నింగ్లాండు నందలిరేవు స్థలములందువలెనే యుండును. అచ్చట బర్బరులు కనుపడరు. విషమును గ్రక్కుచుండుభీషణ సర్పములుగోచరింపవు. కాంగురా మొదలగు భయంకరమృగములు సంచరింపవు. ట్రాములు, మోటారులు గుఱ్ఱపుబగ్గీలు, మేడలు

మిద్దెలు, విద్యుద్దీపములు వెలుగుచుండును. కాపలా తీర్చి రాజపథములను పోలీసువారు కాయుచుందురు.

లండను మొదలగు పట్టణములకును, ఆస్ట్రేలియా యందలి పట్టణములకును, కొన్ని విషయముల మిక్కిలి భేదము కాన్పించును. ఆస్ట్రేలియా యందలి పట్టణములు రవికరోజ్వలములై యుండును. రెండవభేదము వేషభూషలయందు. ఇంగ్లాండును బోలి యిచ్చట వేషభూషల ధరించుట కెట్టి నియమములును లేవు. ఎవరి యిచ్చవచ్చిన దుస్తులను వారు ధరించి వారిచ్చవచ్చినరీతి సంచరింప వచ్చును. స్త్రీలు ధరించుదుస్తులుమాత్రముమిక్కిలిమూల్యముగల్గియుండును. వీరివస్త్రములు నాటకసంఘములలో నుపయోగించు వస్త్రముల బోలియుండును. పట్టణములయందుండు నియమములు తక్కువని యిదివరకే చెప్పియున్నాము. అపరిచితులగు యువతీయువకులు మార్గమున గలిసికొని మాట్లాడుకొనుచుందురు. కాని వీరికి పరిచయ మొనర్చుటకు నుభయుల నెరిగిన మూడవ మనిషియొక్క యావశ్యకత లేదు.



చనిపోయినవానిని గూర్చి దుఃఖింపు చున్నారు.

కొత్తవారి నాదేశపు స్త్రీలు సందేహముతోడ జూడరు. బంధుభావమున జూచుచునిర్వికార చిత్తమున మాట్లాడుదురు.

ఇట్టా కస్మిక పరిచయము గల్గి క్షణకాలము మాట్లాడిన యువకుని లేక వృద్ధుని తమగృహమునకు భోజనమునకు పిల్చుకొని వచ్చుటకు నచ్చటి స్త్రీలు శంకింపరు. లేక వారితోటి వనభోజనము, ఆమోద ప్రమోదాదులయందు గలయుటకును సంశయింపరు.

ఆస్ట్రేలియనుల చరిత్రయందు నిష్కాపట్యము అకృత్రిమము, సరళస్వభావము గన్పడుచుండును. ప్రాచీనవిధి వ్యవహారముల యందు మిక్కిలి భక్తి శ్రద్ధలు వీరిలో కన్పించును. మిగిలిన గుణదోషములయందు వీ రింగ్లీషువారితో సర్వవిధముల సమానులు. ఇంగ్లాండు ధర్మమే వీరిధర్మము. కాని వీరియందు ధర్మసంబంధమగు కృత్రిమము కన్పట్టదు. ఇంగ్లాండువారి సాహిత్యమే లలితకళలే వీరివియై యున్నవి. వారివలెనె వీరు భుజింపుచు జీవనధారణము

నేతురు. ఆస్ట్రేలియాయందు నీచోన్నత విభేదమంతగా లేదు. అవసరము తటస్థించిన ధనైశ్వర్యములయందు మునుగువారుకూడ కూలీలు చేయు పనులొనర్చుటకు లజ్జింపరు. నేడు కూలిగా నుండినవాడు రేపు మంత్రి పదవి నలంకరింపవచ్చును. "ఈతడెవ్వడు" "కులమేమి" "స్థలమేమి?" "ఇదివరకేమి చేయుచుండెను." మొదలగు ప్రశ్నల నెవరుగాని వేయరు. ఇదివరకు ప్రధానమంత్రులైన వారిలో నొక డతిదరిద్రుడు, స్వల్పవేతనముగల నొక రాజోద్యోగి కుమారుడు. మరియొకడు బండ్లు మరమ్మతుచేసి జీవించు వడ్రంగి కొడుకు. వేరొకడు కూలిపని చేసుకొనువాని పుత్రుడు. ఇంకొకడు బొగ్గుగనులలో పనిచేయువాని కొమరుడు. పదియొకడు చిల్లర దుకాణదారు సంతతియు.



ఎముకలను చర్చినవాని తండ్రిచేత జెట్టుచున్నారు.

రాజ సభాక్షేత్రమును బోలి సాంఘికవ్యవహారములయందుగూడ వారొకేవిధముగ ప్రవర్తింపుచుందురు. వంశమర్యాదలతోడను సాంప్రదాయములతోడను వారికవసరములేదు. వ్యక్తిత్వమునే గారవింతురు. "వీనిగుణమేమి," "స్వభావమెట్టిది" "చరిత్రయేమి" "ప్రకృతి యెట్టిది" ఇవియే వారియాలోచనీయ విషయములు



ఎముకలను గుడ్డలు మొదలగువానిలో చుట్టుచున్నారు.



దుఃఖ సూచకముగా వక్షస్థలమునందును, మోమునందును గాయములు వేసికొనుచున్నారు.



గుడిసెలు. ఈచింకిగుడిసెల యందు వారు సుఖముగ కాలముగడుపుదురు.



వీరు నృత్యము చేయుచు తగాదాలను పరిష్కరించుకొనుటకు గాని, స్నేహితుల సన్మానించుటకు గాని యుద్ధమొనర్చు వారి వేషమున నిట్లుబయలు దేరి వెళ్లుచుందురు. ఇది చూచుటకు మనోహరముగ నుండును.



ఈమెను యిందిమహేంద్ర జాలవిద్యలు చెప్పగల ఘనా
నుండి సమస్తమును గడించి బుద్ధిగలదు



మౌనవ్రతము.—భర్త మరణించినయెడల, వానిపత్ని కొంతకాలము మౌనవ్రత మవలంబించవలయును. మౌన
ముపూర్తియైన పిమ్మట మృతపురుషుని యాత్మీయులు భోజనపదార్థముల దెచ్చియిచ్చెదరు. అప్పుడువారి
చిటికెనవ్రేలు నామెకొరకును ఒకపురుషునికొరకు మరియొక స్త్రీగూడ మౌనవ్రతమూనుచుండును



# ముకుళములు.



ఎంతె రాగమునందు నల్లాపు సకల
భావముల పరిస్ఫుర సాయలావ గాహ
మే మనుజుండు సమగ్రంబుగా మునిగించు ?
భావజలధికి పరిధి నెన్నంగ నోపు ?

* * *

భావ వీచికాడోలికఁ బవ్వళించి
నిమిష నిమిషంబు మార్పుఁ జెందెడు విచిత్ర
మానవ స్వభావమ్ము నామంత్రణంబు
సేయఁజాలు నరుండెపో సృష్టికర్త
చెలువ మెల్లఁ దలఁచి సంతసింపఁగలుగు;

* * *

సకల లోకేశు నాజ్ఞ విశ్వంబులెల్ల
దేలి మునుఁగుచు చిత్ర సందిగ్ధమందు
డోలనా పర్యటించుచుటె ప్రోలుసేత
నుద్యమించెనొ తెలియ నర్హుండెవాఁడు ?

* * *

తెలియ రానట్టి గీత సంకలన మొంది
హృదయ వేదనతో మేళవింపఁ దొడఁగు
సమయమున గల్గు వింత శాంతము తెలుంగు
ప్రియసుతమంబుగ దోఁచు సుహృద్వచాళి !

( సత్యకామి )

కీర్తి శేషులైన.

# శ్రీ శంకరమంచి లక్ష్మీనృసింహ రాజ యోగీంద్రులు.



[బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు.]

---

వీరు ధవళేశ్వర గ్రామ వాస్తవ్యులు. గణపతి పరమహంస స్వాముల వారీయన కాధ్యాత్మికోపాధ్యాయులు. నిట్టల ప్రకాశ దాసు గారు తారక



మంత్రోపదేశకర్త. ఈలక్ష్మి నృసింహరాజ యోగీంద్రులు గొప్పవేదాంతి. గంజాము, విశాఖ పట్టణము, గోదావరి, కృష్ణాజిల్లాల యందీయనకు వేలకొలది శిష్యులున్నారు. ఆంధ్రదేశము నంతట వీరిబోధామృతము ద్రావని వారును వీరి నెరుగని వారును లేరు. చిన్నతనము నుండియు సాముగరిడీల నారితేరి మిక్కిలి బలిష్ఠమయిన శరీర సంపత్తిని సముపార్జించెను.

ఈయోగిపుంగవుడు ౨౬—౮—౨౩ ననుషఃకాలమందు రాతేవ వత్సరమున పరమ పదమును జేరిరి. వీరియాత్మకు సుస్థిర శాంతి పరమేశ్వరుడు చేకూర్చుగాక?

# యజ్ఞముల ప్రభావము



( సు. నరసింహశాస్త్రిగారు )



వైదిక యుగేతిహాసమును పరిశీలించి చూచిన యెడల ఆకాలమందు యజ్ఞముల ప్రభావము సమస్త సాంప్రదాయముల మీదను సంపూర్ణముగ వ్యాపించి యుండి నటుల దోచుచున్నది. బ్రాహ్మణ యుగ మందు యజ్ఞాది క్రియా కాండలు సర్వశక్తి సంపన్న ములై యుండెను. ఈ సంబంధమగు ఉపాఖ్యాన ముల చదివినయెడల యాకాలమందలి సాంఘిక రాష్ట్ర విషయములుగూడ నొకింత గ్రాహ్యమగును. శతపథ బ్రాహ్మణము నందిట్లున్నది. "అషాఢీ సౌశ్రోముడు యజ్ఞమును సరిగ జేయకుండుట వలన మృత్యువు వాతబడి యున్నాడు." యజ్ఞములలో నొక్కొక దానికి యొక్కొక ఫలము లభించు చుం డెను. బ్రాహ్మణమం దిట్లున్నది. "కాపేయులు చిత్ర రథుని కొరకు ద్విరాత్రుల యజ్ఞమును జేసిరి." అనగా నీ వంశమును నెల్ల రాశ్రయింపు చుండిరి. బ్రాహ్మణుల ప్రభావము వృద్ధియైనకొలదిని కొన్ని వంశములవారు మాత్రము రాజ్యముచేయుట కర్హు లయినటుల దోచుచున్నది. ఆ వంశముల వారిని ప్రజ లాశ్రయించి జీవింపు చుండిరి. జహ్నువంశజు డగు విశ్వామిత్రరాజు నాలుగు రాత్రుల యజ్ఞమును జేసి వృచివందు మొదలగు వారిని పారదరిమి, రాజ్య ము నుద్ధరించి యుండెను. వశిష్ఠునకు ప్రతి ద్వంది యు, విశ్వామిత్రునకు బంధువునగు జమదగ్ని ఈయాగ ము వలన శక్తి యుతుడాయెను. ఆయన వంశీకు లీ కారణము వలననే మిక్కిలి యభివృద్ధినొంది యుండిరి. ఋగ్వేద మందిట్లున్నది. "విశ్వామిత్రుడు సుదాసునకు పురోహితుడై యుండెను." విశ్వామిత్రుడు రాజు. అయినను పౌరోహిత్య మొనర్చు చుండెను. ఆకాలమున రాజైయుండి పౌరోహిత్య మొనర్చుట యసంభవము గాకుండెను. విశ్వామిత్రుడు శునశ్శేపుని పుత్రునిగ గ్రహించెను. అందు వలన శునశ్శేపుడు జహ్నువంశమునకు రాజగుటయేగాక, గాధివంశమందలి 'దైవవేదునకు' ఉత్తరాధికారి యాయెను. బ్రాహ్మణమందు 'రాజన్యర్షి' 'దేవరాజ' అను శబ్దము లున్నవి. విదేహరాజగు జనకుడు 'రాజర్షి' యని ప్రఖ్యాతిగాంచెను. ఇందువలన వేద–బ్రాహ్మణ యుగమందు రాజకులమందు జన్మిం చిన వారలు వేదజ్ఞులై ఋషు లగుచుండిరని తేలు చున్నది. దేవాపి క్షత్రియుడు. అయినను పురో హితుడై యుండెను.

శతపథ బ్రాహ్మణమందు, దక్ష–పార్వతీయొక్క వంశీకులగు దాక్షాయణులు యాగ విశేషముల వలన బహుకాలము రాజ సన్మానమును బొందుచుండిరి. నలనైషధుడు దిగ్విజయము వలన యముని తుల్యమగు ప్రతిభాశాలి యాయెను. ఈతనినే 'దక్షిణాగ్ని' యని శతపథ బ్రాహ్మణమందు చెప్పబడి యున్నది. ఈతడు దక్షిణ దేశపు రాజై యుండెను. యముడు దక్షిణ దిక్కునకు రాజుగదా? అయిన నీతని యముని తోడ బోల్చుటకు కారణము యముడు వినాశశక్తికి దేవత యయి నటులనే యాతడు యుద్ధములయందు మిక్కుటముగ నాశనముచేయుచుండి నటుల దోచు చున్నది. గోపథ బ్రాహ్మణమందిట్లున్నది "ఒక ప్పుడు జనమేజయ మహారాజు వేటకుజన ఆయనకు రెండుహంసలు గన్పడెను. మీరెవరని ప్రశ్నింపగా

మేమిరుపరము "దక్షిణాగ్ని ఆహవనీయము." అని నుడివి బ్రహ్మచర్యగుణము- కాలము మొదలగు వానిని వర్ణించి చెప్పెను.

శతపధ బ్రాహ్మణమందొక కధయున్నది. శ్యాపర్ణ సాయకాయను డిట్లనుచున్నాడు "నేనొనర్చు యజ్ఞము సమాప్తమయినయెడల నావంశీయులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య తుల్యులగుదురు." ఇందువలన నొక వర్ణమువారు మరియొక వర్ణమున చేరుటకవకాశముండినటుల గోచరింపుచున్నది. అయితే రేయ బ్రాహ్మణమందు "యజ్ఞసంబంధమగు క్రియలయందు లోపముజరిగిన వానిసంతానము అన్యజాతిగ బరిగణింపబడునని" యున్నది.

ఒకప్పుడు కేశీవంశమువారు సత్రయజ్ఞమును చేయ మొదలిడిరి. అప్పుడు యజ్ఞముకొరకేర్పడిన ఆవును పెద్దపులి చంపెను. అప్పుడు కేశీవంశ గృహపతి ప్రాయశ్చిత్త మేమియో తెలిసికొనుటకు ఖండికుని కడకు బయలుదేరునప్పుడు "ఖండికుడు నీకింకను అపకారమును చేయును. కావున నీవాతని కడ కేగవలదని" యాయన పరిషద్వర్గము నుడివెను. కాని యాతడా మాటల నాలకింపక "యజ్ఞము సఫలమైనను కావలయును, లేదా యజ్ఞముతోడ నేనుగూడ నాశనమగుదును" అని శపధమొనర్చి ఖండికుని కడకేగెను. అప్పుడు ఖండికుడు తన పరిషద్వర్గమును చూచి యిట్లనియె "నేను ప్రాయశ్చిత్త విషయమును చెప్పను. అట్లయిన నీవంశీకులు నావంశముమీద నాధిపత్యమును వహించెదరు. అందువలన నాకు మోక్షముగలుగును. చెప్పనియెడల సరిగ దీనికి తల్లక్రిందులగును." అన వారిట్లనిరి "మీరు చెప్పవలదు. క్షత్రియుడు పృథ్వియందంతటను తన యాధిపత్యమును వ్యాపింపజేయుటకు బ్రయత్నించుట వాంఛనీయముగదా?" దీని కాతడిట్లనియె. "కాదు. ఏలయన, అస్థాయియగు నీజీవితముకంటె స్వర్గప్రాప్తి శ్రేయముగదా" అని యాతడు ప్రాయశ్చిత్త విషయమునంతయు జెప్పెను.

ఈ కధవలన యజ్ఞముయొక్క శ్రేష్ఠత్వము మనకు గోచరింపుచున్నది. యజ్ఞమును సఫలముగ జేసి తీరవలయునను దృఢసంకల్ప ముండెడిది. ఈ సంకల్పము ననుసరించి కేశీయనువాడు, ఖండికుని యుపదేశానుసారము ప్రాయశ్చిత్త మొనర్చెను. దీనికి ఫలముగా యావంశమువారు పృథ్వియందు బహుకాలము పరాక్రమవంతులై యుండిరి. క్షత్రియుల యందు యజ్ఞములు నడిపించు జ్ఞానము మిక్కుటముగ నుండినటుల తోచుచున్నది. ఈ విషయమున నాధిక్యతను సంపాదించుకొనుటకు వారిలో వారికి పోటీయుండినటుల గనుపడుచున్నది. కేశీ ఖండిక వంశీయు లిర్వురకు సఖ్యములేదని తెలియుచున్నది. రాజ్యభోగముల కంటెను సహాయమును గోరుచున్న శత్రువునకైనను సహాయమొనర్చి స్వర్గఫలమును జ్ఞానులు గోరుచుండిరని దెలియనగును.

శతపధ బ్రాహ్మణమందు మరియొక కధయున్నది. వరుణపుత్రుడు భృగువు. ఆతడు తండ్రికంటెను తానధికజ్ఞానినని దలంపుచుండెను. అందువలన వరుణుడు పుత్రునిజూచి తూర్పు దక్షిణ పశ్చిమ ఉత్తరదిక్కులను, ఉత్తరపూర్వ కోణమునందును తిరిగి నీవు చూచిన విషయముల సంపూర్ణముగ నాకు తెలియజెప్పుమని యాజ్ఞాపించెను. అటులనే భృగువు తూర్పుదిక్కున తిరుగజొచ్చెను. అచ్చట మానవులు మానవులచేతులు మొదలగు వానిని ఖండించి వైచుచుండిరి. దక్షిణదేశమున మానవులు మానవులను ముక్కలు ముక్కలుగ నరుకుచుండిరి. వారిని చూచి యిట్లొనర్చుటకు కారణమేమని యడుగ వారు పూర్వజన్మమున వీరు మమ్మిట్లు పీకుకుని తినుటవలన తిరిగి మేమిట్లు పీకుకుని తినుచున్నామని ప్రత్యుత్తరమిచ్చిరి. భృగు ఉత్తరతూర్పు కోణమునకేగెను 'కల్యాణీ, 'అతికల్యాణీ, యను నిరువురు స్త్రీలమధ్య నొక పురుషుడు నల్లని శరీరమున, నెర్రని కండ్లతోడ చేత దండమును ధరించియుండెను. ఆదర్శనమువలన నాతడత్యంత భీతుడై తిరిగివచ్చెను. తండ్రికి తాను

చూచిన వానిని వివరించి చెప్పగా నిరుణుడిట్లనియె. "తూర్పు—దక్షిణ—పశ్చిమ—ఉత్తర దిక్కులు చూచినవి వరుసగ వృక్షములు—పశువులు—తృణము—జలము. వీనిని అగ్నిహోత్రమందు యజ్ఞమొనర్చిన యెడల వృక్ష—పశు—మొదలగునవి జగత్తునందు సమృద్ధియగును. ఉత్తర పూర్వకోణమందు చూచిన యిర్వురు స్త్రీలు విశ్వాసము అవిశ్వాసమను వారు. వీరిర్వురి మధ్యనున్న పురుషుడు క్రోధరూపము. యాగ ద్వారమున వీనిని జయింపవచ్చును.

యజ్ఞములవలన బహిరంతర జగత్తులను వశ పరచుకొన వచ్చునని పురోహితులు దలంపు చుండిరి. ఈశాన్యదిక్కును (ఉత్తర పూర్వకోణమును) దేవతలు శుభప్రదమైన దానిగ దలంపుచుండిరి. ఏల యన, అచ్చటనే (అంతర్జగత్తు) దేవత లసురులను (ఇంద్రియ గణమును) నోడించిరి. ఐతరేయ బ్రాహ్మణమును దిలకించినయెడల దేవాసురులకు జరిగిన యుద్ధములయందు తూర్పు—దక్షిణ—పశ్చిమ—ఉత్తర దిక్కులయందు అసురులకే జయము కలిగెను. ఈశాన్య మూలను జరిగిన యుద్ధమందు మాత్రము దేవతలు జయించిరని గనుపడుచున్నది. దేవాసుర సంగ్రామమును గూర్చిన కథ లింకను అనేకములు గలవు. ప్రజాపతి సంతానగణమగు దేవాసురులకు యుద్ధము ప్రారంభ మాయెను. అసురులు భూలోకమునకు ఇనుప ప్రాకారమును గట్టిరి. అంతరిక్షమును రజత ప్రాకారమున బంధించిరి. ద్యులోకమును స్వర్ణప్రాకార యుక్తముగ నొనర్చిరి. దేవతలు ఉపసత్ వలన త్రిలోకములను జయించిరి. (శత—బ్రాహ్మణము.)

ఈ సంగ్రామమును రూపకమని చెప్పవచ్చును. 'ఉపసత్' అనునది యజ్ఞమందలి యొక యంగ విశేషము. దీనివలన మనస్సు దృఢమును శక్తిశాలియై చంచల రహితమగును. "ఈ సంగ్రామము ఆర్యులకు, అనార్యులకు జరిగిన యుద్ధమును సూచింపుచున్నది. యుద్ధము తటస్థించి నప్పుడు అనార్యులు ప్రాకార పరివృతమగు వాని యందుండి యాత్మరక్షణను జేసికొను చుండిరి. స్వర్ణ రజత ప్రాకారయుక్తమగు అంతరిక్షమను నది కల్పన. లోహ ప్రాకారమన దృఢత్వమును సూచింపుచున్నది. ప్రచండ వేగమున అనార్యుల పురములను జయించుటకు తగిన యస్త్ర శస్త్రములు ఆర్యులకు లేవు. మరియు వీనిని సిద్ధ పరచుకొనుట మిక్కిలి యాయాస మగుట వలన ఆర్యులు సాధారణముగ 'ఉపసత్' ద్వారమున అనగా దుర్గముల నరికట్టి దుర్గముల జయింపుచుండిరి." అని కొందరు తలంపుచున్నారు.

శతపథ బ్రాహ్మణమందు మరియొక చోట యిట్లున్నది. అగ్ని—సోమ—మఖ—విష్ణు—విశ్వదేవ గణ మొక సత్రమును నిర్మించి యజ్ఞమును ప్రారంభించిరి. ఈ యజ్ఞ స్థానము కురుక్షేత్రము. అప్పుడు దేవత లిట్లనిరి. మన యందు శ్రమ—తపస్సు—శ్రద్ధ మొదలగువాని ద్వారమున యజ్ఞ ఫలమును బొందువాడు సర్వోత్తముడు. విష్ణువు ప్రథమమున కృతకార్యుడగుట వలన ప్రధాన దేవత యాయెను. అందువలన నాతడుగర్వితుడై జ్యాయుక్తమగు ధనువును మెడమీద నుంచుకొని ముందుకు వచ్చెను. అప్పుడొక విధమగు పిపీలికమాతని మెడమీదనున్న ధనువుయొక్క నారిని కొరికివైచెను. వెంటనే ధనువు క్రీం, శబ్ద మొనర్చుచు నాతని మెడను ఖండించెను. అందువలన విష్ణువుయొక్క తల యంతరిక్షమునకేగెను. ఆతలయే సూర్యుడాయెను. తాండ్య బ్రాహ్మణమందు గూడ నీకథ యున్నది. కాని యందు మఖుని తల యీవిధముగ ఖండింపబడి సూర్యుడాయెనని యున్నది.

ఈ కథ వలన యజ్ఞముయొక్క గురుత్వము సూచింపబడు చున్నది విష్ణువు యజ్ఞము; సూర్యుడు యజ్ఞముయొక్క శ్రేష్ఠాంశయని చెప్పబడినది. అశ్వినీ ద్వయము కురుక్షేత్ర మందలి యజ్ఞమున కాహ్వానింపకుండిరి. అశ్వనీద్వయము పృథ్వియందు సమస్తజీవులకు చికిత్స చేయుచుందురు. అందువలన దేవతల దృష్టియందు వీరు గణనార్హులు కారు. అందువలననే వీరిని యజ్ఞమున కాహ్వానింపరైరి. చికిత్స బ్రాహ్మణ

కార్యము కాదు. కురుక్షేత్రము దేవతల యజ్ఞక్షేత్రము. అందువలన నిది భూమండలమందత్యుత్కృష్టస్థానమని బ్రాహ్మణములయందు చెప్పబడియున్నది. అథర్వణవేదమందు కురురాజగు పరీక్షితునిఖ్యాతి బహుముఖముల వర్ణింప బడినది. బ్రాహ్మణములయందు కురురాజగు జనమేజయుని గూర్చి పలుతావుల జేర్కొన బడెను. కురు పాంచాల బ్రాహ్మణులగు ఉద్దాలకుడు, అరుణియను వారు యజ్ఞకార్యములయందు ప్రామాణ్యులుగ బరిగణింపబడుచుండిరి. కురుపాంచాల దేశములే వాగ్దేవికి ప్రియస్థానములు. కురుపాంచాలురు సర్వశ్రేష్ఠమగు యజ్ఞముల నొనర్చుచుండిరి. అందువలన యజ్ఞములకాదిస్థానము కురుక్షేత్రమనియు, అచ్చటనుండియే బ్రాహ్మణాధిపత్యము భారతవర్షమందంతటను వ్యాపించెననియు తోచుచున్నది.

గోపథ బ్రాహ్మణమందీకథ యున్నది. “కాబంధుని పుత్రుడగు కాబంధీ యనువాడు, మేధావియు, మీమాంసశాస్త్రజ్ఞుడు. ఇందువలన నాతని కభిమానము మిక్కుటమాయెను. ఒకదినమున నాతని తల్లి యిట్లనియె. “కురుపాంచాల అంగ మగధ కాశీ కోసల సాళ్వ మత్స్య శవస ఉశీనర మొదలగు దేశవాసులు సంపాదించుకొని యుదరపోషణ జేసికొనుచున్నారు. కాని నీయభిమానము వలన మన కేమియు లభించుటలేదు. అనకాబంధి యౌవ్వనాశ్వసార్వభౌముని సోమయజ్ఞశాలకేగెను. ఆసభయందలి పండితుల తోడ వాదమున కుపక్రమించెను. మరియు నచ్చట పురోహితుల కిటుల చెప్పెను. నలువైపులనుండి బుట్టి ప్రవహించు నదులన్నియు సముద్రమందు సంగమించిన పిమ్మట వాని ప్రత్యేకత యంతర్హిత మగుచున్నది. ఆజలరాశిని సముద్రమనుచున్నాము. అటులనే వేదరహస్యము బ్రాహ్మణములు పురాణములు – ఉపనిషత్తులు ఇతిహాసములు అను శాసనములు మొదలగునవన్నియు యజ్ఞమందు పర్యవసితమైనయెడల వీనికి ప్రత్యేక నామధేయము లుండవు.”

ఈయుపాఖ్యానమువలన గూడ యజ్ఞముల యుత్కర్షప్రతిపాదింప బడుచున్నది. బ్రాహ్మణ యుగమందు బ్రాహ్మణ సభ్యత అంగ మగధ–మొదలగు దేశములయందు వ్యాపించి యుండెను. ఆకాలమున పురాణములు ఇతిహాసములు మొదలగుశాస్త్రములు వేరువేరుగానుండినటుల తోచుచున్నది. శతపథ బ్రాహ్మణమందు అనుశాసనము–విద్యా–వాకోవాక్య–ఇతిహాస–పురాణ–గాథా–నారాసంశీ–మొదలగు శాస్త్రముల పేర్లుదాహరింపబడినవి.

‘విద్యా’ అనగా, ‘న్యాయ– మీమాంస మొదలగునవియని సాయణుడు చెప్పుచున్నాడు. కాని సర్పవిద్యా, దేవభారవిద్యా, అప్సరవిద్యా, మొదలగునవాని పేర్లు గూడ శతపథమునందు గనుపడుచున్నవి.

వాకోవాక్య యన ధర్మశాస్త్ర సంబంధమగు సంభాషణము లేక విచారమని దీనికుదాహరణముగ సాయనాచార్యుడు ఉద్దాలకుడు, ఆరుణి సైదాయనుని శాస్త్ర విచారమునుచూపించినాడు. ఇతిహాసమనగా సృష్టితత్వమని శాయనమతము. దీనికుదాహరణము శతపథబ్రాహ్మణమందలి సలిలమునుండి విశ్వోత్పత్తి వివరణమును చూపెను.

పురాణములన పురాతన పురుషులవృత్తాంతములు. దీనికి దృష్టాంతము పురూరవ యూర్వశియొక్క చరిత్ర. గాథయన నేదియో యొకసంబంధమగు గానములేక కవిత్వము.

‘నారాశంసీ, ఎవడోయొక వ్యక్తినిగూర్చినగాథ. శతపథ బ్రాహ్మణ మందలి జనమేజయుడు ఆతని యశ్వసంబంధమగు వివరణము.

పై విషయముల వలన కురుపాంచాల; సవశ ఉశీనర; అంగ మగధమొదలగునవి జంటలుగ నుదాహరింపబడుటవలన నాజాతులవారొకరి కొకరు సమీపమునని వసించుచుండిరనియు లేక యుభయులూ కేయాచారవ్యవహారనీతి రీతులుగల వారనియు తోచుచున్నది.

# జాతివిజ్ఞానము

(అ. సోమసుందరరావుగారు.)



సృష్టి యందన్నిటికంటెను విస్మయ కరమగు సృష్టిమానవుడు. మానవప్రకృతిని బరిశీలించి చూచినకొలదిని మానవ సంబంధమగు జ్ఞానము గలుగుచుండును. నృతత్త్వవిదులు మానవ ప్రకృతిని పరిశీలింపుచుందురు. జీవ జగత్తునందు మానవునకు స్థానమెచ్చట— మానవున కాదియేది— అనునవియే వారిపర్యాలోచన విషయములు. వ్యక్తికిని జాతికిని గల సంబంధమంతయు మానవ రూపము వచ్చువరకుండు పరిణామమును గూర్చి యెక్కుడు శ్రద్ధవహించెదరు. మరియు మానవుని కార్య ప్రణాళి ననుసరించి భావములు భాష, ధర్మతత్త్వము, నీతివిజ్ఞానములు, పదార్థవాదము, సాంఘిక తత్త్వము మొదలగునవిగూడ నృతత్త్వ విదుల యాలోచన యందుండును.

మన మెరిగినంతవరకు నృతత్త్వ విద్యకు ప్రథమ ప్రవర్తకుడు హిపొక్రిటీస్. ఈయన క్రీ—పూ—160 మొదలు 357 వరకుండెను. తర్వాత యరిస్టాటిలను నాయన నృతత్త్వ విద్యయందు ప్రవీణుడాయెను. ఈతడు మానవుని సాధారణ జీవుల యందు జేర్చెను. ఇట్లనుట వలన మానవుని విశిష్టతను గుర్తింప లేదని కాదు. మానవుని మస్తిష్కము సమస్త జీవులకంటెను మిక్కుటమని గ్రహించెను. మానవుడు రెండు కాళ్ళ మీద భారమూని నడచుచున్నాడు. అందువలన నీతని మస్తిష్కము సమస్త ప్రాణుల మస్తిష్కము కంటెను మిక్కుటము. ఈతని కనన్య సాధారణమగు మనస్సు కలదు. కావున మానవుడనన్య సాధారణ జీవుల యందు బరిగణింపబడుచున్నాడు. అని యాయన యభిప్రాయము.

నృతత్త్వమును గూర్చిన స్వతంత్ర చర్చ కొలది కాలము క్రిందటనే యూరపునందు ప్రారంభింపబడెను. అందువలన పురాతన శాస్త్రముల యందు నృతత్త్వమునకు స్థానములేదు. కొలది వత్సరముల క్రిందటి వరకును దీనిని స్వతంత్రవిజ్ఞానముగ చర్చించుటకే యవకాశము గలుగకుండెను. జీవ విజ్ఞానము, శరీరసంస్థాపనవిద్య, శారీరవిజ్ఞానము, మనోతత్త్వము ధర్మతత్త్వము, నీతి విజ్ఞానము, భాషాతత్త్వము, జాతి విజ్ఞానము— మొదలగువానియందిదివరకే నృతత్త్వవిషయములు చర్చింపబడియుండుటవలన నృతత్త్వమునకు ప్రత్యేక స్థానమిచ్చుటకు వైజ్ఞానికులంగీకరింపకుండిరి. ఆయనకు మిక్కుటముగ నభివృద్ధినొందినభూతత్త్వము— ప్రాగైతిహాసిక ప్రత్నవస్తు తత్త్వము మొదలగు వాని మూలతత్త్వము నృతత్త్వాంతర్గతములని వైజ్ఞానికులంగీకరింపుచున్నారు. ముఖ్యముగ నృతత్త్వము మానవ జాతి యొక్క పూర్వావస్థను తెలిసికొనుట తోడ పూర్తియగుచున్నది.

నృతత్త్వముతోడ ఇతిహాసమునకు సంబంధముండుటవలన కొందరు దీనిని విజ్ఞానపర్యాయభుక్తముగ నొనర్చుటకంగీకరింపకున్నారు. అట్లయినచో జీవతత్త్వమునుగూడ విజ్ఞానమున కంతర్భుక్తముగ నొనర్చుటకు వీలులేదు. జీవతత్త్వమును విజ్ఞానముయొక్క యొక యంగమని చెప్పుట కెట్టి యాక్షేపణయు లేదుగదా? అట్లనే జీవతత్త్వముయొక్క శాఖయే నృతత్త్వము. జీవతత్త్వముతోడ నితిహాసమునకు సంబంధము లేదని చెప్పనెట్లు? జీవతత్త్వమున నాలోచింపబడు విషయము ప్రాణితత్త్వము. ప్రాణితత్త్వము జడ

తత్త్వమును నది యొకటి కాదు. ఏలయన, జడము ధర్మముగతి; ప్రాణముయొక్క ధర్మము వివర్తనము. ఇందువలన నివి రెండును వేర్వేరని తేలుచున్నది. జడతత్త్వము అజ్ఞాతమగు నొక తత్త్వమువలన గుణింపబడి ప్రాణతత్త్వముగ మారుచున్నది. కాని యిది జడధర్మముకలది కాదు. వివర్తనమన పరివర్తనమని. జడరాజ్యమందు పరివర్తనములేదు. ప్రాణరాజ్యమందున్నది.

జీవతత్త్వమునకు ఇతిహాసముతోడ సంబంధము గలదు. దీనియందు ఇతిహాసధర్మముగూడ నుండినను విజ్ఞాన పర్యాయభుక్తమగుచున్నది. ఇటులనే యితిహాసధర్మముగల జీవతత్త్వముయొక్క యొక శాఖయగు నృతత్త్వమేల విజ్ఞానపర్యాయభుక్తము కాగూడదు? 'మ్యారియెట్టు' అను నాయన యిట్లనుచున్నాడు. నృతత్త్వమొక విశేషసత్యము ననుసంధానమొనర్పుచుండినను జీవతత్త్వమునకు శాఖయైయున్నది. అందువలన జీవతత్త్వము యొక్క వివర్తనపద్ధతి నిది యవలంబించుచున్నది. అట్టిచో దీనిని యేల విజ్ఞానపర్యాయభుక్తముగ దలంపరాదు?

నృతత్త్వముయొక్క స్థానము విజ్ఞానము, ఇతిహాసములకు మధ్యనున్నది ఇతిహాసము, సాహిత్యము, కళలు, ధర్మవిషయికములగు చర్చలు మొదలగునవి నృతత్త్వమున కంగీభూతములు. అయినను విజ్ఞానరీతి ననుసరించియే పరిశీలింపనర్హములయును. మానవకోటియందనేక శాఖలుగ నభివృద్ధినొందిన సాహిత్యము కళలు, ధర్మము మొదలగువానిని పరస్పరము చూచి మానవుని యొక్క యుత్పత్తిని గూర్చియు, వాని యున్నతి యవనతులను పరిశీలించి కనుగొను ప్రయత్నమును నృతత్త్వమందురు.

నృతత్త్వమునకు శారీరిక తత్త్వవిద్య యొక శాఖ. అనేకులు శారీరతత్త్వవిద్యను, నృతత్త్వమునుండి వేరుపరచుటకు ప్రయత్నింపుచుందురు. నృతత్త్వమునుండి శరీరతత్త్వవిద్యను వేరు పరచినయెడల నృతత్త్వమసంపూర్ణమగును. నృతత్త్వముతోడ నొకవైపున మనోవిజ్ఞానమునకు సంబంధముండి నటులనే రెండవవైపున జీవతత్త్వముతోడను విశేష సంబంధము గలదు. విశుద్ధభావమున జీవతత్త్వమునుగూర్చి యోచించువారు మనోవిజ్ఞానమును, ఇతిహాస విషయమును గమనింపరు. అందువలన నృతత్త్వవిచారణయందీ రెంటిని గమనింపవలయును. ఇట్లు యోచింపనియెడల నృతత్త్వవిచారణ యంగవిహీనమగును,

వర్తమాన కాలమున నృతత్త్వమును గూర్చి విచారించినటుల పూర్వకాలమునందెప్పుడు జరుగలేదు. ఇప్పుడు ధర్మతత్త్వానుసంధాయకులెల్లను నృతత్త్వమును గూర్చి విచారింపుచున్నారు. ఇందువలన నమూల్య రత్నములు బయల్వెడలినవి. పృథ్వియందలి సమస్త జీవులకును దేహసంబంధముగలదు. మనశాస్త్రానుసారము దేహాత్మల సంయోగమువలన జీవుని యుత్పత్తి సంభవించుచున్నది. కావున దేహముతో సంబంధించని యాత్మ విషయమగు చర్చ ప్రకృతి విజ్ఞాన విషయముకాదు.

మానవునకు దేహమున్నటులనే యాత్మకూడ నున్నది. కాని యాత్మకును విశుద్ధమగు ప్రకృతికిని యేవిధమగు సంబంధములేదు. కావున ప్రాకృతిక విషయములే ప్రకృతి విజ్ఞానమందు యోచింపబడును. దేహయుక్తమగు ఆత్మయే మనుష్యుడు. దేహమువీడిన యెడల మానవుని మనుష్యత్వము నిలువదు. కావున దేహముతోడ మానవునకు దృఢమగుసంబంధముకలదు. అందువలన మానవదేహమును గూర్చి విచారించునప్పుడు మానవతత్త్వమునుగూర్చి మిక్కుటముగ విచారింపవలసియుండును.

బురుషులమతము ననుసరించి యాత్మనిత్యము. అది దేహమునందుత్పత్తి కాదు. కాని దేహమందు ప్రవేశించును. కొంతకాలమైన పిమ్మట యాదేహమును త్యజించును. పాశ్చాత్యపండితులలో కొందరు ఆత్మకుత్పత్తిస్థానము దేహమనియే దలంపుచున్నారు. మన శాస్త్రముల ననుసరించి యాత్మ తిరిగి తిరిగి దేహము నాశ్రయించును. దేహజాతమగు సంస్కారములవలన

నాత్మ యటుల తిరుగవలసియుండును. దేహమువలన గలిగిన సంస్కారములు నశించిన యెడల ఆత్మతిరిగి పుట్టదు. ముక్తాత్మకును, మానవత్వమునకును సంబంధము లేదు. కావుననే ముక్తాత్మసంబంధమగు విచారమునకును దేహతత్వమునుగూర్చిన యోచనకును సంబంధము లేదు. కాని ముక్తినొందని యాత్మకు దేహజాతమగు సంస్కారములతోడ సంబంధముండును. కావున మానవత్వమునుగూర్చి యోచించునప్పుడు దేహతత్వ సంబంధమగు యోచన మిక్కుటముగ వచ్చును. మానవ దేహమందే మానవాత్మ యుత్పత్తియగునెడల మానవత్వ విచారణ సంబంధమందు మానవదేహతత్వ విషయముగూడ యాలోచనీయమై యుండును. ఎల్లయన, దేహమందే మానవాత్మ బుట్టుటవలన ఆత్మ దేహమును వీడినను దేహజాతమగు సంస్కారములను దప్పించుకొన జాలదను వాదమును, దేహమును వీడినను ఆత్మకు క్రమోన్నతి గలుగుచుండినను, ఆయున్నతి దేహజాతమగు సంస్కారముల యున్నతి యను వాదమునకును, దేహతత్వముతోడ మిక్కిలి సంబంధముకలదు.

హిందూశాస్త్రానుసారము యుత్పత్తియగునది నాశనమొంది తీరునను వాదమెంతయు యుక్తియుక్తము. అందువలన దేహమందు బుట్టిన యాత్మకు నాశనముండి తీరవలయును. పాశ్చాత్య పండితుల యందు కొందరు మానవాత్మయొక్క పుట్టుకను విశ్వసింతురు. కాని వినాశనము మాత్ర మంగీకరింపరు. హిందువుల దర్శనానుసార మీవాదన యుక్తివిరహితము; అసంగతము.

పాశ్చాత్య వైజ్ఞానికులు మానవాత్మయొక్క యుత్పత్తిని యంగీకరించెదరు. కాని యదినశ్వరమా యవినశ్వరమాయను విషయమును గూర్చి మౌనమును వహింతురు. ఈవిషయమున పలుమతములు పలువిధములుగ జెప్పుచున్నను మానవ తత్వమును దెలిసికొనుటకు మానవ దేహతత్వమువలన మిక్కిలి ప్రయోజనము కలదనుట నిశ్చయము.

మానవశరీరమును బోలినయత్యద్భుత యంత్రము మరియొకటి లేదు. ఇం దనేక భాగము లున్నవి. అందు మస్తిష్కమనునది ముఖ్యము. ఇది మిగిలినజంతువులకంటెను మానవునియందు మిక్కుటముగ నున్నది. దీనిభారము—పరిమాణము—సమస్త జంతువులయొక్క పరిమాణము భారముకంటెను మిక్కుటము. శరీర తత్వజ్ఞులు మస్తిష్కమును బుద్ధికే కేంద్రమని నిర్వచింపుచున్నారు. జడవాదులు బుద్ధికికారణము మస్తిష్కమనుచున్నారు. ఆధ్యాత్మవాదులు బుద్ధి ప్రకాసించుటకు వీలగు యంత్రము మస్తిష్కమనుచున్నారు. మానవుని మస్తిష్కపరిమాణ మత్యధిక మగుటవలన మానవుని బుద్ధి మిక్కుటమనియు, మస్తిష్కము బుద్ధి ప్రకాసించుట కేర్పడిన యంత్రమేయైనచో యంత్రము పెద్దదిగ నుండుటవలన మిక్కిలి యుపయోగమనియు జడవాదు లనుచుందురు. కాని మానవ బుద్ధి యితర జంతువుల బుద్ధికంటెను మిక్కుటము. ఆయతనమందు మాత్రము చిన్నది. అంక గణితము ప్రకార ముండవలసినంత యుండినయెడల మానవుని మస్తిష్కము మిక్కిలి పెద్దదగును. అంత పెద్దదానిని మానవ శరీరము ధరింపజాలదు. ఆయతనముతో పాటు మస్తిష్కముగూడ వృద్ధికావలసి యుండును. మానవమస్తిష్కము మిక్కిలి జటిలముగ నుండును. దానిమీద ధూసరవర్ణ యుక్తమగు ఆవరణ యున్నది. ఈయావరణయందలి పొరలు మిగిలిన జంతువులయందు గానరావు. మానవుని స్మృతిశక్తి సమస్త ప్రాణుల స్మృతి శక్తికంటెను మిక్కుటము. ఈపొరలు స్మృతి శక్తికి మిక్కుటమగు సహాయ మొనర్చుచుండును. జగత్తు సంబంధమున మానవునకున్న జ్ఞానమంతయు దీనివలన శ్రేణులుగ విభజింపబడుచున్నది. ఒక్కొక శ్రేణికొరకు మస్తిష్కమును చుట్టి యొక్కొక పొర యున్నది. మనయనుభవములకు సంబంధమగు జ్ఞానము నశింపక మస్తిష్కమందు సంచితమై యుండును.

మానవుని మస్తిష్కమొక భాండార గృహము వంటిది. చైతన్య మయజీవుడు ప్రయోజనము ననుసరించి భాండారగృహమందు సంచితమై యుండు

దానిని వెలువరింపుచుండును. చైతన్య మయమగు జీవుడన కొన్నిశక్తుల సమష్టీభూతమగు క్రియతప్ప మరి వేరు లేదని జడవాదు లనుచుందురు. వెలుతురు వేడిమి మొదలగునవి యొక వస్తువుయొక్క భిన్న భిన్న రూపము లయినటులనే అనుభవముగూడ నైవిధమున జడశక్తియొక్క రూపాంతరమని నుడువుచున్నారు. కాని రసాయనిక క్రియలవలన అనుభూతి సంచిత మగుచుండునను విషయమును విజ్ఞానమింకను ధృవపరచ లేదు. అయినను నీవిషయమును నిచట విపులముగ చర్చించుటకు వీలుకాదు. కాని యీసందర్భమున హిందూసిద్ధాంతములే మిక్కిలి సంగతముగ నున్నవి. విశుద్ధాత్మకును, సాక్షాత్కారానుభూతి సంపన్నుడగు జీవునకును మిక్కిలి భేదమును మనశాస్త్రములు గమనింపుచున్నవి.

జీవుడు జడశక్తియొక్క పరిణామమైనను, లేక యనుభూతి సంపన్నమగు చైతన్యమయమగు సత్తాయయినను, ప్రకృతిపురుషసంయోగమువలన దానియుత్పత్తి యగుచున్నను, జీవునకు లీలానికేతనము దేహము. జీవదేహము మానవదేహముగ బరిణమించినప్పుడు జీవుని యందు మానవత్వ వికాసము గలుగుచున్నది. అనగా దేహముయొక్క క్రమవికాస ఫలితముగ మానవ దేహమును బొందునప్పుడు జీవుడు మానవనామమున కర్హుడగుచున్నాడు. జీవులయం దన్నిటియందును నైక్యమును చూపించుట కెల్లరు ప్రయత్నింపరు. ఇప్పుడు మానవునకు గోచరమగు సమస్త జీవరాసులును సృష్టిప్రారంభమందే వేరు వేరుగ సృష్టింపబడినవని చెప్పువారు కొందరున్నారు. ఈవిధముగ చూచిన యెడల వివర్తనవాదము సమర్థింపబడదు. విజ్ఞాన జగత్తునందు నేడు వివర్తనవాదము సర్వవిధముల సమర్థింపబడుచున్నది. బైబిలు సిద్ధాంతమునకు ముఖ్య శత్రువు వివర్తనవాదము. వివర్తనవాదము ప్రారంభింప బడినప్పుడు క్రైస్తవుల యందు విచిత్రమగు యాందోళన బయల్వెడలెను. అప్పటివైజ్ఞానికులు బహిరంగముగ వివర్తనవాదమును ప్రచారమొనర్చుటకు సాహసింప జాలకుండిరి. అందువలననే డార్విన్‌కు పూర్వము యూరపునందు వివర్తనవాదము సరిగ ప్రచారముకాలేదు. మనశాస్త్రములు వివర్తనవాదమును సరిగ సమర్థింపుచున్నవి.

పురాతనకాలముననే భారతవర్షమందు వివర్తనవాదము ప్రచారమందుండెను. మానవునకును వానర జాతి సంబంధమగు జీవునకును మూలమునందెట్టి భేదము లేదనువిషయము క్రైస్తవులకు విషసదృశమాయెను. కాని యట్లు భారతీయులు దలంపలేదు. ఏల యన భగవద్గీతయందిట్లు చెప్పబడియున్నది

విద్యావినయసంపన్నే।
బ్రాహ్మణే గవిహంతిని।
శునిశ్చైవశ్వపాకేచ పండితా
స్సమదర్శినః॥

మానవదేహము బొంది మానవుడయిన యాత్మయే గార్ధభదేహమును బ్రవేశించి గార్ధభమగుచున్నది.

మనశాస్త్రములు వివర్తనవాదము నంగీకరించును. కాని వైజ్ఞానికుల వివర్తనవాదమునకును మన శాస్త్రములయందు చెప్పబడిన వివర్తనవాదమునకును భేద మున్నది. మనశాస్త్రములు ఆత్మతత్త్వమునుండి వివర్తనవాదమును జేయుచున్నవి. కాని నేటివిజ్ఞానము జడ తత్త్వమునుండి వివర్తనవాదమును గాంచుచున్నవి. మన ఋషులు ఆత్మతత్త్వమును గూర్చి యత్యంతసూక్ష్మముగ బరిశీలించినటులనె విజ్ఞానవిదులు జడతత్త్వమును బరీక్షించియున్నారు. ఋషులు ఆత్మతత్త్వముమీద మిక్కుటముగ లక్ష్యముంచి జడతత్త్వ విషయమున నొకింత యశ్రద్ధనుజూపి యుండిరి. అందువలననాత్మ తత్త్వము నెరుంగగోరు వారికిగాని, మనవివర్తనవాదము సరిగగోచరింపదు. ఒకానొక యింగ్లీషు దేశీయు డిట్లు వ్రాయుచున్నాడు. "దార్శనిక గవేషణము నందు హిందువుల యెదుర నిలువతగిన జాతి మానవ కోటియందు మరియొకటి కానరాదు. కాని పదార్థ విద్యయందుమాత్రము హిందువులు శిశుతుల్యులు." నేటి వైజ్ఞానికుల యందనేకులు పదార్థ విజ్ఞానమునుండి

యాత్మతత్త్వము దిక్కునకు పరువిడుచున్నారు. ఒక వైజ్ఞానికుడు జడజగత్తు వెనుక విశ్వమానవుని యస్తిత్వమును గాంచినాడు. అతని మతము ప్రకారము జడపదార్థమున కనాదత్వమునిలువదు. అనాదియగు మనోజగత్తు జడజగత్తునకు మూలకారణమని యాతఁ డంగీకరించినాడు. ఈతని మతానుసారము యోచించి చూచినయెడల మనశాస్త్రములయందు చెప్పబడిన మతము వైజ్ఞానికుల వివర్తనవాదము వలన నష్టగింపబడుటలేదని దోచుచున్నది. మరియు విజ్ఞానము హిందువుల సిద్ధాంతమున కనుకూలమై క్రమక్రమముగ సహాయమొసర్చుచున్నది.

పాశ్చాత్య జీవ వివర్తనవాదులు ప్రథమమున జలమందు జీవి సృష్టింపబడెనని చెప్పుదురు. అది మొదటనొక విధమగు జలజ జీవియైయుండెను. తర్వాతనది కూర్మాది జీవులుగ బరిణమించెను ప్రథమమున పృథ్విజలమయము. జలమునుండి స్థలముద్భూతమైన పిమ్మట నీటియందును భూమియందును తిరుగు కూర్మాదిజంతువులు సృష్టియాయెను. పాశ్చాత్యుల జీవవివర్తనవాదము ననుసరించి గిరిగిట్ యనుజీవమె పక్షిరూపమున బరిణమించెను. మనఋషులు కూర్మము తర్వాత పక్షిబుట్టెననుచున్నారు. పక్షితర్వాత వానరము వానరమునుండి మానవుఁడుద్భవిల్లెనను విషయమును నుభయమతముల వారు స్వీకరింపుచున్నారు. అనేకలక్షల యోనుల యందు పరిభ్రమించిన గాని మానవజన్మ గలుగదని మన శాస్త్రములు చెప్పుచున్నవి. ఇది క్రమవికాసమేగదా? ఇంతవరకు వైజ్ఞానిక వివర్తనవాదమునకును మనవివర్తన వాదమునకును భేదముకాన రాదు. మనశాస్త్రములయందు జన్మాంతరవాదమున్నది. కర్మఫలమువలన మానవుఁడు తిరిగి పశుయోనియందు బుట్టవచ్చును. కాని యావిషయము పాశ్చాత్య వివర్తన వాదమునకు సరిపోదు. పాశ్చాత్యవివర్త వాదము జడజగత్తునందు బుట్టి వికసించినది. ప్రాచ్యవివర్తవాదము ఆత్మతత్త్వమునుండి యభివృద్ధి గాంచినది. అందువలన నీరెంటికిని యిట్టి భేధము గలుగుచున్నది.

కావున వివర్తనవాదము యూరపునందే బుట్టలేదనియు అంతకుబూర్వమే మన దేశమందు వివర్తనవాదమున్నదనియు తేలుచున్నది. 1869 సం|| వివర్తనవాదము యూరపునందు విజ్ఞానవ్యాప్తముగా లేదు. కాని డార్విను పూర్వమే యావాదమా దేశమందుండెను. అందువలన డార్వినే వివర్తనవాదమునకు ప్రవర్తకుడనుట న్యాయముకాదు.

మనఋషులు వివర్తనవాదమును పురాతనకాలముననే యెరింగి యుండిరి. జీవుడు 29 లక్షలమారులు స్థావరయోనుల యందును 9 లక్షలమారులు జలజంతువుల యోనుల యందును 9 లక్షల మారులు కూర్మయోనులయందును 11లక్షలమారులు పక్షియోనులయందును, 3 లక్షలమారులు పశుయోనులయందును 4 లక్షలమారులు వానర యోనులయందును జన్మించిన పిమ్మట మానవయోని యందు జన్మించునని విచ్చు పురాణమందున్నది వైజ్ఞానిక వివర్తనక్రమముగూడ దాపుగ నిటులనే యున్నది

# నృత్యకళ.



(నారాయణదాసుగారు.)



మనదేశమందలి యరువది నాలుగు విద్యలయందొక ముఖ్యమగువిద్య నృత్యము. పాశ్చాత్యదేశములయందు గూడ లలితకళల యందు నృత్యమునకు ముఖ్యస్థాన మొసంగి యున్నారు.

నృత్యము సుసభ్యజాతులకు మాత్రమే సంబంధించినదికాదు. అసభ్య జాతుల యందు గూడ నీకళ స్వభావసిద్ధముగ విరాజిల్లుచున్నది. అసభ్యజాతుల వారెల్లరు నృత్యవిద్యా ప్రవీణులై యున్నారు. అనాదికాలమునుండియు నృత్యవిద్యాపరిశీలనము జరుగుచున్నది. ఆనందాభివృద్ధికిని చిత్తవినోదము కొరకును మానవుడు లలిత కళల నాదరింపు చున్నాడు. మానవ ప్రవృత్తియందిమిడి యున్న లలిత కళలు నిరంతరము బహిర్గతములగుచున్నవి. మానవసభ్యతయొక్క క్రమోన్నతితోడ లలిత కళలు క్రమవికాసమును గాంచుచున్నవి.

నృత్యవిద్య సుసభ్యతకొర కెదురు చూచుచుండినది కాదు. ఏలయననిది మానవునితోడనే బుట్టినది. అత్యంత పురాతన కాలమందలి మానవుని హృదయమందానందము పొంగి పొరలి నటులనే సుసభ్యతను గాంచిన మానవుని హృదయమందుగూడ ఆనందము వెల్లివిరియుచున్నది. అసభ్యజాతుల సాంఘిక హృదయమునుండి వెల్వడు నృత్యమును గాంచిన వారివిషయము నంగీకరించెదరు.

మనదేశమం దనేకమంది యసభ్యజాతులవారు నివసింపుచున్నారు. ఆర్యసభ్యతాస్పర్శనలన కొన్ని జాతులవారు అర్థసభ్యులుగ మారిరి. మరికొన్ని యసభ్యజాతులంతర్హితములాయెను. కాని యూరపు మొదలగు ఖండములయందు మహాప్రళయతుల్యమగు సుసభ్యతయను ఝంఝూమారుతము వలన అసభ్యజాతులు నామ రూపములు గోల్పోయి నశించెను. మనదేశమునందిప్పటికిని ననేక యసభ్యజాతులవారు పర్వతారణ్యములయందు నివసింపుచున్నారు. వేలకొలది వత్సరములుగ దివ్యతేజమున వెలుంగుచున్న మనదేశమందలి సుసభ్యతకు వారింకను సంపూర్ణముగ వశులుకాలేదు. సుసభ్యతయొక్క మూలమంత్రమేమి? అహింస, జీవదయ లేగదా? అట్టి సుసభ్యజాతులవలన అసభ్యజాతులు నాశనమగుట యసంభవము

మనయాంధ్రదేశమందుగూడ కోయలు—చెంచులు— ఎరుకలు—ఏనాదులు—మొదలగువారు అసభ్యజాతులకు సంబంధించిన వారు. ఇప్పటికిని నృతత్వవిదుల పరిశీలన

కీజాతులవారెంతయు లేగియున్నారు. అర్ధసభ్యులగు జాతులవారినిగూర్చి విచారించుట నిష్ప్రయోజనము. చెంచులు మొదలగువారెల్లరు నృత్యపరాయణులను విషయమెల్లరెరింగినదే. తోడాలు—భిల్లులు—కోలుమొదలగువారుగూడ అసభ్యజాతికి చెందినవారేను. అబిసీనియా, అండమాను, న్యూజీలాండు, ఆస్ట్రేలియా, ఆఫ్రికా, దేశముల యందుగూడ అసభ్యజాతులవారు లక్షలకొలది యున్నారు. వీరియందు నృత్యమనేక విధములుగ జరుగుచుండును. సాధారణముగ బాల బాలికలు—యువక యువతులు—వృద్ధ వృద్ధాంగనలు గలసి నృత్యమొనర్చుచుందురు. ఈజాతివారినృత్యమందు సరళత వెల్లడియగుచుండును. గీత వాద్యములు గూడ నుండును. కొందరు వాయిద్యములకు బదులు చప్పట్లు చరచుచు నృత్యమొనర్చెదరు. పరస్పరము చేతులు బట్టుకుని వృత్తాకారముగను కొంతవడి యర్ధ వృత్తాకారముగను దిరుగుచుందురు. అప్పటి వారి శారీర భంగిమము మనోహరముగనుండును. ఈనృత్యమందొకమారు భూమికంపించుచుండును. మరియొకమారు గతి సుకోమలముగ నుండును. కాని వీరి యంగ భంగిమమునందశ్లీలత యుండదు. నీచపువృత్తి మేల్కొనుట కవకాశము గలుగదు. వార పూర్వమగు ఉల్లాసమున గంటలకొలది నృత్యమొనర్చెదరు. వీరినృత్యము పశుజగత్తునకనుకరణమై యుండును. కొన్ని యసభ్యజాతులవారు అంత్య క్రియలప్పుడు మృతుని శవమునకు వెనుకనుండి యొక విధముగు నృత్యము సల్పెదరు.

మానవేతిహాసము ప్రారంభమైనప్పటినుండియు నృత్యానురక్తియు, నృత్యపరాయణత్వమును మానవునియందుగోచరింపుచున్నవి. ఇందువలన మానవున కెద్దియో యొక ప్రయోజనముండితీరవలయును. లేనియెడల నృత్యధార సభ్యాసభ్యజాతుల యందు ప్రవహించుటకు కారణమేమి? విహంగముల ప్రణయ సంబంధమగు నృత్యమును, లేగలు మైచుగంతులతోడనుండు నృత్యమును మానవునిచూపు నాకర్షింపుచుండుగదా?

ఆనందమే జీవితమని వేదములు చెప్పుచున్నవి. జీవనముయొక్క యభివ్యక్తినే మనము లలితకళలనుచున్నాము. కావున దీని బునాది యానందము. యూరపునందు సుసభ్యజాతులవారెల్లరు నృత్యపరాయణులు. ఆదేశములయందు నృత్యవిద్య స్త్రీ విద్యయందొక ప్రధానాంగము. ప్రాథమికవిద్య పూర్తియైనంతనే బాలికలు ఫ్రెంచి జర్మనీభాషలను చదివెదరు. దానితోబాటు సంగీత నృత్యముల నభ్యసించెదరు. అంతటిలోడ దాదాపుగ వారివిద్యపూర్తియగును. పురుషులు గూడ నేకొలదినైనను నృత్యవిద్య నభ్యసించెదరు. వారియందు సాధారణముగ నృత్యశిక్ష సాంఘిక శిక్షకు ప్రధానాంగమైయున్నది. వారిలో జరుగుసాంఘిక యుత్సవములు మొదలగు వానియందెల్లడలను నృత్యము జరుగుచుండును. యూరపునందు జరుగుకొన్ని నృత్యములను మిక్కిలి నిందనీయముగదలంపుచుందురు. కాని యవినిందనీయమైనను గాకున్నను వానిపద్ధతియందును, సర్వజనసేతయందును ననుమానపడవలసిన యవసరము గాన్పింపదు.

ప్రాచీన కాలమందు మన దేశమందు నృత్యము మిక్కిలిగనుండెను. నేటికిని కొంతవర

కున్నది. ధర్మాసక్తిపరులగు హిందువుల నృత్యగీతములు దాదాపుగ ధర్మసాధనకు సంబంధించియుండును. వివాహాది శుభకార్యములు సాంఘిక యుత్సవములు మొదలగువానియందు గీతవాద్యములు అభినయనృత్యములు, జరుగుచుండెను.

హిందూసభ్యతయందు పలుకారణములచేత స్త్రీపురుషులు గలసి నృత్యము సల్పుటయంతరించెను. కాని నృత్యపిపాసను తృప్తిపరచుటకు నర్తకీసాంప్రదాయమేర్పడెను. వారికి దేవమందిరములయందుగూడ స్థానముదొరకెను. దేవదాసియను పేరున బరుగుచున్న నర్తకీగణము నేటికి దేవాలయములయందు నృత్యగీతముల సల్పుచున్నారు.

మహాభారతకాలమున సంఘమునందు సర్వోన్నతస్థానము వహించిన రాజపరివారమందు స్త్రీపురుషులు నృత్యగీతాభినయములయందు ప్రవీణులై యుండిరను విషయమును విరాటపర్వమందు గాంచవచ్చును. అజ్ఞాతవాసమందున్న అర్జునుడు ఉత్తరకు నృత్యగీతముల నేర్పుటకుపాధ్యాయుడుగ నియమింపబడెను.

మానవునకు లలితకళానుశీలనము వలననే సౌందర్యానురక్తి, సౌందర్యపిపాసలు తృప్తియగుచుండును. మానవత్వవికాసము స్ఫూర్తికొరకు లలితకళలనుష్ఠింపబడుచున్నవి. కావ్యములు సంగీతము చిత్తరువులు భాస్కర్యము మందిరములు మొదలగునవి మానవుని పరిపూర్ణవికాసమునకు దోడ్పడినటులనే నృత్యకళగూడ దోడ్పడుచున్నది. పశుపక్షికీటకములుగూడ నృత్యమొనర్చుచుండును. ఒకవిద్వాంసుడిట్లు వ్రాయుచున్నాడు.

“మానవుడు స్వభావసిద్ధముగ నృత్యప్రియుడు. కావుననే నృత్యమును లలితకళలయందు జేర్చిరి. నృత్యముద్వారమున సౌందర్యము పలుముఖముల వికసించుటకు ప్రయత్నించుచుండును. కావున మానవుడత్యంత నృత్యప్రియుడు. జగత్తంతయు స్పందనాత్మకమై నృత్యమునగూడియున్నది. అందువలన మానవుడు నృత్యపరాయణుడనుటయందాశ్చర్యములేదు. స్పందనమేగదా జీవనము? కాబట్టి నృత్యమును జీవనముయొక్క ప్రధానలక్షణమని చెప్పవచ్చును. మనదేశమందు పురాతనులు గ్రహనక్షత్రముల గానమువినుచు విశ్వనృత్యమును దర్శించుచుండిరను విషయము కల్పనగాదు. విజ్ఞానముగూడ నాసంగీత నృత్యముల విషయమున సాక్ష్యమొసంగుచున్నది.

రసనకు తృప్తికలిగినను, లేకమఱియొక కారణమువలననైనను ఆనందము గలిగినంతనే బాలుడు నృత్యము సల్పును. కాని యది నేర్చుకొనినది కాదు. విశుద్ధహృదయుడును, అనాసక్తుడగు ముదుసలిబ్రాహ్మణునకు భక్ష్యములతోడ భోజనములభించిన నానందమువలన నృత్యమొనర్చును.

“నృత్యంతి భోజనే విప్రా
మయూరా మేఘదర్శనే,,

ఇట్టి నృత్యకళానుశీలనమును కొన్ని సుసభ్యజాతులవారు నిందించుటకును మరికొన్ని సుసభ్యజాతులవారు అత్యంతగౌరవముగ నాచరించుటకును కారణమేమి? హిందూసంఘమునుండి నృత్యమును పారదరుముటకు కారణమేమి? కొన్ని ధర్మసంప్రదాయములవారు మిక్కుటముగ నేల నిందిం



రావుసాహెబ్ కూనె గోపాలుడుగారు — ఏలూరు.

వీరు భూస్వాములు, వర్తకులు, ఏలూరునందలి అన్నదాన సమాజము మొదలగువానికి భూరి విరాళము లొసంగినారు.

'శారద' కు రు 116- రూప్యము లొసంగి శాశ్వత పోషకులైరి.

చెదరు? అను ప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చిన చాలును. నృత్యముయొక్క యుత్పత్తి వ్యాప్తి చరిత్ర మొదలగు వానిని వీడి నృత్యవిద్య మానవదేహమునకును మనోవికాసమునకును సహాయ మొనర్చునా? లేక నష్టమును గలిగించునా? అనువిషయముల యోచింప వలయును.

కొన్ని ధర్మ సాంప్రదాయములవారి యభిప్రాయ మేమన "లలిత కళల నభ్యసించుట వలన చిత్తవిక్షోభము కలుగును. దుర్బలత్వ మేర్పడును. ధృఢత—సంయమము—స్థైర్యము మొదలగునవి నశించును. అందువలన నిది ధర్మపథమున కంతరాయము" అని చెప్పుచుందురు.

క్రైస్తవులయందు నీతివాదులును రోమన్ క్యాథలిక్కు సన్న్యాసులు, ఇసలాం ధర్మమునకు జెందిన సమస్త సాంప్రదాయముల వారును అందు ముఖ్యముగ 'ఫరాజిరా' యను వారును నృత్యగీత వాద్యముల నంగీకరింపరు. మనదేశమందుగూడ యోగమార్గావలంబులును సన్న్యాసులును లలితకళలయందాదరమును జూపింపరు. నీతివాదులుగూడ "లలితకళలు స్త్రీ జనోచితములు. వీనివలన చరిత్రనాశన మగును, ఇంద్రియభోగ వాంఛ మిక్కుట మగును" అని నుడువుచుందురు.

అసభ్యజాతులు మొదలుకొని సుసభ్యజాతులవరకుండు నృత్యకళను హేయముగను మానవాభివృద్ధికి భంగకరముగను ధర్మాచరణమున కాటంకముగను దలంచుటకు కారణమేమి? పశుపక్షి కీట పతంగములు మొదలు మానవునివరకు స్వభావసిద్ధమై యలరారుదానిని విడనాడుట కర్తవ్యమా?

ఆటలు మొదలగువాని వలన అంగ ప్రత్యంగముల యందు కదలికయు దానితోడ రక్తము బ్రవహించి శరీరబల మభివృద్ధి యగుననుట కెట్టి యాటంకములు లేవుగదా! శరీర తత్త్వవిదులు నృత్యవిద్య సర్వోత్తమమగు వ్యాయామమని యంగీకరింపుచున్నారు.

ఒక యింగ్లీషు విద్వాంసు డిట్లు వ్రాయుచున్నాడు. "నర్తన మొనర్చువారు బలయుతులై యుండవలయునా? లేక బలయుతులగుటకే నర్తన మొనర్ప వలయునా? యను విషయమును గూర్చి యనేకదినముల నుండి వాద ప్రతివాదములు జరుగుచున్నవి. కాని నర్తకులు, ఆరోగ్యము బలము మొదలగునవి నర్తన వలన గలుగునని నమ్ముచున్నారు."

మార్గోట్ ఫిష్ యను ప్రసిద్ధికెక్కిన నర్తకి యిట్టుల వ్రాయుచున్నది. సుఖ సంతోషముల కాలము గడుప నెంచిన యెడల నృత్య మొనర్చుము. శరీరారోగ్యమును సంపాదింప గోరవలయునేని నృత్యము చేయుము. ఇది సమస్త విధమగు రోగములకు మహౌషధము. విషాదము నడంచి సంతసమును గలిగించుటకును, సౌందర్యాభివృద్ధికిని నృత్యముతోడసరియగు నౌషధముమరియొకటిలేదు. ఈవిషయ మతిశయోక్తి కాదు. ఇందెంతయు సత్యము కలదు. పలువిధములగు వ్యాయామములున్నవి. అందుకొన్నిటి వలనకొన్ని యంగములకు మాత్రమే చలనము గలుగును. చలనములేని యంగములనుండి రక్తము బ్రవహించి చలించువానిని జేరును. చలింపని యంగములకు మాత్రము నష్టము గలుగును. ఒక దాసియొక్క క్షయము

రెండవ దానియభివృద్ధికి కారణమగుచున్నది. కాని నృత్యము వలన మానవ దేహమందలి యంగ ప్రత్యంగము లన్నిటికి వ్యాయామము గలుగును. సూక్ష్మస్నాయువులు—స్థూలమగు నస్తికలు మాంసములు మొదలగు వానికి వ్యాయామము గలుగును. అందువలన నృత్యము సర్వోత్తమ మగు వ్యాయామ మను టకు సందియము లేదు. మనము తినెదము. రుచ్యములగు భోజన పదార్థముల భుజించెదము. కాని యీరెంటి వలన గలుగు ఆనంద మొక విధమగు నదికాదు. అటులనే నృత్యమునకును మిగిలిన వ్యాయామ ములకును ఆనంద విషయమున స్వర్గ నరకములకు నంత భేదమున్నది. సంగీతమువలన గలుగు ఆనందము వ్యాయామము వలన లభింపదు. కాని సంగీత ధ్వని మానవుని యుల్లసితునిగ జేయునప్పుడు నృత్యసూచన ప్రారంభమగును. వెంటనే మానవ దేహము స్పందిత మగును. తాళము, మానము, లయ, మొదలగునవి గతియుక్తములు. ఈ గతి—స్పందనము— నృత్య రూపమున బయల్వెడలును. దానిని విశ్వముయొక్క గతియందు శృతి గలిపి నృత్యమొనర్చెదరు. ఈజగత్తునందు గతివిహీనము, శృతి విహీనములగునవి కక్ష్యచ్యుతములై చూర్ణమై మృతమగుచు న్నవి. ఈవిషయమునే యొకమహాకవి ఇట్లు వర్ణించియున్నాడు. "విపులమును, గంభీరమును మృదుమధురమగు మనము నందు విశ్వగానము తోడ విశ్వముయొక్క గతి ప్రారంభమైనంతనే చిత్తము మేల్కొనినది. నృత్యము ప్రారంభమైనది. వెంటనే బంధనములు పటపట తెగిపోయెను. మహదానందము పొంగిపొరలజొచ్చెను. నూతనసంగీతమున—నవీనఛందమున హృదయసాగరమున పూర్ణ—చంద్రు డుదయించెను."

నృత్యముయొక్క భావరూపములు మనస్సును దేహమును ఆశ్రయించి యుండును. కావ్యములయందు—ఛందము—యతియు; సంగీతమందు తాళమానములును; చిత్తరువులందు వర్ణసంస్థాపనము సన్నివేశమును; భాస్కర్యమందు రేఖలును, కౌశలము మొదలగునవి నృత్యము లేగదా?

ఒకానొక శరీర తత్వజ్ఞుడగు వైద్యుడిట్లు వ్రాయుచున్నాడు "దుర్నీతి పరాయణులు ఇంద్రియా సక్తులగు నర్తకీ నర్తకుల గూర్చి యోచించినయెడల నృత్యముయొక్క ప్రతిభ పొడగట్టదు. నేనొకవార్తాపత్రికయందు బ్రహ్మచర్యము నవలంబించిన యొకనర్తకి విషయమును చదివితిని. అందు "నృత్యాభ్యాసము వలన నామె యప్సరసల ధిక్కరించు సౌందర్యమును, స్వాస్థ్యమును గలిగియున్నది. కోల్పోయిన సౌందర్యమును స్వాస్థ్యము మొదలగువానిని బ్రహ్మచర్యముతో గూడిన నృత్యాభ్యాసమువలన తిరిగి సంపాదించు కొనినది.

ఆమె నృత్యమును గాంచుటవలన దర్శకులకుచిత్తవిక్షోభముకలుగదు. జగత్తునందలి సమస్త విషయములుఆపవ్యయ మొనర్పబడిన టులనే నృత్యముగూడఆపవ్యయ మొనర్పబడినది. నీచభావముల బుట్టించు హావభావములు గల నృత్యము విసర్జనీయము." అనియున్నది. నృత్యము యొక్కస్వాభావికతను మన భాష నుండి చూపించుటకు ప్రయత్నింతును. "ఆ దర్శనము వలన నాహృదయము తాండవం బాడినది." ఆవిషయము విన నామన

మానందముజేత నృత్యము చేయును" అని సాధారణముగ వ్రాయుచుందుము. ఇందు వలన ఆనందమున్నచోటనే నృత్యమున్నది. మన హృత్పిండముయొక్క నర్తనమేగదా జీవితము. ఈనర్తన మాగినంతనే జీవితము ముగియును.

నృత్యానుశీలనములేని జాతి మృతప్రాయము. నేడు మనము దాస్యాంధకారమున దగుల్కొని యున్నాము. మనయందంతటను తమోగుణము రాజ్యముచేయుచున్నది. అందువలననే నృత్యమును మరచితిమి. ముమూర్షుప్రాయమున నిరానందముగ జీవితమును గడుపుచున్నాము. భక్తిపరవశులగు వారిలో కొందరు మాత్రము నృత్యమొనర్చుచుందురు. వారిని చూచిన విద్యాధికులమనుకొను వారికి పరిహాసము. క్రమక్రమముగ జీవనశక్తి హ్రాస్వమగుచున్నది. ఇట్టిజాతిని పునరుద్ధరింప వలయునన్న శిల్పసాహిత్యములను, సంగీత నృత్యములను అభివృద్ధిలోనికిదీసికొని రావలయును. ఆంధ్రుల హృదయ రాజ్యమందు స్తంభించియున్న యమృత వాహినిని వెల్లివిరియునట్లు చేయవలయును. అప్పుడు నృత్యము ప్రారంభమగును. అది విశ్వనృత్యమందు శృతిగలసినప్పుడు, బాల గోపాలుడు ప్రత్యక్షమగును. అంతటితోడ జాతికి బాధనవిముక్తిగలుగును.



# ప్రణయకుమారి.

[అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. యే., బి. యల్.,]



లిత లలితమౌ గాన మంజుల రవంబు
మృదుల సుకుమార హస్తంబు మీటుచుండ,
పారవశ్యంబుచేఁ జేయి జారవిడచు
వీణియను బూని కళ్యాణ వాణితోడ
మధురముగ బాడె ప్రణయకుమారి యోర్తు
పాటచే మబ్బుక్రమ్మెను భావవీధి?
ముసుచుకొని పోయె రాగిణి ముద్దుమోము!
కన్నుగవను నిర్మల బాష్పకణము లురలె
పాట తెచ్చెను మదికిఁ దుపానుగాలి?
దూరంపు జూపు కన్నులఁ జేరుకొనియె
మెరయు కన్నుల కన్నీరు కరుగుచుండె,
రెప్ప లిడకుంట తెల్పెను హృదయచింత
చెలియ హృదయానరగిలిన చింతయేమొ.
వనిత మదిలోన నుండెడు వగపదేమొ,
వంతతోడ 'ప్రియా' యను పలుకొకండె
వెలగె నస్ఫుట గళరవంబులకు నడుమ ॥

# సంఘము — భార్యాభర్తలు:



( క. విశ్వనాథచయనులు గారు. )



ప్రేయసీ!

రెండు వత్సరములయినది—నిన్నువీడి. దుఃఖపూరితమగు నీయుత్తరములనందుకొన్నాను. ప్రత్యుత్తరము వ్రాయకుండుటవలన నీకు మిక్కిలి కష్టముగ నుండు నను విషయమును నేనెరుంగుదును. దుర్భరదుఃఖమున మునిగియున్నటుల భావింపుచున్నాను. నేనునీవిరక్తి భాజనుడనగుచున్నాననియు దోచుచున్నది. కానియేమి చేయుదును? భగవద్విధాన మనుల్లంఘనీయముగదా?

నీమంచిచెడుగులు నాతోడ బంధింపబడినవి. వానిని వేరు పరచుటకు వీలులేదు. ఆకస్మికముగ నిన్ను ఎదలి బిచ్చమెత్తుకుని జీవించమని చెప్పి వెడలితిని. ఆవిషయము నొక విధముగ భావించిన నాకును మిక్కిలి కష్టముగనే యున్నది? అందువలననామీద నీకు విపరీతమగు కోపము గలుగుట సహజము. మనము మానవాతీతులము గాముగదా- మంచిచెడుగులను సమముగ తలచి భరించుటకు. మానవసులభమగు దుర్బలత్వమువలన నీవు నాప్రయాణమును పలువిధముల నిరోధించియుంటివి; బ్రతిమాలితివి: చెప్పిచూచితివి. కాని ప్రయోజనంబేమి? నీకాశాభంగమాయెను. మనోక్షోభ నొందితివి. కాని యిందు నాతప్పేమి యున్నది? నామనో విషయమును నీకు తెలియజెప్పితిని. కాని నీవు సరిగ గ్రహించలేదు. అందువలన నీకు దుఃఖము గలుగుచున్నది. అయినను నాప్రయాణమును ముగించుకొని త్వరలో వచ్చుచున్నాను. అప్పుడు ముఖస్థముగమాటలాడుకొన వచ్చును. నీకుత్తరము వ్రాయవలయునని దలంచితిని. కాని యేమి చేయుదును? కలము సాగకుండెను. అందువలన రేపని యెల్లుండియని యనుకొనుటతోడ కాలము గడచినది. చివర కిప్పటికి బుద్ధి కుదిరినది. కలము సాగినది. కాని చెప్పదలచిన విషయమును సరిగ వ్రాయగలనో లేదో యనుశంక వొడముచున్నది. అయినను నామనోభావమును వెల్లడించుటకు బ్రయత్నించుటయందు లోపములేదుగదా?

మనము భార్యాభర్తలము. ఆశాపూరితలోచనముల కంపిత హృదయమున నీవునాచేతిని బట్టుకొనిన శుభముహూర్తమును నీవెప్పుడునుమరువవు. నాకెప్పుడును మరుపునకురాదు. అగ్నిహోత్ర సాక్షిగవివాహమైనప్పటినుండియు మనలో మనకెట్టి భేదములు లేవను మాట సత్యము. అప్పటినుండియు సమస్తకార్యముల భారమును మనము సరిగ నిర్వర్తింపుచుంటిమి. ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థముల యందు నీవునాకు సహధర్మిణివై యుంటివి. అందు వలన మనమొనర్చు ప్రతికార్యమునకు మనమిర్వురము బాధ్యులముగ వర్తింపుచుంటిమి. కావుననే నొనర్చు కార్యాకార్యముల గూర్చి నీయెదుట యెట్టి దాపరికము నుండరాదు. ఏలయన, మనము అభిన్నులము. ఇందున కగ్నిహోత్రుడే సాక్ష్యము.

హిందూసంఘమునందుస్త్రీ పురుషుల కభేదత్వమేర్పడి యది క్రమక్రమముగ వికసించెను. కాని దాని చరిత్రను మాత్రము సరిగ చెప్పజాలను. హిందు సంఘ మేర్పడి నప్పటినుండియు స్త్రీ పురుషులకు సమానస్థలమున్నటుల దోచుచున్నది. లోక కల్యాణమునకును, సంఘస్థితికిని పురుషులతోబాటు స్త్రీల యాంతరంగిక సహాయ మత్యవసరమని గ్రహించి యుండిరి. అందువలన స్త్రీ పురుషుల మధ్యనుండు వ్యవధాన మంతర్హితమాయెను. స్త్రీ పురుషునితోడ

సమముగ నడచుచు క్రమోన్నతిని బొంది యభిన్నత్వము గాంచెను. స్త్రీలయంతర్నిహితమగు శక్తిని గమనించిన కాలదిని పురుషుడు స్త్రీని సన్మానింపుచుండెను. అప్పటినుండియే నాయకా నాయికల కలయిక మొదలగు విషయములు సాహిత్యమునందగ్ర స్థానమును వహించెను. శిల్పులకు లక్ష్యమాయెను. గాయకులా విషయమునే బాడజొచ్చిరి. ఇంతయేల? మానవకోటి యితిహాసమే నూతనరూపమునుదాల్చెను. భర్తనిందను సహింపజాలక భార్యతృణప్రాయముగ శరీరమును త్యజించెను. ఆశవమును మూపునధరించి యామెభర్త తన్మయుడై పిచ్చివానిని బోలి పృథ్వియంతయు ప్రదక్షిణ మాచరించి యోగనిద్రితుడాయెను. విశ్వాస ఘాతకుడగు పరమదుర్మార్గుడొకడు భర్తనుచంపి యాతని శరీరమును ముక్కలు ముక్కలుగ ఖండించి దేశమందంతటను విరజిమ్మ, సాధ్వీమతల్లి యగు నాతనిభార్య భర్త విరహమునకు తాళజాలక పిచ్చిదానిని బోలి మైమరచి దేశమంతయు తిరుగుచు ఆశరీర శకలముల నేరుకొనజొచ్చెను.

దంపతులు పరస్పర మాత్మసమర్పణ మొనర్చుకొని నప్పటినుండియు వారిసంబంధము ఇహలోకము నతిక్రమించి పరలోకమున గూడ స్థిరమాయెను. ఏవనిదైనను భర్తగక్షణకాలము భావించి మనస్సునందు స్థానమొసంగినయెడల నాతడే పతియనియు, మరియొకనిని పతిగ తలంచుటగూడ మహాపాతక మని స్త్రీ తలంప జొచ్చెను. మనసంఘము నందిట్టి భావము వికసించిన కాలందిని సావిత్రి దమయంతి మొదలగు సాధ్వీమతల్లు లావిర్భవించిరి సావిత్రిదేవి సత్యవంతుని యాయుర్దాయము ముగియుచున్నదని యెరింగియు నాతనినే వరించెను. అట్లువరించుట కామె కెట్టియాటంకమును గలుగలేదు. ఇటులనే దమయంతి దేవతలనుగూడ గణనచేయక నలుని వివాహమాడియుండెను. నలునివివాహమాడిన వారు సర్వవిధముల బాధింతురను విషయము దమయంతికి తెలియనిదికాదు. అయినను చలింపలేదు. కావుననే సావిత్రీ దమయంతులు భారతవర్షమందలి స్త్రీలకు లక్ష్యమందున్నారు.

భార్యయందు నిస్వార్థభావము వికసించిన విధముననే భర్తయందుగూడ నిస్వార్థభావముపరిస్ఫుటమాయెను. కాని భార్యాతుల్యముగ భర్తయందు వికసించెనని చెప్పుటకు వలనుపడదు. భార్యను వెంటనిడుకొని భర్త సమస్తవిధ కర్మల నాచరింపుచుండెను. అందువలన భార్య కత్యంత గౌరవముగలుగుచుండెను. భార్యావిహీనుడగు వాడు యజ్ఞాదికర్మల నొనర్చునట్టి యధికారమును గోల్పోయెను. సహధర్మిణిని వెంటనిడుకొని యాధ్యాత్మిక కర్మలను లేక లౌకిక కార్యము లొనర్చుట సామాన్య విషయము కాదు. ఇందువలన నార్యసభ్యతయందు స్త్రీకి యుత్తమాసనము లభించెనని సుస్పష్టమగుచున్నదిగదా!

దంపతుల యందెట్టి భేదమును లేదు. వారిద్దరభిన్న హృదయములు. కేవలము దేహములు మాత్రము భిన్నము. ఈభావము క్రమోన్నతిని గాంచినకాలదిని భార్యాభర్తల బంధన మీ జన్మయందే కాక జన్మజన్మాంతరములయందుగూడ, చిరస్థాయియాయెను. కావుననే భర్త దుర్మార్గుడయినను భార్య "జన్మజన్మాంతరములయందీతడే భర్తయగుగాత." అని నిరంతరము భగవానుని ధ్యానింపుచుండును. కాని భర్తగూడ నీవిధముగ నొనర్చుచుండునని మాత్రము స్ఫుటముగ జెప్పుటకు వీలులేదు.

దంపతుల శరీరములు వేర్వేరయినను వారొక్కమూర్తిగ భావింపబడుచున్నారు. అందువలన ప్రత్యేక వ్యక్తిత్వములోపించి యిద్దరదేహము లర్థములగుటవలన నీరెండునుగలసిన దేహమె పూర్ణదేహముగ బరిగణింపబడెను. ఇదియపూర్ణత్వము ఇట్టి కలయికయే వ్యక్తిత్వము. ఈభావమె సంఘమందలి ప్రతికార్యమందును గన్పడుచున్నది. ఇందువలననే సంఘరక్షణకు_ సేవకు- ఇద్దరుబాధ్యులు.' భర్తకు ధర్మమైనదే భార్యకుగూడ ధర్మము. భార్యగృహమునకు రాణి;

గృహకృత్యముల నిర్వహింపుచుండును. భర్త గృహము వెలుపలి కార్యముల చేయుచుండును. భర్తయారాధించుదేవుని భార్యయారాధించును. కాని భార్యకు పతియే దైవము. అందువలన పతినే యారాధింపు చుండును. ఈవిషయమును విని నప్పుడు స్త్రీని బానిసగ జేయుట కేర్పడిన విధానమిది యని ప్రథమమున మన మునకు తోచును. విచారించిచూచినయెడల నిట్టి దురభి ప్రాయమునకు తావులేదు. ఏలయన, భర్తయొనర్చు సాధనభజనలకు భార్య సహాయము చేయుచుండ వల యును. అందువలన భార్యకు నిష్కామకర్మ ఫలముల భింపుచున్నది. భర్తతో సంబంధించని పూజాపున స్కారములు భార్యకులేవు. కలయందైనను, కల్పనయందుకాని మరియొకటి కానరాదు. "ఒక స్త్రీ, నేను భర్తనైన విడతునుగాని గురువును వీడ నేఱను." అని నాకొకమిత్రుడు చెప్పెను. అమాట విని నప్పుడు నాకాశ్చర్యము గలిగినది. నేటి వ్యక్తి గతమగు స్వేచ్ఛవలన నిట్టి మాటలు ఇతరదేశము లందు వచ్చిన రావచ్చును. కాని హిందూ స్త్రీ నోట యిట్టిమాట వచ్చుట శోచనీయము కదా ?

హిందూదేశ మందలి దంపతులకు ప్రత్యేక వ్యక్తిత్వములేదు. దంపతుల కలయికవలననే వారికి వ్యక్తిత్వము గలుగుచున్నది. భర్తకంటెను గురువున కగ్రస్థాన మొసంగ వలయునని తలంచుట భారతీ య సభ్యతకు విరుద్ధ విషయము; అహితకరము. స్వాతంత్ర్యమును నార్జించుకొనవచ్చును. కాని యిట్లు కాదు. దంపతు లిర్వురకు స్వాతంత్ర్య ముండ వలయును. ఇరువురును గోరవచ్చును. ఇట్టి స్థల మునకాదు. ఆవిషయమును సంఘమునుబట్టి నిర్ణయించు కొనవలయును. మనము సాంఘిక జీవులము- అందు వలన సంఘ సంబంధమగు బాధ్యతలను నేవిధముగను విడనాడుటకు వీలులేదు. ఈవిషయమును గూర్చి తరువాత విపులముగ ముచ్చటింతును.

ఆశ్రమ చతుష్టయమందు గృహస్థాశ్రమము సర్వోత్కృష్టమైనది- ధర్మసాధనకు దీనితో తుల్య మగు ఆశ్రమము మరియొకటిలేదు. అందువలనే మన దేవత లందరు గృహస్థులు. బ్రహ్మచారి కాని, సంసార విరక్తుడగు దేవుడుగాని లేడు. పితా మహుడు సత్వగుణ ప్రధానుడు- ఆయన భార్య నామధేయము సావిత్రి, లేక గాయత్రి. విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వీడి యుండనే యుండడు. నిరంత రము స్మశానముల యందే తిరుగుచు, సంహారమేనియ మిత కార్యమై భస్మము- కపాలమాలలే యాభరణ ములుగా గలగిన శివుని భార్య యన్నపూర్ణ. ఇంక యేల త్రింశత్కోటి దేవతలు గృహస్థులు.

దేవతలు గృహస్థులగుటకు కారణమేమి? గృహస్థాశ్రమమే జగద్వికాసమునకు మూలము. జగ ద్వికాసమునకు భగవానుడు స్త్రీపురుష రూపముగ విడివడి నాడని వినుచున్నాముగదా? ఒక్కపురుష సృష్టితోడనే భగవానుడు తృప్తినొందలేదు. అట్లు తృప్తిచెందినయెడల స్త్రీని సృష్టింపవలసినయావశ్యకత యే యుండదుగదా? గృహస్థాశ్రమమే యుండని యెడల మానవకోటి యభివృద్ధి నొందుటకేవీలు లేదని దోచుచున్నది. పశుతుల్యులమై యుండియుందుము. సుసభ్యత నేత్రములకుగోచర మయ్యెడిదే కాదు.

మానవకోటియొక్క స్థితికి గృహస్థాశ్రమము సహాయకారి. అందువలననే దీనికింత గౌరవము. భార్యా భర్తలిర్వురు స్వార్థ రహితులై పరస్పర మొకరిమీద మరియొక రాధారపడుటయందే గృహ స్థాశ్రమ ముత్పన్నమైనది. ఇదిప్రకృతి సిద్ధము. దంపతులిర్వురు సమముగ సంసార భారమును మోయుచుందురు. అందువలన నీయాశ్రమమం దిర్వురు సమానులు. సమానాధికారులు. వీరి యందు కొద్దిగొప్పలులేవు. దంపతులిర్వురు గలసి యొక్కటియేజీవి. ఒక్కజీవి ద్విరూపముల దాల్చి కర్తవ్య కార్యముల సరిసమానముగ నిర్వహింపు చుండును. సమానమగు బాధ్యతనుగలిగి యుండును. కావున గృహస్థాశ్రమాభివృద్ధి కిరువు రభివృద్ధినొంద వలయును. ఇందొకరియున్నతి యదార్థమగు యున్నతి కాదు. స్త్రీపురుషులిర్వురుసరిగనభివృద్ధిగాంచియోగ్యత

నార్జించుకొనినయెడల నాశ్రమము శుభకరమగును. ఇరువురి కలయిక సార్థకమగును. అప్పుడా దంపతులు గాంధిదంపతులబోలి లోక హితకరమగు దేవతలుగ బరిగణింపబడుదురు. భార్యాభర్తలిరువురు యోగ్యత మొదలగువానిని ధర్మసంగతముగ నార్జించుకొనవలయు ననుటవిధి. ఈవిధి నుల్లంఘింపరాదు. ఉల్లంఘించిన పాపగ్రస్తులగుదురు. ఈవిధి ననుసరించినయెడల పుణ్యమూర్తులై విరాజిల్లెదరు. కావున నే భార్యాభర్తలిర్వురు సహధర్ములు.

నీవునాకు సహధర్మిణివి. నా సకల కార్యముల యందు సహాయురాలవు. నిన్నువీడి నేనొకయడుగైనను ముందిడుటకు వీలులేదు. ఏలయన నీవు నా కర్థాంగివి. నీవు నాయందు గుప్తముగ బ్రవహించుచున్నావు. నేననీయందు గుప్తముగ వెలుంగుచున్నాను. మన మొక స్థలమున నున్నపుడు మనయందలి గుప్తమూర్తి స్థూల నేత్రములకు గోచరముగాకున్నను హృదయమందు జాగరితమైయుండును. ఆమూర్తిని మరచుటకెరికిని సాధ్యముకాదు. సమస్త కార్యములయందును, వేళలయందును మన యందా మూర్తి పరిస్ఫుటమై యుండును. అందువలన లౌకికముగ గలిగిన నీయెడబాటునందేమయిన సత్యము గలదా? భ్రమకాదా? అట్లుజరుగుట యసంభవము. అస్వాభావికము. ప్రకృతివిరుద్ధము. విరుద్ధమగునది యెట్లు ఘటిల్లును? మనయిర్వురి భౌతికదేహములు దూరమై పండ్రెండుమాసములైనవి. నాకువిడిపడి నటులేలేదు. ఆలోపము గాన్పించుటలేదు. కాని నిక్షేపము గాంచి. నేనును దుఃఖింపక తప్పకున్నది. దుఃఖింపకుము. లౌకిక విచ్ఛేదమునందు సత్యము లేదు. ఆంతరంగిక విచ్ఛేదమే నిజమగు విచ్ఛేదము. హిందూ దంపతులయందట్టి విచ్ఛేదము గలుగుట యసంభవము. ఈ విషయమును నీకు బోధించియుంటిని. రామమ్మ విషయమునుగూర్చి నీకు దెలియజెప్పితిని. ఆమె భర్తను హృదయమందు గాంచలేదు. అందువలన భర్తధర్మమె తన ధర్మమనితలచి కర్మసాగర మందోలలాడుచున్నది.

మనయందొకే మూర్తి విరాజిల్లుచున్నది. ఆసజీవ మూర్తియొక్క బాహ్య ప్రకాశమే మన మిర్వురము. ఒక్క మానవుడు కార్య సాఫల్యముకొరకు తనను తాను రెండుగ భాగించుకొనుచున్నాడు. నీవు గృహకృత్యముల చేయుచున్నావు. నేను వెలుపలి కార్యములు చేయుచున్నాను. మనమిర్వురము పరస్పర సహాయ మొనర్చుకొనుచున్నాము. నన్నువీడి నీవు నిలువజాలవు. నిన్నువీడి నేనునిలువజాలను. మనము దంపతులమైనప్పటినుండియు నీధర్మ విభాగము నంగీకరించితిమి. ఇప్పుడావిషయమున క్షోభ నొందుటవలన బ్రయోజనంబేమి? నీవుకల్పిత దుఃఖమున తలక్రిందులగుచున్నావు. నేను నాకర్తవ్యకార్యము కొరకిట నున్నాను; కర్తవ్యభ్రష్టుడను కాలేదు. నీ యర్థాంగమును పాపపంకిలమున ముంచలేను. ఏల దుఃఖించెదవు?



శ్లో॥ యద్యప్యేతే నపశ్యంతి ।
లోభోపహత చేతసః
కులక్షయ కృతం దోషం
మిత్రద్రోహే చపాతకమ్॥ ౩౮

కథం నజ్ఞేయ మస్మాభిః ।
పాపాదస్మాన్నివర్తితుమ్
కులక్షయ కృతందోషం
ప్రపశ్యద్భిర్జనార్దన॥ ౩౯

తా॥ రాజ్యమునందలి పేరాసచేత మనస్సుచెడిన వారగుట ఈ దుర్యోధనాదులు స్వకులక్షయముచే కలుగు దోషమును మిత్రద్రోహముచేనగు పాతకమును నెంచువారుగాకున్నను జనార్దనా? కులక్షయమువలన కలుగు దోషమును పరికించునట్టి మనమీపాపమును పరిహరింప నుపాయము గానక పోవుటెట్లు?

ఇంద్రియముల నిర్మూలనంబొనర్చుటవలన కులక్షయమగు నను శంక సాధకుని మనంబున బుట్టుట యుక్తి సంగతము. వ్యావహారికార్థమందు జ్ఞాతివధవలన మిత్రవధయు కులక్షయమును సంభవించునట్లు యోగికార్థమందు ఇంద్రియాది రూపమగు వానిని వధించుటవలన కులక్షయముగలిగి తీరును. కులమనగా తుర్యాంశతత్వములే ప్రకృతి. ఆత్మ ప్రకృతి నవలంబించియుండుటవలన ప్రకృతికి కులమను పేరువచ్చినది.

ప్రథమావస్థయందు నేననునది పరిపూర్ణముగ వికసించుటకు ప్రకృతిలేక యింద్రియముల ప్రయోజనము మిక్కుటమని యదివరకు చెప్పియున్నాను.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మాస్సనాతనాః
ధర్మేనష్టే కులం కృత్స్న
మధర్మోభి భవత్యుత॥ (౪౦)

తా॥ కులనాశనము సంభవించినప్పుడు చిరకాలమునుండి పరంపరగా నాచరింపబడుచున్న కులధర్మములు నాశనము నొందును. అట్టి యాచారములు నశించినయెడల కులమంతయు నధర్మమున ప్రవర్తిల్లును.

కులధర్మమన నేమి? జీవుని స్వాభావిక ధర్మము. బ్రహ్మాండమునంతను చుట్టియున్న మహాశక్తినే ధర్మమందురని యిదివరకు చెప్పియున్నాను. ఆశక్తి దేహరూపమగు క్షుద్రబ్రహ్మాండమును ధరించియున్నది. దానినే కులధర్మమని చెప్పుదురు. ఇదియే యాకర్షణ శక్తిలేక ప్రణవమను విషయమును నిదివరకే చెప్పియున్నాను. సూర్యుడు స్వీయశక్తి ప్రభావమువలన పృథ్విని ధారణచేసినటులనే పృథ్వితనపై నుండు వస్తువులను నాకర్షించి నిలుపుచుండు విధముననే ప్రణశక్తి జీవాత్మను జీవాత్మదేహమును ధారణచేయుచున్నది. కులక్షయమనగా యింద్రియములు మొదలగునవి నిర్మూలింపబడినయెడల మనమాకులధర్మము నుండి విచ్యుతుల మగుదుము. ఆత్మను ఇంద్రియాదులే బాహ్య ప్రకృతితోడ సంయుక్త మొనర్చియుంచును. ఇంద్రియాదులు వినష్టమగుటవలన సంయోగము నాశనమగును. శబ్దస్పర్శరూపరస గంధములు మొదలగువానిరూపమున బహిఃప్రకృతి కులము

యందులేక జీవభావాపన్నావస్థయందు ప్రతిఫలింపను. ఆ కులధర్మము నాశనమగును. మనము జీవభావాపన్నులమై ప్రకృతి గర్భమందున్న విషయమునుగూర్చి యొకింత ముచ్చటించెదను.

ఒక్క మహత్తరమగు ఆకర్షణశక్తిద్వారమున బ్రహ్మాండము లన్నియు చుట్టబడియున్నవని యిదివరకే చెప్పియున్నాను. జీవుని సంస్కారములు ఇంద్రియములద్వారమున విలసిల్లి శబ్దస్పర్శరూపరస గంధ రూపమున బ్రహ్మాండమునులేక బాహ్యప్రకృతిని నుపభోగింపుచుండును. అనగా బాహ్యప్రకృతి యింద్రియములద్వారమున జీవసంస్కారములయందు ప్రతిఫలించి శబ్దస్పర్శరూపరస గంధముల రూపమున వికసించును. ఈశబ్దస్పర్శరూపరస గంధములుగూడ ప్రణవముయొక్క (ఆకర్షణశక్తి) రూపాంతరములు. ఇవి కులధర్మరూపమున జీవిని యహర్నిశలు ధారణ చేసియుండును. వీని సత్తావలననే మనము 'నేను' అనుదాని నుపలబ్ధిబొందుచున్నాము. జీవునిదేహరూపమగు మాతృమందిరము, వానిద్వారముననే రచింపబడుచున్నది. మరియు నవి మాతృపూజకు సాధనములైయున్నవి. వీనినుండి విచ్యుతుడగు సాధారణ జీవుడు, తన యస్తిత్వమును తానుపలబ్ధిగాంచజాలడు. కావున ప్రణవము యొక్క రూపాంతరసమూహములను జీవుని పక్షమునకు కులధర్మములని పేర్కొనియున్నారు. అద్దపు కలపుపుల్లను సూర్యునికేసి త్రిప్పి చూచినయెడల, దానియందు సూర్యాలోకము సప్తవర్ణవిశిష్టమై గన్పడును. అటులనే జీవుని సంస్కారములయందు విరాటమగు ఆకర్షణ శక్తి ప్రతిఫలితమై శబ్దస్పర్శరూపరస గంధాది రూపమున ప్రతిఫలింపుచుండును. మన యింద్రియముల నిర్మాణము బొర్చుకొనినచో శబ్దస్పర్శరూపరస గంధాది రూపమున ప్రబలమగు శక్తి ప్రవాహము వచ్చి మనల నాకర్షింపలేదు. మనల విరాటమగు నిస్సృష్టితోడ సంయుక్తమొనర్చి లేక పట్టుకొని యుండజాలను; ధర్మము నష్టమగును. ఈవిధముగ ధారణ చేసియుండుటవలననే యాకర్షణశక్తికి ధర్మమను నామము వచ్చినది. ఇంతకంటెను విపులముగ జెప్పుటకు యత్నింతును. ప్రణవము (ఆకర్షణశక్తి) భువనములన్నిటిని యోతప్రోతభావమున పరిప్లావితమై యాకాశగంగా రూపమున ప్రవహింపుచున్నది. ఆ కులశక్తియొక్క యాకర్షణ ప్రవాహము, సంస్కార రూపమగు ఉపకూలము (గట్టు) వలన సంఘట్టనము బొందుచు, కాలరూపమగు మహేశ్వరుని జటాజాలముల ఛేదించుకొని యనంతకాలము నుండి ప్రవహింపుచున్నది. సంస్కార రూపమగు ఉపకూలమువలన, ఆ కులప్రవాహము ప్రతిఘాతమును బొంది శబ్దస్పర్శరూపరసగంధములను తరంగ భంగిమములతోడ విలసిల్లుచున్నది. సాధకులా సముద్రముకడకేగి యందలి జలమును దోసిలితోడ దీసి భగవానునుద్దేశించి యాజలమును తిరిగి సముద్రమునందు బోయుచుండునటులనె, జీవులాప్రవాహ జలమును వేరుపరచి మాతృపూజ యొనర్చుచుందురు. ఆకాశగంగ త్రిలోకములు వ్యాపించి ప్రవహించుటవలన దానిని 'త్రిధారా', లేక 'త్రిపథగా', యని నుడువుదురు. సురధుని భాగీరథీ భోగవతీయను మూడు నామధేయములు కల్పితములు. సత్వము, రజస్సు, తమస్సులేక జ్ఞాన, శక్తి, కర్మల రూపమున ప్రవహింపుచున్నది. అందువలననే దీనికి త్రిస్రోతమను పేరు వచ్చినది. అనంతకోటి జీవరాసులీగంగయందు కంఠమువరకు మునిగి కరాంజలుల నింపుకొని త్రివిధముల ప్రవహించు ప్రవాహమును పరిదర్శన మొనర్పుచున్నవి. తమోగుణ రూపమగు స్రోతమందు నిమజ్జితులై యుండు జీవమండలి కరాంజలియందు శబ్దస్పర్శరూప రసగంధాది భోగములను గైకొనుచున్నవి అందువలననె పాతాళమందు ప్రవహించు

దానికి భోగవతియను నామమువచ్చినది. రజోగుణ స్రోతమందు నిమగ్నమగు జీవులందలి యా ప్రవాహము నుండి శబ్దస్పర్శరూప రసగంధములను అదృష్టము లేక భాగ్యఫలముగ దలంచి కరాంజలి నిండునటుల గైకొనుచున్నది. అందువలననే మర్త్యలోకమున దీని నామధేయము భాగీరథీ. సత్వస్రోతమందు జీవులందలి యా ప్రవాహమును నమృత ప్రవాహ రూపమున గ్రహింపుచుండుట వలన దీని నామధేయము సురధుని లేక యమృతప్రదాయని యన బరగుచున్నది. జీవుడా! ఒక్కగంగా ప్రవాహము త్రిలోకముల యందు త్రివిధముల పరిగ్రహింపబడుచున్నది. శబ్దస్పర్శరూపరస గంధరూపమగు తరంగ సముదాయమును కొందరు పభోగ్యములని గ్రహింపుచున్నారు. స్వయముగ భోక్తలగుచున్నారు. కొందరు కర్మఫలము లేక యదృష్టమని దలచి యందుభోగ సుఖమును గాంచక విరాటశక్తి యొక్క తరంగములని యనుభవించుచున్నారు. దానినుండి దప్పించుకొని ఊర్ధ్వదృష్టిని సంపాదించుటకు యత్నించుచున్నారు. కొందరా శబ్దస్పర్శాది తరంగములు అమరపుర మందలి యమృత ప్రవాహమని దలచి అమరనాధుడగు మహేశ్వరుని మృత్యుంజయ రూపమున నుపలబ్ధనొంది యమరత్వమును బొందుచున్నారు. లేక మృత్యుంజయులగుచున్నారు.

జీవుడా! నీవు చివరచెప్పిన విధమున ఆకాల గంగకేసి చూడుము. శబ్దస్పర్శరూప రసగంధముల తోడ ఆకాశగంగా ప్రవాహము సంస్కార రూపమగు నీకులమందు ప్రవేశించి తరంగ భంగములసృజింపుచున్నది. అదిభోగమైనను భోగమని దలచి గ్రహింపకు. కర్మఫలమైనను నిరాశ నొందకుము. దీనినమృతమని దలంపుము. అమృత ప్రవాహమందం యమృతవారిని శబ్దస్పర్శ రూపరసగంధ యుక్తమగు యమృతాంజలియని భావింపుము. ఊర్ధ్వముఖమున మృత్యుంజయుని పదకమలముల యందర్పింపుము. అప్పుడు స్రోతము ఊర్ధ్వగతినొందును. ప్రవాహమునబడి మృత్యుంజయుని పద పద్మముల జేరనవు ఉపకూలమును విడి కులమును గలియుదవు.

ఇదియే కులధర్మము. ఈవిధముగ జగద్భోగమును దర్శించుటయే మన సనాతన ధర్మము. ఇట్టి జగద్భోగముల నుపలబ్ధినొందని యెడల సంస్కారరూపమగు ఉపకూలమునం దిటునటు తిరుగుచుండవలసినదే కాని, ప్రవాహము ఊర్ధ్వగతినొందదు. అట్టిది గోచరముకాదు!

ఇంద్రియములు లేనియెడల నమృతస్వాదన మసంభవమని దలచి, యూర్ధ్వస్రోతము నను సంధానము చేయు నంతవరకును, ఉపకూలమందే యుండవలయును. అందువలన నాకులమును నాశనము చేయుటకు వీలులేదు. అట్లు నష్టమొనర్చినయెడల సనాతన కుల ధర్మము వినష్టమగును.

ధర్మము నష్టమైనను లేక సంస్కార జనితమగు ఇంద్రియరూపమైన ఉపకూలము భంగమైనయెడల గలుగునది ధర్మనష్టమే కాదు. ఒక్క ధర్మనష్టమే యైన యెడల జీవునకు పరితాప ముండదు. ధర్మము నష్టమైన యెడల అధర్మము వచ్చి చుట్టుకొనును. ధర్మచ్యుతుడయిన వాడధర్మమునకు కబళము కాక తీరదు. మహాస్రోతస్వినియందు జీవుడు స్థిరముగ నిలుచుండజాలడు. ఉండిన యూర్ధ్వమందు, లేకుండిన క్రిందనుండక తప్పదు. గతి యేదియో యొకచోటునకు లాగితీరును. వెలుతురు చీకటి, సుఖదుఃఖములు సంతోష విషాదములు, పాపపుణ్యములు, ధర్మాధర్మములు, మొదలగువాని యందున్నంతకాలము గతి యుండి తీరును. పాపపుణ్యములు, ధర్మాధర్మములు లేవను స్థితికులమును జేరినగాని సంభవింపదు. అందువలన యింద్రియములు, లేక సంస్కారరూపమగు ఉపకూలమునందు దృఢముగ నుండవలయును. ఊర్ధ్వముఖియగు స్రోతస్వినిని గాంచనంతవరకు ప్రవాహమునందు భాసిల్లజాలవు. అందువలన తల్లిరచించిన యిసు

కతిస్నెలమీదనుండి ప్రవాహముకొరకెనురుచూచు చుండుము. అట్లుండని యెడల ధర్మము నష్టమగును. అధర్మము నిన్ను చుట్టుముట్టును. పాతాళలోకమున ప్రవహించు భోగవతీ ప్రవాహమున మునుంగుదువు. అనేకదినంబులు మునుగుచు దేలుచు ప్రవాహమునంటి యుండు నిసుకతిన్నెల దిరుగుచు మనుష్యరూపమున నింద్రియ సంబంధమగు నుపకూలమునకు దిరిగివచ్చెదవు. భోగవతీ జలముల నిది భాగీరథీజలముల నేడు భాసిల్లు చున్నావు. కర్మమయమగు భాగీరథీ కూలమును కర్మక్షేత్రముగ గాంచుము. కాని భోగవతి యొక్క భోగమయ కూలమని నిరసించవలెను. సురధుని కూలమును జేరుటకు ప్రయత్నించుము. ఇంతవరకును మనకు ఊర్ధ్వ ముఖమున ప్రవహించు ప్రవాహము గనుపడలేదు. నిమ్నముఖియగు కల్లోలస్రవంతి యందుబడి యలసి సొలసి కూలమునుమాత్రము చేరగల్గితిమి. ఇట్టి స్థితియందు సాహసముతోడ జలప్రవాహమున దుమికిన మునిగి పాతాళలోకమును జేరుదుము. కావున రాత్రింబవళులు జాగ్రత్తగ మెలగవలయును.

ఇదియే కులధర్మము. తంత్రశాస్త్రములయందు వీని ఆచారపద్ధతినే కులాచార మందురు. ఇడా, పింగళ, సుషుమ్న, యనునవి తాంత్రిక నామములు. ఉపకూలమునే యాజ్ఞాచక్రమందురు. సహస్రారమనకులము. నిమ్నాధికారియగు సాధకుడు ఆయాజ్ఞాచక్రమును చేరగల్గిన యెడల దానియందుండి యూర్ధ్వస్రోతమును నిరీక్షింపు చుండవలయును. కాని నిమ్నాధికారి యాజ్ఞాచక్రమును చేరగల్గినను నధిక కాలముచ్చటనుండజాలడు. భోగవతియొక్క యాకర్షణవలన గ్రింది కాకర్షింపబడును. భోగక్షేత్రమందు బడిపోవును. యాభాప్రకారముగ జగద్భోగములందు మత్తుడగును. ఈవిధముగ నాజ్ఞాచక్రమును జేరుచు గ్రింద పడిపోవుచు దిరిగి తిరిగి చివరకు నాచక్రమందు స్థిరముగనుండగల శక్తి కల్గును. అప్పుడూర్ధ్వస్రోతమును నిరీక్షింపు చుండసమర్థుడగును. ఒక్క సాధకుడేకాదు. ప్రతిమానవుడును ఆజ్ఞాచక్రమును స్పృశింపుచు దిరిగి క్రిందకు వచ్చుచుండును. మానవుడేదైన నొకకార్యమును నిర్వహింప గల్గెనేని నాజ్ఞాచక్ర స్పర్శలేక నాకార్యము జరిగెనని దలంపజనదు. ఏకార్యమొనర్పవలయునన్నను మనోమయ క్షేత్రమందు లేకనాయాజ్ఞా చక్రమందు నొకింత సమాధి గల్గితీరవలయును. కావున ప్రతి కార్యమును యోగమని భావింపుము సమస్తకార్యములందును షటంగయోగము నిర్వర్తింపబడుచుండును. ప్రతికార్యమందును, ఆసనము ప్రాణయామము, ప్రత్యాహారము, ధారణ ధ్యానము, సమాధులనునవి యున్నవి. ఈయారు సోపానములును లక్షితములగుచున్నవి. ఈయారు సోపానముల వ్యతీతముగ నేకార్యమును నిర్వహింపబడజాలదు.

ఏకార్య మొనర్పవలయు నన్నను కర్మోపయోగమగు ఆసన — ప్రాణాయామ — ప్రత్యాహార ధారణ — ధ్యానములు గల్గినపిమ్మట సమాధి గల్గిననే కార్య సాఫల్యమగును. నీవు వ్రాయదలచిన యెడల, పరుగెత్తు చున్నటులగాని, పోట్లాడు సమయమున నున్నటులగాని నిద్రించు చున్నటులగాని, శరీరముండిన యెడల నీవు వ్రాయజాలవు గదా? కావున వ్రాత సాంగమగు పద్ధతిని నీవు గూర్చుండవలయును. అట్లు గూర్చుండుటనే యాసనమని గ్రహింపవలయును. అనగా కార్యసానుకూలము కొరకు సరియగు విధమున శరీరము నుంచుకొనుటను ఆసనమందురు. విశేషకార్యముల కుపయోగపడునటుల నిశ్వాస ప్రశ్వాసలను సుయమమొనర్చుటను ప్రాణాయామమందురు. మనయుండి శ్వాస యెప్పుడును నొక్క విధముగ బ్రవహింపదు. భుజించునప్పు డొకవిధముగను, నడచునప్పుడు మరియొక విధముగను, నిద్రించునప్పు డింకొక విధముగను భక్తిభావముప్పొంగునప్పుడు వేరొక విధముగను వెల్వెడలుచుండును. ఏలయన, మనోభావము మారిన కొలదిని శ్వాసగూడ మారుచుండును. కావున నట్లు మనో

భావము ననుసరించి ప్రవహించు శ్వాసనే ప్రాణాయామమందురు. ఈశ్వరచింతనము కొరకు లేక సమాధికొరకు శ్వాసప్రశ్వాసల నియమబద్ధముగ నొనర్పుటను ప్రాణాయామ మందురు. కావున ప్రాతేపవీలగునటుల గూర్చుండినటులనే శ్వాసను వ్రాయుట కుపయోగకరముగ నుంచుకొనుటను, ప్రాణాయామ మందురు. ఇటులనే ప్రత్యాహార ధ్యానధారణలు మొదలగువానిని గ్రహింపవలయును.

ఏ కార్యమును నిర్వహింపవలయు ననినను ఆజ్ఞా చక్రమును స్పర్శించి తీరవలయును. యోగ విషయమును వ్రాయునప్పుడు దీనినిగూర్చి సవిస్తరముగ విస్తరించెదను.

ప్రకృతితోడ సంయుక్తమై యుండనియెడల కులధర్మమునుండి విచ్యుతుల మగుదుమనియు, వెంటనే యధర్మము మనల చుట్టుకొనుననియు చెప్పియున్నాను. ధర్మహీనతయే యధర్మము. ధర్మమగు కార్యముల చేయకుండుటవలన నధర్మము సంభవించదని యనేకులు తలంపుచున్నారు. కాని యది సత్యముకాదు. అధర్మ కార్యములొనర్పుట వలన అధర్మము గలుగును. "ధర్మము" నాచరింపకుండుటయే యధర్మమను విషయమును మరువరాదు. ధర్మమును ధ్వంసముచేయు అధర్మకార్యము నొనర్చుటవలన అధర్మము చుట్టుకొనునను విషయమునెల్ల రంగీకరించెదరు. కాని ధర్మజనకమగు కార్యములు చేయకుండుట వలన అధర్మము వాటిల్లునను విషయమును సాధారణముగ ధారణజేయరు. మనయందు విశుద్ధమగు సాత్వికాంకురములు ప్రచ్ఛన్నముగ నున్నవి. ధర్మజనకమగు కార్యము లొనర్చుచుండినయెడల నవి క్రమక్రమముగ అభివృద్ధినొందుచుండును. అధర్మజనక కార్యములొనర్చినను లేక, ధర్మజనకమగు కార్యములు చేయకున్నను, మనయందలి యీసాత్వికశక్తి వికసింపదు. మరియునది బంధింపబడి జడముగ బరిణమించును. ఈయశంక వలననే యర్జును డీక్రింది విధముగ బ్రశ్నించుచున్నాడు.




తండ్రి కుమారుఁడు మనుమఁడు

# దరిద్రుని యాకాంక్ష.



(ఉ. లక్ష్మీనారాయణ గారు.)

## ౧

నాకు గావలసినది యత్యల్పము. నాకుమించిన దానిని నేను కోరుటలేదు. ఎక్కుడయవసరమును లేదు. భగవానుడను గ్రహించి మహామూల్యమగు ప్రాణము నొసంగియున్నాడు. ఆప్రాణమును నిలుపుకొనుటకు తగినదిచాలును. రెండుపూటల కడుపునిండ తినుటకు కూడు దొరికినతృప్తి. గంజిదొరికినను సరే. ఇదేనాకు గావలసినది. నేనడుగునది యిదియే. నేనునడచుటకు సిద్ధముగ నున్నాను. ఎంతదూరమైనను నడచుటకు వెనుదీయను. సంతసముతోడ నడచెదను. కానియెప్పుడు కూర్చుండియుండజాలను. అందువలన నేమైనసుఖమున్నదేమో నాకు తెలియదు. సోమరులై యుండువారలు సుఖము నెరుంగరని పండితులు చెప్పుచుందురు. ఉదరపోషణకొరకు కదల మెదలక గూర్చుండవలసినవారు గూడ సమయము దొరికినయిటునటు తిరుగుచుందురు నేను పొట్టతిప్పల కెప్పుడు తిరుగుచుందును. నడవక గూర్చుండుటవలననే సుఖముండినయెడల యెల్లరు ఎప్పుడు గూర్చుండియే యుందురు కదా! అట్లుండరు. భూమండల మందందరు నడచుచుందురు. నడచుటయందే సుఖమున్నది. కావున నేను నడచుటకు సంసిద్ధుడను. నడచుచునేని భూలోకమునకు వచ్చితిని. తిరిగి నడచుచు మరణించెదను. నడువవలసి వచ్చెనను భయము నాకు లేదు. నాకు కావలసినది రెండుపూటల రెండుముద్ద లన్నము. అంతమాత్రము చాలును. అంతకంటె మిక్కుటముగ నాకక్కరలేదు. నాయీకోరికయందత్యాశయున్నదా?

ఆకలివలన శరీరము మండుకొని పోవుచున్నది. ఒక్కముద్ద యన్నము దొరికినయెడల నాహృదయమానందమున తాండవంబాడును. ఆనందనిశ్వాసము బయల్వెడలును. ఇదియేగదా భుజించుటవలన గలుగు సుఖము? కడుపునిండిన తర్వాత గారెలు బూరెలు తినుటవలన గలుగు సుఖమెద్దియో నాకు తెలియకున్నది. అందువలన సుఖము లేదనుకొనెద. క్షుధానివృత్తియందే కదా సుఖము? ఆకలిలేని భోజనమున నానంద ముండునా? బాగుగ తిరుగనియెడల ఆకలి యుండదు. అందువలననే నేను తిరుగుచుందును. తిరిగినకొలది యాకలిమంట బయలుదేరును. అప్పుడు దాని కౌహుతిపడని యెడల నడచుటెట్లు? అన్నము దొరకకయుండుటవలన కడుపుమాడిపోవును. అప్పుడు క్షుధానివృత్తివలన గలుగు సుఖమునుండి వంచింపబడుదును. తినుటకును నడచుటకును గల సంబంధమిట్టిది. అందువలననె "శ్రీరామచంద్రా! పూర్తిగ తిరిగినతర్వాత రెండుముద్దలన్నమును బ్రసాదించుము. కష్టించితిందును. తిని కష్టించెదను. నాకోరిక యిదియే."

## ౨

ప్రపంచము నందందరు కోరుదానినే నేనును కోరుచుందును. అంతకుమించిన కోరిక నాకెప్పుడును లేదు. జీవకోటియందు మానవు డగ్రగణ్యుడుగదా? మానవులయందు ఋషులు, మునులు, భక్తులు, యోగులు మొదలగువారు ముఖ్యులు. వారు కోరుదానినె గదా నేనుకోరుచున్నాను. ఆనందము దేనియందున్నది. ఆకలగునప్పుడు తినుటయే యానందము. అందువలన నేను తిన బ్రయత్నింతును. ఆరోగ్యముతోడ నడచుటయం దానందమున్నది. అందువలననే శరీరారోగ్యమును గోరుచుందును. ప్రేమించుట

యందు మిక్కిలి యానంద ముండుటవలననే నేను ప్రేమించుటకును, ప్రేమయొసంగుటకును ప్రయత్నింతును. నేను ప్రేమించువారికిని, నన్ను ప్రేమించువారికిని సేవజేయుటకు నాకానందము. అగుటవలన సేవజేయుటకు తగినవాని నగుటను గోరుచుందును. నాపిల్లలు చంద్రకళల బోలి దిన దినమభివృద్ధి నొందుచుండిన యెడల నేనానందింపుచుందును. వారానందముగ విహరింపు చుండుటను గాంచిన కొలదినినాకానందము వృద్ధియగుచుండును. కావున నేను వారికిరెండుపూటల పొట్టనిండ యన్నము బెట్టుటకు యత్నింతును. వారికి మంచి బట్టల నిచ్చుటకు యోచింపుదును. నాకడుపునిండ కున్నను పిల్లలకడుపు నింపుటను కోరుదును. నేను పస్తుండియైనను పిల్లల కన్నము బెట్టుటకు బ్రయత్నింతును. వారికొరకే నేను తిరుగుచుందును. బాగుగ తిరుగగలుగుటకే తినుచుందును. తిరుగుట తినుటవలన నానంద మున్నదనిన యేమి? తినుట తిరుగుటయందానందములేదు. నన్నాశ్రయించి యుండుభార్యాపుత్రులు మొదలగువారికడుపునిండి, బట్టకట్టుకొనుట యందున్నది. అందువలన నేను వారికొరకు తినుచుందును. నడచుచుందును. వారారోగ్యవంతులై సునిర్మలమగు మనమున నభివృద్ధి నొందుచుండిన కొలదిని వారికెట్టి యభావములుగాని యభివృద్ధి కొటంకములుగాని కలుగకుండు గాక యని గోరుచుందును. వానిసుఖము మొదలగునవి నాతోడ పెనవేసుకొనినదినము నుండియు నేనిట్లు కోరుచున్నాను. ఇట్లు గ్రహింపు చున్నాను.

౩

కేవలము నాకొరకు నేను నడచుటలేదు. అట్లు నడచుటవలన సుఖ మేముండును? జానెడు పొట్ట యెదోవిధముగ నిండును. ఒక చిన్నిగుడ్డ దొరకిన సమృద్ధి. తలదాచు కొనుట కొక కుటీర మయినను లేక తరు తలచ్ఛాయ యైనను కాలము గడచును. దీనికొరకంతగా భావింపను. అంతగా యాతురతయు లేదు. పశుపక్షులీ విధముగనే జీవింపుచున్నవి. కీట పతంగములు గూడ నిటులనే కాలమును వెళ్లబుచ్చు చున్నవి. ఇట్లు బ్రతుకుట యందుగూడ నొక విధమగు ఆనంద మున్నది. భగవానుని యాశీర్వాదనము వలన జీవన ధారణయందే జీవు లానందమును బొందుచున్నవి. ఆనందమును బొందు చుండుట వలననే బ్రతుకుటకు బ్రయత్నింపు చున్నవి కాని యా యానంద మత్యల్పము. చాల దినము లుండునదికాదు. దీనితోడనే మానవ జీవితము పూర్తికాదు. మానవుడు కేవలము జీవించి యుండుట తోడనే సుఖమును బొందజాలడు. మానవుడు ప్రేమించును. ప్రేమ నొసంగును. సేవ యొనర్చుచుండును. సేవను కోరుచుండును. సమస్త విషయముల (శరీరము—మనస్సు భావము) నభివృద్ధి నొంద యత్నించును. తనచుట్టుప్రక్కల నుండువారినిగూడ వికసింప జేయుటకు పాటుపడును. మానవుడు పదిమందితోడ తిరుగుటకును, మాట్లాడుటకును, అభివృద్ధి నొందుటకును బ్రయత్నించును. అందువలన సంసారమును—సంఘమును—రాష్ట్రమును గోరుచుండును. ఇవి లేనియెడల మానవునకు జరుగదు. స్వార్థసిద్ధి యందే మానవునకు సుఖములేదు. పదార్థ సాధనయందే యాతని సుఖముండును. అతని సుఖము కేవలము గ్రహణమందేకాదు. వితరణయందు. ఇతరులకు తన నర్పించుకొని సుఖింప జూచు చుండును. మానవకోటియందందరికంటెను నెక్కుడుగ సుఖము నొందు వాడెవ్వడు? నిశ్శేషముగ తనను దా నర్పించుకొనినవాడు. పరమానందమునుబొందుచుండును. తనకొరకు తాను చేయు ప్రయత్నమందు సుఖములేదు. ఒంటరిగ భుజించుటవలన నంతకంటెను సుఖములేదు. అందువలన నేను పరివారము కొరకును పరిజనుల కొరకును తిరుగుచుందును. పదిమందితోడ భుజించుటకు బ్రయత్నింపు చుండును.

౪

నాకును బ్రాణ మున్నది. నాకు భూమి బ్రాత లేకుండుట వలన ప్రేమింపబడు వారు లేరని తలంప

వలదు. నాకు బాంకునందు లక్షలకొలది ధనము లేనిమాట నిజము. కాని నా ప్రియజనులకు కడుపు నిండ భోజనము—బట్ట - నగ లుండవలయునను కోరిక నాకులేదా? నాకు చదువురాదు. చదువుకొనుట కవ కాశము గలుగలేదు. అందు వలన జ్ఞాన పిపాస నాకు లేదని, యెవ్వరును దలంపరాదు. నాయింటి యందు చిత్తరువులు లేవు. ఇంటిని చుట్టిన యుద్యాన వనము కావరాదు. అందువలన సౌందర్యమును గాంచి నంతనే నా హృదయమం దానంద ముద్భూతమగు నను విషయమును మరువ జనదు. కుత్సిత మగునది నాకంటికి కంటకమువలె నుండును. కర్కశ స్వరము నా చెవులకు బాధను గలిగించును. విధాత యెల్లర ప్రకృతికిట్టి ప్రకృతినే యొసంగియున్నాడు. ఒక్క ప్రాణమే సమస్త మానవులయందు స్పందిత మగు చున్నది. ఒక్క మనమే యెల్లరియందు తేజో మూర్తియై వెలుంగుటకు బ్రయత్నింపు చున్నది. ఒక్క యాత్మయే యెల్లరియందు వికసించుటకు బ్రయాస పడుచున్నది. ఒక్క మానవుడు కోరు దానినే సమస్త మానవులు గోరుచుందురు. ఒక్క మానవుని ప్రాణము బొందు ప్రయాసయే సమస్త మానవులు బొందు ప్రయాస. నవరత్న ఖచితమగు నగలను పిల్లల కలంకరించి నీ వానందమును బొందు చున్నావు. నేను నక్కపల్లి గిలకపండును పిల్లవాని చేతికిచ్చి యానందింపు చున్నాను. కుసుమముకంటె ను సుకుమారమగు నీపిల్లలు జబ్బుపడిన యెడల నీప్రాణము పరితపించును. అనశనమున పరితపించు చుండు నాపిల్లలు రోగగ్రస్తు లయిన యెడల నాప్రాణము తల్లడిల్లును. మనుష్యత్వమను పీఠ భూమి యందు ప్రాణమను దర్బారులో ప్రేమ, స్నేహము, ప్రీతి, సేవయను రాజ్యమందు సమస్త మానవులు సమానులు. ఒక మానవుడు గోరు దానినే సమస్త మానవులు గోరుచుందురు. కాని యీ సత్యము నెల్లరు భావింపరు. కన్ను విప్పి చూడరు. అందు వలననే సంసార మందింత పాపము, విరోధము. దుఃఖము.

౫

సమస్తదేశములు— సకల యుగములయందలి మహాపురుషుల విషయమును దెలిసికొనియున్నారు. అందువలననే వారు మానవునియందు భేదమును గాంచి యెరుంగరు. దివ్యచక్షువుల ద్వారమున సమస్త ప్రాణులయందు విరాజిల్లుచుండు భగవానుని గాంచి పలువిధముల స్తోత్రములొనర్చి యున్నారు. మహా భక్తుడగు క్రీస్తు యిట్లు నుడివియున్నాడు "చివర విచా రణయందనేకులు నన్ను ప్రభూ, అని సంబోధిం చెదరు. కాని యప్పుడు నేను వారిని గుర్తింపజాలను. నేను క్షుధితుడనై వారిద్వారములకడ కేగితిని. కాని వారునాకు భోజనమిడలేదు. పిపాసవలన నొక గ్లాసు జలమును గోరితిని. వారునాకొక బొట్టుజలమైన నీయలేదు. నిరాలయుడనై శీతకాలము రాత్రి వారింటియందొక మూలస్థలము గోరితిని. వారు తలుపు దీసి నన్ను లోనికి దీసికొని యేగలేదు: ఈమాటలు వినిన యెడల వారు విస్మితులై యిట్లు ప్రశ్నించెదరు. "ప్రభో మీరెప్పుడు ఆకలివలన మమ్ము అన్నము బెట్టుమని యడిగినారు? దాహమువలన మమ్మెప్పుడు మంచితీర్థము నడిగినారు?" క్షుద్రాదపి క్షుద్రతమమగు సోదరులకన్న మొసంగలేదు. దాహ మీయలేదు. అందువలన పిపాసితుడనగు నేను మీవలన తరుమబడితిని. ఆవిషయము మీకుదెలియలేదా,,? ఏసు క్రీస్తును క్రైస్తవులు పరమేశ్వరావతార జ్ఞానమున భజన చేయుదురు. ఆ క్రీస్తు తిరిగి ప్రతి మానవుని తన విగ్రహముగను, తనయవతారముగను భావించి యున్నాడు. మానవుని గుర్తింపజాలనివాడు భగ వానుని యెట్లుగుర్తించును? మానవుని ప్రేమింపజాలని వాడు భగవానునకు భక్తియెట్లు నెరపును? మానవ దేవత యానందమును బొందనప్పుడు భగవానుని సేవ యందానంద మెట్లు గలుగును? మానవుని వీడి భగ వానుని బొంద యత్నించు వానికిని భగవానునకును అనంతకోటి యోజనముల దూరముండును. భగవాను నిబొందవలయుననిన మానవునివీడరాదు. సమస్త దేశ

మందలి సాధుపుంగవులు యీవిషయమును నేక కంఠమున బలికియున్నారు.

౬

నేను సాధుపుంగవుడగాను. భక్తి యంతకంటెను తెలియదు. జ్ఞానమను విషయమేమియో యెఱగను. నేనత్యంత దరిద్రుడను. సాధారణ మానవుడను. మహాజన సముద్రమందొక గణించుటకు వీలుగాని తరంగభంగమును. భగవన్నామమును వినునప్పటి నుండియు, నామోపాసనకు గడంగినప్పటినుండియు, భగవానుని ద్వారమున మానవుని భావించి, మానవునే భజింపుచుంటిని. నాదేవుడు సుందరులయందు సుందరుడు. ప్రతిభాశాలులయందు ప్రతిభాశాలి. బలవంతులయందు బలవంతుడు. ప్రేమికులయందు ప్రేమికుడు. అందువలననే నాభక్తిని యనంత విధముల నాకర్షించియున్నాడు. నేను కాళీ, కరాళీయందు ప్రకాశించు ప్రళయరూపమగు శక్తినిగాంచి, భయవిహ్వలుడనై కపాలమాలినిని బిలచుచున్నానని దలంపజనను. కాళియందు, మాతృమూర్తిని సందర్శించి 'తల్లీ, 'తల్లీ, యని పిలచుచున్నాను. నెనల్లాహో అగ్బరనుటవలన మానవున కతీతమగు నిరాకార ప్రభువును బిలచుచున్నానని యనుకోనకుడు. అతడు నిరాకారుడు. మానవుడు గాడనుమాట నిజము. మానవాకారము ఈదేహమందు బ్రకాశింపుచున్నది. ఈదేహమునకు రోగములున్నవి. ఇది కుళ్లిపోవును. ఇట్టిదేహము భగవానున కెట్లుండును? మానవునకు భ్రమప్రమాదములు, ఈర్ష్యా ద్వేషములు, మానాభిమానములు మొదలగునవి యున్నవి. మానవుడు మృత్యువున కధీనుడు. అందువలన పరమ ప్రభువగు పరమేశ్వరుని మానవరూప కల్పనకు చోటీయను. అట్లొనర్చినయెడల మహాపాప మొనర్చినవాడ నగుదును. కాని మనఖోదా మనకు ప్రభువు. మనశాహన్‌షా అనంతకాలమునకు ప్రభువు. నేనాతనికి నిత్యదాసుడను. ఈప్రభుదాస సంబంధ మధ్యమున మనుష్యత్వ భావము వికసింపుచున్నది. ఈభావము నాశ్రయించియే ప్రభువునకు సర్వస్వమొసంగి సేవజేయుచున్నాను. ఈమానవ భావాశ్రయము వలననే ప్రభువును బంధువుగను ప్రియతమునిగను భావించి భజనచేయుచున్నాను. నేను చిరదినములుగ నాప్రభువునందు మానవునియనుసంధాన మొనర్చుచున్నాను. అజ్ఞానమున నన్వేషణమొనర్చితిని. జ్ఞానమున వెదకితిని. కాని ప్రయోజనం బేమి? లభింపలేదు. నెను మానవుని సరిగ గుర్తింపలేదు. అందువలన దొరకలేదు.

౭

తనను తానుగాంచలేదు. తలమీదమణి తలమీదనే యుండును. దానిని మరచి సర్పము పరిపరి విధముల పరువిడుచుండును. అటులనే మానవుడు తన్ను దానుమరచి సంసారమం దంతటను పరిభ్రమింపుచుండును. ధనికులు ధనగర్వమునను, దరిద్రులు దారిద్ర్యమువలనను, జ్ఞానులకు జ్ఞానజ్యోతివలన చక్షువుల నంధకార గ్రమ్ముటవలనను ధార్మికులు ధర్మాభిమానమువలనను, తమను దామమరచుచున్నారు. తనను దానుగుర్తింపజాలనివాడు భగవానుని యెట్లుగుర్తించును? నెను నాదేవతను గోరుచున్నాను. ఈనేత్రములతోడనే నాదేవతను గాంచయత్నింపుచున్నాను. నాదేవతతోడ నేను ప్రత్యక్ష సాంగత్యమును వాంఛింపుచున్నాను.

౮

మానవులయందు కొందరు గొప్పవారలై భగవానుని బిలుచుటను మరచుచున్నారు. కొందరతి సామాన్యులు భగవానుని ధారణచేయజాలకున్నారు. నేని కొద్దిగొప్పలు సమానమగుటను వాంఛించెదను. అప్పుడుగాని భజనకు సమభూమి యేర్పడదు. ఈయాకాంక్షయందు పెద్దలయందణుమాత్రమైనను అసూయలేదు. చిన్నలయందు నిర్లక్ష్యములేదు. వీనియందు నాదైవమును బొందవలయునను ఆకాంక్షమాత్రమున్నది. ఈబీదవాని యాకాంక్ష యెప్పుడు పూర్తి యగును?




ముస్తఫా కమాలు పాషా కిలాఫతును తల్క్రిందులుగ నొనర్చెను. అందువలన మహమ్మదీయ జగత్తంతయు క్షోభిల్లుచున్నది. అరబ్బు — మిశరు — మెసపొటేమియా — సిరియా — పర్షియా — అఫ్గన్‌స్థానములయందు జరుగుచున్నయాందోళనమునకంతము లేదు. వారు కిలాఫతుయొక్క శూన్య పీఠమును తిలకింపజాలకున్నారు. ఈ సంక్షోభము భారతవర్ష మందలి మహమ్మదీయులను గూడ కలవరపరచుచున్నది.

*　　　*　　　*

భారతీయ మహమ్మదీయులను కిలాఫతుసమస్య ఘోరతరతమో నిద్రనుండి మేల్కొలిపినది. దానిని సాధించుటకనేక విధముల యత్నించిరి. మహత్తర త్యాగ మొనర్చిరి. ఆశలు సఫలమైనవని యనుకొనుచుండ నిరాశ కలిగినది. ధర్మ విశ్వాసమునకు భంగము వాటిల్లినది. వీ రింతవరకును కేంద్రముగ దలంపుచున్న ధర్మ పీఠ మంతర్ధాన మైనది. ఇందువలన ధర్మమునే శేషావలంబనముగ దలంచి కాలము గడపుచున్న మహమ్మదీయ సోదరుల విచారమున కంత మెచ్చట?

*　　　*　　　*

కిలాఫతు వలనను, కమాల్ పాషాయొక్క దుర్జయ శక్తి సామర్థ్యము వలనను మహమ్మదీయ ప్రపంచము కన్ను దెరచెననుట సత్యము. స్వవిషయముల వర్తమాన కాలమున కనుగుణ్యముగ మార్చుకొని సర్వవిధముల నభివృద్ధి నొందుటకు వారెల్లరు బ్రయత్నింపుచున్నారు. ఈ సందర్భమున భారతవర్షీయ మహమ్మదీయుల కర్తవ్యమేమి? ప్రపంచమందలి మహమ్మదీయుల పురాతన భావము లంతర్హితము లైనవి. నవీనోత్సాహమున భవిష్యత్కాలమునకు తగిన సంఘవ్యవస్థలను— రాష్ట్రములను—నిర్మించుకొనుచున్నారు. స్త్రీల స్వాతంత్ర్యమును గమనించిన విషయము ముఖ్యము. వారికి స్వాతంత్ర్య మొసగుచున్నారు. మంత్రిపదవి యందొక స్త్రీ యున్నదని నుడివినప్పుడు ప్రపంచమునందు సంతసింపనివాడుండడు గదా? ఆ ప్రయత్నము భారతవర్ష మందలి ముసల్మానులయందుగూడ లీలగ గోచరమగుచున్నది. కాని యది స్ఫుటము గావలయును. ధర్మ జగత్తునకు హద్దులు లేవు. ఆటంకములు లేవు. సముద్రములు దాటవలసి వచ్చినను, కొండల నెక్కవలసి వచ్చినను నెక్కవచ్చును. కాని మహమ్మదీయుల దృష్టి వారు నివసించు దేశమునందే నిలువవలయును. అదియే కేంద్రము గావలయును. అప్పుడే హిందూ మహమ్మదీయ సఖ్యత- హిందూ మహమ్మదీయ బౌద్ధ జైన శిక్కు పార్సీ క్రైస్తవుల యైక్యదృష్టితో గూడిన జాతీయత- దానితో గూడిన రాష్ట్రము మొదలగునవి యేర్పడును. భారతజాతి మహత్తరమగుజాతియగును. అది శౌర్య సాహసోపేతమై మానవకోటియందు సరిసమానస్థాన మాక్రమించి జగత్కల్యాణమునకు దోడ్పడును. హిందూ దేశీయ మహమ్మదీయ క్రైస్తవ పార్సీ జైనులకు ముక్తి గలుగును. కాని యింగ్లండు ముక్తి క్రైస్తవులకు ముక్తి నివ్వజాలదు. అటులనే టర్కీ ముక్తి మహమ్మదీయుల విముక్తి నొనర్పజాలదు. అందువలన గలుగవలసి నంతఫలము భారత మహమ్మదీయులకు లభించినది. మిగిలినది స్వప్రయత్నముమీద నాధారపడి యున్నది.

*　　　*　　　*

మహమ్మదీయుల విజయనినాదమునందు వెల్వడిన మహామంత్రమేమి! జాతీయ భావమేగదా? ఇదివరకు జాతీయభావము ధర్మాంతర్గతమైయుండెను. పాశ్చాత్యదేశములయందు ధర్మవిహీనమైయుండెను. కాని యీ జాతీయభావము— మానవకోటియందుద్భూతమై పొంగిపొరలుచున్న జాతీయభావము ధర్మరహితమైనదికాదు; ధర్మసంగతమైనది. దేశవిరహితమైనది కాదు. దేశమునంతయు వ్యక్తముగ చేసికొనినది. అందువలన వ్యక్తిని వీడిన సంఘమునకుగాని, సంఘమునువీడిన వ్యక్తికిగాని, దేశమును గమనించని ధర్మమునకుగాని, ధర్మమును గమనించని దేశమునకుగాని లోకకళ్యాణమునువీడిన దేశమునకుగాని దేశకళ్యాణవీడిన లోకకళ్యాణమునకుగాని తావులేదు. అందువలన వ్యక్తి-సంఘము-దేశము-ధర్మము-మతములకిదివరకు రక్షకములైయున్న బంధనములు తెగి సమన్వయమేర్పడుచున్నది. ఈమహాసమన్వయమందే మానవకోటికళ్యాణ మిడిమిడియున్నది. మానవవికాసమున్నది. ఇదియే మానవకోటియొక్క హృదయమును డి యమృతప్రవాహరూపమున బయలెడలుచున్న నూతనయుగము. భగవల్లీల. ఒక్కమారు ప్రదర్శింపబడినది తిరిగి ప్రదర్శింపబడదు. అట్లు ప్రదర్శించబడినయెడల నాశనముకాని వికాసముకాదు. అవి మానవుడు దాటిన సోపానములు.

* * *

ఇదివరకు మానవకోటి తీవ్రముగు వ్యతిరేకపథమున నడచినది. వ్యతిరేకముగ నడుచునది సమన్వయముకాదు. తన్ను దాను తెలిసికొనజాలనివానికి జగత్తెట్లర్థమగును? మానవకోటితోడ దృఢసంబంధమెట్లుగలుగును?

నేడు మానవకోటియందు నేకభావము వృద్ధియగుచున్నది. దానిని మానవసౌభ్రాతృత్వమందుము. మానవసౌభ్రాతృత్వముకొరకే వేలకొలదివత్సరముల నుండి వ్యతిరేకసాధన జరుగుచుండెను. ఈసాధనయందుక్తనదులు ప్రవహించినవి. జాతులుక్షయమైనవి. కానియిక వానికి తావులేదు. ఆమార్గమంతరించినది. దానితోడ మానవులయందుండు కల్పితమగు అంతరాయములు నశించినవి. మానవునిదృష్టి మానవకోటియొక్క మధ్యబిందువునందు లగ్నమగుచున్నది. అందువలననే తనమీద తాను, తనదేశముమీద తాను నిలచి జీవించుట స్వధర్మమనితలచి; జాతులు— ధర్మములు— మొదలగువానికి చెందిన సమస్తమానవులు వ్యక్తిత్వమును గాపాడుకొనుచు సమన్వయమును బొందు ప్రయత్నమందున్నారు.

* * *

మహమ్మదీయ ధర్మమొక ముఖ్యమగు ధర్మము. భూమండలమందంతటను నీధర్మావలంబులున్నారు. వీరియందువ్యతిరేక సాధన మిక్కుటము. ఆసాధనకొరకు తృణప్రాయముగ ప్రాణముల నర్పించెదరు. మహత్తరమగు నీ జాతిని భగవానుడు కదలింపుచున్నాడు. మూసయందు బోసి కరిగింపుచున్నాడు. ఆమూసనుండి షోడశకళాపూర్ణమగు చంద్రధ్వజముతోడ నూతన తుర్కీరాజ్యముద్భవించినది.

ఇప్పుడు వారియందు కొద్దిగొప్పలు లేవు. నేరినినీచులుగ భావింపరు. తాము నీచులుగ భావింపరు. నీచులుగ భావింపబడుట కంగీకరింపరు. స్త్రీపురుషులెల్లరు సమానస్వాతంత్రమున సౌభ్రాతృత్వమున్న ధర్మమంతర్వ్యక్తమైన జాతీయ భావమున మాతృపూజకుపాయనముల కరకమలముల యందుంచుకొని విశ్వమాతృమందిరముకేసి పరుగిడుచున్నారు. కమాలుపాషా జయ జయధ్వానము లొనర్చుచుముందుముందుకు చున్నాడు. భారతవర్షమందలి మహమ్మదీయ సోదరులారా! మనధర్మమేమి?



# ఆంధ్రికర్మాగారము లిమిటెడ్, గుంటూరు.



(1913) సం॥ ఇండియాకంపెనీల చట్టము ప్రకారము రిజిష్టరు చేయబడినది.)
ప్రాస్పెక్టస్ స్థానిక్టేటుమెంటు జాయింట్ స్టాక్ రిజిష్ట్రారుగారివద్ద దాఖలు చేయబడినది.

మూలధనము **5,00000** రూప్యములు.

**12** వేలషేర్లు దరఖాస్తు కాబడినవి. స్థలముకొనబడినది. షేర్లుమొత్తమువసూలు కాగానే పని ప్రారంభింపబడును.

వాటాలు, **50,000** లు. వాటా 1కి రు 10 లు మాత్రమే సొమ్మంతయు నొక్కసారిగా చెల్లించనవసరములేదు. దరఖాస్తుతో 1 రూపాయిన్ని, మంజూరు అయినతరువాత రు 3 లున్ను పిమ్మట రెండేసి మాసములకు తక్కువకాని వ్యవధితో దఫాకు రు 2 లు చొ॥ మూడుదఫాలుగాను వసూలుచేయబడును. సామాన్యస్థితిమంతులకూడ అవకాశముండుట కిట్టి సులభమైన ఏర్పాటు చెయ్యబడినది నూరుభాగములు పుచ్చుకొన్నవారు డైరక్టరుపదవికి అర్హులు.

## డైరక్టర్లు.

1. నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు పంతులుగారు ఎం. ఏ. ఎల్. ఎల్. బి. బార్—అట్—లా; ఏజెంటు కలకత్తా రాయకట్ ఇండస్ట్రియల్ బ్యాంకు, గుంటూరు బ్రాంచి ప్రొప్రయిటరు, మ్యునిసిపల్ చైర్మన్, గుంటూరు.
2. పొత్తకమూరి వీరబ్రహ్మముగారు, ప్రొప్రయిటరు, పి యిం, పండితఅండ్ సన్స్ గుంటూరు.
3. మోతే నారాయణరావుగారు, జమీందార్, ఏలూరు.
4. బాకురుపండా వెంకట రమణమూర్తిగారు, జమీందార్, విశాఖపట్నం.
5. మోతే నరసింహారావుగారు, జమీందార్ ఏలూరు.
6. గద్దే వెంకటారాయుడుగారు, బ్యాంకర్, భూస్వామి, గుంటూరు.
7. శంకర వెంకట్రావు పంతులుగారు, ఎల్. ఎం. అండ్ ఎస్. గుంటూరు.
8. రుద్రవరపు కాశీపతిరావుగారు, ప్రొప్రయిటరు, గుంటూరు.
9. నూకా వెంకటరత్నంగారు, మర్చెంటు బ్యాంకరు, అండు డైరక్టరు తెనాలి. వెంకటేశ్వర రయిస్ మిల్లు, గుంటూరు.
10. నేరెళ్ల వెంకటసుబ్బారావుగారు, మర్చంటుఅండ్ బ్యాంకరు, గుంటూరు.
11, పన్నాల వెంకటకృష్ణమూర్తిగారు, బ్యాంకరు భూస్వామి. గుంటూరు.

## ముఖ్యోద్దేశములు.

(1)ఒక ఫౌండ్రీనినిర్మించి, అందు ఐరన్ కాస్టింగు (ఇనుముకరుగుట మౌల్డింగు (అచ్చులువేయుట)సైజింగు, ప్లెయినింగు,, సాయింగు షేపింగు క్రాస్‌కట్టింగు(మూలకోయుట) మైటరింగు జాయింటింగు, రివెంటింగు టంటింగు, గ్రూయింగు, పాలిషింగు, టర్నింగు డ్రిల్లింగు సాష్టింగ్ మొదలగుపనులను చేయుటకు కావలసిన యంత్రములను (మెషీనరి) యేర్పరుచుట (2) ఇనుము ఉక్కు ఇత్తడి మొదలగులోహములను కలపలను కొనుట అమ్ముట వాటిలోపని ముట్లను తయారుచేయుట తయారుచేసిన వాటిని అమ్ముట (3) మంచములు కుర్చీలు ఇనుపపెట్టెలు పలక కమ్ములు సుంత్రవనికమ్ములు పటాలు సోడామెషీనులు తాళములు చాకులు కత్తెరలు బ్రిషులు పాతలు ఫౌంటెన్‌పెన్లు నగయిరాలు చేయుటకు (4)బంగారు వెండి రేకులుతీయు మెషీనులు రాములవారు లక్ష్మీహనుమంతుడు మొదలగు మహానీయుల విగ్రహముల బొమ్మలు మొదలగునవి నిర్మించుట (5) మిషనులతో సున్నము గానుగాడించుట సుంగులూరు పెంకులు చేయుట, పైపు పోతపోయుట.

ఈపరిశ్రమము లాభకరమైనదా కాదా యని సందేహించినవారు ఇంగ్లాండు, అమెరికా, జర్మనీ మున్నగుదేశముల భాగ్యస్థితులను గమనించినచో దీనియందు ఉత్సాహము గలుగక మానదు. మనదేశమున టాటాకంపెనీవారి లాభములనుగూర్చి వినియేయుందురు. మనఆంధ్రదేశమున నిదియొక నవీనమైన పరిశ్రమము. ఫ్యాక్టరీలు, మిల్లులు కొల్లగానున్నవి వీటికన్నిటికి సామానులు సప్లయిచేయుటకు నెన్నిఫౌండ్రీలు స్థాపించినను లాభము రాకలదు అన్ని పరిమలకంటె నీపరిశ్రమ యందెక్కువలాభము రాగలదని, గొప్పయింజనీయరుల యభిప్రాయము ప్రస్తుతము మన దేశమున నట్టిఫౌండ్రీలు లేకుండుటచేచిన్న మేకుదగ్గరనుంచి యితరదేశములపై నాధారపడి ధనము గోల్పోవుచున్నాము మనదేశమున నిట్టిపనితనము, నట్టి శిల్పవిద్య కుదురునాయని కొందరు సందేహించుందురు అవకాశములు లేక వేలకొలది శిలవిద్యాధికులు మనదేశమున హీనస్థితి యందున్నారు. అట్టివారికిందగిన ప్రోత్సాహ మిచ్చిన యెడల చేయరానిదేదియు లేదు. మనము తగినంత పి. యమ్. పండిత అండ్ సన్స్ కంపెనీవారు ఈకంపెనీకి మేనేజర్లుగా నుండుటవలన వివిధములగు శిల్పములను నిర్మించుటకు మంచిమార్గము యేర్పడినది. ఈ కర్మాగారమునందు ధనము వెచ్చించిన కొలది లాభము చేకూరును.

ఇందున సాలుకు 100 లకు సుమారు రు 50 లాభము రాగలదని అంచనా వేయబడినది. గాన ధనాధికు లెల్లరు దీనిలో వాటాలు త్వరితముగ పుచ్చుకొన గోరెదము.

బ్యాంకర్సు!— రాయల్ ఇండస్ట్రియల్ బ్యాంక్ ఆఫ్ కలకత్తా, గుంటూరుబ్రాంచి

మేనేజింగు డైరక్టరు—

నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు పంతులుగారు ఎం, ఏ, ఎల్, ఎల్, బి.

రిజష్టర్డు ఆఫీసు:—గుంటూరు


Lodhra
UTERINE TONIC







సంహతౌ సంప్రవర్తితౌ ॥
పీనోన్నత ముఖౌ కాన్తౌ
స్నిగ్ధౌ తాళఫలోపమౌ ॥
20 మణిప్రవేకాభరణౌ
రుచిరౌ తే పయోధరౌ
చారుస్మితే చారుదతి
చారునేత్రే విలాసిని
మనోహరసి మే కాన్తే
నదీకూల మివామ్భసా ॥

పరస్త్రీ ఒక్కరితె యుండగా పెద్దమనిషైన వాడైన నిట్లు బలుకునా? ఈపలుకుల వలననే వాడెంత పవిత్ర వేషము పైకివేసుకున్ననూ వాని గుణవైఖరి స్పష్టబడగలదు. అటువంటి నీచవాక్యలను బలుకుచున్నపై మొగవానితో సీతవంటి పుణ్యచారిత్రి మాటనైనా మాట్లాడునా? మాటాడిన గౌరవించునా? గౌరవించిన తనయొక్క వయస్సును జెప్పునా? ఈసందర్భములో సీతనుడివిన నుడువులవల్ల సీతయొక్క గరీయతయెంత తగ్గియున్నదో చూడుడి!

బ్రాహ్మణ వేషము లోనుండి వాడుగాన చెప్పకపోతే శపించునేమో యన్నభీతిచే జెప్పెనని ఒక శ్లోకమున్నది.

III. 47. 2 "బ్రాహ్మణశ్చాతిథిశ్చాయ
మనుక్తో హి శపేత మామ్"

చెప్పకపోతె శపించునని భయపడ్డది. ఏమిటి చెప్పకపోతే! వాడడిగినదానికి సరియైన ప్రత్యుత్తరవు కాని అడగనియంశములు చెప్పకపోతే అనిగాదు * రావణుడడిగిన ప్రశ్నలలో సీతవయస్సును రాముని వయస్సునుగోరినది ఒకటైనలేదు. అయిననూ మర్యాదహీనముగా మాట్లాడిన వానితో గౌరవ ప్రవర్తనకు లోపమును గలుగజేయు తన వయస్సును జెప్పుట సీతకు యుక్తముగా నున్నదనుట యెట్లు?

సీత మరియొక సమయములో తనను ప్రశ్నవడిగిన నెట్లు మాట్లాడెనో చూతము. లంకలో అశోకవృక్షమునకు ఉరిబోసుకొనుటకు సిద్ధముగా నుండగా హనుమంతుడు సీతను ప్రశ్నించెను. ఈప్రశ్నలు రావణుడడిగిన ప్రశ్నలకు సమానములే. V. 33.

3 కానుపద్మపలాశాక్షి
క్లిష్ట కౌశేయవాసిని ।
ద్రుమస్య శాఖామాలంబ్య
తిష్ఠసి త్వమనిందితే ।
... ... ...
కాన్త్వం భవసి శోభనే.
9 కోను పుత్రః పితా భ్రాతా
భర్తా వా తే సుమధ్యమే

రావణుడడిగిన ప్రశ్నలకంటే ఈప్రశ్నలు పెచ్చు వివరముగా నున్నవి గాని రావణుడు బలికిన అమర్యాద సంభాషణ ఇచ్చటలేదు. మరియు, మహామర్యాదగాను, అతినమ్రతగాను నడిగినాడు హనుమంతుడు. అయినప్పటికి సీతయొక్క ప్రత్యుత్తరవు మాత్రము కించిద్భేదముగా నున్నది. ప్రశ్నలు అడుగువారి గుణముల ననుసరించియే యున్నవి. దుర్మార్గుడైన రావణుని ప్రశ్నలు దుష్టవాక్యములతో నున్న సన్మార్గుడైన హనుమంతుని ప్రశ్నలు మర్యాదతో గూడిన వాక్యములతోను నున్నవి. అయిననూ, ప్రత్యుత్తరవు ఇయ్యవలసినది సీతే గాన ఒక్కరీతిని జబాబు చెప్పెను.

* "అనుక్తో హి శపేత మామ్," అని మరియొక ఉద్దేశమున అనునని యుండవచ్చును. సీత పుణ్యచారిత్రి. వాడు దుర్భాష లాడుచున్నవాడు. గాన అట్టివాడడిగిన ప్రశ్నలకు జబాబు చెప్పనిష్టము లేదు. కాని అతిథిగా వచ్చినాడు. వానికి ప్రత్యుత్తరము ఇవ్వకపోతె శపించునని అనుకున్నది. గావుననే తరువాత శ్లోకములో, కొంచెము సేపాలోచించిన దని యున్నది. ఆలోచించుట యెందుకో! వాడాడిన పరుష వాక్యములకు కోపమువచ్చి ఆకోపమునణచుకొనుటకు గాదా?



గాని హనుమంతునితో చెప్పిన యంశములు రావణునితో నేల జెప్పెనో తెలియకున్నది. రావణునికిన్ని హనుమంతునికిన్ని ఇచ్చిన ఉత్తరువులను ఒక్కటే యని జూపుటకై, ఆయుత్తరువులు గల శ్లోకములిందు పొందుబరచి చూపఁబడియున్నది.

రావణున కిచ్చిన యుత్తరువు. III. 49.

3 దుహితా జనకస్యాహమ్ మైథిలస్య మహాత్మనః।
సీతా నామ్నాస్మి భద్రం తే రామస్య మహిషీ ద్విజ।
4 ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే।
భుంజానా మానుషాన్భోగాంత్సర్వకామసమృద్ధిని
5 తత స్త్రయోదశే వర్షే రాజాఽమన్త్రయత ప్రభుః।
అభిషేచయితుం రామం సమేతో రాజమన్త్రిభిః॥
6 తస్మింత్సంభ్రియమాణే తు రాఘవస్యాభిషేచనే।
కైకేయీ నామ భర్తారం మమార్యా సాయాచ తే వరమ్॥
7 ప్రతిగృహ్యాతు కైకేయీ శ్వశురం సుకృతేన మే।
మమ ప్రవ్రాజనం భర్తు ర్భరతస్యాభిషేచనమ్॥
8 ద్వావయాచ భర్తారం సత్యసంధం నృపోత్తమమ్
నాద్యభోక్ష్యే న చ స్వప్స్యే న పాస్యే చ కథంచన
9 ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే।
ఇతి బ్రువాణాం కైకేయీం శ్వశురో మే స మానదః।
10 అయాచతార్థైరన్వర్థైర్న చ యాచ్ఞాం చకార సా।
మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః।
11 అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే॥
రామేతి ప్రథితో లోకే గుణవాన్ సత్యవాన్ శుచిః।
12 విశాలాక్షో మహాబాహుః సర్వభూతహితే రతః।
కామార్తస్తు మహాతేజాః పితా దశరథస్స్వయమ్॥
13 కైకేయ్యాః ప్రియకామార్థం తం రామం నాభ్యషేచయత్।
అభిషేకాయ తు పితుస్సమీపం రామమాగతం॥
14 కైకేయీ మమ భర్తార మిత్యువాచ ధృతం వచః।
తవ పిత్రా సమాజ్ఞప్తం మమేదం శృణు రాఘవ।
15 భరతాయ ప్రదాతవ్య మిదం రాజ్యమకంటకమ్।
త్వయా హి ఖలు వస్తవ్యం నవవర్షాణి పంచ చ॥
16 వనే ప్రవ్రజ కాకుత్స్థ పితరం మోచయానృతాత్।
తథేత్యుక్త్వా చ తాం రామః కైకేయీమకుతోభయః।
17 చకార తద్వచస్తస్యా మమ భర్తా దృఢవ్రతః।
దద్యాన్న ప్రతిగృహ్ణీయాత్సత్యం బ్రూయాన్న
చానృతమ్।
18 ఏతద్బ్రాహ్మణ రామస్య ధ్రువం వ్రత మనుత్తమమ్।



హనుమంతున కిచ్చిన యుత్తరువు. V. 33.

16 స్నుషా దశరథస్యాహం శత్రుసైన్యప్రతాపినః।
దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః॥
17 సీతేతి నామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః।
సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే॥
18 భుంజానా మానుషాన్భోగాన్సర్వకామసమృద్ధినీ॥
తత స్త్రయోదశే వర్షే రాజ్యేనేక్ష్వాకునందనమ్।
19 అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే।
తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవస్యాభిషేచనే।
20 కైకేయీ నామ భర్తారం దేవీ వచనమబ్రవీత్
21½ యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ
22 తచ్చేన్న వితథం కార్యం వనం గచ్ఛతు రాఘవ।
20½ నహి పేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనం।
21 ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే॥
22½ స రాజా సత్యవాగ్దేవ్యా వరదాన మనుస్మరన్।
23 ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూరమప్రియమ్।
తతస్తు స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః
24 జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుదన్ రాజ్యమయాచత
స పితుర్వచనం శ్రీమానభిషేకాత్పరం ప్రియమ్।
25 మనసా పూర్వమాసాద్య వాచా ప్రతిగృహీతవాన్।
దద్యాన్న ప్రతిగృహ్ణీయాన్న బ్రూయాత్కించి
దప్రియమ్।
26 అపి జీవితహేతోర్వా రామస్సత్యపరాక్రమః।

ఆరంభములో నిద్దరితో జెప్పినవి సమానముగా నున్నను రావణునితో జెప్పిన యంశములలో సీత పెద్దలైన దశరథులను నిందించినట్లున్నది. తన యొక్కయు, తనభర్త యొక్కయు వయస్సులు ఒకటి హెచ్చు జెప్పినది. ఇద్దరడిగిన ప్రశ్నలు ఒక్కలాగునున్నప్పుడు, జవాబు ఒక్కలాగుండవలెను. హనుమంతునితో జెప్పుటకు నవసరము లేని యంశములు రావణునితో జెప్పుటకేమి యవసరమో! బ్రాహ్మణుడు, అతిథి చెప్పకపోతే శపించునేమో యని భయముచేత చెప్పినదంటే, అడిగిన ప్రశ్నలకు యదార్థమైన యుత్తరమును చెప్పకపోయిన శపించునని

భయపడునా లేదా? అనవసరమైన తనయొక్కయు తనపెనిమిటి యొక్కయు వయస్సులు జెప్పకపోతే శపింతునని భయపడునా? గొప్పయింటి పిల్ల, గొప్ప యింటికోడలు, గొప్పవాని భార్య; స్వతహాగా నిష్కళంకమైన గుణగౌరవముగలది? అట్టియామె పరపురుషునితో (ఎంతబ్రాహ్మణుడైనా) పెద్దలను దూషించుచూ తనవయస్సు చెప్పవలెననుట యుక్తముగానున్నదా? ఏకాలమునందైననూ, ఏజాతియందైననూ కులస్త్రీలు పైపురుషునికి తనవయస్సును జెప్పునాచారమున్నదా? ఏధర్మశాస్త్రమైననూ నొప్పుకొనుచున్నదా? లోకాచారమైన గలదా?

ఇట్టి గుణహీనతను గలుగజేయు వాక్యములను సీతయన్నట్లు వాల్మీకి వ్రాసియుండునా? రామాయణమునందు మరియెచ్చటనైననూ సీత ఇట్లుమాట్లాడినట్లున్నదా? సీతను తనవృత్తాంతము చెప్పుమని యడిగిన వారు ముగ్గురు. అనసూయ బ్రాహ్మణవేషము వేసుకున్న రావణుడు, ఆంజనేయులు. అనసూయాదేవి చేసిన ప్రశ్న ఇది:—

24. స్వయంవరే కిల ప్రాప్తా త్వమనేన యశస్వినా
రాఘవేణేతి మే సీతే కథా శ్రుతిముపాగతా॥
తాం కథాం శ్రోతుమిచ్ఛామి
విస్తరేణ చ మైథిలి
యథానుభూతం కార్త్స్న్యేన
తన్మే త్వం వక్తుమర్హసి॥

సీతా! మహాకీర్తిమంతుడైన రాముడు నిన్ను స్వయంవరమున బొందెను గదా. ఈసంగతి నేను వినియున్నాను. మైథిలీ ఈకథనంతయు సవిస్తరముగా వినగోరుచున్నాను. కావున జరిగినది జరిగినట్లుగా నాకు దానినంతయు జెప్పవలయునని యడిగెను.

ఈప్రశ్నకు ఇచ్చిన ప్రత్యుత్తరములో వివాహమునాటికి తనవయస్సు చెప్పవలసివచ్చె. తోటి స్త్రీ మహాపతివ్రత ముసలి అట్టియామెతోనైన "పతిసంయోగసులభం వయోదృష్ట్వాతు మే పితా చింతామభ్యగమద్దీనో విత్తనాశాదివాధనః" అని యభిప్రాయముగా చెప్పుటతో గలయాటకు తనవయస్సు కాగానే యని చెప్పినది. ఆయుస్సింతయనియే చెప్పలేదు.

తరువాత ఆంజనేయులవారు సీతను వృత్తాంతమడిగినవారు. వారితో నూగినవయస్సింతయని చెప్పలేదు. యోగ్యులు సాధువులు మర్యాదస్థులు అయినవారితో అనవసరమైనను వయస్సు చెప్పలేదు. అయోగ్యుడు అమర్యాదవాక్యములను బలుకుచుండువాడు ఆయనరావణునితో పెద్దల నిందించుట తన వయస్సు చెప్పుట మొదలైన హీనవాక్యములు బలికినట్లు వాల్మీకివంటి కవి వ్రాయునా? వ్రాసిన యొకచో వ్రాసి నూరమొకచో వ్రాయకుండునా, రావణునితో చెప్పిన "అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే" యను వయస్సులో "ఉషిత్వా ద్వాదశ సమాః" అను శ్లోకములలో చెప్పబడిరెండువిషయములు తీసివేయగా మిగిలినవి ఆరేండ్లు గదా! యనసూయతో చెప్పినప్పుడు ఆరేండ్ల వయస్సు దానను కాగానేయని యేల వ్రాయడు. వాల్మీకికి గణితము తెలియదేమో:

మరియు రావణునితో చెప్పినని యున్న శ్లోకములలో 8 1/2 మొదలు 11 1/2 వరకూ (బ్రాకెట్టులో జూపినవి.) వదలి జదివినను కథాసందర్భము చెడదు, ఇంతేగాదు. దశరథుని దూషించు వాక్యములు లైతముండవు. బ్రాహ్మణ్యంబు ద్విప్రియమ్ ఇదిరామని కృష్ణవ్రతముగదా! అట్టివాని భార్యామాత్రమపి యమును బలుకునా? అందులో పూజ్యులైన మామగారినిదూషించునా? గావున ఈశ్లోకములు మొదటికవివి గావని స్పష్టపడుచున్నవి. వీటిని తొలగించుటవలన నష్టమేమీ లేదుగాని గ్రంథమునకు గౌరవవృద్ధికాగలదు. ఇట్టి అసందర్భములు చూచియే శ్రీవైద్యాగారు రిడిల్ ఆఫ్ రామాయణ (The Riddle of Ramayana) లో బాల్యవివాహమునకు ప్రమాణములను జూపుటకై యొకరిచేతనో యింతవల మార్పబడిన శ్లోకములని యన్నారు. వైద్యాగారే కాదు. ఈర్ష్యలేని

హృదయముతో జనులు వారెందైనను యీమాట అనక తీరదు.

ఇట్టిదూష్యదుశ్లోకము లెన్నియో రామాయణమం దున్నవి. వీటివల్లనే ఆగ్రంథముయొక్క యథార్థము కప్పివేయ బడియున్నది. నిజమైన దేశాభిమానుల ట్టివాటిని తొలగించి గ్రంథము శుద్ధిపరచి యథార్థమును వెల్లడిచేసి మనదేశమునకు ప్రఖ్యాతి తేవలెనే గాని వాటినేబట్టుకొని అవే యథార్థములని సాధింప ప్రయత్నించుట వల్లలాభములేదు. విరుద్ధవాక్యము లెన్నియో యుండుటచేతను లోకాతీతములైన సంగతు లెన్నియో యుండుటచేతను రామాయణగ్రంథమునందు జెప్పిన కథ నిజముగాదనియు అందు చరిత్రాంశము లేశ లేదనియు అనేకమంది విద్వాంసులు కొట్టివేసినారు. ఇందువలన గ్రంథమునకు గలఖ్యాతి చెడినది. అట్లుగాక దానిలోనుండు నిజమును బైటపెట్ట ప్రయత్నము దేశాభిమానులందరును. చేయవలసినదే నిజమును బైట పెట్టుటవల్ల మన మతాచారముల కెట్టి లోటులేదు. మరింత గౌరవమువచ్చును. ఏమనగా సత్యమే ప్రమాణము ఓం తత్సత్.



# వసంతకోకిలము.

—— —:౦:— ——

( అనంతపంతుల రామలింగస్వామిగారు. )



శా॥ మూకీభావముఁ బూని తేలఁ బ్రదటిలో మోమోటమా కోకిలా-నీ
వేకాంతంబున నుండ నేల భయమో- యింపైన నీ గానమీ
లోకుల్ కొంత రుచించదో- పలుకుమా లోకైకసమ్మోహన
శ్రీకంఠస్వర మొత్తినాడు మనవిన్ జెల్లించుమా కోయిలా!

క॥ పలుగాకులతో లోకం బలరుట నేకాంతవాస మతి యోగ్యముగా
దలఁచుచు వృక్షాగ్రమునన్ దలదాచుకయుంటివో ముదంబునఁ బికమా!

ఉ॥ కాకులలోనఁ గాకివయి కాటుకవన్నియఁ గల్గినిల్చినిన్
లోకులెఱుంగఁ జెట్టు లిలలోపలఁ బాచమ సుస్వరంబుతో
నీకలకంఠ మెత్తి సుధనించెడుగానముఁ బూనుమంతటన్
కాకి నిసుగ దేవో, కలకంఠమ దేదియొ తేటతెల్లమా!

ఉ. నీయమృతాభగానమును నేవిని చిన్నతనంబునందు నీ
వేయెడనో కనుంగొనన మస్త్రాకుహాముల్గని కాంచలేక కో
కోయనిసేను కూయుటనె కోయనిహాయిని గూర్చుచుంటి, నా
తీయని కంఠ మిప్పుడల దించబడె గాకటు పల్కరింపగన్!

క॥ నవరస పోషిత జీవనము వసంతశ్రియముఁ గలిగి మోహన మగునో
నవకవితాకలకంఠమ! ప్రివసంతపికంబు బదులు పలుకఁ బలుకుమా!

చ॥ పలికితె కోయిలా! విబుధవర్ణిత కీర్తి విరాజితాన్యతో
త్కలితమృదూక్తి నాతత సుధామయ భావ మరున్నవాంకురం
బులఁ జలియించు నవ్యరస పూర్ణము సూనదళీదికాశిర
స్థలమున ఫేనఖండ సదృశంబుగనన్ నటియింపఁ జేయుచున్॥

క॥ కల, కల, కలయని ముమ్మార్వలికెద వాతత్వ మెఱుక పడెనఖిల జగం
బులు, బరభృతములుగా నెందలరగనిను మాత్రమంట యదికల మెపుమా

క॥ అమరగఘుణాక్షర న్యాయ్యముగ రసంబమరెనొకట నందురో యనుభా
వముఁ గొని ముమ్మారటులే యమృతమయరుతమును జలిపియులరె ద్రోపికమా

క॥ నీకలగానము కన్నన్ బ్రాకటముగ మించిపాడు వారరయఁగ భూ
లోకములో నాకములోఁ గోకోయను చదిగెదివాకో... కోకిలమా!

క॥ అలవిష్ణుపదము నోరసెడు నిలారుహము నెక్కి-యూదితే! మాధవునిన్
గలఁడు, కలండని, కలఁడని కలరుతమునఁ బలుకినేను కితమో పికమా!

క॥ వనరమకును మాధవునకు ఘనతర కల్యాణమగును కావున రండో
జనులార! యావినోదము గనుడను చెలుఁగెత్తి పిలువగా వచ్చితివో.

క॥ వాచాలత నీచంబని తోఁచగమిత భాషణంబుతో మనుటకునా
లోచించి కోసరిపాడెడొ మేచకనిచయమున మెఱుపుమెఱసెడు లీలన్॥

గీ॥ దివ్యశారీర మాధురిఁ దేటపడగ । వసుధ జనులకుఁ దెల్పఁగ వచ్చినట్టి
నవ్యదివి దూతవందుఁ గర్ణామమోద । నవసుధాసార కలితగానంబు వినుము

మ॥ నవచూతాగ్రము నెక్కి-నిక్కి-న, వసంతావాసము న్జేకేసినన్,
జివురుంగొమ్మలఁ జేరి పల్లవము నెంతే మెక్కి-నన్ గిన్క-గ
న్గవనత్యాంతము నెట్టిఁ జేసిననుఁగాకం బొందఁగాఁ జాలునే
భవదీయాద్భుత మాధురీ కలితదివ్య స్ఫారగానార్భటిన్।

క॥ కవిభృతమాన ససరసీ ప్రివిమల కల్లోల కవితభావ జనకమా
భవదీయమధుర గానము సెవులంబడ మోడ్రిదులైనఁ జివురించుఁగదే!

చ॥ సరసులు కల్గుచోటు, సురసంబులు గ్రాలెడుచోటు, పద్మినుల్
కరమల గారుచోటు, గణికామణు లొప్పెడిచోటు, పల్లవ
స్ఫురితము లైనచోటు, మధుచోరులు ద్రిమ్మరుచోటు నా వనాం
తరమిరవౌట నీకిటు సుధామధుర స్వరమబ్బెనే మోకో!

మ॥ చిగురుం గొమ్మలపల్లవాధర రసశ్రీనానుటన్ లోకసం
స్తవనీయంబగు గాన కౌశలమహత్త్వం బబ్బెనో నీకు, లే
కవసంత ప్రథితైక సంగతిని రాగాలాప మీవొందితో
నవనవ్యామృత సద్రసాక్తమగు గానంబూని మారాడుమా!

మ॥ నలువారాగసుఁగల్గుఁ గొమ్మలలపున్నాగంబు లెన్నన్నమిన్
దలలూపున్ మధుపాళి మత్తిలెడు, మోదాంభోధి నోలాడిరం
జలు నెంచన్ గవిసంచయంబు, సుమనశ్శ్రీ మంత్ర సంపూతని
ర్మల మాతావకగాన కూజితరస మీరస్పర్శ మూలంబునన్॥

క॥ రూపముగలిగిన సద్గుణ మోపనిచో విఫలమందు; నొగిహేమంబా
రూపమునొందిన సుగుణ సురూపిణివి వగుటను సురూపిని కావే!

చ॥ కనఁగఁ జరాచరాత్మక జగంబున నిండియు నందునందు విం
పౌనరనిజాంశమొండ ఖిలముంచుచు లీలఘటించు నీశ్వరుం
డనుటఁ బత్రి త్రిలోకమున నాతని గానకళావతారమం
చనియెదఁ గోయిలా! నిను; నవామృతపారము నించి పాడుటన్.

మ॥ కనులన్ రాగము, కర్ణపేయమగు నీగానంబునన్ రాగమున్
మనునాహారమునందు రాగము, వసంతప్రాప్తిమై రాగమున్
వనితాపాంథగణాను యోగరచనా ప్రాంచద్భవ ద్రాగమున్
గని రాగాత్మిక దివ్యరూపిణినినిన్ గామింతునో కోయిలా!

గీ॥ నీలమణి నీలవర్ణ గోపాలుఁ డెట్లు భువనమోహనుఁ డయ్యెనో పౌనరెనెట్టుల
రాగమయుఁడయ్యు నత్తనువిరాగు డగుచు నోపికము నీవునట్టులగుచుందువందు॥

ఉ॥ పాదపవాసమున్, మృదులపల్లవభక్షణ, మంబుపానమున్,
మోదవికీర్ణ మానసము, మోహనమాధవ సన్నిధానమున్,
ఖేదము యోషణత్రియ వినిర్జితజీవనమున్ జెలంగనిన్
నాదమునదిన్ దలంచెద ననారతమింక విరాగ మూర్తిగాన్॥



# భద్రాచలయాత్ర.

(పెద్దిభొట్ల వీరయ్యగారు బి. ఏ., బి. యల్.)

గోదావరీనదీతీరమందు దండకారణ్య మధ్యమున శ్రీభద్రాచల క్షేత్రముగలదు. శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సమేతుడై భద్రగిరియందుండుటయు సుప్రసిద్ధభక్తులగు కంచర్ల గోపన్నగారను రామదాసుగారు ప్రస్తుతము భద్రాద్రియందుండు దేవాలయమునకై విశేషము సొమ్ము వెచ్చించిన సంగతియు నెల్లరకువిదితము. ప్రతిసంవత్సరము చైత్రశుద్ధ నవమినాడు శ్రీరామ కళ్యాణోత్సవమతివైభవముతో జరుగుటయు వేనవేలు యాత్రికులప్పట్టున నచ్చటికిపోవు చుండుటయు ననేకసంవత్సరములుగా జరుగుచున్నది. కాని యీ క్రోధనసంవత్సరమునగత (ఏప్రిల్ 2 తారీఖున) జరిగిన శ్రీరామనవమి మహోత్సవమునకు భద్రాచలమునకు వచ్చిన యాత్రికులసంఖ్య యపరిమితమై యుండెను. ఈ సంవత్సరము కాలమానము చక్కగనుండి కలరా మొదలగు జాడ్యములు దూరమగుటచేతను ప్రతి గ్రామమునను రైలుస్టేషను 50 మైళ్ల దూరములోనుండినను ఫోర్డు మోటారుబండ్ల సౌకర్యమును బట్టి మారుమూలలనున్న ప్రజలుసహితము యాత్రకుబోవుటకెక్కువ అవకాశము గలుగుటయు బొగ్గుగనుల ప్రదేశమగు సింగరేణి ప్రాంతమున భద్రాద్రివరకు కొంతదూరము రైలు కొంతదూరము మోటారు బోవుచుండుటచే యాత్రికులకెక్కువ ప్రోత్సాహమునకు కారణము...య్యెను. రైలుమోటారుల సౌకర్యములు హెచ్చినకొలదిని యాత్రికులు భద్రాద్రి కపరిమితముగ బోవుట కెక్కువ వీలుగలుగును.

ప్రస్తుతము భద్రాచలమునకు నాలుగు మార్గములు గలవు. రా...ను హేంద్రవర ప్రాంతమువారు గోదావరి ...ద స్టీమరులోను బోట్లలోను పయనము...దుందురు. పాపికొండల సందున గోదావరివైశాల్యముతక్కలి తక్కువగుటచేతగాలి విపరీతమైనచో నచ్చట పడవలు రాతికిదగిలి బద్దలగుట కవకాశముగలదు. కానియీప్రయాణము శరీరశ్రమ కాయాసములేదు. నదిలో నీరు తక్కువగుటచే స్టీమరు ప్రయాణము సుకరముగా... ఏలూరుచింతలపూడిప్రాంతములజనులు చింతలపూడి అశ్వారావుపేట మార్గమున అరణ్యములోనుంచి భద్రాద్రి చేరుదురు. బెజవాడకు దక్షిణమున పశ్చిమమునయున్నవాడు ఎర్రుపాలెం రైలుస్టేషను దగ్గిర రైలుదిగి బండ్లమీద తిరువూరు మీదుగా అరణ్యములోనుంచి పోవుదురు. నాల్గవ

మార్గము. సింగరేణిబొగ్గుగనుల వద్దనుంచి బండ్లమీద నరణ్యమున బోవలెను. ఇప్పటనే మోటారుబండ్లు నూతనముగా నడుపుచున్నారు. బెజవాడనుంచితిరువూరువరకు రోడ్డు గలదు. కొండపల్లి మీదుగ మోటారులచ్చటికి బోవుచున్నవి. బెజవాడకొనుకొండపల్లికిని 11 మైళ్లదూరము. కొండపల్లినుంచి తిరువూరుకు 39 మైళ్ళదూరము. తిరువూరుకు భద్రాచలమునకు 48 మైళ్లు దూరము. ఇందుమూడు వంతులరణ్యము. అరణ్యములో నొక్కబండిమాత్రము పోవుటకు దగినవెడల్పుగల మార్గముండును. అరణ్య మంతయు నైజాం దొరతనము వారిది.

గోదావరికినుత్తర భాగమున భద్రాచలమున్నది.

భద్రాచలం తాలూకాశనివారప్పేట జమీందారులగుశ్రీరాజా పార్థసారథిఅప్పారావు బహదరు జమీందారుగారికి జెందియున్నది. ఇదియేజన్సీ, అనగా; మన్యపు ప్రదేశములోచేరినది. భద్రాచలంలో బ్రిటీషువారి కచ్చేరీలు పోస్టుఆఫీసు టెలిగ్రాఫుఆఫీసు ఆసుపత్రి గలవు. ఇచ్చట నుండు తహసీలుదారొక్కడేసబురిజిష్ట్రారుపెరస్థదారు మేజిస్ట్రేటు హెడ్డు అక్కౌంటెంటు మొదలగు పనులనిర్వహింపుచుండును. వీరికి రివిన్యూ సివిల్ అధికారములు కూడా గలవు. దేవాలయము మాత్రము నైజాం ప్రభుత్వము వారిపాలనలోనున్నది. అమీల్దారుగారొకరు దేవాలయమును గురించినపనులు నైజాంగారి తరఫున నెరవేర్చుచుందురు. దేవాలయము వద్దనుభయరక్షకభటులుప్రత్యేకముగ. స్వామిదర్శనమునకై యాత్రికులు పొందు పరియాసనువర్ణింప నలవికాదు. శిఫారసుగాని ధనవ్యయముగాని లేనిచో వెళ్ళినదారిని స్వామిదర్శనములేకుండ నింటికి తిరిగిరావలసినదే. అటుల వచ్చినవారిలో నూమిత్రులగు కాంభోట్లుగా రొకరు. రక్షక భటులకును యాత్రికులకును దేవాలయముకడ నుత్సవకాలము లందుజరుగు సంఘర్షణము ఘోరముగ నుండును. క్రిందబడువారిలోను దెబ్బలుతినువారిలోను యాత్రికులురక్షక భటులును గలరు.

భద్రాచలమునకు నుత్తరముగ 22 మైళ్ళ దూరమునపర్ణశాలగలదు. అచ్చటికి బోవుబాట తక్కువవెడల్పు గలదగుటచే బండ్లుతలక్రిందగుట గలదు. అచ్చట ముఖ్యముగసీతాదేవి యుండిన ప్రదేశమును ఆమె యారవేసిన చీరెయుండుప్రదేశము మొదలగు వాటిని జూడవచ్చును. భద్రాచలమునకేగు యాత్రికులలో పెక్కండ్రు పర్ణశాలవరకు బోవుచుందురు. భద్రాద్రి కాగ్నేయమున 5 మైళ్ళదూరమున ఉష్ణగుండములు గలవు. గోదావరినదిలో నిసుక ప్రదేశమందు 6 అంగుళములోతున చలమదీసి యచ్చటనుంచి చెంబులతో నీరు చేదుదురు. ఆనీరు మిక్కిలి వేడిగనుండి గంధకపువాసన గలిగియుండును. పూర్వము యాత్రికు లిష్టము వచ్చిన రీతి నూతినీరు దీసికొనెడి వారు. తర్వాత చెంబుకు అర్ధణాచొప్పున జనసమ్మర్దమైనదినమున చెంబు కణాచొప్పున జనులెగబడియొకరినొకరుత్రోసుకొని తోసికొనిమిక్కిలికష్టముతో వేడినీటిని సంపాదింప గలిగిరి. కొందరికి గుండమును చూచుట కేయవకాశము కలుగలేదు. వేడినీరుచిక్కకనిరాశజెందిన యాత్రి

కుల గొందరజూచితిని. అచ్చటికిఫర్లాంగు లోనున్న గోదావరినీటిలో ం—వేడినీరుగలిపి జనులు స్నానము చేయుచుందురు. కొందరు వేడినీటిని శిరస్సున చల్లుకొని స్నానము చేయుదురు. ఉష్ణగుండములనుంచి గోదావరియొడ్డున కెక్కుచోట పెక్కు గుండ్రాళ్ళు చిన్న రాళ్ళు గలవు. యాత్రికులు తీసికొనిపోగలిగినన్ని రాళ్ళను గైకొందురు. ఆరాళ్లునునుపుగ నుండును. అందు కొన్ని మిక్కిలి మనోహరముగ నుండును. భద్రాచలమునందు నూతులులోతు. క్షారోదకము. గోదావరినుండి మంచినీరు నెల్లరు దెచ్చికొనవలెను. తిరువూరుబాట చాపరాల పల్లి నూతిలో జలముతప్ప మిగిలినచోట్ల సరియైన దాహోదకము లేదు. కాలి నడకను, బోట్లను, మోటారులలోను, వచ్చినజనులుగాక బండ్లమీద వచ్చిన జనుల సంఖ్య కూడ హెచ్చుగ నున్నది. కొన్నివేలబండ్లు గోదావరికిద్దరి నద్దరి నియుండె. చెట్లనీడ లేక యెండకు బడెడు కష్టమునకు కాళ్లక్రింద కాలుచున్న యిసుక తోడ్పడ జూచువారికి వేదన కలిగించక మానదు. యాత్రికులకు భోజన సౌకర్యమునకు సత్రములున్నవి కాని నోరులేని జీవము లెండకు ఘోషిల్లుచుండ వాని యిబ్బందుల దప్పింప నెట్టి ప్రయత్నము జరుగకుండుట శోచనీయము. గోదావరి యొడ్డున ధార్మికులు చెట్లను వేసి పెంచి పుణ్యము గట్టుకొనగలరని నమ్ముచున్నాను. నర్సారావుపేట ప్రాంతములకు జెందిన కీర్తిశేషులగు పైడిగంటం వెంకట్రామయ్యగారు యాత్రికులకై యనేక వేల ద్రవ్యమును వెచ్చించి భద్రాద్రిలో పెద్ద ధర్మసత్రమును గట్టించియుండెను.

ఈ సత్రములో 15000 రూప్యముల పాత్రసామాగ్రిగలదను నప్పుడు దీని యుపయోగమును వర్ణింపవలెనా? ఇప్పుడు ఈసత్రమును నైజాంవకీలు తుందుర్తి నరసింహారావు పంతులుగారి యాజమాన్యముక్రింద నడచుచున్నది. ఇదిగాక గోదావరియొడ్డున భద్రాద్రిలో కొంతకాలము పోస్టుమేష్టరుగ కొండముడి వరదయ్య పంతులను వారుండిరి. ఆయన నాకు బాల్యమిత్రుడు. ఆతడు విశేషధనము ఖర్చుపెట్టి సత్రమును నిర్మించెను. వీరు ప్రతిసంవత్సరము స్వయముగ శ్రీరామనవమి నాటికి భద్రాద్రి చేరి సత్రమును నడుపుచున్నారు. స్వల్పజీతము దెచ్చుకొనువారైనను మిక్కిలి శ్రమచేసి కొన్ని వేలు స్వంతద్రవ్యమును వినియోగించిన వరదయ్య పంతులుగారి త్యాగసౌశీల్యములను వర్ణింప నాతరము కాదు. ఈ సత్రమునకు పరిహారి నిర్మాణ మవసరము. త్యాగశీలురు శ్రీ వరదయ్య పంతులుగారికి తోడ్పడి పనిని పూర్తిచేయించగలరని నమ్ముచున్నాను. గోదావరి మిక్కుటముగ వచ్చునప్పుడు సత్రము తలుపులు తీసియుంచబడును. ప్రవాహము సత్రములోనుంచి పోవుచుండును. అందువలన పునాదులకు జాల వ్యయమైనటుల తెలియుచున్నది. మంగళగిరిభక్తురాలగు బాలాంబగారు ఈ సత్రమును మొలకలపల్లిలోని సత్రమును నిర్వహించుట మిక్కుటముగ తోడ్పడుచున్నటుల తెలియుచున్నది. భద్రాద్రియందు లక్షలకొలది వచ్చినజనుల సహాయమునకై తగు కూరగాయలు పెరుగు దగ్గరపల్లెలనుంచి వచ్చుచుండును. వీధులు పరిశుభ్రముగ నుంచుటకై మంచి ప్రయత్నములే జరుగుచున్నవి. ఈ దినములలో ఆ కాంపౌండ

# ఆస్ట్రియా దేశము.

(ఆర్. రంగనాథ శాస్త్రి, బి. ఎ.)

ఆస్ట్రియా దేశస్థులు సర్వజనప్రియులు. కానబడుచున్నారు. వారికొకింత యుద్ధ స్వభా వీరు జర్మనుజాతికి సంబంధించిన వారు నైలు. నెమ్మదిగ కార్యములు చేయుట కిష్టపడిం అయినను వారికియున్నంత ధనాశ వీరికిలేదు. తుదు. కాని హాస్యమునకు వదలిరాదు.



మంచిదుస్తులను ధరించిన కృషక బాలిక.



వియన్నా నగరమందలి స్త్రీలు పూర్వమిట్టిదుస్తుల ధరింపుచుండిరి.

ధనాశాపరునిజూచిజగత్తెప్పుడు అసహ్యించు కొనుచుండునుగదా? ఇప్పు డాస్ట్రియావారు తమవ్యక్తిత్వమును స్వతంత్రతను గాపాడు వారియందొక గొప్పదోషముగలదు. అది యేదియన మన దేశమందలి రాజకర్మచారుల

బోలివారును సిగ్గింపుచుందురు. అందువలన శాసనకార్యములు, శాసనపరిషత్తు కార్యముల యందు అసమర్థులను పేరువచ్చినది. జర్మనీ యందు సంచరించు నప్పుడొక మిల్లునందు తిరుగుచున్నటులుండును. కాని యాస్ట్రియా యందు సంచరించునప్పుడు సువిశాలదేశ



ఒక భూస్వామి.

మున విహరింపుచుండినటులుండును. జర్మనీ యందు గడియారమునుబోలి కార్యములు నడచుచుండును. కాని యిచట మానవులు మానవులుగనే పనిచేయుచుందురు. యంత్రములలోని భాగము, మానవుడింకను మారలేదు. అందువలన నాస్ట్రియాయందు తిరుగునప్పుడు మానవుల కానందముగలుగు చుండును. అన్ని ఆటంకములు నియమనిష్ఠలను వెలుపల సంచరించుచుండుటకు మానవుడెప్పుడును కోరుచుండును. జర్మనీనుండి యాస్ట్రియాకు వచ్చువాని కట్టి యానందము గలుగుననుట యతిశయోక్తిగాదు. ఆస్ట్రియాకు ముఖ్యనగరమగు 'వియన్నా' స్వాభావిక సౌందర్యమునకాలవాలమైయుండును.



ఫిడేలు వాయింపుచున్నాడు.

ఈ పురవాసులు నిరంతరము సహజ సరళభావమున ఆమోదప్రమోదముల కాలముగడుపు చుందురు. ఆనందతరంగములువీచుచుండును. వియన్నా పట్టణమున కేగినవాడు సంతసమున కాలము గడుపక తప్పదు. అచ్చటి పరిస్థితులట్టివి. కన్నను నగరవాసులు కఠోరమగు ముఖభావము ఉత్సాహపూరమగు గంభీ

ర

దృష్టితో నుందురు. కాని వియన్నానగర వాసుల చిరునగవునగూడిన మోము-కోమల దృష్టియు యాత్రికుల హృదయమునందానందమును గలిగింపుచుండును. ఈస్త్రీలు ధరించు వస్తులనే యనేక సభ్యజాతుల స్త్రీలనుకరింపుచుందురు. సుసౌందర్యమున వలరాచు స్త్రీలాదేశమందన్ని తరగతుల వారియందును గలరు. వీరు విరికివారుగారు. నగరవాసుల పద్ధతులు నాటివరకు పల్లెలయందును చిన్నచిన్న పట్టణముల యందును వ్యాపింపుచున్నవి. సాధారణముగ ప్రతి దేశస్థులును రాజధాని ననుకరించుట స్వాభావికమేకదా! అచ్చట పల్లెలయందు ధనికులు మొదలగువారెల్లరు మన దేశమందువలెనే వియన్నానగరమున నివసించుటకై ప్రయత్నింపుచుందురు. వియన్నానగరమందలిస్త్



వియన్నా పట్టణమందలి పండ్లబజారు.

విపత్తుల నెంతమాత్రమైనను గణనచేయరు. ఎట్టి దుర్ఘటననైనను సాధారణ భావమున గాంతురు. రాజనీతి-వ్యాపారములయందు జిక్కుకొని తల బద్దలుకొట్టుకొనరు. వారెప్పుడును నాటకములు-సంగీతము-నృత్యము-మొదలగు లలితకళలయందు మునిగితేలుచుందురు. వనభోజనము - వనవిహారము మొదలగునవి చాల ప్రియమైనవి. వియన్నా యిలంతయు రింగుస్ట్రీటువందుమాత్రే భవించియుండును. ఆస్ట్రియాయందుత్తరభాగమునను దక్షిణభాగమున నివసించు జనులు కృషకులు. సరళస్వభావులు. వారికి రాజకీయ సంబంధముగుజ్ఞానమే లేదనవచ్చును. అందువలన విదేశరాజకీయములతోగాని స్వదేశ రాజకీయములతోగాని వారికి సంబంధమే లేదు. ఇట్లనుటవలన చదువుగాని మూర్ఖ

లుగారు. బాగుగ చదువుకొనిన వారలు. ఉత్తమగ్రంథములను పఠింపుచుందురు. ఆస్ట్రియా యందు [illegible] గాలించి



ఈస్త్రీ సీమవేషు సంస్థమ్ము చున్నది

వెదకినను నిరక్షరుఁడు వేయింట నొకఁడుండిన నుండవచ్చును.

జర్మనీయందువలె ఆస్ట్రియాయందు పట్టణములు వీధులు బాటలు మొదలగునవి పరిశుభ్రముగ నుండవు. మ్యూనిసిపాలిటీలు నిద్రమత్తుతోడ పనిచేయుచుండును. నవ్యక్షులు చటపట కార్యములొనర్చు కార్యచతురులుగారు. అయినను వారికార్యములు వారే చక్కబెట్టుకొనుచున్నారు. భారతీయులమగు మనము సోమరితనము దగ్గఱవారలము. స్వారాజ్యము వచ్చినచో ఆస్ట్రియావారివి బోలి



కూలివాఁడు.

మనకార్యములు మనము చక్కబెట్టుకొనగలుగుటకు సంశయింపవలసిన పనిలేదు.

ఆస్ట్రియాయందు "క్రిశ్చియన్ సోషలిష్టు" పేరున నొక రాజకీయసంఘమున్నది. వీరు పేరుకు సోషలిష్టులయినను కార్యమున కాకుండుటయే గాక తద్విపరీతముగ వీరప్పుడును ధనికుల స్వార్థమును రక్షించుటకై ప్రయత్నింపుచుందురు. వీరి ప్రయత్నములు